## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్థం మహానుభావులైన యధార్థ గీత వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) యధార్థ గీత వారి వెబ్ సైట్: http://yatharthgeeta.com/
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com.
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.



**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

యథార్థ గీత వారి వెబ్ సైట్:

http://yatharthgeeta.com/



# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014



శ్రీ పరమాత్మనే నమః

# యథార్థ గీత

## శ్రీమద్ భగవద్ గీత

## ప్రథమ అధ్యాయము

ధృతరాష్ట్ర ఉవాచ-

శ్లో ॥ *ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః।*
*మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ ॥1॥*

ధృతరాష్ట్రుడు సంజయుణ్ణి అడిగాడు- ''ఓ సంజయా!! ధర్మ క్షేత్రం మరియు కురుక్షేత్రంలో ఒక్కచోటచేరి యుద్ధం చేయు కోరికగలవారైన నా వారు మరియు పాండు పుత్రులు ఏం చేసారు ? ''

అజ్ఞాన రూపుడయినవాడు ధృతరాష్ట్రుడు, సంయమ రూపి అయిన వాడు సంజయుడు. అజ్ఞానం మనస్సు యొక్క అంతరాళంలో ఉంటుంది. అజ్ఞానం ఆవరించిన మనస్సుగల ధృతరాష్ట్రుడు జన్మాంధుడు. అతడు సంయమ- స్వరూపుడైన సంజయుని ద్వారా చూడగలడు, వినగలడు. అతనికి పరమాత్ముడే సత్యమన్నది తెలుసు. అయినా కూడా తన వలన ఉత్పన్నమైన మోహరూపి అయిన దుర్యోధనుడు జీవించి ఉన్నంత వరకూ, అతని దృష్టి ఎల్లప్పుడూ కౌరవుల పైనే ఉంటుంది. వికృతులపైనే ఉంటుంది.

శరీరం ఒక క్షేత్రం. హృదయ దేశంలో దైవీ సంపత్తి బాగా ఎక్కువైనప్పుడు ఈ శరీరం ధర్మ క్షేత్రమయిపోతుంది. ఇందులో ఆసురీ సంపత్తి బహుళమయినప్పుడు, ఈ శరీరం కురు క్షేత్రమయిపోతుంది. 'కురు' అంటే 'చెయ్యి' అని అర్థం. ఈ శబ్దం ఆజ్ఞార్థకము. శ్రీ కృష్ణుడు- ''ప్రకృతి వలన ఉత్పన్నమైన మూడు గుణాలకు వశుడై మనిషి కర్మ చేస్తాడు,

అతను క్షణమాత్రం కూడా కర్మ చేయకుండా ఉండలేడు.'' అని అంటాడు. గుణాలు అతని చేత కర్మను చేయించు కొంటాయి. నిద్ర పోయినప్పుడు కూడా కర్మ చేయడం ఆగిపోదు, అది కూడా ఆరోగ్యవంతమైన శరీరానికి అవసరమైన మందు మాత్రమే. ఈ మూడు గుణాలు మనిషి నుండి పిపీలికాది పర్యంతం అందరినీ శరీరాలలో బంధించి ఉంచుతాయి. ప్రకృతీ, ప్రకృతి వలన ఉత్పన్నమైన గుణాలు జీవించి ఉన్నంత వరకు 'చెయ్యడం' అన్నది వెన్నంటి ఉంటుంది. కాబట్టి జన్మ-మృత్యువుల క్షేత్రం, వికృతుల క్షేత్రం కురుక్షేత్రం, మరియు పరమ ధర్మ స్వరూపుడైన పరమాత్మునిలో ప్రవేశం ఇప్పించగల పుణ్యమయ ప్రవృత్తుల (పాండవుల) క్షేత్రం ధర్మక్షేత్రం.

పురాతత్త్వ వేత్తలు పంజాబులోనూ, కాశీ-ప్రయాగల మధ్యగల అనే కానేక ప్రదేశాలలో కురుక్షేత్రానికై పరిశోధిస్తున్నారు, కానీ గీతాకారుడు స్వయంగా ఏ క్షేత్రంలో యుద్ధం జరిగిందో, అదెక్కడ ఉన్నది అనేదాన్ని గురించి ఇలా చెప్పాడు- **''ఇదం శరీరం కౌంతేయ క్షేత్ర మిత్యభిధీయతే''** -''అర్జునా! ఈ శరీరమే క్షేత్రం, ఎవడైతే ఈ విషయం తెలుసుకుంటాడో అతను దానిని దాటగలడు, అతనే క్షేత్రజ్ఞుడు.'' ఆపైన శ్రీకృష్ణుడు 'క్షేత్రం' గురించి విస్తారంగా చెప్పాడు - ఇందులో గల పది ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి, అహంకారం, ఐదు వికారాలు మరియు మూడు గుణాల వర్ణన ఉంది. శరీరమే క్షేత్రం, ఒక రణరంగం. ఇందులో పోట్లాడుకునే ప్రవృత్తులు, రెండు 'దైవీ సంపద (సద్గుణాలు) మరియు ఆసురీ సంపద (దుర్గుణాలు) 'పాండు సంతానం మరియు ధృతరాష్ట్రుని, సంతానం', 'సజాతీయ మరియు విజాతీయ ప్రవృత్తులు.''

అనుభవశాలియైన మహాపురుషుని శరణులోకి వెళ్ళినప్పుడు ఈ రెండు ప్రవృత్తుల మధ్య సంఘర్షణ ప్రారంభమవుతుంది. ఇది క్షేత్ర-క్షేత్రజ్ఞుల మధ్య సంఘర్షణ. మరియు యిదే వాస్తవిక యుద్ధం. ప్రపంచ యుద్ధాలతో చరిత్ర పుటలు నిండి పోయినవి, కానీ వీటిలో గెలుపొందిన వారికి కూడా శాశ్వత విజయం దొరకదు. ఇవి ఒకరిపై ఒకరి ప్రతీకారాలు మాత్రమే. ప్రకృతిని నిరోధించి, ప్రకృతిపై నున్న అధికారిని దిగ్దర్శనం చేసుకొని, అందులో ప్రవేశం పొందుటయే వాస్తవమైన విజయం. ఇది ఎలాంటి విజయమంటే, దీని తరువాత అపజయానికి తావు ఉండదు. ఇదే ముక్తి, దీని తరువాత జన్మ-మృత్యువుల బంధం ఉండదు.

ఈ ప్రకారంగా అజ్ఞానంచే ఆచ్ఛాదితమైన మనస్సు, సంయమనం ద్వారా క్షేత్ర-క్షేత్రజ్ఞుల యుద్ధంలో ఏమయిందన్న విషయాన్ని తెలుసుకొంటుంది. ఇప్పుడు సంయమనం పెరిగిన కొద్దీ అతడికి జ్ఞానం కలగుతూ ఉంటుంది.

సంజయ ఉవాచ-

శ్లో ॥ దృష్ట్వాతు పాండవానీకం వ్యూఢం దుర్యోధనస్తదా।
ఆచార్యముప సంగమ్య రాజా వచనమబ్రవీత్ ॥2॥

ఆ సమయంలో దుర్యోధనరాజు వ్యూహముగా పన్నియున్న పాండవుల సైన్యమును చూసి ద్రోణాచార్యుని సమీపించి యీ విధంగా చెప్పాడు.

ద్వైత ఆచరణమే ద్రోణాచార్యుడు. ఎప్పుడైతే మనం పరమాత్ముడి నుంచి వేరు పడ్డాము అన్న విషయం తెలుస్తుందో (యిదే ద్వైతం యొక్క భ్రాంతి), అప్పుడే అతని ప్రాప్తికై తపన మొదలవుతుంది. అప్పుడే మనం గురువు కొరకు వెదకుతూ ఉంటాము. రెండు ప్రవృత్తుల మధ్య యిదే ప్రాథమిక గురువు, ఆ తరువాతి గురువు యోగేశ్వరుడైన శ్రీ కృష్ణుడే అవుతాడు. అతడు యోగ స్థితిని పొందిన వాడు.

రాజైన దుర్యోధనుడు ఆచార్యుని వద్దకు వెళతాడు. దుర్యోధనుడు మోహరూపుడు. మోహం అన్ని వ్యాధులకి మూలం. వాటికి రాజు దుర్యోధనుడు- దుర్ అంటే దూషితం, యోధన్ అంటే ఆ ధనం. ఆత్మిక సంపత్తియే స్థిర సంపత్తి. అందులో దోషాన్ని ఉత్పన్నం చేసేదే మోహం. ఇది ప్రకృతి వైపు ఆకర్షిస్తుంది మరియు వాస్తవికతను తెలుసుకోడానికి కూడా ప్రేరణనిస్తుంది. మోహం ఉన్నంత వరకే అడగటానికి ప్రశ్నలుంటాయి. అదే లేక పోతే అందరూ పరిపూర్ణులే.

అందుచేత వ్యూహ-రచనతో కూడిన పాండవ సేనను చూసి, అంటే పుణ్యం చేత ప్రవహించి వచ్చిన సజాతీయ ప్రవృత్తులు సంఘటితం అవడాన్ని చూచి, మోహ రూపి అయిన దుర్యోధనుడు, ప్రథమ గురువు అయిన ద్రోణుని వద్దకు వెళ్ళి ఇలా అంటాడు-

శ్లో ॥ పశ్యైతాం పాండుపుత్రాణా మాచార్య మహతీం చమూం।
వ్యూఢాం ద్రుపద పుత్రేణ తవ శిష్యేణ ధీమతా ॥3॥

''ఓ ఆచార్యా! మీ శిష్యుడును, బుద్ధిమంతుడును అగు ద్రుపద పుత్రుడు ధృష్టద్యుమ్నుని చేత వ్యూహాకారంలో నిలబడి ఉన్న యీ పాండు పుత్రుల గొప్ప సైన్యాన్ని చూడండి.''

శాశ్వతమైన అచలమైన పథంలో స్థిరత్వాన్ని పెంపొందించే ధృడమైన మనస్సే 'ధృష్టద్యుమ్నుడు. అతడే పుణ్య ప్రవృత్తులకు నాయకుడు.''సాధన కఠినం కాదు, మనస్సు యొక్క ధృఢత్వం కఠోరం కావాలి''.

ఇప్పుడు సైన్యం యొక్క విస్తృతిని చూడండి.-

*శ్లో ॥ అత్ర శూరా మహేష్వాసా భీమార్జున సమాయుధి।*
*యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః ॥4॥*

ఈ సైన్యంలో **''మహేష్వాసా''** పరమాత్మునిలో నివాసం కల్పించగల భావరూపుడైన ''భీముడు'', అనురాగరూపుడైన 'అర్జునునితో సమానులైన చాలా మంది శూర వీరులు; సాత్త్వికతారూపుడైన **'సాత్యకి'**, **'విరాటుడు-** ఉన్నారు, సర్వత్ర అధ్యాత్మిక పథంలో అచల స్థితి అయిన ద్రుపదరాజు మరియు-

*శ్లో ॥ ధృష్టకేతుశ్చేకితానః కాశీరాజశ్చ వీర్యవాన్ ।*
*పురుజిత్కుంతి భోజశ్చ శైబ్యశ్చ నరపుంగవ ః ॥5॥*

**''ధృష్టకేతుః''** - ధృఢ కర్తవ్యం. **'చేకితానః'** ఎక్కడికి వెళ్ళినా సరే, చిత్తమును తిరిగి లాగుకొనివచ్చి యిష్టదైవంలో స్థిర పరచడం, **'కాశీరాజః'** కాయారూపమైన కాశీలోనే ఆ సామ్రాజ్యం ఉన్నది, **''పురుజిత్''** - స్థూల, సూక్ష్మ, కారణ శరీరాలపై విజయం ఇప్పించేవాడు పురుజిత్, **''కుంతిభోజః'** కర్తవ్యం ద్వారా ఇహంపై విజయం సాధించేవాడు. నరులలో శ్రేష్ఠుడు శైబ్యుడు' అంటే సత్య వ్యవహారం కలవాడు.

*శ్లో ॥ యుధామన్యుశ్చ విక్రాంత ఉత్తమౌజాశ్చ వీర్యవాన్ ।*
*సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః ॥6॥*

మరియు పరాక్రమవంతుడైన **'యుధామన్యు'**- యుద్ధానికి అనుగుణంగా మనస్సు ధారణ చేయువాడు, **ఉత్తమౌజాః-** శుభం పట్ల ఉత్సాహం గలవాడు, సుభద్రాపుత్రుడు అభిమన్యుడు మొదలగువారు ఉన్నారు. ఎప్పుడైతే కార్యానికి శుభం ఆధారమవుతుందో, అప్పుడు మనస్సు భయ రహితమవుతుంది. అటువంటి శుభకరమైన ఆధారముచే ఉత్పన్నమైన భయరహితమైన మనస్సు, ధ్యానరూపీ అయిన ద్రౌపది యొక్క ఐదుగురు పుత్రులు- వాత్సల్యం, లావణ్యం, సహృదయత్వం సౌమ్యత్వం, స్థిరత్వం అందరూ మహారథులే సాధనా పథంలో సంపూర్ణ యోగ్యతతో కూడి కలసికట్టుగా వెళ్ళే క్షమత్వార్హతలు, గలవారు.

ఈప్రకారంగా దుర్యోధనుడు పాండవ పక్షంలో ఉన్న పదిహేను - యిరవైమంది పేర్లు లెక్కించాడు, అవి అన్నీ దైవీ సంపదలోని మహత్వపూర్ణ అంశములే, విజాతీయ ప్రవృత్తులకు రాజైయుండి కూడా, 'మోహం' సజాతీయ ప్రవృత్తులను అర్థం చేసుకోవడంలో బాధ్యులను చేస్తుంది. దుర్యోధనుడు తన పక్షం గూర్చి సంక్షేపంగా చెప్పాడు. ఇదే బాహ్య యుద్ధమైతే తన పక్షం గురించి గొప్పగా చెప్పుకునే వాడే. వికారాలను గురించి తక్కువగా చెప్పాడు.

ఎందుకంటే వాటిపై విజయం సాధించాలి, అవి నశ్వరాలు. కేవలం ఐదో ఆరో వికారాలను గురించి మాత్రమే చెప్పడమైనది. వాటిలో సంపూర్ణంగా బహిర్ముఖీనమైన ప్రవృత్తులు నిండి ఉన్నాయి. ఎలాగంటే-

శ్లో ॥ అస్మాకం తు విశిష్టా యే తాన్నిబోధ ద్విజోత్తమ ॥
నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్ర్బవీమితే ॥7॥

''ద్విజోత్తమా! మన పక్షంలో ఎవరెవరైతే ప్రధానమైన వారో, వారిని గురించి కూడా మీరు తెలుసుకోండి. మీరు తెలుసుకొనేందుకై, నా సైన్యంలోని నాయకులను గురించి చెప్పుతాను.''

బాహ్య యుద్ధంలో సేనాపతికి 'ద్విజోత్తముడ'ను సంబోధన అనుచితం వర్ణించబడింది. నిజానికి గీతలో మనస్సు యొక్క రెండు ప్రవృత్తుల యొక్క సంఘర్షణము. వాటిలో ద్వైతం యొక్క ఆచరణమే ద్రోణుడు. మనం లేశమాత్రంగానైనా ఆరాధ్యదైవం నుంచి వేరుగా ఉన్నంత వరకు ప్రకృతి ఉంటుంది, ద్వైతం ఉంటుంది. ఈ 'ద్వితం' పై విజయం పొందాలనే ప్రేరణ ప్రథమ గురువైన ద్రోణాచార్యుడినుంచే లభిస్తుంది. అసంపూర్ణ జ్ఞానమే పూర్ణంగా తెలుసుకోవడానికి ప్రేరణను కలిగిస్తుంది. అది పూజాస్థలం కాదు, అక్కడ శౌర్య సూచకమైన సంబోధనమే ఉండాలి.

విజాతీయ ప్రవృత్తులకు నాయకులు ఎవరెవరు? –

శ్లో ॥ భవాన్భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయః ।
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తి స్త థై వచ ॥8॥

ఒకరు స్వయంగా మీరే (ద్వైత ఆచరణయే ద్రోణాచార్యుడు), భ్రమరూపమైన పితామహుడు భీష్ముడు. ఈ వికారాలన్నిటికీ భ్రమయే ఉత్పత్తి స్థానం. చివరి దాకా జీవించి ఉంటుంది. అందుకనే పితామహుడు. మొత్తం సైన్యం నశించి పోయినా, జీవించే ఉన్నాడు. అంపశయ్యపై అచేతనంగా పడి ఉన్నా, జీవించే ఉన్నాడు. భ్రమ రూపమైన భీష్ముడు. అంటే ఇదే భ్రమ ఆఖరి వరకు ఉంటుంది. ఇదే విధంగా విజాతీయ కర్మ రూపీ అయిన కర్ణుడు, సంగ్రామ విజయస్వరూపుడైన కృపాచార్యుడు. సాధనావస్థలో సాధకునిద్వారా కృపకు పూనుకునే ఆచరణయే కృపాచార్యుడు. భగవంతుడు కృపాధాముడు. అతణ్ణి పొందిన పిదప యోగి కూడా అదే స్వరూపం పొందుతాడు, కానీ సాధనా కాలంలో మనం వేరు పరమాత్మ వేరు అని అనకున్నంత వరకు విజాతీయ ప్రవృత్తి జీవించి ఉంటుంది, మోహం నలువైపులా ఆవరించుకొని ఉంటుంది. ఇటువంటి పరిస్థితులలో గనక సాధకుడు కృపాచారణ చూపిస్తే, అతను నశించి పోతాడు. సీత కొంత దయ చూపించింది అందుచేత కొంత కాలం వరకు లంకలో ప్రాయశ్చిత్తం చేసుకోవలసి వచ్చింది. విశ్వామిత్రుడు దయార్ద్రుడై పతితుడై పోయాడు. యోగ సూత్రకారుడు పతంజలి కూడా ఇదే అంటాడు– **'తే సమాధాంవ్యుపసర్గా వ్యుత్థానే సిద్ధయః'** (3/37) వ్యుత్థాన కాలంలో సిద్ధులు ప్రకటితమవుతాయి, అవి వాస్తవంగానే సిద్దులు, కానీ కామం, క్రోధం, లోభం, మోహం వలె కైవల్య ప్రాప్తికి అడ్డంకులు. గోస్వామి తులసీదాసుది కూడా యిదే నిర్ణయం.

*ఛోరత గ్రంధి జాని ఖగరాయా। విఘ్న అనేక కరయి తబ మాయా।*
*రిద్ధి సిద్ధి ప్రేరయి బహు భాయీ బుద్ధి హిం లోభ దిఖావ హిం ఆయీ॥*
(రామచరిత మానసం 7/127/6-7)

మాయా అనేక విఘ్నాలను సృష్టిస్తుంది. సిద్ధులను ఎన్నో శక్తులను, ప్రసాదిస్తుంది. అటువంటి సాధకుడు, సిద్ధుడు ప్రక్క నుంచి వెళితే చాలు, మృత్యుముఖంలో ఉన్న రోగి కూడా జీవించి లేస్తాడు. రోగి బాగు పడవచ్చు గాక, కానీ సాధకుడు అది తన గొప్ప అనుకొంటే నశించి పోతాడు. ఒక్కరోగికి బదులుగా వేయి మంది రోగులు చుట్టు ముట్టేస్తారు, భజనచింతన కార్యక్రమంలో అవరోధం ఏర్పడుతుంది. అటువైపు జారితే, మెల్లమెల్లగా ప్రకృతి (మాయ) ఆవరించేస్తుంది. లక్ష్యానికి దూరంగా ఉండి సాధకుడు కృపను చూపిస్తే, కేవలం ఆ కృపాచరణయే 'సమితింజయమై' మొత్తం సైన్యాన్ని గెలుస్తుంది. కాబట్టి సాధకుడు తన సాధన అయ్యే వరకు దీని వలలో పడకుండా జాగ్రత్తగా ఉండాలి. **'దయా బిను సంతు కసాయి, దయాకరితో ఆఫత్ ఆయి ।'** (దయ లేని సాధువు కసాయి లాంటివాడు, కానీ దయ చూపిస్తే ప్రమాదం ముంచుకోస్తుంది). కానీ అసంపూర్ణావస్థలో విజాతీయ ప్రవృత్తులలో ఇది దుర్ధర్ష యోధునివంటిది. ఇదే ప్రకారంగా ఆసక్తి రూపుడైన అశ్వాత్థామ, వికల్ప రూపుడైన వికర్ణుడు, భ్రమయైన శ్వాసవంటి భూరిశ్రవుడు. వీరందరూ బహిర్ముఖీనమైన ప్రవాహానికి నాయకులు.

శ్లో ॥ *అన్యేచ బహవః శూరా మదర్థే త్యక్త జీవితాః।*
*నానా శస్త్ర ప్రహరణాః సర్వే యుద్ధ విశారదాః ॥9॥*

మరియు చాలా మంది శూరవీరులు, అనేక శస్త్రాలతో యుక్తులై నాకొరకు జీవితం పై ఆశను త్యజించి యుద్ధానికి సిద్ధంగా నిలబడ్డారు. అందరూ నా కోసం ప్రాణాల్ని త్యాగం చేసే వారే, కానీ వారి యొక్క సంఖ్యను సరిగ్గా లెక్క పెట్టలేదు. ఇప్పుడు ఏ సైన్యం ఏ భావాల మూలంగా సురక్షితమై ఉంది? దీనిని గురించి ఇలా చెప్పాడు :-

శ్లో ॥ *అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభి రక్షితం।*
*పర్యాప్తం త్విద మేతేషాం బలం భీమాభి రక్షితమ్ ॥10॥*

భీష్ముడి ద్వారా రక్షించబడుతున్న మన సైన్యం అన్ని విధాలుగా అజేయమ్ మరియు భీముడి ద్వారా రక్షించబడుతున్న సైన్యాన్ని గెలవడం సులభం. **'పర్యాప్తం'** మరియు **'అపర్యాప్తం'** వంటి శ్లిష్ట శబ్దాల ప్రయోగం దుర్యోధనుడి భయాకులతను వ్యక్తం చేస్తుంది. అందుచేత ఇప్పుడు ''కౌరవులు ఆధారపడుతున్న, భీష్ముడు ఎటువంటి సత్తా కలవాడు? పాండవులందరూ ఆధారపడుతున్న భీముడు ఎటువంటి సత్తా (దైవీ సంపద) కలవాడు ?'' అని ఆలోచించవలెను. దుర్యోధనుడు తమ యుద్ధ వ్యవస్థను ఇలా వివరించాడు :-

శ్లో ॥ అయనేషు చ సర్వేషు యథాభాగ మవస్థితాః।
భీష్మ మేవాభి రక్షంతు భవంతః సర్వ ఏవ హి ॥ 11॥

కాబట్టి అందరూ సేనలో తమ తమ నియతస్థానాలలో ఉంటూ అందరూ భీష్మణ్ణి

అన్ని వైపుల నుండి రక్షించండి. భీష్ముడు జీవించి ఉన్నట్లయితే, మనం అజేయులమే. కాబట్టి మీరు పాండవులతో పోరాడక, కేవలం భీష్మణ్ణి మాత్రమే రక్షించండి. భీష్ముడు స్వయంగా తనను రక్షించుకోలేని యోధుడా? కౌరవులకు అతని రక్షణ చేయవలసి వచ్చింది. అతను బాహ్య యోధుడుకాడు, భ్రమ యొక్క ప్రతిరూపమే భీష్ముడు. భ్రమ జీవించి ఉన్నంత వరకూ విజాతీయ ప్రవృత్తులు (కౌరవులు) అజేయములు. 'అజేయుడు' అంటే అర్థం గెలవ శక్యం కాని వాడని కాదు, అసలు అజేయుడంటే దుర్జయుడని అర్థం, అంటే అతణ్ణి గెలవడం కష్టతరమని అర్థం–

*''మహా అజయ సంసార రిపు, జీతి సకయి సో బీర్ ।* (రా.చ.మా. 6/80)

సంసారం మహా అజయం, వీరుడే దాన్నిపై గెలుపొందగలడు.

భ్రమ సమాప్తమయి పోతే, అవిద్య అస్తిత్వహీనమై పోతుంది. ఆంశిక రూపంలో మిగిలి ఉన్న మోహం మొదలయినవి శీఘ్రంగానే నశించి పోతాయి. భీష్మునిది యిచ్ఛా-మృత్యువు. కోరికే భ్రమ. కోరికలు నశించి పోవడం అన్నా, భ్రమ నశించి పోవడం అన్నా ఒకటే. దీనినే సంత్ కబీరు సరళంగా ఇలా చెప్పాడు–

**''ఇచ్ఛా కాయా, ఇచ్ఛా మాయా, ఇచ్ఛా జగ ఉపజాయా ।**
**కహ కబీర జే ఇచ్ఛా వివర్జిత, తాకా పారన పాయా ॥''**

(కోరికలే తనువు, కోరికలే మాయ, కోరికలే జగత్తును సృష్టించాయి, కబీరు అంటాడు– అన్ని కోరికలను విసర్జించనంత వరకు వాటిని దాటి పోలేడు అని)

దేనిలోనైతే భ్రమ ఉండదో, అది అపారమూ, అవ్యక్తము, ఈ శరీరం యొక్క జన్మకి కారణం కోరికలే. కోరికలే మాయ, కోరికలే జగత్తు యొక్క ఉత్పత్తికి కారణం. **(సోऽऽకామయత' 'తదైక్షత బహుస్యాం ప్రజాయేయ యితి'** (ఛాన్దోగ్య 6/2/3), కబీరు అంటాడు, కోరికలనుండి రహితులైన వారు. అపారం, అనంతం, అసీమం అయిన తత్త్వంలోకి ప్రవేశం పొందుతారు. **(యోऽకామో నిష్కామ ఆప్తకామ ఆత్మకామో న తస్య ప్రాణా ఉత్క్రామంతి బ్రహ్మైవ స్య బ్రహ్మాప్యేతి !** '(బృహదారణ్యకం 4/4/6) కోరికలచే రహితమైన ఆత్మలో స్థిరమైన ఆత్మస్వరూపం పొందిన వారు ఏనాటికీ పతనం చెందరు. వారు బ్రహ్మతో లీనమై పోతారు. ఆరంభంలో అనంతమైన కోరికలు ఉంటాయి, కానీ చివరకు పరమాత్ముని ప్రాప్తి అనే ఒకే ఒక కోరిక మిగిలి ఉంటుంది. ఈ కోరిక కూడా నెరవేరినప్పుడు, కోరికలు కూడా నశించి పోతాయి. భగవంతుణ్ణి మించి ఏదైనా ఉంటే, మీరు తప్పకుండా దానిని కోరుకుంటారు. అతని కంటే గొప్ప వస్తువు ఏదీ లేనప్పుడు, మరి దేనికోసం కోరిక? పొందడానికి యోగ్యమైన వస్తువు ఏదైనా సరే, అప్రాప్తంగా ఉండక పోతే అప్పుడు కోరికలు కూడా సమూలంగా నశించి పోతాయి. కోరికలు అణగారిపోగానే, భ్రమ కూడా లేకుండా పోతుంది.

ఇదే భీష్ముని యొక్క ఇచ్ఛా మృత్యువు అర్థం. ''ఈ ప్రకారంగా భీష్ముడి ద్వారా రక్షించబడుతున్న మన సైన్యం అన్ని విధాలా అజేయం''. భ్రమ ఉన్నంత వరకే అవిద్యకు కూడా స్థానముంటుంది. భ్రమ లేకుండా పోతే, అవిద్య కూడా నశించి పోతుంది.

భీముని ద్వారా రక్షించబడుతున్న ఈ సైన్యాన్ని గెలవడం సులువు, భావ రూపి భీముడు 'భావే విద్యతే దేవః'- భావంలో ఉన్న సామర్థ్యం ఏమిటంటే అవిదితుడైన పరమాత్మను కూడా విదితం చేస్తుంది. **''భావ వస్య భగవాన్, సుఖ నిధాన కరుణా ఆయన్''** (రా.చ.మా 7/92 ఖ). శ్రీ కృష్ణుడు దీనినే 'శ్రద్ధ అని సంభోదించాడు. భగవంతుణ్ని కూడా వశ పర్చుకోగల సామర్థ్యం భావంలో ఉన్నది. భావంలో నుంచే సంపూర్ణ పుణ్యమయ ప్రవృత్తులు వికసించుతాయి. ఇది పుణ్యాన్ని సంరక్షిస్తుంది. ఇది నిజంగానే చాలా బలశాలి, ఎందుకంటే పరమదేవుడయిన పరమాత్ముణ్ణి కూడా సాధ్యం చేస్తుంది. కానీ అంతే కోమలమయినది కూడా. ఈ వేళ వున్న భావం, రేపు అభావంలోకి మారడానికి ఎక్కువ వ్యవధానం పట్టదు. ఈ రోజు మీరందరూ, ''స్వామీజీ చాలా మంచి వారు.'' అని అనవచ్చు. రేపు మీరే గొణగవచ్చు ఆయన పాయసం తింటూఉండగా మేము చూసాం.'' అని.

**''ఘాస్‌పాత జె ఖాత్ హైం, తిన్హహిం సతావై కామ్।**
**దూద్ మలాయి కాత్ జె, తినకీ జానే రామ్॥''**

(ఆకులూ అలములు తినే జంతువులు కామ బాధలకు గురౌతాయి. పాలు, మీగడలు మెక్కే వారి దుర్గతి ఆ దేవుడికే తెలియాలి).

ఆరాధ్య దేవునిలో లేశ మాత్రమైనా లోపం కనిపించితే భావం విహ్వలమయి పోతుంది, పుణ్యమయ ప్రవృత్తులు విచలితమై పోతాయి, ఇష్ట దైవంతో సంబంధం విడిపోతుంది, కాబట్టి భీముని ద్వారా రక్షించబడుతున్న ఈ సైన్యాన్ని గెలవడం సులభం. పతంజలి మహర్షి కూడా ఇదే చెప్పాడు. **''సతు దీర్ఘకాల నైరంతర్య సత్కారాసేవితో ధృఢభూమిః''** (1/14), దీర్ఘ కాలం వరకు నిరంతరం శ్రద్ధా భక్తి పూర్వకంగా చేసే సాధనమే ధృఢంగా ఉండగలుగుతుంది.

తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః।
సింహానాదం వినద్యోచ్చైః శంఖం దధ్మౌ ప్రతాపవాన్ ॥ **12**॥

ఈ ప్రకారంగా తమ బలాబలాలను గురించి నిర్ణయం తీసుకొని, శంఖ ధ్వనులు చేయబడినాయి. గెలిస్తే ఏ పాత్ర మీకే మిస్తుంది ? అన్న విషయంపై, పాత్రల పరాక్రమం యొక్క ప్రకటన మాత్రమే శంఖధ్వని. కౌరవులలో వృద్ధుడు, ప్రతాపవంతుడు, పితామహుడైన భీష్ముడు ఆ దుర్యోధనుని హృదయంలో హర్షం కలిగేటట్లుగా ఉచ్చ స్వరంలో సింహనాదం వలె భయంకరంగా శంఖాన్ని పూరించాడు. సింహం ప్రకృతి యొక్క ప్రలోభానికి ప్రతీక. ఘోరారణ్యంలో, నీరవ ఏకాంతంలో సింహం గర్జన గనక వినపడితే,ఆ సింహం మైళ్ళ దూరంలో

ఉన్నా సరే రోమాలు నిక్కబొడుచుకుంటాయి, హృదయం కంపించి పోతుంది. భయం ప్రకృతిలో ఉంటుంది. పరమాత్మలో కాదు, అతను భయరహితుడైన సత్తా. భ్రమ రూపమైన భీష్ముడు గనక విజయుడైతే, ప్రకృతి రూపమైన ఏ భయారణ్యంలో మీరు ఉన్నారో అంతకన్నా అధికమైన భయావరణంలో మిమ్ములను బంధించి వేస్తుంది. భయం ఇంకా ఎక్కువవుతుంది, భయం యొక్క ఆవరణం ఇంకా సాంద్రమైపోతుంది. ఈ భ్రమ ఇంతకు మించి ఇంకేమీ ఇవ్వలేదు, కాబట్టి ప్రకృతి నుంచి నివృత్తే లక్ష్యప్రాప్తికి మార్గం. ప్రపంచంలో ప్రవృత్తులే భయంకరమైన అడవులు. అంధకారపు నీడలే ఉంటాయి ఇంతకు మించి కౌరవుల వద్ద యింకే ప్రకటన లేదు. కౌరవుల పక్షం నుంచి అనేక వాద్యాలు ఒక్క సారిగా మోగాయి, కానీ అన్నీ కలిసి అవి కూడా భయాన్నే కలిగించాయి. ఇంతకుమించి ఇంకేం లేదు. ప్రతి వికారం ఎంతో కొంత భయాన్ని కలిగిస్తుంది. కాబట్టి వారు కూడా అదే విధంగా ఘోషించారు–

*శ్లో ॥ తతః శంఖాశ్చ భేర్యశ్చ పణవానక గోముఖాః।*
*సహసైవాభ్య హన్యంత స శబ్దస్తుములో౽భవత్ ॥* ***13***॥

తదనంతరం అనేక శంఖాలు, నగారాలు, డోళ్ళు, మొదలగు అనేక వాయిద్యాలు ఒకేసారిగా వాయించ బడ్డాయి. వాటి శబ్దం కూడా అతి భయంకరంగా ఉండింది. భయం కలిగించడం తప్ప కౌరవులది ఇంకొక ప్రకటన లేదు. బహిర్ముఖీనమైన విజాతీయ ప్రవృత్తులు సఫలమైతే మోహమయమైన బంధం మరింత సాంద్రమై పోతుంది.

ఇప్పుడు పుణ్యమయమైన ప్రవృత్తుల వైపు నుంచి వచ్చిన ప్రకటనలు చూడండి. వాటిలో మొట్ట మొదటిది యోగేశ్వరుడు శ్రీ కృష్ణుడిది —

*శ్లో ॥ తతః శ్వేతైర్హయైర్యుక్తే మహతి స్యందనే స్థితౌ ।*
*మాధవః పాండవశ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః ॥* ***14***॥

దీని తరువాత శ్వేత అశ్వములతో యుక్తమైన రథంలో; వీటిలో లేశమాత్రం కూడా నలుపు గానీ, దోషం గానీ లేదు– శ్వేతం సాత్వికానికి, నిర్మలత్వానికి ప్రతీక. – **'మహతి స్యందనే'** మహా రథముపై కూర్చున్న యోగేశ్వరుడు శ్రీ కృష్ణుడూ, అర్జునుడు కూడా అలౌకికమైన శంఖాలను పూరించారు. అలౌకిక, అంటే ఈ లోకం కన్న పైది. మృత్యులోకం, దేవలోకం, బ్రహ్మలోకం, ఎక్కడి వరకైతే జన్మ– మరణాల భయముందో, ఆసమస్త లోకాలకన్నపైది పారలౌకికం, పారమార్థిక స్థితిని ప్రధానం చేసే ప్రకటనను యోగేశ్వరుడు శ్రీ కృష్ణుడు చేశాడు. బంగారం–వెండి– కొయ్యతో చేసిన రథం కాదు. ఆ రథం అలౌకికం, ఆ శంఖం అలౌకికం, కనుక ప్రకటన కూడా అలౌకికమే. లోకాలన్నిటికి అతీతంగా ఒక బ్రహ్మ మాత్రమే ఉన్నాడు. నేరుగా అతనితో సంపర్కాన్ని స్థాపింప చేసే ప్రకటన అది. అతను ఆ స్థితిని ఎలా ప్రదానం చేస్తాడు?

*శ్లో ॥ పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః।*
*పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః ॥ 15॥*

**'హృషీకేశః'**– ఎవరైతే హృదయం యొక్క సంపూర్ణ జ్ఞానియో, ఆకృష్ణుడు 'పాంచజన్యం' అనే శంఖాన్ని పూరించాడు. ఐదు జ్ఞానేంద్రియాలను, ఐదు తన్మాత్రల (శబ్ద, స్పర్శ, రూప, రుచి, వాసన) రసాలతో సహా తమ జన (భక్త) శ్రేణిలో చేర్చుకునే ప్రకటన చేశాడు. వికార రూపంతో దారి తప్పే ఇంద్రియాలను నిర్బంధించి, వాటిని సేవకుని శ్రేణిలో నిలబెట్టడానికి హృదయంలో ప్రేరణ కలిగించడమే సద్గురువు చేసే దానం. శ్రీకృష్ణుడు ఒక యోగేశ్వరుడు, ఒక సద్గురువు. ''శిష్యః త్యేహం– భగవన్ ! నేను మీ శిష్యుడను'' బాహ్య విషయ వస్తువులను వదలి, ధ్యానంలో ఒక్క యిష్టదైవాన్ని తప్ప ఇంకొకరిని చూడకపోవడం, ఇంకొకటి వినకపోవడం, ఇంకొక దానిని స్పృశించకపోవడం; యివి సద్గురువు యొక్క అనుభవ సంచారం మీద ఆధారపడి ఉంటాయి.

**'దేవదత్తం ధనంజయః'** దైవీ సంపత్తిని అధీనం చేసుకోగల అనురాగమే అర్జునుడు. ఇష్టదైవానికి అనుగుణంగా మసలుకోవడం– దేనిలోనైతే విరహం, వైరాగ్యం, అశ్రుపాతం ఉంటాయో; **'గద్గద్ గిరా నయన్ బహ నీరా'**, (గద్గదమైన స్వరం, నయనముల నుండి కన్నీళ్ళ ప్రవాహం) రోమాంచకం ఉంటుందో, యిష్టదైవాన్ని తప్పించి అన్య విషయ వస్తువులు లేశమాత్రం కూడా గుర్తురాక పోతాయో దానినే 'అనురాగం' అంటారు. ఇదే గనక సఫలమైతే, పరమదేవుడైన పరమాత్మునిలో ప్రవేశం ఇప్పించే దైవీ సంపదపై ఆధిపత్యం ప్రాప్తిస్తుంది. దీనికే రెండవ పేరు ధనంజయుడు. ఒక ధనం బాహ్య సంపత్తి. దీని వలన శరీర పోషణ జరుగుతుంది, ఆత్మకు దీనితో ఎటువంటి సంబంధమూ లేదు. దీనిని మించిన స్థిర ఆత్మిక సంపత్తే నిజమైన సంపద. బృహదారణ్యకోపనిషత్తులో యాజ్ఞవల్క్యుడు మైత్రేయికి ఇదే బోధించాడు, ధనంతో సంపన్నమైన పృథ్విపై ఆధిపత్యం వల్ల కూడా అమృతత్త్వ ప్రాప్తి రాజాలదు. దానికి ఒకే ఒక ఉపాయం ఆత్మిక సంపద మాత్రమే.

భయానకమైన కర్మలు చేసే భీమసేనుడు పౌండ్రం అంటే ''ప్రీతి'' అనే పేరుగల మహా శంఖాన్ని పూరించారు. భావం యొక్క ఉద్గమ నివాస స్థానం హృదయం. కాబట్టి దీని పేరు వృకోదరం. మీ యొక్క భావం, ఆసక్తి పిల్లలపై ఉంటుంది, కానీ వాస్తవానికి ఆ ప్రేమ మీ హృదయంలో ఉంటూ మీ పిల్లలలో మూర్తీ భవిస్తుంది. ఈ భావం మహా బలవత్తరమైనది. అదే 'ప్రీతి' అనే పేరుగల మహాశంఖాన్ని పూరించింది. భావంలోనే ఈ ప్రీతి నిహితమై ఉంటుంది, కాబట్టే భీముడు 'ప్రీతి' పేరుగల మహా శంఖాన్ని పూరించాడు. భావం మహత్తరమైన బలశాలి, కానీ దాని సంచారం ప్రీతిద్వారానే జరుగుతుంది.

*హరి వ్యాపక సర్వత్ర సమానా ।*
*ప్రేమతే ప్రకట హోహి మై జానా ।* (రా.చ.మా. 1/184/5)

శ్లో ॥ *అనంత విజయం రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః।*
*నకులః సహదేవశ్చ సుఘోషమణి పుష్పకౌ ॥ 16॥*

కుంతీ పుత్రుడు యుధిష్ఠిర మహారాజు 'అనంత విజయం' అను పేరుగల శంఖాన్ని పూరించాడు. కర్తవ్యానికి రూపమైన కుంతి, మరియు ధర్మానికి రూపమైన యుధిష్ఠిరుడు, ధర్మం మీద పట్టు ఉంటే అది అనంత విజయం– అనంత పరమాత్మునిలో స్థితిని కలిగిస్తుంది. **యుద్ధే స్థిరః యుధిష్ఠిరః'**. ప్రకృతి–పురుషుడు, క్షేత్ర – క్షేత్రజ్ఞుల సంఘర్షణలో స్థిరంగా ఉంటే, మహా దుఃఖం వలన కూడా విచలితులవక పోతే, ఒక రోజు, ఏదైతే అనంతమో, దేనికైతే అంతం లేదో, అటువంటి పరమతత్త్వం అయిన పరమాత్మునిపై విజయం లభింపజేస్తుంది.

నియమ స్వరూపుడయిన నకులుడు 'సుఘోషం' అనే పేరుగల శంఖాన్ని పూరించాడు. నియమం ఉన్నతమవుతూంటే, అశుభం నశిస్తూ పోతుంది, శుభం ప్రకటిత మవుతూ ఉంటుంది. సత్సంగ రూపుడైన సహదేవుడు 'మణిపుష్పకం' శంఖాన్ని పూరించాడు. మనీషులు ప్రతీ శ్వాసను బహు మూల్యమైన మణి అని అన్నారు. **''హీరా జైసీ స్వాసా బాతో మే బీతీజాయ్''** (మణి వంటి శ్వాస మాటలలో వ్యర్థమై పోతుంది). సత్పురుషుల వాక్కులను వినగలిగితే, అది ఒక సత్సంగం, కానీ యదార్థమైన సత్సంగం ఆంతరికమైనది. శ్రీ కృష్ణుని వాక్కుల ప్రకారం ఆత్మయే సత్యం, సనాతనం. చిత్తం అన్ని వైపుల నుంచి కూడా కట్టుబడి ఆత్మతో సాంగత్యం చేస్తే, అదే వాస్తవిక సత్సంగం. ఈ సత్సంగం చింతన, ధ్యానం మరియు సమాధితుల అభ్యాసం ద్వారా లభిస్తుంది. సత్యం సాన్నిధ్యంలో ధ్యానం పట్టుపడిన కొద్దీ ఒక్కొక్క శ్వాసపైన అధికారం లభిస్తూ ఉంటుంది. మనస్సుతో సహా యింద్రియాలు నిరోధించబడుతూ ఉంటాయి. ఏ రోజైతే అవి పూర్తిగా నిరోధించబడతాయో, అప్పుడు అసలు వస్తువు ప్రాప్తిస్తుంది. వాద్యయంత్రాలలాగా చిత్తం ఆత్మతో స్వరంతో స్వరం కలిపి మిళితమై పోవడమే సత్సంగం.

భౌతికమయిన మణి కఠినమైనది, కానీ శ్వాస అనే మణి పుష్పంకంటే కూడా కోమలమయినది. పుష్పం పూర్తిగా వికసించిన తరువాత లేకపోతే కోసిన తరువాతనే వాడి పోతుంది. కానీ మీరు తరువాతి శ్వాస వరకు జీవించి ఉంటారనే గ్యారంటీ ఇవ్వలేరు. కానీ సత్సంగం సఫలమైతే అది ప్రతి శ్వాసపై అధికారాన్నిచ్చి, పరమ లక్ష్య ప్రాప్తి కలిగిస్తుంది. దీని తరువాత పాండవుల నుంచి మరింకే ప్రకటనా లేదు. కానీ ప్రతి సాధనం నిర్మలత్వం యొక్క మార్గంలో ఎంతోకొంత దూరం నడిపిస్తుంది. ఆతరువాత ఇలా అంటారు.

శ్లో ॥ కాశ్యశ్చ పరమేష్వాసః శిఖండీ చ మహారథః।
ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకిశ్చాపరాజితః ॥ **17**॥

శరీర రూపమైనది కాశీ. ఎప్పుడైతే పురుషుడు (వ్యక్తి) అన్నీ వైపుల నుండి మనస్సుతో సహా ఇంద్రియాల్ని కూడగట్టుకొని, కాయంలోనే కేంద్రీకృతమవుతాడో, అప్పుడు 'పరమేష్వాసః పరమాత్మునిలో నివసించడానికి అధికారవుతాడు. పరమాత్మునిలో నివాసం ఇప్పించగల సామర్థ్యం గల కాయమే కాశీ. కాయంలోనే పరమాత్ముని నివాసం. పరమేష్వాసః అంటే అర్థం శ్రేష్ఠమైన ధనస్సు గల వాడని కాదు, పరమ + ఈశ + వాసః అని ఆ సమాసానికి అర్థం.

శిఖా-సూత్రం యొక్క త్యాగమే శిఖండి. ఈ రోజులలో మనుష్యులు తలపై జుట్టును గొరిగించుకొని, సూత్రం పేరు మీద మెడలోని జంద్యాన్ని తొలగించేసి అగ్నిని ప్రజ్వలించడం (హోమం చేయడం) మానేస్తారు. దానితో వారి సన్యాసం పూర్తి అయిపోయింది. అలా కానే కాదు. వాస్తవానికి శిఖ మీరు పొందవలసిన లక్ష్యానికి ప్రతీకం, మరియు సూత్రం సంస్కారాలకు ప్రతీకం, ఎప్పటి వరకు పరమాత్ముని పొందడం మిగిలి ఉందో, సంస్కారాల సూత్రం తగులుకొని ఉంది. మరి ఇక త్యాగం ఎలా సాధ్యపడుతుంది ? సన్యాసం ఎలా సంభవమవుతుంది? ఇంకా అతడు పథికుడే. ఎప్పుడైతే ప్రాప్తవ్యం లభించి పోతుందో, తగులుకొని ఉన్న సంస్కారాల సూత్రం తెగిపోతుందో, అటువంటి పరిస్థితిలో భ్రమ పూర్తిగా లుప్తమైపోతుంది. కాబట్టి శిఖండియే భ్రమకు ప్రతి రూపమైన భీష్ముణ్ణి నాశనం చేయగలడు. శిఖండి చింతనా పథంలో ఒక విశిష్ట యోగ్యత గల మహారథికుడు.

'ధృష్టద్యుమ్న'- ధృఢమైన అచంచలమైన మనస్సు, 'విరాటః' సర్వత్ర విరాట్ స్వరూపుడైన ఈశ్వరుడి ప్రసారాన్ని, చూడగల సామర్థ్యం మొదలగునవి దైవీ సంపదలో ప్రముఖ గుణాలు. సాత్వికతయే సాత్యకి. సత్యంపై చింతనా ప్రవృత్తి అంటే సాత్వికత ఉంటే, ఎప్పటికీ పతనం సంభవించదు. ఈ సంఘర్షణలో పరాజితుణ్ణి కానివ్వదు.

*శ్లో ॥ ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీ పతే।*
*సౌభద్రశ్చ మహాబాహుః శంఖాన్దధ్ముః పృథక్ పృథక్ ॥ **18**॥*

అచల పదదాయకుడు ద్రుపదుడు. ధ్యాన రూపిణి అయిన ద్రౌపది యొక్క ఐదుగురు పుత్రులు- సహృదయత, వాత్సల్యం, లావణ్యం, సౌమ్యత స్థిరత మొదలగునవి సాధనలో గొప్ప సహాయకులయిన మహారథులు, గొప్ప బాహు బలంగల అభిమన్యుడు- వీరందరూ వేరు వేరు శంఖాలు పూరించారు. భుజము కార్యక్షేత్రానికి ప్రతీకం. మనస్సు భయరహితమైనప్పుడు దాని సామర్థ్యం చాలా వరకు పెరిగిపోతుంది.

'హే రాజా వీరందరూ వేరే వేరు శంఖాల్ని పూరించారు.'' అందరూ ఎంతో కొంత దూరం నడిపిస్తారు. వీటిని పాటించడం అవసరం, కాబట్టే వీరి పేర్లు చెప్పబడ్డాయి. ఇవి కాకుండా, మనస్సు-బుద్ధులకు అతీతమయిన దూరం కూడా ఉంది. భగవంతుడు స్వయంగా అంతః కరణంలో ఉండి మనలను నడిపిస్తాడు. ఇటు దృష్టిగా మారి ఆత్మలో నిలబడతాడు, అటు స్వయంగా ఎదురుగా నిలబడి తనను పరిచయం చేసుకొంటాడు.

*శ్లో ॥ సఘోషోధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్।*
*నభశ్చ పృథివీం చైవ తుములో వ్యనునాదయన్ ॥ **19**॥*

ఈ ఘోర శబ్దం ఆకాశాన్నీ, పృథ్విని కూడా శబ్దాయమానం చేస్తూ ధృతరాష్ట్ర పుత్రుల హృదయాల్ని బ్రద్దలు చేసింది. సైన్యం పాండువుల వైపున కూడా ఉంది, కానీ హృదయం, బ్రద్దలు అవడం ధృతరాష్ట్ర పుత్రులకే జరిగింది. వాస్తవానికి పాంచ జన్యం, దైవీ

శక్తిపై ఆధిపత్యం, అనంతంపై విజయం, అశుభాల శమనం, శుభాల ప్రకటన వరుసక్రమంగా జరుగుతుంటే, కురుక్షేత్రం, ఆసురీ సంపద, బహిర్ముఖీన ప్రవృత్తుల హృదయం బ్రద్దలవుతుంది. వాటి బలం మెల్ల మెల్లగా క్షీణిస్తూ ఉంటుంది. పూర్తిగా సాఫల్యం లభించినప్పుడు మోహమయ ప్రవృత్తులు శమితమై పోతాయి.

*శ్లో ॥ అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః।*
*ప్రవృత్తే శస్త్ర-సంపాతే ధనురుద్యమ్య పాండవః ॥**20**॥*

*హృషీకేశం తదా వాక్యమిదమాహ మహీపతే ।*

అర్జున ఉవాచ-

*శ్లో ॥ సేనయోరుభయోర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత ॥**21**॥*

సంయమరూపుడయిన సంజయుడు అజ్ఞానంచే ఆవృత్తమైన మనస్సును ప్రబోధ పరిచాడు :- హే రాజా ! దీని తరువాత 'కపిధ్వజః'- వైరాగ్య రూపుడయిన హనుమంతుడు. కొంతమంది అర్జునుని ధ్వజం చంచలమైంది, కాబట్టి కపిధ్వజమన్నారు అని అంటారు. కానీ అది సరి కాదు, ఇక్కడ కపి సాధారణమైన కోతి కాదు, స్వయంగా హనుమంతుడు- అతను మానావమానాల్ని నశింపచేసుకున్నవాడు, **'సమమాన నిరాదర ఆదరిహి !''** ప్రకృతిలో చూచిన - వినిన వస్తువులపై, విషయాలపై రాగాన్ని త్యజించడమే వైరాగ్యం. కాబట్టి వైరాగ్యమే ఎవరి ధ్వజమో, అట్టి అర్జునుడు వ్యవస్థిత రూపంలో నిలబడిన ధృతరాష్ట్ర పుత్రుల్ని చూసి శస్త్రాలను ప్రయోగించడానికి ధనుస్సు ఎక్కుపెట్టి, 'హృషీకేశం'-ఎవరైతే హృదయం యొక్క సర్వస్వ జ్ఞాతయో ఆ యోగేశ్వరుడు, శ్రీకృష్ణునితో ఇలాగు అన్నాడు- 'ఓ అచ్యుతా (ఎవరైతే ఎప్పుడూచ్యుతుడు కాడో)! నా రథాన్ని రెండు సేనల మధ్య నిలపండి.'' ఇది సారథికి యిచ్చిన ఆదేశం కాదు, యిష్ట దేవునికి (సద్గురువుకు) చేసిన ప్రార్థన. ఎందుకని రథాన్ని నిలబెట్టాలి?

*శ్లో ॥ యావదేతాన్నిరీక్షేహం యోద్ధుకామానవస్థితాన్।*
*కైర్మయా సహ యోద్ధవ్యమస్మిన్రణ సముద్యమే ॥**22**॥*

నేను ఇక్కడి స్థితులైన యుద్ధం చేయు కోరికగలవారైన యావన్మందిని చూచి, ఈయుద్ధంలో నేను ఎవరితో యుద్ధం చేయడం యోగ్యమో నిశ్చయించుతాను. ఈ యుద్ధమనే క్రియలో నేను ఎవరెవరితో యుద్ధం చేయాలి ?

*శ్లో ॥ యోత్స్య మానానవేక్షేఽహం య యేతేఽత్ర సమాగతాః ।*
*ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేర్యుద్ధే ప్రియచికీర్షవః ॥**23**॥*

దుర్మార్గుడయిన దుర్యోధనుడికి యుద్ధంలో మంచి జరగాలనుకుంటూ, ఏ-ఏ రాజులైతే ఈ సేనలో చేరారో, యుద్ధం చేసే కోరిక గల అటువంటి వారిని, నేను చూస్తాను, అందుకై రథాన్ని నిలబెట్టండి. మోహరూపుడయినవారు దుర్యోధనాదులు. మోహమయ ప్రవృత్తుల మంచి కోరి ఏ యే రాజులు ఈ యుద్ధం చేయ వచ్చారో, వారిని నేను చూస్తాను.

సంజయ ఉవాచ

*శ్లో ॥ ఏవముక్తో హృషీకేశో గుడాకేశేన భారత ।*
*సేన యోరుభయోర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమం ॥**24**॥*

*శ్లో ॥ భీష్మద్రోణ ప్రముఖతః సర్వేషాం చ మహీక్షితాం ।*
*ఉవాచ పార్థ పశ్యైతాన్ సమ వేతాన్ కురూనితి ॥**25**॥*

సంజయుడు ఇలా చెప్పాడు:- నిద్రాజయుడయిన అర్జునుడు ఈవిధంగా అన్న తరువాత హృదయం యొక్క జ్ఞాత అయిన శ్రీకృష్ణుడు రెండు సేనల నడుమ – భీష్ముడు, ద్రోణుడు మరియు 'మహీక్షితాం' – శరీరరూపమయిన పృథ్విపై అధికారాన్ని హస్తగతం చేసుకొన్న అందరి రాజుల మధ్య, ఉత్తమ రథాన్ని నిలబెట్టి ఇలా అన్నాడు –పార్థా ! ఇక్కడ చేరియున్న కౌరవులను చూడు. ఇక్కడ ఉత్తమ రథం అంటే బంగారం –వెండితో చేయబడ్డ రథం కాదు. ప్రపంచంలో ఉత్తమం అన్న పదానికి నిర్వచనం ఈ నశ్వర శరీరానికి అనుకూలంగా లేక ప్రతి కూలంగా చేయబడుతుంది. ఇలాంటి నిర్వచనం అపూర్ణమయినది. మన ఆత్మతో, మన స్వరూపంలో ఎల్లప్పుడు కలిసి ఉండేదే ఉత్తమం. ఆ తరువాత 'అనుత్తమ' – మాలిన్యం వుండదు.

*శ్లో ॥ తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄనథ పితామహాన్ ।*
*ఆచార్యాన్ మాతులాన్ భ్రాతౄన్ పుత్రాన్ పౌత్రాన్ సఖీం స్తదా ॥**26**॥*
*శ్వశురాన్ సుహృదశ్చైవ సేనయోరుభయోరపి ।*

దీని తరువాత గురితప్పని లక్ష్యం గలవాడు, పార్థివ శరీరాన్ని రథంగా మార్చుకొన్న పార్థుడు ఆ రెండు సేనలలో ఉన్న తండ్రియొక్క అన్న దమ్ములను, పితామహులను, ఆచార్యులను, మామలను, అన్న దమ్ములను, పుత్రులను, పౌత్రులను, మిత్రులను, మామగార్లను చూసాడు. రెండు సేనలలోనూ అర్జునుడికి కేవలం తన కుటుంబం, మామల కుటుంబం, మామగారి కుటుంబం మిత్రులు మరియు గురుజనులు కనిపించారు. ఆనాటి లెక్కల ప్రకారంగా పద్దెనిమిది అక్షౌహిణీల సేన ఇంచుమించు 40 లక్షలు అవుతుంది. కానీ ఈనాటి లెక్కల ప్రకారం అది ఇంచుమించు 650 కోట్లు అవుతుంది. అది ఈనాటి ప్రపంచ జనసంఖ్యకు సమానమైనది. ఇంతమందికి ప్రపంచ స్థాయిలోనే ఉండడానికి యిళ్ళు, తినడానికి తిండి, సమస్యయిపోతుంది. ఇంత పెద్ద జన సమూహం అర్జునుడి ముగ్గురు నలుగురు బంధువుల కుటుంబాలు మాత్రమే, ఎవరికైనాయింత పెద్ద కుటుంబం ఉంటుందా? అసంభవం. ఇది హృదయదేశ – చిత్రణ మాత్రమే.

*శ్లో ॥ తాన్సమీక్ష్య సకౌంతేయః సర్వాన్బంధూన వస్థితాన్ ॥**27**॥*
*కృపయా పరయా విష్టో విషీద న్నిదమ బ్రవీత్ ।*

ఈ ప్రకారంగా నిలుచున్న అందరు బంధువులను చూచి అత్యంత కరుణతో నిండిన ఆ కుంతీ పుత్రుడు అర్జునుడు శోక పూరితుడైనాడు. అర్జునుడు దుఃఖించడం మొదలు పెట్టాడు; ఎందుకంటే అక్కడ అందరూ అతని కుటుంబ సభ్యులే, కాబట్టి ఇలా అన్నాడు–

అర్జున ఉవాచ–

శ్లో ॥ *దృష్ట్వేమం స్వజనం కృష్ణ యుయుత్సుం సముపస్థితం ॥**28**॥*

శ్లో ॥ *సీదంతి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి ।*
*వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే ॥**29**॥*

''హే కృష్ణా ! యుద్ధం చేయ కోరిక గలిగి నిలుచున్న ఈ స్వజన సముదాయాన్ని చూచి, నా అంగాలన్నీ శిథిలమై పోతున్నాయి, నోరు ఎండి పోతున్నది. నాశరీరం వణుకుతూ రోమాంచితమయి పోతుంది. ఇంతేకాదు–

శ్లో ॥ *గాండీవం స్రంసతే హస్తాత్ త్వక్చైవ పరిదహ్యతే ।*
*నచ శక్నో మ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః ॥**30**॥*

చేతిలో నుంచి గాండీవం జారిపోతున్నది, చర్మం జ్వలించిపోతుంది. అర్జునుడికి జ్వరంలాగా వచ్చింది. ఇదేం యుద్ధం? ఇందులో అంతా స్వజనులే ఉన్నారు? అని సంతాపం కలిగింది. అర్జునుడికి భ్రమ కలిగింది. అతను ఇలా అన్నాడూ–ఇప్పుడు నిలబడడానికి కూడా అసమర్థుణ్ణి అయి పోతున్నాను. ఇంక ముందుకు చూడడానికి సామర్థ్యం లేదు.

శ్లో ॥ *నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ ।*
*న చ శ్రేయోऽను పశ్యామి హత్వా స్వజన మాహవే ॥**31**॥*

''హే కేశవా ! ఈ యుద్ధపు లక్షణాలు కూడా విపరీతంగానే కనిపిస్తున్నాయి. యుద్ధంలో మన కులాన్నే చంపి పరమ కళ్యాణాన్ని కూడా చూడలేక పోతున్నాను. కులాన్ని నశింపజేస్తే, కళ్యాణ మెలా సాధ్యపడుతుంది.

శ్లో ॥ *న కాంక్షే విజయం కృష్ణ నచ రాజ్యం సుఖాని చ ।*
*కిం నో రాజ్యేన గోవిందకిం భోగైర్జీవితేన వా ॥**32**॥*

కుటుంబ సభ్యులందరూ యుద్ధం చేయడానికి సిద్ధంగా ఉన్నారు. వారిని చంపితే వచ్చే విజయం, విజయం వలన లభించే రాజ్యం మరియు రాజ్యం వలన కలిగే సుఖం అర్జునుడికి అవసరం లేదు. అతను ఇలా అంటాడు– కృష్ణా! నేను విజయాన్ని కోరడం లేదు, రాజ్యాన్ని, సుఖాన్ని కూడా కోరడం లేదు. గోవిందా! మనకు రాజ్యం వలన, సుఖాల వలన జీవితంలో

ఏమిటి ప్రయోజనం? ఎందుకని? ఆ పై అంటాడు-

*శ్లో ॥ యేషా మర్థే కాంక్షితం నో రాజ్యం భోగాః సుఖానిచ ।*
*త ఇమే వస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనాని చ ॥**33**॥*

మనం ఎవరి కోసమైతే రాజ్యం, సుఖం మొదలయినవి కోరుకున్నామో, ఆకుటుంబ సభ్యులే జీవితంపై ఆశను త్యజించి యుద్ధానికై రణరంగంలో నిలబడ్డారు. మనకు రాజ్యంపై కోరిక ఉండేది కుటుంబం కోసమే, భోగాలూ, సుఖాలూ, ధన పిపాస స్వజనులు మరియు కుటుంబంతో కలసి అనుభవించాలనే; కానీ వీరందరూ ప్రాణాల్పై ఆశను త్యజించి నిలబడ్డారు, అలాంటప్పుడు నాకు సుఖాలు, రాజ్యాలు, భోగాలు అక్కరలేదు. ఇవన్నీ వీరికోసమే నాకు అవసరమనిపించాయి. వీరే దూరమైనప్పుడు, నాకు వాటి అవసరం లేదు. పూరి గుడిసెలో వుండే వాడు కూడా తన కుటుంబాన్ని, మిత్రులను, స్వజనులను చంపి ప్రపంచ సామ్రాజ్యాన్ని స్వీకరించడు. అర్జునుడు కూడా యిదే అంటాడు- మనకు భోగాలు అంటే ఇష్టం, విజయం అంటే ఇష్టం, కానీ ఎవరి కోసం ? వారే లేనప్పుడు ఈ భోగాల వలన ప్రయోజన మేమిటి ? ఈ యుద్ధంలో ఎవరిని చంపాలి ? (నా వారినే కదా!)

*శ్లో ॥ ఆచార్యాః పితరః పుత్రాస్తథైవ చ పితామహాః।*
*మాతులాః శ్వసురాః పౌత్రాః శ్యాలాః సంబంధినస్తథా ॥**34**॥*

ఈ యుద్ధంలో ఉన్న వారందరూ పెదనాన్నలు, చిన్నాన్నలు, కొడుకులు తాతలు, మేనమామలు, మామగార్లు, మనుమలు, బావ మరదులు బంధువులే ఉన్నారు.

*శ్లో ॥ ఏ తాన్న హంతుమిచ్ఛామి ఘ్నతోపి మధు సూదన ।*
*అపి త్రై లోక్య రాజ్యస్య హేతోః కిం, ను మహీకృతే ॥**35**॥*

''హే మధుసూదనా! నన్ను చంపినా సరే, ఈ ముల్లోకాల్పై ఆదిపత్యం కోసం కూడా నేను వీరందరిని చంపలేను, అలాంటప్పుడు ఇహ ఈ పృథ్వీకోసమా?

పద్దెనిమిది అక్షౌహిణీల సేనలో అర్జునుడికి తన కుటుంబం వారే కనిపించారు. ఇంత మంది స్వజనులా ! వాస్తవానికి ఏమిటిది? వాస్తవానికి అనురాగమే అర్జునుడు. సాధన ప్రారంభములో ప్రత్యేక అనురాగవంతుడికి ఇదే సమస్య ఎదురవుతుంది. అందరూ తాము భజన చేయాలనీ, ఆ పరమాత్మున్ణి పొందాలనీ అనుకుంటారు. కానీ ఎవ్వరైనా అనుభవ యుక్తుడయిన సద్గురువు సంరక్షణలో ఎవ్వరైనా అనురాగవంతుడు క్షేత్ర-క్షేత్రజ్ఞుల సంఘర్షణను గురించి, తాను ఎవరిని ఎదుర్కోవాలన్న విషయం అర్థం చేసుకొంటున్నప్పుడు, అతను హతాశుడై పోతాడు. తన తండ్రి కుటుంబంతో, మామగారి కుటుంబంతో, మేన మామల కుటుంబాలతో, మిత్రులతో, గురుజనులతో కలసి ఉండాలనీ, వారందరూ సుఖంగా ఉండాలనీ, వారందరికీ తగిన ఏర్పాట్లు చేస్తూ తాను పరమాత్మ స్వరూపాన్ని పొందాలనీ కోరుకుంటాడు. కానీ ఆరాధనలో అగ్రేసరుడవాలంటే కుటుంబాన్ని వదలి పెట్టాలనీ, యీ బంధువుల మోహాన్ని

త్రెంచి వేసుకోవాలని తెలుసు కొన్నప్పుడు, అతను వ్యాకుల పడిపోతాడు.

పూజ్య గురు మహారాజుల వారు చెపుతుండేవారు– ''చావడమూ సాధువు అవడమూ సమానం''. అని. సాధువుకు ఈ సృష్టిలో ఎవ్వరైనా ఉండవచ్చును, కానీ తన ఇంటి వారంటూ ఎవరూ ఉండరు. అలా కాకుండా ఎవ్వరైనా ఉన్నట్లయితే, వార్పై మమకారం ఉంటుంది, అలాంటప్పుడు మోహం పరిసమాప్తమెలా అవుతుంది? ఆ మమకారపు అస్తిత్వం నశింపజేసినప్పుడే, విజయం ప్రాప్తిస్తుంది. ఈ సంబంధాల పరివ్యాప్తియే జగత్తు. అదే లేకపోతే ఈ జగత్తులో మనదంటూ ఏముంది ? 'తులసిదాస్ కహ చిద్విలాస జగ్, బూఝత్–బూఝత్ బూఝై, (తులసిదాసంటాడు: చిత్తం యొక్క విలాసమే జగత్తు, మెల్లగా, అతి మెల్లగా అది అర్థం అవుతుంది). మనస్సు మొక్క ప్రసారమే జగత్తు. యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు కూడా మనస్సు యొక్క ప్రసారాన్నే జగత్తు అంటూ సంబోధించాడు. ఎవ్వరైతే దీని ప్రభావాన్ని నిరోధిస్తాడో, అతను ఈ చరాచర జగత్తును జయిస్తాడు– ''ఇహైవ తైర్జితః సర్గోయేషాం సామ్యే స్థితం మనః' (గీత 5/19)

ఒక్క అర్జునుడే వ్యాకులుడై పోయాడని కాదు. అనురాగం అందరి హృదయాల్లోనూ ఉంటుంది. ప్రతి అనురాగవంతుడూ వ్యాకులపడి పోతాడు. అతనికి బంధువులు గుర్తుకు వస్తారు. భజన వలన కొంత లాభముంటుందనీ, కాబట్టి వీరందరూ సుఖంగా ఉంటారనీ అతను మొదట్లో అనుకుంటాడు. వీరందరితో ఉంటూ ఆ సుఖాన్ని అనుభవించుదామనుకొంటాడు. ఎప్పుడైతే వీరే ఉండరో అప్పుడు ఆ సుఖాలని ఏం చేయాలి? అర్జునుడి దృష్టి రాజ్య సుఖం వరకే నియమితమైపోయింది. అతను త్రిలోక సామ్రాజ్యమే సుఖానికి పరాకాష్ట అని అనుకొంటున్నాడు. ఇంతకు మించిన సత్యం కూడా ఒకటి ఉంది, దానిని గురించి అర్జునుడికి ప్రస్తుతం తెలియదు.

*శ్లో ॥ నిహత్య ధార్తరాష్ట్రాన్నః కా ప్రీతిః స్యాజ్జనార్దన ।*
*పాపమే వాశ్రయే దస్మాన్ హత్వై తానాతతాయినః ॥**36**॥*

''హే జనార్ధనా! ధృతరాష్ట్రుని పుత్రులను చంపితే మాకు ఆనందం ఎలా కలుగుతుంది? ఇక్కడ ధృతరాష్ట్ర అంటే ధృష్టత యొక్క రాష్ట్రం అని అర్థం, దాని వలన ఉత్పన్నమైన మోహరూపుడైన దుర్యోధనుడు మొదలగువారిని చంపితే, మాకు పాపమే చుట్టుకుంటుంది. జీవన యాపనమనే తుచ్ఛ లాభానికై అవినీతిని ఆశ్రయించేవారు ఆతతాయిలనబడతారు. కానీ వాస్తవానికి యింత కన్నా పెద్ద ఆతతాయి ఆత్మయొక్క మార్గంలో అవరోధాన్ని ఉత్పన్నం చేసేవాడు. ఆత్మదర్శనంలో అడ్డంకులను సృష్టించే కామం, క్రోధం, మోహం మొదలగువాటి సమూహమే నిజమయిన ఆతతాయి.

శ్లో ॥ తస్మాన్నారాహ వయం హంతుం ధార్తా రాష్ట్రాం స్వబాంధవాన్ ।
స్వజనం హి కథం హత్వా సుఖినః స్యాం మాధవ ॥**37**॥

అందువలన ''హే మాధవా!'' మన బంధువులయిన ధృతరాష్ట్ర పుత్రులను చంపడానికి మనం యోగ్యులం కాము. వారు తనకు బంధువులు ఎలా? వారు శత్రువులు కదా! వాస్తవానికి శారీరకమైన చుట్టరికాలు అజ్ఞానం వలన ఉత్పన్నమవుతాయి. ''ఇతను మామ, యిది మా అత్తగారిల్లు, వీరు స్వజన సముదాయం'' ఇదంతా అజ్ఞానమే కదా! ఈ శరీరమే నశ్వరమైనప్పుడు దీనికి చుట్టరికాలు ఎక్కడివి? మోహం ఉన్నంత వరకే మిత్రులు ఉంటారు, మన కుటుంబం ఉంటుంది, మన ప్రపంచం ఉంటుంది. మోహమే లేనప్పుడు ఏమీ ఉండదు. కాబట్టే ఆ శత్రువులు కూడా అర్జునుడికి స్వజనంగా కనబడ్డారు. అతడు ఇలా అంటాడు 'మా కుటుంబాన్ని చంపుకొని మేమెలా సుఖంగా ఉండగలము?'' అజ్ఞానం, మోహం లేకుంటే కుటుంబానికి అస్తిత్వమే లేదు. ఈ అజ్ఞానం జ్ఞానానికి ప్రేరకం కూడా. భర్తృహరి, తులసీదాస్ మొదలగువారలకు వైరాగ్య ప్రేరణ భార్యల వలన కలిగితే, మరి కొందరు సవతి తల్లుల వ్యవహారంతో ఖిన్నులై వైరాగ్య పథంపై అగ్రేసరులవుతూ కనిపిస్తారు.

*శ్లో ॥ యద్యప్యేతే న పశ్యంతి లోభోపహత చేతసః।*
*కులక్షయ కృతం దోషం మిత్ర ద్రోహే చ పాతకమ్ ॥**38**॥*

లోభంచే భ్రష్ట చిత్తులైన వీరు కులనాశమనే దోషాన్నీ, మిత్ర-ద్రోహ మనే పాపాన్నీ చూడలేక పోతున్నారు. అది వారి లోపం, అయినా గానీ-

*శ్లో ॥ కథం న జ్ఞేయ మస్మాభిః పాపాదస్మాన్ని వర్తితుం ।*
*కుల క్షయ కృతం దోషం ప్రపశ్యద్భిర్జనార్ధన ॥**39**॥*

'హే జనార్ధనా! కులనాశం వలన జరిగే దోషాలు తెలిసిన మనం ఈ పాపాన్ని ఆపడం గురించి ఎందుకు ఆలోచించ కూడదు ? నేనే పాపాన్ని చేస్తున్నానని కాదు- మీరు కూడా తప్పు చేయబోతున్నారు! అని శ్రీ కృష్ణునిపై ఆరోపణచేస్తున్నాడు. ఇప్పుడు అతనికి తెలిసినంత వరకు తాను శ్రీ కృష్ణుని కంటే తక్కువ వాడు కాదు. ప్రతి కొత్త సాధకుడూ సద్గురువు శరణులోకి వెళ్ళినప్పుడు ఇదే విధంగా తర్కిస్తాడు, తాను తెలివితేటలలో తక్కువ అని అనుకోడు. ఇదే విధంగా అర్జునుడు కూడా అంటాడు. ''వీళ్ళకు తెలియక పోవచ్చు, కానీ నేనూ, మీరూ అర్థం చేసుకోగలవారమే గదా. కుల నాశనం యొక్క దోషాల గురించి మనం ఆలోచించాలి. కుల నాశనంలో దోషమేమిటి?

*శ్లో ॥ కులక్షయే ప్రణశ్యంతి కులధర్మాః సనాతనాః।*
*ధర్మే నష్టే కులం కృత్స్న మధర్మోభిభవత్యుత ॥**40**॥*

కులం నాశనం అవడం వలన సనాతనమైన కులధర్మం నశించి పోతుంది. అర్జునుడు కులధర్మాన్నీ కులాచారాలనే సనాతన ధర్మమను కొంటున్నాడు. ధర్మం నాశనం అవడం వలన సంపూర్ణ కులాన్ని పాపం బాగా అణచి వేస్తుంది.

*శ్లో ॥ అధర్మాభిభవాత్కృష్ణ ప్రదుష్యంతి కులస్త్రియః ।*

*స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణ సంకరః ॥41॥*

''హే కృష్ణా!'' పాపము అధికంగా పెరుగుటచేత కులస్త్రీలు దూషితమైపోతారు.

''హే వార్ష్ణేయ! స్త్రీలు దూషితులైతే, వర్ణసంకరమవుతుంది''. స్త్రీలు దూషితులవడం చేత వర్ణసంకరమవుతుందని అర్జునుని యొక్క అభిప్రాయము, కానీ శ్రీకృష్ణుడు దానిని ఖండించి చెప్పాడు– ''నేను (లేక) నా స్వరూపంలో స్థితుడై ఉన్న మహాపురుషుడు ఆరాధనా క్రమంలో భ్రమను ఉత్పన్నం చేస్తే, అప్పుడు వర్ణసంకరం అవుతుంది. ''వర్ణ సంకరం యొక్క దోషాల్ని అర్జునుడు వివరిస్తాడు:–

శ్లో ॥ *సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ ।*
*పతంతి పితరో హ్యేషాం లుప్తపిండోదక క్రియాః ॥42॥*

వర్ణ సంకరం కులఘ్నులైన వారి కులాన్ని నరకానికి పంపడానికి మూలం అవుతుంది. పిండోదక క్రియలు లుప్తమై పోవడం వలన వీరి పితరులు కూడ పతితులైపోతారు. వర్తమానం నాశనమై పోతుంది. భూతకాలంలో ఉన్న పితరులు పతితులైపోతారు, భవిష్యత్తులోని వారు కూడా పతితులైపోతారు. ఇంతే కాదు–

శ్లో ॥ *దోషైరేతైః కులఘ్నానాం వర్ణ సంకర కారకైః ।*
*ఉత్సాద్యంతే జాతి ధర్మాః కుల ధర్మాశ్చ శాశ్వతాః ॥43॥*

ఈ వర్ణసంకర కారక దోషాల వలన కులం, కులఘాతకుల సనాతన కులధర్మాలు, జాతి ధర్మాలు నాశనమయి పోతాయి. కులధర్మమే సనాతనమనీ, శాశ్వతమనీ అర్జునుడు అనుకొంటున్నాడు. కానీ శ్రీ కృష్ణుడు ఈ మాటలను ఖండిస్తూ ఇలా అంటాడు. ''ఆత్మయే సనాతన శాశ్వత ధర్మం.'' వాస్తవిక సనాతన ధర్మాన్ని తెలుసుకోవడానికి ముందు మనిషి 'ఏదో ఒక రూఢినే ధర్మమనుకొంటాడు. సరిగ్గాయిదే ప్రకారంగా అర్జునుడు కూడా అనుకొంటున్నాడు, శ్రీ కృష్ణుని మాటలలో అది ఒక రూఢి మాత్రమే.

శ్లో ॥ *ఉత్పన్న కులధర్మాణాం మనుష్యాణాం జనార్థన ।*
*నరకే నియతం వాసో భవతీత్యను శుశ్రుమ ॥44॥*

''హే జనార్థనా! కులధర్మములు నశించిన మనుష్యులు అనంత కాలం వరకు నరకంలో నివసిస్తారు; కులధర్మమే నాశనం కాలేదు, దానితోబాటు శాశ్వత సనాతన ధర్మం కూడా నాశనమైపోతుంది. ఎప్పుడైతే ధర్మం నశిస్తుందో, ఆ వ్యక్తి అనంతకాలం వరకు నరకంలో నివసిస్తాడు, అలాగని నేను విన్నాను. నేను చూడలేదు. కానీ విన్నాను.

శ్లో ॥ *అహో బత మహత్పాపం కర్తుం వ్యవసితా వయం ।*
*యద్రాజ్య సుఖలోభేన హంతుం స్వజన ముద్యతాః ॥45॥*

''అహో! మనం బుద్ధిమంతులమై కూడా మహాపాపం చేయబోతున్నందుకు నేను శోకిస్తున్నాను. రాజ్యం మరియు సుఖాల ప్రలోభం చేత మన కులాన్నే చంపుకోవడానికి, తయారుగా ఉన్నాము''. ఇప్పుడు అర్జునుడు తనని తానొక సామాన్య జ్ఞాత అనుకోవటం లేదు. ఆరంభంలో ప్రతి సాధకుడూ ఇలాగే అంటాడు. మహాత్ముడైన బుద్ధుని కథన మేమిటంటే, ''మనుష్యుడు అసంపూర్ణ జ్ఞానాన్ని కలిగి ఉన్నప్పుడు తను ఒక మహాజ్ఞానినని అనుకొంటాడు, కానీ సగానికి పైగా జ్ఞానం ఆర్జించినప్పుడు తను ఒక మహామూర్ఖుడినని అను కొంటాడు. ''సరిగ్గా యిదే ప్రకారంగా అర్జునుడు కూడా తననొక జ్ఞానిననే అనుకొంటున్నాడు. ఆ పాపం వలన పరమ కళ్యాణం జరుగుతుందని కాదు, కేవలం రాజ్యం మరియు సుఖాల ప్రలోభంలో పడి మనం మనకులాన్నే నాశనం చేయ బోతున్నామనీ, ఘోరమైన తప్పును చేస్తున్నామనీ అతను శ్రీకృష్ణునికి బోధ పరుస్తున్నాడు. నేను మాత్రమే తప్పు చేస్తున్నానని కాదు, మీరు కూడా తప్పు చేస్తున్నారు. మాటలతో శ్రీ కృష్ణణ్ణి కూడా ఒక దెబ్బ కొట్టాడు. చివరిగా అర్జునుడు తన నిర్ణయాన్ని ఇలా తెలియజెప్పాడు.

*శ్లో ॥ యది మామ ప్రతీకారమశస్త్రం శస్త్ర పాణయః ।*
*ధార్తరాష్ట్రారణే హన్యుస్తన్మే క్షేమతరం భవేత్ ॥**46**॥*

నన్ను శస్త్ర రహితుడననుకొని, ఎదురించలేనివాడిననుకొని శస్త్రధారులైన ధృతరాష్ట్రుని పుత్రులు నన్ను యుద్ధంలో చంపితే, వారు ఆ విధంగా చంపడం కూడా నాకు పరమ కళ్యాణ కారకమవుతుంది. కనీసం చరిత్ర నన్ను తెలివైన వాడి నంటుంది, ఎందుకంటే తనను బలియిచ్చుకొని, యుద్ధాన్ని తప్పించాడంటుంది. ఏమీ తెలియని చిన్న పిల్లలు సుఖంగా వుండాలనీ, కులాన్ని రక్షించాలనీ మనుష్యులు ప్రాణాల్ని కూడా ఆహుతి చేస్తారు. మనిషి విదేశాలకు వెళ్లినా, వైభవ పూర్ణ ప్రాసాదాలతో ఉంటున్నా, రెండు రోజుల తరువాత తను వదలి వచ్చిన తన గుడిసె గుర్తుకు వస్తుంది. మోహం అంత ప్రబలమైనది. కాబట్టే అర్జునుడు అంటాడు, ''శస్త్రధారులైన ధృతరాష్ట్రుని పుత్రులు, మమ్ము ఎదిరించి నన్ను రణంలో చంపినాకూడా, అది నాకు అతి కళ్యాణకారకం అవుతుంది, ఎందుకంటే పిల్లలైనా సుఖంగా ఉంటారు కదా!'' అని.

సంజయ ఉవాచ-

*శ్లో ॥ ఏవ ముక్త్వార్జునః సంఖ్యే రథోపస్థ ఉపావిశత్ ।*
*విసృజ్య సశరం చాపం శోక సంవిగ్న మానసః॥**47**॥*

సంజయుడు అంటాడు, ''రణభూమిలో శోకంతో ఉద్విగ్నమైన మనస్సుగల అర్జునుడు ఈ ప్రకారంగా చెప్పి, బాణాల సహితంగా ధనస్సును త్యజించి, రథం యొక్క వెనుక భాగంలో కూర్చుండి పోయాడు, అంటే, క్షేత్ర-క్షేత్రజ్ఞుల సంఘర్షణలో పాల్గొనడానికి వెనుకంజ వేశాడు.

సారాంశం:

గీత, క్షేత్ర–క్షేత్రజ్ఞుల యుద్ధాన్ని నిరూపణ చేస్తుంది. ఇది ఈశ్వరీయ విభూతులతో సంపన్నమైన భగవత్స్వరూపాన్ని చూపించే గేయము. ఈ గేయం ఏ క్షేత్రంలో జరుగుతుందో, ఆ యుద్ధక్షేత్రం శరీరం. దానిలో రెండు ప్రవృత్తులు ఉన్నాయి. ''ధర్మక్షేత్రం మరియు కురుక్షేత్రం''. ఈ సేనల యొక్క స్వరూపాన్నీ వాటి బలాలకు ఆధారమైన శంఖధ్వనీ, వారి యొక్క పరాక్రమాన్ని తెలుపుతుంది. తదనంతరం ఏ సేనతో యుద్ధం చేయాలో, దాని పరీక్ష జరిగింది. మొత్తం సేన పద్దెనిమిది అక్షౌహిణీలు (రమారమి 650కోట్లు), కానీ వాస్తవానికి అది అనంతం. ప్రకృతి యొక్క దృష్టికోణాలు రెండు– ఒకటి యిష్టోన్ముఖీన ప్రవృత్తి–దైవీ సంపద, రెండవది బహిర్ముఖీన ప్రవృత్తి – ఆసురీ సంపద, రెండూ ప్రకృతికి సంబంధించినవే. ఒకటి యిష్ట దైవం వేపు ఉన్ముఖుల్ని చేస్తుంది, పరమధర్మ పరమాత్ముని వైపు తీసుకుని వెళ్తుంది. రెండవది ప్రకృతిపట్ల విశ్వాసాన్ని కలిగిస్తుంది. మొదట దైవీ సంపదని సాధించి, ఆసురీ సంపదను అంతం చేయాలి, తరువాత శాశ్వత సనాతన పరబ్రహ్మ యొక్క దిగ్దర్శనం మరియు అతనితో సమైక్యం పొందటంతోనే దైవీ సంపద యొక్క అవసరం తీరిపోతుంది, యుద్ధ పరిణామం బహిర్గతమవుతుంది.

అర్జునుడు సైన్యాన్ని పరీక్షించినప్పుడు, ఎవరినైతే చంపాలో వారంతా తన కుటుంబంగానే కనిపించింది. ఎంత వరకు సంబంధం ఉంటుందో అంత వరకే జగత్తు ఉంటుంది. అనురాగం యొక్క ప్రథమ దశలో కౌటుంబిక మోహం ఆటంకాన్ని కలిగిస్తుంది. మధుర సంబంధాలు ఎంతగా విచ్ఛిన్నమై పోతాయంటే అసలు అవి ఉండేవేకాదనిపించినప్పుడు సాధకుడు గాభరా పడిపోతాడు. స్వజనులపట్ల ఆసక్తిని నశింపచేసుకోవడం అతనికి అకళ్యాణ ప్రదంగానే కనిపిస్తుంది. అర్జునుడి వలెనే అతను కూడా వ్యవహారంలో ఉన్న మూఢ నమ్మకాలలో తన్ను సమర్పించుకునే ప్రయత్నం చేస్తాడు. అతను అంటాడు– ''కుల ధర్మమే సనాతన ధర్మం. ఈ యుద్ధం వలన సనాతన ధర్మం నాశనమై పోతుంది. కుల స్త్రీలు దూషితులైపోతారు. వర్ణ సంకరం జరుగుతుంది. ఆ కులం మరియు కుల ఘాతకులు అనంతకాలం వరకు నరకంలో ఉండిపోతారు.'' అని అర్జునుడు తనకు తెలిసినంతవరకు 'సనాతన ధర్మం' యొక్క రక్షణకై వ్యాకుల పడిపోయాడు. అతను శ్రీకృష్ణునికి ఇలా విన్నవించుకొన్నాడు, ''మనం తెలివైన వారమై ఉండీ, ఈ మహా పాపానికి ఎందుకు ఒడి గట్టాలి?'' అంటే శ్రీకృష్ణుడు కూడా పాపం చేయబోతున్నాడు. చిట్టచివరకు పాపం నుంచి తప్పించుకొనేందుకు ''నేనీ యుద్ధం చేయను'' అంటూ హతాశుడైన అర్జునుడు రథం వెనుక భాగంలో కూర్చుండి పోయాడు; క్షేత్ర–క్షేత్రజ్ఞుల సంఘర్షణ నుంచి తప్పుకున్నాడు.

వ్యాఖ్యాకారులు ఈ అధ్యాయాన్ని 'అర్జున విషాద యోగం' అన్నారు, అర్జునుడు అనురాగానికి ప్రతీక. సనాతన ధర్మంకోసం వ్యాకులపడే అనురాగవంతుడి విషాదం యోగానికి కారణమవుతుంది. ఇదే విషాదం మనువుకి కూడా అనుభవయోగ్యం అయింది, ''హృదయ బహుత్ దుఃఖ్‌లాగ్, జనం గయవు హరి భగతి బిను' (రా.చ.మా142), సంశయంలోపడే

మనుష్యుడు విషాదాన్ని అనుభవిస్తాడు. అతనికి సందేహం కలిగింది. వర్ణసంకరం మొదలవుతుంది, అది నరకానికి తీసుకెళ్ళుతుంది, సనాతన ధర్మం నాశనమయిపోతుందనే విషాదం కూడా అతనిలో ఉండింది. అంటే 'సంశయ-విషాద-యోగం' అనే సామాన్య నామకరణం ఈ అధ్యాయానికి తగినటువంటిది. అందుచేత-

ఓం తత్సదితి శ్రీమద్ భగవద్ గీతాసూపనిషత్సు
బ్రహ్మ విద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
**'సంశయ విషాద- యోగో'** నామ ప్రథమోऽధ్యాయః **|| 1||**

ఈ ప్రకారంగా శ్రీమద్భగవద్గీతా రూపమయిన ఉపనిషత్తు మరియు బ్రహ్మవిద్యా యోగశాస్త్ర విషయకమైన శ్రీకృష్ణుడు మరియు అర్జునుల సంవాదంలో 'సంశయ-విషాద యోగం' అనే పేరుగల ప్రథమ అధ్యాయం పరిపూర్ణమయింది.

ఇతి శ్రీమత్పరమహంస పరమానందస్య శిష్య స్వామీ అడగడానందకృతే శ్రీమద్‌భగవద్‌గీతాయాః **'యథార్థ గీతా'** భాష్యే **'సంశయ-విషాద-యోగో'** నామ ప్రథమోధ్యాయః**|| 1||**

ఈ ప్రకారంగా శ్రీమత్ పరమహంస పరమానందగారి యొక్క శిష్యుడు అడగడానంద గారిచే రచించబడిన శ్రీమద్ భగవత్‌గీత యొక్క భాష్యం యథార్థ గీతలో సంశయ విషాదయోగమనే పేరుగల ప్రథమాధ్యాయము పూర్ణమయింది.

||హరి ఓం తత్సత్ ||

ఓం

శ్రీ పరమాత్మనే నమః

# ద్వితీయ అధ్యాయము

ప్రథమ అధ్యాయం గీతకు ప్రవేశికవంటిది. అందులో, ప్రారంభదశలో యాత్రికుడిలో కనిపించే కష్టాలు వర్ణించబడ్డాయి. యుద్ధం చేసే వారు అందరూ కౌరవులు- పాండవులే, కానీ సంశయాలకి తావు అర్జునుడే, అనురాగమే అర్జునుడు. ఇష్టదేవునికి అనుగుణంగా రాగమే యాత్రికుణ్ణి క్షేత్ర-క్షేత్రజ్ఞుల సంఘర్షణకై ప్రేరేపిస్తుంది. అనురాగం మొదటిమెట్టు. పూజ్య గురు మహారాజులు అనే వారు, ''సద్గృహస్థు ఆశ్రమంలో ఉంటూండగా అతని హృదయంలో గ్లాని కలిగితే, ఆకారణంగా అశ్రుపాతం జరిగితే, కంఠం గద్గదమయితే, అప్పుడు అక్కణ్ణుంచే భజన ఆరంభమైందని అర్థం చేసుకోవాలి''. అనురాగదశలో యివన్నీ జరుగుతాయి. అందులో ధర్మం, నియమం, సత్సంగ భావం, ఉంటాయి.

అనురాగం యొక్క ప్రథమ చరణంలో కుటుంబం పట్ల మోహం అడ్డంకులను కలిగిస్తుంది. మొదట్లో అందరూ ఆ పరమసత్యాన్ని ప్రాప్తి చేసుకోవాలని కోరుకుంటారు. కానీ కొంత ముందుకు వెళ్ళిన తరువాతే మధురమైన సంబంధాలను త్రెంచాలని తెలుసుకొని హతాశులైపోతారు. అతను మొదటి నుంచి దేనినైతే ధర్మం- కర్తవ్యం అని అనుకొంటూ ఉండేవాడో, అందులోనే సంతోషం పొందడం మొదలుపెడతాడు. తన మోహాన్ని సమర్థించుకోవడం కోసం అతను ప్రచారంలో ఉన్న అంధ విశ్వాసాలను ప్రమాణంగా ఉటంకించుతాడు, అర్జునుడు 'కుల ధర్మమే సనాతనం' అన్నట్లు; యుద్ధం వలన సనాతన ధర్మం నాశనమైపోతుంది, కులక్షయం అవుతుంది. స్వైరాచారం వ్యాపిస్తుంది. ఇది అర్జునుడు ఇచ్చిన జవాబు కాదు, సద్గురువు సాన్నిధ్యానికి రాక పూర్వం సాధకుడు తనదంటూ ఏర్పరచుకొన్న ఒక చెడు సంప్రదాయం మాత్రమే.

ఈ చెడు పద్ధతులలో చిక్కుకొని మనుష్యులు వేరువేరు ధర్మాలను అనేకమైన సంప్రదాయాలను చిన్న-పెద్ద సమూహాలను ఏర్పరచుకొంటారు. కొందరు ముక్కు మూసుకుంటారు. కొందరు చెవులు బ్రద్ధలు కొట్టుకొంటారు. కొందరిని ముట్టుకుంటే ధర్మం మైల పడిపోతే, మరొకచోట అన్నం - నీళ్ళు కారణంగా ధర్మం అణగారిపోతుంది. ఇందులో దోషం అంటరాని వారిదా? లేక అంటుకొన్న వారిదా? ఎవరిదీ కాదు. మనకు భ్రమలు కలిగించిన వారిది. ధర్మం పేరిట మనం దుష్టమైన ఆచారాలకు బలి అయిపోయాము. కాబట్టి నిజానికి దోషం మనది.

బుద్ధ మహాత్ముడి సమయంలో కేశకంబళి అనే పేరిట ఒక సంప్రదాయం ఉండేది. కొందరు తమ కేశాలను పెంచి కంబళిగా ఉపయోగించడాన్ని గొప్పగా భావించేవారు. కొంత మంది గోవ్రతం (గోవు లాగా) కుక్కలాగా తినడం- త్రాగడం పాటించేవారు. బ్రహ్మవిద్యకు వీటితో ఏ సంబంధమూ లేదు. సంప్రదాయాలు, చెడు ఆచారాలు, మొదట్లో కూడా ఉండేవి, ఈనాడు కూడా ఉన్నాయి. సరిగ్గా ఇదే విధంగా శ్రీకృష్ణుడి కాలంలో కూడా సంప్రదాయాలు ఉండేవి, చెడు ఆచారాలు ఉండేవి. వాటిలో నుంచి ఒకటి రెండు చెడు ఆచారాలకు అర్జునుడు బలయి పోయాడు. అతను నాలుగు తర్కాల్ని ముందుంచాడు.

1. ఇటువంటి యుద్ధం వలన సనాతన ధర్మం నాశనమై పోతుంది. 2. వర్ణ సంకరం మొదలవుతుంది. 3. పిండోదక క్రియలకు లోపం ఏర్పడుతుంది. 4. మనం కులక్షయమనే మహాపాపానికి ఒడి గడుతున్నాము. ఇదివిని యోగేశ్వరుడు శ్రీ కృష్ణుడు ఇలా అంటాడు

సంజయ ఉవాచ-

*శ్లో* // తం తథా కృపయావిష్టమశ్రు పూర్ణాకులే క్షణం ।
విషీదంతమిదం వాక్యము వాచ మధుసూదనః ॥**1**॥

కరుణచే పరివ్యాప్తుడై, అశ్రుపూరిత వ్యాకుల నేత్రాలు గల ఆ అర్జునునితో 'మధుసూదనుడు' మదమును వినాశనం చేయు భగవంతుడు- ఈ ప్రకారంగా అన్నాడు.

శ్రీ భగవానువాచ-

*శ్లో* // కుతస్త్వా కశ్మలమిదం విషమే సముపస్థితం ।
అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తి కరమర్జున ॥**2**॥

'అర్జునా! ఈ విషమస్థలంలో నీకు ఈ అజ్ఞానం ఎక్కడి నుంచి వచ్చిపడింది? విషమస్థలం అంటే దేనికైతే సమానంగా సృష్టిలో ఇంకొక స్థలంలేదో, దేని లక్ష్యమైతే పారలౌకికమో, ఆ నిర్వివాద స్థలంలో నీకు అజ్ఞానం ఎక్కడి నుంచి వచ్చిపడింది ? అజ్ఞానమే ఎందుకు? అర్జునుడు సనాతన ధర్మాన్ని రక్షించడానికి నడుంబిగించాడు. సనాతన ధర్మాన్ని రక్షించడానికై ప్రాణాన్ని పణంగా పెట్టడానికి సిద్ధపడడం అజ్ఞానమా? శ్రీకృష్ణుడు అంటాడు, ''అవును, ఇది అజ్ఞానమే. గౌరవయుక్తులయిన పురుషులు ఇలా ఆచరించలేదు. ఇది స్వర్గాన్ని యిప్పించేది కాదు. ఇది కీర్తిని సంపాదించి పెట్టేదికాదు. సన్మార్గంపై దృఢంగా ఆరూఢులై ఉండే వారిని ఆర్యులంటారు. కుటుంబం కొసం మరణించడం అజ్ఞానం కాకపోతే, మహాపురుషులు తప్పకుండా దానిని ఆచరించి ఉండేవారే. నిజానికి కులధర్మమే సత్యమైనదయితే, అదే స్వర్గానికీ, కళ్యాణానికీ సాధనం అయి ఉండేది. ఇది కనీసం కీర్తిదాయకం కూడా కాదు. మీరా భజన చేయడం మొదలెట్టినప్పుడు, 'లోగ్ కహే మీరా బాయీ బావరీ, సాస్ కహే కుల నాశీరే (లోకం మీరాను పిచ్చిదంది. అత్తగారు కులనాశని అంది). ఏ కుటుంబం, కులం, కుల మర్యాదల కోసమైతే మీరా యొక్క అత్తగారు పాటు పడిందో, అలాంటి మీరా అత్తగార్ని ఎవరూ గుర్తించరు. కానీ మీరాను ప్రపంచంలో అందరూ గుర్తిస్తారు. సరిగ్గా యిదే ప్రకారంగా కుటుంబం కోసం కష్టపడే

వారి కీర్తి ఎంత కాల ముంటుంది ? దేనిలోనైతే కీర్తి లేదో, శ్రేష్ఠ పురుషులు మరచి పోయి కూడా దేనినైతే ఆచరించలేదో, అది నిజంగా అజ్ఞానమే. అందుచేత.

శ్లో ॥ *క్లైబ్యం మాస్మగమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే ।*
*క్షుద్రం హృదయ దౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప ॥**3**॥*

అర్జునా! నపుంసకతను పొందకుము. అర్జునుడు నంపుంసకుడా? మరి మీరు పురుషులా? పౌరుషహీనుడే నపుంసకుడు. అందరూ తమకు తెలిసినంత వరకూ పురుషార్థమే చేస్తారు. ఒకరైతు రాత్రింబగళ్ళు చెమట– రక్తం ఓడ్చి పొలంలో పురుషార్థమే చేస్తాడు. కొందరు వ్యాపారాన్ని పరుషార్థమనుకుంటే, ఇంకొందరు తమ పదవుల్ని దురుపయోగం చేయడమే పురుషార్థమనుకొంటారు. జీవన పర్యంతం పురుషార్థం చేసిన పిదప కూడా ఉత్తి చేతులతోనే వెళ్ళి పోవలసి వస్తుంది. కాబట్టి యిది పురుషార్థం కాదని స్పష్టమై పోతోంది. అత్మ దర్శనమే శుద్ధ పురుషార్థం. గార్గి యాజ్ఞవల్క్యుడితో ఇలా అంటుంది–

శ్లో ॥ *''నపుంసక పుమాన్ జ్ఞేయో యోన వేత్తి హృదిస్థితం ।*
*పురుషం స్వప్రకాశం తస్మానందాత్మానమవ్యయం ॥''*

ఎవరైతే హృదయస్థమైన ఆత్మను గుర్తించలేరో, వారు పురుషులై కూడా నపుంసకులే. ఆ ఆత్మయేపురుష స్వరూపం, స్వయం ప్రకాశం, ఉత్తమ ఆనందయుక్తం, మరియు అవ్యక్తం. దానిని పొందు ప్రయత్నమే పౌరుషం. అర్జునా ! నీవు నపుంసకత్వమును పొందకుము. ఇది నీకు యోగ్యమైనది కాదు. హే పరంతపా! హృదయం యొక్క ఈ క్షుద్ర దుర్బలత్వాన్ని త్యజించి, యుద్ధానికై సంసిద్ధుడవు కమ్ము. ఆసక్తిని త్యజించు. ఇది హృదయం యొక్క దౌర్బల్యం మాత్రమే. దీని తరువాత అర్జునుడు మూడవ ప్రశ్నను ముందుంచాడు.

అర్జున ఉవాచ

శ్లో ॥ *కథం భీష్మ మహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన ।*
*ఇషుభిః ప్రతి యోత్స్యామి పూజార్హావరి సూధన ॥**4**॥*

అహంకారాన్ని నశింపచేయు మధుసూధనా! నేను రణ భూమిలో పితామహుడు భీష్ముడు మరియు అచార్యుడు ద్రోణుడు– వీర్లపై ఏ ప్రకారంగా బాణాలను ప్రయోగించ గలను? ఎందుకంటే హే అరి సూదనా! వారిద్దరూ పూజనీయులే కదా.

ద్వైతమే ద్రోణుడు. ప్రభువు వేరు, మనం వేరు – ద్వైతంలోని ఈ భ్రాంతియే ప్రాప్తికి మూలం. ప్రారంభిక నిచ్చే ద్రోణాచార్యుని గురుత్వం. భ్రమయే భీష్ముడు. భ్రమ ఉన్నంత వరకూ పిల్లలు, కుటుంబం బంధువులు అందరూ మనవారేననిపిస్తుంది. మనదనిపించడానికి భ్రమయే కారణం. ఆత్మ వీరినే పూజ్యులనుకొని ఇతను తండ్రి, అతను తాత, అల్లతను కులగురువు అని భావించి వారితో కలసి ఉండడం జరుగుతుంది. సాధన ముగిసే కాలంలో 'గురు న చేలా, పురుష్ ఆకేలా' (గురువూ లేడు శిష్యుడు లేడు, పురుషుడు ఒంటరి వాడు అనిపిస్తుంది.

*శ్లో ॥ న బంధుర్న మిత్రం గురుర్నైవ శిష్యః ।*
*చిదానందరూపః శివో హం శివోహమ్ ॥*

ఎప్పుడైతే చిత్తం ఆ పరమానందంలో లయమైపోతుందో, అప్పుడు గురువు జ్ఞానదాతగానూ, శిష్యుడు గ్రహీతగానూ ఉండరు. ఇదే పరమస్థితి. గురువు యొక్క గురుత్వాన్ని ప్రాప్తం చేసుకొన్న పిదప గురుత్వంలో లీనమవడం జరిగిపోతుంది. అర్జునా! ''నీవునాలో నివసిస్తావు'' అని శ్రీకృష్ణుడు అన్నాడు. శ్రీ కృష్ణుడెలాంటివాడో అర్జునుడు అలాంటివాడే. సరిగ్గా అలాగే ప్రాప్తిని పొందిన తరువాత సాధకుడూ మహాపురుషుడు అయిపోతాడు. అటువంటి అవస్థలో గురువుకూడా లయమైపోతాడు. గురుత్వం హృదయంలో ప్రవహించుతుంది. అర్జునుడు గురు పదవిని రక్షగా మార్చుకొని, ఈ సంఘర్షణలో ప్రవృత్తమవడం నుంచి తప్పించు కోవాలనుకొంటున్నాడు. అతను అంటాడు–

*శ్లో ॥ గురూనహత్వా హి మహానుభావాన్*
*శ్రేయో భోక్తుం భైక్ష్యమపీహలోకే।*
*హత్వార్థ కామాంస్తు గురూనిహైవ*
*భుంజీయ భోగాన్ రుధిర ప్రదిగ్ధాన్ ॥**5**॥*

ఈ మహానుభావులైన గురుజనులను చంపడం కన్నా, ఈ లోకంలో భిక్ష మెత్తుకొని తినడమే శ్రేయస్కరమని నేననుకొంటున్నాను. ఇక్కడ భిక్షం అంటే ఉదరపోషణకై ముష్టి అడుక్కోవడం కాదు. కానీ సత్పురుషుల వద్ద చిన్న చిన్న సేవలు చేయడం ద్వారా వారి నుండి కళ్యాణాన్ని (మేలును) యాంచించడమే భైక్ష్యం. 'అన్నం బ్రహ్మేతి వ్యజానాత్'. (తైత్తిరీయ 3/21) ఏక మాత్రుడైన పరమాత్ముడే అన్నం. దాన్ని ప్రాప్తింప చేసుకొని, ఆత్మనిత్య తృప్తి పొందుతుంది. ఇంకా అతృప్తి అనేదే ఉండదు. మనం మహాపురుషుల సేవచేసి యాచన ద్వారా మెల్లమెల్లగా బ్రహ్మ పీయూషాన్ని పొందవచ్చు, కానీ కౌటుంబిక స్నేహ– సంబంధాలు తెగకుండా మెల్లమెల్లగా ముక్తి లభించాలని అర్జునుడు కోరుకొంటాడు. ప్రపంచంలో చాలా మంది ఇలాగే చేస్తారు. కానీ పయనించే పథికులకు, అనగా ఎవరి సంస్కారమైతే సమర్థవంతంగా ఉందో, అటువంటి వారికి ఈ భిక్షాన్నం సరైన విధానం కాదు. స్వయంగా చేయకుండా యాచించడమే భిక్షాన్నం. గౌతమ బుద్ధడు కూడా ''మజ్జిమనికాయ'' ధమ్మదయాద సుత్త (1/1/3)లో ఈ భిక్షాన్నాన్ని అమిష– దాయాదమంటూ (మాంసం వంటిదంటూ) హేయంగా భావించాడు. కానీ నిజానికి శరీర యాపనకై వారందరూ భిక్షువులైన వారే (బిచ్చ మెత్తిన వారే).

ఈ గురుజనులను చంపితే ఏం దొరుకుతుంది? ఈ లోకంలో రుధిరంతో తడసిన ధనమూ, కామభోగాలే అనుభవించడానికి దొరుకుతాయి. భజన వలన భౌతిక సుఖాలలో అభివృద్ధి కలుగుతుందని అర్జునుడు భావించి ఉంటాడు. ఇంత సంఘర్షణ అనుభవించిన పిదప కూడా శరీర పోషణ కోసం ధనం, కామ భోగాలే కదా దొరికేవి. అతను మళ్ళీ ఇలా తర్కం చేస్తాడు–

శ్లో ॥ న చైత ద్విద్మః కతరన్నో గరీయో
యద్వా జయేమ యది వా నో జయేయుః।
యానేవ హత్వా న జిజీవిషామ
స్తేऽవ స్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః ॥6॥

ఈ సుఖాలు కూడా దొరుకుతాయన్నది నిశ్చయంగా చెప్పలేము. మనకు ఏది శ్రేయస్కరమన్నది కూడా మనకు తెలియదు, ఎందుకంటే నేనింత వరకు చెప్పినదంతా అజ్ఞానమేనని నిరూపించబడింది. మేము గెలుస్తామో లేక వారే గెలుస్తారో అన్నది చెప్పలేము. ఎవరిని చంపి మేము జీవించ దలచలేదో, ఆ ధృతరాష్ట్రుని పుత్రులే మా ఎదురుగా నిలబడి ఉన్నారు. అజ్ఞాన రూపుడయిన ధృతరాష్ట్రునిచే ఉత్పన్నమైన మోహాదులు నశించి పోతే, అప్పుడు మేము జీవించి మాత్రం ఏం చేస్తాము? అర్జునుడు మరల ఆలోచించి ఇలా అన్నాడు, ''నేనన్నదంతా, బహుశా అజ్ఞానమేమో!'' అందుచేత అతను ఇలా ప్రార్థించాడు.–

శ్లో ॥ కార్పణ్య దోషోపహతస్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మ సంమూఢ చేతాః।
యచ్ఛ్రేయః స్యాన్నిశ్చితం బ్రూహితన్మే
శిష్యస్తేऽహం శాధి మాంత్వాం ప్రపన్నమ్ ॥7॥

భయమనే దోషంచే నష్టమైన స్వభావం గల నేను, ధర్మమనే విషయంలో ఎల్లప్పుడూ మోహితమైన చిత్తం గల నేను, మిమ్మల్ని అడుగుతున్నాను, ఏదైతే నిశ్చితంగా పరమ కళ్యాణకారకమో, ఆ సాధనను నాకు తెలియ చెప్పండి. నేను మీ శిష్యుణ్ణి. మీ శరణు పొందుతున్న నన్ను శాసించండి (ఆజ్ఞాపించండి) కేవలం శిక్షా దీక్ష ఇవ్వడమే కాదు, ఎక్కడైనా తడబడితే అక్కడనన్ను సంబాళించండి. బలాన్నివ్వండి, భారం వహించండి, మరియు భారం వహించి నాకు తోడుగా నడవండి– ఎక్కడైనా క్రింద పడిపోతే, అప్పుడు మళ్ళీ ఎవరు ఎత్తుతారు? ఇటువంటి సమర్పణ భావం అర్జునుడిది.

ఇక్కడ అర్జునుడు పరిపూర్ణంగా తన్నుతాను సమర్పణ చేసుకొన్నాడు. ఇప్పటి వరకూ అతను శ్రీకృష్ణుణ్ణి తన స్థాయి వాడనే అనుకొంటూవచ్చాడు. అనేక విద్యలలో తను కొంచెం ఎక్కువ అనే భావించు కొన్నాడు. ఇక్కడ అతను తన కళ్ళాన్ని శ్రీకృష్ణుడి చేతుల్లో నిజంగానే పెట్టేశాడు. సద్గురువు సాధన పూర్తి అయ్యేవరకూ సాధకుని హృదయంలో వుంటూ సాధకునితో కూడి నడుస్తాడు. అతను తోడు ఉండకపోతే, అప్పుడు సాధకుడు అడుగుముందుకు వేయలేడు. ఒక యువతి కుటుంబంవారు ఏ ప్రకారంగా వివాహం అయ్యే వరకూ ఆమేకు నీతులు నేర్పిస్తూ సంభాళించుకుంటారో, సరిగ్గా అదే ప్రకారంగా సద్గురువు తన శిష్యుడి అంతరాత్మకు రథికుడై అతణ్ణి ప్రకృతి లోయలలో నుంచి వెలికి తీసుకొనివచ్చి, దాటేయిస్తాడు. అర్జునుడు ఇలా నివేదించుకొంటాడు, ''భగవంతుడా! మరొక మాటుంది.–

శ్లో ॥ నహి ప్రపశ్యామి మమాపనుద్యాద్
యచ్ఛోకముచ్ఛోషణమింద్రియాణాం।
అవాప్య భూమావసపత్న మృద్ధం
రాజ్యం సురాణామపి చాధిపత్యం ॥8॥

భూమిపై నిష్కంటకమైన ధన–ధాన్య సంపన్నమైన రాజ్యాన్నీ, దేవతలకు రాజైన ఇంద్రుని పదవిని పొందినా కూడా, నా ఇంద్రియాలని ఎండ గొడుతున్న ఈ శోకాన్ని దూరం చేయగల ఆమార్గం నాకు కనిపించడం లేదు. శోకం ఇలాగే ఉండేటట్లయితే, ఇవన్నీ తీసుకొని నేనేం చేసుకోవాలి? ఇదే (శోకమే) లభించేట్లయితే, నన్ను క్షమించండి. ఇంతకు మించి ఎక్కువ ఏం చెప్పాలి? అని అర్జునుడు అనుకొన్నాడు.

సంజయ ఉవాచ–

శ్లో ॥ *ఏవ ముక్త్వా హృషీకేశం గుడాకేశః పరంతప।*
*న యోత్స్య యితి గోవింద ముక్త్వా తూష్ణీం బభూవ హ ॥9॥*

సంజయుడు అన్నాడు– '' హేరాజా! మోహనిశాజయుడయిన అర్జునుడు, హృదయం యొక్క సర్వజ్ఞుడయిన శ్రీకృష్ణునితో 'గోవిందా! నేను యుద్ధం చేయను, అని ఊరుకుండి పోయాడు. ఇప్పటి వరకు అర్జునుడి దృష్టి పౌరాణికమైనది. ఇందులో పరాపర కర్మకాండలతో బాటుగా, భోగాల ఉపలబ్ధికై కూడా విధానం చెప్పబడి ఉంది, అందులో స్వర్గమే అన్నింటి కన్న మిన్న అని చెప్పబడింది. ఈ అభిప్రాయం కూడా తప్పంటూ, శ్రీకృష్ణుడు దీన్ని వివరించాడు.

శ్లో ॥ *తమువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత।*
*సేనయోరు భయోర్మధ్యే విషీదంత మిదం వచః॥ 10॥*

దీని తరువాత హే భరత వంశానికి చెందిన ధృతరాష్ట్రా! అంతర్యామి అయిన యోగేశ్వరుడు శ్రీకృష్ణుడు రెండు సేనల మధ్యలో, నిలబడి శోక యుక్తుడైన ఆ అర్జునుడితో నవ్వుతూ ఇలాగ అన్నాడు–

శ్రీభగవానువాచ–

శ్లో ॥ *అశోచ్యానన్వశోచస్త్వం ప్రజ్ఞా వాదాంశ్చ భాషసే।*
*గతాసూనగతాసూంశ్చ నానుశోచంతి పండితాః ॥ 11॥*

అర్జునా! నీవు శోకించడానికి యోగ్యం కాని దానికై శోకిస్తున్నావు, మరియు పండితుని వలె మాట్లాడుతున్నావు, కానీ బుద్ధితో సంపన్నులైన పండిత జనులు ప్రాణం పోయిన వారి కోసం గానీ, ప్రాణం పోని వారి గురించిగానీ శోకించరు. ఎందుకంటే వారు కూడా మరణిస్తారు. నీవు పండితులలాగా మాట్లాడుతున్నావు, కానీ వాస్తవానికి నీవు జ్ఞాతవుకావు, ఎందుకంటే –

శ్లో ॥ న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధి పాః।
న చైవ న భవిష్యామః సర్వే వయమతః పరం ॥ **12**॥

నేను సద్గురువును. ఏ కాలంలో నేను లేనని కాదు. లేక నువ్వు అనురాగవంతుడయిన పాత్రానివి లేక 'జనాధిపాః'- రాజులు అంటే రాజసవృత్తిలో ఉండే అహంకారం'', లేనివారని కాదు. అలాగని ముందు ముందు మనం అందరం ఉండమని కాదు. సద్గురువు ఎల్లప్పుడూ ఉంటాడు, అనురాగవంతుడూ ఎల్లప్పుడూ ఉంటాడు. ఇక్కడ యోగేశ్వరుడు యోగం యొక్క అనాదిత్వాన్ని వివరిస్తూ భవిష్యత్తులో కూడా దాని ఉనికిని సమర్థించాడు. మరణించిన వారిని గురించి శోకించకూడదనడానికి కారణం చూపిస్తూ అతనంటాడు-

శ్లో ॥ దేహినో ऽ స్మిన్యథా దేహే కౌమారం యౌవనం జరా ।
తథా దేహాంతర ప్రాప్తి ర్ధీరస్తత్ర న ముహ్యతి ॥ **13**॥

ఎలాగైతే జీవాత్మకు ఈ దేహంలో కౌమార, యౌవ్వన, వృద్ధావస్థలు వస్తాయో, అలాగే ఇతర శరీర ప్రాప్తి కూడా కలుగుతుంది. కాబట్టి ధీర పురుషులు మోహితులు కారు. ఒకప్పుడు మీరు బాలకులుగా ఉండినారు, మెల్ల మెల్లగా యువకులైనారు. అప్పుడు మీరు చనిపోలేదు గదా? ఆ తరువాత వృద్ధులయ్యారు; పురుషుడు ఒకడే, అదే ప్రకారంగా లేశ మాత్రం కూడా క్రొత్త దేహం ప్రాప్తించడంలో కూడా ఏ తేడా ఉండదు. కళేబరం యొక్క ఈ పరివర్తన, ఈ పరివర్తనల కన్న అతీతమైన వస్తువు దొరకేంతవరకూ జరుగుతూనే ఉంటుంది.

శ్లో ॥ మాత్రా స్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణసుఖ- దుఃఖదాః।
ఆగమాऽపాయినోऽనిత్యాస్తాం స్తితిక్షస్వ భారత ॥ **14**॥

హే కుంతీ పుత్రా! సుఖ-దుఃఖాలు, చలి, వేడిని కలిగించే యింద్రియాలతో, విషయాలతో సంయోగం అనిత్యం, క్షణ భంగురం. అందుచేత భరత వంశీయుడవైన అర్జునా! నువ్వు వీటిని త్యజించుము. అర్జునుడు ఇంద్రియాల విషయాల సంయోగజన్యమైన సుఖాన్ని స్మరించే వికలుడైనాడు. కుల ధర్మం, కులగురువుల పూజ మొదలగునవి యింద్రియాల మమకారం క్రిందికే వస్తాయి. ఇవి క్షణికం, అబద్ధం మరియు నాశనమై పోయేవి. విషయాలతో సంయోగం నిత్యమూ లభించదు.

ఎల్లప్పటికీ యింద్రియాలలో ఆ సామర్థ్యమూ ఉండదు. అందుచేత అర్జునా! నువ్వు వీటిని విడిచిపెట్టుము, సహించుము. ఎందుకని? ఈ యుద్ధం హిమాలయాలల్లో జరుగుతోందని అర్జునుడు చలిని సహించాలా? లేక ఇది ఎడారులలో జరుగుతోందని అర్జునుడు వేడిని సహించాలా? ఇతరులు చెప్పేది చూస్తే కురుక్షేత్రం సమశీతోష్ణస్థితి గల స్థలం. మొత్తం అంతా కలసి పద్దెనిమిది రోజులే కదా యుద్ధం జరిగింది! అంతలోనే వేసవి-చలి కాలాలు వచ్చి వెళ్ళిపోయాయా? వాస్తవానికి చలి-వేడి, దుఃఖం-సుఖం, మానం-అవమానం యివన్నీ సహించడం ఒక యోగి మనః స్థితిపై ఆధారపడి ఉంటుంది. ఇది హృదయ దేశంలోని యుద్ధ

చిత్రణ, ఆ బయటి యుద్ధాలను గురించి గీత చెప్పలేదు. ఇది క్షేత్ర-క్షేత్రజ్ఞుల సంఘర్షణ, ఇందులో ఆసురీ సంపదల్ని నశింపజేసి, ఆ పరమాత్మునిలో స్థితిని కలిగించిన తరువాత దైవీ సంపదలు కూడా శాంతమయిపోతాయి. ఎప్పుడైతే వికారాలే లేవో, అప్పుడు సజాతీయ ప్రవృత్తులు వేటిపై దాడి చేయాలి ? అందుచేత పూర్ణత్వం లభించగానే అవికూడా శాంతమై పోతాయి. గీత అంతర్దేశంలోని యుద్ధాన్ని చిత్రిస్తుంది. ఈ త్యాగం వలన ఏం దొరుకుతుంది? దీని వలన లాభమేమిటి? దీన్ని గురించి శ్రీకృష్ణుడు అంటాడు-

*శ్లో ॥ యం హి న వ్యథయంత్యేతే పురుషం పురుషర్షభ।*
*సమ దుఃఖ సుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే ॥ **15**॥*

ఎందుకంటే హే పురుషశ్రేష్ఠుడా! దుఃఖ-సుఖాల్ని ఎవరైతే సమానంగా అర్థం చేసుకోగలడో, ఆ ధీర పురుషుణ్ణి ఇంద్రియాల విషయాల సంయోగాలు వ్యథలపాలు చేయలేవు. అతడు మృత్యువుకంటే అతీతమైన అమృతత్వాన్ని పొందడానికి యోగ్యుడవుతాడు. యుద్ధ పరిణామంగా స్వర్గం దొరుకుతుందనీ లేక పృథ్వి దొరుకుతుందనీ అర్జునుడు అనుకొన్నాడు. స్వర్గం లేక పృథ్వీ దొరకవు, కానీ అమృతం దొరుకుతుందని శ్రీకృష్ణుడు చెప్పాడు. అమృతం అంటే ఏమిటి?

*శ్లో ॥ నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః।*
*ఉభయోరపి దృష్టోఽన్తస్త్వనయోస్తత్త్వదర్శిభిః॥ **16**॥*

అర్జునా! అసత్య వస్తువుకు అస్తిత్వం లేదు, అది లేనేలేదు, దాన్ని ఉంచుకొనుట కష్టతరం. సత్యానికి మూడు కాలాల్లోనూ అభావం లేదు. దాన్ని నశింపచేయడం కష్టతరం. అర్జునుడు అడిగాడు, ''మీరు భగవంతుడైనందు వలన ఇలా అంటున్నారా?'' శ్రీ కృష్ణుడు తత్త్వ దర్శకులు దర్శించిన సత్యాన్నే వక్కాణించాడు. శ్రీకృష్ణుడు కూడా ఒక తత్త్వదర్శి, మహా పురుషుడు. ఎవరైతే పరమతత్త్వమైన పరమాత్ముడి ప్రత్యక్ష దర్శనం చేసుకొని, అతనిలో లీనమై పోతారో, అతణ్ణి తత్త్వదర్శకుడు అని అంటారు. సత్యం అసత్యం అంటే ఏమిటి ? దీనిని గురించి ఇలా అంటాడు.-

*శ్లో ॥ అవినాశి తు తద్విద్ధి యేన సర్వమిదం తతం।*
*వినాశమవ్యయస్యాస్య న కశ్చిత్కర్తుమర్హతి ॥ **17**॥*

ఈ సంపూర్ణ జగత్తులో వ్యాపించి ఉన్నదే నాశరహితత్త్వం. ఈ 'అవ్యయస్య'- అవినాశిని వినాశం చేయగల సామర్థ్యం ఎవరికీ లేదు, కానీ ఈ 'అవినాశి' కి 'అమృతానికి గల పేరేమిటి? అది ఎవరు?

*శ్లో ॥ అంతవంత ఇమే దేహా నిత్య స్యోక్తాః శరీరిణః।*
*అనాశినోఽప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత ॥ **18**॥*

అవినాశి, అప్రమేయం, నిత్య స్వరూపమైన ఆత్మయొక్క ఈ శరీరాలన్నీ నశించి పోయేవే. కాబట్టే భరతవంశీయుడైన అర్జునా! నువ్వు యుద్ధం చేయి. ఆత్మయే అమృతం.

ఆత్మయే అవినాశి. మూడు కాలాల్లోనూ నాశనం లేని ఆత్మయే సత్యం. శరీరం నశించునది. ఇదే అసత్తు. దీనికి మూడు కాలాల్లోనూ అస్తిత్వం లేదు.

'శరీరం నశించునది, కాబట్టి నువ్వు యుద్ధం చేయి'– ఈ ఆదేశంతో అర్జునుడు కేవలం కౌరవులనే చంపాలన్నది స్పష్టం కాదు. పాండవ పక్షంలో కూడా శరీరాలే నిలబడ్డాయి, పాండవుల శరీరాలు నాశముకానివా? శరీరం నశించునదైతే, అప్పుడు శ్రీకృష్ణుడు ఎవరిని రక్షిస్తూ నిలబడ్డాడు? అర్జునుడు శరీరధారియా? ఏ శరీరమైతే అసత్యమో, దేనికైతే అస్తిత్వం లేదో, దేన్నైతే ఆపలేమో, శ్రీకృష్ణుడు అలాంటి శరీరాన్ని రక్షించడానికి నిలబడ్డాడా? అదే నిజమైతే, అతను కూడా అవివేకియే, మూఢుడే. ఎందుకంటే ఆతరువాత శ్రీకృష్ణుడు స్వయంగా ఇలా అంటాడు, కేవలం శరీరం కోసమే శ్రమించువారు (3/13)అవివేకులు మరియు మూఢ బుద్ధిగలవారు. ఆ పాపాత్ముడైన పురుషుడు వ్యర్థంగా జీవిస్తాడు. అయితే చివరకు అర్జునుడు ఎవరు?

వాస్తవానికి అనురాగమే అర్జునుడు. అనురాగవంతుడి కోసం ఇష్టదైవం ఎల్లప్పుడూ రథిగా, తోడుగా ఉంటాడు. ఒక సఖునిలాగా మార్గం చూపిస్తాడు. మీరు శరీరం కాదు. శరీరం ఒక ఆవరణ మాత్రమే. ఉండేటందుకు ఒక ఇల్లు లాంటిది మాత్రమే. అందులో ఉండేది అనురాగపూరితమైన ఆత్మయే. భౌతిక యుద్ధంలో లాగా నరికితే, శరీరాలు అంతంకావు. ఆత్మ ఈ శరీరాన్ని వదలిపెట్టిపోతుంది, అప్పుడు అది ఇంకో శరీరాన్ని ధరిస్తుంది. ఎలాగైతే బాల్య కాలం తరువాత యువావస్థ లేక వృద్ధావస్థ వస్తాయో. అలాగే దేహాంతరాలు ప్రాప్తిస్తాయని, ఈ సందర్భంలో శ్రీకృష్ణుడు చెప్పాడు. శరీరాన్ని నరికేస్తే, ఈ జీవాత్మ క్రొత్త వస్త్రాలను (క్రొత్త శరీరాలను)ధరిస్తుంది.

శరీరం సంస్కారాలపై ఆశ్రితమయినది మరియు సంస్కారాలు మనస్సుపై ఆధారపడి ఉంటాయి. ''మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః'' ! మనస్సును నిరోధించడం, అచంచలంగా– స్థిరంగా ఉంచడం అంతిమ సంస్కారం విలయమవడం, ఇవన్నీ ఒకే క్రియ. సంస్కారాల సంబంధం తెగిపోవడమే శరీరాలు అంతమవడం. దీనికై మీరు ఆరాధన చేయవలసి ఉంటుంది. శ్రీ కృష్ణుడు దీనికే 'కర్మ' లేక ''నిష్కామ కర్మ యోగమని'' పేరు పెట్టాడు. శ్రీకృష్ణుడు చాలా చోట్ల అర్జునుణ్ణి యుద్ధం చేయమని ప్రేరేపించాడు, కానీ ఒక్క శ్లోకం కూడా బాహ్య యుద్ధాన్ని లేదా చంపడాన్ని, నరకడాన్ని సమర్థించదు. ఈ యుద్ధం సజాతీయ– విజాతీయ ప్రవృత్తులకి హృదయంలో జరిగేది.

*శ్లో ॥ య ఏనం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతం ।*
*ఉభౌ తౌన విజానీతో నాయం హంతి న హన్యతే ॥* ***19***॥

ఎవరైతే అత్మ చనిపోతుందని అనుకొంటారో, ఎవరు ఈ ఆత్మని నేను చంపానని అనుకొంటారో, వారిద్దరూ కూడా ఆత్మ స్వరూపాన్ని తెలుసుకోలేదు. ఎందుకంటే ఈ ఆత్మ చావదు, చంపబడదు. మళ్ళీ దీనిని గురించి ఇలా వివరిస్తాడు.

శ్లో ॥ న జాయతే మ్రియతే వా కదాచి
న్నాయం భూత్వా భవితా వా న భూయః।
అజో నిత్యః శాశ్వతోऽయం పురాణో
న హన్యతే హన్య మానే శరీరే ॥20॥

ఈ ఆత్మ ఏ కాలంలోనూ కూడా జన్మించదు; మరియు మరణించదు. ఎందుకంటే యిది వస్త్రాలను మాత్రమే మార్చుతుంటుంది. ఇది ఆత్మ కాకుండా యింకేమీకాలేదు. ఎందుకంటే యిది అజన్మం, నిత్యం, శాశ్వతం మరియు పురాతనం. శరీరం నాశనమైనప్పుడు కూడా ఇది నాశనం కాదు. ఆత్మయే సత్యం, ఆత్మయే పురాతనం, ఆత్మయే శాశ్వతం మరియు ఆత్మయే సనాతనం. మీరు ఎవరు? సనాతన ధర్మం యొక్క అనుయాయులు. సనాతనం ఎవరు? ఆత్మ, మరియు మీరు ఆత్మయొక్క అనుయాయులు. ఆత్మ, పరమాత్మ, మరియు బ్రహ్మ యివి ఒక దాని కొకటి పర్యాయపదాలు. మీరు ఎవరు? శాశ్వత ధర్మం యొక్క ఉపాసకులు. శాశ్వతం ఎవరు? ఆత్మ-అంటే మనమందరం ఆత్మ యొక్క ఉపాసకులం. మీరే గనుక ఆత్మ పథాన్ని తెలుసుకోకపోతే, మీ వద్ద శాశ్వతం-సనాతనం అనే పేరుగల ఏ వస్తువూలేదు. దానికోసం మీరు యత్నిస్తే మీరు అభ్యర్థులు మాత్రమే, కానీ సనాతన ధర్మానుయాయలు కాలేరు; సనాతన ధర్మం పేరు మీద ఏదో ఒక చెడు ఆచారానికి మీరు బలి అయిపోయారన్నమాట.

దేశా-విదేశాలలోని మానవ మాత్రులందరి ఆత్మ ఒక్కలాగే ఉంటుంది. కాబట్టి ప్రపంచంలో ఎక్కడైనా 'ఏదైనా ఆత్మ స్థితిని ప్రసాదించే క్రియ ఎవరికైనా తెలిసినా, ఆమార్గంలో నడవడానికి ప్రయత్నశీలుడైతే, అతను తప్పకుండా సనాతన ధర్మపరుడే, అతను క్రిస్టియను, మహమ్మదీయుడు, యవనుడు మరెవరైనా కావచ్చుగాక.

*శ్లో ॥ వేదావినాశినం నిత్యం య యేనమజమవ్యయం।*
*కథం స పురుషః పార్థ కం ఘాతయతి హంతి కమ్ ॥**21**॥*

పార్థివ శరీరాన్ని రథంగా మార్చి బ్రహ్మరూపమైన లక్ష్యం పై గురి పెట్టిన పృథాపుత్రుడవైన అర్జునా! ఎవడైతే ఈ ఆత్మను నాశనరహితమనీ, నిత్యమనీ, అజన్మయనీ అవ్యక్తమనీ తెలుసుకుంటాడో, అతడు ఎవరినైనా ఎందుకు చంపించుతాడు? ఎవరినైనా ఎందుకు చంపుతాడు? అవినాశానికి వినాశనం అసంభవం. అజన్మా, జన్మ నెత్తదు. అందుచేత శరీరం కోసం శోకించకూడదు. దీనినే ఒక ఉదాహరణ ఇస్తూ స్పష్టం చేస్తాడు.

శ్లో ॥ వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోపరాణి ।
తథా శరీరాణి విహాయ జీర్ణాన్య
న్యాని సంయాతి నవాని దేహీ ॥22॥

ఎలాగైతే మనుష్యుడు 'జీర్ణాని వాసాంసి' జీర్ణమైన చిరిగి పోయిన వస్త్రాలను త్యజించి, క్రొత్త వస్త్రాలను ధరిస్తాడో, సరిగ్గా అదే విధంగా జీవాత్మ పాత శరీరాన్ని త్యజించి, మరొక

క్రొత్త శరీరాన్ని ధరిస్తుంది. జీర్ణమైనప్పుడే క్రొత్త శరీరాన్ని ధరించేటప్పుడు, శిశువులు ఎందుకు మరణిస్తారు? ఆ వస్త్రం యింకా వికసించాలి గదా! వాస్తవానికి ఈ శరీరం సంస్కారాలపై ఆధారపడిఉంది. ఎప్పుడైతే సంస్కారం జీర్ణమై పోతుందో, అప్పుడు శరీరం వదలి వెళ్ళి పోతుంది. సంస్కారం రెండే రోజుల కొరకైతే రెండవ రోజే శరీరం జీర్ణమై పోతుంది. దీని తర్వాత మనుష్యుడు ఒక్క శ్వాస కాలం కూడా అధికంగా జీవించలేడు. సంస్కారమే శరీరం. ఆత్మ సంస్కారాలకు అనుగుణంగా క్రొత్త శరీరాలను ధరిస్తుంది– 'అథ ఖలు క్రతుమయః పురుషః, యథా ఇహైవ, తథైవ ప్రేత్య భవతి కృతం లోకం పురుషోభిజాయతే!' (ఛాందోగ్యోపనిషత్తు –3/14) అంటే ఈ పురుషుడు నిశ్చయంగా సంకల్పమయుడు. ఈ లోకంలో పురుషుడు ఎలాంటి నిశ్చయబుద్ధి గలవాడై ఉంటాడో, తదనుగుణంగానే మరణించిన పిదప రూపుపొందుతాడు. తన సంకల్పాలతో రూపొందించుకొన్న శరీరాలలో పురుషుడు ఉత్పన్నమవుతాడు. ఈ ప్రకారంగా మృత్యువు అంటే, శరీరం మార్పిడి మాత్రమే. ఆత్మ మరణించదు. మళ్ళీ ఆత్మయొక్క అజరత్వ– అమరత్వాలను గట్టిగా సమర్థిస్తాడు.

*శ్లో ॥ నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః।*
*న చైనం క్లేదయంత్యా పో న శోషయతి మారుతః॥**23**॥*

అర్జునా! ఈ ఆత్మను ఆయుధాలు ఛేదించ లేవు. అగ్ని దీనిని కాల్చలేదు. నీళ్ళు దీనిని తడపలేవు, వాయువు దీనిని ఎండింప లేదు.

*శ్లో ॥ అచ్ఛే ధ్యోఽయమదాహ్యోఽయమ క్లేధ్యోఽశోష్యేవచ।*
*నిత్యః సర్వగతః స్థాణురచలోఽయం సనాతనః ॥**24**॥*

ఈ ఆత్మ అచ్ఛేద్యం– దీనిని చీల్చుటకు శక్యం కాదు. ఇది అదాహ్యం. దహించరానిది. ఇది అక్లేధ్యం. ఇది తడప శక్యం కానిది. ఆకాశం దీనిని తనలో సమాహితం చేసుకోలేదు. ఈ ఆత్మనిస్సందేహంగా అశోష్యం, సర్వవ్యాపకం, అచలం, స్థిరంగా ఉండేది. మరియు సనాతనమయినది.

అర్జునుడు కులధర్మం సనాతనమైనదన్నాడు. ఈ లాంటి యుద్ధం సనాతన ధర్మాన్ని నష్టం చేస్తుంది. అని అన్నాడు. కానీ శ్రీకృష్ణుడు దీనిని అజ్ఞానమనీ, ఆత్మయే సనాతనమని అన్నాడు. మీరు ఎవరు? సనాతన ధర్మం యొక్క అనుయాయులు. సనాతనం ఎవరు? ఆత్మ. మీరు ఆత్మ పర్యంతం దూరాన్ని ప్రయాణించగలిగే విధి విశేషాన్ని అవగతం చేసుకోలేక పోతే, మీకు సనాతన ధర్మాన్ని గురించి తెలియదు. దీని చెడు పరిణామాన్ని సంప్రదాయకత్వంలో చిక్కుకున్న ధర్మ భీరువులు అనుభవించ వలసి వస్తుంది. మధ్య యుగంలో భారతదేశంలోకి బయటి నుంచి వచ్చిన ముస్లిముల సంఖ్య పన్నెండు వేల నుంచి పెరిగి లక్షల్లోకి రావచ్చు. ఎక్కువలో ఎక్కువగా రమారమి ఒకకోటి కావచ్చు, ఇంకెంతో అవవచ్చు? వారు ఇరవై ఎనిమిది కోట్లు కూడా దాటి పోతున్నారు. అందరూ హిందువులే, మీ సొంత అన్నదమ్ములే, కానీ ముట్టుకోవడం వలన, తినడం వలన నాశనమయి పోయారు. వారు నాశనం కాలేదు కానీ వారి సనాతనమైన, అపరివర్తన శీలమైన ధర్మం భ్రష్టమయి పోయింది.

పదార్థ క్షేత్రంలో పుట్టే ఏ వస్తువూ కూడా ఈ సనాతనాన్ని స్పృశించ లేనప్పుడు, ముట్టుకోవడం వలన గానీ, తిండి తినడం వలన గానీ సనాతన ధర్మం ఎలా భ్రష్టమవుతుంది? అది ధర్మం కాదు, ఒక చెడు ఆచారం- పరిస్థితి మాత్రమే. దీని వలన భారతదేశంలో సాంప్రదాయిక వివాదాలు పెరిగాయి. దేశం యొక్క విభజన జరిగింది. దేశ సమైక్యత ఈనాటికీ ఒక సమస్య అయి కూర్చుంది.

చెడు ఆచారాలకు సంబంధించిన కథలతో చరిత్ర పుటలు నిండిపోయాయి. హమీర్‌పూరు జిల్లాలో ఏభై-అర్వై కులీనులైన క్షత్రియ కుటుంబాలు ఉండేవి. ఈనాడు వారందరూ ముస్లిములే. వారిపై తూటాలతో గానీ, కత్తులతో గానీ దురాక్రమణ జరగలేదు. జరిగిందేమిటి? నిష్ఠా గరిష్ఠుడయిన ఒక బ్రాహ్మణుడు అందరికన్నా ముందు అక్కడికి స్నానం చేయవస్తాడని అర్థరాత్రి ఒకరిద్దరు మౌల్వీలు ఆగ్రామంలో ఉన్న ఒకే ఒకనూతి సమీపంలో దాక్కొన్నారు. అతను రాగానే వాళ్ళు అతణ్ణి పట్టేసుకొన్నారు, అతని నోటిని మూసేశారు. అతని ఎదురుగానే వారు నూతిలో నుంచి నీళ్ళు తోడారు, నోట కరచుకొని త్రాగారు. మరి మిగిలిన నీళ్ళను నూతిలో పోసేసారు. ఒక రొట్టె ముక్క కూడా పడేసారు. బ్రాహ్మణుడు ఏమీ చేయలేక చూస్తూనే ఉండిపోయాడు. తరువాత బ్రాహ్మణున్ని తొడు తీసుకొని వారు వెళ్ళిపోయారు. తమ ఇంటిలో అతణ్ణి బంధించి వేసారు.

రెండవ రోజు చేతులు జోడించి భోజనం చేయమని ప్రార్థిస్తే, అతను మండి పడ్డాడు, ''అరే, మీరు మొహమ్మదీయులు. నేను బ్రాహ్మణుణ్ణి, ఎలా తినగలను?'' వారన్నారు, అయ్యా మాకు మీలాంటి ఆలోచనాశక్తిగల వారి అవసరం ఉంది. క్షమించండి' అని బ్రాహ్మణున్ని వదిలేసారు

బ్రాహ్మణుడు తన గ్రామానికి వచ్చాడు. పూర్వంలాగానే ప్రజలు నూతి నీటిని వాడడం అతను చూసాడు. అతను నిరాహార దీక్షబూనాడు. ప్రజలు కారణ మడిగితే అతను చెప్పాడు.'మొహమ్మదీయులు నూతిని ఎంగిలి చేసారు. మరియు అందులో ఎంగిలి రొట్టె ముక్కను కూడా పడవేసారు''. గ్రామస్థులు స్తబ్ధులై అడిగారు. ''యిప్పుడేమవుతుంది?'' బ్రాహ్మణుడు అన్నాడు, ''ఏముంది ధర్మం భ్రష్టమయిపోయింది''.

ఆ కాలంలో ప్రజలు నిరక్షరాస్యులుగా వుండేవారు. స్త్రీలు శూద్రులు చదువుకునే అధికారాన్ని ఎప్పుడో తుడిచి పెట్టేశారు. వైశ్యులు ధనోపార్జనయే తమ ధర్మమనుకొన్నారు. 'అన్నదాత ఖడ్గం మెరిస్తే మెరుపులు మెరుస్తాయి. డిల్లీలోని సింహాసనం పునాదులతో ఊగిసలాడిపోతుంది. 'అంటూ క్షత్రియులను ప్రశంసిస్తూ భట్రాజులు పాడుతుండేవారు. గౌరవమర్యాదలు ఎలాగో లభించాయి ఇంక చదువెందుకు? ధర్మంతో వారికి సంబంధమేమిటి? ధర్మం కేవలం బ్రాహ్మణుల వారసత్వమై ఉండి పోయింది. వారే ధర్మ సూత్రాల రచయితలు. వారే వాటి వ్యాఖ్యాకారులు. వారే వాటి యొక్క సత్యా అసత్యాలను నిర్ణయించేవారు. కానీ ప్రాచీన కాలంలో స్త్రీలు, శూద్రులు, వైశ్యులు, క్షత్రియులు మరియు బ్రాహ్మణులు అందరికీ

వేదం చదివే అధికారం ఉండేది. ప్రతి వర్గానికీ చెందిన ఋషులు వైదిక మంత్రాలను రచించారు. శాస్త్రార్థ నిర్ణయాలలో అందరూ పాలు పంచుకొన్నారు. ప్రాచీన కాలంలో రాజులు ధర్మం పేరిట ఆడంబరాలను వ్యాపింపజేసే వారిని దండించారు. ధర్మ పరాయణులను ఆదరించారు.

కానీ మధ్యయుగంలోని భారతదేశంలో సనాతన ధర్మం యొక్క సరియైన అర్థం తెలియకపోవడంతో, పైన చెప్పబడిన గ్రామంలోని వారందరూ ధర్మం భ్రష్టమై పోయిందను కొని గొడ్డెలలాగా ఒక మూల నిలబడిపోయారు. చాలా మంది ఈ అప్రియమైన మాట వింటూనే ఆత్మహత్య చేసుకొన్నారు, కానీ అందరూ ఎక్కడ ప్రాణాలు తీసుకొంటారు? అత్యంత శ్రద్ధగల వారయి కూడా చేతగానివారై అన్య మార్గాలు వెతక మొదలు పెట్టారు. ఈ నాటికి కూడా అక్కడివారు వెదురు పాతి, రోకలి పెట్టి హిందువుల లాగానే పెళ్ళిళ్ళు జరిపిస్తారు. ఆ తరువాత మౌల్వీ నిక్హా చదివి వెళ్ళి పోతాడు. అందరి కందరూ శుద్ధ హిందువులే! అందరి కందరూ శుద్ధ మొహమ్మదీయులై పోయారు.

జరిగిందేమిటి? నీళ్ళు త్రాగారు. తెలియకుండా మొహమ్మదీయులు ముట్టుకున్నది తిన్నారు. అందుకనే ధర్మం భ్రష్టమయి పోయింది. ధర్మం 'లాజవంతీ' అయిపోయింది లాజవంతి= సిగ్గుచేట్టు. ఒక చిన్న చెట్టు. ముట్టు కొంటే దాని ఆకులు ముడుచుకొని పోతాయి చెయ్యి తీసేయగానే మళ్ళీ వికసిస్తాయి. ఈ చెట్టు చెయ్యి తీసేయగానే వికసించుతుంది. కానీ ధర్మం మాత్రం ఎలా ముకుళించుకుపోయిందంటే అదింకెన్నటికీ వికసించదు. ఆనాటి వారందరూ మరణించారు, వారితోపాటు శాశ్వతంగా ఉండే రాముడు, కృష్ణుడు, పరమాత్ముడు కూడా మరణించారు. వాస్తవానికి శాశ్వతమనే పేరిట ఏదో ఒక దురాచారం. దాన్నే ప్రజలు ధర్మమని అనుకున్నారు.

మనం ఎందుకు ధర్మాన్ని శరణు పొందుతాము ? ఎందుకంటే మనం మరణధర్ములం (జన్మించి–మరణించే వారం). ధర్మం ఎంతటి ఘనమైనదంటే దాని శరణు పొందితే మనం కూడా అమరులమై పోతాం అని అనుకొంటాము. మనం చంపితేనే చస్తాం. మరి ఆ ధర్మం కేవలం ముట్టుకుంటేనే లేక తింటేనే చని (భ్రష్టమై) పోతే, అది మననేం రక్షించగలదు? ధర్మం మిమ్మల్ని రక్షిస్తుంది. మీకంటే శక్తిశాలి. మీరు ఖడ్గంతో చస్తారు. మరి ధర్మం ? అది ముట్టుకోగానే భ్రష్టమయి పోతుంది. ఎటువంటిదయ్యా మీ ధర్మం? దురాచారాలు నాశనమై పోతాయి. కానీ సనాతనం ఏనాటికీ నాశనమైపోదు.

సనాతనం ఎంతటి ఘనమైనదంటే, ఆయుధాలు దానిని నరకలేవు, అగ్ని దానిని కాల్చలేదు, నీళ్ళు దానిని తడపలేవు. తినడం–తాగడం వదలి పెట్టేయండి, ప్రకృతిలో పుట్టిన ఏ వస్తువూ దానిని స్పృశించను కూడా స్పృశించలేదు, మరి అలాంటి సనాతనం నాశనమెలా అయిపోతుంది ?

ఇలాంటి దురాచారాలు అర్జునుడి కాలంలో కూడా ఉండేవి. అర్జునుడు కూడా వాటికి లొంగిపోయిన వారిలో వున్నాడు. 'కులధర్మం సనాతనమంటూ' అతను వాపోయాడు.

కులధర్మం భ్రష్టమయి పోతే మనం అనంత కాలం వరకు నరకానికి వెళ్ళి పోతాము. కానీ శ్రీకృష్ణుడు అన్నాడు, ''నీకు ఈఅజ్ఞానం ఎక్కడి నుంచి వచ్చిపడింది''? అంటే అదొక దురాచారమని స్పష్టమవుతోంది. అందుకనే కదా శ్రీకృష్ణుడు దానిని నిరాకరించి ఆత్మయే సనాతనమని. చెప్పాడు! మీకు గనక ఆత్మ పథం గురించి తెలియకపోతే ఇప్పటి వరకు మీరు సనాతన ధర్మంలో ప్రవేశించనే లేదన్నమాట.

సనాతనమూ–శాశ్వతమూ అయిన ఆత్మ అందరిలోపల పరివ్యాప్తమై ఉన్నప్పుడు దేని కోసం వెతకాలి? దీనిని గురించి శ్రీకృష్ణుడు ఇలా అంటాడు–

*శ్లో ॥ అవ్యక్తోఽయమచిన్త్యోఽయమవికార్యోఽయముచ్యతే ।*
*తస్మాదేవం విదిత్వైనం నాను శోచితుమర్హసి ॥**25**॥*

ఈ ఆత్మ అవ్యక్తం, అంటే యింద్రియాలకు సంబంధించిన విషయం కాదు. ఇంద్రియాల ద్వారా దీనిని అర్థం చేసుకొలేరు. యింద్రియాలు మరియు విషయాల సంయోగం ఉన్నంత వరకూ, ఆత్మ వున్నా, దానిని అర్థం చేసుకోలేరు. అది అచింత్యము. చిత్తమూ దాని కల్లోలమూ ఉన్నంత వరకూ శాశ్వతమైన ఆత్మని మనం దర్శించు కునేందుకు, ఉపయోగించుకొందుకు, ప్రవేశించేటందుకు వీలు లేదు. అందుచేత ముందుగా చిత్తాన్ని నిరోధించాలి.

లోగడ శ్రీకృష్ణుడు చెప్పినట్లు అసత్య వస్తువుకి అస్తిత్వం లేదు మరియు సత్యానికి మూడు కాలాల్లోనూ అభావం లేదు. ఆసత్యం ఆత్మే. ఆత్మే అపరివర్తనశీలం, శాశ్వతం, సనాతనం, మరియు అవ్యక్తం. తత్త్వదర్శకులు ఆత్మను ఈ విశేష గుణధర్మాలతో యుక్తమై ఉండగా చూశారు. పది భాషలను నేర్చిన పండితుడు చూడలేడు, సమృద్ధ శాలి అయినవాడు చూడలేదు. కానీ తత్త్వ దర్శకులు చూశారు. తత్త్వమే పరమాత్ముడని శ్రీ కృష్ణుడు ఇక ముందు తెలుపుతాడు. మనస్సును నిరోధించిన కాలంలో సాధకుడు దీని దర్శనం చేసుకోగలడు. మరి దానిలో ప్రవేశం పొందగలడు. సాధన పూర్తి అయినప్పుడు భగవంతుడు లభిస్తాడు. ఆ తరువాత క్షణంలోనే అతను తన ఆత్మ ఈశ్వరీయ గుణ ధర్మాలతో విభూషితమై ఉండడం గమనిస్తాడు. అతనేమి చూస్తాడు? అత్మ సత్యమనీ, సనాతనమనీ మరియు పరిపూర్ణమైనదనీ గ్రహిస్తాడు. ఈ అత్మ అచింత్యమైనది. ఇది వికార రహితమైనది అంటే మార్పులేనిదని చెప్పవచ్చు. అందుచేత అర్జునా! ఆత్మ యిలాంటిదని తెలుసుకొన్నాక నీవు శోకించడం తగదు. ఇప్పుడు శ్రీకృష్ణుడు అర్జునుని ఆలోచనల్లోని విరోధభావాన్ని సామాన్య తర్కం ద్వారా నిరూపిస్తాడు–

*శ్లో ॥ అథచైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతం ।*
*తథాపిత్వం మహాబాహో నైవం శోచితుమర్హసి ॥**26**॥*

ఆత్మ ఎల్లప్పుడూ జన్మించేది మరియు ఎల్లప్పుడూ మరణించేది అని అనుకొన్నా కూడా, నీవు శోకించ కూడదు, ఎందుకంటే–

శ్లో ॥ *జాతస్య హి ధ్రువో మృత్యుర్ధ్రువం జన్మ మృతస్యచ।*
*తస్మాదపరిహార్యేఽర్థే నత్వం శోచితుమర్హసి ॥**27**॥*

అలా అనుకొన్నప్పుడు కూడా జన్మించే దానికి మృత్యువు తప్పదు; మరియు మరణించిన దానికి జన్మం నిశ్చయమన్నది నిజం. కాబట్టి మన చేతులలో లేని యీ విషయం గురించి శోకించడం తగదు. దేనికైతే మందు లేదో, దానికై శోకించడం మరొక దుఃఖాన్ని కొని తెచ్చుకోవడమే అవుతుంది.

శ్లో ॥ *అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత ।*
*అవ్యక్త నిధానాన్యేవ తత్రకా పరిదేవనా ॥**28**॥*

అర్జునా! అన్ని ప్రాణులూ, జన్మించడానికి ముందు ఈ శరీరం లేనివే; మరియు మరణించిన తరువాత కూడా శరీరం లేనివే. జన్మలకు ముందు, తరువాత కూడా కనిపించవు. కేవలం జన్మ–మృత్యువుల మధ్యకాలంలో శరీరాన్ని ధరించి కనిపిస్తాయి. అందుచేత ఈ పరివర్తనకై వ్యర్థంగా చింతించడం దేనికి? ఈ ఆత్మను ఎవరు చూస్తారు? ఆ పై అంటాడు:–

శ్లో ॥ *ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేన*
*మాశ్చర్యవద్వదతి తథైవ చాన్యః।*
*ఆశ్చర్య వచ్చైనమన్యః శృణోతి*
*శ్రుత్వాప్యేనం వేద న చైవ కశ్చిత్ ॥**29**॥*

ఇంతకు ముందు శ్రీ కృష్ణుడేమన్నాడంటే ఈ ఆత్మను తత్త్వ దర్శకులు చూసారని. ఇప్పుడు తత్త్వదర్శనం దుర్లభమని స్పష్టం చేస్తూ ఇలా అంటాడు –ఎవరో దుర్లభుడైన మహాపురుషుడు మాత్రమే ఈ ఆత్మను చూస్తాడు. ఆశ్చర్యంతో దీని తత్త్వాన్ని గురించి చెప్తాడు. ఎవ్వరైతే చూసారో, వారే యథార్థాన్ని చెప్పగలరు. ఇంకో దుర్లభుడైన సాధకుడు దీనిని ఆశ్చర్యంగా వింటాడు– అందరూ వినలేరు కూడా. ఎందుకంటే అది అధికారి (యోగ్యుడి) కే వినబడుతుంది. హే అర్జునా! కొంత మంది వినికూడా ఈ అత్మను తెలుసుకోలేరు, ఎందుకంటే సాధన పూర్తి చేయలేరు. మీరు జ్ఞానానికి సంబంధించిన లక్ష మాటలు వినండి, అర్థం చేసుకోండి. వెంట్రుక విడిదీసి అర్థం చేసుకోండి, తీవ్రమయిన కోర్కెకలవారై కూడ అయి ఉండవచ్చు; కానీ మోహం చాలా ప్రబలమయింది, కొంచెం సేపటిలోనే మీరు ఈ ప్రాపంచిక వ్యవస్థలో చిక్కుకొని పోతారు.

చివరలో శ్రీ కృష్ణుడు తన నిర్ణయం ఇస్తూ ఇలా చెప్తాడు–

శ్లో ॥ *దేహీ నిత్యమవధ్యోఽయం దేహే సర్వస్య భారత ।*
*తస్మాత్సర్వాణి భూతాని నత్వం శోచితు మర్హసి ॥**30**॥*

అర్జునా! ఈ ఆత్మ అందరి శరీరంలోనూ ఎల్లప్పుడూ అవధ్యమై, అచ్ఛేద్యమై ఉంటుంది. కాబట్టి సంపూర్ణ భూత ప్రాణులకోసం నువ్వు శోకించడం తగినది కాదు.

'ఆత్మయే సనాతనం'- ఈ సత్యాన్ని ప్రతిపాదించి, దీన్ని అధికారికంగా వర్ణించిన తరువాత, ప్రశ్న యిక్కడ ముగుస్తుంది. ఇప్పుడు యింకో ప్రశ్న పుట్టుకొస్తుంది. 'దీన్ని పొందడం ఎలా?' మొత్తం గీతలో దీనికి రెండే మార్గాలు సూచించబడ్డాయి- మొదటిది నిష్కామ కర్మ యోగం; రెండవది జ్ఞానయోగం. రెండు మార్గాలలోనూ చేయవలసినది 'కర్మ' ఒక్కటే. ఆ కర్మ యొక్క అనివార్యతను ఉటంకిస్తూ యోగేశ్వరుడు శ్రీకృష్ణుడు జ్ఞాన యోగం విషయంలో ఇలా చెప్పాడు:-

*శ్లో ॥ స్వధర్మమపి చావేక్ష్య న వికమ్పితుమర్హసి ।*
*ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రే యోऽన్యత్ క్షత్రియస్య న విద్యతే ॥**31**॥*

అర్జునా! స్వధర్మాన్ని చూచి కూడా నీవు భయపడే యోగ్యుడివి కాదు. ఎందుకంటే ధర్మ సంయుక్తమైన యుద్ధం తప్ప పరమ కళ్యాణకారియైన మరోమార్గం క్షత్రియులకు లేదు. ఇప్పటి వరకూ 'ఆత్మయే శాశ్వతం','ఆత్మయే సనాతనం, అది ఒక్కటే ధర్మం' అంటూ వచ్చాడు. ఇప్పుడు ఈ స్వధర్మం ఏమిటి? ధర్మం ఏకమాత్ర ఆత్మయే కదా ! అది అచంచలంగా, స్థిరంగా ఉంటుంది. అప్పుడు ధర్మాచరణం ఏమిటి? కానీ ఈ ఆత్మ పథంలో ప్రవృత్తిని కలిగించే సామర్థ్యం ప్రతి వ్యక్తిలో వేరు-వేరుగా ఉంటుంది. స్వభావంచే ఉత్పన్నమైన ఈ సామర్థ్యాన్ని స్వధర్మం అనడమయింది.

ఈ సనాతన ఆత్మిక పథంపై పయనించే సాధకులను వారి వారి స్వభావాలు, వారి వారి సామర్థ్యాలను బట్టి నాలుగు వర్గాలుగా విభజించారు- 'శూద్రులు, వైశ్యులు, క్షత్రియులు మరియు బ్రాహ్మణులు' సాధన యొక్క ప్రారంభ దశలో ప్రత్యేక సాధకుడు శూద్రుడే; అంటే అల్పజ్ఞుడే. గంటల కొద్దీ భజనలో కూర్చున్నా సరే, అతను పది నిమిషాలు తనవిగా చేసుకోలేడు. అతను ప్రకృతి యొక్క మాయా-జాలాన్ని ఖండించలేడు. ఈ దశలో మహాపురుషుని సేవలో అతని స్వభావంలో సద్గుణాలు వస్తాయి. అతను వైశ్య శ్రేణికి చెందిన సాధకుడిగా మారిపోతాడు. ఆత్మిక సంపత్తియే స్థిరమైన సంపత్తి. దీనిని అతడు మెల్లమెల్లగా సేకరించడంలోనూ, కామం-క్రోధం మొదలగువాని నుండి ఇంద్రియాలను రక్షించుకోవడంలోనూ సమర్థుడైపోతాడు. కామం-క్రోధం మొదలగువాని వలన ఇంద్రియాలు హింసించబడతాయి. మరియు వివేకం-వైరాగ్యాల వలన ఇవి రక్షించబడతాయి. కానీ ప్రకృతిని సమూలంగా పెరికి వేసే సామర్థ్యం వాడిలో ఉండదు. క్రమక్రమంగా ముందుకు సాగుతూసాధకుడి అంతః కరణంలో మూడు గుణాల్ని ఖండించే సామర్థ్యం అంటే క్షత్రియత్వం ఏర్పడుతుంది. ఈ స్థాయిలో ప్రకృతినీ దాని వికారాలనూ నాశనం చేయగల సామర్థ్యం వస్తుంది. అందువలన యుద్ధం ఇక్కడ నుండే మొదలు అవుతుంది. సాధన చేస్తూ, సాధకుడు బ్రాహ్మణత్వపు శ్రేణిలోకి వస్తాడు. ఈ సమయంలో మనస్సును నిరోధించడం, ఇంద్రియాలను అణచడం, నిరంతరంగా చింతన చేయడం, సారళ్యం, అనుభవం, జ్ఞానం మొదలగు లక్షణాలు సాధకునిలో స్వాభావికంగా వస్తాయి. వీటి అనుష్ఠానం చేత క్రమంగా అతను బ్రహ్మలో ప్రవేశం పొందుతాడు. అప్పుడు అతను బ్రాహ్మణుడిగా కూడా ఉండడు.

విదేహుడైన జనక మహారాజు సభలో యాజ్ఞవల్క్య మహర్షి చాక్రాయణుడు, ఉషస్తుడు, కహోలుడు, ఆరుణి, ఉద్దాలకుడు, గార్గి మొదలగువారి ప్రశ్నలకు సమాధానమిస్తూ, ఏం చెప్పాడంటే, ఆత్మ సాక్షాత్కారాన్ని సంపూర్ణంగా పొందిన వారే బ్రాహ్మణులవుతారు. ఈ ఆత్మే లోక-పరలోకాలనూ, సమస్త ప్రాణులను లోపలి నుండి నియంత్రిస్తుంది. సూర్యుడు, చంద్రుడు, పృథ్వీ, జలం, వాయువు, అగ్ని, తారాగణం, అంతరిక్షం, ఆకాశమేగాక ప్రతి క్షణం కూడా ఈ ఆత్మకు లోబడే ఉన్నాయి. అంతర్యామి అయిన ఈ నీ ఆత్మ అమృతం (చావు లేనిది). ఆత్మ ఒక్కటే అక్షరం, దీనికి విరుద్ధంగా ఉన్న వన్నీ నశ్వరాలే. ఈ లోకంలో ఈ అక్షరాన్ని తెలుసుకోకుండా ఆహుతులు ఇచ్చేవారి, తపస్సు చేసేవారి, వేల కొద్దీ సంవత్సరాలు యజ్ఞం చేసేవారి అన్ని కర్మలు నాశనమయ్యేవే. ఎవడైతే ఈ 'అక్షరాన్ని' తెలుసుకోకుండా మరణిస్తాడో, అతడు దయనీయుడు, కృపణుడు మరి ఎవడైతే ఈ అక్షరాన్ని తెలుసుకొని ఈ లోకం నుంచి, మరణించి పోతాడో అతనే బ్రాహ్మణుడు. (బృహదారణ్యకోపనిషత్తు 3/4-6-7/8).

అర్జునుడు క్షత్రియ శ్రేణికి చెందిన సాధకుడు. శ్రీ కృష్ణుడు ఇలా అంటాడు; క్షత్రియ శ్రేణికి చెందిన సాధకుడికి యుద్ధం మినహా కళ్యాణ కారకమైన మరి యొక మార్గం లేదు. ఇప్పుడు ప్రశ్న క్షత్రియుడెవరు అని? సాధారణంగా లోకులు ఈ ఆశయాన్ని సమాజంలో జన్మించడంచే ఏర్పడిన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర జాతులతో పోలుస్తారు. వీటినే నాలుగు వర్ణాలుగా ఎంచుకొంటారు. కానీ అసలు విషయం అది కాదు, శాస్త్రకారుడు స్వయంగా 'క్షత్రియు డెవడు? వర్ణ మేమిటి? అన్నది వివరించాడు. ఇక్కడ అతడు కేవలం క్షత్రియుడనే పేరును మాత్రమే ఉచ్చరించాడు. కానీ మున్ముందు పద్దెనిమిదవ అధ్యాయం వరకూ ఈ ప్రశ్నకు సమాదానం ఇస్తూ వచ్చాడు, ''ఈ వర్ణం ఏమిటి ? మరి వీటిలో పరివర్తన మెలా జరుగుతుంది?''

శ్రీకృష్ణుడు అంటాడు, ''చాతుర్వర్ణ్యం మయా సృష్టం'' నాలుగు వర్ణాలను సృష్టించింది నేనే. అంటే మనుష్యులను విభజించాడా? శ్రీ కృష్ణుడు అంటాడు,- కాదు, 'గుణ-కర్మ విభాగశః'- గుణాలు కారణంగా, కర్మను నాలుగు భాగాలుగా విభజించడమైంది. 'దేనినైతే విభజించారో, 'ఆ కర్మ ఏమిటి?' అని చూడాలి. గుణాలు పరివర్తన శీలములు. సాధన యొక్క ఉచిత ప్రక్రియల ద్వారా తామసం నుంచి రాజసంలోకి, రాజసం నుంచి సాత్త్విక గుణాలలోకి ప్రవేశం దొరుకుతుంది. ఆఖరికి బ్రాహ్మణుడి స్వభావం చేకూరుతుంది. ఆ సమయంలో బ్రహ్మలో ప్రవేశం ఇప్పించ గలిగే, అన్ని యోగ్యతలు ఆ సాధకునిలో ఉంటాయి. వర్ణానికి సంబంధించిన ప్రశ్నకు ఇక్కడి నుంచి ఆరంభమయి, పద్దెనిమిదవ అధ్యాయంలో సమాధానం పూర్తవుతుంది.

'శ్రేయాన్స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్' స్వభావం వలన ఉత్పన్నమయ్యే ఈ ధర్మంలో ప్రవృత్తమయ్యే సామర్థ్యం ఏ స్థాయిలో నున్నదైనా సరే, అది గుణ రహితమైన

శూద్ర శ్రేణికి చెందినదైనా సరే, అదే పరమ కళ్యాణాన్ని సాధించగలదు. ఎందుకంటే మీరు క్రమశః అక్కడ నుంచే పైకి వస్తారు, అన్నది శ్రీకృష్ణుడి ఆలోచన. అంత కంటే పైన ఉన్న వారిని కాపీ చేయడం వలన సాధకుడు నష్టపోతాడు.

అర్జునుడు క్షత్రియశ్రేణికి చెందిన సాధకుడు. కాబట్టే శ్రీకృషుడు ఇలా అంటాడు– అర్జునా! స్వభావతః ఉత్పన్నమైన ఈ యుద్ధంలో ప్రవృత్తమవగలిగే నీ సామర్థ్యాన్ని తెలుసుకొని కూడా, నీవు భయ పడటం సరియైనది కాదు. ఇంతకు మించి కళ్యాణ కారకమైన ఇంకో కార్యం క్షత్రియుడికి లేదు. దీనినే స్పష్టంచేస్తూ మళ్ళీ శ్రీకృష్ణుడు ఇలా అంటాడు–

*శ్లో ॥ యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వారమపావృతం।*
*సుఖినః క్షత్రియాః పార్థ లభన్తే యుద్ధ మీదృశమ్ ॥**32**॥*

పార్థివ శరీరాన్నే రథంగా మార్చుకొని గురితప్పకుండా లక్ష్యాన్ని ఛేదించగల ఓ అర్జునా! తనంతటతానే ప్రాప్తమయ్యే, స్వర్గ ఉన్ముక్త ద్వారం వంటి ఈ యుద్ధం అదృష్టవంతులైన క్షత్రియులకే లభిస్తుంది. క్షత్రియ శ్రేణికి చెందిన సాధకులలో మూడు గుణాలను నరికి వేయగల సామర్థ్యం ఉంటుంది. వారి కోసం స్వర్గం ద్వారాలు తెరచి ఉంటాయి. ఎందుకంటే అతనిలో దైవీ సంపద పూర్ణత్వాన్ని పొంది ఉంటుంది, శ్వాసలో చరించగల సామర్థ్యం అతనిలో ఉంటుంది. ఇదే తెరచి ఉన్న స్వర్గ ద్వారం. క్షేత్ర–క్షేత్రజ్ఞుల ఈ యుద్ధం అదృష్టవంతులైన క్షత్రియునికే ప్రాప్తిస్తుంది, ఎందుకంటే అతనిలోనే ఈ సంఘర్షణలో పాల్గొనే సామర్థ్యం ఉంటుంది.

ప్రపంచంలో యుద్ధాలు అవుతూనే ఉంటాయి. లోకమంతా ఏకమై యుద్ధం చేస్తుంది, ప్రతి జాతి యుద్ధం చేస్తుంది, కానీ 'శాశ్వత విజయం' గెలిచిన వారికి కూడా లభించదు. ఇవి ప్రతీకారాలు మాత్రమే. ఒకడు ఇంకొకరిని ఎంతగా అణచి వేస్తాడో, కాలాంతరంలో తాను కూడా అలా అణగిపోవలసి వస్తుంది. ఇంద్రియాలను ఎండగట్టేసే శోకం గల ఈ విజయం ఎలాంటిది? చివరకు శరీరం కూడా వినష్టమైపోతుంది. వాస్తవికమైన సంఘర్షణ క్షేత్ర క్షేత్రజ్ఞులదే. దీనిలో ఒక్కసారి విజయం ప్రాప్తిస్తే, ప్రకృతి ఎల్లప్పటికీ నిరోధించబడుతుంది. మరియు పరమ పరుడు, పరమాత్ముడు కూడా ప్రాప్తిస్తాడు. అపజయం ప్రసక్తి లేనటువంటి విజయం ఇది.

*శ్లో ॥ అథ చేత్ త్వమిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి ।*
*తతః స్వధర్మం కీర్తించ హిత్వా పాపమవాప్స్యసి ॥**33**॥*

నీవు ఈ 'ధర్మయుక్త సంగ్రామం' అంటే శాశ్వత సనాతన పరమధర్మమైన పరమాత్మునిలో ప్రవేశం కలిగించే ధర్మయుద్ధం చేయకపోతే, 'స్వధర్మం' అంటే స్వభావంనుండి ఉత్పన్నమయ్యే సంఘర్షణ చేయగలిగిన సామర్థ్యాన్ని, క్రియలో ప్రవృత్తమయ్యే సామర్థ్యాన్ని పోగొట్టుకొని, పాపాన్ని అంటే జనన మరణాలను మరియు అపకీర్తిని పొందుతావు. అపకీర్తిని గూర్చి నొక్కి చెప్తూ అంటాడు–

శ్లో || *అకీర్తిం చాపి భూతాని కథయిష్యంతి తే వ్యయామ్।*
*సంభావితస్య చా కీర్తిర్మరణా దతిరిచ్యతే ||**34**||*

అందరూ చాలాకాలంవరకు నీ అపకీర్తి కథలుగా చెప్పుకుంటారు. ఈ రోజు కూడా పదచ్యుతులైన మహాత్ములలో విశ్వామిత్రుడు, పారాశరుడు, నిమి, శృంగి యిత్యాదులను లెక్కించడం జరుగుతుంది. చాలా మంది సాధకులు తమ ధర్మం గురించి ఆలోచించేదేమిటంటే లోకులు మమ్మల్నేమంటారో అని. ఈ లాంటి భావం కూడా సాధనలో సహాయకమవుతుంది. దీని వలన సాధన చేయడానికి ప్రేరణలభిస్తుంది. కొంచెం దూరం వరకు ఈ భావన తోడునిస్తుంది. మాననీయులైన పురుషులకు అపకీర్తి మరణం కంటే కూడా ఘోరమైనది.

శ్లో || *భయాద్రణా దుపరతం మంస్యన్తే త్వాం మహారథాః।*
*యేషాం చ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవమ్ ||**35**||*

ఏ మహారథుల దృష్టిలో నువ్వు గొప్ప మాననీయుడవో, యిప్పుడు వారి దృష్టిలోనే తుచ్ఛత్వాన్ని పొందుతావు. ఆ మహారథులే భయం కారణంగా నీవు యుద్ధం నుంచి విరమించుకొన్నావని అనుకొంటారు. మహారథులు ఎవరు? ఈ మార్గంలో మహాపరిశ్రమతో ముందుకు వెళ్ళు సాధకులే మహారథులు. ఇదే ప్రకారంగా ఇంతే పరిశ్రమతో అవిద్య వైపు ఆకర్షించే కామం, క్రోధం, లోభం, మోహం మొదలగునవి కూడా మహారథులే. 'ఈ సాధకుడు ప్రశంసార్హుడు, అంటూ ఎవరైతే నిన్ను సన్మానించారో, వారి దృష్టిలో నీవు పతితుడవై పోతావు. ఇంతే కాదు. ఇంకా:-

శ్లో || *అవాచ్య వాదాంశ్చ బహూన్ వదిష్యన్తి తవాహితాః।*
*నిన్దన్తస్తవ సామర్థ్యం తతో దుఃఖ తరం ను కిం ||**36**||*

వైరులు నీ పరాక్రమాన్ని నిందిస్తూ చెప్పనలవికాని అనేక మాటలు అంటారు. ఒక్క దోషం చేస్తే చాలు, నాలుగు వైపులనుంచి నిందలు మరియు చెడ్డ మాటలు అనడం కూడా జరుగుతుంది. ఇంత కన్న పెద్ద దుఃఖం ఇంకే ముంటుంది? కనుక-

శ్లో || హతో వా ప్రాప్స్యసి స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్।
తస్మాదుత్తిష్ఠ కౌన్తేయ యుద్ధాయ కృతనిశ్చయః ||**37**||

ఈ యుద్ధంలో మరణిస్తే స్వర్గాన్ని పొందుతావు, స్వాసలో చరించే సామర్థ్యం ఉంటుంది. శ్వాస బయటి ప్రకృతిలో విచరించే భావ ధారలు నిరుద్ధ మయిపోతాయి. పరమదేవుడయిన పరమాత్మునిలో ప్రవేశం ఇప్పించే దైవీ సంపద హృదయంలో పూర్ణంగా ప్రవాహితమై ఉంటుంది. అలా కాకుండా ఈ సంఘర్షణలో గెలిస్తే మహామహిమ స్థితిని పొందుతావు. కాబట్టి అర్జునా! యుద్ధం చేయడానికే నిశ్చయించుకొని నిలబడు.

సాధారణంగా లోకులు ఈ శ్లోకానికి ఏమని అర్థం చెపుతారంటే; ఈ యుద్ధంలో మరణిస్తే స్వర్గానికే వెళతావు. మరియు గెలిస్తే పృథ్విపై భోగాలను అనుభవిస్తావు, కానీ, మీకు గుర్తుందనుకుంటాను అర్జునుడు ముందే చెప్పాడు. ''భగవంతుడా! పృథ్వియే కాదు గానీ

త్రిలోకాలపైనా, దేవతలపైనా ఆధిపత్యం అంటే ఇంద్రుని పదవి ప్రాప్తించినా కూడా ఈ ఇంద్రియాలను ఎండబెట్టేసే నా శోకాన్ని తొలగించుకునే ఉపాయం నాకు కనిపించడం లేదు. 'ఇంతే గనక లభించేట్లయితే, గోవిందా! నేను యుద్ధం చేయనే చేయను!'' ఇంత అన్న తర్వాత కూడా ''అర్జునా! యుద్ధం చేయి; గెలిస్తే పృథ్విని సంపాదిస్తావు, ఓడితే స్వర్గం పొరుడివయిపోతావు. 'అని శ్రీకృష్ణుడు అంటే, మరి అతను ఇచ్చే దేమిటి? అర్జునుడు ఇంతకు మించిన సత్యాన్ని, శ్రేయస్సు (పరమ కళ్యాణాన్ని)ను కోరుకొంటున్న శిష్యుడు. అతనితో సద్గురువు శ్రీకృష్ణుడేమన్నాడంటే, క్షేత్ర-క్షేత్రజ్ఞుల సంఘర్షణలో నీ శరీరం యొక్క సమయం పూర్తయి పోతే, లక్ష్యాన్ని చేరుకోలేక పోతే స్వర్గాన్ని పొందుతావు అంటే శ్వాసలో చరింప చేసే సామర్థ్యాన్ని పొందుతావు, దైవీ సంపద హృదయంలో ఉండి పోతుంది. మరి అలాకాక ఈ శరీరం ఉంటూ ఉండగానే సంఘర్షణలో సఫలుడవైపోతే 'మహీం' అందరి కన్నా మహానుభావుడుగా బ్రహ్మ యొక్క మహిమకు భోక్తవవుతావు, మహామహీం స్థితిని పొందుతావు. గెలిస్తే సర్వస్వం ఎందుకంటే, మహామహిమత్వాన్ని, అలాకాకుండా, ఓడిపోతే దైవత్వాన్ని పొందుతావు. రెండు చేతుల్లో లడ్డూ వున్నట్లే. లాభంలో కూడా లాభం. మరి హానిలో కూడా లాభమే ఉంది. దీనినే పునరుద్ఘాటించాడు.

*శ్లో ॥ సుఖ దుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ।*
*తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాపమవాప్స్యసి ॥**38**॥*

ఈ ప్రకారంగా సుఖ-దుఃఖాలు, లాభ-నష్టాలు, జయాపజయాలు, సమానం అనుకొని నీవు యుద్ధానికై తయారు కమ్ము. యుద్ధం చేస్తే నీకు పాపం అంటుకోదు. అంటే సుఖంలో సర్వస్వం మరియు దుఃఖంలో కూడా దైవత్వం ఉంది. లాభంలో మహీం స్థితి అంటే సర్వస్వం మరియు హానిలో కూడా దైవత్వం ఉంది. జయంలో మహామహీం స్థితి మరియు అపజయంలో దైవీ సంపదపై అధిపత్యం ఉంది. ఈ ప్రకారంగా లాభ-నష్టాల్ని స్వయంగా బాగా, అర్థం చేసుకొని, నీవు యుద్ధానికి తయారు కమ్ము. యుద్ధంలోనే ఈ రెండు వస్తువులు ఉన్నాయి. యుద్ధం చేస్తే పాపం అంటే జనన-మరణాలని పొందవు. ఇందువల్ల నీవు యుద్ధానికై తయారు కమ్ము.

*శ్లో ॥ ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధి ర్యోగే త్విమాం శృణు ।*
*బుద్ధ్యా యుక్తో యయా పార్థ కర్మబన్ధం ప్రహాస్యసి ॥**39**॥*

పార్థా! ఈ బుద్ధి నీకు జ్ఞానయోగం విషయంలో చెప్పబడింది. ఏ బుద్ధి? ఇదే యుద్ధం చేయమని. తనను తాను చూసుకొంటూ, లాభ-నష్టాలను బేరీజు వేసుకొంటూ, గెలిస్తే మహామహీం స్థితి, ఓడిపోతే దైవత్వం, జయంలో సర్వస్వం, అపజయంలో కూడా దైవత్వం- రెండు వైపులా లాభమే, యుద్ధం చేయకపోతే, అందరూ చెడుగా అంటారు. భయంతో విరమించుకున్నాడంటారు. అపకీర్తి కలుగుతుంది', ఈ ప్రకారంగా తన అస్తిత్వాన్ని ముందు ఉంచుకొని, స్వయంగా ఆలోచించు కొంటూ, యుద్ధంలో ముందడుగు వేయడమే జ్ఞానయోగం.

జ్ఞాన మార్గంలో కర్మ (యుద్ధం) చేయనవసరం లేదని సాధారణంగా లోకులలో ఒక భ్రాంతి ఉంది. జ్ఞాన మార్గంలో కర్మ లేదని వారంటారు. నేను శుద్ధాత్మను, 'బుద్ధుడను' చైతన్యాన్ని', 'అహం బ్రహ్మాస్మి', 'గుణములే గుణాలలో విహరిస్తున్నాయి'– ఇలా అనుకొంటూ, కాలుమీద కాలు వేసుకొని కూర్చుంటారు. యోగేశ్వరుడు శ్రీకృష్ణుడు చెప్పినట్లు ఇది జ్ఞాన యోగం కాదు. నిష్కామకర్మ యోగంలో చేయాల్సిన దానిని జ్ఞానయోగంలో కూడా 'కర్మ' చేయవలసిందే, రెండింటిలోనూ కేవలం బుద్ధి మరియు దృక్పథా భేదం ఉంది. జ్ఞాన మార్గి తన స్థితిని అర్థం చేసుకొంటూ, తనపైనే ఆధారపడి, కర్మ చేస్తాడు. అలాకాకుండా నిష్కామ కర్మ యోగంలో ఇష్టదేవుని ఆశ్రితుడై కర్మ చేస్తాడు. చేయడం రెండు మార్గాల్లోనూ ఉంది. ఆ కర్మ కూడా ఒకటే, రెండు మార్గాల్లోనూ చేయ్యాల్సినదే. కేవలం, కర్మను చేసే దృష్టి కోణాలు వేరు.

అర్జునా! ఇదే బుద్ధిని ఇప్పుడు నీవు నిష్కామ కర్మయోగం విషయంలో విను. నిష్కామ కర్మయోగ యుక్తుడవై నీవు కర్మ బంధనాలను నాశనం చేయగలవు. ఇక్కడ శ్రీకృష్ణుడు 'కర్మ' శబ్దాన్ని మొదటిసారి ఉచ్చరించాడు. కానీ ఈ కర్మ ఏమిటన్నది చెప్పలేదు. ఇప్పుడు కర్మగురించి చెప్పకుండా, మొదట కర్మ యొక్క విశిష్టతలను స్పష్టం చేస్తాడు.

*శ్లో ॥ నేహాభిక్రమనాశోऽస్తి ప్రత్యవాయోన విద్యతే ।*
*స్వల్ప మప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్* ॥**40**॥

ఈ నిష్కామ కర్మయోగంలో ఆరంభం అంటే బీజం నాశనం కాదు. సీమిత ఫలం ఇచ్చే దోషం లేదు. కాబట్టి ఈ నిష్కామ కర్మయోగం యొక్క, ఈ కర్మచే సంపాదించబడే ధర్మం యొక్క స్వల్ప సాధన కూడా జన్మ–మృత్యువులనే మహాభయం నుండి ఉద్ధరిస్తుంది. మీరు ఈ కర్మను అర్థం చేసుకొని, దానిపై రెండడుగులు ముందుకు వేస్తే చాలు, (సద్గృహస్థ ఆశ్రమంలో ఉంటూ కూడా ఆచరించవచ్చు. సాధకుడు ఆచరించనే ఆచరిస్తాడు). భీజం మాత్రం వేస్తే చాలు. అర్జునా! బీజం నాశనం కాదు. ఈ సత్యాన్ని తుడిపేయగల సామర్థ్యం ప్రకృతిలో లేదు. దానిని నశింపజేసే ఆయుధం కూడా లేదు. ప్రకృతి కేవలం ఒక ఆచ్ఛాదన వేయగలదు, కొంచెం ఆలస్యం చేయగలదు, కానీ సాధన యొక్క ఆరంభాన్ని తుడిపేయలేదు.

ఆ తరువాత శ్రీకృష్ణుడు ఇలా అంటాడు: అందరిపాపులకన్నా కూడా పెద్ద పాపి ఐనా సరే, జ్ఞానమనే నౌక ద్వారా నిస్సందేహంగా భవసాగరాన్ని దాటి వేయగలడు. సరిగ్గా అదే మాట ఇక్కడ అంటాడు, –అర్జునా! నిష్కామ కర్మయోగం యొక్క భీజారోపణ మాత్రం చేయుము. ఆ బీజానికి ఎన్నటికీ నాశనం లేదు. మిమ్మల్ని స్వర్గం, బుద్ధులు లేక సిద్ధులు దాకా చేర్చి వదలివేసేటటువంటి విపరీత ఫలదోషం కూడా యిందులో లేదు. మీరు ఈ సాధనని తెలిసి వదలినా, యీ సాధన మాత్రం మిమ్మల్ని ఉద్ధరించి మాత్రమే వదులుతుంది. ఈ నిష్కామ కర్మయోగం యొక్క కొద్ది సాధన కూడా జన్మ–మృత్యువు అనే మహాభయాన్నుంచి ఉద్ధరించుతుంది. 'అనేక జన్మ సంసిద్ధతో యాతి పరాంగతిమ్' కర్మ యొక్క ఈ బీజారోపణము అనేక జన్మల తరువాత ఎక్కడైతే పరమధామం గలదో, పరమగతి ఉందో, అక్కడే నిలబెడుతుంది. ఇదే క్రమంలో ఇంకా ఇలా అంటాడు–

శ్లో ॥ వ్యవసాయాత్మికా బుద్ధిరేకేహ కురునందన।
బహుశాఖా హ్యనన్తాశ్చ బుద్ధయోऽవ్యవసాయినామ్ ॥**41**॥

అర్జునా! ఈ నిష్కామ కర్మ యోగంలో క్రియాత్మక బుద్ధి ఒక్కటే ఉంటుంది. క్రియ ఒక్కటే, దాని పరిణామమూ ఒక్కటే. ఆత్మిక సంపత్తే స్థిరమైన సంపత్తి. ఈ సంపత్తిని ప్రకృతి యొక్క ద్వంద్వంతో మెల్ల మెల్లగా ఆర్జించడమే 'వ్యవసాయం'. ఈ 'వ్యవసాయం' లేక నిశ్చయాత్మక క్రియ కూడా ఒక్కటే అయి ఉంటుంది. అలాంటప్పుడు అనంత క్రియలను గురించి చెప్పే వారు భజన చేయరా? శ్రీ కృష్ణుడు ఇలా అంటాడు, ''అవును, వారు భజన చేయరు. అటువంటి పురుషుల బుద్ధి అనంతమైన శాఖలు కలిగినదై ఉంటుంది, కాబట్టివారు అనంత క్రియలను విస్తరింపచేసుకుంటారు.

శ్లో ॥ *యామిమాం పుష్పితాం వాచం ప్రవదన్త్య విపశ్చితః।*
*వేదవాదరతాః పార్థ నాన్యదస్తీతి వాదినః ॥**42**॥*
*కామాత్మానః స్వర్గపరా జన్మకర్మఫలప్రదామ్।*
*క్రియావిశేష బహులాం భోగైశ్వర్యగతిం ప్రతి॥**43**॥*

పార్థా! 'కామాత్మానః' కోరికలతో యుక్తులైన, వారు 'వేద వాదరతాః' వేదముల వాక్యాలలో అనురక్తులైన వారు. 'స్వర్గపరాః' స్వర్గాన్నే పరమలక్ష్యంగా అనుకొని, అంతకుమించి ఇంకెమీ లేదనుకొనే అవివేకమైన జనులు జన్మ-మృత్యు రూపమైన ఫలాన్నిచ్చే, భోగాలు మరియు ఐశ్వర్యాలను పొందుటకై అనేకమైన క్రియలను విస్తరింప చేసుకుంటారు. మరియు ఆడంబరానికై శోభాయుక్తమైన మాటలతో దానిని వ్యక్తం కూడా చేస్తారు. అవివేకులబుద్ధి అనంతమైన బేధాలు కలదై ఉంటుంది. వారు కేవలం ఫలముల గురించి చెప్పే మాటల యందే అనురక్తులై ఉంటారు. వారు వేదాల వాక్యాల్నే ప్రమాణంగా మన్నిస్తారు. స్వర్గాన్నే శ్రేష్ఠంగా భావిస్తారు. వారి బుద్ధి చాలా బేదాలు కలది. కాబట్టి అనంతమైన క్రియలను ఏర్పరచుకొంటారు. వారు పేరుని మాత్రం పరమతత్వ-పరమాత్మునిదే చేబుతారు, కానీ దాని వెనక అనంతమైన క్రియల్ని విస్తరింపచేసుకుంటారు. అంటే ఈ అనంత క్రియలు కర్మలు కావా? శ్రీ కృష్ణుడు ఇలా అంటాడు. ''కావు, అనంత క్రియలు కర్మలు కావు''. అంటే అది ఒక నిశ్చిత క్రియయా? శ్రీ కృష్ణుడు ఇప్పుడే దానిని గురించి చెప్పడు. ఇప్పుడు కేవలం 'ఇంతే' అంటాడు. అవివేకుల బుద్ధి అనంత శాఖలు కలిగినదై ఉంటుంది. కాబట్టి వారు అనంత క్రియలను విస్తరింపచేసుకోవడమే కాదు, అలంకృత శైలిలో వ్యక్తం కూడా చేస్తారు. దాని ప్రభావం ఏమిటి?

శ్లో ॥ *భోగైశ్వర్య ప్రసక్తానాం తయాऽపహృత చేత సాం।*
*వ్యవసాయాత్మికా బుద్ధిః సమాధౌ న విధీయతే ॥**44**॥*

వారి మాటల ముద్ర ఎవరెవరి మనస్సులపై పడుతుందో, అర్జునా! వారి బుద్ధి కూడా భ్రష్టమయిపోతుంది, వారేమీ పొందలేరు. ఆ మాటల ద్వారా అపహరించబడిన మనస్సుగల, భోగాలు-ఐశ్వర్యాల పట్ల ఆసక్తిగల పురుషుల అంతఃకరణంలో క్రియాత్మక బుద్ధి ఉండదు. ఇష్ట దైవంలో సమాధిస్థం చేయగల నిశ్చయాత్మక క్రియ వారిలో ఉండదు.

అటువంటి అవివేకుల మాటలు వినేదెవరు? భోగాల పట్ల, ఐశ్వర్యాల పట్ల ఆసక్తి గలవారే వింటారు, యోగ్యుడు వినడు. అటువంటి పురుషులలో ఆదితత్త్వంలో ప్రవేశం ఇప్పించగల నిశ్చయాత్మక క్రియతో సంయుక్తమైన బుద్ధి ఉండదు.

ఇప్పుడు ప్రశ్న ఏమిటంటే, 'వేదవాదరతాః'– వేద వచనాల్లో అనురక్తులైన వారు కూడా తప్పు చేస్తారా? దీనిని గురించి శ్రీ కృష్ణుడు ఇలా అంటాడు–

*శ్లో ॥ త్రైగుణ్య విషయా వేదా నిస్త్రై గుణ్యో భవార్జున।*
*నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్ ॥**45**॥*

అర్జునా! ''త్రైగుణ్య విషయా వేదాః'' వేదాలు మూడు గుణాల వరకే నొక్కి చెప్పాయి. వాటికి అతీతమైన వాటిని గురించి తెలుపలేవు.

కాబట్టి. 'నిస్త్రై గుణ్యా భవార్జున' –అర్జునా! నీవు మూడు గుణాలకంటే పైకిలే. అంటే వేదాల యొక్క కార్యక్షేత్రం కంటే పైకి వెళ్ళు. వెళ్ళడం ఎలా? దీనిని గురించి శ్రీకృష్ణుడు ఇలా అంటాడు– 'నిర్ద్వంద్వః'– సుఖ దుఃఖాలనే ద్వంద్వాలచే రహితుడవై, నిత్యమైన సత్యమైన వస్తువులో స్థితుడవై, యోగక్షేమాన్ని కోరుకోకుండా ఆత్మ పరాయణుడవై ఉండు. ఈ ప్రకారంగా పైకిలే. 'మేమే అతీతులం కావాలా లేక ఎవరైనా అతీతులయినారా, అన్న ప్రశ్న పుడుతుంది. శ్రీకృష్ణుడు ఇలా అంటాడు– ఎవరైతే అతీతులవుతారో, వారే బ్రహ్మను తెలుసుకొంటారు. మరియు ఎవరైతే బ్రహ్మను తెలుసుకోంటారో, వారే విప్రులు.

*శ్లో ॥ యావానర్థ ఉదపానే సర్వతః సంప్లు తోదకే।*
*తావా స్సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః ॥**46**॥*

అన్ని వైపులా పరిపూర్ణమైన జలాశయాన్ని పొందిన మనుష్యునికి ఒక చిన్న జలాశయంతో ఎంత ప్రయోజనం వుంటుందో, చాలా బాగా బ్రహ్మను తెలుసుకొన్న బ్రాహ్మణునికి వేదాలతో అంతే ప్రయోజన ముంటుంది. తాత్పర్యం ఏమిటంటే ఎవరైతే వేదాలకన్న పైకి లేస్తాడో, వారే బ్రహ్మను గురించి తెలిసినవారు. వారే బ్రాహ్మణులు. అంటే నీవు వేదాల కన్న పైకి లేచి, బ్రాహ్మణుడివి కమ్ము.

అర్జునుడు క్షత్రియుడు. శ్రీకృష్ణుడు ఇలా అంటాడు. ''బ్రాహ్మణుడివి కమ్ము'' బ్రాహ్మణుడు – క్షత్రియుడు మొదలైన వర్ణాలు –స్వభావం యొక్క సామర్థ్యాలకు పేర్లు. ఇవి కర్మ ప్రధానమైనవి. జన్మచే నిర్ధారితమయ్యే ఏదో ఆచారం కాదు. ఎవరికైతే గంగ జలధార ప్రాప్తించిందో, వారికి క్షుద్ర జలాశయంతో ప్రయోజనమేమిటి? కొందరు అందులో నిత్యక్రియలు జరిపితే, కొందరు పశువులకు స్నానం చేయిస్తారు. ఇంత కన్న ఎక్కువ ఉపయోగం లేదు. ఇదే ప్రకారంగా బ్రహ్మను సాక్షాత్తు తెలిసికొన్న ఆ విప్రమహాపురుషునికి, ఆ బ్రాహ్మణునికి వేదాలతో అంతే ప్రయోజనం ఉంటుంది. ప్రయోజనం తప్పకుండా ఉంటుంది. వేదాలు ఉంటాయి. ఎందుకంటే వెనకనున్న వారికి వాటి ఉపయోగం ఉంది. అక్కడి నుంచే చర్చ ఆరంభమవుతుంది.

దీని తరువాత యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు కర్మను చేయు సమయంలో తీసుకోవలసిన జాగ్రత్తలను ప్రతిపాదించాడు.

*శ్లో ॥ కర్మణ్యేవాధి కారస్తే మా ఫలేషు కదాచన ।*
*మా కర్మ ఫల హేతుర్భూర్మాతే సంఙ్గోస్త్వ కర్మణి ॥**47**॥*

కర్మ చేయడానికే నీకు అధికారం ఉంది. ఫలం ఆశించడానికి కాదు. ఫలం లేదనే అనుకో. ఫలాన్ని ఆశించేవాడివి కాకూడదు. మరియు కర్మ చేయడంలో అశ్రద్ధ కూడా ఉండకూడదు.

ఇప్పటి వరకు యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు ముప్పైతొమ్మిదో శ్లోకంలో 'కర్మ' శబ్దాన్ని ఉపయోగించాడు, కానీ కర్మ ఏమిటన్నదీ, అది చేయడమెలాగన్నదీ చెప్పలేదు. ఆ కర్మ యొక్క విశిష్టతలని స్పష్టం చేస్తూ ఇలా చెప్పాడు.

1) అర్జునా! ఈ కర్మ వలన నీవు కర్మల యొక్క బంధం నుంచి ముక్తుడివవుతావు.

2) అర్జునా! ఇందులో ఆరంభం యొక్క అంటే భీజం యొక్క నాశనం లేదు. మొదలు చేసిన తరువాత దానిని నశింపజేసేందుకు ప్రకృతి వద్ద ఏ ఉపాయం ఉండదు.

3) అర్జునా! స్వర్గం, రిద్ధులూ మరి సిద్ధులలో యిరికించి నిలబెట్టు నటువంటి, సీమిత ఫల రూపమైన దోషం కూడా ఇందులో లేదు.

4) అర్జునా! ఈ కర్మ యొక్క స్వల్ప సాధన కూడా జన్మ- మరణాల భయం నుంచి ఉద్ధరించే దవుతుంది. కానీ, యిప్పటి వరకూ యీ కర్మ యేమిటన్నది అతడు చెప్పలేదు. ఎలా చేయాలి? ఈ అధ్యాయంలోని నలభై ఒకటో శ్లోకంలో అతను అంటాడు-

5) అర్జునా! ఇందులో నిశ్చయాత్మకమైన బుద్ధి ఒక్కటే. క్రియ ఒక్కటే. అంటే అనంత క్రియలు చేసేవారు భజన చేయరా?

శ్రీ కృష్ణుడు ఇలా అంటాడు- వారు కర్మ చేయరు. దానికి కారణం చెపుతూ అతను ఇలా అంటాడు- అవివేకుల బుద్ధి అనంత శాఖలు కలదై ఉంటుంది, కాబట్టి వారు అనంత క్రియలను విస్తిరింపచేసుకొంటారు. వారు భేషజమైన, శోభాయుక్త మాటలతో ఈ క్రియల్ని వ్యక్తం కూడా చేస్తారు. వారి మాటల ముద్ర ఎవరి మనస్సుపై పడుతుందో వారి బుద్ధి కూడా నష్టమై పోతుంది. కనుక నిశ్చయాత్మక క్రియ ఒక్కటే, కానీ ఆ క్రియయేమిటన్నది అతడు చెప్పలేదు.

నలభై ఏడవ శ్లోకంలో అతను ఇలా అంటాడు ''అర్జునా! కర్మ చేయడానికే నీకు అధికారం ఉంది, ఫలం ఆశించడానికి లేదు. ఫలాన్ని ఆశించే వాడివికాకు, మరియు కర్మను చేయడంలో అశ్రద్ధ చూపకు, అంటే నిరంతరం చేయడానికై, అందులో లీనమై, కర్మను చేస్తూ

ఉండు, కానీ ఆ కర్మ యేమిటన్నది అతను చెప్పలేదు. సాధారణంగా ఈ శ్లోకాన్ని ఉదహరిస్తూ లోకులు అంటారు ''ఏదైనా కర్మ చేయి, కానీ ప్రతిఫలాన్ని ఆశించకు'' అంతే నిష్కామ కర్మయోగం అంటే అని. కానీ ఇప్పటి వరకు కర్మ ఏమిటన్నది శ్రీకృష్ణుడు చెప్పనే లేదు. దేన్నైతే చేయాలో, దానిని గురించి చెప్పలేదు. 'కర్మ యిచ్చే దేమిటి? మరియు కర్మ చేసేటప్పుడు తీసుకొనవలసిన జాగ్రత్త ఏమిటి? కర్మ యొక్క విశిష్టతలను చెప్పాడు. అంతే. ప్రశ్న ప్రశ్నగానే మిగిలి పోయింది. దాన్ని యోగేశ్వరుడు ముమ్ముందు మూడు-నాలుగు అధ్యాయాలలో స్పష్టం చేస్తాడు.

దీనినే పునరుద్ఘాటిస్తూ ఇలా అంటాడు-

శ్లో ॥ *యోగస్థః కురు కర్మాణి సంఙ్గం త్యక్త్వా ధనంజయ।*
*సిద్ధ్య సిద్ధ్యోః సమోభూత్వా సమత్వం యోగ ఉచ్యతే ॥**48**॥*

ధనంజయా ! ఆసక్తిని మరియు సంగదోషాన్ని త్యజించి సిద్ధి మరియు అసిద్ధుల పట్ల సమభావం ఉంచుతూ, యోగంలో స్థితుడవై కర్మ చెయ్యి. ఏ కర్మ? నిష్కామ కర్మ చెయ్యి. 'సమత్వం యోగ ఉచ్యతే' ఆ సమత్వ భావమే యోగం అనబడుతుంది. అసమానత్వం లేని ఆ భావాన్ని సమత్వం అంటారు. బుద్ధులు-సిద్ధులు అసమత్వాన్ని కలిగిస్తాయి. ఆసక్తి మనల్ని అసముల్ని చేస్తుంది, ప్రతిఫలాకాంక్ష అసమత్వాన్ని కలిగిస్తుంది. కాబట్టి ప్రతిఫలం కోరకూడదు. అయినా కానీ కర్మ చేయడంలో, అశ్రద్ధ చూపకూడదు. చూచిన వినిన, అన్ని వస్తువులపై ఆసక్తిని త్యాగం చేసి, ప్రాప్తి మరియు అప్రాప్తుల విషయంలో ఆలోచించకుండా, కేవలం యోగంలో స్థిరుడవై కర్మ చెయ్యి. యోగంలో మనస్సు చంచలం కాకూడదు.

యోగం ఒక పరాకాష్ఠ స్థితి. ప్రారంభిక స్థితి కూడా ఒకటి ఉంటుంది. ప్రారంభంలో కూడా మన దృష్టి లక్ష్యం పైనే ఉండాలి. అందుచేత యోగంపై దృష్టి ఉంచుతూ కర్మను ఆచరించాలి. సమత్వభావం అంటే సిద్ధి మరియు అసిద్ధిలలో సమభావమే యోగం అనబడుతుంది. దేనినైతే సిద్ధి మరియు అసిద్ధి విచలితం చేయలేదో, ఎందులోనైతే అసమత్వం పుట్టదో, అలాంటి భావం కావడం వలన దీన్ని సమత్వయోగం అంటారు. ఇది ఇష్ట దైవంతో సమత్వాన్ని లభింప జేస్తుంది. కాబట్టే దీన్ని సమత్వయోగం అంటారు. కోరికలు సదా త్యాగం చేయబడతాయి, కాబట్టి దీన్నే నిష్కామ కర్మయోగం అంటారు. కర్మ చేయాలి, కాబట్టి దీన్నే కర్మయోగం అంటారు. పరమాత్మునితో కలుపుతుంది, కాబట్టి దీనిపేరు యోగం. యోగం అంటే కలవడం. సిద్ధి మరియు అసిద్ధులలో సమభావం ఉండేటట్లుగా, ఆసక్తి కలుగకుండు నట్లుగా, ప్రతి ఫలం పట్ల కోరిక ఉండకుండునట్లుగా, దీనిలో, భౌద్ధిక స్థాయిలో, జాగ్రత్త పడాలి. కాబట్టే ఈ నిష్కామ కర్మయోగం బుద్ధి యోగం అని కూడ అనబడుతుంది.

శ్లో ॥ *దూరేణ హ్యవరం కర్మ బుద్ధి యోగా ద్ధనంజయ।*
*బుద్ధౌ శరణమన్వి చ్ఛ కృపణాః ఫలహేతవః ॥**49**॥*

ధనంజయా! **'అవరం కర్మ'** -నికృష్టకర్మ, కోరికలతో చేయబడే కర్మ, బుద్ధి యోగానికి బహు దూరం. ప్రతిఫలాన్ని ఆశించేవారు కృపణులు. వారు ఆత్మతో ఉదారంగా వ్యవహరించరు.

కనుక సమత్వ బుద్ధి యోగాన్ని శరణు పొందుము. ఆశించిన కోరిక లభించినా కూడా, దానిని అనుభవించేటందుకు శరీరాన్ని ధరించక తప్పదు. అలా పునరాగమనం ఉండేటట్లయితే కళ్యాణం, మేలు ఎలా సాధ్యపడుతుంది? సాధకుడు మోక్షానికై కూడా కోరికను ఉంచుకోకూడదు. ఎందుకంటే కోరికల నుంచి ముక్తి పొందటమే మోక్షం కదా! ప్రతిఫలం గూర్చి విచారించడం చేత సాధకుని సమయం వృథా అవుతుంది మరియు ఫలం ప్రాప్తించినప్పుడు అతడు ఆ ప్రతిఫలంలో ఇరుక్కొని పోతాడు. అతని సాధన సమాప్తమయి పోతుంది. ఆ తరువాత అతను ఎందుకు భజన చేయాలి? అక్కడి నుంచే అతను దారి తప్పి పోతాడు. కాబట్టి సమత్వ బుద్ధితో యోగాచరణ చేయాలి.

జ్ఞాన మార్గాన్ని కూడా శ్రీకృష్ణుడు బుద్ధి యోగ మంటూ వివరిస్తాడు, అర్జునా! ఈ బుద్ధి నీకు జ్ఞాన యోగం విషయంలో చెప్పబడింది, మరియు యిక్కడ నిష్కామ కర్మ యోగం కూడా బుద్ధి యోగం అనబడింది. వాస్తవానికి రెండింటిలో బుద్ధిలోనూ, దృష్టికోణంలో మాత్రమే భేదం ఉంది. మొదటి దానిలో లాభ నష్టాల రికార్డు ఉంచుకొని, దాన్ని పరీక్షిస్తూ నడవ వలసి ఉంటుంది. రెండవ దానిలో కూడా భౌద్ధిక స్థాయిలో సమత్వాన్ని చూపించాలి. కాబట్టే దీన్ని సమత్వ బుద్ది యోగం అంటారు. కాబట్టి ధనంజయా నీవు సమత్వ బుద్ధి యోగాన్ని ఆశ్రయించు, ఎందుకంటే ప్రతిఫలాకాంక్షులు అత్యంత కృపణులు.

*శ్లో ॥ బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృత దుష్కృతే ।*
*తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలం ॥**50**॥*

సమత్వ బుద్ధితో యుక్తుడైన పురుషుడు పుణ్యం-పాపం రెండిటినీ ఈ లోకంలోనే త్యాగం చేస్తాడు. వాటితో చుట్టు బెట్టుకుపోడు. కాబట్టి సమత్వ బుద్ధి యోగం కొరకు ప్రయత్నం చెయ్యి. ''యోగః కర్మసు కౌశలమ్''- సమత్వ బుద్ధితో కూడిన కర్మల ఆచరణలో చూపే కౌశలమే యోగం.

ప్రపంచంలో కర్మ చేయడం పై రెండు దృష్టి కోణాలు ప్రచారంలో ఉన్నాయి. లోకులు కర్మ చేస్తే ప్రతిఫలాన్ని ఆశిస్తారు. లేక ప్రతిఫలం దొరక్కపోతే కర్మం చేయనించరు. కానీ యోగేశ్వరుడు శ్రీకృష్ణుడు ఈకర్మలను బంధనకారులంటాడు, 'ఆరాధనే ఏకమాత్ర కర్మగా భావించాడు. ఈ అధ్యాయంలో అతను కర్మ పేరు మాత్రం చెప్పాడు. అధ్యాయం-3లోని తొమ్మిదవ శ్లోకంలో దాని నిర్వచనాన్ని యిచ్చాడు. మరియు నాలుగవ అధ్యాయంలో కర్మ స్వరూపాన్ని గురించి విస్తారంగా చర్చించాడు. ప్రస్తుత శ్లోకంలో శ్రీకృష్ణుడు ప్రాపంచిక ఆచారాలకు వ్యతిరేకంగా కర్మను చేసే కళను చూపించాడు -కర్మను చెయ్యి, శ్రద్ధా పూర్వకంగా చెయ్యి; కానీ ప్రతిఫలంపై అధికారాన్ని స్వేచ్ఛగా వదిలేయి. ప్రతిఫలం ఎక్కడికి పోతుంది? ఇదే కర్మలను చేసే కౌశలం. నిష్కామ సాధన యొక్క సమగ్రశక్తి ఈ ప్రకారంగా కర్మలోనే ఇమిడి వుంటుంది. ఆరాధన కోసమే కదా ఈ శరీరం ఉంది. 'ఎల్లప్పటికీ కర్మ చేస్తూనే ఉండాలా లేక దీనికి పరిణామం కూడా లభిస్తుందా? అన్న దాన్ని గురించిన జిజ్ఞాస స్వాభావికమే. దీన్ని గురించి ఆలోచిద్దాం-

*శ్లో ॥ కర్మజం బుద్ధి యుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః।*
*జన్మ బన్ధ వినిర్ముక్తాః పదం గచ్ఛన్త్య నామయమ్ ॥**51**॥*

బుద్ధి యోగంగల జ్ఞానులు కర్మలచే ఉత్పన్నమయ్యే ప్రతిఫలాన్ని త్యాగం చేసి, జన్మ–మృత్యువుల బంధం నుంచి ముక్తి పొందుతారు. వారు నిర్ధోషమైన, అమృతమయమైన పరమపదాన్ని పొందుతారు.

ఇక్కడ మూడు బుద్ధులు యొక్క చిత్రణ ఉంది. మొదటిది వివేకంతో కూడినది (శ్లో 31–39). దీని ఫలితాలు రెండు– స్వర్గము, శ్రేయస్సు. రెండవది నిష్కామ కర్మాచరణం (శ్లో 39–51) దీని ఫలితం ఒకటే– భగవంతునితో ఐక్యమేర్పడి, తద్వారా జనన మరణ భయం నుండి విముక్తి. ఈరెండే యోగాచరణకి చూపబడిన మార్గాలు, ఇక బుద్ధి యొక్క మూడవ ప్రవృత్తి, అనంత శాఖలుగల కర్మలని ఆచరిస్తూ జనన మరణ వలయంలో చిక్కుకొన్న మూర్ఖులు అనుసరించేది.

అర్జునుడి యొక్క దృష్టి త్రిలోకాల సామ్రాజ్యం మరియు దేవలతపై ఆధిపత్యం వరకే పరిమితమై ఉండింది. వీటికోసం కూడా అతను యుద్ధంలో ప్రవృత్తుడు కాలేదు. ఇక్కడ శ్రీకృష్ణుడు అతనికి ఒక నవీన సత్యాన్ని ఉద్ఘాటించాడు– ఆసక్తి రహితమైన కర్మ ధ్వారా అనామయ పదం ప్రాప్తిస్తుంది. నిష్కామ కర్మ యోగం మృత్యువుకు ప్రవేశంలేని పరమపదాన్ని ఇప్పిస్తుంది. ఈ కర్మలో ప్రవృత్తి ఎప్పుడు లభిస్తుంది ?

*శ్లో ॥ యదాతే మోహ కలిలం బుద్ధి ర్వ్యతితరిష్యతి ।*
*తదా గన్తాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ ॥**52**॥*

ఏ కాలంలో నైతే నీ (ప్రతి సాధకుడి) బుద్ధి మోహరూపమైన ఊబిని పూర్తిగా దాటి వేస్తుందో, లేశమాత్రంగా కూడా మోహం ఉండకుండా, పుత్రులలో గానీ, ధనంపై గానీ గౌరవ ప్రతిష్టల పైన గానీ ఉండదో– వీటి అన్నిటితో బంధం తెగి పోతుందో, ఆ సమయంలో ఏదైతే విన యోగ్యమో, దానిని నీవు వినగలుగుతావు. మరియు విన్న దానిని అనుసరించి వైరాగ్యాన్ని సంపాదించుకోగలుగుతావు. అంటే దానిని ఆచరణలోకి తేగలుగుతావు. ఇప్పుడైతే వినయోగ్యమైన దానిని నీవు వినునే లేదు. ఇంక ఆచరణలోకి తెచ్చే ప్రశ్నే లేదు. ఈ యోగ్యతను స్పష్టం చేస్తూ ఇలా అంటాడు–

*శ్లో ॥ శ్రుతి విప్రతి పన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా ।*
*సమాధా వచలా బుద్ధి స్తదా యోగ మవాప్స్యసి ॥**53**॥*

అనేక ప్రకారాలైన వేద వాక్యాలను విని విచలితమైన నీ బుద్ధి ఎప్పుడైతే పరమాత్మ స్వరూపంలో సమాధిస్థితిపై అచలంగా, స్థిరంగా ఉండి పోతుందో, అప్పుడు నీవు సమత్వ యోగాన్ని పొందుతావు. పూర్ణమైన సమస్థితిని 'అనామయ పరమపదాన్ని పొందుతావు. ఇదే యోగం యొక్క పరాకాష్ఠ, మరియు ఇదే అప్రాప్తాన్ని పొందడం కూడా. వేదాల నుండి విద్య దొరుకుతుంది. కానీ శ్రీకృష్ణుడు ఇలా అంటాడు. 'శ్రుతి విప్రతి పన్నా'– శ్రుతుల యొక్క

అనేక సిద్ధాంతాల్ని వినడంచేత బుద్ధి విచలిత మయిపోతుంది. సిద్ధాంతాలు అనేకం విన్నా, లోకులు వినడానికి యోగ్యమైన దానికి దూరంగా ఉంటారు.

ఈ విచలితమైన బుద్ధి ఏ సమయంలో సమాధిలో స్థిరమై పోతుందో, అప్పుడు నీవు యోగ పరాకాష్ఠమైన అమృత పదాన్ని పొందుతావు. అనామయ పదంలో స్థితులైన, సమాధిలో బుద్ధి స్థిరమైన ఆ మహాపురుషులు ఎలా ఉంటారన్న విషయంలో అర్జునుడికి స్వాభావికంగా ఉత్కంఠ కలిగింది. అతను ఇలా ప్రశ్నించాడు-

అర్జున ఉవాచ

*శ్లో ॥ స్థిత ప్రజ్ఞస్య కా భాషా సమాధి స్థస్య కేశవ।*
*స్థితధీః కిం ప్రభాషేత కిమాసీత వ్రజేత కిమ్ ॥**54**॥*

'సమాధీయతే చిత్తం యస్మిన్ స ఆత్మా 'ఎవ సమాధిః' -దేనిలోనైతే చిత్తాన్ని సమాధాన పరుస్తామో ఆ ఆత్మయే సమాధి. అనాది తత్త్వంలో ఎవరైతే సమత్వాన్ని పొందుతారో, అతడినే సమాధిస్థుడంటారు. అర్జునుడు అడిగాడు ''కేశవా! సమాధిస్థుడైన, స్థిర బుద్ధి గలవాడైన మహాపురుషుని లక్షణాలు ఏమిటి? స్థిత ప్రజ్ఞుడైన పురుషుడు ఎలా మాట్లాడుతాడు? అతను ఎలా కూర్చుంటాడు? అతను ఎలా నడుస్తాడు? ఈ నాలుగు ప్రశ్నలు అర్జునుడు అడిగాడు. వీటిపై భగవంతుడైన శ్రీకృష్ణుడు స్థిత ప్రజ్ఞుడి లక్షణాల గురించి చెబుతూ ఇలా అన్నాడు-

శ్రీ భగవానువాచ-

*శ్లో ॥ ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్ ।*
*ఆత్మన్యే వాత్మనా తుష్టః స్థిత ప్రజ్ఞస్త దోచ్యతే ॥**55**॥*

పార్థా! ఎప్పుడైతే మనుష్యుడు మనస్సులో ఉన్న అన్ని కోరికలను త్యాగం చేస్తాడో, అప్పుడు అతను ఆత్మచే ఆత్మలో సంతుష్టుడైన స్థిర బుద్ధిగల వాడనబడతాడు. కోరికలను త్యాగం చేస్తేనే, ఆత్మ యొక్క దిగ్దర్శనమవుతుంది. అటువంటి ఆత్మారాముడే, ఆత్మ తృప్తి పొందిన మహాపురుషుడే స్థిత ప్రజ్ఞుడు.

*శ్లో ॥ దుఃఖేష్వను ద్విగ్నమనాః సుఖేషు విగత స్పృహః।*
*వీతరాగ భయక్రోధః స్థిత ధీర్మునిరుచ్యతే ॥**56**॥*

దైహికమైన, దైవికమైన మరియు భౌతికమైన దుఃఖాలలో ఎవరి మనస్సైతే ఉద్విగ్నమవదో, సుఖాల ప్రాప్తిపట్ల ఎవరికి ఆశ లేదో మరియు ఎవరి రాగం, భయం మరియు క్రోధం నష్టమయి పోయాయో, అటువంటి మననశీలత చరమ సీమను చేరిన ముని, స్థిత ప్రజ్ఞుడనబడును. అతని అన్య లక్షణాలను ఇలా వివరించాడు.

శ్లో ॥ యః సర్వత్రానభిస్నేహస్తత్తత్ప్రాప్య శుభాశుభమ్ ।
నాభినన్దతి నద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥**57**॥

ఏ పురుషుడైతే సర్వత్ర స్నేహ రహితుడై వుంటాడో, శుభా శుభాలను పొంది ప్రసన్నుడు కాడో లేక ద్వేష భావ పూరితుడుకాడో, అతని బుద్ధి స్థిరమయినది. పరమాత్మ –స్వరూపాన్ని ప్రదానం చేయించేదే శుభం. ప్రకృతి వైపు తీసుకొని వెళ్ళేదే అశుభం. కానీ స్థిత ప్రజ్ఞుడైన పురుషుడు అనుకూలమైన పరిస్థితులలో ప్రసన్నుడూ కాడు, ప్రతికూలమైన పరిస్థితులలో ద్వేష పూరితుడూ కాడు. ఎందుకంటే ప్రాప్తి యోగ్యమైన వస్తువు అతని నుంచి వేరుగా లేదు. పతితుణ్ణి చేయగల ఏ వికారాలూ అతనిలో లేవు. అంటే సాధన వలన అతనికి స్వప్రయోజన మంటూ ఏదీ లేదు. అటువంటి వ్యక్తి స్థిత ప్రజ్ఞుడు అనబడును.

శ్లో ॥ యదా సంహరతే చాయం కూర్మోఙ్గానీవ సర్వశః।
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥**58**॥

ఎలాగైతే తాబేలు తన శరీర భాగాల్ని తనలోనే సంకోచించు కుంటుందో, సరిగ్గా అలాగే ఈ పురుషుడు ఎప్పుడైతే అన్ని వైపుల నుంచి తన ఇంద్రియాల్ని సంకోచించుకుంటాడో, అప్పుడు అతని బుద్ధి స్థిరమవుతుంది. ప్రమాదాన్ని గుర్తించుతూనే తాబేలు ఏ ప్రకారంగా తన శిరస్సునూ, కాళ్ళనూ లోపలికి లాగేసుకొంటుందో, సరిగ్గా ఇదే ప్రకారంగా ఏ పురుషుడైతే విషయాలలో విచరించే ఇంద్రియాల్ని అన్ని వైపులనుంచి లాగేసుకొని హృదయదేశంలో ఎప్పుడు నిరోధించుకుంటాడో, ఆ కాలంలో ఆ పురుషుని బుద్ధి స్థిరమవుతుంది. కానీ యిదొక దృష్టాంతం మాత్రమే. ప్రమాదం తొలగిపోగానే తాబేలు తన అవయవాల్ని మరల వ్యాకోచింప చేస్తుంది. ఇదే ప్రకారంగా స్థితప్రజ్ఞుడైన మహా పురుషుడు కూడా విషయాల రసాస్వాదన చేయడం మొదలు పెడ్తాడా? ఈ విషయం గురించి ఇలా అంటాడు–

శ్లో ॥ విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః।
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే॥**59**॥

ఇంద్రియాల ద్వారా విషయాలను గ్రహించనటువంటి పురుషులలో, విషయాలు వారు గ్రహించరు కాబట్టి నివృత్తమయిపోతాయి. కానీ వాటిపై రాగం నివృత్తమవదు. ఆసక్తి ఉంటుంది. మొత్తం ఇంద్రియాల్ని విషయాలనుంచి లాగివేసుకొన్న నిష్కామ కర్మడియొక్క రాగం కూడా 'పరం దృష్ట్వా' పరమతత్త్వమైన పరమాత్ముని సాక్షాత్కారంతో నివృత్తమయి పోతుంది.

మహాపురుషుడు తాబేలు లాగా తన ఇంద్రియాల్ని విషయాలలో విస్తరించడు. ఒకసారి ఇంద్రియాలు లాగి వేయబడితే, అప్పుడు సంస్కారం నశించి పోతుంది. తిరిగి అవి పైకి రావు. నిష్కామ కర్మ యోగ– ఆచరణ ద్వారా పరమాత్ముడి ప్రత్యక్ష దర్శనంతో బాటుగా ఆ పురుషునికి విషయాలపట్ల గల రాగం కూడా నివృత్తమయిపోతుంది. సాధారణంగా చింతనా– మార్గంలో పట్టుదల వహిస్తారు. పట్టుదలగా యింద్రియాల్ని నిరోధించినట్లయితే విషయాల నుండి అయితే నివృత్తులయి పోతారు.

కానీ మనస్సులో వాటికి సంబంధించిన ఆలోచనలు, రాగం నిండి ఉంటాయి. ఈ ఆసక్తి 'పరం దృష్ట్వా' – పరమాత్ముని సాక్షాత్కరించు కొన్న తర్వాతనే, నివృత్త మవుతుంది, అంతకు ముందు కాదు.

'పూజ్య గురు మహారాజుల వారు' ఈ సంబంధంలో తనదైన ఒక సంఘటనను గురించి చెప్పేవారు. గృహాన్ని త్యాగం చేయడానికి మునుపు ఆయనకు మూడుసార్లు ఆకాశవాణి వినిపించింది. నేను అడిగాను, ''గురూజీ! మీకు ఆకాశవాణి ఎందుకు వినిపించింది? మాకు వినిపించలేదే!'' అప్పుడు గురువు గారిలా అన్నారు– ''హో! ఈ శంక నాకూ ఉండింది. అప్పుడు అనుభవం వల్ల తెలిసిందేమిటంటే నేను గత ఏడు జన్మల నుండీ సాధువుగా ఉన్నాను. నాలుగు జన్మలు కేవలం సాధువు వేషం ధరించుకొని, ఒకప్పుడు నామాలు పెట్టుకొని, ఒకప్పుడు విభూతి పూసుకొని, ఒకప్పుడు కమండలం చేత బుచ్చుకొని తిరుగుతూ ఉండేవాణ్ణి. యోగక్రియ గురించిన జ్ఞానం లేకుండేది. కానీ గత మూడు జన్మలనుంచి సాధువు అంటే ఎలా ఉండాలో అలాంటి సాధువుగా ఉన్నాను. నాలో యోగక్రియ జాగృతమైంది. పోయిన జన్మలో మోక్షం అయిపోవచ్చింది, నివృత్తి అయిపోవచ్చింది, కాగా రెండు కోరికలు మిగిలి పోయాయి. ఒకటి స్త్రీ మరియు రెండోది గాంజాయి. లోలోపల మనస్సులో, కోరికలు ఉండేవి, పైకి మాత్రం నేను శరీరాన్ని ధృఢంగా ఉంచాను. మనస్సులో కోరికలు ఉండిపోయాయి, అందుకే, మళ్ళీ జన్మ నెత్త వలసి వచ్చింది. జన్మ ఎత్తగానే భగవంతుడు కొద్ది కాలంలోనే అన్నీ చూపించి–తినిపించి నివృత్తి యిప్పించాడు, రెండు మూడు దెబ్బలు తినిపించాడు, మరి సాధువును చేసేశాడు.

సరిగ్గా ఇదే మాట శ్రీకృష్ణుడు అంటాడు– ఇంద్రియాల ద్వారా విషయాల్ని స్వీకరించని పురుషునికి కూడా విషయాల నుంచి నివృత్తి కలిగి పోతుంది. కానీ సాధన ద్వారా పరమపురుషుడైన పరమాత్ముని సాక్షాత్కారం చేసుకొన్నప్పుడే, ఆ విషయాలపట్ల రాగం కూడా నివృత్తమవుతుంది. అందుచేత ఎప్పటి వరకు సాక్షాత్కారం జరగదో అప్పటివరకు, 'కర్మ' చేయాలి.

*'ఉర్ కఛు ప్రథమ వాసనా రహీ। ప్రభుపద్ ప్రీతి సరిత్ సో బహీ ।*
(రామచరిత మానస్– 5/48/6)

ఇంద్రియాల్ని విషయాల నుంచి లాగేయడం కఠినమైన పని. దీనిని స్పష్టం చేస్తూ ఇలా చెప్తాడు.

శ్లో ॥ *యతతో హ్యాపి కౌంతేయ పురుషస్య విపశ్చితః।*
*ఇన్ద్రి యాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః॥* ***60***॥

కౌంతేయా! ప్రయత్నం చేసే మేధావి పురుషుల యొక్క ప్రమథనశీలమయిన ఇంద్రియాలు అతని మనస్సును బలవంతంగా ఓడించేస్తాయి, విచలితుణ్ణి చేసేస్తాయి. కాబట్టి–

శ్లో ॥ *తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః।*
*వశే హి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥61॥*

ఆ సమస్త ఇంద్రియాలను వశంలో ఉంచుకొని, యోగంతో యుక్తుడవై మరియు సమర్పణ భావంతో కూడుకుని, నా ఆశ్రితుడవు కమ్ము, ఎందుకంటే ఏపురుషుని యొక్క ఇంద్రియాలు వశంలో ఉంటాయో, అతని బుద్ధే స్థిరమవుతుంది. ఇక్కడ యోగేశ్వరుడయిన శ్రీకృష్ణుడు సాధన యొక్క నిషేధాత్మక పక్షాలతో బాటు దాని యొక్క విధేయాత్మక పక్షాన్ని గురించి గట్టిగా చెప్పాడు. కేవలం నియంత్రణ మరియు నిరోధం వలన ఇంద్రియాలు వశంలోకి రావు. సమర్పణతో కూడిన ఇష్టదేవుని చింతన అనివార్యం. ఇష్టదేవుని చింతన లేకపోతే, విషయ చింతన మొదలవుతుంది. దాని దుష్పరిణామం గురించి శ్రీకృష్ణుని మాటలలోనే వినండి.

శ్లో ॥ *ధ్యాయతో విషయాన్ పుంసః సంఙ్గస్తేషూ పజాయతే।*
*సంఙ్గాత్సంజాయతే కామః కామాత్క్రోధోऽభిజాయతే॥62॥*

విషయాలను గురించి చింతన చేయు పురుషునికి, ఆవిషయాలలో ఆసక్తి పెరుగుతుంది. ఆసక్తి వలన కోరిక ఉత్పన్నమవుతుంది. కోరిక నెరవేరడంలో ఆలస్యమయితే క్రోధం ఉత్పన్నమవుతుంది. క్రోధం దేనికి జన్మనిస్తుంది?

శ్లో ॥ క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్స్మృతి విభ్రమః ।
స్మృతి భ్రంశా ద్బుద్ధినాశో బుద్ధి నాశాత్ప్రణశ్యతి ॥**63**॥

క్రోధం వలన విశేష మూఢత అంటే అవివేకం ఉత్పన్నమవుతుంది. నిత్య-అనిత్య వస్తువుల యొక్క విచక్షణ ఉండదు. అవివేకం వలన అర్జునుడికి అయినట్లు స్మరణ శక్తి నశించి పోతుంది! ''భ్రమతీవచమే మనః అని గీత చివరలో అతడు అంటాడు- 'నష్టో మోహః స్మృతిర్లబ్ధా!', 'ఏం చేయాలి- ఏం చేయకూడదు' అనే నిర్ణయం చేయలేడు. స్మృతి భ్రమిత (నష్ట) మవడం వలన యోగ-పరాయణం కావలసిన బద్ధి నష్టమై పోతుంది. మరియు బుద్ధి నాశనం అయిపోవడంచే ఆపురుషుడు తన శ్రేయస్సాధన నుండి పతితుడయి పోతాడు.

విషయాల చింతన చేయకూడదన్న దానిని ఇక్కడ శ్రీకృష్ణుడు నొక్కి వక్కాణించాడు. సాధకునకు నామము, రూపము, లీల, మరియు ధామం- వీటిలో ఏదో ఒక దాన్నిపై ఎల్లప్పుడూ బుద్ధి నిలకడగా ఉండాలి. భజన చేయడంలో వ్యవధానం ఇస్తే, మనస్సు విషయాలవైపు మళ్ళుతుంది. విషయాల చింతనచే ఆసక్తి పుడుతుంది. ఆసక్తి వలన ఆ విషయంపై కోరిక సాధకుడి అంతర్మనస్సులో ఏర్పడుతుంది. కోరిక తీరడంలో వ్యవధానం వలన క్రోధం. క్రోధం వలన అవివేకం, అవివేకం వలన స్మృతి భ్రమించడం మరియు స్మృతి భ్రవించడం వలన బుద్ధి నాశనం కలుగుతాయి. నిష్కామ కర్మయోగాన్నే బుద్ధి యోగం అని కూడా అంటారు. ఎందుకంటే కోరికలు కలగకుండా, ప్రతి ఫలాపేక్ష లేకుండుట్లుగా బుద్ధి స్థాయిలో ఆలోచించ వలసి ఉంటుంది. కోరిక ఏర్పడితే, ఈ బుద్ధి యోగం నాశనమైపోతుంది- **'సాధన కరియ**

**విచార హీన మన శుద్ధి హోయ నహితైసే'** ఆలోచనా శూన్యుడైన పురుషుడు, శ్రేయోసాధన నుండి పతితుడైపోతాడు. సాధన క్రమం తెగి పోతుంది, కానీ ఎప్పటికీ నష్టమయి పోదు. అనుభవించిన తరువాత సాధన ఎక్కడి నుంచయితే అవరుద్ధమయిందో అక్కడి నుంచే మళ్ళీ ప్రారంభమవుతుంది.

ఇది విషయోన్ముఖుడైన సాధకుడికి పట్టేగతి. స్వాధీనమైన అంతః కరణం గల సాధకుడు ఏ గతిని పొందుతాడు? దీనిని గురించి శ్రీకృష్ణుడు ఇలా అంటాడు–

శ్లో ॥ రాగద్వేష వియుక్తైస్తు విషయానిన్ద్రియై శ్చరన్ ।
ఆత్మ వశ్యైర్విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి ॥**64**॥

ఆత్మ విధిని పొందిన ప్రత్యక్షదర్శి అయిన మహాపురుషుడు రాగ–ద్వేషాలతో రహితుడై, వశం చేసుకొన్న తన ఇంద్రియాల ద్వారా 'విషయాన్ చరన్' –విషయాలలో విహరిస్తూ కూడా 'ప్రసాద మధిగచ్ఛతి'– అంతః కరణం యొక్క నిర్మలత్వాన్ని పొందుతాడు. అతను తన భావ దృష్టిలో ఉంటాడు. మహాపురుషులకు విధి నిషేధాలు ఉండవు. అతనికి ఎక్కడా అశుభం ఉండదు. అతడు తన్ను రక్షించుకోవల్సినది, అతను కోరుకో గలిగినది అయిన శుభం ఎక్కడా మిగిలి ఉండదు. అంటే అన్ని శుభాలను అతను పొందే ఉంటాడు. ఎటువంటి అశుభం వుండదు.

శ్లో ॥ ప్రసాదే సర్వ దుఃఖానాం హానిరస్యోపజాయతే।
ప్రసన్న చేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే ॥**65**॥

భగవంతుని పూర్ణ కృపా ప్రసాదమైన భగవత్తత్వంతో సంయుక్తుడైనప్పుడు అతనికి ఎటువంటి దుఃఖాలూ లేకుండా పోతాయి. 'దుఃఖాలయం అశాశ్వతం' అయిన ప్రపంచం కూడా లేకుండా పోతుంది మరియు ప్రసన్న చిత్తుడైన ఆ పురుషుని బుద్ధి శీఘ్రంగానే పూర్తిగా స్థిరమై పోతుంది. కానీ ఎవరైతే యోగ యుక్తులు కారో, వారి దశను గురించి ఇలా అంటాడూ–

శ్లో ॥ నాస్తి బుద్ధిర యుక్తస్యన చాయుక్తస్య భావనా ।
న చాభావయతః శాన్తి రశాన్తస్య కుతః సుఖమ్ ॥**66**॥

యోగ సాధన రహితుడైన పురుషుని అంతః కరణంలో నిష్కామ కర్మతో యుక్తమైన బుద్ధి ఉండదు. అలాంటి వాని అంతః కరణంలో భావం కూడా ఉండదు. భావనా రహితుడైన పురుషునికి శాంతి ఎక్కడ? మరియు అశాంత పురుషునికి సుఖమెక్కడ? యోగక్రియను చేయుట వలన, ఏదైనా కలలో కనిపించినప్పుడే భావం ఏర్పడుతుంది. 'జానే బిను న హోయి పరతీతీ'. భావం లేకపోతే శాంతి దొరకదు మరియు శాంత రహితుడైన పురుషునికి సుఖం అంటే శాశ్వతం, సనాతనం యొక్క ప్రాప్తి కలగదు.

శ్లో ॥ ఇన్ద్రియాణాం హి చరతాం యన్మనోఽను విధీయతే।
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమి వామ్భసి ॥67॥

నీటిలోని నావను ఏ ప్రకారంగా నైతే వాయువు అపహరించుకొని పోయి, గమ్యానికి దూరం చేస్తుందో, సరిగ్గా అలాగే విషయాలలో చరించే ఇంద్రియాలలో, ఏ యింద్రియంతో కూడి మనస్సు ఉంటుందో, ఆ ఒక్క యింద్రియమే అయుక్తుడైన పురుషుని బుద్ధిని హరించుకు పోతుంది. అందుచే యోగాచరణ అనివార్యం. క్రియాత్మక ఆచరణ పై శ్రీకృష్ణుడు మరల ఇలా అంటాడు–

శ్లో ॥ తస్మాద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః।
ఇన్ద్రియాణీంన్ద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥68॥

దీని వలన హే మహాబాహో! ఏ పురుషుని యొక్క యింద్రియాలు విషయాల నుంచి సర్వదా వశం చేసుకొనబడి ఉంటాయో, అతని బుద్ధి స్థిరమవుతుంది. 'బాహువు' కార్యక్షేత్రం యొక్క ప్రతీక. భగవంతుడు 'మహాబాహుడు', మరియు 'ఆజానుభాహుడు' అనబడతాడు. అతడు కాళ్ళు, చేతులు లేకుండానే సర్వత్ర కార్యం చేస్తాడు. అతనిలో ఎవడైతే ప్రవేశం పొందుతాడో, లేక ఎవ్వరైతే ఆ భగవతత్త్వ దిశలో అగ్రసరుడౌతాడో, అతను కూడా మహాబాహుడే. శ్రీకృష్ణుడు మరియు అర్జునుడు, ఇద్దరినీ 'మహాబాహుడు' అనబడడం జరిగింది.

శ్లో ॥ యా నిశా సర్వ భూతానాం తస్యాం జాగర్తి సంయమీ।
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా, పశ్యతో మునేః ॥69॥

సమస్త భూత–ప్రాణులకు ఆ పరమాత్ముడు రాత్రితో సమానం. ఎందుకంటే కనిపించడు, ఆలోచనలకు అందడు– కాబట్టే రాత్రితో సమానుడు. ఆ రాత్రిపూట, పరమాత్మునిలో సంయమనంగల పురుషుడే చక్కగా చూడగలడు, నడవగలడు, మేల్కొని ఉండగలడు, ఎందుకంటే అక్కడే అతని పట్టుగలదు. యోగి ఇంద్రియాల నియంత్రణ వలన అందులో ప్రవేశం పొందగలడు. ఏ నశ్వరమైన సాంసారిక సుఖభోగాల్లకై సర్వ ప్రాణులు రాత్రింబగళ్ళు పరిశ్రమ చేస్తారో, యోగికి అది రాత్రి.

రమా విలాసు రామ అనురాగీ। తజత బమన జిమి జన బడభాగీ ॥31॥
(రామచరిత మానసం 2/323/8)

ఏ యోగి అయితే పరమార్థ మార్గంలో, నిరంతరం జాగరూకుడై మరియు భౌతిక విషయాలలో సర్వథా నిఃస్పృహుడై ఉంటాడో, అతనే ఆ ఇష్టదైవంలో ప్రవేశం పొందగలడు. అతను ఉండేది ప్రపంచంలోనే అయినా కూడా ప్రపంచం యొక్క ప్రభావం అతనిపై ఉండదు. ఈ రకంగా ఉండే మహాపురుషుని యొక్క చిత్రణను చూద్దాం.–

శ్లో ॥ ఆపూర్యమాణమచల ప్రతిష్ఠమ్
సముద్రమాపః ప్రవిశన్తి యద్వత్ ।
తద్వత్కామా యం ప్రవిశంతి సర్వే
సశాంతి మాప్నోతి న కామకామీ ॥70॥

ఎలాగైతే అన్ని వైపుల నుంచి పరిపూర్ణంగా అచల ప్రతిష్ఠగల సముద్రాన్ని నదుల నీరు అన్ని వైపుల నుంచి చలాయమానం చేయకుండా, గొప్ప వేగంతో వచ్చి అందులో ఇమిడిపోతాయో, సరిగ్గా అలాగే పరమాత్మునిలో స్థితుడైన ప్రజ్ఞుడైన పురుషునిలో సమస్త భోగాలు, వికారాలు ఉత్పన్నమవ కుండానే సమాహితం అయి పోతాయి. అటువంటి పురుషుడే పరమ శాంతిని పొందుతాడు, భోగలాలసుడు కాదు.

భయంకరమైన వేగంతో ప్రవహించే వేల కొద్ది నదులు పంటలను నష్ట పరుస్తూ, హత్యలు చేస్తూ, నగరాలను ముంచుతూ, హాహాకారాలు చేస్తూ, గొప్ప వేగంతో సముద్రంలో కలుస్తాయి, కానీ సముద్రాన్ని ఒక అంగుళం కూడా ఎత్తు చేయలేవు మరియు తక్కువ చేయలేవు, పై పెచ్చు అందులోనే సమాహితమై పోతాయి- సరిగ్గా ఈ ప్రకారంగానే మహా పురుషునిలో కూడా సమస్త భోగాలు అంతే వేగంతో వస్తాయి, కానీ అతనిలో సమాహితమై పోతాయి. ఆ మహాపురుషునిలో శుభాశుభ సంస్కారాలను కలిగించలేవు. యోగి యొక్క కర్మలు తెలుపుగానీ, లేక నలుపుగానీ కావు. ఎందుకంటే ఏ చిత్తములోనైతే సంస్కారాలు పడతాయో, ఆచిత్తం యొక్క నిరోధం మరియు విలీనీకరణం జరిగిపోయింది. దీనితో బాటే భగవత్తత్త్వం అను స్థితి వచ్చింది. ఇప్పుడు సంస్కారాలు పడాలన్నా ఎక్కడ? ఈ ఒక్క శ్లోకంలోనే శ్రీకృష్ణుడు అర్జునుని అనేక ప్రశ్నలకు సమాధానం ఇచ్చాడు. స్థిత ప్రజ్ఞుడైన మహాపురుషుని లక్షణాలు ఏమిటన్నవి అతని జిజ్ఞాస. అతను ఎలా మాట్లాడుతాడు? ఎలా కూర్చుంటాడు? ఎలా నడుస్తాడు? శ్రీ కృష్ణుడు ఒకే ఒక పదంలో జవాబిచ్చాడు, 'అతను సముద్ర సమానుడు', అతనికి ''ఇలా కూర్చో లేక ఇలానడు'' అని విధి-నిషేధాలు ఉండవు. అలాంటి వారు పరమశాంతిని పొందుతారు, ఎందుకంటే వారు సంయమ పురుషులు. భోగలాలసులు శాంతిని పొందలేరు. దీనిని గురించే మరల ఇలా అన్నాడు-

శ్లో ॥ విహాయ కామాన్ యః సర్వాన్ పుమాంశ్చరతి నిఃస్పృహః।
నిర్మమో నిరహంకారః స శాంతి మధి గచ్ఛతి ॥71॥

ఏ పురుషుడైతే సమస్త కోరికలను త్యాగం చేసి! 'నిర్మమః' ''నేను'' మరియు 'నా' అనే భావన, మరియు అహంకారం మరియు కోరిక లేనివాడై వ్యవహరిస్తాడో అతను ఆ పరమశాంతిని పొందుతాడు, దీని తరువాత యింకేదీ పొందవలసినదీ మిగిలి ఉండదు.

శ్లో ॥ ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థనైనాం ప్రాప్య విముహ్యతి।
స్థిత్వాఽస్యామన్త-కాలేఽపి బ్రహ్మ నిర్వాణ మృచ్ఛతి ॥72॥

పార్థా! ఈపైన చెప్పబడిన స్థితి బ్రహ్మను పొందిన పురుషుని యొక్క స్థితి. సముద్ర

సమానుడైన ఆ మహాపురుషునిలో విషయాలు నదులలాగ సమాహితమై పోతాయి. అలాంటి వారు పూర్ణ నియంత్రితులు మరియు ప్రత్యక్షతః పరమాత్మ దర్శకులు. కేవలం 'అహం బ్రహ్మోస్మి' అన్నది చదివేస్తే, లేక కంఠస్థం చేస్తే ఆ స్థితి లభించదు. సాధన చేసి ఆ బ్రహ్మ నిష్ఠలో స్థితులైన వారు శరీరం యొక్క చివరి కాలంలో కూడా బ్రాహ్మోనందాన్నే పొందుతారు.

సారాంశము:

సాధారణంగా కొంతమంది రెండవ అధ్యాయంతో గీత పూర్తయి పోతుందని అంటారు, కానీ, కేవలం కర్మ పేరు మాత్రం చెప్పటంతో కర్మ పూర్తయి పోయేటట్లయితే, అప్పుడు గీత సమాప్తమయిందని ఒప్పుకోవచ్చు. ఈ అధ్యాయంలో యోగేశ్వరుడయిన శ్రీకృష్ణుడు ఏమన్నాడంటే - అర్జునా! దేనినైతే తెలుసుకొని నీవు సంసార బంధం నుంచి ముక్తుడవయి పోగలవో అట్టి నిష్కామ కర్మయోగం యొక్క విషయం గురించి విను, కర్మ చేయడానికి నీకు అధికారం ఉంది, ప్రతిఫలం పట్ల ఎప్పటికీ లేదు. కర్మచేయడంలో అశ్రద్ధ కూడా ఉంచకూడదు. నిరంతరం కర్మ చేయడానికే తత్పరుడవై ఉండు. దీని పరిణామంలో నీవు 'పరం దృష్ట్వా' పరమ పురుషుని దర్శనం చేసి స్థిత ప్రజ్ఞుడవవుతావు, పరమశాంతిని పొందుతావు, కానీ 'కర్మ ఏమిటన్నది చెప్పలేదు.

ఇది 'సాంఖ్యాయోగం' పేరుగల అధ్యాయం కాదు. ఈ పేరు శాస్త్రకారుడు పెట్టినది కాదు. వాఖ్యానకారులు పెట్టినటువంటిది. వారు తమ బుద్ధికి తగినట్లుగా గ్రహిస్తే ఆశ్చర్యమేముంది ?

ఈ అధ్యాయంలో కర్మ యొక్క గొప్పదనం. దానిని చేయడంలో పాటించ వలసిన జాగ్రత్తలు మరియు స్థిత ప్రజ్ఞుడి యొక్క లక్షణాలు చెప్పి శ్రీకృష్ణుడు అర్జునుడి మనస్సులో కర్మ పట్ల ఉత్కంఠను జాగృతం చేసాడు. అతనికి కొన్ని ప్రశ్నలిచ్చాడు. ఆత్మ శాశ్వతమైనది. సనాతమైనది, అది తెలుసుకొని తత్త్వదర్శకుడివి కమ్ము. దీని ప్రాప్తికి రెండు సాధనలు ఉన్నాయి- 'జ్ఞానయోగం మరియు నిష్కామ కర్మ యోగం'.

తన శక్తిని తెలుసుకొని, లాభ నష్టాలను స్వయంగా నిర్ణయించుకొంటూ కర్మలో ప్రవృత్తమవడమే జ్ఞాన మార్గం, మరియు ఇష్టదైవంపై ఆధారపడి సమర్పణ భావంతో కూడి అదే కర్మలో ప్రవృత్తమవడం నిష్కామ కర్మ మార్గం. గోస్వామి తులసీదాసు రెండింటినీ ఈ విధంగా వర్ణించాడు.

> మోరే ప్రౌఢ తనయ సమ గ్యానీ ।
> బాలక సుత సమ దాస అమానీ ॥
> జనహి మోర బల నిజ బల తాహీ।
> దుహు కహు కామ-క్రోధ రిపు ఆహీ ॥ (రామచరిత మానసం- 3/42/8-9)

రెండు ప్రకారాలుగా భజన చేసేవారు ఉన్నారు. ఒకటి జ్ఞాన మార్గం, రెండవది భక్తి మార్గం.

నిష్కామ కర్మమార్గంలో, లేక భక్తి మార్గంలో శరణాగతుడైనవాడు నా ఆశ్రయం పొంది ఆచరిస్తాడు. జ్ఞాన మార్గీయుడు తన శక్తిని ముందుంచుకొని, తన లాభనష్టాలను బేరీజు వేసుకొంటూ, తన భరోసా పై ఆచరిస్తాడు. కానీ యిద్దరి శత్రువు ఒక్కటే, జ్ఞాన మార్గావలంబులకు కామ, క్రోదాది శత్రువులపై విజయం సాధించాలి మరియు నిష్కామ కర్మయోగి కూడా వీటితోనే యుద్ధం చేయాలి. కోరికలను యిద్దరూ త్యాగం చేస్తారు మరియు రెండు మార్గాలలోనూ చేయవలసిన కర్మ ఒక్కటే. ఈ కర్మయొక్క పరిణామంలో పరమశాంతిని పొందుతారు.

కానీ 'కర్మ' అంటే ఏమిటి?' అన్నది చెప్పలేదు. ఇప్పుడు మీ సమక్షంలో కూడా 'కర్మ' ఒక ప్రశ్నే. అర్జునుని మనస్సులో కూడా కర్మ గూర్చి జిజ్ఞాస పుట్టింది. మూడవ అధ్యాయం ఆరంభంలోనే అతడు కర్మని గురించి ప్రశ్నను ముందుంచాడు.

ఓం తత్సదితి శ్రీమద్ భగవద్ గీతాసూపనిషత్సు బ్రహ్మ విద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే **'కర్మ జిజ్ఞాసా'** నామ ద్వితీయోఽధ్యాయః ||**2**||

శ్రీమద్ భగవద్ గీతారూపీ ఉపనిషత్తు మరియు బ్రహ్మవిద్య మరియు యోగశాస్త్ర విషయంలో శ్రీకృష్ణుడు మరియు అర్జునుల సంవాదంలో 'కర్మ–జిజ్ఞాస'అను పేరుగల రెండవ అధ్యాయం పూర్ణమయింది.

ఇతి శ్రీమత్పరమహంస పరమానందస్య శిష్య స్వామీ అడగడానందకృతే శ్రీమద్ భగవద్గీతా యాః- **'యథార్థ గీతా'** భాష్యే **'కర్మ జిజ్ఞాస'** నామ ద్వితీయోఽధ్యాయః||**2**||

ఈ ప్రకారంగా శ్రీమత్ పరమహంస పరమానందగారి యొక్క శిష్యుడైన స్వామి అడగడానంద గారిచే రచించబడిన శ్రీమద్ భగవత్‌గీత యొక్క భాష్యం 'యథార్థ గీత'లో కర్మ జిజ్ఞాసా అనే రెండవ అధ్యాయం పూర్ణమయింది.

||హరి ఓం తత్సత్||

ఓం

శ్రీ పరమాత్మనే నమః

# తృతీయ అధ్యాయము

రెండో అధ్యాయంలో భగవంతుడైన శ్రీకృష్ణుడు ఇలా చెప్పాడు- ఈ విషయం నీకు జ్ఞానమార్గం సందర్భంలో చెప్పబడింది, ఏ విషయం? అదే, యుద్ధం చేయమని. గెలిచావా మహామహిమ స్థితిని పొందుతావు, లేదా ఓడిపోతే దైవత్వం ఉంది. గెలుపులో సర్వస్వం, మరియు ఓటమిలో దైవత్యం ఉంది. ఏదో ఒకటి దొరుకుతుంది. ఈ విధంగా ఈ దృష్టితో చూస్తే, లాభ నష్టాలు రెండింటిలోనూ ఏదో ఒకటి దొరుకుతుంది. ఏ మాత్రం కూడా నష్టం లేదు. మళ్ళీ శ్రీకృష్ణుడు అన్నాడు- దీనినే నీవు నిష్కామ కర్మయోగం విషయంలో విను. ఈ బుద్ధితో యుక్తుడవైతే నీవు కర్మబంధం నుంచి చక్కగా ముక్తుడివి కాగలవు. తరువాత దాని విశిష్టతలను గూర్చి చెప్పాడు. 'ప్రతి ఫలాన్ని ఆశించువాడివి కారాదు. కోరికలచే రహితుడవై, కర్మలో ప్రవృత్తుడవు కమ్ము. మరియు కర్మ చేయడంలో అశ్రద్ధ చూపరాదు, మొదలైన అవసరమైన జాగ్రత్తలను కర్మ చేసేటప్పుడు పాటించవలసిన కర్మ బంధం నుంచి ముక్తుడై పొవడానికి అవసరమైనవాటిని గురించి నొక్కిచేప్పాడు. ముక్తుడవైతే అయిపోతావు, కానీ వాటితో నీ స్థితిని తెలుసుకోలేవు.

ఈ విధంగా అర్జునుడికి నిష్కామ కర్మ యోగానికంటే జ్ఞాన మార్గం సరళంగానూ మరియు ప్రాప్తి నిప్పించు దానిగానూ ప్రతీతమైంది. అతను ప్రశ్నించాడు- 'జనార్ధనా! మీ దృష్టిలో నిష్కామ కర్మ కంటే, జ్ఞాన మార్గం శ్రేష్ఠమైన దైనప్పుడు, నన్ను భయంకర కర్మలలో ఎందుకు ఇరికిస్తున్నారు? ప్రశ్న స్వాభావికమైనదే. ఒకే స్థానాన్ని చేరడానికి రెండు మార్గాలు ఉన్నాయనుకోండి. మీరు వాస్తవంగా వెళ్ళవలసి ఉంటే, 'వీటిలో సుగమమైనదేది'? అన్న ప్రశ్న తప్పకుండా అడుగుతారు. అలా అడగని పక్షంలో మీరు యాత్రికులు కారు. సరిగ్గా ఇదే ప్రకారంగా అర్జునుడు కూడా ప్రశ్నించాడు-

అర్జున ఉవాచ-

శ్లో // జ్యాయసీ చేత్కర్మణస్తే మతా బుద్ధిర్జనార్ధన ।
తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ ॥1॥

జనులపై దయగల జనార్ధనా! నిష్కామ కర్మయోగంకంటే జ్ఞాన యోగం శ్రేష్ఠమైందని మీరను కొంటే, హే కేశవా! మీరు నన్ను భయంకరమైన కర్మయోగంలో ఎందుకు తోస్తున్నారు? నిష్కామ కర్మయోగంలో అర్జునుడికి భయంకరత్వం కనిపించింది. ఎందుకంటే ఇందులో కర్మ

చేయడంలోనే నీకు అధికారం ఉంది. ప్రతిఫలం పై ఎన్నటికీ లేదు. కర్మ చేయడంలో అశ్రద్ధ కూడా ఉండకూడదు మరియు నిరంతర, సమర్పణ భావంతో కూడి, యోగంపై దృష్టి ఉంచుతూ కర్మ చేస్తూనే ఉండాలి.

కానీ జ్ఞాన మార్గంలో ఓడిపోతే దైవత్వం, గెలిస్తే మహామహిమస్థితి ఉన్నాయి. తన లాభ-నష్టాలను స్వయంగా చూసుకుంటూ, ముందుకు వెళ్ళాలి. ఈ ప్రకారంగా అర్జునుడికి నిష్కామ కర్మ యోగాని కంటే జ్ఞాన యోగం సరళంగా కనిపించింది. కాబట్టి అతను ఇలా నివేదించుకున్నాడు -

శ్లో ॥ వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే ।
తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహమాప్నుయామ్ ॥**2**॥

మీరు యీ కలగాపులగపు వచనాలతో నా బుద్ధిని మోహితం చేస్తున్నారు. మీరు నా బుద్ధి యొక్క మోహాన్ని తొలగించడానికి ప్రవృత్తులైనారు. అందుచేత వీటిలో ఒక దానిని నిశ్చయంచేసి, దేని వల్లనైతే నాకు శ్రేయం కలుగుతుందో, పరమ కళ్యాణమైన మోక్షం లభిస్తుందో, దానిని చెప్పండి. అప్పుడు శ్రీకృష్ణుడు ఇలా అంటాడు-

శ్రీ భగవానువాచ:

శ్లో ॥ లోకేస్మిన్ద్వివిధా నిష్ఠా పురాప్రోక్తా మయానఘ ।
జ్ఞాన యోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్ ॥**3**॥

నిష్పాపుడైన అర్జునా! ఈ ప్రపంచంలో సత్యశోధనకై రెండు మార్గాలను గురించి ముందే చెప్పడమైంది. 'ముందే' అంటే తాత్పర్యం ఎప్పుడో సత్యయుగంలోనో లేక త్రేతాయుగంలోనో కాదు, కానీ దాని గురించి రెండవ అధ్యాయంలో చెప్పబడింది. జ్ఞానుల కోసం జ్ఞాన మార్గం, మరియు యోగుల కోసం నిష్కామ కర్మ మార్గం అని చెప్పబడింది. రెండు మార్గాలలోనూ కర్మ చేయవలసిందే. కర్మ అనివార్యమైనది.

శ్లో ॥ న కర్మణామ నారమ్భా న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే ।
నచ సంన్యాసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి ॥**4**॥

అర్జునా! మనుష్యుడు కర్మలను ఆరంభం చేయక పోవడం వలన 'నిష్కర్మత' అనే అంతిమ స్థితిని పొందడు. మరియు ఆరంభం చేసిన క్రియను త్యజించుట వలన భగవత్ ప్రాప్తిరూపమైన పరమ సిద్ధిని పొందడు. ఇప్పుడు నీకు జ్ఞాన మార్గం నచ్చినా, లేక నిష్కామ కర్మ మార్గం నచ్చినా, రెండింటిలోనూ కర్మను చేయవలసిందే.

సాధారణంగా ఈ స్థలంలో లోకులు భగత్పథంలో సంక్షిప్త మార్గానికై లేక, రక్షణకై వెతుకుతుంటారు. 'కర్మ ఆరంభం చేయనే లేదు. అయిపోయినాడయ్యా నిష్కర్ముడు- ఇలాంటి భ్రాంతి ఉండ కూడదు. కాబట్టే కర్మను ప్రారంభం చేయకుండానే నిష్కర్మతా భావన లభించదని

శ్రీకృష్ణుడు నొక్కి వక్కాణించాడు. శుభాశుభ కర్మలు ఎక్కడ అంతమవుతాయో, ఆ నిష్కర్మతా స్థితిని కర్మ చేయడం వలనే పొందవచ్చును. ఇదే ప్రకారంగా చాలా మంది అంటారు, ''మేము జ్ఞానమార్గపు పథికులం ; జ్ఞాన మార్గంలో కర్మ లేనే లేదు''. – అలా అనుకొని కర్మను వదలి పెట్టే వారు జ్ఞానులు కారు. ఆరంభం చేసిన క్రియను త్యజించినంత మాత్రానే, ఎవరూ భగవత్సాక్షాత్కార రూపమయిన పరమ సిద్ధిని పొందరు, ఎందుకంటే–

శ్లో ॥ న హి కశ్చిత్క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్ ।
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః ॥**5**॥

ఏ పురుషుడైనా సరే, ఏ కాలంలోనూ కూడా, క్షణ మాత్రం కూడా కర్మ చేయకుండా ఉండలేడు, ఎందుకంటే పురుషులందరూ ప్రకృతి నుంచి ఉత్పన్నమయిన గుణాల ద్వారా వివశులై కర్మ చేస్తారు. ప్రకృతి మరియు ప్రకృతి నుంచి ఉత్పన్నమైన గుణాలు జీవించి ఉన్నంత వరకు ఏ పురుషుడు కూడా కర్మ చేయకుండా ఉండలేడు.

నాలుగో అధ్యాయం, ముప్పయి మూడవ, ముప్పయి ఏడవ శ్లోకాల్లో శ్రీకృష్ణుడు ఇలా అంటాడు– యావన్మాత్రమయిన కర్మలు, జ్ఞానంలో సమాప్తమయి పోతాయి. జ్ఞాన రూపమయిన అగ్ని పూర్తిగా కర్మలను భస్మం చేస్తుంది. ఇక్కడ శ్రీకృష్ణుడు అంటాడు– 'కర్మ చేయకుండా ఎవరూ ఉండరు'. నిజానికి ఆ మహాపురుషుడు ఏం చెప్పాలను కొంటున్నాడు? అతని ఆశయమేమిటంటే యజ్ఞం చేస్తూ–చేస్తూ మూడు గుణాల నుండి అతీతమయి పోయినప్పుడు మనస్సు యొక్క విలీనం మరియు పరమాత్ముని సాక్షాత్కారంతో పాటు యజ్ఞం యొక్క పరిణామం వెలువడుతున్నప్పుడు కర్మ నశించిపోతుంది. ఆ నిర్ధారిత క్రియ పూర్తి గాక ముందు కర్మ నశింపదు. ప్రకృతి నుండి ముక్తులము కాలేదు.

శ్లో ॥ కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్ ।
ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచారః స ఉచ్యతే ॥**6**॥

ఇంత చెప్పినా కూడా కర్మేంద్రియాలను మొండిగా నిరోధించి, ఇంద్రియాల భోగాలను మనస్సులో స్మరించేవారు మరీ మూఢులు మిథ్యాచారులు, డంబాచారులు, అంతే గానీ జ్ఞానులుకారు. ఇదేం నిరూపిస్తుందంటే, కృష్ణుని కాలంలో కూడా ఇలాంటి, మూఢాచారాలు ఉండేవన్నమాట. లోకులు చేయయోగ్యమైన క్రియను వదలి ఇంద్రియాలను మొండిగా నిరోధించే వారూ, 'నేను జ్ఞానిని', 'పూర్ణుడిని'. అని అనే వారూ ధూర్తులని శ్రీకృష్ణుడంటున్నాడు. జ్ఞాన మార్గం నచ్చినా లేక నిష్కామ కర్మయోగం నచ్చినా, రెండు మార్గాలలోనూ కర్మచేయ వలసిందే.

శ్లో ॥ యస్త్వింద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున।
కర్మేంద్రియైః కర్మయోగమసక్తః సవిశిష్యతే ॥**7**॥

అర్జునా! ఏ పురుషుడైతే మనస్సుద్వారా ఇంద్రియాలను వశంచేసికొని, ఎప్పుడైతే మనస్సులో కూడా కోరికలను స్మరించడో, సర్వథా అనాసక్తుడై కర్మేంద్రియాలతో కర్మయోగాన్ని ఆచరిస్తాడో, అతను శ్రేష్ఠుడు. కర్మ ఆచరించాలన్నది అర్థమయింది. కానీ ఇప్పుడు మిగిలియున్న ప్రశ్న 'ఏ కర్మ చేయాలి?' అప్పుడు శ్రీకృష్ణుడు ఇలా అంటాడు–

శ్లో // నియతం కురు కర్మత్వం కర్మ జ్యాయో హ్యా కర్మణః।
శరీర యాత్రాపి చతే న ప్రసిద్ధ్యే ద కర్మణః ॥8॥

అర్జునా! నీవు నిర్ధారితమైన కర్మను చేయుము. అంటే చాలా రకాలైన కర్మలు ఉన్నాయి. అందులో ఏదో ఒక దానిని ఎంచుకొనబడింది. ఆ నియతమైన కర్మను చేయుము. కర్మ చేయక పోవడం కంటే కర్మ చేయడమే శ్రేష్ఠమయినది. ఎందుకంటే చేస్తూ ఉంటే వెనుక చెప్పినట్లుగా కొంచెం దూరమైనా పోగలిగితే జన్మ-మరణమనే మహా భయం నుంచి ఉద్ధరించునది, కాబట్టి కర్మ శ్రేష్ఠమైనది. కర్మ చేయక పోతే శరీర యాత్ర కూడా సఫలం కాదు. శరీర-యాత్ర అంటే అర్థం లోకులు అంటారు- 'శరీర నిర్వహణ'. ఎలాంటి శరీర-నిర్వాహం? మీరు ఈ శరీరమా? ఈ పురుషుడు జన్మ జన్మాంతరాల నుండి, యుగయుగాంతరాల నుండి శరీర యాత్రే కదా చేస్తూ వస్తున్నాడు. ఎలాగైతే వస్త్రం జీర్ణమై పోతే, అపుడు రెండోది - మూడోది ధరిస్తామో, అదే విధంగా క్రిమి-కీటకాదుల నుంచి మానవుల వరకు, బ్రహ్మ నుంచి యావన్మాత్రమైన జగత్తూ అంతా పరివర్తన శీలము అయినది. ఉచ్చ-నీచ యోనులలో మళ్ళీ-మళ్ళీ పుట్టి, ఈ జీవి శరీరాల యాత్రే కదా చేస్తున్నది! కర్మ ఎలాంటి వస్తువంటే, అది ఈ యాత్రను సఫలీకృతం చేస్తుంది, పూర్తి చేయిస్తుంది. ఒకే ఒక్క జన్మ ఎత్త వలసి వచ్చిందనుకోండి, అప్పుడు యాత్ర జరుగుతూనే ఉన్నదన్నమాట. పథికుడు ఇంకా నడుస్తున్నాడు. గమ్యం చేరుకున్నప్పుడే యాత్ర పూర్తవుతుంది. పరమాత్మునిలో ఉనికిని పొందిన తరువాతనే ఈ ఆత్మకు శరీరాల యాత్ర చేయనవసరం ఉండదు. అంటే శరీర-త్యాగం మరియు శరీర-ధారణ, ఈ క్రమం సమాప్తమవుతుంది. 'కర్మ' ఎలాంటిదంటే దానిని ఆచరించుటతో ఆ పురుషునికి శరీర యాత్రచేయవలసి ఉండదు. 'మోక్ష్యసే శుభాత్' (4/16) అర్జునా ! ఈ కర్మ చేసి నీవు సంసార బంధమనే అశుభం నుంచి ముక్తుడివవుతావు. కర్మ సంసార బంధం నుంచి విముక్తిని యిప్పించేది. ఇప్పుడు 'ఈ నిర్ధారితమైన కర్మ ఏమిటి ? అన్నది ప్రశ్న. అప్పుడు శ్రీకృష్ణుడు ఇలా అంటాడు-

శ్లో // యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః।
తదర్థం కర్మ కౌంతేయ ముక్త సంగః సమాచర ॥9॥

అర్జునా! యజ్ఞ ప్రకియే కర్మ. దేని వలనైతే యజ్ఞం పూర్తవుతుందో ఆ ప్రయత్నమే కర్మ. దీని వలన నిరూపించబడేదేమిటంటే. కర్మ ఒక నిర్ధారితమైన ప్రక్రియ. దీనికి అతిరిక్తంగా ఏ కర్మలైతే జరుగుతాయో, అవి కర్మలు కావా? శ్రీకృష్ణుడు అంటాడు ''కావు'' అవి కర్మలు కావు. 'అన్యత్ర లోకోఽయం కర్మ బంధనః' ఈ యజ్ఞం యొక్క ప్రక్రియ కాకుండా, ప్రపంచంలో జరుగునదేదయినా, జగత్తు అంతయు దేనిలోనైతే రాత్రింబగళ్ళు వ్యస్తమై ఉంటుందో, అది ఈ లోకం యొక్క ఒక బంధమే గానీ కర్మ కాదు. మోక్ష్యసేఽశుభాత్- అశుభం. అంటే ఈ సంసారపు బంధం నుంచి ముక్తిని ఇప్పించేది కర్మ. యజ్ఞం యొక్క ప్రక్రియ మాత్రమే కర్మ. దేని వలన అయితే యజ్ఞం పూర్తవుతోందో ఆ పని కర్మ. కాబట్టి అర్జునా! ఆ యజ్ఞాన్ని పూర్తి చేయడానికి సంగదోషం విడిచి పెట్టు. బాగుగా కర్మను ఆచరించుము. సంగదోషం నుంచి విడివడకుండా కర్మ చేయడం జరగదు.

ఇప్పుడు మనం యజ్ఞం యొక్క ప్రక్రియే కర్మ అని అర్థం చేసుకొన్నాము, కానీ యిక్కడ మళ్ళీ ఒక క్రొత్త ప్రశ్న పుడుతుంది. అదేమిటంటే 'ఈ చేయవలసిన యజ్ఞం, ఏమిటి?' దీని కోసం మొదట యజ్ఞం గురించి చెప్పకుండా శ్రీ కృష్ణుడు ఈ యజ్ఞం ఎక్కడి నుంచి వచ్చింది? ఇది ఏమిస్తుంది? అన్న విషయాలు చెప్పాడు. దాని విశిష్టతలను స్పష్టం చేశాడు. ఆ తరువాత నాలుగో అధ్యాయంలో యజ్ఞం అంటే ఏమిటి? మొదలైన విషయాలు స్పష్టం చేశాడు. యోగేశ్వరుడైన శ్రీకృష్ణుని శైలి వలన ఏం స్పష్టమవుతుందంటే, ఏదైనా వస్తువు యొక్క చిత్రణ చేయాలంటే, అతను మొదట దాని విశిష్టతలను చిత్రీకరించుతాడు, దాని వలన శ్రద్ధ జాగృతమవుతుంది. ఆతరువాత అతను దానిలో పాటించవలసిన జాగరూకతలను స్పష్టం చేస్తాడు. చివరికి ముఖ్య సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తాడు.

జ్ఞాపకం ఉంచుకోవలసిందేమిటంటే యిక్కడ శ్రీకృష్ణుడు కర్మ యొక్క రెండో పక్షం గూర్చి చెబుతూ కర్మ ఒక నిర్ధారిత క్రియ అని అంటాడు. ఏదంటే అది చేయడం, కర్మ కాదు.

రెండో అధ్యాయంలో మొదటి సారిగా ''కర్మ'' శబ్దాన్ని ఉపయోగించాడు, దాని విశిష్టతలను, దానిలో పాటించవలసిన జాగ్రత్తలను గూర్చి చెప్పాడు; కానీ కర్మ ఏమిటన్నది చెప్పలేదు. ఇక్కడ మూడో అధ్యాయంలో ఎవరూ కర్మ చేయకుండా వుండలేరు అని అంటాడు. ప్రకృతి చేతిలో పరాధీనుడయి మనుష్యుడు కర్మ చేస్తాడు. ఏ మనుష్యులైతే మొండిగా ఇంద్రియాలని నిరోధించి మనస్సులో విషయాలను గురించి ఆలోచిస్తారో, వారు ఆడంబరపూర్ణులు, ఆడంబరం కోసం ఆచరణ చేసేవారు. కాబట్టి అర్జునా! మనస్సు ద్వారా ఇంద్రియాలను నియంత్రిస్తూ నీవు కర్మ చేయుము. కానీ ప్రశ్న ప్రశ్నగానే ఉండిపోయింది. ఏకర్మ చేయాలి? దీనిని గురించి యోగేశ్వరుడయిన శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు– అర్జునా! నీవు నిర్ధారితమైన కర్మనే ఆచరించుము.

ఇప్పుడు ఉదయించే ప్రశ్న 'మనం' చేయవలసిన నిర్ధారితమైన కర్మ ఏమిటి?' అనేది. అప్పుడు అతను ఇలా చెప్తాడు. యజ్ఞానికి కార్య రూపం ఇవ్వడమే కర్మ. ఇప్పుడు యజ్ఞం అంటే ఏమిటి? అన్న ప్రశ్న పుడుతుంది. ఇక్కడ యజ్ఞం యొక్క ఉత్పత్తి, విశిష్టతలను గురించి చెప్పి ఊరుకొందాము. ముందు నాలుగో అధ్యాయంలో యజ్ఞం యొక్క రూపం కనిపిస్తుంది, దానిని ఆచరించడమే కర్మ.

కర్మకు ఇచ్చిన నిర్వచనం గీతను అర్థం చేసుకోవడానికి అవసరమయ్యే సాధనం. యజ్ఞం కాకుండా ప్రపంచంలో లోకులు ఏదో ఒకటి చేస్తూనే ఉంటారు. కొందరు పొలం పని చేస్తే, మరి కొందరు వ్యాపారం. కొందరు పదవిలో ఆసీనులైతే మరికొందరు శ్రమజీవులు. కొందరు సమాజసేవయే కర్మ అంటే మరికొందరు దేశసేవే అంటారు మరియు ఈ కర్మలలోనే లోకులు సకామానికి మరియు నిష్కామానికి భూమికలు కూడా తయారు చేశారు. కానీ శ్రీకృష్ణుడనేదేమిటంటే అవి కర్మలుకావు. 'అన్యత్ర లోకోఽయం కర్మ బంధనః'– యజ్ఞం యొక్క ప్రక్రియ కాకుండా వేరే యేదైనా కర్మ చేయబడితే అది ఈ లోకపు బంధనకారి అవుతుంది. అదీ కర్మే గానీ మోక్షమిప్పించే కర్మకాదు. వాస్తవానికి యజ్ఞం యొక్క ప్రకియే కర్మ. ఇప్పుడు యజ్ఞం గురించి చెప్పకుండా మొదట యజ్ఞం వచ్చింది ఎక్కడ నుంచి అనేది చెప్తాడు–

శ్లో ॥ సహయజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః।
అనేన ప్రసవిష్యధ్వమేష వోఽస్త్విష్ట కామధుక్ ॥ 10॥

ప్రజాపతి బ్రహ్మ కల్ప ప్రారంభంలో యజ్ఞ సహితంగా ప్రజలను సృష్టించి అన్నాడు– ''ఈ యజ్ఞం ద్వారా వృద్ధిని పొందండి. ఈ యజ్ఞం మీ కోసం 'ఇష్టకామధుక్' (కోరిన కోరికలు ఇచ్చేది)– దేనిలోనైతే అనిష్టం లేదో, అలాంటి ఇష్ట దైవానికి సంబంధించిన కోరికలను పూర్తి చేస్తుంది. దీనితో ఉత్తరోత్తరాభివృద్ధి పొందండి''. అని.

యజ్ఞం సహితంగా ప్రజలను ఎవరు సృష్టించారు? ప్రజాపతి బ్రహ్మ. బ్రహ్మ ఎవరు? ఎలాగైతే ప్రసిద్ధుడై ఉన్నాడో, అలాంటి నాలుగు ముఖాలు మరియు ఎనిమిది కళ్ళుగల దేవుడా? కాదు, శ్రీ కృష్ణుడు చెప్పినట్లు దేవతల పేరిట వేరే ఏ సత్తా లేదు. మరి ఈ ప్రజాపతి ఎవరు? వాస్తవానికి ఎవరైతే ప్రజలకు మూల ఉద్గమ స్థానమయిన పరమాత్మునిలో ప్రవేశం పొందాడో, ఆ మహాపురుషుడే ప్రజాపతి. బుద్ధియే బ్రహ్మ– 'అహంకార శివ, బుద్ధి అజ, మన్ శశి, చిత్త మహాన!' (రామచరిత మానసం). ఆ సమయంలో బుద్ధి యంత్రం మాత్రమే అవుతుంది. ఆ మహాపురుషుని వాక్కు ద్వారా పరమాత్ముడే మాట్లాడుతాడు.

భజన యొక్క వాస్తవిక క్రియ ప్రారంభం అయినప్పుడు బుద్ధి క్రమక్రమంగా వృద్ధి చెందుతుంది. ప్రారంభంలో ఆ బుద్ధి 'బ్రహ్మ విద్య'తో సంయుక్తమై ఉండడం చేత' బ్రహ్మవిత్తు' అనబడుతుంది. క్రమంగా వికారాలు నష్టమైపోయినప్పుడు, 'బ్రహ్మవిద్య'లో శ్రేష్ఠమయినప్పుడు, అది 'బ్రహ్మ విద్వరం' అనబడుతుంది. వృద్ధి చెంది సూక్ష్మమయినప్పుడు, బుద్ధి దశవికసితమవుతుంది. అప్పుడది 'బ్రహ్మ విద్వరీయాన్' అనబడుతుంది. ఆ దశలో 'బ్రహ్మవిద్' (బ్రహ్మవిద్యను తెలుసుకొన్న) అయిన ఆ పురుషుడు ఇతరులను కూడా వ్యుత్థాన మార్గంపై నడిపించగల అధికారాన్ని పొందుతాడు. బుద్ధి యొక్క పరాకాష్ఠ– 'బ్రహ్మ విద్వరిష్ఠం' అంటే బ్రహ్మవిత్తు, ఆ దశ, ఇష్టదైవం ప్రవాహితమయ్యేటటువంటి స్థితిగల ఆ మహాపురుషుడు ప్రజల యొక్క మూల ఉద్గమమైన పరమాత్మునిలో ప్రవిష్టుడై మరియు స్థితుడై ఉంటాడు. అటువంటి మహాపురుషుని బుద్ధి ఒక యంత్రం మాత్రమే. వారే ప్రజాపతి అనబడతారు. వారు ప్రకృతి యొక్క ద్వంద్వాలను విశ్లేషించి 'ఆరాధనా క్రియ'ను రూపొందిస్తారు. యజ్ఞానికి అనుగుణంగా సంస్కారాలు ఇవ్వడమే ప్రజలను సృష్టించడం. ఇంతకు పూర్వం సమాజం అచేతనమై, అవ్యవస్థమై ఉంటుంది. సృష్టి అనాదియైనది. సంస్కారాలు మొదటి నుండే ఉన్నాయి, కానీ అస్తవ్యస్తంగా వికృతంగా ఉన్నాయి. యజ్ఞానికి అనుగుణంగా వాటిని మార్చడాన్నే సృష్టి అంటారు.

అలాంటి మహాపురుషుడు కల్పం యొక్క ఆదిలో యజ్ఞ సహితంగా ప్రజలను సృష్టించాడు. కల్పం రోగముక్తులను చేస్తుంది. వైద్యులు కల్పాన్ని యిస్తారు, కొందరు కాయకల్పాన్ని చేస్తారు. అది క్షణికమైన శరీరాల యొక్క కల్పం. వాస్తవికమైన కల్పం భవరోగం నుంచి ముక్తి దొరికినప్పుడే. ఆరాధన యొక్క ప్రారంభమే ఈ కల్పానికి మొదలు. ఆరాధన పూర్తయిందంటే మీ కల్పం పూర్తయిందన్న మాటే.

ఈ ప్రకారంగా పరమాత్ముని స్వరూపస్థుడైన మహా పురుషుడే భజన యొక్క ప్రారంభంలో యజ్ఞం సహితంగా సంస్కారాలను సుసంఘటిత పరచి ఇలా అన్నాడు– ఈ

యజ్ఞం ద్వారా నీవు వృద్ధిని ప్రాప్తం చేసుకో. ఎలాంటి వృద్ధి? పూరిల్లు పెంకుటిల్లుగా మారి పోతుందా? రాబడి పెరుగుతుందా? కాదు, యజ్ఞం 'యిష్టకామదుక్'- ఇష్టుని సంబంధమైన కోరికలను నెరవేరుస్తుంది. ఇష్టదైవం ఒక్కపరమాత్ముడే. ఆ పరమాత్మునికి సంబంధించిన కోరికలు నెరవేరడం జరుగుతుంది. 'యజ్ఞం తిన్నగా ఆ పరమాత్ముని దరికి చేరుస్తుందా లేక క్రమ క్రమంగానా?' అన్న ప్రశ్న స్వాభావికమైనదే.-

శ్లో ॥ దేవాన్ భావయతానేన తే దేవా భావయంతువః।
పరస్పరం భావయంతః శ్రేయః పరమవాప్స్యథ ॥ **11**॥

ఈ యజ్ఞం ద్వారా దేవతలను వృద్ధి చేయుము, అంటే దైవీ సంపదను వృద్ధి పరచుము. ఆ దేవతలు మిమ్ములను ఉన్నతం చేస్తారు. ఈ ప్రకారంగా పరస్పరం వృద్ధి చేసుకుంటూ, ఆ పరమ శ్రేయం, దేని తర్వాత యింకేదీ పొందవలసినది మిగిలి ఉండదో, అటువంటి పరమ కల్యాణాన్ని పొందుము. ఎలా ఎలా మనం యజ్ఞంలో ప్రవేశం పొందుతామో (ముందు ముందు యజ్ఞం అంటే అర్థం ఆరాధన యొక్క విధి అని తెలియ వస్తుంది.) అలా-అలా హృదయ దేశంలో దైవీ సంపద ఆర్జితం అవుతూ ఉంటుంది. పరమ దేవుడు ఏకమాత్ర పరమాత్ముడే, ఆ పరమదేవునిలో ప్రవేశం ఇప్పించే సంపదను, అంతః కరణంలోని సజాతీయ ప్రవృత్తులను, దైవీ సంపద అంటారు. అది పరమదేవుణ్ణి సాధ్యపరుస్తుంది, కాబట్టే దైవీ సంపద అనబడుతుంది. కానీ ప్రజలు కల్పించుకున్న బయటి దేవతలు, రాళ్ళు, నీళ్లు మొదలైనవి కావు. యోగేశ్వరుడైన శ్రీకృష్ణుని మాటలలో వాటికి ఎలాంటి అస్తిత్వమూ లేదు. ఇంకా ఇలా అంటాడు.

శ్లో ॥ ఇష్టాన్ భోగాన్ హివోదేవా దాస్యంతే యజ్ఞ భావితాః।
తైర్దత్తాన ప్రదాయైభ్యోయో భుంక్తే స్తేన ఏవ సః ॥ **12**॥

యజ్ఞం ద్వారా సంబంధితులైన దేవతలు (దైవీ సంపద), మీకు 'యిష్టాన్ భోగాన్ హిదాస్యంతే'- ఇష్టదైవం (అంటే) ఆరాధ్య దైవానికి సంబంధించిన భోగాలను ఇస్తుంది. వేరే యింకేమీ కాదు. ''తైః దత్తాన్'- వారు మాత్రమే యిచ్చేవారు. ఇష్ట దైవాన్ని పొందడానికి యింకో వికల్పం లేదు. ఈ దైవీ గుణాల్ని పెంపొందించుకోకుండా ఎవరైతే ఈ స్థితిని అనుభవించుతాడో, అతను నిశ్చయంగా దొంగయే. అతను సంపాదించనే లేదు, అనుభవించేదేమిటి? కానీ తప్పకుండా అతడు అంటాడు కదా 'నేను పరిపూర్ణుణ్ణి'. 'తత్త్వదర్శకుణ్ణి' అని. ఇలాంటి గొప్పలు చెప్పుకొనేవారు యీ పథంలో ముఖం చాటు చేసుకొనే వారే. వారు నిశ్చయంగా దొంగలే గానీ ప్రాప్తి పొందినవారు కారు. కానీ ప్రాప్తి పొందిన వారు ఏం పొందుతారు?

శ్లో ॥ యజ్ఞ శిష్టాశినః సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః।
భుంజతే తే త్వఘం పాపా యే పచంత్యాత్మకారణాత్ ॥ **13**॥

యజ్ఞం తరువాత మిగిలిన అన్నాన్ని తినే పుణ్యపురుషులు అన్ని పాపాల నుంచి విముక్తులయి పోతారు. దైవీ సంపదను వృద్ధి చేస్తూ - చేస్తూ ఆ పరిణామంలో ప్రాప్తించిన

కాలమే పూర్తి కాలం. ఎప్పుడైతే యజ్ఞం పూర్తి అయిపోతుందో, అప్పుడు శేషంగా మిగిలిన బ్రహ్మే అన్నం. దీనినే శ్రీకృష్ణుడు ఇంకోరకమైన మాటలలో చెప్పాడు–'యజ్ఞ శిష్టామృతభుజో యాంతి బ్రహ్మ సనాతనం'– యజ్ఞం దేనినైతే సృష్టిస్తుందో, ఆ అమృతాన్ని త్రాగేవారు బ్రహ్మలో ప్రవిష్టులైపోతారు. ఇక్కడ అతను ఇలా అంటాడు– యజ్ఞం తరువాత శేషంగా మిగిలే అమృతాన్ని (బ్రహ్మపీయూషాన్ని) త్రాగేవారు అన్ని పాపాలనుంచి విముక్తులైపోతారు. సాధు జనులైతే ముక్తులై పోతారు. కానీ పాపులు మోహం ద్వారా ఉత్పన్నమైన శరీరాల కోసం దానిని జీర్ణం చేసుకొంటారు. వారు పాపాన్ని తింటారు. వారు భజన కూడా చేస్తారు. ఆరాధన అంటే తెలుసుకొన్నారు, అందులో అగ్రేసరులు కూడా అయ్యారు, కానీ బదులుగా 'ఆత్మ కారణాత్'– శరీరం కోసం మరియు శరీరానికి సంబంధించి ఏదైనా దొరకాలని ఒక తియ్యని కోరిక పుడుతుంది. వారికి దొరకడమైతే దొరుకుతుంది, కానీ దాన్ని అనుభవించిన తరువాత వారు తాము అక్కడే ఉండడం గుర్తిస్తారు. ఇంతకన్నా పెద్ద నష్టం ఏముంటుంది? ఈ శరీరమే నశ్వరమైనప్పుడు, దాని సుఖ భోగాలు ఎంత వరకు తోడుంటాయి? వారు ఆరాధనైతే చేస్తారు. కానీ బదులుగా పాపాన్నే తింటారు–

'పలటి సుధా తేసర్ విషలేయి' (ఆ మూర్ఖులు అమృతానికి బదులుగా విషం తీసుకొంటారు). వారు నష్టం కారు కానీ ముందడుగు వేయలేరు. కాబట్టే శ్రీకృష్ణుడు నిష్కామ భావనతో కర్మ (భజన) చేయడాన్ని సమర్థించాడు. ఇప్పటి దాకా శ్రీకృష్ణుడు చెప్పిందేమిటంటే యజ్ఞం పరమ శ్రేయాన్ని యిస్తుంది మరియు దాని సృష్టి మహాపురుషుల ద్వారా జరుగుతుంది, కానీ ఆ మహాపురుషులు ప్రజలని సృష్టించడంలో ఎందుకు ప్రవృత్తమవుతారు? దీనిని గురించి అంటాడు–

శ్లో ॥ అన్నాద్ భవంతి భూతాని పర్జన్యాదన్న సంభవః ।
యజ్ఞాద్ భవతి పర్జన్యో యజ్ఞః కర్మ సముద్భవః ॥ **14**॥
కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షర సముద్భవం ।
తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితం ॥ **15**॥

సమస్త ప్రాణులు అన్నం నుంచి ఉత్పన్నమవుతాయి. 'అన్నం బ్రహ్మ వ్య జానాత్'– అన్నం పరమాత్ముడే. ఆ బ్రహ్మపీయుషాన్నే ఉద్దేశ్యంగా చేసుకొని ప్రాణులు యజ్ఞం వైపు అగ్రసరులవుతాయి. అన్నం యొక్క ఉత్పత్తి వృష్టినుంచి అవుతుంది. మేఘాల నుంచి కురిసే నీరు కాదు కానీ కృపా వృష్టి. పూర్వంలో సంచితమైన యజ్ఞ కర్మయే కృపారూపంలో వర్షిస్తుంది. ఈ నాటి ఆరాధన రేపు కృపా రూపంలో లభిస్తుంది. కాబట్టి వృష్టి యజ్ఞం ద్వారా అవుతుంది. ''స్వాహా '' చెప్పడంచే మరియు నువ్వులు, బార్లి కాల్చడం చేతనే గనుక వర్షం కురిస్తే, విశ్వంలో బీడు భూములు, ఎడారులు ఎక్కువగా ఎందుకున్నాయి? అన్నీ సస్యశ్యామలమై పోతాయి. ఇక్కడి కృపావృష్టి యజ్ఞంచే యివ్వబడినది. ఈ యజ్ఞం కర్మల నుంచే ఉత్పన్నమవుతుంది. కర్మచే యజ్ఞం పూర్తవుతుంది.

ఆ కర్మ వేదాల నుంచి ఉత్పన్నమైందని తెలుసుకో. వేదాలు బ్రహ్మస్థితుడైన మహాపురుషుని వాక్కులే. ఏతత్త్వమైతే విదితం కాదో, దాని యొక్క ప్రత్యక్ష అనుభూతి పేరే

వేదం గానీ, శ్లోక సంగ్రహం పేరు కాదు. వేదం అనశ్వరుడయిన పరమాత్ముడి నుంచి ఉత్పన్నమైనదిగా తెలుసుకో. చెప్పింది మహాత్ములే అయినా కానీ వారు ఆ పరమాత్మునితో కూడి తద్రూపులై పోయారు, వారి ద్వారా అనశ్వరుడయిన పరమాత్ముడే మాట్లాడతాడు. కాబట్టే వేదాలు అపౌరుషేయాలు అనబడతాయి. మహాపురుషులు వేదాల్ని ఎక్కడి నుంచి పొందారు? వేదాలు అనశ్వరుడయిన పరమాత్ముడి నుంచి ఉత్పన్నమయ్యాయి. ఆ మహాపురుషులు పరమాత్మునితో తద్రూపులైనారు, వారు యంత్రాలు మాత్రమే, కాబట్టి వారి ద్వారా పరమాత్ముడే మాట్లాడుతాడు. ఎందుకంటే యజ్ఞం ద్వారానే మనస్సు యొక్క నిరోధక కాలంలో పరమాత్ముడు సర్వదా యజ్ఞంలోనే ప్రతిష్ఠితమై ఉంటాడు. యజ్ఞమే అతనిని పొందే ఒకే ఒక సాధనం. దీనినే శ్రీకృష్ణుడు సమర్థిస్తాడు.

శ్లో ॥ ఏ వం ప్రవర్తితం చక్రం నాను వర్త యతీ హ యః ।
అఘా యు రింద్రియా రామో మోఘం పార్థ స జీవతి ॥ **16**॥

హే పార్థా ! ఏ పురుషుడైతే ఈ లోకంలో మనుష్య శరీరాన్ని పొంది ఈ ప్రకారంగా నడిపించే సాధన చక్రానికి అనుగుణంగా ప్రవర్తించడో అంటే దైవీ సంపద యొక్క ఉత్కర్ష, దేవతల యొక్క వృద్ధి మరియు పరస్పర వృద్ధి ద్వారా అక్షర దాముణ్ణి ఉపాసించడం, అలాగ ఈ క్రమానికి అనుగుణంగా ప్రవర్తించడో, ఇంద్రియాలకు విశ్రామం కోరే వాడైన ఆ పాపాత్ముడైన పురుషుడు వ్యర్థంగా జీవిస్తాడు.

మిత్రులారా! యోగేశ్వరుడు శ్రీకృష్ణుడు రెండో అధ్యాయంలో 'కర్మ' పదాన్ని ఉపయోగించాడు మరియు ఈ అధ్యాయంలో చెప్పాడు– 'నియమించిన కర్మ చెయ్యి.' యజ్ఞం యొక్క ప్రక్రియే కర్మ. ఇది కాకుండా, యింకేది చేసినా అది ఈ లోకం యొక్క బంధమే. కాబట్టి సంగదోషం (ఫలాపేక్ష) నుండి దూరంగా ఉంటూ, ఆ యజ్ఞం పూర్తి కావడానికై కర్మను ఆచరణలో పెట్టు. అతను యజ్ఞం యొక్క విశిష్టతలను గూర్చి నొక్కి చెప్పాడు. యజ్ఞం యొక్క ఉత్పత్తి బ్రహ్మ నుంచి జరిగిందని చెప్పాడు. ప్రజలు అన్నాన్ని లక్ష్యం చేసుకొని, ఆ యజ్ఞంలో ప్రవృత్తమవుతారు. యజ్ఞం కర్మ నుంచి, మరియు కర్మ అపౌరుషేయాలైన వేదాల నుంచి ఉత్పన్నమవుతాయి. కానీ వేద మంత్రద్రష్టలు మహాపురుషులే. వారి పౌరుషం తిరోహితమై పోయింది. అది జరగడంతోనే ఆ అవినశ్వరుడైన పరమాత్ముడే శేషంగా మిగిలిపోయాడు. కాబట్టి వేదాలు పరమాత్మనుంచే ఉత్పన్నమయ్యాయి. సర్వ వ్యాపియైన పరమాత్ముడు యజ్ఞంలో సర్వదా ప్రతిష్ఠితమై ఉంటాడు. ఈ సాధనా చక్రానికి అనుగుణంగా ఎవరైతే ప్రవర్తించడో, ఆ పాపాత్ముడయిన పురుషుడు, ఇంద్రియ సుఖాన్ని కోరుకునేవాడు. వ్యర్థంగా జీవిస్తాడు. అంటే యజ్ఞం ఎలాంటి విధి విశేషమంటే, అందులో ఇంద్రియాలకి విరామం లేదుగానీ అక్షయ సుఖం కలదు. ఇంద్రియాల నియంత్రణతో బాటు కర్మ చేయడానికై ఉద్యుక్తుడయ్యే విధానం కలదు. ఇంద్రియాల విరామం కోరుకునే వాడు పాపాత్ముడు. ఇప్పటి వరకు శ్రీకృష్ణుడు యజ్ఞం ఏమిటన్నది చెప్పలేదు. కానీ యజ్ఞం చేస్తూనే ఉంటామా లేక దీనికెప్పుడైనా అంతం కూడా ఉంటుందా ? దీనిని గురించి యోగేశ్వరుడు ఇలా అంటాడు–

శ్లో ॥ యస్త్వాత్మరతిరేవ స్యాదాత్మతృప్తశ్చ మానవః ।
ఆత్మన్యేవ చ సంతుష్ట స్తస్య కార్యం నవిద్యతే ॥ 17॥

కానీ ఏ పురుషుడైతే ఆత్మలోనే రతుడై, ఆత్మతృప్తుడై మరియు ఆత్మలోనే సంతుష్టుడై ఉంటాడో, అతనికి ఇంకే కర్తవ్యం మిగిలి ఉండదు.

ఇదే లక్ష్యం కదా. ఎప్పుడైతే అవ్యక్తమైన, సనాతనమైన, అనశ్వరమైన ఆత్మతత్త్వం ప్రాప్తమవుతుందో, ఆ మీద దేనిని గురించి వెతకాలి? అలాంటి పురుషునికి కర్మ యొక్క ఆవశ్యకత లేదు. ఆరాధన యొక్క అవసరమూ లేదు. ఆత్మ మరియు పరమాత్మ ఒక దానికొకటి పర్యాయాలు. దీనినే మళ్ళీ వివరిస్తాడు–

శ్లో ॥ నైవ తస్య కృతేనార్థో నాకృతే నే హ కశ్చన ।
న చాస్య సర్వ భూతేషు కశ్చిదర్థ వ్యపా శ్రయః ॥ 18॥

ఈ ప్రపంచంలో అలాంటి పురుషుడు కర్మ చేయుట వలన లాభం లేదు, చేయక పోవడం వలన నష్టం లేదు. అతనికి సర్వ ప్రాణులతో ఏ విధమైన స్వార్థ సంబంధం ఉండదు. ఆత్మయే శాశ్వతం, సనాతనం అవ్యక్తం, అపరివర్తన శీలం, అక్షయం. ఎప్పుడైతే దానినే పొందాడో, దానిచే సంతుష్టి, దానిలో తృప్తిని పొంది ఉంటూ దానిలో స్థితుడైనాడో, ఆ పైన యింకే సత్తాలేనే లేదు, అలాంటప్పుడు దేన్ని వెతకాలి ? దొరికే దేమిటి? ఆ పురుషుడు కర్మను వదిలేయడం వలన నష్టం కూడా లేదు. ఎందుకంటే వికారాలు దేన్పై అంకితమవుతాయో, ఆ చిత్తమే అతని వద్ద లేదు. అతనికి సంపూర్ణ భూతాలలో, బాహ్య జగత్తు మరియు అంతర సంకల్పాల పోరులో లేశ మాత్రం కూడా సంబంధం ఉండదు. అన్నింటికన్నా పెద్ద అర్థం పరమాత్ముడు. అతనే దొరకినప్పుడు మిగిలిన వాటితో అతనికేం ప్రయోజనం ?

శ్లో ॥ తస్మాదసక్తః సతతం కార్యం కర్మ సమాచర ।
అసక్తో హ్యా చరన్ కర్మ పరమాప్నోతి పూరుషః ॥ 19॥

ఈ స్థితిని పొందుటకై నీవు అనాసక్తుడవై నిరంతరం 'కార్యం కర్మ'– చేయ యోగ్యమైన కర్మను చేయుము. ఎందుకంటే అనాసక్త పురుషుడు కర్మయొక్క ఆచరణ ద్వారా పరమాత్ముణ్ణి చేరుకుంటాడు 'నియత కర్మ', 'కార్యం కర్మ' రెండూ ఒక్కటే. కర్మ చేయుటకై ప్రేరణనిస్తూ అతడు ఇలా అంటాడు–

శ్లో ॥ కర్మణై వ హి సంసిద్ధి మా స్థితా జనకాదయః ।
లోక సంగ్రహమే వాపి సంపశ్యన్ కర్తుమర్హసి ॥20॥

జనకుడు అంటే జనకమహారాజు కాదు. జన్మ దాతను జనకుడని అంటారు. యోగమే జనకుడు. మీ స్వరూపానికి జన్మనిస్తుంది, ప్రకటించుతుంది. యోగంతో సంయుక్తుడైన ప్రతి మహాపురుషుడూ జనకుడే. ఇలాగ యోగ సంయుక్తులైన చాలా మంది ఋషులు 'జనకాదయః'– జనకుడు ఇత్యాది జ్ఞానులైన మహా పురుషులు కూడా 'కర్మణా ఏవహి సంసిద్ధిం', కర్మల ద్వారానే పరమ సిద్ధిని పొందారు. పరమసిద్ధి అంటే పరమతత్త్వమైన పరమాత్ముని యొక్క ప్రాప్తి. జనకుడు మొదలయిన మహార్షులందరూ, ఈ 'కార్యం కర్మ',

యజ్ఞం యొక్క ప్రకియ, ద్వారా ఈ కర్మను చేస్తూనే 'సంసిద్ధిం' – పరమసిద్ధిని పొందారు. కానీ పొందిన తరువాత కూడా లోక కళ్యాణాన్ని దృష్టిలో ఉంచుకొని కర్మ చేశారు. లోక హితాన్ని కోరుకుంటూ కర్మ చేశారు. కనుక నీవు కూడా దీనిని పొందిన తర్వాత లోక–నాయకుడవగుటకై కార్యంకర్మ చేయ యోగ్యుడవే, ఎందుకు ?

ఇప్పుడే శ్రీకృష్ణుడు అన్నాడు– పరమాత్ముడిని చేరిన మహాపురుషులకి కర్మ చేయడం వలన లాభం లేదు మరియు వదలివేస్తే నష్టం లేదు, అయినా గానీ లోక హిత వ్యవస్థకోసం వారు నియత కర్మని ఆచరిస్తారు.

శ్లో // యద్యదాచరతి శ్రేష్ఠస్తత్త దేవేతరో జనః ।
స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే ॥**21**॥

శ్రేష్ఠులైన పురుషులు ఎలా ఆచరణ చేస్తారో, అన్యజనులు కూడా అతనిని అనుసరించే చేస్తారు. ఆ మహాపురుషుడు దేనిని ప్రమాణముగా చేస్తాడో, ప్రపంచం దాన్ని అనుసరిస్తుంది.

మొదట శ్రీకృష్ణుడు స్వరూపంలో స్థితులైన, ఆత్మతృప్తులైన మహాపురుషులు వుండే పద్ధతిని గూర్చి నొక్కిచెప్పి వారికి కర్మ చేయడం వలన లాభం లేదు మరియు వదలి వేయడం వలన హాని లేదు, అయినా గానీ, జనకాదులు కర్మలో వ్యవహరించుతారు అంటూ ఆ మహాపురుషులతో మెల్లగా తనను సమానం చేసుకుంటాడు– నేను కూడా ఒక మహాపురుషుణ్ణే అని.

శ్లో // న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన ।
నాన వాప్తమవాప్తవ్యం వర్త ఏ వ చ కర్మణి ॥**22**॥

హే పార్థా ! నాకు మూడులోకాలలోనూ ఎలాంటి కర్తవ్యం లేదు. ఇంతకు ముందు అన్నాడు– ఆ మహాపురుషునికి సమస్త భూతాల పట్ల ఎలాంటి కర్తవ్యమూ లేదు. ఇక్కడ అంటాడు–మూడు లోకాలలోనూ నాకు ఎలాంటి కర్తవ్యం కూడా మిగిలి లేదు మరియు కించిన్మాత్రం ప్రాప్తం చేసుకోవలసిన వస్తువు ఏదీ అప్రాప్తంగా లేదు. అయినా కూడా నేను కర్మలోనే చక్కగా వ్యవహరిస్తున్నాను. ఎందుకని ?

శ్లో // యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్య తంద్రితః ।
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః ॥**23**॥

ఎందుకంటే నేను గనుక సావధానుడనై సరిగా కర్మలో వ్యవహరించకపోతే, మనుష్యులు నా ఆచరణకి అనురూపంగా వ్యవహరించడం మొదలు పెడతారు. అంటే మిమ్మల్ని అనుకరించడం తప్పా? శ్రీ కృష్ణుడు అంటాడు – తప్పే.

శ్లో // ఉత్సీదేయురిమే లోకాన కుర్యాం కర్మ చేదహం ।
సంకరస్య చ కర్తా స్యాముప హన్యామిమాః ప్రజాః ॥**24**॥

నేను గనుక సావధానుడనై కర్మ చేయక పోతే, ఈ లోకాలన్నీ భ్రష్టములయి పోతాయి మరియు 'సంకరస్య'– వర్ణ సంకరాన్ని కలిగించినవాడి నవుతాను. ఈ మొత్తం

ప్రజల్ని చంపిన వాడిని అవుతాను. స్వరూపంలో స్థితుడైన మహాపురుషుడు జాగ్రత్త వహించి ఆరాధనా క్రమంలో పాల్గొనకపోతే, ఈ సమాజం అతణ్ణి అనుకరించి భ్రష్ఠమైపోతుంది. మహాపురుషుడు ఆరాధనని పూర్తి చేసి పరమ నైష్కర్మ్య స్థితిని పొందాడు. అతను కర్మ చేయక పోతే, అతని కెలాంటి హానీ లేదు. కానీ సమాజం ఇంకా ఆరాధనని ఆరంభం చేయనే లేదు. తన వెనుక నున్న వారికి, మార్గ దర్శనం చేయడానికి మహాపురుషుడు కర్మ చేస్తాడు, నేను కూడా చేస్తాను అంటే శ్రీకృష్ణుడు ఒక మహాపురుషుడు, అంతే గానీ వైకుంఠం నుంచి వచ్చిన ఎవరో విశిష్ట భగవంతుడుకాడు, అతనేమన్నాడంటే మహాపురుషుడు లోక హితానికై కర్మ చేస్తాడు, నేను కూడా చేస్తాను. నేను గనుక చేయకపోతే, లోకులు పతనమై పోతారు, అందరూ కర్మను వదలి కూర్చుంటారు.

మనస్సు అతి చంచలమైంది, అది అన్నీ కోరుకుంటుంది. కేవలం భజన చేయడాన్నే కోరుకోదు. స్వరూపస్థుడైన మహా పురుషుడు గనుక కర్మచేయక పోతే, అతణ్ణి చూస్తున్న వెనుక వారు కూడా కర్మను వదలి వేస్తారు. వారికి ఒక నెపమంటూ దొరుకుతుంది– ఇతడు భజన చేయడు, తాంబూలం తింటాడు, సెంటు పూసుకుంటాడు, మామూలుగా మాట్లాడుతాడు అయినా సరే మహాపురుషుడనబడతాడు– ఇలా ఆలోచించి వారుకూడా ఆరాధనని వదలి, పతితులై పోతారు. శ్రీకృష్ణుడంటాడు– నేను గనుక కర్మ చేయక పోతే, అందరూ భ్రష్టులైపోతారు అలాగ నేను వర్ణ సంకరానికి కర్త నవుతాను.

స్త్రీలు దూషితులవడంచేత వర్ణ సంకరం జరగడం చూడవచ్చు, వినవచ్చును. అర్జునుడు కూడా ఇదే భయంతో వికలుడైనాడు– స్త్రీలు దూషితలవుతారు, అప్పుడు వర్ణసంకరం జరుగుతుంది. కానీ శ్రీకృష్ణుడు అంటాడు– నేను గనక సావధానుడనై ఆరాధనలో పాల్గొనక పోతే, వర్ణసంకరానికి కర్తనవుతాను. వాస్తవానికి ఆత్మ యొక్క శుద్ధ వర్ణం (రూపం) పరమాత్మ. తమ శాశ్వతమైన స్వరూపం యొక్క దారి నుంచి తప్పి పోవడమే వర్ణ సంకరం. స్వరూపస్థుడైన మహాపురుషుడు గనక క్రియను చేయకపోతే లోకులు అతడిని అనుకరించి క్రియారహితులై పోతారు, ఆత్మపథం నుంచి తప్పిపోతారు. వర్ణ సంకరులై పోతారు. వారు ప్రకృతిలో చిక్కుపడిపోతారు.

స్త్రీల సతీత్వం మరియు పసుపు యొక్క శుద్ధత ఒక సామాజిక వ్యవస్థ, అధికారులకు సంబంధించిన ప్రశ్న. సమాజానికై వాటి ఉపయోగం ఉంది. కానీ తల్లి–తండ్రి యొక్క తప్పులు సంతానం యొక్క సాధనని ప్రభావం చేయలేవు. **'ఆపన్ కరనీ పార్ ఉతరనీ'** (తను చేయడం,తను దాటి వేయడం). హనుమంతుడు, వ్యాసుడు, వశిష్ఠుడు, నారదుడు, శుకదేవుడు, కబీరు, ఏసు మొదలగువారు మహా పురుషులయ్యారు, కానీ సామాజిక కులీనతతో వీరికి సంబంధం లేదు. ఆత్మ తన పూర్వ జన్మ యొక్క గుణ ధర్మాలను వెంట తీసుకొని వస్తుంది – 'మనః షష్ఠానీంద్రియాణి ప్రకృతి స్థాని కర్షతి' (15/7) మనస్సు సహితంగా ఇంద్రియాల చేత ఏ కార్యం ఈ జన్మలో చేయబడుతుందో దాని సంస్కారాన్ని వెంట తీసుకొని జీవాత్మ పాత శరీరాన్ని వదలి వేసి, నవీన శరీరంలోకి ప్రవేశిస్తుంది. ఇందులో జన్మ దాతల సహకారం

ఏం ఉంది ? వారి వికాసంలో తేడా రాదు. కాబట్టి స్త్రీలు దూషితలవుతే వర్ణ సంకరం కాదు. స్త్రీలు దూషితలవటానికీ, వర్ణ సంకరానికీ ఏ సంబంధమూలేదు. శుద్ధ స్వరూపంవైపు అగ్రసరులు కాకుండా, ప్రకృతిలో చిక్కుకపడి పోవడమే వర్ణసంకరం.

మహాపురుషుడు గనుక సావధానుడై క్రియ (నియత కర్మ)లో వ్యవహరించక (చేయక) పోతే, లోకులచే క్రియను చేయించక పోతే, అతడు ఆ మొత్తం ప్రజలను చంపిన వాడవుతాడు. సాధనా క్రమంలో నడుచుకొంటూ, ఆ మూల పురుషుడైన అనశ్వరుణ్ణి పొందడం జీవనం. ప్రకృతిలో చిక్కుకపడి పోవడం, తప్పి పోవడం మృత్యువు. కానీ ఆ మహాపురుషుడు ఈ ప్రజలను గనుక క్రియా పథంలో నడిపించకపోతే, ఆ మొత్తం ప్రజలను చెల్లా చెదరు కానివ్వకుండా సత్పథం పై నడిపించకపోతే, అతడు ఆ మొత్తం ప్రజలను చంపిన హంతకుడవుతాడు, హింసకుడవుతాడు. క్రమంగా నడిపించుతూ, ఎవరైతే తీసుకెళతాడో, అతనే శుద్ధ అహింసకుడు. గీత ప్రకారంగా శరీరం మరణించడం, నశ్వరమైన కళేబరాలు మరణించడం ఒక పరివర్తనం మాత్రమే గానీ హింస కాదు.

శ్లో ॥ సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత ।
కుర్యాద్విద్వాంస్తథాసక్త శ్చికీర్షుర్లోక సంగ్రహం ॥**25**॥

హే భారతా! (అర్జునా) కర్మలో ఆసక్తులైన అజ్ఞానులు ఎలాగైతే కర్మ చేస్తారో, అలాగే అనాసక్తులైన విద్వాంసులు, పూర్ణ జ్ఞానులు కూడా లోకుల హృదయంలో ప్రేరణనిస్తూ వారి కళ్యాణం (మేలు) కోరుతూ కర్మ చేయాలి. యజ్ఞం యొక్క విధి తెలిసుండీ, యజ్ఞం చేస్తూ కూడా మనం అజ్ఞానులం. జ్ఞానం అంటే అర్థం ప్రత్యక్షంగా తెలుసుకోవడం. ఎప్పటి వరకైతే మనం ఆరాధ్య దైవానికి వేరుగా ఉంటామో అప్పటి వరకు అజ్ఞానం ఆవరించుకొని ఉంటుంది. ఎప్పటి వరకు అజ్ఞానం ఉంటుందో, అప్పటి వరకూ కర్మలో ఆసక్తి ఉంటుంది. అజ్ఞానుడు ఎంత ఆసక్తితో ఆరాధన చేస్తాడో, అనాసక్తుడు కూడా అంతే. ఎవరికైతే కర్మల వలన ప్రయోజనం లేదో వారికి ఆసక్తి ఎందుకుంటుంది ? అలాంటి పూర్ణ జ్ఞానంగల మహా పురుషుడు కూడా లోకహితానికై కర్మ చేయాలి, దైవీ సంపదలను వృద్ధి చేయాలి. దాని వలన సమాజం ఆ మార్గంపై నడుస్తుంది.

శ్లో ॥ న బుద్ధి భేదం జనయేదజ్ఞానాం కర్మ సంగినాం ।
జోషయేత్సర్వ కర్మాణి విద్వాన్ యుక్తః సమాచరన్ ॥**26**॥

జ్ఞానులైన పురుషులు చేయవలసినది, కర్మలో ఆసక్తులైన అజ్ఞానుల బుద్ధిలో భ్రమ పుట్టించక పోవుటే. అంటే స్వరూపస్థులైన మహాపురుషులు గుర్తుంచుకోవలసినదేమిటంటే తమ ఆచరణ వలన తమ వెనకనున్న వారి మనస్సులలో కర్మ పట్ల అశ్రద్ధ ఉత్పన్నం కాకూడదు. పరమాత్మతత్త్వంతో సంయుక్తులైన మహాపురుషులు చేయవలసిన దేమిటంటే స్వయంగా నియత కర్మను చేస్తూ, ఇతరులచే చేయించాలి.

ఇదే కారణం వలన 'పూజ్య గురు మహారాజులవారు' వృద్ధాప్యంలో కూడా రాత్రి రెండు గంటలకే లేచి కూర్చొని, దగ్గుతూ ఉండేవారు. ''మూడుగంటలకు- లేవండి, మట్టి

బొమ్మల్లారా'' అని అనేవారు, అందరూ లేచి చింతనలో మునిగి పోగానే, తాము స్వయంగా కొంచెం నడుం వాల్చేవారు. కొంచెం సేపయిన తరువాత లేచి కూర్చొని వారు ఇలా అనేవారు. ''గురువుగారు నిద్రపోయారని అనుకొంటున్నారా? కానీ నేను నిద్రపోవటంలేదు, శ్వాస క్రియలో మునిగి ఉన్నాను. వృద్ధావస్థలో ఉన్న శరీరం కదా! కూర్చోవడం కష్టమవుతున్నది, అందుకనే నేను నడుం వాలుస్తాను, కానీ మీరు స్థిరంగా తిన్నగా కూర్చొని చింతన చేయాలి. ఎప్పటి వరకు నూనెధారవలె శ్వాస క్రియ దారంలా పని చేయదో, క్రమం తెగకుండా ఉండదో, అన్య సంకల్పాలు మధ్యలో వ్యవధానాన్ని ఉత్పన్నం చేయలేవో, అప్పటి వరకు నిరంతరం సాదన చేయడం సాదకుని కర్తవ్యం. నా శ్వాస మాత్రం వెదురు కర్రలాగా స్థిరంగా నిలబడి ఉంది.'' ఇదే కారణంగా తమ శిష్యులచే కర్మ చేయించడానికై ఆ మహాపురుషుడు కర్మ చేస్తూ ఉండేవాడు. ''జిస్‌గుణ్‌కో సిఖావే, ఉసే కరకే దిఖావే'' (ఏది నేర్పించుతావో, దాన్ని చేసి చూపించు).

ఈ ప్రకారంగా స్వరూపస్థుడైన మహాపురుషుడు చేయవలసిందేమిటంటే స్వయంగా తను కర్మ చేస్తూ, సాధకుల చేత కూడా ఆరాధన చేయించాలి. సాధకుడు కూడా శ్రద్ధా పూర్వకంగా ఆరాధన చేయాలి, కానీ సాధకుడు కర్మయోగి అయినా, జ్ఞానయోగి అయినా అతనిలో సాధనను గురించి అహంభావం రాకూడదు. కర్మ ఎవరి వలన జరుగుతుంది, అలా జరగడానికి కారణం ఎవరు? – దీనిని గూర్చి శ్రీకృష్ణుడు స్పష్టంగా చెప్తాడు –

శ్లో || ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః |
అహంకార విమూఢాత్మా కర్తాహమితి మన్యతే ||**27**||

ఆరంభం నుంచి అంతం వరకు సంపూర్ణ కర్మ ప్రకృతి యొక్క గుణాల ద్వారానే చేయబడుతుంది. అయినా గానీ అహంకారం చేత విశేషంగా మూఢులైన పురుషులు ''నేనే కర్తను'– అని అనుకుంటారు. ప్రకృతి యొక్క గుణాల ద్వారానే ఆరాధన జరుగుతుందనేది ఎలా ఒప్పుకోవాలి? అలాగని ఎవరు చూసారు ? దీనిని గూర్చి శ్రీకృష్ణుడు ఇలా అంటాడు –

శ్లో || తత్త్వవిత్తు మహాబాహో గుణ కర్మ-విభాగయోః |
గుణా గుణేషు వర్తంత ఇతి మత్వా న సజ్జతే ||**28**||

''హే మహాబాహూ ! గుణాలను మరియు కర్మ యొక్క విభాగాలను ''తత్త్వవిత్తులు' – పరమతత్త్వ పరమాత్ముని తెలుసుకొన్న మహా పురుషులు చూశారు. మరియు సంపూర్ణ గుణాలు, గుణాలలోనే వ్యవహరిస్తున్నాయి– అలా అనుకొని గుణాలలోనూ, కర్మల కర్తృత్వంలోనూ వారు ఆసక్తులు కారు.

ఇక్కడ 'తత్త్వం' అంటే అర్థం పరమతత్త్వమైన పరమాత్ముడనే గానీ లోకులు లెక్కపెట్టునట్లు ఐదు, లేక ఇరవై ఐదు' తత్త్వాలు కావు. యోగేశ్వరుడైన శ్రీకృష్ణుని మాటలలో చెప్పాలంటే తత్త్వం కేవలం పరమాత్ముడే, ఇంకో తత్త్వమంటూ లేనే లేదు. గుణాలకంటే అతీతుడై, పరమతత్త్వమైన పరమాత్మునిలో స్థితులైన మహాపురుషులు గుణాలను బట్టి కర్మ

యొక్క విభజనను చూడగలుగుతారు. తామసగుణం ఉంటే, దాని క్రియలు బద్ధకం, నిద్ర మరుపు, కర్మలో ప్రవృత్తం కాకపోవడం మొదలైనవి; రాజసగుణం ఉంటే, దాని క్రియలు ఆరాధన నుంచి వెనుకాడని స్వభావం, శౌర్యం, స్వామిత్వ భావనతో కర్మ చేయడం మొదలయినవి. సాత్విక గుణం కార్యరతమైనప్పుడు ధ్యానం, సమాధి అనుభవాల ఉపలబ్ధి, ధారావాహిక చింతన, సారళ్యం మొదలగునవి స్వభావంలో ఉంటాయి. గుణాలు పరివర్తన శీలాలు. గుణాలకి అనుగుణంగా కర్మలో ఉత్కర్ష-అనుత్కర్ష కలుగుతాయన్న దానిని ప్రత్యక్ష దర్శకులైన జ్ఞానులే చూడగలరు. గుణాలు తమ కార్యాల్ని చేయించుకొంటాయి. అంటే గుణాలు గుణాలలో సంచరిస్తాయి. అలాగని అనుకొని ఆ ప్రత్యక్ష ద్రష్టులు కర్మలో ఆసక్తులుకారు. కానీ ఎవ్వరైతే గుణాలకు అతీతమవలేదో, ఎవ్వరైతే యింకా దారిలో ఉన్నారో, వారు కర్మలో ఆసక్తులై ఉండాలి. కాబట్టి-

శ్లో // ప్రకృతేర్గుణ సంమూఢాః సజ్జంతే గుణ కర్మసు ।
తానకృత్స్నవిదో మందాన్ కృత్స్నవిన్న విచాలయేత్ ॥**29**॥

ప్రకృతి యొక్క గుణాలచే మోహితులైన పురుషులు గుణాలలో మరియు కర్మలలో క్రమంగా నిర్మలమైన గుణాలవైపు ఉన్నతమవడం చూసి వాటిలో ఆసక్తులవుతారు. అంత బాగా తెలుసుకోలేని 'మందాన్' శిథిల ప్రయత్నం చేయు వారిని బాగుగా తెలుసుకోగల జ్ఞానులు చంచల మనస్కులను చేయకూడదు. వారిని హతోత్సాహులను చేయకుండా, ప్రోత్సహించాలి, ఎందుకంటే కర్మ చేయుట ద్వారానే పరమనైష్కర్మ్య స్థితిని పొందాలి. తమ శక్తి మరియు స్థితిని అవగతం చేసుకొంటూ, కర్మలో ప్రవృత్తులయ్యే జ్ఞాన మార్గంలో సాధకులు చేయవలసిన దేమిటంటే కర్మను గుణాలు ఇచ్చినవని అనుకోవాలి తప్ప మనమే కర్తలను కొని, అహంకారయుక్తులు కారాదు, నిర్మల గుణాల్ని పొందినా కూడా వాటిలో ఆసక్తులు కారాదు. కానీ నిష్కామ కర్మయోగికి కర్మలోనూ, గుణాల విశ్లేషణలోనూ సమయం ఇవ్వవలసిన అవసరం లేదు. అతను సమర్పణ భావంతో కర్మను చేస్తూనే ఉండాలి. ఏ గుణం వస్తూ-పోతూ ఉందన్నది చూడటం యిష్టదైవం యొక్క బాధ్యత. గుణాలలో పరివర్తన మరియు క్రమక్రమంగా వృద్ధి చెందడం- ఇష్టదైవం యిచ్చేవిగా అతను అనుకుంటాడు. కర్మ జరగడం కూడా ఆ యిష్టదైవం ప్రసాదించినది అని అనుకుంటాడు. కాబట్టి నేనే చేస్తున్నాననే అహంకారంగానీ, లేక గుణాలలో ఆసక్తి చూపించవలసిన సమస్యగానీ అతనికి ఉండదు. అయినా సరే నిరంతరం కర్మ చేస్తూనే ఉంటాడు. దీనిని గురించి మరియు దీనితోబాటు యుద్ధం యొక్క స్వరూపాన్ని గురించి, చెబుతూ శ్రీకృష్ణుడు ఇలా అంటాడు-

శ్లో // మయి సర్వాణి కర్మాణి సంన్యస్యాధ్యాత్మ చేతసా ।
నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వర ॥**30**॥

కాబట్టి అర్జునా ! నీవు 'అధ్యాత్మచేతసా' అంతరాత్మలో చిత్తమును నిరోధించి, ధ్యానస్థుడవై, సంపూర్ణ కర్మలను నాకు అర్పణచేస్తూ, ఆశారహితుడవై, మమతా రహితుడవై సంతాపరహితుడవై యుద్ధం చెయ్యి. ఎప్పుడైతే చిత్తము ధ్యానంలో స్థితమై ఉంటుందో, లేశమాత్రం

కూడా ఆశ ఉండదో, కర్మపై మమకారం ఉండదో, అసఫలత పట్ల సంతాపం ఉండదో, అప్పుడు ఆ పురుషుడు ఏ యుద్ధం చేస్తాడు? చిత్తము అన్ని వైపుల నుండీ ముకుళించుకొంటూ, హృదయ దేశంలో నిరుద్ధమయి పోతూ ఉంటే, అతను ఎందుకు యుద్ధం చేయాలి? ఎవరితో చేయాలి? అక్కడ ఎవరున్నారు? వాస్తవానికి ఎప్పుడైతే మీరు ధ్యానంలో ప్రవేశిస్తారో, అప్పుడే యుద్ధం యొక్క అసలైన స్వరూపం మీ ముందు ఉంటుంది. అప్పుడు కామం క్రోధం, రాగం ద్వేషం, ఆశా, తృష్ణా యిత్యాది వికారాల సమూహం విజాతీయ ప్రవృత్తులు, 'కురు' అనబడతాయో, అవి ప్రపంచంలోకి ప్రవృత్తమవుతూనే ఉంటాయి. అడ్డుగోడలై భయంకరంగా ఆక్రమణ చేస్తాయి. వీటిని తరించ (దాట) గలగడమే యుద్ధం. వీటిని నాశనం చేస్తూ అంతరాత్మలోకి వెళ్ళడమే, ధ్యానస్థుడు కావడమే యథార్థమైన యుద్ధం. దీనిని గూర్చి తిరిగి అంటాడు –

శ్లో ॥ యేమే మతమిదం నిత్య మనుతిష్ఠంతి మానవాః।
శ్రద్ధావంతోన సూయంతో ముచ్యంతే తేఽపి కర్మభిః ॥**31**॥

అర్జునా! ఏ మనుష్యుడైతే దోష దృష్టి రహితుడై, శ్రద్ధాభావంతో సమర్పణభావంతో సంయుక్తుడై, ఎప్పటికీ నా ఈ సిద్ధాంతానికి అనుగుణంగా వ్యవహరిస్తాడో ('యుద్ధం చెయ్యి' అనే సిద్ధాంతం) ఆ పురుషుడు కూడా సంపూర్ణ కర్మలనుంచి విముక్తుడై పోతాడు. యోగేశ్వరుని యొక్క ఈ అభయం హిందువులు, ముస్లింలు లేక క్రిస్టియన్లలో ఎవరో ఒకరికి కాదు, మానవ మాత్రులందరికీ. అతని సిద్ధాంతం ఏమిటంటే 'యుద్ధం చెయ్యి' దీని వలన ఎలా అనిపిస్తుందంటే ఈ ఉపదేశం యుద్ధం చేసే వారి కోసమని. ఆర్జునుడి సమక్షంలో అదృష్టవశాత్తు ప్రపంచ యుద్ధంలాటి వ్యూహ రచనే ఉంది. మీ ముందు ఏలాంటి యుద్ధం లేదే! మీరు గీతనే ఎందుకు అధ్యయనం చేస్తున్నారు? ఎందుకంటే కర్మలనుంచి ముక్తి పొందే ఉపాయం యుద్ధం చేసే వారికోసమే కాదు. వాస్తవానికి యిది అంతరదేశంలోని యుద్ధం. క్షేత్ర–క్షేత్రజ్ఞుల యొక్క, విద్యా–అవిద్యల యొక్క, ధర్మక్షేత్రం–కరుక్షేత్రం యొక్క సంఘర్షణ. మీరు ఎలా ఎలాగైతే ధ్యానంలో చిత్తాన్ని నిరోధించుతూ ఉంటారో, విజాతీయ ప్రవృత్తులు అడ్డు గోడలై ప్రత్యక్షమవుతాయి, భయంకరమైన ఆక్రమణ చేస్తాయి. వాటిని శాంత పరుస్తూ, చిత్తాన్ని నిరోధించుతూ వెళ్ళడమే యుద్ధం. ఎవ్వరైతే దోష దృష్టి రహితులై శ్రద్ధతో ఈ యుద్ధంలో పాల్గొంటారో, వారు కర్మల నుంచి, జనన మరణాల నుంచి ముక్తి పొందుతారు. ఎవ్వరైతే ఈ యుద్ధంలో. ప్రవృత్తులు కారో, వారి గతి ఏమిటి? దీని గురించి ఆయన ఇలా అంటాడు –

శ్లో ॥ యే త్వే తదభ్య సూయంతో నానుతిష్ఠంతి మే మతం ।
సర్వజ్ఞానవి మూఢాం స్తా న్విద్ధి నష్టాన చేతసః ॥**32**॥

ఎవ్వరైతే దోష దృష్టి కలవారో 'అచేతసః'– మోహం యొక్క మత్తులో అచేతనులై ఉన్నారో, నా ఈ అభిప్రాయానికి అనుగుణంగా ప్రవర్తించరో అంటే ధ్యానస్థులై ఆశ, మమత, సంతాపం మొదలగు వాటిచే రహితులై సమర్పణభావంతో కూడి యుద్ధం చేయరో, 'సర్వజ్ఞాన విమూఢాన్''– జ్ఞాన పదంలో సర్వదావిమోహితులై ఉండే ఆ మనుష్యులను నీవు కళ్యాణం (మేలు) నుంచి భ్రష్టులైనవారిగా తెలుసుకో. ఇదే నిజమయినప్పుడు లోకులెందుకు కర్మను

చేయరు? దీనిని గూర్చి అంటాడు–

శ్లో ॥ సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేర్ జ్ఞానవానపి ।
ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి ॥**33**॥

ప్రాణులన్నీ తమ తమ ప్రకృతినే పొందుతాయి. తమ స్వభావంచే వివశులయి కర్మలో పాలు పంచుకుంటారు. ప్రత్యక్షదర్శకులైన జ్ఞానులు కూడా తమ ప్రకృతికి అనుగుణంగానే ప్రయత్నం చేస్తారు. ప్రాణులు తమ కర్మలు చేస్తే జ్ఞానులు తమ స్వరూపంలో చేస్తారు. ఎవరి ప్రకృతి ఎలా ప్రభావితమవుతుందో, అలాగే పనులు చేస్తారు. ఇది స్వయం నిరూపితమైనది. దీనిని ఎవరైనా ఎలా కాదంటారు? ఈ కారణం వల్లనే అందరూ నా అభిప్రాయానికి అనుగుణంగా కర్మలో ప్రవృత్తులు కాలేరు. వారు ఆశ, మమత, సంతాపాలను ఇంకో విదంగా చెప్పాలంటే రాగద్వేషాలను విడిచిపెట్టలేరు. అందువల్లనే కర్మ యొక్క సమయానుకూలమైన ఆచరణ జరగదు. దీనినే ఇంకా స్పష్టం చేస్తూ ఇంకో కారణం చూపిస్తూ ఇలా అంటాడు.

శ్లో ॥ ఇంద్రియ స్యేంద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ ।
తయోర్న వశమాగచ్ఛేత్తౌ హ్యస్య పరిపంథినౌ॥**34**॥

ఇంద్రియాల భోగాలలో, రాగద్వేషాలు ఇమిడి ఉన్నాయి. ఈ రెండింటికి లోబడ కూడదు; ఎందుకంటే ఈ కళ్యాణ మార్గంలో– కర్మల నుంచి ముక్తి నిప్పించే ప్రణాళికలలో – ఈ రాగ ద్వేషాలు దుర్ధర్షమైన శత్రువులు, ఆరాధనని అపహరించుకు పోతాయి. శత్రువు లోపల ఉన్నప్పుడు, ఎవరైనా బయట ఎవరితోనో ఎందుకు యుద్ధం చేస్తారు? శత్రువులు ఇంద్రియాలలో మరియు వాటి భోగాలలో ఉన్నారు. యుద్ధమనేది అంతః కరణంలోని యుద్ధమే, ఎందుకంటే శరీరమే క్షేత్రం. దానిలో సజాతీయ– విజాతీయాలనే రెండు ప్రవృత్తులు, మాయ యొక్క రెండు రూపాలయిన విద్యా–అవిద్యలు, ఉన్నాయి. ఈ ప్రవృత్తులను తరించి వేయడమే. సజాతీయ ప్రవృత్తిని సాధించి విజాతీయ ప్రవృత్తిని అంతం చేయడమే యుద్ధం. విజాతీయం సమాప్తమయి పోయినప్పుడు సజాతీయం యొక్క ఉపయోగం సమాప్తమయిపోతుంది. స్వరూపాన్ని స్పృశించిన సజాతీయం కూడా దాని అంతరాళాలలో విలయమయి పోతుంది, ఈ ప్రకారంగా ప్రకృతిని తరించడమే యుద్ధం, అది ధ్యానం వల్లనే సంభవం.

రాగద్వేషాలను నశింపచేయడానికి సమయం పడుతుంది. కాబట్టి చాలా మంది సాధకులు క్రియను వదలి పెట్టి, సహజంగా మహాపురుషుల్ని అనుకరించడం మొదలు పెడ్తారు. శ్రీకృష్ణుడు ఈ విషయం పట్ల సావధాన పరుస్తాడు –

శ్లో ॥ శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ ।
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః ॥**35**॥

ఒక సాధకుడు పది సంవత్సరాల నుండి సాధన చేస్తున్నాడనుకోండి. రెండో సాధకుడు ఈ రోజే సాధనలో ప్రవేశించాడనుకోండి. ఇద్దరి యొక్క సామర్థ్యం ఒక్కలాగే ఉండదు. ఆరంభిక సాధకుడు గనుక మొదటి వాణ్ణి అనుకరిస్తే, తాను నష్టమైపోతాడు. దీనిని

గూర్చి శ్రీకృష్ణుడు ఇలా అంటాడు–

బాగుగా ఆచరణ చేసినటువంటి ఇతరుల ధర్మం కన్నా, గుణ రహితమైన దైనాసరే స్వధర్మమే అధిక ఉత్తమమయినది. స్వభావం నుంచి ఉత్పన్నమైన కర్మలో సాధకుణ్ణి ప్రవృత్తం చేయగల సామర్థ్యమే స్వధర్మం. తమ సామర్థ్యాన్ని బట్టి కర్మలో ప్రవృత్తమయ్యే సాధకుడు, ఏదో ఒకరోజు తరించి పోగలడు. కాబట్టి స్వధర్మాచరణంలో మరణించడం కూడా కళ్యాణ కారకమవుతుంది. ఎక్కడయితే సాధనను వదలివేయడం జరుగుతుందో శరీరం దొరికిన తర్వాత మళ్ళీ అక్కడి నుంచే ప్రారంభం చేయడం జరుగుతుంది. ఆత్మ మరణించదు. వస్త్రం (శరీరం) మార్పిడి జరిగినంత మాత్రంచే, మీ బుద్ధి– ఆలోచనలు మారిపోవుగదా? అగ్రసరులయిన వారిలాగే ప్రవర్తించి అభినయం చేయండతో సాధకుడు భయాన్నే పొందుతాడు. భయం ప్రకృతి పట్లగానీ, పరమాత్ముని పట్ల కాదు. ప్రకృతి యొక్క ఆచ్ఛాదన మరింత దట్టమై (ఎక్కువై) పోతుంది.

ఈ భగవత్పథంలో అనుకరణ చేయడం బహుళంగా కనిపిస్తుంది. 'పూజ్య గురు మహరాజుల వారికి' ఒకసారి ఆకాశవాణి వినిపించింది –'అనుసూ ఇయావెళ్ళి ఉండు.', అని. అప్పుడు వారు జమ్మూనుండి చిత్రకూట్, వచ్చారు మరియు అనుసూఇయాలోని ఘోర అరణ్యాలలో నివసించడం మొదలు పెట్టారు. చాలా మంది మహాత్ములు అక్కడికి వచ్చి వెళుతూ ఉండేవారు. అందులో ఒకతడు పరమహంసజీ (గురువుగారు) దిగంబరంగా, నగ్నంగా ఉండటం, వారికి జరిగే సమ్మానం చూసి వెంటనే అతను కూడా తన కౌపీనం విసిరేసాడు, తన దండ–కమండలాలు ఇంకో మహాత్మునికి యిచ్చేసి దిగంబరుడైపోయాడు. కొంత కాలం తర్వాత వచ్చి పరమ హంసజీ లోకులతో మాట్లాడుతూ ఉండటం వార్పై తిట్ల వర్షాన్ని కురిపించడం చూశాడు. గురువుగారికి లభించిన ఆదేశం ఏమిటంటే భక్తుల కళ్యాణార్థం వారిని కొంచెంగా తిట్టవచ్చు, ఈ పథంలోని పథికులపై అజామాయిషీ ఉంచు. గురువుగారిని అనుకరిస్తూ ఆ మహాత్ముడు కూడా లోకులను తిట్టనారంభించాడు, కానీ దానికి బదులుగా లోకులు కూడా ఏదో ఒకటి అనేసేవారు. అ మహాత్ముడనే వాడు– 'అక్కడ ఎవరూ నోరెత్తరు, కానీ ఇక్కడ ఎదురు జవాబిస్తారేమిటి? అని

ఒకటి రెండు ఏళ్ళ తర్వాత వచ్చి చూస్తే, పరమహంసజీ పరుపు మీద కుర్చున్నారు, లోకులు విసన కర్రలతో విసురుతున్నారు. అతను అడవిలో ఒక పాడుపడ్డ భవనంలో ఒక మంచం తెప్పించి వేసుకున్నాడు, పరుపులు పరిపించాడు, ఇద్దరు మనుష్యులను విసనకర్రతో విసరడానికి నియమించుకున్నాడు. ప్రతి సోమవారం జనసమూహం కూడా చేరడం మొదలైంది– కొడుకు కావాలనుకుంటే, ఏభై రూపాయలు, కూతురు కావాలంటే యిరవై అయిదు రూపాయలు. కానీ 'ఉఘరే అంతన హోయి నిబాహు' (దిగంబరత్వాన్ని చివరిదాకా నిభాయించుకోవడం కష్టం.) అన్నట్లుగా ఒక నెలలోపునే చిల్లు కాణీకి చెల్లకుండా వెళ్ళిపోయాడు. ఈ భగవత్పథంలో అనుకరణ పనికిరాదు. సాధకుడు స్వధర్మాన్నే అచరించడం మంచిది.

''స్వధర్మం'' అంటే ఏమిటి? రెండో అధ్యాయంలో శ్రీకృష్ణుడు ''స్వధర్మం'' అనే పదాన్ని ఉపయోగిస్తూ అంటాడు– స్వధర్మాన్ని గమనించినా, నీవు యుద్ధం చేయడానికి

యోగ్యుడవు. 'క్షత్రియుడికి దీన్ని మించి కళ్యాణ కారకమైన మార్గం ఇంకొకటి లేదు. 'స్వధర్మంలో అర్జునుడు క్షత్రియ వర్గానికి చెందినవాడు. దాన్ని వివరిస్తూ ఇలా అంటాడు– అర్జునా! బ్రాహ్మణుడైన వానికి, వేదాల ఉపదేశాలు క్షుద్రజలాశయంతో సమానం. నీవు వేదాలకంటే పైకి ఎదుగు, మరియు బ్రాహ్మణుడివి కమ్ము. అంటే స్వధర్మంలో మార్పు సంభవమే. మళ్ళీ అంటాడు– రాగద్వేషాలకు వశం కాకు, వాటిని నాశనం చెయ్యి. స్వధర్మమే శ్రేయస్కరం. అర్జునుడు ఒక బ్రాహ్మణుణ్ణి అనుకరిస్తూ వేష భూషలు వేయాలన్నది అతని ఆశయం కాదు.

ఒకే కర్మ పథాన్ని మహాపురుషులు నాలుగు వర్గాలుగా విభజించారు– నికృష్టం, మధ్యమం, ఉత్తమం, అత్యుత్తమం, ఈ వర్గాల సాధకులకు క్రమంగా శూద్రుడు, వైశ్యుడు, క్షత్రియుడు మరియు బ్రహ్మణుడు అనే పేర్లు పెట్టారు. శూద్రుని సామర్థ్యంతో కర్మ ఆరంభించబడుతుంది. సాధనా క్రమంలో అదే సాధకుడు బ్రాహ్మణుడిగా మారవచ్చును. ఇంతకు మించి ఆ పరమాత్మునిలో ప్రవేశం పొందినప్పుడు– 'న బ్రాహ్మణో నక్షత్రియః న వైశ్యో తథాన శూద్రః చిదానంద రూపః శివః కేవలోహమ్'' అతను ఈ వర్ణాల కంటే అతీతుడై ఉంటాడు. శ్రీకృష్ణుడు కూడా ఇలాగే అంటాడు 'చాతుర్వర్ణ్యం మయా సృష్టం' – నాలుగు వర్ణాల యొక్క సృష్టి నేచేసాను. అంటే జన్మ ఆధారంగా మనుష్యులను విభజించాడా ? కాదు. గుణ కర్మ విభాగశః' – గుణాలు ఆధారంగా కర్మను విభజించడమైంది. ఏ కర్మ? సాంసారిక కర్మయా? శ్రీకృష్ణుడు అంటాడు – కాదు, నియత కర్మ. నియత కర్మ ఏమిటి? అది యజ్ఞం యొక్క ప్రకియ, అందులో శ్వాసలో నిశ్వాసం యొక్క ఆహుతి, నిశ్వాసంలో శ్వాస యొక్క ఆహుతి, ఇంద్రియాల నియంత్రణ మొదలయినవి ఉంటాయి. దాని శుద్ధ అర్థం యోగ సాధన, ఆరాధన. ఆరాధ్య దేవుడి వరకు చేర్చే విధి విశేషమే ఆరాధన. ఈ ఆరాధనా కర్మనే నాలుగు వర్గాలుగా విభజించడమయింది. ఏ క్షమతగల పురుషుడు తనదైన వర్గం నుంచి ప్రారంభం చేయాలి. ఇదియే ప్రతి ఒక్కరి వ్యక్తిగత స్వధర్మం. మిగతా వారిని అనుసరిస్తే, భయాన్ని పొందుతాడు. ఎప్పటికీ నష్టమయిపోడు, ఎందుకంటే ఇందులో బీజానికి నాశనం లేదు. అతను ప్రకృతిచే అణచి వేయబడి భయాక్రాంతుడై తప్పకుండా దీన–హీనుడై పోతాడు. ఒకటవ తరగతి విద్యార్థి గనుక తన కన్నా పెద్ద తరగతిలో కూర్చోవడం జరిగితే, అతను పెద్ద తరగతికి చెందిన వాడవగలడా? అతను ప్రారంభిక వర్ణమాల నేర్చుకునే అవకాశం కూడా పోగొట్టు కుంటాడు. అర్జునుడు ప్రశ్నిస్తాడు– మనుష్యుడు స్వధర్మాన్ని ఎందుకు ఆచరించ లేక పోతూన్నాడు? –

అర్జున ఉవాచ–

శ్లో॥ అథకేన ప్రయుక్తోऽయం పాపం చరతి పురుషః।
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః॥**36**॥

హే శ్రీకృష్ణా! మరి ఆ పురుషులు బలవంతంగా లాక్కొచ్చినట్లుగానే వద్దనుకుంటూనే కూడా, ఎవరి ప్రేరణ వలన పాపాన్ని' అచరిస్తారు? మీ అభిప్రాయానికి అనుగుణంగా ఎందుకు నడవలేరు? ఇది విని యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు ఇలా అంటాడు –

శ్రీభగవానువాచ–

శ్లో ॥ కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః ।
మహాశనో మహా పాప్మా విద్ధ్యే నమిహ వైరిణం ॥37॥

అర్జునా! రజోగుణం నుంచి ఉత్పన్నమయ్యే ఈ కామం ఈ క్రోధం, అగ్నితో సమానంగా భోగాలు అనుభవించినందు వల్ల తృప్తి పొందని మహా పాపుల వంటివి. కామ–క్రోధాలు నిజానికి రాగద్వేషాలకు పూరకాలు, ఇప్పుడు నేను చర్చించిన వాటిని శత్రువులుగా తెలుసుకో. ఇప్పుడు వీటి ప్రభావాన్ని గూర్చి చెబుతాడు –

శ్లో ॥ ధూమేనావ్రియతే వహ్ని ర్యథా ధర్శో మలేనచ ।
యథోల్బేనావృతో గర్భ స్తథా తేనే దమావృతం ॥38॥

ఎల్గాగైతే పొగ వలన అగ్ని మరియు మలినము వలన దర్పణం కప్పబడతాయో, ఎల్గాగైతే, మావి వలన గర్భం కప్పబడి ఉంటుందో సరిగ్గా అలాగే కామక్రోధాది వికారాలచే ఈ జ్ఞానం కప్పబడి ఉంటుంది. తడసిన కర్రలను మండిస్తే, పొగే వస్తుంది. అగ్ని మంటల రూపాన్ని దాల్చలేదు. మాలిన్యం కప్పబడిన అద్దంలో ఏ ప్రకారంగా ప్రతిబింబం స్పష్టంగా కనబడదో, మావి కారణంగా ఏ ప్రకారంగా గర్భం కప్పబడిఉంటుందో, అలాగే ఈ వికారాలు ఉంటూ ఉండగా, పరమాత్మని యొక్క ప్రత్యక్ష జ్ఞానం ఉదయించదు.

శ్లో ॥ ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా।
కామరూపేణ కౌన్తేయ దుష్పూరేణానలేన చ ॥39॥

కౌంతేయా! అగ్నితో సమానమైన భోగాలచే తృప్తి పొందని, జ్ఞానుల యొక్క జ్ఞానం నిరంతర శత్రువు అయిన ఈ కామంచేత కప్పబడిఉంది. ఇప్పుడే కదా శ్రీకృష్ణుడు కామం మరియు క్రోధం రెండింటిని శత్రువులని చెప్పాడు. ప్రస్తుత శ్లోకంలో అతడు కేవలం ఒక శత్రువు 'కామం' పేరు మాత్రమే చెప్పాడు. వాస్తవానికి కామంలో క్రోధం అంతర్భూతమై ఉంది. కార్యం పూర్తయిపోతే క్రోధం సమాప్తమయిపోతుంది, కానీ కోరిక సమాప్తం కాదు. కోరిక తీరడంలో వ్యవధానం అవుతూనే క్రోధం మళ్ళీ వెలికి వస్తుంది. కామంలో క్రోధం కూడా నిహితమై ఉంది. ఈ శత్రువు యొక్క నివాసం ఎక్కడ ? దీనిని ఎక్కడ వెతకాలి? నివాసం తెలిసికోగలగితే దీన్ని సమూలంగా నాశనం చేయడం సులభమవుతుంది. దీనిని గూర్చి శ్రీకృష్ణుడు అంటాడు.–

శ్లో ॥ ఇంద్రియాణి మనో బుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే ।
ఏతైర్వి మోహయ త్యేష జ్ఞానమావృత్య దేహినం ॥40॥

ఇంద్రియాలు, మనస్సు మరియు బుద్ధి ఇవి కామం యొక్క నివాసస్థానాలని అనబడతాయి. ఈ కామం ఈ మనస్సు, బుద్ధి మరియు ఇంద్రియాల ద్వారానే జ్ఞానాన్ని ఆవరించేసి, జీవాత్మను మోహంలో పడవేస్తుంది.

శ్లో ॥ తస్మాత్త్వ మింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ।
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞాన విజ్ఞాన నాశనం ॥**41**॥

కాబట్టి అర్జునా ! నీవు మొదట ఇంద్రియాల్ని 'నియమ్య' నియంత్రణ చేయుము, ఎందుకంటే శత్రువు వీటిలో దాగి ఉన్నాడు. అతడు నీ శరీరం లోపల ఉన్నాడు. బయట వెతికితే అతను ఎక్కడా దొరకడు. ఇది హృదయ దేశానికి, అంతర్జగత్తుకి సంబంధించిన యుద్ధం. ఇంద్రియాల్ని వశపర్చుకొని, జ్ఞానం మరియు విజ్ఞానాన్ని నాశనం చేసే ఈ కామాన్ని చంపుము. కామం సులభంగా పట్టుపడదు. కాబట్టి వికారాల నివాసస్థానాన్నే ముట్టడించు. ఇంద్రియాల్నే అదుపులో పెట్టు.

కానీ ఇంద్రియాలను మరియు మనస్సునీ వశం చేయడం చాలా కష్టమైన పని. అలా మనం చేయగలమా? దీని మీద శ్రీకృష్ణుడు అర్జునుడి సామర్థ్యాన్ని చూపిస్తూ ప్రోత్సహించుతాడు.

శ్లో ॥ యింద్రియాణి పరాణ్యాహురింద్రియే భ్యః పరం మనః ।
మనసస్తు పరా బుద్ధిర్యో బుద్దేః పరతస్తు సః ॥**42**॥

అర్జునా! ఈ శరీరం కంటే ఇంద్రియాలు అతీతమైనవి సూక్ష్మమైనవి మరియు బలమైనవని తెలుసుకో. ఇంద్రియాలకంటే అతీతమైనది మనస్సు. ఇది వాటికంటే బలమైనది. మనస్సు కంటే అతీతమైనది బుద్ధి. మరి ఆ బుద్ధి కంటే అత్యంత అతీతమైనది నీ యొక్క ఆత్మ. కాబట్టి ఇంద్రియాలను, మనస్సును మరి బుద్దిని వశం చేసుకోవడంలో సమర్థుడవు కమ్ము.

శ్లో ॥ ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మాన మాత్మనా ।
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్ ॥**43**॥

ఈ ప్రకారంగా బుద్ధికంటే అతీతమైనదీ, సూక్ష్మమైనదీ బలమైనదీ అయిన నీ ఆత్మను తెలుసుకొని, ఆత్మ బలాన్ని అర్థం చేసుకొని, బుద్ధి ద్వారా నీ మనస్సును వశంలోకి తెచ్చుకొని అర్జునా! ఈ కామరూపమయిన దుర్జయ శత్రువును సంహరించు. నీ శక్తిని తెలుసుకొని ఈ దుర్జయ శత్రువును సంహారించు. కామం ఒక దుర్జయ శత్రువు. ఇంద్రియాల ద్వారా ఈ ఆత్మను మోహితం చేస్తుంది. కాబట్టి నీ శక్తిని తెలుసుకొని, ఆత్మను బలవంతునిగా తెలుసుకొని, ఈ కామరూపి అయిన శత్రువును చంపు. ఇప్పుడు ఈ శత్రువు ఆంతరంగికమైనదని, మరియు యుద్ధం కూడా అంతర్దేశానికి సంబంధించినదని చెప్పనవసరం లేదు.

సారాంశం :

చాలా మంది గీతా ప్రేమికులు, వ్యాఖ్యానకారులు ఈ అధ్యాయానికి 'కర్మయోగం' అని పేరు పెట్టారు, కానీ యిది అసంగతమైనది. రెండవ అధ్యాయంలో యోగేశ్వరుడయిన శ్రీకృష్ణుడు 'కర్మ' పదాన్ని మొదటి సారిగా ఉపయోగించాడు. అతను కర్మ యొక్క మహత్వాన్ని ప్రతిపాందిచి అతనిలో కర్మ జిజ్ఞాసను జాగృతం చేశాడు ఇక ఈ అధ్యాయంలో అతడు కర్మను

నిర్వంచించాడు, యజ్ఞం యొక్క ప్రకియే కర్మ. అంటే యజ్ఞం ఒక నిర్ధారిత దిశ మాత్రమే. దీన్ని తప్పించి యింకేదైనా కూడా చేస్తే, అది ఈ లోకం యొక్క బంధమే. శ్రీకృష్ణుడు చెప్పిన ఆ కర్మ 'మోక్ష్యఽసే శుభాత్'– సంసార బంధం నుంచి ముక్తిని కలిగిస్తుంది.

శ్రీకృష్ణుడు యజ్ఞం యొక్క ఉత్పత్తిని గురించి చెప్పాడు అది ఏమియిస్తుంది? దాని విశిష్టతలను వివరించాడు. యజ్ఞం చేయడం గూర్చి వివరించాడు. అతను అన్నాడు– ఈ యజ్ఞం యొక్క ప్రక్రియే కర్మ. దీనిని ఎవ్వరైతే చేయరో, అటువంటి వారు పాపాత్ములు, వారు వ్యర్థంగా జీవిస్తారు. ఇంతకు పూర్వంలో ఉండిన మహాపురుషులు కూడా కర్మను చేయుడం వలనే పరమనైష్కర్మ్యాన్ని. సిద్ధిని పొందారు. వారు ఆత్మ తృప్తులు, వారికి కర్మయొక్క అవసరం లేదు. అయినా కూడా తరువాత వారి యొక్క మార్గ దర్శనానికై వారు కూడా కర్మను చేస్తూ ఉండేవారు. ఆ మహాపురుషులతో శ్రీకృష్ణుడు తనని సమానం చేసుకొన్నాడు– నాకూ్కడా యిప్పుడు కర్మవలన ప్రయోజనం లేదు. కానీ నేను కూడా తరువాతి వారి హితంకై కర్మ చేస్తాను. శ్రీకృష్ణుడు స్పష్టంగా తను కూడా ఒక యోగినని తన పరిచయం ఇచ్చాడు.

కర్మలో ప్రవృత్తమయ్యే సాధకులను కర్మనుండి పలాయమానం చేయరాదని అతను చెప్పాడు. ఎందుకంటే కర్మ చేసియే ఆ సాధకులు ఆత్మ స్థితిని పొందాలి. కర్మ చేయక పోయినట్లయితే వారు భ్రష్టులై పోతారు. ఈ కర్మ కోసం ధ్యానస్థులై యుద్ధం చేయాలి. కళ్ళు మూయబడి ఉన్నాయి. ఇంద్రియాలనుంచి ముకుళించుకున్న చిత్తం నిరోధించబడింది. అలాంటప్పుడు యుద్ధం చేయడమెలా? ఆ సమయంలో కామం –క్రోధం, రాగద్వేషాలు అడ్డు గోడలవుతాయి. ఈ విజాతీయ ప్రవృత్తులను దాటి వేయడమే యుద్ధం. ఆసురీ సంపదలను, కరుక్షేత్రాన్ని, విజాతీయ ప్రవృత్తులను మెల్లమెల్లగా ఏరి పారేస్తూ. ధ్యానస్థుడవడమే యుద్ధం. వాస్తవానికి ధ్యానంలోనే యుద్ధం ఉంటుంది. ఇదే ఈ అధ్యాయం యొక్క సారాంశము. ఇందులో కర్మగురించి గానీ, యజ్ఞం గురించి గానీ చెప్పబడలేదు. యజ్ఞం గురించి గనుక అర్థమయిపోతే, కర్మ గురించి అర్థమయిపోతుంది. ఇప్పటివరకయితే కర్మ గురించి భోధపరచనే లేదు.

ఈ అధ్యాయంలో కేవలం స్థితప్రజ్ఞులైన మహాపురుషుల యొక్క శిక్షణాత్మక పద్ధతి గూర్చి వివరమివ్వబడింది. ఇవి గురుజనులకై ఇవ్వబడిన సూచనలు. కర్మ చేయక పోయినా కూడా వారికి హాని లేదు. మరి అలా చేయడం వలన వారికి తమకంటూ లాభం లేదు, కానీ ఏ సాధకులకు పరమగతి అభీష్టమో, వారి కోసం విశేషించి ఏమీ చెప్పలేదు, అలాంటప్పుడు ఇది 'కర్మయోగం' ఎలాగవుతుంది? దేన్నైతే చేయాలో ఆ కర్మ స్వరూపం కూడా స్పష్టంగా లేదు. ఎందుకంటే 'యజ్ఞం యొక్క ప్రకియే కర్మ'– ఇంత వరకు అతడు ఇంతే చెప్పాడు. యజ్ఞం గురించి చెప్పనే లేదు. కర్మ స్వరూపం ఎక్కడ స్పష్టమయింది? యుద్ధం యొక్క యథార్థ చిత్రణ గీతలో ఇక్కడే కనిపిస్తుంది.

సంపూర్ణ గీతను చదివితే, రెండో అధ్యాయంలో శ్రీకృష్ణుడు అంటాడు– శరీరం నశించునటువంటిది. కాబట్టి యుద్ధం చెయ్యి. గీతలో యుద్ధం చేయమనడానికి ఇదే గట్టి

కారణంగా చెప్పబడింది. మునుముందు జ్ఞానయోగం గురించి చెప్పే సందర్భంలో, క్షత్రియులకు యుద్ధమే కళ్యాణానికి (మేలు) ఏక మాత్రమైన సాధనంగా చెప్పబడింది. మరియు ఇంకా అంటాడు– ఈ బుద్ధి నీకోసం జ్ఞనయోగం విషయంలో చెప్పబడింది. ఏబుద్ధి? అదే జయాపజయాలు రెండింటిలోనూ లాభమే ఉంది– అని అనుకొని యుద్ధం చేయి. మళ్ళీ నాలుగో అధ్యాయంలో అంటాడు యోగంలో స్థితుడవై హృదయంలో స్థితమైన నీ ఈ సంశయాన్ని జ్ఞానరూపమయిన ఖడ్గంతో నరుకు. ఆఖడ్గం యోగంలో ఉంది. ఐదు నుంచి పదవ అధ్యాయం వరకు యుద్ధం గురించిన చర్చ లేనే లేదు. పదకొండవ అధ్యాయంలో కేవలం ఇంతే అంటాడు– ఈ శత్రువులు నా ద్వారా ముందే చంపబడ్డారు. నీవు నిమిత్త మాత్రుడవై నిలబడు, చాలు. యశస్సును పొందు. వీరు నీవు లేకుండానే చనిపోయారు, ప్రేరణ ఇచ్చేవాడు, చేయించుకుంటాడు. నీవు ఈ చనిపోయిన వారినే చంపు.

పదిహేనవ అధ్యాయంలో, సంసారం రావి చెట్టులాంటిది అని చెప్పబడింది. దాన్ని అసంగత రూపమయిన శస్త్రంతో నరికి, ఆ పరమపదాన్ని వెదకమని నిర్దేశం ఇవ్వబడింది. ఆపై అధ్యాయాలలో యుద్ధం గురించిన చర్చ లేదు. పదహారో అధ్యాయంలో నరకగాములైన అసురుల యొక్క చిత్రణ ఉంది.

మూడో అధ్యాయంలోనే యుద్ధం గూర్చి విశదీకరించబడింది. శ్లోకం 30 నుంచి శ్లోకం 43 వరకు, యుద్ధం యొక్క స్వరూపం, దాని అనివార్యత, యుద్ధం చేయనివారి వినాశం, యుద్ధంలో మరణించే శత్రువుల పేర్లు, వారిని చంపడానికి తమ శక్తిని ఆహ్వానించడం మరియు నిశ్చయంగా వారిని నరికి పారేయడం గురించిన వివరణ ఉంది. ఈ అధ్యాయంలో శత్రువులు మరియు వారి అంతరిక స్వరూపం స్పష్టంగా యివ్వబడింది. వారి వినాశానికి ప్రేరణ యివ్వబడింది. కాబట్టి–

ఓం తత్సదితి శ్రీమద్ భగవద్ గీతాసూపనిషత్సు బ్రహ్మ విద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే 'శత్రు-వినాశ-ప్రేరణం' నామ తృతీయోऽధ్యాయః ॥**3**॥

ఈ ప్రకారంగా శ్రీమద్భగవద్గీత ఉపనిషత్తులు మరియు బ్రహ్మవిద్యా మరియు యోగ శాస్త్రం విషయంలో శ్రీకృష్ణార్జునుల సంవాదంలో ''శత్రు–వినాశ–ప్రేరణ' అనబడు మూడవ అధ్యాయం పూర్తయింది.

ఇతి శ్రీమత్పరమహంస పరమానందస్య శిష్య స్వామీ అడగడానంద కృతే శ్రీమద్‌భగవద్ గీతా యాః-- 'యథార్థ గీతా' భాష్యే 'శత్రు-వినాశ-ప్రేరణ' నామ తృతీయోధ్యాయః॥**3**॥

ఈ ప్రకారంగా శీమత్పరమహంస పరమానందగారి శిష్యుడు స్వామి అడగడానంద గారిచే రచించబడిన శ్రీమద్ భగవద్ గీత యొక్క భాష్యం యథార్థ గీతాలో ''శత్రువు–వినాశ–ప్రేరణ'' అనే మూడో అధ్యాయం సంపూర్ణమయింది.

॥హరి ఓం తత్సత్॥

ఓం

శ్రీ పరమాత్మనే నమః

# చతుర్థ అధ్యాయము

మూడో అధ్యాయంలో యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు విశ్వాసం కలిగించాడు. ''దోషదృష్టినుంచి రహితుడై ఏ మానవుడు శ్రద్ధా యుక్తుడై నా అభిప్రాయానికి అనుగుణంగా నడుచుకుంటాడో, అతడు కర్మ బంధం నుంచి విముక్తి పొందుతాడు'', అని నమ్మకంగా చెప్పాడు. కర్మ బంధం నుండి విముక్తిని ఇప్పించే సామర్థ్యం యోగం (జ్ఞాన యోగం లేక కర్మ యోగం, రెండింటిలోనూ)లో, ఉంది. యోగంలోనే యుద్ధ సంచారం నిహితమై ఉంది. ప్రస్తుత అధ్యాయంలో ఈ యోగానికి ప్రేరకులు ఎవరు? ఇది క్రమంగా ఎలా వికసిస్తుంది ? అని వివరిస్తాడు.

శ్రీభగవానువాచ-

శ్లో ॥ ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహమవ్యయమ్ ।
వివశ్వాన్మనవే ప్రాహ మనురిక్ష్వాకవేఽబ్రవీత్ ॥1॥

అర్జునా! నేను ఈ అవినశ్వర యోగాన్ని, కల్పాదిలో వివస్వానుడి (సూర్యుడు)కి చెప్పాను, వివస్వానుడు మనువుకు, మనువు ఇక్ష్వాకునకు చెప్పాడు. ఎవరు చెప్పారు? నేను. (శ్రీకృష్ణుణ్ణి). శ్రీకృష్ణుడు ఎవరు ? ఒక యోగి, తత్త్వస్థితుడైన ఒక మహాపురుషుడే ఈ అవినశ్వర యోగాన్ని కల్పానికి ఆరంభంలో అంటే భజన ప్రారంభంలో వివస్వానుడు అంటే వివశులైనవారికి చెప్తాడు. శ్వాసలో సంచారం చేయిస్తాడు. ఇక్కడ సూర్యుడు ఒక ప్రతీక మాత్రమే, ఎందుకంటే శ్వాసలోనే ఆ పరమ ప్రకాశ స్వరూపం ఉంది. మరియు అక్కడే అతడిని పొందే విదానం ఉంది. వాస్తవికమైన ప్రకాశదాత (సూర్యుడు) అక్కడే ఉన్నాడు.

ఈ యోగం అవినశ్వరము. శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు– ఇందులో ఆరంభానికి నాశనం లేదు. ఈ యోగాన్ని ప్రారంభం చేస్తే చాలు అది పూర్ణత్వాన్ని ఇప్పించి తీరుతుంది. శరీరంలో కల్పం (మార్పు) ఔషధుల ద్వారా జరుగుతుంది. కానీ ఆత్మలో మార్పు భజన ద్వారా వస్తుంది. భజన ఆరంభమే 'ఆత్మ–కల్పం' యొక్క ఆది. ఆసాధన– భజన కూడా ఎవరో ఒక మహాపురుషుడి ఆశీర్వాదమే. మోహం యొక్క మత్తులో అచేతనుడైన ఆదిమ మానవుడు భజన యొక్క ఎలాంటి సంస్కారమూ లేనివాడు, యోగం విషయంలో ఎప్పుడూ ఆలోచించనివాడు– ఎవరైనా మహాపురుషుణ్ణి చూస్తే, అతని దర్శన మాత్రంచే, అతని మాటలు

వినడం వల్లనే, అతనికి చిన్న-చిన్న సేవలు చేయడం వల్లనే. అతడి సాన్నిధ్యంలో తనలోనూ యోగానికి సంబంధించిన సంస్కారం సంచరితం కావడం మొదలవుతుంది. గోస్వామి తులసీదాసు దీని విషయంలో ''జే చితయె ప్రభు జిన్హె ప్రభు హేరే', 'తే సబ్ భయే పరమ పద్ జోగు' (రామచరిత మానసం) (ప్రభువును, పరమాత్ముణ్ణి చూచిన వారిని చూచిన వారు పరమ పద ప్రాప్తికి యోగ్యులవుతారు) అని అన్నాడు.

శ్రీకృష్ణుడు ఇలా అంటాడు- ఈ యోగాన్ని నేనే ఆరంభంలో సూర్యునికి చెప్పాను. 'చక్షోఃసూర్యో అజాయత్' మహా పురుషుని దృష్టి- నిక్షేపం మాత్రం చేత యోగం యొక్క సంస్కారం శ్వాసలో ప్రసారమయి పోతుంది. స్వయం ప్రకాశమైన, స్వవశుడైన పరమేశ్వరుని నివాసం అందరి హృదయాలలో ఉంది. శ్వాసను నిరోధించడమే అతణ్ణి పొందుటకు విధానము. శ్వాసలో సంస్కారాల సృజనమే సూర్యునితో చెప్పడం. సమయం వచ్చినప్పుడు ఈ సంస్కారం మనస్సులో స్ఫురితమవుతుంది. ఇదే సూర్యుడు మనవుతో చెప్పడం. మనస్సులో స్ఫురితమవగానే మహాపురుషుని ఆ వాక్యం పట్ల ఒక కోరిక జాగృత మవుతుంది. మనస్సులో గనుక ఒక కోరిక ఉంటే దానిని తీర్చుకోవాలి అనే ఇచ్ఛ తప్పకుండా ఉంటుంది. ఇదే మనువు ఇక్ష్వాకునితో చెప్పడం. నియత కర్మ చేయాలనే ఇష్టం ఏర్పడుతుంది. అది అవినశ్వరమూ, కర్మ బంధం నుంచి ముక్తి ఇప్పించేది అయిన నియత కర్మ చేయాలనే కోరిక. అలా కర్మ చేయడం మొదలవుతుంది. మరియు ఆరాధన వేగం పుంజుకుంటుంది. పుంజుకొని, ఈ యోగం ఎక్కడికి చేర్చుతుందనే విషయం గురించి శ్రీకృష్ణుడు ఇలా అంటాడు-

శ్లో ॥ ఏవం పరమ్పరాప్రాప్తమిమం రాజర్షయో విదుః ।
సకాలేనేహ మహతా యోగో నష్టః పరంతప ॥**2**॥

ఈప్రకారంగా ఎవరైనా మహాపురుషుని ద్వారా సంస్కార రహితులైన పురుషుల శ్వాసలోకి, శ్వాసలో నుంచి మనస్సులోకి, మనస్సులో నుంచి ఇచ్ఛలోకి ఈ యోగం సంచరితం చేయబడుతుంది. ఆ సంచారం తీవ్రమైనప్పుడు క్రియాత్మక ఆచరణలోకి మారుతూ, ఈ యోగం క్రమంగా వృద్ధి చెందుతూ రాజర్షి శ్రేణి వరకు చేర్చుతుంది, ఆ దశలోకి వెళ్ళితే, ఇదంతా తెలుస్తుంది. ఈ స్థాయిలోని సాధకుడిలో రిద్ధులు- సిద్ధులు సంచారితమవుతాయి. ఆ యోగం ఈ మహత్వపూర్ణ కాలంలో ఈ లోకం (శరీరం)లోనే సాధారణంగా నష్టమయి పోతుంది. ఈ సరిహద్దును దాటటం ఎలా ? ఈ విశిష్ట దశకు చేరుకొని అందరూ నాశనమై పోతారా ? శ్రీకృష్ణుడు ఇలా అంటాడు- కాదు, నా ఆశ్రితులై, నా ప్రియ భక్తులై, అనన్య మనస్కులై ఉన్న వారు నశించరు.

శ్లో ॥ సయేవాయం మయా తేఽధ్య యోగః ప్రోక్తః పురాతనః ।
భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేత దుత్తమం ॥**3**॥

ఈ పురాతన యోగాన్ని ఇప్పుడు నేను నీ కోసం వివరించాను, ఎందుకంటే నీవు నా భక్తుడవు, మిత్రుడవు మరియు ఈ యోగం ఉత్తమమైనది, రహస్యపూర్ణమయినది. అర్జునుడు క్షత్రియ శ్రేణికి చెందిన సాధకుడు, రిద్ధులు, సిద్ధుల యొక్క ఆటుపోట్ల వలన సాధకుడు

నష్టమైపోయే రాజర్షిదశను పొందినవాడు. ఈ కాలంలో కూడా యోగం కళ్యాణం చేయగల దశలోనే ఉంది, కానీ సాధారణంగా సాధకుడు ఇక్కడకు చేరుకొని తడబడి పోతాడు. అలాంటి అవినశ్వరమూ, రహస్య మయమూ అయిన యోగాన్ని శ్రీకృష్ణుడు అర్జునుడికి చెప్పాడు, ఎందుకంటే భ్రష్టమయ్యే దశలో అర్జునుడు ఉన్నాడు. ఎందుకు చెప్పాడు? ఎందుకంటే నువ్వు నా భక్తుడవు, అనన్య భావంతో నాఆశ్రయాన్ని పొందినవాడవు, ప్రియుడవు, మిత్రుడవు.

అధ్యాయం ఆరంభంలో భగవంతుడు ''నాశరహితమైన ఈ యోగాన్ని కల్పాదిలో నేనే సూర్యునితో చెప్పాను'' అన్నాడు. సూర్యుని నుంచి మనువుకు ఇదే గీత లభించింది. మనువు దానిని తన స్మృతిలో సేకరించాడు. రాజర్షులు తెలుసుకున్న ఇదే స్మృతి మనువు నుంచి ఇక్ష్వాకునకు లభించింది. కానీ ఆ తర్వాత కాలంలో ఈ యోగం లుప్తమైంది. పురాతనమైన ఆ స్మృతి జ్ఞానాన్నే భగవంతుడు అర్జునునకు చెప్పాడు. సారాంశం ఏమిటంటే, ఏ జ్ఞానమైతే మనువుకు లభించిందో, అదియే ఈ ''గీత''. మనువుకు ఇదే పైతృక సంపత్తి రూపంలో లభించింది. దీనికన్నా అతను ఇంకేస్మృతిని ధరిస్తాడు? ఎలాగైతే మనువుకు లభించిందో, అలాగే గీతా జ్ఞానాన్ని విన్న తర్వాత పద్దెనిమిదవ అధ్యాయం చివరలో అర్జునుడు ''నాకు స్మృతి లభించింది'' అన్నాడు. కాబట్టి శ్రీమద్ భగవద్ గీత యే విశుద్ధ మనుస్మృతి.

ఏ పరమాత్ముణ్ణి మనం కావాలనుకోంటున్నామో. ఆ (సద్గురువు) పరమాత్ముడు ఆత్మతో అభిన్నుడై ఎప్పుడైతే నిర్దేశించడం మొదలు పెడతాడో, అప్పటినుంచే, వాస్తవికమైన భజన ఆరంభమవుతుంది. ప్రేరేపించబడు ఈ దశలో పరమాత్ముడు మరియు సద్గురువు ఒకరి కొకరు పర్యాయాలు. ఏ స్థాయిలో నైతే మనం నిలబడ్డామో, ఆ స్థాయికి ఎప్పుడైతే స్వయంగా ప్రభువు హృదయంలోకి దిగి వస్తాడో, నియంత్రణ చేయడం మొదలు పెడ్తాడో, తడబడినప్పుడు సంభాలించుకుంటాడో, అప్పుడే మనస్సు వశంలోకి వస్తుంది– ''మన్ బస్ హోయి తబహిం, జబ్ ప్రేరక్ ప్రభు బరజే' ఎప్పటి వరకు ఇష్ట దైవం రథికుడై ఆత్మతో అభిన్నుడై ప్రేరకుడి రూపంలో నిలబడడో, అంత వరకు సరియైన విధంగా ఈ పథంలో ప్రవేశమే దొరకదు. ఆ సాధకుడు తప్పకుండా అభ్యర్థియే. కానీ అతని దగ్గర భజన ఏది?

'పూజ్య గురుదేవ్ భగవాన్' అనేవారు ''ఆహ్ ! నేను చాలా సార్లు నష్టమై పోతూ–పోతూ బ్రతికి పోయాను. భగవంతుడే బ్రతికించాడు. భగవంతుడు యిలా బోధపరిచాడు, అలా అన్నాడు''. నేను అడిగాను– ''గురువుగారూ! భగవంతుడు మాట్లాడగలడా ?'' మాట్లాడతాడా?'' ఆయన అన్నారు– ''తప్పకుండా, ఆహ్! భగవంతుడు ఎలా మాట్లాడతాడంటే నువ్వు నేను మాట్లాడుకున్నట్లే, గంటల కొద్దీ మాట్లాడతాడు మరియు క్రమం తప్పదు కూడా''. నేను విచారమగ్నుణ్ణై పోయాను, భగవంతుడు ఎలా మాట్లాడతాడని ఆశ్చర్యం వేసింది కూడా, ఇదో గొప్ప విషయం కూడా. కొంచెం సేపైన తర్వాత గురువుగారన్నారు ''ఎందుకు విచారపడతావు? నీతో కూడా మాట్లాడతాడు.'' వారి మాట అక్షరా సత్యమైంది మరియు ఇదియే సహభావం. అంటే ఒక మిత్రుడిలాగా అతను నిరాకరిస్తూనే ఉండాలి, అప్పుడే ఈ భ్రష్టమయ్యే స్థితిని సాధకుడు దాట గలుగుతాడు.

ఇప్పటివరకు శ్రీకృష్ణుడు ఒక మహాపురుషుని ద్వారా యోగం యొక్క ఆరంభం, అందులో కలిగే వ్యవధానాలు, వాటిని దాటగలిగే ఉపాయాల గురించి చెప్పాడు. ఆ మీద అర్జునుడు ఇలా ప్రశ్నించాడు–

అర్జునా ఉవాచ–

శ్లో ॥ అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః ।
కథమే తద్విజానీయాం త్వమాదౌ ప్రోక్తవానితి ॥**4**॥

''భగవన్! మీ జన్మ 'అపరం'– ఇప్పుడయినది మరియు నాలోని శ్వాస సంచారం చాలా పురాతనమైంది, అలాంటప్పుడు ఈ యోగాన్ని, భజన యొక్క ఆదిలో మిరే చెప్పారని నేనెలా నమ్మను? దీనిపై యోగేశ్వరుడు శ్రీకృష్ణ మహారాజు ఇలా చెప్పాడు–

శ్రీభగవానువాచ–

శ్లో ॥ బహూనిమే వ్యతీతాని జన్మాని తవ చార్జున ।
తాన్యహం వేద సర్వాణినత్వం వేత్థ పరం తప ॥**5**॥

అర్జునా! నేను, నీవు చాలా జన్మలు ఎత్తాము. హే! పరంతపా! అవన్నీ నీకు తెలియవు, కానీ నాకు తెలుసు. సాధకుడికి తెలియదు, స్వరూపస్థుడైన మహాపురుషునికి తెలుసు, అవ్యక్తమైన స్థితిని పొందిన వారికి తెలుసు. మీరు అందరిలాగే పుడతారా? శ్రీకృష్ణుడు అంటాడు– ''లేదు, స్వరూపం యొక్క ప్రాప్తి శరీరం యొక్క ప్రాప్తి కంటే భిన్నమైనది. నాజన్మ ఈ కన్నులతో చూడలేనటువంటిది. నేను అజన్ముడను, అవ్యక్తుడను, శాశ్వాతమైన వాడనైయుండి కూడా శరీరంపై ఆధారపడిన వాడను.

**''అవధూ! జీవత్ మే కర్ ఆశా ।**
**ముయే ముక్తి గురు కహేస్వార్థీ, ఝూఠా దే విశ్వాసా॥ ''**

శరీరం ఉంటూ ఉండగానే, ఆ పరమతత్త్వంలో ప్రవేశం పొందవచ్చును. లేశమాత్రంగానైనా లోపముంటే, మళ్ళీ జన్మనెత్తవలసివస్తుంది. ఇప్పటి వరకూ అర్జునుడు శ్రీకృష్ణుణ్ణి తనతో సమానమైన దేహధారుడనే అనుకుంటున్నాడు. అతను ఒక ఆంతరంగిక ప్రశ్న అడుగుతాడు. మీ జన్మ అందరిలాగానే అవుతుందా? మీరు కూడా శరీరధారుల లాగానే జన్మించుతారా? శ్రీకృష్ణుడు అంటాడు–

శ్లో ॥ అజోఽపి సన్నవ్యయా త్మా భూతానా మీశ్వరోఽపిసన్ ।
పకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా ॥**6**॥

నేను వినాశరహితుడను, పునర్జన్మరహితుడను మరియు సమస్త ప్రాణుల యొక్క శ్వాసలో సంచరితుడనయి కూడా, నా ప్రకృతిని ఆధీనం చేసుకొని, ఆత్మ–మాయచే ప్రకటమవుతాను. ఒక మాయ అవిధ్య. అది ప్రకృతి పట్ల విశ్వాసం కలిగిస్తుంది. నీచమైన

మరియు అధమ యోనులలో జన్మించడానికి కారణమవుతుంది. రెండవమాయ– ఆత్మమాయ, అది ఆత్మలో ప్రవేశం ఇప్పిస్తుంది. స్వరూపం జన్మించడానికి కారణమవుతుంది. దీనినే యోగమాయా అని కూడా అంటారు. దేనినుంచైతే మనం వేరుగా ఉన్నామో, ఆ శ్వాశ్వత స్వరూపంతో ఇది మనలను కలుపుతుంది. ఆ ఆత్మిక ప్రక్రియ ద్వారా నేను నా త్రిగుణమయ ప్రకృతిని ఆధీనంగా చేసుకుని ప్రకటమవుతాను.

సాధారణంగా లోకులు అంటారు– 'భగవంతుడు అవతరిస్తాడు, అప్పుడు దర్శనం చేసుకొందాము' అని. శ్రీకృష్ణుడు అంటాడు– 'ఇతరులు చూచే విధంగా జరిగేది కాదు. స్వరూపం యొక్క జన్మ, పిండరూపంలో జరగదు. శ్రీకృష్ణుడు అంటాడు– యోగసాధన ద్వారా, ఆత్మమాయ ద్వారా నా త్రిగుణమయ ప్రకృతిని స్వవశం చేసుకొని, నేను క్రమంగా ప్రకటమవుతాను. కానీ ఏ పరిస్థితులలో ?–

శ్లో // యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత ।
అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహం ॥7॥

హే అర్జునా ! ఎప్పుడైతే పరమధర్ముడైన పరమాత్ముని కోసం హృదయం గ్లానితో నిండి పోతుందో, ఎప్పుడైతే అధర్మం యొక్క వృద్ధిని భావికుడు దాటలేననుకుంటాడో, అప్పుడు నేను ఆత్మను సృష్టించడం మొదలు పెడతాను. అలాంటి గ్లానే మనువుకి ఏర్పడింది–

**'హృదయ్ బహుత్ దుఃఖ లాగ్, జనమ గయవు హరి భగతి బిను!'**
(జీవితమంతా హరిభజన లేకుండా గడిచి పోయిందని మనస్సుకు చాలా బాధగా ఉంది).
(రామచరిత మానసం)

ఎప్పుడైతే మీ హృదయం అనురాగంతో నిండి పోతుందో. ఆ శాశ్వత ధర్మం కోసం **'గద్గద గిరాం నయన బహ నీరా'** (గద్గద స్వరం, కన్నీళ్ళతో నిండిన నయనాలు), స్థితి వస్తుందో, ఎప్పుడైతే ప్రయత్నం చేసి కూడా అనురాగయుక్తుడు అధర్మాన్ని దాటలేక పోతాడో అటువంటి పరిస్థితులలో నేను నా స్వరూపాన్ని రచించుతాను. అంటే భగవంతుడి ఆవిర్భావం కేవలం అనురాగ యుక్తుడి కోసమే, మరియు –

**సోకేవల్ భగతన్ హిత్ లాగీ!** (రామచరిత మానసం 1/12/5)

(ఆ అవతారం కేవలం భక్తుల కొరకే) ఈ అవతారం ఎవరో అదృష్టవంతుడైన సాధకుని అంతరాళంలో సంభవిస్తుంది. మీరు ఆవిర్భవించి ఏం చేస్తారు?

శ్లో // పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్ ।
ధర్మ సంస్థాప నార్థాయ సంభవామి యుగే యుగే ॥8॥

అర్జునా! 'సాధూనాం పరిత్రాణాయ'– సాధించవలసిన పరమ సాధ్యుడు ఏక మాత్రుడైన పరమాత్ముడే, ఎవరినైతే సాధించిన తర్వాత ఇంక సాధన ఉండదో, అతనిని

సాధించడంలో ప్రవేశం యిప్పించ గలిగే వివేకం, వైరాగ్యం, నియంత్రణ మొదలగు దైవీ సంపదను నిర్విఘ్నంగా ప్రవహింప చేయడానికి మరియు 'దుష్కృతాం' – వేటి వల్లనైతే దూషిత కార్యాలు రూపుదిద్దుకొంటాయో, ఆ కామ, క్రోధం, రాగద్వేషాలు మొదలైన విజాతీయ ప్రవృత్తులను సమూలంగా నాశనం చేయడం కోసం మరియు ధర్మాన్ని చక్కగా స్థిరపరచడం కోసం నేను ప్రతి యుగంలో ఆవిర్భవిస్తాను.

యుగం అంటే తాత్పర్యం సత్యయుగం, త్రేతా, ద్వాపారాలనికాదు, యుగ ధర్మాల ఉచ్చనీచాలు మనుష్యుల స్వభావంపై ఆధారపడి ఉంటాయి. యుగ ధర్మాలు ఎల్లప్పుడూ ఉంటాయి. రామచరిత మానసంలో దీనిని గురించి ఇలా చెప్పబడింది.

'నిత్ జుగ్ ధర్మహోహి సబ్ కేరే । హృదయ రామ్ మాయాకే ప్రేరే॥

(రామచరిత మానసం – 7/10/1)

యుగధర్మాలు అందరి హృదయాలలో ప్రతి నిత్యం జరుగుతూనే ఉంటాయి. అవిధ్య వలన కాదు. విధ్య వలన రామమాయ యొక్క ప్రేరణచేత హృదయంలో యుగ ధర్మావిర్భావం అవుతుంది. ప్రస్తుత శ్లోకంలో దేనినైతే ఆత్మ మాయ అనడం జరిగిందో, అదే రామమాయ. హృదయంలో రాముని స్థితి ఇప్పించగలిగేదే, రాముని ప్రేరితమైనదీ ఆవిధ్య. ఇప్పుడు ఏ యుగం నడుస్తోందో ఎలా అర్థం చేసుకోవాలి అన్నది, 'సుద్ధ సత్వ సమతా విగ్యానా। కృత ప్రభావ్ ప్రసన్న మన్ జానా॥' (రామచరిత మానసం 7/103/2), ఎప్పుడైతే హృదయంలో శుద్ధ సత్త్వ గుణమే కార్యరతమై ఉండునో, రాజసం మరియు తామసం రెండు గుణాలూ అణగారి పోతాయో, ద్వంద్వాలు సమాప్తమయి పోతాయో, ఎవరికీ మరొకరి పైన ద్వేషం ఉండదో, విజ్ఞానం ఉంటుందో, అంటే ఇష్ట దైవం యొక్క నిర్దేశాలను స్వీకరించడానికీ వాటిని అనుసరించడానికి సామర్థ్యం ఉంటుందో, మనస్సులో ప్రసన్నత్వం పూర్ణంగా సంచరిస్తుందో, ఎప్పుడైతే ఇలాంటి యోగ్యత వస్తుందో, అప్పుడు సత్యయుగంలో ప్రవేశం దొరుకుతుంది. ఇదే ప్రకారంగా మిగిలిన రెండింటిని వర్ణన చేయబడింది. మరియు చివరలో–

'తామస్ బహుత్ రజోగుణ థోరా।
కలి ప్రభావ్ విరోధ్ చహుం ఓరా॥

తామసగుణం బహుళంగానూ, లేశమాత్రంగా రజోగుణం కూడా ఉంటూ, నాలుగు వైపుల శత్రువులు మరియు విరోధులతో చుట్టు బెట్టుకొని ఉంటే, ఆ వ్యక్తి కలియుగ పురుషుడనబడును. ఎప్పుడైతే తామస గుణం కార్యరతమవుతుందో, అప్పుడు మనుష్యునిలో బద్ధకం, నిద్ర మరియు అశ్రద్ధ ఎక్కువగా ఉంటాయి. అతడు కర్తవ్యాన్ని గుర్తించి కూడా అందులో ప్రవృత్తుడు కాలేడు. నిషిద్ధ కర్మను గుర్తించి కూడా దాని నుంచి నివృత్తి పొందలేడు. ఈ ప్రకారంగా యుగ ధర్మాల యొక్క పెరగడం– తరగడం అనేది మనుష్యుల యొక్క ఆంతరంగిక యోగ్యతలపై ఆధారపడి ఉంటుంది. కొందరు ఈ యోగ్యతలనే నాలుగు

యుగాలంటే, యింకొందరు వీటికే నాలుగు వర్ణాల పేర్లు ఇచ్చారు. మరి కొందరు సాధకుల అత్యుత్తమం, ఉత్తమం, మధ్యమం, నికృష్టమంటూ నాలుగు శ్రేణులుగా వ్యవహరించారు. ప్రతి యుగంలో ఇష్టదైవం తోడుంటాడు. ఉచ్ఛ శ్రేణిలో అనుకూల్యత బహుళ్యంగా ఉంటే, నిమ్న యుగాలలో సహాయం క్షీణంగా ఉన్నట్లు అనిపిస్తుంది.

సంక్షేపంగా శ్రీకృష్ణుడు అంటాడు- సాధించ వలసిన వస్తువును ఇప్పించే వివేకం, వైరాగ్యం మొదలగు వాటిని నిర్విఘ్నంగా ప్రవహింప చేయడం కోసం దూషణలకు కారణమయ్యే కామ-క్రోదాలను, రాగ-ద్వేషాలను పూర్తిగా నాశనం చేయడం కోసం పరమధర్మమైన పరమాత్మునిలో స్థిరంగా ఉంచడంకోసం, నేను ప్రతి యగంలోనూ, ప్రతి పరిస్థితిలోనూ, ప్రతి శ్రేణిలోనూ ప్రకటమవుతాను –కానీ ఒకే ఒక షరతు- గ్లాని ఉండాలి. ఎప్పటి వరకు ఇష్టదైవం సమర్థించడో, అప్పటి వరకు మీకు బోధపడదు- వికారాలు వినాశనమయ్యాయా, లేకపోతే ఇప్పుడింకా ఎంత మిగిలి ఉన్నాయి? ప్రవేశం నుంచి పరాకాష్ఠ పర్యంతం ఇష్టదైవం ప్రతి శ్రేణిలోనూ ప్రతి యోగ్యతలోనూ తోడు ఉంటాడు. అతను ప్రకటమవడం అనురాగ యుక్తుడయిన సాధకుని హృదయంలో జరుగుతుంది. భగవంతుడు ప్రకటమయితే అందరూ దర్శనం చేసుకుంటారేమో? శ్రీకృష్ణుడు ఇలా అంటాడు, కాదు-

శ్లో ॥ జన్మ కర్మచమే దివ్యమేవం యో వేత్తి తత్త్వతః।
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున ॥**9**॥

అర్జునా! నా యొక్క జన్మ అంటే, గ్లానితో కూడిన స్వరూప రచన మరియు నాయొక్క కర్మ అంటే దుష్కృతుల కారణాలను నాశనం చేయడం, సాధించ వలసిన వస్తువును ఇప్పించగల సామర్థ్యాలను నిర్దోషంగా సంచరింప జేయడం, ధర్మాన్ని స్థిరపరచడం, నా ఈ కర్మ, జన్మలు ఇవన్నీ దివ్యమైనవి అంటే అలౌకికమైనవి, లౌకికం కానివి. ఈ చర్మ చక్షువులతో వాటిని చూడలేము. మనస్సుతో బుద్ధితో వాటిని కొలవలేము. అవి యింత గూఢమైనవి అయినప్పుడు, వాటిని ఎవరు చూస్తారు? కేవలం 'యో వేత్తి తత్వతః' –కేవలం తత్త్వ దర్శకులే నా ఈ జన్మను మరియు కర్మను చూస్తారు. నన్ను సాక్షాత్కరింప చేసుకొని వారు పునర్జన్మను పొందకపోవడమే కాదు, నన్ను పొందుతారు.

తత్వదర్శకులే భగవంతుని జన్మను మరియు కర్మను చూడగలిగితే, 'అవతరిస్తే, దర్శనం చేసుకుందామని లక్షలమంది పోగవుతారెందుకు? మీరు తత్త్వ దర్శకులా? మహాత్ముల వేషంలో ఈ రోజున కూడా వివిధ రకాలుగా, ముఖ్యంగా మహాత్ముల వేషం ముసుగులో చాలా మంది తమ ప్రచారం చేసుకుంటూ తిరుగుతున్నారు. వారు 'అవతార'మని వారి ఏజెంట్లు ప్రచారం చేస్తారు. లోకులు గొర్రెల్లాగా అవతారాన్ని చూడడానికై త్రొక్కిసలాడతారు, కానీ శ్రీకృష్ణుడు అంటాడు- కేవలం తత్త్వ దర్శకులే అవతారాన్ని చూడగలుగుతారు. ఇప్పుడు ఎవరిని తత్త్వదర్శకులంటారు?

రెండో అధ్యాయంలో సత్యాసత్యముల నిర్ణయంచేస్తూ యోగేశ్వరుడయిన శ్రీకృష్ణుడు ఇలా అంటాడు- అర్జునా! అసత్య వస్తువుకు అస్తిత్వం లేదు. సత్యానికి మూడు

కాలాల్లోనూ అభావం లేదు. అయితే మీరు ఏం అంటారో? అతను అంటాడు– ''కాదు 'తత్త్వదర్శకులు దీన్ని చూశారు!'' ఎవరో భాషా పండితుడు చూడలేదు., ఎవరో సమృద్ధ శాలి అయిన వ్యక్తి చూడలేదు'. ఇక్కడ మళ్ళీ నొక్కి వక్కాణించుతాడు. 'నా ఆవిర్భావమైతే జరుగుతుంది, కానీ దాన్ని తత్త్వ దర్శకులే చూస్తారు. తత్త్వదర్శకుడు ఎవరనేది ఒక ప్రశ్న. ఐదు తత్త్వాలున్నాయి లేక యిర్వైఅయిదు తత్త్వాలున్నాయి. వీటి లెక్కలు నేర్చుకొని అందరూ తత్త్వదర్శకులు అయిపోరు. శ్రీకృష్ణుడు ఇంతకు ముందు చెప్పాడు– ఆత్మయే పరమ తత్త్వమని. ఆత్మ పరమపదార్థంతో సంయుక్తమై పరమాత్మునిగా మారిపోతుంది. ఆత్మ–సాక్షాత్కారం చేసుకోగల వాడే ఈ ఆవిర్భావాన్ని అర్థం చేసుకోగలడు. అవతారం ఎవరో ఒక విరహ వ్యాకులుడైన అనురాగయుక్తుడైన సాధకుని హృదయంలోనే జరుగుతుందని నిరూపించబడింది. తన కెవరు సంకేతం ఇస్తున్నారో, ఎవరు మార్గదర్శనం చేస్తున్నారో, అన్న విషయాలు ఆరంభంలో సాధకుడు అర్థం చేసుకోలేడు. కానీ పరమతత్త్వమైన పరమాత్ముని దర్శనంతో బాటే అతను చూడగలడు, అర్థం చేసుకోగలడు; శరీరాన్ని త్యజించి మళ్ళీ జన్మనుపొందడు.

శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు– ''నా జన్మదివ్యమయినది, దానిని చూచినవారు నన్ను పొందుతారు'', దానితో లోకులు అతని విగ్రహాన్ని తయారు చేసి పూజించడం మొదలు పెట్టారు, ఆకాశంలో ఎక్కడో అతని నివాసం ఉందని కల్పనలు చేసేసుకున్నారు. అది నిజం కాదు. మీరు కూడా నిర్ధారించబడిన కర్మ చేస్తే, మీ జన్మ కూడా దివ్యమైనదేనని తెలుసుకుంటారని ఆ మహాపురుషుల ఆశయం. మీరేం కాగలరో, నేను అది ముందే అయిపోయాను. నేను మీరు కోరుకుంటున్న దశను, మీ భవిష్యత్తును. మీ అంతరంగంలో మీరు కూడా ఏ రోజు అలాంటి పూర్ణత్వాన్ని పొందుతారో, అప్పుడు మీరూ శ్రీకృష్ణుడే అవుతారు. ఏదైతే శ్రీకృష్ణుని స్వరూపమో అదే మీది కూడా కావచ్చును. అవతారం బయట ఎక్కడా కాదు. అనురాగ పూరితమైన హృదయం ఉంటే గనక, మీలోపల కూడా అవతారం యొక్క అనుభూతి సాధ్యమే. అతను మిమ్మల్ని ప్రోత్సహిస్తూ ఇలా అంటాడు– ''చాలా మంది ఈ మార్గంలో పయనించి, నా స్వరూపాన్ని పొందారు''. అని

శ్లో ॥ వీతరాగ భయక్రోధా మన్మయా మాముపాశ్రితాః।
బహవో జ్ఞాన తపసా పూతా మద్భావ మాగతాః॥ 10॥

రాగం, విరాగం ఈ రెండింటికీ అతీతమైనది వీతరాగం. ఇదే విధంగా భయం–అభయం క్రోధం–అక్రోధం ఈ రెండింటికీ మించిన అనన్య భావంతో, అంటే అహంకార రహితులై నా శరణు జొచ్చిన చాలా మంది, జ్ఞాన, తపస్సులతో పవిత్రులయి నాస్వరూపాన్ని పొందారు. ఇప్పుడే యిలా జరిగిందని కాదు. ఈ విదానం ఎల్లప్పుడూ ఉంది. చాలా మంది పురుషులు ఈ ప్రకారంగా నా స్వరూపాన్ని పొందారు. ఏ ప్రకారంగా? ఎవరి హృదయమైతే అధర్మం యొక్క వృద్ధిని చూచి, పరమాత్ముని కోసం గ్లానితో నిండి పోతుందో, అప్పుడు ఆ స్థితిలో నేను నా స్వరూపాన్ని రచించుతాను. వారు నా స్వరూపాన్ని పొందుతారు. దేనినైతే శ్రీకృష్ణుడు 'తత్త్వదర్శనం' అని అన్నాడో, దానినే ఇప్పుడు 'జ్ఞానం' అని అన్నాడు. పరమతత్త్వం అంటే పరమాత్ముడే. అతనిని ప్రత్యక్ష దర్శనంతో బాటు తెలుసుకోవడమే జ్ఞానం. తెలుసుకోగలిగిన

జ్ఞానులు నా స్వరూపాన్ని పొందుతారు. ఇక్కడికి ఈ ప్రశ్న పూర్తయింది. ఇప్పుడు యోగ్యతల ఆధారంపై భజన చేసే వారి శ్రేణిని విభజన చేస్తాడు.

శ్లో ॥ యే యథా మాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహం।
మమ వర్త్మాను వర్తంతే మనుష్యాః పార్థ సర్వశః ॥ **11**॥

పార్థా! ఎవరు నన్ను ఎంత ధ్యాసతో, ఎలా భజన చేస్తారో, నేను కూడా వారిని అలాగే భజిస్తాను. అంతే పరిమాణంలో సహయోగం ఇస్తాను. సాధకుని శ్రద్ధయే కృపగా మారి, అతనికి లభిస్తుంది. ఈ రహస్యాన్ని తెలుసుకొని సాధుజనులు సంపూర్ణ భావనతో నా మార్గానికి అనుగుణంగా వ్యవహరిస్తారు. ఎవ్వరైతే నాకు ప్రియులో వారు నేనెలా వ్యవహరిస్తానో అలాగే ఆచరణ చేస్తారు. నేనేదైతే చేయించాలను కుంటున్నానో, అదే చేస్తారు.

భగవంతుడు ఎలా భజిస్తాడు? అతను రథుడై నిలబడి భక్తునితో కూడా నడుస్తాడు. ఇదే అతని భజన. వేటి వల్లనైతే దోషం ఏర్పడుతుందో వాటి వినాశానికై అతను నిలబడతాడు. సత్యంలో ప్రవేశం యిప్పించగలిగే సద్గుణాల రక్షణకై అతను నిలబడతాడు. ఎప్పటి వరకు ఇష్టదేవుడు హృదయంలో పూర్ణంగా అధిరోహించడో, అడుగడుగునా సావధాన పరచడో, అంత వరకూ ఎవ్వరైనా సరే, ఎంత భజనానందుడైనా సరే, లక్షలసార్లు కళ్ళు మూసుకున్నా, లక్షల ప్రయత్నాలు చేసినా, అతను ఈ ప్రకృతి యొక్క ద్వంద్వాన్ని దాటి పోలేడు. అతను ఎంత దూరం ప్రయాణించాడనేది అతనికెలా తెలుస్తుంది? ఇంకా ఎంత మిగిలి ఉంది? ఇష్టదైవమే ఆత్మతో అభిన్నుడై నిలబడతాడు 'నువ్వు ఇక్కడ ఉన్నావు, ఇలాచేయి, ఇలా నడు' అని మార్గదర్శనం చేస్తాడు. ఈ ప్రకారంగా ప్రకృతి యొక్క లోయల్ని దాటించుతూ, మెల్ల మెల్లగా ముందుకు సాగిస్తూ స్వరూపంలో ప్రవేశం ఇప్పిస్తాడు. భజన మాత్రం సాధకుడే చేయాలి, కానీ అతని ద్వారా ఈ పథంలో ప్రయాణించబడే దూరం ఇష్టదైవం యొక్క ఆశీర్వాదం మీద ఆదారపడి ఉంటుంది. ఇలా అని తెలుసుకొని మనుష్యులందరూ సంపూర్ణ భావనతో నన్ను అనుసరిస్తారు. ఏ ప్రకారంగా వారు వ్యవహరిస్తారు ?

శ్లో ॥ కాంక్షంతః కర్మణాం సిద్ధిం యజంత యిహ దేవతాః ।
క్షిప్రం హి మానుషే లోకే సిద్ధిర్భవతి కర్మజా ॥ **12**॥

ఆ పురుషులు ఈ మనుష్య శరీరంలో కర్మలు సిద్ధించాలని కోరుకుంటూ దేవతలను పూజిస్తారు. ఏ కర్మ? శ్రీకృష్ణుడు ఇలా అంటాడు,''అర్జునా ! నువ్వు నియత కర్మ చెయ్యి.'' నియత కర్మ ఏమిటి? యజ్ఞం యొక్క ప్రక్రియే కర్మ. యజ్ఞం ఏమిటి? సాధన యొక్క విధివిశేషం, దేనిలోనైతే శ్వాస-ప్రశ్వాసల ఆహుతి, యింద్రియాల బహిర్ముఖీన ప్రవాహం సంయమాగ్నిలో ఆహుతి చేయబడుతుందో, దాని పరిణామం పరమాత్ముని ప్రాప్తి. కర్మ యొక్క అసలు అర్థం ఆరాధన. దాని స్వరూపం ఇదే అధ్యాయంలోనే చెప్పబడింది. ఈ ఆరాధన యొక్క పరిణామం ఏమిటి? 'సంసిద్ధిం'- పరమసిద్ధి పరమాత్మునిలో- 'యాంతి బ్రహ్మ సనాతనం'- శాశ్వత బ్రహ్మలో ప్రవేశం మరియు పరమ నైష్కర్మ్యస్థితి. శ్రీకృష్ణుడు అంటాడు- నన్ను అనుసరించి వ్యవహరించేవారు ఈ మనుష్య లోకంలో కర్మ యొక్క పరిణామం కోసం మరియు పరమ నైష్కర్మ్య సిద్ధి కోసం, దేవతలను పూజిస్తారు, అంటే దైవీ

సంపదల్ని బలపరచుతారు.

మూడవ అధ్యాయంలో అతడు ఇలా అన్నాడు– ఈ యజ్ఞం ద్వారా నువ్వు దేవతలను వృద్ధి చెయ్యి, దైవీ సంపద యొక్క బలాన్ని పెంచు. ఎలా ఎలా హృదయ దేశంలో ఆ దైవీ సంపద వృద్ధి చెందుతుందో, అలా అలా నీ ఉన్నతి సాధ్యపడుతుంది. ఈ ప్రకారంగా పరస్పరం వృద్ధి చేసుకుంటూ, పరమ శ్రేయాన్ని పొందు. ఇది చివరి వరకూ ఉన్నతి చేసుకుంటూ పోయే అంతఃప్రక్రియ. దీనిని ఇంకా స్పష్టం చేస్తూ శ్రీకృష్ణుడు ఇలా అంటాడు– నా అనుకూలంగా వ్యవహరించేవారు ఈ మనుష్య శరీరంతో కర్మలు సిద్ధించడాన్ని కోరుకుంటూ ఉంటారు. తద్ద్వారా దైవీ సంపదల్ని బలపరచుకుంటారు, తద్వారా ఆనైష్కర్మ్యసిద్ధి శీఘ్రంగా లభిస్తుంది. అది అసఫలం కాదు, సఫలమే అవుతుంది. శీఘ్రం అంటే తాత్పర్యం? కర్మలో ప్రవృత్తి అవుతూనే తత్‌క్షణమే పరమసిద్ధి లభిస్తుందా? శ్రీకృష్ణుడు ఇలా అంటాడు– దొరకదు. ఇది సోపానాలుగా ఎదిగే విధానం. ఎవరూ ఒక గెంతుతో భావాతీత ధ్యానంలాంటి చమత్కారాన్ని సిద్ధింప చేసుకోలేరు. దీనిని గమనిద్దాం–

శ్లో ॥ చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః।
తస్య కర్తారమపి మాం విద్ధ్య కర్తారమవ్యయం॥ **13**॥

అర్జునా ! 'చాతుర్వర్ణ్యం మయా సృష్టం'– నాలుగు వర్ణాలను నేనే సృష్టించాను, అంటే మనుష్యుల్ని నాలుగు విభాగాలుగా విభజించడమయిందా? శ్రీకృష్ణుడు ఇలా అంటాడు– ''లేదు, 'గుణకర్మ విభాగశః'– గుణాలు కారణంగా కర్మను నాలుగు భాగాలుగా విభజించడమైంది'' గుణం ఒక కొలమానం, కొలబద్ధ మాత్రమే. తామస గుణం వుంటే బద్ధకం, నిద్ర, అశ్రద్ధ, కర్మలో ప్రవృత్తి కాలేనటువంటి స్వభావం, తెలిసుండి కూడా అకర్తవ్యం నుంచి నివృత్తి కాలేకపోవడం వంటి తప్పనిసరి గుణాలు ఉంటాయి. అలాంటి దశలో సాధన ఆరంభం చేయడం ఎలా? రెండు గంటలు మీరు ఆరాధనలో కూర్చుంటారు, ఈ కర్మ చేయడం కోసం ప్రయత్నశీలురు కావాలని కోరుకుంటారు, కానీ పది నిమిషాలు కూడా చిత్తాన్ని మీ పక్షంలోకి త్రిప్పుకోలేరు. శరీరం అయితే, కూర్చొనే ఉంది, కానీ ఏ మనస్సునైతే స్థిరంగా ఉంచాలో, అది గాలికబుర్లు చెబుతోంది, కుతర్కాలవల అల్లుతోంది. అలల తరువాత అలలు విసిరి కొడుతున్నాయి. మరి మీరెందుకు కూర్చొని ఉన్నారు? సమయం ఎందుకు వ్యర్థం చేస్తున్నారు? ఆ సమయంలో కేవలం 'పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజం' ఏ మహా పురుషుడైతే అవ్యక్త స్థితిని పొందాడో, అవినశ్వర తత్త్వంలో స్థితుడై ఉన్నాడో, అతడికి, మరియు ఈ పథంలో అగ్రసరులై ఉన్నతులైన వారి సేవ చేయడంలో నిమగ్నుడివికా. దీని వలన దుష్టసంస్కారాలు శాంతిస్తాయి, సాధనలో ప్రవేశం కలిగించే సంస్కారాలు బలపడతాయి.

క్రమంగా తామసగుణం శమించిపోయినప్పుడు రాజసగుణం యొక్క ప్రాధాన్యంతో పాటు సాత్త్విక గుణం స్వల్పంగా సంచరించడంతో సాధకుని సామర్థ్యం వైశ్యశ్రేణికి చేరుతుంది. ఆ సమయంలో అదే సాధకుడు ఇంద్రియ సంయమనం, ఆత్మిక సంపత్తిని కూడబెట్టుకోవడం స్వాభావికంగానే చేయడం మొదలు పెడ్తాడు. కర్మ చేస్తూ ఉంటే, ఆ సాధకునిలో సాత్విక గుణాలు బాగా పెరుగుతాయి. రాజసగుణం తక్కువైపోతుంది. తామసగుణం

శాంతమయిపోతుంది. ఆ సమయంలో అదే సాధకుడు క్షత్రియ శ్రేణిలోకి ప్రవేశం పొందుతాడు. శౌర్యం, కర్మలో ప్రవృత్తుడై ఉండే సామర్ధ్యం, వెనుకాడని స్వభావం, అన్ని భావాలపై ఆధిపత్య భావన, ప్రకృతి యొక్క మూడు గుణాలను ఖండించే సామర్థ్యం అతని స్వభావంలో ఏర్పడతాయి. అదే కర్మ యింకా సూక్ష్మమైనప్పుడు, సాత్విక గుణం మాత్రం కార్యపరమై ఉండినప్పుడు, మనస్సు మరియు ఇంద్రియాలపై నియంత్రణ, ఏకాగ్రత, సారళ్యం, ధ్యానం, సమాధి, ఈశ్వరీయ నిర్దేశం, ఆస్తికత మొదలయిన బ్రహ్మలో ప్రవేశం కలిగించే స్వాభావికమైన సామర్థ్యాలతో కూడి ఉన్నప్పుడు అదే సాధకుడు బ్రాహ్మణ శ్రేణికి చెందిన వాడనబడతాడు. ఇది బ్రాహ్మణ శ్రేణి యొక్క నిమ్నతమ దశ. ఎప్పుడైతే అదే సాధకుడు బ్రహ్మలో స్థితుడై పోతాడో, ఆ అంతిమ దశలో అతను స్వయంగా బ్రాహ్మణుడూ కాడు, క్షత్రియుడూ కాడు, వైశ్యుడూ, శూద్రుడు కూడా కాడు, కానీ ఇతరులకు మార్గదర్శనం చేయడానికి మాత్రం అతనే బ్రాహ్మణుడు. కర్మ ఒక్కటే- నియత కర్మ, ఆరాధన. దశలలో కలిగే భేధాలచే ఇదే కర్మను ఉచ్చ-నీచమైన నాలుగు మెట్లుగా విభజించడమైంది. ఎవరు విభజించారు? ఎవరో ఒక యోగేశ్వరుడు విభజించాడు, అవ్యక్తంలో స్థితుడైన మహాపురుషుడు విభజించాడు. వాటి కర్తనైన నన్ను, అవినశ్వరుడనైన నన్ను అకర్తగా కూడా తెలుసుకో. ఎందుకని ?

శ్లో ॥ న మాం కర్మాణి లింపంతి న మే కర్మ ఫలే స్పృహా ।
యితి మాం యోऽభిజానాతి కర్మ భిర్న స బధ్యతే ॥ **14**॥

ఎందుకంటే కర్మ యొక్క ప్రతి ఫలంలో నాకు స్పృహ (ఆసక్తి) లేదు. కర్మ యొక్క ఫలం ఏమిటి? శ్రీకృష్ణుడు ఇంతకు ముందే చెప్పాడు. యజ్ఞం దేనివల్లనైతే పూర్తవుతుందో, ఆ క్రియ యొక్క పేరు కర్మ. పూర్తి కాలంలో యజ్ఞం దేనినైతే రచిస్తుందో,ఆ జ్ఞానామృతాన్ని త్రాగిన వారు శాశ్వతమూ, సనాతనమూ అయిన బ్రహ్మలో ప్రవేశం పొందుతారు. కర్మ యొక్క పరిణామం- పరమాత్ముడు. ఆ పరమాత్ముణ్ణి పొందాలనే కోరిక కూడా ఇప్పుడు నాకు లేదు. ఎందుకంటే అతను నా నుంచి భిన్నంగా లేడు. నేను అవ్యక్త స్వరూపుణ్ణి. అతని యొక్క స్థితి గలవాడిని. దేని కొరకైతే కర్మ పై శ్రద్ధ చూపాలో, అటువంటి ఇంకో సత్త ఇప్పుడు లేదు. కాబట్టి కర్మ నన్ను బంధించలేదు. మరియు ఇదే స్థాయిలో, ఎవరైతే నన్ను తెలుసుకుంటారో అంటే ఎవరైతే కర్మ యొక్క పరిణామమైన పరమాత్ముణ్ణి పొందుతారో, వారిని కూడా కర్మ బంధించలేదు. శ్రీకృష్ణుడు ఎంతో, ఆ స్థాయిని తెలుసుకొన్న మహాపురుషుడు కూడా అంతే.

శ్లో ॥ ఏ వం జ్ఞాత్వా కృతం కర్మ. పూర్వై రపి ముముక్షు భిః।
కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వ తరం కృతం ॥ **15**॥

అర్జునా! ఇంతకు ముందు మోక్షాన్ని కోరుకున్న పురుషులు కూడా ఇది తెలుసకునియే కర్మ చేశారు. ఏం తెలుసుకొని? కర్మ యొక్క పరిణామం పరమాత్ముడే, వేరు కాదు, అనే స్థితిలో, కర్మ యొక్క పరిణామం అయిన పరమాత్ముని యొక్క స్పృహ కూడా ఉండనటువంటి దశలో ఆ పురుషుణ్ణి కర్మ బంధించలేదు. శ్రీకృష్ణుడు ఇదే స్థితికి చెందినవాడు. కాబట్టే అతను కర్మచే బంధించ బడడు. మరి ఆ స్థాయిని తెలుసుకొన్నప్పుడు, శ్రీకృష్ణునివలె

మనల్ని కూడా కర్మ బంధించలేదు. అటువంటి పురుషుడు కూడా కర్మబంధం నుంచి ముక్తుడైపోతాడు. శ్రీకృష్ణుణ్ణి 'భగవంతుడు','మహాత్ముడు, 'అవ్యక్తుడు' యోగేశ్వరుడు, అని ఏపేర్లతో పిలిచినా సరే, ఆ స్వరూపం అందరికోసం, అందరిది. ఇదే తెలుసుకుని యింతకు ముందే ముముక్షువులైన పురుషులు, మోక్షాన్ని కోరుకున్న పురుషులు కర్మ చేయడానికి ముందడుగు వేశారు. కాబట్టి అర్జునా! నువ్వు కూడా పూర్వజుల ద్వారా ఎప్పటి నుంచో చేయబడుతున్న ఈ కర్మను చెయ్యి. ఇదే కళ్యాణానికి ఏకైక మార్గం.

ఇప్పటి వరకూ యోగేశ్వరుడయిన శ్రీకృష్ణుడు కర్మ చేయడం గురించే నొక్కి చెప్పాడు. కానీ కర్మ ఏమిటన్నది స్పష్టం చేయలేదు. రెండో అధ్యాయంలో అతను 'కర్మ' అనే శబ్దాన్ని మాట మాత్రంగా ఉపయోగించాడు– దీన్ని గురించే, నిష్కామ కర్మ విషయం గురించి విను'', అని దాని విశిష్టతలను వర్ణించాడు– ఇది జన్మ–మృత్యువులనే మహాభయం నుంచి రక్షిస్తుంది, అన్నాడు. కర్మ చేసే సమయంలో తీసుకోవలసిన జాగ్రత్తలను వర్ణించాడు, కానీ కర్మ ఏమిటన్నది చెప్పలేదు. మూడో అధ్యాయంలో అతను ఇలా అన్నాడు– జ్ఞాన మార్గం నచ్చినా సరే, లేక నిష్కామ కర్మ యోగం నచ్చినా సరే, కర్మ మాత్రం చేయవలసిందే. కర్మను వదలివేయడం వలన ఎవ్వరూ జ్ఞానులు కాలేరు, కర్మను ఆరంభం చేయకపోవడం చేత ఎవరూ నిష్కర్ములు కారు. మొండిగా ఎవరైనా కర్మ చేయకపోతే, వారు మూఢులు. కాబట్టి మనస్సు ద్వారా యింద్రియాలను వశం చేసుకొని కర్మ చెయ్యి. ఏ కర్మ చేయాలి? అంటే శ్రీకృష్ణుడు నియత కర్మ చెయ్యమన్నాడు. ఇప్పుడా నిర్ధారించబడిన కర్మ ఏది? అంటే– యజ్ఞం యొక్క ప్రక్రియే నియత కర్మ అని అన్నాడు. క్రొత్త ప్రశ్న. దేనినైతే చేస్తే కర్మ జరుగుతుందో, ఆ యజ్ఞం అంటే ఏమిటి? ఇక్కడ కూడా యజ్ఞం యొక్క ఉత్పత్తిని గురించి చెప్పాడు, దాని విశిష్టతలను వర్ణించాడు. అంతే గానీ యజ్ఞం గురించి చెప్పలేదు. ఇప్పటి వరకూ కర్మ ఏమిటన్నది స్పష్టం కాలేదు. ఇప్పుడు అంటాడు– 'అర్జునా! కర్మ ఏమిటి? అకర్మ ఏమిటి? ఈ విషయంలో గొప్ప గొప్ప విద్వాంసులు కూడా భ్రమలో పడి ఉన్నారు. దాన్ని చక్కగా అర్థం చేసుకోవాలి.'' అని.

శ్లో ॥ కిం కర్మ కిమకర్మేతి కవయోऽప్యత్ర మోహితాః।
తత్తే కర్మ ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వా మోక్ష్యసేऽశుభాత్ ॥ **16**॥

కర్మ ఏమిటి? మరియు అకర్మ ఏమిటి? ఈ విషయంలో బుద్ధిమంతులైన పురుషులు కూడా భ్రమలో పడిఉన్నారు. కాబట్టి నేను ఆకర్మను గురించి నీకు స్పష్టంగా చెపుతాను, దానిని తెలుసుకొని నీవు 'అశుభాత్ మొక్ష్యసే'– అశుభం అంటే సంసార బంధం నుంచి, చక్కగా ముక్తుడవయి పోతావు. కర్మ సంసార బంధం నుంచి విముక్తినిచ్చేది. ఈ కర్మను తెలుసుకోవడం కోసమే శ్రీకృష్ణుడు మళ్ళీ వివరిస్తాడు.

శ్లో ॥ కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః ।
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః ॥ **17**॥

కర్మ యొక్క స్వరూపాన్ని కూడా తెలుసుకోవాలి, అకర్మ యొక్క స్వరూపాన్ని కూడా తెలుసుకోవాలి. వికర్మ అంటే వికల్ప శూన్యమైన విశేష కర్మ, ఆప్తపురుషుల ద్వారా

చేయబడే వికర్మను గురించి కూడా తెలుసుకోవాలి, ఎందుకంటే కర్మ యొక్క గతి చాలా గంభీరమైనది. కొంతమంది వికర్మ అంటే 'నిషిద్ధమైన కర్మ' అనీ, 'మనస్సు పెట్టి చేసిన కర్మ' అనీ అన్నారు. వాస్తవానికి యిక్కడ ఉపసర్గ 'వి' విశిష్ఠతను తెలియచేస్తుంది. ప్రాప్తి చెందిన పిదప మహాపురుషుల కర్మ వికల్ప శూన్యమవుతుంది. ఆత్మ స్థితులు, ఆత్మ తృప్తులు, ఆప్తకాములయిన మహాపురుషులకు కర్మచేయడం వలన లాభము లేదు. మరియు వదలివేయడం వలన నష్టమూలేదు. అయినా గానీ, వారు భావితరాలవారి హితాన్ని మనస్సులో పెట్టుకొని చేస్తారు. అటువంటి కర్మే వికల్ప శూన్యమైనది. విశుద్ధమైనది మరియు ఇదే కర్మ వికర్మ అని కూడా అనబడుతుంది.

ఉదాహరణకు గీతలో ఎక్కడైనా సరే, ఏదైనా కార్యానికి ముందు 'వి' ఉపసర్గ ఉంటే, అది దాని విశిష్టతను తెలియచేస్తుంది, నిష్కృష్టతని కాదు. ఎలాగంటే- 'యోగ యుక్తో విశుద్ధాత్మ విజితాత్మ జితేంద్రియః' (5/7)

ఎవరైతే యోగంతో యుక్తులై ఉంటారో, వారు విశేషంగా శుద్ధమైన ఆత్మ కలవారనీ విశేషంగా అంతః కరణాన్ని గెలిచినారనీ వారి విశిష్టతలనే తెలియచేస్తుంది. ఈప్రకారంగా గీతలో ఎక్కడెక్కడ 'వి' యొక్క ప్రయోగం కనిపిస్తుందో, అక్కడ అది విశిష్ట పూర్ణత్వాన్ని తెలియజేస్తుంది. ఈ ప్రకారంగానే 'వికర్మ' కూడా విశిష్ట కర్మనే సూచిస్తుంది, అది పరమ ప్రాప్తి పొందిన తర్వాత మహాపురుషుల ద్వారా చేయబడుతుంది, అది శుభాశుభ సంస్కారాలను కలిగించదు.

ఇప్పుడు మీరు వికర్మని గురించి తెలుసుకొన్నారు. ఇంక మిగిలినవి కర్మ మరియు అకర్మ, వాటిని తరువాత శ్లోకంలో అర్థం చేసుకొనేందుకు ప్రయత్నం చేయండి. ఇక్కడ కర్మ-అకర్మల విభజనాన్ని అర్థం చేసుకోలేక పోతే, ఎప్పటికీ అర్థం చేసుకోలేరు.

శ్లో ॥ కర్మణ్య కర్మయః పశ్యేదకర్మణి చ కర్మ యః ।
స బుద్ధిమాన్ మనుష్యేషు స యుక్తః కృత్స్న కర్మకృత్ ॥ **18**॥

ఏ పురుషుడైతే కర్మలో అకర్మను చూస్తాడో (కర్మ అంటే ఆరాధన) అంటే ఆరాధన చేస్తూ మరియు 'నేను కాదు కర్మచేస్తున్నది, గుణాల దశయే నన్ను చింతనలో నియుక్తుణ్ణి చేస్తున్నది. నేను ఇష్టదైవం ద్వారా సంచాలితుణ్ణి అవుతున్నాను అని (అర్థం చేసుకొంటూ) ఈ ప్రకారంగా అకర్మను చూచే సామర్థ్యం వస్తుందో, ధారావాహికంగా కర్మ జరుగుతూనే ఉంటుందో, అప్పుడే కర్మ సరియైన దిశలో జరుగుతోందని అర్థం చేసుకోవాలి. ఆలాంటి పురుషుడే మనుష్యులలో బుద్ధిమంతుడు, మనుష్యులలో యోగి, యోగంతో యుక్తుడైన బుద్ధిగలవాడు మరియు సంపూర్ణ కర్మలు చేయువాడు. అతని వలన కర్మ చేయడంలో లేశ మాత్రం కూడా తప్పు జరగదు.

ఆరాధనయే కర్మ అని సారాంశం. ఆ కర్మను చేయాలి. చేస్తూ అకర్మను చూడాలి- నేను యంత్రమాత్రుణ్ణి. చేయించేవాడు ఇష్టదైవం. నేను గుణాల నుంచి ఉత్పన్నమయ్యే అవస్థకు అనుగుణంగా ప్రయత్నం చేయగలుగుతాను. ఎప్పుడైతే అకర్మ యొక్క ఈ సామర్థ్యం వస్తుందో,

ధారావాహికంగా కర్మ జరుగుతూనే ఉంటుందో, అప్పుడే పరమ కళ్యాణ స్థితిని ఇప్పించే కర్మ జరుగుతుంది. 'పూజ్య గురువుగారు' 'ఎప్పటి వరకు ఇష్టదైవం, రథుడు కాడో, నియంత్రణ చేయడో, అప్పటి వరకు సరియైన పరిమాణంలో సాధన ఆరంభమే కాదు.' 'అని అనేవారు. ఇంతకు మునుపు చేసినదంతా కూడా, కర్మలో ప్రవేశించడానికై చేసిన ప్రయత్నం కంటే ఇంకేమీ కాదు. నాగలి భారమంతా ఎద్దుల మీదే ఉంటుంది, అయినా పొలాన్ని దున్నడం అనేది దున్నుతున్న రైతుడే. సరిగ్గా ఈ ప్రకారంగా సాధన యొక్క భారమంతా సాధకుని పైనే ఉంటుంది. కానీ వాస్తవికమైన సాధకుడు వెనుక ఉండి మార్గదర్శనం చేసే ఇష్టదైవమే. ఇష్టదైవం నిర్ణయించే వరకు మీరేం చేశారో మీకే తెలియదు. ప్రకృతిలో పడి తిరుగాడుతున్నామా లేక, పరమాత్ముడిలోనా అన్న విషయం కూడా అర్థం కాదు. ఈ ప్రకారంగా ఇష్టదైవం యొక్క నిర్దేశనంలో ఏ సాధకుడైతే ఈ ఆత్మిక పథంలో అగ్రసరుడవుతాడో, తనను అకర్త అనుకుంటూ నిరంతరంగా కర్మ చేస్తాడో, అతనే బుద్ధి మంతుడు, అతని తెలివితేటలు యథార్థమైనవి, అతనే యోగి. ''కర్మ చేస్తూ ఉంటామా లేక ఎప్పటికైనా ఈ కర్మ నుంచి ముక్తి దొరుకుతుందా? అనే జిజ్ఞాస స్వాభావికమైనదే. దీనిని గూర్చి యోగేశ్వరుడు ఇలా అంటాడు-.

శ్రీకృష్ణుని వచనానుసారంగా చేయబడేదంతా కర్మకాదు. కర్మ అనేది నియతమయిన క్రియ. 'నియతం కురు కర్మత్వం' అర్జునా! నీవు నియతమైన కర్మ చేయ్యుము. నియతమైన కర్మ ఏది? అప్పుడు అన్నాడు 'యజ్ఞార్థాత్కర్మాణోఽన్యత్ర లోకోఽయం కర్మ బంధనః'- యజ్ఞానికి కార్యరూపు ఇవ్వడమే తప్పించి యింకేం చేసినా, అది ఈలోకానికి సంబంధించినది మాత్రమే కానీ కర్మ కాదా? శ్రీకృష్ణుడు అంటాడు- 'అన్యత్ర లోకో యం కర్మ బంధనః – ఈ యజ్ఞానికి కార్యరూపాన్ని ఇచ్చే పని తప్పించి, వేరే ఏం చేసినా, అది ఈ లోకం యొక్క బందం, కర్మ కాదు'. 'తథర్థ కర్మ' అర్జునా! ఆ యజ్ఞం పూర్తి చేయడం కోసం చక్కగా ఆచరణ చెయ్యి. మరియు అసలు యజ్ఞం స్వరూపం అంటే, ఆరాధన యొక్క ఒక విధి విశేషమే, అదే ఆరాధ్య దైవం వరకు తీసుకొని వెళ్ళి అతనిలో విలీనం చేస్తుంది.

ఈ యజ్ఞంలో ఇంద్రియదమనం, చిత్త శమనం, దైవీ సంపద ఆర్జన యిత్యాదులను చెబుతూ, చివరికి ఇలా అంటాడు- చాలా మంది యోగులు ప్రాణాపానాల గతిని నిరోధించి, ప్రాణాయామ పరాయణులవుతారు. అప్పుడు లోపలి సంకల్పాలు జాగ్రుతం కావు. మరియు బయటి వాతావరణంలోని సంకల్పాలు మనస్సులో ప్రవేశించలేవు. అటువంటి స్థితిలో మనస్సు సర్వథా నిరోధించబడుతుంది. నిరుద్ధమయిన మనస్సుకూడా విలయమయ్యే కాలంలో ఆ పురుషుడు 'యాంతి బ్రహ్మ సనాతనం' శాశ్వతమైన, సనాతనమైన బ్రహ్మలో ప్రవేశం పొందుతాడు.- ఇవన్నీ కలిపితే యజ్ఞం. దానికి కార్యరూపాన్ని ఇవ్వడమే కర్మ. అందుచేత కర్మకు సరియైన అర్థం 'ఆరాధన'.

కర్మ యొక్క అర్థం 'భజన'. కర్మ యొక్క అర్థం 'యోగ సాధన'ను చక్కగా నిర్వహించడం, దీనిని ఈ అధ్యాయంలోనే ముందు ముందు విపులంగా వర్ణించాడు. ఇక్కడ

కర్మ మరియు అకర్మల విభజన మాత్రం జరిగింది. దీని వలన కర్మ చేసే సమయంలో, సరియైన విధానంలో చేయవచ్చు. మరియు ఆవిధానంలో అగ్రేసరులు కావచ్చు కూడా.

శ్లో // యస్య సర్వే సమారంభాః కామ సంకల్ప వర్జితాః।
జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణం తమాహుః పండితం బుధాః ॥ **19**॥

అర్జునా! 'యస్య సర్వే సమారంభాః'- ఏ పురుషుని ద్వారా సంపూర్ణత్వంతో ఆరంభం చేయబడిన క్రియ (దీనిని యింతకుముందే ఇలా చెప్పాడు- ''అకర్మగా చూచే సామర్థ్యం వచ్చినప్పుడు, కర్మలో ప్రవృత్తుడై ఉండే పురుషుడు, సంపూర్ణ కర్మలు చేయువాడవుతాడు. అతను చేయడంలో లేశమాత్రం కూడా తప్పులు ఉండవు.'') 'కామ సంకల్ప వర్జితాః' క్రమంగా అభివృద్ధి చెందుతూ, ఎంత సూక్ష్మమయి పోతుందంటే, కోరికలు మరియు మనస్సు యొక్క సంకల్ప-వికల్పాలకు అతీతమై పోతుంది (కోరికలు మరియు సంకల్పాలు నిరోధించబడటమే మనస్సును జయించిన స్థితి. అందుచేత కర్మ అంటే ఈ మనస్సును కోరికలకు మరియు సంకల్పాలకు అతీతం చేసేటటువంటిది. ఆ సమయంలో 'జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణం'- అంతిమ సంకల్పం శమించడంతోటే, మనకు తెలియనటువంటి, మనం తెలుసుకోవాలని కోరుకున్నటువంటి, ఆ పరమాత్ముణ్ణి ప్రత్యక్షంగా తెలుసుకోవడం జరుగుతుంది. క్రియాత్మక పథంపై నడచి పరమాత్ముణ్ణి ప్రత్యక్షంగా తెలుసుకోవడానికి పేరే 'జ్ఞానం' ఆ జ్ఞానంతో బాటే 'దగ్ధ కర్మాణం'.

కర్మ ఎల్లప్పటికీ దగ్ధమై పోతుంది. దేన్నయితే పొందాలో దానిని పొందడమయింది. దాన్ని మించిన సత్తా ఇంకొకటి లేదు, వెదకడానికి. కాబట్టి కర్మ చేసి కూడా వెదికే దెవరిని? ఆ తెలుసుకోవడమనే దానితో బాటు కర్మ యొక్క అవసరం లేకుండా పోతుంది. అటువంటి స్థితిని పొందిన వారినే బోధ స్వరూపులైన మహాపురుషులనీ పండితులనీ అంటారు, వారికంతా సంపూర్ణంగా తెలుసు. అటువంటి స్థితిని పొందిన మహాపురుషులు ఏం చేస్తారు? ఎలా ఉంటారు? వారు ఉండే విధానాన్ని వివరిస్తాడు-

శ్లో // త్యక్త్వా కర్మ ఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః।
కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కించిత్కరోతి సః ॥**20**॥

అర్జునా! అటువంటి పురుషుడు సాంసారిక బంధాల నుండి విడివడి నిత్యవస్తువైన పరమాత్మునిలో సంతృప్తుడై, కర్మ యొక్క ప్రతిఫలమైన పరమాత్మునిపై ఆసక్తిని కూడా త్యాగంచేసి (ఎందుకంటే పరమాత్ముడు ఇప్పుడు తనకు వేరుగా లేడు)కర్మలో చక్కగా ప్రవృత్తుడై ఉంటూ కూడా ఏమీ చేయడు.

శ్లో // నిరాశీర్యత చిత్తాత్మా త్యక్త సర్వ పరిగ్రహః।
శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషం ॥**21**॥

ఎవరైతే అంతః కరణం మరియు శరీరాన్ని గెలిచినాడో, భోగాల సమస్త సాధన

సామగ్రిని త్యాగం చేసిన వాడో, అటువంటి ఆశారహితుడయిన పురుషుని శరీరం మాత్రం కర్మ చేస్తూన్నట్లు కనబడుతుంది. వాస్తవానికి అతడు చేయడం-గీయడం అంటూ ఏమీ ఉండదు, కాబట్టి అతడు పాపాన్ని పొందడు. అతను పూర్ణత్వాన్ని పొందాడు, కాబట్టి జనన మరణాలు ఉండవు.

శ్లో ॥ యదృచ్ఛాలాభ సంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః ।
సమః సిద్ధావసిద్ధౌ చ కృత్వాపి న నిబధ్యతే ॥**22**॥

దొరికినదానితో సంతుష్టుడై ఉండే వాడు, సుఖ-దుఃఖాలు, రాగ-ద్వేషాలు మరియు హర్ష-శోకాలు మొదలయిన ద్వంద్వాలకు అతీతంగా 'విమత్సరః' ఈర్ష్యా రహితుడై ఉండేవాడు మరియు సిద్ధాసిద్ధులలో సమభావం కలిగి ఉండే పురుషుడు కర్మలను చేస్తూ కూడా బంధించబడడు, పొందిన సిద్ధి ఇప్పుడు తనకు వేరుగా లేదు. మరియు అది ఎప్పుడూ వేరుకాదు. కాబట్టి అసిద్ధి యొక్క భయంలేదు, ఈ ప్రకారంగా సిద్ధి మరియు అసిద్ధులలో సమభావం గల పురుషుడు కర్మ చేస్తూ కూడా బంధించబడడు. అతను ఏకర్మ చేస్తాడో? అదే నియత కర్మ. యజ్ఞం యొక్క ప్రక్రియ. దీనినే మళ్ళీ వివరిస్తూ ఇలా అంటాడు-

శ్లో ॥ గత సంగస్య ముక్తస్య జ్ఞానావస్థిత చేతసః ।
యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే ॥**23**॥

అర్జునా! 'యజ్ఞాయాచరతః కర్మ'- యజ్ఞం యొక్క ఆచరణయే కర్మ, మరియు సాక్షాత్కారం పేరే జ్ఞానం. యజ్ఞం యొక్క ఆచరణ చేసి, సాక్షాత్కారంతో బాటు జ్ఞానంలో స్థితుడైన, సంగదోషం మరియు ఆసక్తిలేని ముక్తుడైన, పురుషుడి యొక్క సమస్త కర్మలు బాగుగా విలీనమయి పోతాయి. ఆకర్మలు ఎటువంటి పరిణామాన్నీ ఉత్పన్నం చేయలేవు, ఎందుకంటే కర్మ యొక్క ప్రతిఫలమయిన పరమాత్ముడు అతని నుంచి వేరుగాలేడు. ఇప్పుడు ఫలంలో ప్రతిఫలమేముంటుంది? కాబట్టి ఆ ముక్తుడైన పురుషుడికి తనకోసం కర్మ చేయవలసిన అవసరం సమాప్తమయి పోతుంది. అయినా కూడా లోకహితం కోసం వారు కర్మ చేస్తారు. మరియు కర్మ చేస్తూ కూడ వారు ఆ కర్మలో బంధించబడరు. కర్మ చేస్తున్నప్పుడు ఎందుకు బంధించబడరు? అప్పుడు శ్రీకృష్ణుడిలా అంటాడు-

శ్లో ॥ బ్రహ్మార్పణం బ్రహ్మహవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్ ।
బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మ కర్మ సమాధినా ॥**24**॥

అలాంటి ముక్తుడైన పురుషుని సమర్పణ బ్రహ్మ, ఆహుతి బ్రహ్మ, అగ్ని కూడా బ్రహ్మే అంటే, బ్రహ్మరూపమయిన అగ్నిలో బ్రహ్మరూపమయిన కర్త ద్వారా ఆహుతి చేయబడేది కూడా బ్రహ్మ. 'బ్రహ్మ కర్మ సమాధినా' ఎవరి కర్మ బ్రహ్మను స్పృశించి సమాధిస్థమై పోతుందో, అతనిలో విలయమయిపోతుందో, అలాంటి మహాపురుషుడు ప్రాప్తం చేసుకోవడానికి యోగ్యమైనది కూడా బ్రహ్మే. అతను చేయడం- గీయడం అంటూ ఏమీ ఉండదు, కేవలం లోకహితానికై కర్మలో వ్యవహరిస్తాడు.

ఇది పరమాత్మని పొందిన మహాపురుషుని యొక్క లక్షణం; కానీ కర్మలో ప్రవేశించిన ప్రారంభిక సాధకుడు ఏ యజ్ఞం చేస్తాడు?

ఇంతకు ముందు అధ్యాయంలో శ్రీకృష్ణుడు 'అర్జునా! కర్మ చేయుము' అన్నాడు ఏ కర్మ? అతను 'నియత కర్మ'– అన్నాడు నిర్ధారించబడిన కర్మ చేయుము. నిర్ధారించబడిన కర్మ ఏది? అంటే ''యజ్ఞార్థాత్కర్మణోऽన్యత్ర లోకోऽయం కర్మ బంధనః' (3/9) అన్నాడు. అంటే అర్జునా! యజ్ఞం యొక్క ప్రక్రియే కర్మ. ఈ యజ్ఞం తప్ప ఏం చేసినా, అది ఈ లోకం యొక్క బంధమే, గానీ కర్మ కాదు. కర్మ సంసార బంధం నుంచి మోక్షం ఇప్పిస్తుంది. అందుచేత 'తదర్థం కర్మ కౌన్తేయ ముక్త సంగః సమాచర'– ఆ యజ్ఞాన్ని పూర్తి చేయడానికై సంగదోషం నుంచి తప్పుకొని, చక్కగా యజ్ఞాన్ని ఆచరించు అన్నాడు. ఇక్కడ ఒక నూతనమైన ప్రశ్న ఏ యజ్ఞం చేయుటచే మనచే కర్మ ఆచరించబడుతుందో, ఆ యజ్ఞం ఏమిటి? బదులుగా అతను కర్మ యొక్క విశిష్టతలను వివరించాడు. యజ్ఞం ఎక్కడి నుంచి వచ్చిందో చెప్పాడు. యజ్ఞం ఏమిస్తుంది అన్నది చెప్పాడు. దాని విశిష్టతలను వివరించాడు, కానీ యిప్పటి వరకూ యజ్ఞం ఏమిటన్నది చెప్పలేదు.

ఇప్పుడిక్కడ ఆ యజ్ఞ స్వరూపాన్ని స్పష్టం చేసాడు–

శ్లో ॥ దైవమే వాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే ।
బ్రహ్మాగ్నావపరే యజ్ఞం యజ్ఞేనైవోపజుహ్వతి ॥**25**॥

గత శ్లోకంలో యోగేశ్వరుడయిన శ్రీకృష్ణుడు పరమాత్మునిలో స్థితుడైన మహాపురుషుని యొక్క యజ్ఞాన్ని వర్ణించాడు. కానీ యితర యోగులు ఇంకా ఆతత్త్వంలో స్థితిని పొందనివారు, క్రియలో ప్రవేశించిన వారు, ఎక్కడ నుంచి ప్రారంభం చేయాలి? అప్పుడు 'దైవం యజ్ఞం' అంటే దైవీ సంపదను బల పరుస్తూ, బ్రహ్మయొక్క నిర్దేశం గల ఆ యజ్ఞం ద్వారా దేవతలను సమున్నతులను చేయండి. అని అంటాడు. హృదయ దేశంలో దైవీ సంపద ఆర్జితమవడమే నీ ప్రగతి. క్రమంగా పరస్పరం ఉన్నతి చేసుకుంటూ పరమశ్రేయాన్ని పొందుము. దైవీ సంపదను బలపరచడం, కర్మలో ప్రవేశించిన ప్రాథమిక యోగుల యొక్క యజ్ఞం.

పదహారవ అధ్యాయంలోని మొదటి మూడు శ్లోకాలలో ఆదైవీ సంపద వర్ణించబడ్డది, అది అందరిలోనూ ఉన్నది, కానీ కేవలం మహత్వపూర్ణమైన కర్తవ్యం అనుకొని వాటిని జాగృతం చేయాలి. దీనినే సూచిస్తూ, యోగేశ్వరుడు అన్నాడు– అర్జునా! నీవు శోకించవద్దు, ఎందుకంటే నువ్వు దైవీ సంపదను పొందావు. నీవు నాలో నివసిస్తావు; నా యొక్క శాశ్వత స్వరూపాన్ని పొందుతావు. ఎందుకంటే ఆ దైవీ సంపద పరమ కళ్యాణం కోసమే ఉంది మరియు దీనికి విరుద్ధంగా ఆసురీ సంపద నీచమైన మరియు అధమమైన జన్మకు కారణం అవుతుంది. ఈ ఆసురీ సంపద ఆహుతి నుంచే యజ్ఞం ఆరంభం అవుతుంది.

ఇతర యోగులు 'బ్రహ్మాగ్నౌ'– పరబ్రహ్మ పరమాత్మ రూపమయిన అగ్నిలో యజ్ఞం

ద్వారానే, యజ్ఞం యొక్క అనుష్ఠానం చేస్తారు. శ్రీకృష్ణుడు మున్ముందు ఇలా అంటాడు– ఈ శరీరంలోని 'అధియజ్ఞాన్ని నేనే. యజ్ఞముల అదిష్ఠాతను నేను. అంటే ఎవరిలో యజ్ఞాలు విలయమవుతాయో, ఆ పురుషుణ్ణి నేను. శ్రీకృష్ణుడు ఒక యోగి, ఒక సద్గురువు. ఈ ప్రకారంగా ఇతర యోగీజనులు బ్రహ్మరూపమయిన అగ్నిలో యజ్ఞం అంటే యజ్ఞస్వరూపుడైన సద్గురువుని ఉద్దేశించి యజ్ఞాన్ని అనుష్ఠిస్తారు అంటే సద్గురువు స్వరూపాన్ని ధ్యానం చేస్తారు.

శ్లో ॥ శ్రోత్రాదీనీంద్రియాణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి ।
శబ్దాదీన్విషయానన్య యింద్రియాగ్నిషు జుహ్వతి ॥**26**॥

అన్యయోగులు శ్రోత్రాధిక (చెవులు, నేత్రాలు, చర్మం, జిహ్వ, నాసిక) సమస్త ఇంద్రియాలను సంయమరూపమయిన అగ్నిలో ఆహుతి చేస్తారు. అంటే యింద్రియాలను వాటి విషయాల నుంచి వికర్షించి సంయమనం చేస్తారు. ఇక్కడ అగ్ని మండదు. ఎలాగైతే అగ్నిలోవేస్తే ప్రతి వస్తువు భస్మమై పోతుందో, సరిగ్గా అదే ప్రకారంగా సంయమనమే ఒక అగ్ని. అది ఇంద్రియాల సంపూర్ణ బహిర్ముఖీన ప్రవాహాన్ని దగ్ధం చేసేస్తుంది. ఇతర యోగులు శబ్దాదిక (శబ్దం, స్పర్శ, రూపం, రసం, గంధం) విషయాలను ఇంద్రియ రూపమయిన అగ్నిలో ఆహుతి చేస్తారు. అంటే వాటి ఆశయాల్ని మార్చేసి, సాధనకి సహాయకంగా మార్చుకుంటారు.

సాధకుడు ప్రపంచంలో ఉంటూనే భజన చేయాలి. లోకుల మంచీ చెడూ మాటలు అతను వింటూనే ఉంటాడు. విషయోత్తేజకరమయ్యే అలాంటి మాటలను విని, సాధకుడు వాటి ఆశయాల్ని మార్చుకొని, యోగం, వైరాగ్య సహాయక, వైరాగ్యోత్తేజక భావాలలో మళ్ళించి, ఇంద్రియ రూపమైన అగ్నిలో ఆహుతి చేస్తాడు. ఒకసారి అర్జునుడు చింతనలో నిమగ్నుడై కూర్చున్నాడు. అకస్మాత్తుగా అతని చెవులకు ఒక సంగీత లహరి వినిపించింది. అతను తలెత్తి చూస్తే ఊర్వశి నిలబడి ఉంది. ఆమె ఒక దేవ వేశ్య. అందరూ ఆమే రూపాన్ని చూసి ముగ్ధులై తన్మయులయిపోతున్నారు, కానీ అర్జునుడు మాత్రం ఆమెను స్నేహశీల దృష్టితో, మాతృదేవిని చూసినట్లుగా, చూశాడు. ఆ శబ్ద, రూపం వలన కలిగిన వికారాలు విలీనమయి పోయాయి, ఇంద్రియాల అంతరాళాలలోనే సమాహితమై పోయాయి.

ఇక్కడ యింద్రియాలే అగ్ని, అగ్నిలో వేసిన వస్తువెలా భస్మమయిపోతుందో, అలాగే ఆశయాన్ని మార్చి ఇష్టదైవానికి అనుకూలంగా మలచుకోవడం వలన, విషయోత్తేజకాలయిన రూప, రస, గంధ, స్పర్శ, శబ్దాదులు కూడా భస్మమై పోతాయి, సాధుకునిపై తమ చెడు ప్రభావాన్ని చూపలేవు. సాధకుడు ఈ శబ్దాధికాలపై ఆసక్తి చూపించడు, వీటిని గ్రహించడు. ఈ శ్లోకాలలో 'అపరే', 'అన్యే' అనే శబ్దాలు ఒకే సాధకుని ఉచ్చ, నీచ స్థాయిలను తెలుపుతాయే గానీ వేరు వేరు యజ్ఞాలని కాదు.

శ్లో ॥ సర్వాణీంద్రియ కర్మాణి ప్రాణ కర్మాణి చాపరే ।
ఆత్మ సంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞాన దీపతే ॥**27**॥

ఇప్పటి వరకూ యోగేశ్వరుడు ఏ యజ్ఞం గురించి చర్చించాడో, అందులో క్రమంగా దైవీ సంపదను ఆర్జించడం జరుగుతుంది, ఇంద్రియాల యొక్క సమస్త చేష్టలనూ సంయమనం

చేయడమవుతుంది, బలాత్కారం చేసే విషయోత్తేజక శబ్ధాలను ఎదుర్కొన్నప్పుడు కూడా, వాటి ఆశయాన్ని మార్చి, వాటి బారి నుండి తప్పించుకోవడం జరుగుతుంది. దీని కంటేపై స్థితికి చేరినప్పుడు, ఇతర యోగులు సమస్త ఇంద్రియాల చేష్టలనూ, ప్రాణాల క్రియలనూ సాక్షాత్కార యుక్తమయిన జ్ఞానం వలన ప్రకాశితుడైన పరమాత్ముని స్థితిరూపమయిన యోగాగ్నిలో ఆహుతి చేస్తారు. ఎప్పుడయితే సంయమనం యొక్క పట్టు ఆత్మతో కూడి తద్రూపమై పోతుందో, ప్రాణం మరియు యింద్రియాల క్రియావ్యాపారాలు అణగారి పోతాయో, అప్పుడు విషయాలను ఉద్దీప్తం చేసేటటువంటి, ఇష్ట దైవం పట్ల ప్రవృత్తిని కలిగించేటటువంటి రెండు ప్రవృత్తులు ఆత్మతో మిళితమయి పోతాయి. పరమాత్మునిలో స్తితి లభిస్తుంది. యజ్ఞం పరిణామం బహిర్గతమవుతుంది. ఇదే యజ్ఞం యొక్క పరాకాష్ఠ రూపం. ఏ పరమాత్ముడినైతే పొందాలో అతనిలోనే స్థితిని పొందితే, ఆతరువాత మిగిలేదేముంటుంది? మళ్ళీ యోగేశ్వరుడు యజ్ఞం గురించి చక్కగా బోధ పరుస్తాడు-

శ్లో ॥ ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా యోగయజ్ఞాస్థథా పరే ।
స్వాధ్యా యజ్ఞానయజ్ఞాశ్చ యతయః సంశిత వ్రతాః ॥**28**॥

అనేక మంది ద్రవ్య-యజ్ఞం చేస్తారు. అంటే ఆత్మ పథంలో మహాపురుషుల సేవలో పత్రం-పుష్పం సమర్పిస్తారు. వారు సమర్పణతో బాటు మహాపురుషుల సేవలో ద్రవ్యం ఖర్చు చేస్తారు. శ్రీకృష్ణుడు ఇంకా ఇలా అంటాడు- భక్తిభావంతో పత్రం, పుష్పం, ఫలం, తోయం మొదలగువాటిని సమర్పిస్తే వాటిని నేను స్వీకరిస్తాను. అతనికి పరమ కళ్యాణాన్ని (మేలును) కలిగించే వాడినవుతాను. ఇది కూడా యజ్ఞమే. ప్రతి ఆత్మ యొక్క సేవ, దారి తప్పిన వారిని ఆత్మ పథంలోకి తేవడం, వగైరాలు ద్రవ్య-యజ్ఞం. ఎందుకంటే అది ప్రాకృతిక సంస్కారాలను భస్మం చేయడంలో సమర్థమయినది.

ఈ ప్రకారంగానే చాలా మంది. 'తపోయజ్ఞా'- స్వధర్మపాలనలో ఇంద్రియాలను తపింపచేస్తారు. అంటే స్వభావంచే ఉత్పన్నమైన క్షమతానుగుణంగా యజ్ఞం యొక్క నిమ్నోన్నత దశల మధ్య తపిస్తారు. ఈ పథం గురించి అల్పజ్ఞత వలన, ప్రారంభిక శ్రేణికి చెందిన సాధకుడు శూద్రుడై పరిచర్యల ద్వారానూ, వైశ్యుడు దైవీ సంపదను కూడబెట్టడం వలననూ, క్షత్రియుడు కామక్రోధాదుల్ని నిర్మూలించడం ద్వారానూ, బ్రాహ్మణుడు బ్రహ్మలో ప్రవేశం పొందే యోగ్యత యొక్క స్థాయి ద్వారానూ ఇంద్రియాలను తపింపచేస్తారు. అందరికీ ఒకేలాగ శ్రమించ వలసి ఉంటుంది. వాస్తవానికి యజ్ఞం ఒక్కటే, దశల అనుసారంగా ఉచ్ఛ-నీచ శ్రేణుల తేడా.

'పూజ్య గురువుగారు' అనేవారు - ''మనస్సుతో సహా ఇంద్రియాలను మరియు శరీరాన్ని లక్ష్యానికి అనుగుణంగా తపింప జేయడమే తపస్సు అనబడుతుంది. ఇవి లక్ష్యం నుంచి దూరంగా తొలగిపోతాయి. వాటిని బలవంతంగా యథాస్థానంలో స్థిరంగా ఉంచు.'' అని.

అనేకులు యోగ-యజ్ఞాన్ని ఆచరిస్తారు. ప్రకృతిలో చిక్కుకొనిపోయిన ఆత్మను, ప్రకృతి కంటే అతీతమయిన పరమాత్మునితో కలపడం అనే ప్రక్రియ పేరే యోగం. యోగం

యొక్క నిర్వచనం అధ్యాయం 6/23లో కనిపిస్తుంది. సామాన్యంగా రెండు వస్తువుల కలయికనే యోగం అంటారు. కాగితంతో కలం కలిస్తే, పళ్ళెం మరియు బల్ల కలిస్తే యోగం జరిగిందా? లేదు, ఇవి పంచభూతాలతో నిర్మితమైన పదార్థాలు, అవన్నీ ఒకటే, రెండు కానే కావు. రెండు వస్తువులేమిటంటే ప్రకృతి మరియు పురుషుడు. ప్రకృతిలో స్థితమైన ఆత్మ, తన శాశ్వత స్వరూపమైన పరమాత్మలో ప్రవేశం పొందుతుంది, దానితో ప్రకృతి పురుషునిలో విలీనం పొందుతుంది. ఇదే యోగం. అందుచేత అనేకమంది పురుషులు ఈ కలయికలో సహాయకారులైన శమ, దమ మొదలైన నియమాలను చక్కగా ఆచరిస్తారు. యోగ యజ్ఞం చేసే వారు అహింసాది తీక్షణ వ్రతాలతో యుక్తులైన ప్రయత్న శీల పురుషులు 'స్వాధ్యాయ జ్ఞాన యజ్ఞాశ్చ'- స్వాధ్యాయం, స్వరూపం యొక్క అధ్యయనం చేసేవారు జ్ఞాన యజ్ఞ కర్తలు. ఇక్కడ యోగాంగాలు, (యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ద్యాన, ధారణ, సమాధులు) అహింసాది తీక్షణ వ్రతాలుగా చెప్పబడ్డాయి. అనేక మంది స్వాధ్యాయం చేస్తారు. పుస్తకాలను చదవడం స్వాధ్యాయానికి మొదటి మెట్టు మాత్రమే. విశుద్ధమైన స్వాధ్యాయం అంటే స్వయం యొక్క అధ్యయనం, (తన్ను తాను అధ్యయనం చేసుకోవడం) దానివలన స్వస్వరూపం ఉపలబ్ధం అవుతుంది, దాని పరిణామం జ్ఞానం, అంటే సాక్షాత్కారం.

యజ్ఞం యొక్క తరువాతి చరణం గురించి ఇలా చెప్తాడు-

శ్లో ॥ అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేऽపానం తథాపరే ।
ప్రాణాపాన గతీ రుద్ధ్వా ప్రాణాయామ పరాయణాః ॥**29**॥

చాలా మంది యోగులు అపాన వాయువులో ప్రాణవాయువును ఆహుతి చేస్తారు మరియు అదే విధంగా ప్రాణవాయువులో అపాన వాయువును ఆహుతి చేస్తారు. ఇంత కంటే సూక్ష్మ స్థితి సంప్రాప్తించినప్పుడు ఇతర యోగీజనులు ప్రాణ, అపాన గతిని నిరోధించి ప్రాణయామ పరాయణులు అయిపోతారు.

దేనినైతే శ్రీకృష్ణుడు ప్రాణ. అపాన మన్నాడో దానినే బుద్ధుడు 'అనాపాన' మన్నాడు. దీనినే అతడు శ్వాస-ప్రశ్వాస మన్నాడు. ప్రాణమంటే మీరు శ్వాసతో లోపలికి తీసుకునే వాయువు, అపానం అంటే మీరు బయటికి విడిచే శ్వాస.

మీరు శ్వాసతో బాటుగా బాహ్య వాయుమండలంలోని సంకల్పాలను కూడా గ్రహిస్తారనీ, ప్రశ్వాసలో ఈ ప్రకారంగానే అంతరంగంలోని మంచీ చెడూ చింతనల తరంగాల్ని బయటకు పంపించేస్తుంటారనీ యోగుల స్వానుభవం. బాహ్య సంకల్పాలను గ్రహించక పోవడమే ప్రాణం యొక్క ఆహుతి. మరియు లోపలి సంకల్పాలను జాగృతం కానివ్వకపోవడమే అపానం (నిఃశ్వాస) యొక్క ఆహుతి. లోపల ఎలాంటి సంకల్పాలు స్ఫురణకు రారాదు మరియు బయటి ప్రపంచంలో జరిగే చింతనలు లోపల క్షోభను ఉత్పన్నం చేయరాదు. ఈ ప్రకారంగా ప్రాణ అపానాలు రెండింటి యొక్క గతి సమానమైనప్పుడు, ప్రాణాల యొక్క ఆయామం అంటే నిరోధం జరుగుతుంది, ఇదే ప్రాణాయామము. ఇది మనస్సును జయించిన స్థితి. ప్రాణవాయువులు ఆగడం మరియు మనస్సు ఆగడం

రెండూ ఒకటే.

ప్రతి మహాపురుషుడూ ఈ ప్రకరణాన్ని గురించి చెప్పాడు. వేదాలలో దీని చర్చ ఉంది. 'చత్వారి వాక్ పారమితా పదాని' (ఋగ్వేదం 1/164/45) అథర్వణ వేదం- 9/10/27). దీనిని గురించే 'పూజ్య గురువుగారు' ఇలా చేప్పేవారు- 'ఓహో! ఒకే నామమును నాలుగు శ్రేణులలో జపించడం జరుగుతుంది- వైఖరీ, మధ్యమా, పశ్యంతీ మరియు పరా. వ్యక్తమయ్యే దానిని వైఖరీ అంటారు. అంటే నామజపం మీకు వినబడాలి, బయట ఎవ్వరైనా ఉంటే, వారికి కూడా వినబడాలి. మధ్యమా అంటే మధ్యమ స్వరంలో జపం. దాన్ని మీరు మాత్రమే వినాలి. మీ ప్రక్కన కూర్చున్న వ్యక్తికి కూడా ఆ ఉచ్చారణ వినబడకూడదు. ఈ ఉచ్చారణ కంఠంలో చేయబడుతుంది. మెల్లమెల్లగా నామం యొక్క లయం జరిగిపోతుంది, నామ క్రమం పట్టులోకి వస్తుంది. సాధన యింకా సూక్ష్మం అయినప్పుడు, పశ్యంతీ అంటే నామాన్ని చూసే దశ వస్తుంది, అప్పుడింక నామం జపించడం జరగదు. అదే నామం శ్వాసలో పడిపోతుంది. మనస్సుని ద్రష్టగా మార్చి, నిలబెట్టండి, శ్వాస ఏం అంటుంది అనేది చూస్తూ ఉండాలి. శ్వాస ఎప్పుడు వస్తుంది? బయటికి వచ్చేదెప్పుడు? ఏం అంటుంది? అనేవి కూడా చూస్తూ ఉండాలి. ఈ శ్వాస నామాన్ని తప్పించి యింకేమీ అనదని మహాపురుషులు అంటారు. సాధకుడు నామాన్ని జపించడు, కేవలం దానిలో నుండి లేచే ధ్వనిని మాత్రం వింటాడు. శ్వాసను చూస్తూ ఉంటాడు, కాబట్టే దీనిని 'పశ్యంతీ' అంటారు.

'పశ్యంతీ'లో మనస్సుని ద్రష్ట రూపంలో నిలబెట్టవలసి వస్తుంది. కానీ సాధన ఇంకా ఉన్నతమయినప్పుడు వినడం కూడా జరగదు. ఒక్కసారి ధ్యానాన్ని సిద్ధింపజేసుకొంటే చాలు. స్వతః వినబడుతుంది. 'జపైన జపావై, అపనే సే ఆవై' (జపించద్దు, జపం చేయించవద్దు, తనంతట తనుగా రావాలి)- స్వయంగా జపించవద్దు, మనస్సుకు వినే బాధ్యత ఇవ్వవద్దు, మరియు జపం జరుగుతూ ఉండాలి. దీని పేరే అజపం. జపం ఆరంభించనే లేదు, వచ్చేసింది అజపం' అలా ఎప్పటికీ జరగదు. ఎవ్వరైనా సరే జపం ప్రారంభం చేయకపోతే, అతనివద్ద అజపం అనే వస్తువే లేదు. అజపం అంటే అర్థం మనం జపించడం కాని జపం. మనతోడు విడవదు. ఒక్కసారి ధ్యానం యొక్క మర (Key) తిప్పేస్తే చాలు, జపం ప్రవాహితమయి పోవాలి. నిరంతరం జరుగుతూనే ఉండాలి. ఇలా స్వాభావికంగా జరిగే జపం యొక్క పేరే 'అజపం' మరియు ఇదే 'పరా' వాణి యొక్క జపం. ఇది ప్రకృతి కంటే అతీత తత్త్వమయిన పరమాత్మునిలో ప్రవేశం ఇప్పిస్తుంది. దీని తరువాత వాణిలో ఇంక ఎలాంటి పరివర్తనం ఉండదు. పరం యొక్క దిగ్దర్శనం చేయించి అందులో విలీనమయి పోతుంది. కాబట్టే దీన్ని 'పరా' అంటారు.'

ప్రస్తుత శ్లోకంలో యోగేశ్వరుడు శ్వాసపై ధ్యానం ఉంచాలని మాత్రం చెప్పాడు కానీ మున్ముందు అతను స్వయంగా 'ఓం' ను జపించడం గురించి వివరణ ఇస్తాడు. గౌతమ బుద్ధుడు కూడా 'అనాపాన సతీ' లో శ్వాస-ప్రశ్వాసల చర్చే చేస్తాడు. ఇంతకీ ఆ

మహాపురుషులేం చెప్పాలనుకొంటున్నారు? వాస్తవానికి ప్రారంభంలో వైఖరీ, దాని నుంచి మధ్యమా మరియు దాని నుంచి ఉన్నతమయినప్పుడు, జపం యొక్క పశ్యంతీ అవస్థలో శ్వాస పట్టులోకి వస్తుంది. ఆ సమయంలో జపం శ్వాసలో మిళితమయి పోతుంది, మరి ఇంక ఏం జపించాలి? అప్పుడింక శ్వాసను మాత్రం చూడాలి. కాబట్టే 'ప్రాణాపాన' అని అన్నాడు కానీ' జపించు' అని అనలేదు, కారణం ఏమిటంటే అలా చెప్పవలసిన అవసరం లేదు. అలాగనక చెప్పినట్లయితే, దారి తప్పి క్రింది శ్రేణులలోనే తిరుగాడవలసి వస్తుంది. బుద్ధ భగవానుడు, గురుదేవుడు మరియు ప్రతి మహాపురుషుడూ ఈ దారిలో నడిచినవారు ఎవరైనా సరే, అందరూ ఒకే మాట అన్నారు. వైఖరీ మరియు మధ్యమలు నామ-జపానికి ప్రవేశ ద్వారాలు. పశ్యంతీ నుండే నామంలోకి ప్రవేశం లభిస్తుంది. పరాలో నామం ధారావాహికమైపోతుంది. ఆ తరువాత జపం తోడువదలదు.

మనస్సు శ్వాసతో కూడి ఉంది. ఎప్పుడైతే శ్వాసపై దృష్టి ఉంటుందో, శ్వాసలో నామం స్థిరపడి పోయిందో, అప్పుడు లోపల ఏ సంకల్పమూ ఉత్పన్నం కాదు, మరియు బాహ్య వాయు మండలపు సంకల్పాలు లోపల ప్రవేశించలేవు. ఇదియే మనస్సు పై విజయం సాధించిన దశ. దీనితో బాటే యజ్ఞం యొక్క పరిణామం బహిర్గతమవుతుంది.

శ్లో ॥ అపరే నియతాహారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి ।
సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపిత కల్మషాః ॥**30**॥

నియమితమైన ఆహారం తీసుకునే ఇతరులు, ప్రాణంలో ప్రాణాలను ఆహుతి చేస్తారు. 'పూజ్య గురువుగారు' అనేవారు ''యోగి యొక్క ఆహారం, ఆసనం మరియు నిద్ర దృఢంగా ఉండవలసి ఉంటుంది''. ఆహార-విహారాలపై నియంత్రణ చాలా అవసరం. అలా అనేక మంది యోగులు ప్రాణాలను ప్రాణంలో ఆహుతి చేస్తారు. అంటే శ్వాస తీసుకోవడం పైనే ధ్యాస ఉంచుతారు. ప్రశ్వాసపై ధ్యాస ఉంచరు. శ్వాస తీసుకున్నప్పుడు 'ఓం' వింటాడు మళ్ళీ శ్వాస తీసుకున్నప్పుడు 'ఓం' ఇలా వింటూనే ఉండాలి. ఈ ప్రకారంగా యజ్ఞం వలన పాపాలను పోగొట్టుకున్న ఈ పురుషులందరూ యజ్ఞం గురించి తెలిసిన వారే. ఈ నిర్దిష్టమైన విధులలో ఎక్కడ నుంచి ప్రారంభం చేసినా చాలు, వారందరూ ఈ యజ్ఞాలన్నిటినీ తెలిసినవారే. ఇప్పుడు యజ్ఞం యొక్క పరిణామం గురించి చెప్తాడు:-

శ్లో ॥ యజ్ఞ శిష్టామృత భుజో యాంతి బ్రహ్మ సనాతనం।
నాయం లోకోఽస్త్య యజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ ॥**31**॥

కురుశ్రేష్ఠుడవైన అర్జునా! 'యజ్ఞ శిష్టామృతభుజః'- యజ్ఞం దేనినైతే సృష్టిస్తుందో, దేనినైతే అవశేషంగా విడిచి పెడుతుందో, అదే అమృతం. దాన్ని ప్రత్యక్షంగా తెలుసుకోవడమే జ్ఞానం. ఆ జ్ఞానామృతాన్ని అనుభవించిన, అంటే పొందిన యోగీజనులు 'యాంతి బ్రహ్మ సనాతనం' శాశ్వతమైన, సనాతనమైన పరబ్రహ్మను పొందుతారు. యజ్ఞం ఎలాంటి వస్తువంటే, పూర్తవుతూనే సనాతనమైన పరబ్రహ్మలో ప్రవేశం ఇప్పిస్తుంది. యజ్ఞం చేయకపోతే వచ్చే ఆపద

ఏమిటి? శ్రీకృష్ణుడు అంటాడు, యజ్ఞం చేయని పురుషునికి ఈ మనుష్యలోకం అంటే మానవ శరీరం కూడా లభించదు మరి మిగిలిన లోకాలెలా సుఖప్రధాలవుతాయి? అతను జంతు జన్మలు పొందవలసిందే. ఇందువల్ల యజ్ఞం చేయడమనేది మనుష్య మాత్రులకు అత్యావశ్యకం అని స్పష్టమవుతోంది.

శ్లో // ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణోముఖే I
కర్మజాన్ విద్ధితాన్ సర్వానేవం జ్ఞాత్వా విమోక్ష్యసే ।।**32**।।

ఈ ప్రకారంగా పైన చెప్పబడిన విధంగా అనేక రకాల యజ్ఞాలు వేదంలో చెప్పబడ్డాయి. అవి బ్రహ్మ ద్వారా వివరించబడ్డాయి. పరమాత్మను పొందిన పిదప మహాపురుషుల శరీరాలను పరబ్రహ్మ ధరించేస్తాడు. బ్రహ్మ నుండి అభిన్నులైన ఆ మహాత్ముల బుద్ధి కేవలం ఒక యంత్రంగా ఉండిపోతుంది. వారి ముఖతః ఆ బ్రహ్మే మాట్లాడుతాడు. వారి వాక్కులలోనే, ఈ యజ్ఞాలను గురించి విస్తారంగా చెప్పబడింది.

ఈ అన్ని యజ్ఞాలనూ 'కర్మజాన్ విద్ధి'– కర్మనుండి ఉత్పన్నమైనవిగా తెలుసుకో. ఇదే ఇంతకు ముందు కూడా చెప్పబడింది 'యజ్ఞం కర్మ సముద్భవః' (3/14). వాటిని ఈ ప్రకారంగా క్రియాత్మక ఆచరణ ద్వారా తెలుసుకున్నప్పుడు (యిప్పుడే చెప్పడమైంది యజ్ఞం చేయడంచేత ఎవని పాపాలు నశించి పోయాయో, అతనే యజ్ఞం యొక్క యధార్థ జ్ఞాత) అర్జునా! నీవు 'విమోక్ష్యసే' – సంసార బంధం నుంచి పరిపూర్ణంగా ముక్తి పొందుతావు. ఇక్కడ యోగేశ్వరుడు కర్మను గురించి స్పష్టం చేశాడు. ఏ కార్యకలాపాల వల్లనయితే పైన చెప్పబడిన యజ్ఞం పూర్తవుతుందో, ఆకార్య కలాపాలనే కర్మ అంటారు.

ఇప్పుడు గనుక దైవీ సంపద, సద్గురువు యొక్క ధ్యానం, ఇంద్రియాల నియంత్రణ, శ్వాసను ప్రశ్వాసలో, ప్రశ్వాసనూ శ్వాసలో ఆహుతి చేయడం, ప్రాణాపాన వాయువుల గతిని నిరోధించడం మొదలయినవి వ్యవసాయం చేయడం వలన, లేక వ్యాపారం– ఉద్యోగాల వలన, లేక రాజకీయం వలన గానీ జరిగితే, తప్పకుండా మీరు వాటిని ఆచరించండి. యజ్ఞ ప్రక్రియ పూర్తవుతూనే, తక్షణమే పరబ్రహ్మలో ప్రవేశం పొందగలుగుతాము, బయట మీరు చేసే పనులతో తక్షణమే బ్రహ్మలో ప్రవేశం పొందగలిగితే, వాటిని మీరు తప్పకుండా చేయండి.

వాస్తవానికి యివన్నీ కూడా యజ్ఞం చింతనల యొక్క అంతః క్రియలే. ఆరాధన యొక్క చిత్రణలే, ఆరాధన వలన ఆరాధ్య దేవుడు విదితమవుతాడు. యజ్ఞం అనేది ఆ ఆరాధ్య దైవం వరకూ గల దూరాన్ని ప్రయాణింప చేయగలిగిన నిర్ధారిత ప్రకియా విశేషం. ఈ యజ్ఞం శ్వాస, ప్రశ్వాస, ప్రాణాయామం, ఇత్యాది యేఏ ప్రక్రియల ద్వారా పూర్తవుతుందో, ఆ కార్యప్రణాళి యొక్క పేరే కర్మ. కర్మ యొక్క అసలు సిసలైన అర్థం ఆరాధన, చింతన.

సాధారణంగా– లోకులు ఏం పని చేసినా కూడా అది కర్మే అని అంటారు. కోరికల నుంచి రహితులయి ఏదైనా చేస్తే అది నిష్కామ కర్మ యోగం. అధిక లాభాల కోసం మీరు విదేశీ వస్త్రాలను అమ్మితే, మీరు సకాములనీ, దేశ సేవ కోసం స్వదేశీ వస్తువులను అమ్మితే, అది

నిష్కామ కర్మ యోగం అనీ కొందరంటారు. నిష్ఠతో ఉద్యోగం చేసినా, లాభనష్టాల చింత వదిలేసి వ్యాపారం చేసినా అది నిష్కామ కర్మయోగం అవుతుంది అంటారు. జయాపజయాల భావన నుండి ముక్తులై ఎవరైనా యుద్ధం చేసినా, ఎన్నికలలో నిలబడినా వారు నిష్కర్ముల య్యారను కుంటారు. మరణిస్తే ముక్తి కలుగుతుందా? వాస్తవానికి ఇలా ఏమీలేదు. యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు స్పష్టంగా ఈ నిష్కామ కర్మలో నిర్ధారితమైన క్రియ ఒక్కటే అని అన్నాడు. 'వ్యవసాయాత్మికా బుద్ధిరేకేహ కురునందన'- అర్జునా! నీవు నిర్ధారించబడిన కర్మ చెయ్యి. యజ్ఞం యొక్క ప్రక్రియే కర్మ. యజ్ఞం ఏమిటి? శ్వాస-ప్రశ్వాసల యొక్క ఆహుతి, ఇంద్రియాల యొక్క సంయమనం; యజ్ఞ స్వరూపులైన మహాపురుషుల ధ్యానం, ప్రాణాయామం- ప్రాణాల యొక్క నిరోధం.

ఇదే మనస్సు యొక్క విజితావస్థ. మనస్సు యొక్క విస్తరణే జగత్తు. శ్రీకృష్ణుని మాటలలో చెప్పాలంటే- ''ఇహైవ తైర్జితః సర్గోయే షాం సామ్యే స్థితం మనః'' (5/19) ఎవరి మనస్సు సమత్వ స్థితిలో ఉంటుందో, ఆ పురుషుల ద్వారా చరాచర జగత్తులు గెలవబడ్డాయి, మనస్సు యొక్క సమత్వ భావానికీ, జగత్తును గెలవడానికీ ఏమిటి సంబంధం? జగత్తునే కనుక గెలిచేస్తే మరి ఉన్న దెక్కడ? అప్పుడు- ఆబ్రహ్మ నిర్దోషుడు మరియు సముడు, ఇటు మనస్సు కూడా నిర్దోషి మరియు సమత్వంలో స్థితిని పొందినట్లైతే, అతను బ్రహ్మలో స్థితుడై పోతాడు అని అంటాడు.

సారాంశం ఏమిటంటే మనస్సు యొక్క విస్తరణే జగత్తు. చరాచర జగత్తే హోమసామగ్రి రూపంలో ఉంది. మనస్సు ఎప్పటికీ నిరోధించబడినప్పుడు జగత్తు కూడా నిరోధించబడుతుంది. మనస్సు నిరోధించబడటంతో బాటే యజ్ఞం యొక్క పరిణామం బహిర్గతమవుతుంది. యజ్ఞం దేనినైతే సృష్టిస్తుందో, ఆ జ్ఞానామృతాన్ని త్రాగిన పురుషులు సనాతనమైన బ్రహ్మలో ప్రవిష్టులై పోతారు. ఈ యజ్ఞాలన్నింటి గురించి కూడా బ్రహ్మలో స్థితులైన మహాపురుషుల మాటలలోనే చెప్పబడ్డది. వేరు వేరు సాంప్రదాయాలకు చెందిన సాధకులు వేరు వేరు రకాలైన యజ్ఞాలు చేస్తారని కాదు, కానీ అసలు అర్థం ఈ యజ్ఞాలన్నీ కూడా ఒకే సాధకుని ఉచ్చనీచ అవస్థలను తెలుపుతాయి.

ఈ యజ్ఞం దేనివల్లనైతే జరుగుతుందో, ఆక్రియ యొక్క పేరు కర్మ. ప్రాపంచిక కార్యాలనుగానీ, వ్యాపారాన్నిగానీ సమర్థించేదిగా ఒక్క శ్లోకం కూడా మొత్తం గీతలో ఎక్కడా లేదు.

సాధారణంగా యజ్ఞం పేరు చెప్పగానే లోకులు బయట హోమగుండం తయారు చేస్తారు, నువ్వులు, జొన్నలు తీసుకొచ్చి 'స్వాహా' అంటూ ఆహుతి చెయ్యడం మొదలు పెడతారు. ఇది ఒక దొంగనాటకం మాత్రమే. ద్రవ్య యజ్ఞం ఇంకో రకం అంటూ శ్రీకృష్ణుడు చాలాసార్లు చెప్పాడు. కానీ పశుబలులు, వస్తు దహనాలతో దీనికి ఎలాంటి సంబంధమూ లేదు.

శ్లో ॥ శ్రేయాన్ద్రవ్య మయాద్ యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప ।

సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరి సమాప్యతే ॥33॥

అర్జునా! సాంసారిక పదార్థాలతో చేసే యజ్ఞం కంటే జ్ఞాన యజ్ఞం (దేని పరిణామం జ్ఞానమో (సాక్షాత్కారమో), యజ్ఞం దేనినైతే సృష్టిస్తుందో, ఆ అమృత తత్త్వాన్ని తెలుసుకోవడమే జ్ఞానం, అలాంటి యజ్ఞం) శ్రేయస్కరమైంది. అది పరమ కళ్యాణకారి. హే పార్థా! జ్ఞానంలో కర్మలు పరి సమాప్తమై పోతాయి 'పరిసమాప్యతే' బాగా సమాహితమయి పోతాయి. జ్ఞానం యజ్ఞం యొక్క పరాకాష్ట. దాని తరువాత కర్మ చేయుట వలన లాభము లేదు. కర్మను వదలివేయడం వలన ఆ మహాపురుషునికి ఎలాంటి హానీ కలగదు.

ఈ ప్రకారంగా భౌతిక ద్రవ్యాలతో చేసే యజ్ఞం కూడా యజ్ఞమే, కానీ ఆ యజ్ఞంతో పోలిస్తే, (దేని పరిణామమైతే సాక్షాత్కారమో ఆ జ్ఞాన యజ్ఞంతో పోలిస్తే) అత్యంత అల్పమయింది. మీరు కోటి అహుతులు వేల్చండి, వందల కొద్దీ హోమకుండాల్ని తయారు చేయండి, సన్మార్గంలో ధనాన్ని ఖర్చు పెట్టండి, సాధు– సంతు– మహాపురుషుల సేవలో ధనాన్ని ఖర్చు చేయండి, కానీ ఈ జ్ఞాన యజ్ఞంతో పోలిస్తే అవి చాలా అల్పమయినవి. శ్రీకృష్ణుడు చెప్పినట్లు వాస్తవానికి యజ్ఞం శ్వాస–ప్రశ్వాసలకి చెందినది, ఇంద్రియాల సంయమానికి చెందినది, మనోనిరోధానికి చెందినది. ఈ యజ్ఞాన్ని ఎక్కడ పొందవచ్చు? దాని విధివిధానాన్ని ఎక్కడ నుంచి, ఎలా నేర్చుకోవచ్చు? గుళ్ళు, మసీదులు, చర్చిలు, గురుద్వారాలలో దొరుకుతుందా లేక పుస్తకాలలోనా? తీర్థ యాత్రలలో దొరుకుతుందా లేక స్నానంచేస్తే దొరుకుతుందా? శ్రీకృష్ణుడు అలా దొరకదు అని అంటాడు. దానికి ఒకే ఒక ఉపాయం తత్త్వస్థితుడైన మహాపురుషుడు. శ్రీకృష్ణుడు అంటాడు–

శ్లో ॥ తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।
ఉపదేక్ష్యంతి తేజ్ఞానం జ్ఞానినస్తత్త్వ దర్శినః ॥34॥

కాబట్టి అర్జునా! నీవు తత్త్వ దర్శకుడైన మహాపురుషుని వద్దకు వెళ్ళి, నమ్రతతో నమస్కరించి (అహంకారాన్ని త్యజించి, శరణు వేడుకొని) చక్కగా సేవ చేసి, నిష్కపట భావంతో ప్రశ్నించి ఆ జ్ఞానాన్ని తెలుసుకో. తత్త్వాన్ని తెలుసుకొన్న జ్ఞానులు నీకు ఆ జ్ఞానాన్ని ఉపదేశిస్తారు, సాధనా పథంపై నడిపిస్తారు. సమర్పిత భావంతో సేవ చేస్తేనే, ఈ జ్ఞానాన్ని నేర్చుకోకలిగే సామర్థ్యం ఏర్పడుతుంది. తత్త్వదర్శకుడైన మహాపురుషులు పరమతత్త్వమైన పరమాత్ముని యొక్క ప్రత్యక్ష దర్శనం చేసుకొన్న వారై ఉంటారు. వారు యజ్ఞం యొక్క విధివిశేషాలను గూర్చి తెలుసుకున్న జ్ఞానులు, వారే మీకు కూడా నేర్పిస్తారు. ఇంకోరకమైన యజ్ఞం గనుక అయితే జ్ఞానుల యొక్క, తత్త్వదర్శకుల యొక్క అవసరం ఏమిటి?

స్వయంగా భగవంతుడి ఎదురుగానే అర్జునుడు నిలుచున్నాడు గదా. భగవంతుడు అతనిని తత్త్వ దర్శకుల వద్దకు ఎందుకు పంపిస్తున్నాడు? వాస్తవానికి శ్రీకృష్ణుడు ఒక యోగి. అతని ఆశయం ఏమిటంటే ఈ రోజు అనురాగియైన అర్జునుడు నా సమక్షంలో ఉన్నాడు. 'శ్రీకృష్ణుడు వెళ్ళి పోయాడు, ఇప్పుడు ఎవరిని శరణుపొందాలి?' అనే భ్రమ భవిష్యత్తులో అనురాగులైన వారికి కలగవచ్చు. కాబట్టి అతను స్పష్టంగా ఏం చెప్పాడంటే తత్త్వదర్శకుల

వద్దకు వెళ్ళు. ఆ జ్ఞానులు నీకు ఉపదేశం చేస్తారు. మరియు ఇలా చెప్పాడు.

శ్లో ॥ యజ్ఞాత్వా న పునర్మోహమేవం యాస్యసి పాండవ ।
యేన భూతాన్య శేషేణ ద్రక్ష్యస్యాత్మన్యథోమయి ॥**35**॥

ఆజ్ఞానాన్ని వారి ద్వారా అర్థం చేసుకొని నీవు ఈ ప్రకారంగా నడుచుకుంటూ మళ్ళీ ఎప్పుడూ మోహాన్ని పొందవు. వారిచే ఇవ్వబడిన తెలివితేటల ద్వారా, వాటిని ఆచరిస్తూ నీవు నీ ఆత్మ అంతరంగంలో సంపూర్ణ భూతాలను చూస్తావు, అంటే అన్ని ప్రాణులలో ఈ ఆత్మ యొక్క ప్రసరణని చూస్తావు. ఎప్పుడైతే సర్వత్రా ఒకే ఆత్మ యొక్క తత్త్వాన్ని ప్రసరణని చూచే సామర్థ్యం వస్తుందో, దాని పిదప నీవు నాలో ప్రవేశించుతావు. అందువల్ల ఆ పరమాత్మున్ణి పొందే సాధన క్రమం 'తత్త్వ స్థితులైన మహాపురుషుల' ద్వారానే లభిస్తుంది. జ్ఞానం గురించిగానీ, ధర్మం మరియు శాశ్వత సత్యం గురించిగానీ, శ్రీకృష్ణుడు చెప్పినట్లు ఎవరైనా తత్త్వదర్శకుణ్ణే అడగాలి.

శ్లో ॥ అపి చేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః ।
సర్వం జ్ఞాన ప్లవేనైవ వృజినం సంతరిష్యసి ॥**36**॥

నీవు అందరు పాపులకంటే కూడా అధిక పాపం చేసిన వాడివయినా కూడా జ్ఞానమనే నౌకద్వారా అన్ని పాపాల్ని నిస్సందేహంగా దాటి వేయగలవు. దీని ఆశయాన్ని 'అధికాధికంగా పాపం చేసి కూడా, ఎప్పుడైనా దాటేయగలం' అని మాత్రం అనుకోకండి. మీరు భ్రమలో పడిపోకూడదని శ్రీకృష్ణుడి అభిప్రాయం. 'మేము గొప్ప పాపులము', 'మేము సంసార సాగరాన్ని దాటలేము అనే అపోహలు మనస్సులోకి రానివ్వకండి. కాబట్టే శ్రీకృష్ణుడు ప్రోత్సహించుతూ, అభయమిచ్చేదేమిటంటే పాపులందరి పాపాల సమూహం కంటే కూడా అధికంగా పాపాలు చేసిన వాడివయినా సరే, తత్త్వదర్శకులచే లభించే జ్ఞానమనేడి నౌక ద్వారా నీవు నిస్సందేహంగా సంపూర్ణ పాపాలను తరించి వేయగలవు. ఏ ప్రకారంగా అంటే-

శ్లో ॥ యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మసాత్కురుతేఽర్జున ।
జ్ఞానాగ్ని సర్వ కర్మాణి భస్మసాత్కురుతే తథా ॥**37**॥

అర్జునా! ఏ ప్రకారంగా ప్రజ్వలించిన అగ్ని వంటచెరుకును భస్మం చేస్తుందో, సరిగ్గా అదే ప్రకారంగా జ్ఞానమనే అగ్ని సంపూర్ణ కర్మలను భస్మం చేసేస్తుంది. ఎక్కడనుండైతే యజ్ఞంలో ప్రవేశం కలుగుతుందో, అది జ్ఞానానికి ప్రవేశిక కాదు. ఇది ఎటువంటి జ్ఞానం అంటే సాక్షాత్కారం యొక్క పరాకాష్ఠ చిత్రణ మాత్రమే. ఇందులో మొదట విజాతీయ కర్మ భస్మం అవుతుంది' మరియు ప్రాప్తి తరువాత చింతన కర్మ కూడా విలయమయిపోతుంది. దేనినైతే పొందాలో, పొందడమయింది. మరి ఇంక చింతన చేసి ఏంవెతకాలి? అలాంటి సాక్షాత్కారాన్ని పొందిన జ్ఞాని సంపూర్ణ శుభాశుభకర్మలను అంతం చేసేస్తాడు. ఆ సాక్షాత్కారం ఎక్కడ అవుతుంది? బయట అవుతుందా లేక లోపలా? దీనిని గూర్చి ఇలా అంటాడు-

శ్లో ॥ నహి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే।

తత్స్వయం యోగ సంసిద్ధః కాలేనాత్మని విందతి ॥38॥

ఈ సంసారంలో జ్ఞానానికి సమానంగా మనలను పవిత్రం చేయగలది నిస్సందేహంగా యింకొకటి లేదు. ఆ జ్ఞానాన్ని (సాక్షాత్కారాన్ని) నీవు స్వయంగా (యింకొకరు కాదు) యోగం యొక్క పరిపక్వ అవస్థలో (ఆరంభంలో కాదు) నీ ఆత్మ యొక్క అంతర్గతంలోనే, హృదయదేశంలో అనుభవించగలవు, బయట కాదు. ఈ జ్ఞానం కోసం ఏఏ యోగ్యతలు కావలసి ఉంటాయి ? యోగేశ్వరుని మాటలలోనే–

శ్లో ॥ శ్రద్ధావాన్‌లభతే జ్ఞానం తత్పరః సంయతేన్ద్రియః।
జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతి మచిరేణాధిగచ్ఛతి ॥39॥

శ్రద్ధాళువూ, తత్పరుడూ సంయతేంద్రియుడైన పురుషుడే జ్ఞానాన్ని పొందగలడు. భావపూర్వకమైన జిజ్ఞాస లేక పోతే, తత్త్వదర్శకుని శరణులోకి వెళ్ళినా కూడా జ్ఞానం ప్రాప్తించదు. కేవలం శ్రద్ధ మాత్రమే సరిపోదు. శ్రద్ధాళువు శిథిల ప్రయత్నశీలుడు కూడా కావచ్చు. అందుచేత మహాపురుషుని ద్వారా నిర్దిష్టమైన పథం పై తత్పరుడై అగ్రసరుణ్ణి కావాలనే నిష్ఠ అవసరం... దీనితో బాటే సంపూర్ణ యింద్రియాల సంయమం కూడా అనివార్యం. ఎవరైతే కోరికల నుండి విరతులు కాలేరో, వారికి సాక్షాత్కారం (జ్ఞానం యొక్క ప్రాప్తి) దుర్లభము. కేవలం శ్రద్ధాళువు, ఆచరణ రతులు, సంయత మనస్కులైన పురుషులే జ్ఞానాన్ని పొందగలరు. జ్ఞానాన్ని సంపాదించుకొని వారు తక్షణమే పరమశాంతిని పొందుతారు, దాని తరువాత పొందేదేదీ మిగిలి ఉండదు, ఇదే పరమ శాంతి– మళ్ళీ అతను ఎప్పుడూ అశాంతికి లోనుకాడు. మరియు ఎక్కడైతే శ్రద్ధలేదో–

శ్లో ॥ అజ్ఞశ్చాశ్రద్ధధానశ్చ సంశయాత్మా వినశ్యతి।
నాయం లోకోఽస్తిన పరోన సుఖం సంశయాత్మనః ॥40॥

యజ్ఞం యొక్క విధి–విశేషాలలో అనభిజ్ఞులై శ్రద్ధారహితులై మరియు సంశయయుక్తులైన అజ్ఞానులైన పురుషులు ఈ పరమార్థ పథంలో భ్రష్టులై పోతారు. వారిలో కూడా సంశయ యుక్తులైన పురుషులకు సుఖం ఉండదు, మళ్ళీ మానవ శరీరం లభించదు మరియు పరమాత్ముడు కూడా లభించడు. అందుచేత తత్త్వదర్శి అయిన మహాపురుషుని వద్దకు వెళ్ళి ఈ పథంలోని సంశయాల నివారణ చేసుకోవాలి. ఇలా చేయని వారికి తత్త్వ పరిచయం ఎప్పటికీ కలగదు. మరి గమ్యానికి చేరేవారేవరు?

శ్లో ॥ యోగ సంన్యస్త– కర్మాణం జ్ఞాన సంఛిన్న సంశయమ్ ।
ఆత్మ వంతంన కర్మాణి నిబధ్నంతి ధనంజయ ॥41॥

ఎవరి కర్మ, యోగం ద్వారా భగవంతునిలో సమాహితమయిపోతుందో, ఎవరి యొక్క సంపూర్ణ సంశయాలు పరమాత్ముణ్ణి ప్రత్యక్ష్యంగా తెలుసుకొనడం వలన, తీరి పోతాయో పరమాత్మునితో సంయుక్తుడైన అటువంటి పురుషుణ్ణి కర్మ బంధించలేదు. యోగం ద్వారానే కర్మ శాంతిస్తుంది. జ్ఞానం చేతనే సంశయాలు నష్టమవుతాయి. కాబట్టి శ్రీకృష్ణుడు ఇలా అంటాడు.

శ్లో ॥ తస్మాదజ్ఞాన సంభూతం హృత్స్థం జ్ఞానాసినాత్మనః।
ఛిత్త్వైనం సంశయం యోగమాతిష్ఠోత్తిష్ఠ భారత ॥**42**॥

కాబట్టి భరతవంశీయుడవైన అర్జునా! నీవు యోగంలో స్థితుడవై మరియు అజ్ఞానం నుంచి ఉత్పన్నమయి హృదయంలో స్థితమయ్యే ఈ సంశయాల్ని జ్ఞానమనే ఖడ్గంతో ఖండించు. యుద్ధానికై నిలబడు. సాక్షాత్కారంలో అడ్డుగోడలై నిలచే సంశయాలనబడే శత్రువులు మనస్సులో ఉండగా, బయట ఎవరితో ఎందుకు యుద్ధం చేయాలి? వాస్తవానికి మీరు చింతన పథంలో అగ్రసరులైనపుడు, సంశయాలచే ఉత్పన్నమయ్యే బాహ్య ప్రవృత్తులు అడ్డుగోడలై నిలవడం స్వాభావికమే. అవి శత్రువుల రూపంలో భయంకరంగా దాడి చేస్తాయి. సంయమనంతో బాటు యజ్ఞం యొక్క విధి విశేషాలను ఆచరిస్తూ, యీ వికారాలను దాటగలగడమే యుద్ధం, దాని పరిణామం పరమశాంతి. ఇదే అంతిమ విజయం, దీని వెనక అపజయం అనేదే ఉండదు.

సారాంశం :

ఈ అధ్యాయం ఆరంభంలో శ్రీకృష్ణుడు అంటాడు – ఈ యోగాన్ని ఆరంభంలో నేనే సూర్యుడికి స్వయంగా చెప్పాను. సూర్యుడు మనువుకీ, మనువు ఇక్ష్వాకుడికీ చెప్పారు. మరియు రాజర్షులు తెలుసుకొన్నారు. ''నేనే'' అంటే అవ్యక్త స్వరూపంగలవారే. చెప్పారు, మహాపురుషులు కూడా అవ్యక్త స్వరూపం గలవారే. శరీరం వారుండే ఇల్లు మాత్రమే. అలాంటి మహాపురుషుని వాణి ద్వారా పరమాత్ముడే ప్రవాహితమవుతాడు. అలాంటి మహాపురుషునిచే యోగం సూర్యుని ద్వారా సంచరితం చేయబడుతుంది. ఆ పరమ ప్రకాశమయ రూపం యొక్క ప్రసారం శ్వాస యొక్క అంతరాళంలో జరుగుతుంది, కాబట్టే సూర్యునికి చెప్పాడు. శ్వాసలో సంచరించే అవి సంస్కార రూపంలోకి వస్తాయి. శ్వాసలో సంచరితమైనప్పుడు, సమయం వచ్చినప్పుడు, అదే మనస్సులోకి సంకల్పంగా మారి వస్తుంది. దాని మహత్వం అర్థమయినప్పుడు, మనస్సులో ఆవాక్యం పట్ల కోరిక జాగృతమవుతుంది. మరియు యోగం కార్యరూపం దాల్చుతుంది. క్రమంగా ఉత్థానమవుతూ, ఆయోగం రిద్ధుల-సిద్ధుల యొక్క రాజర్షిత్వం శ్రేణి వరకు చేర్చి నష్టమయిపోయే స్థితికి చేరుకుంటుంది, కానీ ప్రియ భక్తులైన వారినీ, అనన్య మిత్రభావం గల వారినీ ఆ మహాపురుషులే సంభాళించుకొంటారు.

'మీరు ఇప్పుడే కదా అవతరించారని' అర్జునుడు ప్రశ్నించగా యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు అంటాడు– ''అవ్యక్తమూ అవినాశీ, అజన్మా మరియు సంపూర్ణ భూతాల్లో నిరంతరం ఉంటూ కూడా ఆత్మమాయా, యోగ ప్రకియల ద్వారా త్రిగుణమయ ప్రకృతిని వశం చేసుకొని నేను ఆవిర్భవిస్తాను. అవిర్భవించి ఏం చేస్తాను? సాధించ వలసిన వస్తువులను సంరక్షించటానికి మరియు వాటి వలన ఉత్పన్నమయ్యే దోషాలను వినాశం చేయడానికి, పరమధర్ముడైన పరమాత్ముణ్ణి స్థిరపరచడం కోసం నేను సృష్ట్యాదినుండి ప్రళయ పర్యంతం పుడుతూ ఉంటాను. నాయొక్క ఆ జన్మ మరియు కర్మ దివ్యమైనవి. వాటిని కేవలం తత్త్వదర్శకులే తెలుసుకోగలుగుతారు. అసలైన ధ్యానముంటే భగవంతుని ఆవిర్భావం కలియుగావస్థ నుంచే

జరుగుతుందని తెలుస్తుంది. కానీ ప్రారంభిక సాధకుడు 'భగవంతుడే చెపుతున్నాడా? లేక మామూలుగానే సంకేతాలు లభిస్తున్నాయా' అన్నది అర్థం చేసుకోలేడు. ఆకాశం నుండి ఎవరు మాట్లాడతారు? 'పూజ్య గురువుగారు' చెప్పేవారు. భగవంతుడి కృప ఎప్పుడైతే కలుగుతుందో, ఆతడు రథి అవుతాడు. (నడిపించేవాడు)అప్పుడు స్తంభాలలో నుంచీ, వృక్షాలలో నుంచీ పరమాత్ముడు మాట్లాడతాడు మరియు తోడుంటాడు. ఉత్థానమవుతూ, ఎప్పుడైతే పరమ తత్త్వస్వరూపడైన పరమాత్ముడు విధితమవుతాడో, అప్పుడే స్పర్శతో బాటే అతను స్పష్టంగా తెలుసుకోగలడు. కాబట్టి అర్జునా నాయొక్క ఆ స్వరూపాన్ని తత్త్వదర్శకులే చూస్తారు మరియు నన్ను తెలుసుకొని వారు తక్షణమే నాలోనే ప్రవిష్ఠులైపోతారు. అప్పటినుంచి వారికి జనన మరణాలుండవు.

ఈ ప్రకారంగా అతను భగవంతుని ఆవిర్భావం యొక్క విధిని గురించి చెప్పాడు– అది ఎవరో ఒక అనురాగి అయిన వ్యక్తి యొక్క హృదయంలోనే జరుగుతుంది. బయట కానే కాదు. శ్రీకృష్ణుడు అంటాడు– నన్ను కర్మ బంధించదు. ఈ స్థాయి నుంచి తెలుసుకొన్న వారిని కూడా కర్మ బంధించదు. దీనిని అర్థం చేసుకొని ముముక్షువులైన పురుషులు, కర్మను ఆరంభిస్తారు– ఆ స్థాయిలో తెలుసుకుంటే, ఆ పురుషుడు శ్రీకృష్ణునితో సమానుడు. మరియు తెలుసుకొన్న తరువాత ఆ ముముక్షువు అర్జునుడు కూడా శ్రీకృష్ణునితో సమానుడు. యజ్ఞం చేస్తే మాత్రం ఇది నిశ్చితంగా లభిస్తుంది. యజ్ఞం యొక్క స్వరూపం గురించి, యజ్ఞం యొక్క పరిణామం పరమతత్త్వం, పరమశాంతి అని చెప్పాడు. ఈ జ్ఞానాన్ని ఎక్కడ పొందవచ్చు? దీనిని గురించి తెలుసుకోవడానికి తత్త్వ దర్శకుని వద్దకు వెళ్ళమనీ విధి విధానాలతో ఆ మహాపురుషుణ్ణి సానుకూల పరచుకోమనీ చెప్పాడు.

యోగేశ్వరుడు వివరిస్తూ ఇలా చెప్పాడు– ఆ జ్ఞానాన్ని నీవు స్వయంగా ఆచరించే పొందగలవు, ఇతరుల ఆచరణ వలన నీకు అది దొరకదు. అది కూడా యోగం యొక్క పరాకాష్ఠ దశలోనే పొందగలవు, ప్రారంభంలో కాదు. ఆ జ్ఞానం (సాక్షాత్కారం) హృదయ దేశంలో జరుగుతుంది, బయటకాదు. శ్రద్ధాలువుడూ తత్పరుడూ, సంయతేంద్రియుడూ, సంశయ రహితుడూ అయిన పురుషుడే దానిని పొందుతాడు. అందుచేత హృదయంలో స్థితమైన నీ సంశయాల్ని వైరాగ్యమనే ఖడ్గంతో నరుకు. ఇది హృదయంలో జరిగే యుద్ధం. బాహ్యయుద్ధంతో గీతోక్త యుద్ధానికి ఎటువంటి సంబంధమూ లేదు.

ఈ అధ్యాయంలో యోగేశ్వరుడయిన శ్రీకృష్ణుడు ముఖ్యంగా యజ్ఞం యొక్క స్వరూపాన్ని స్పష్టీకరించాడు. యజ్ఞం దేని వలన పూర్తవుతుందో, ఆ కార్య ప్రణాళిక పేరే కర్మ. అని చెప్పాడు కర్మను చక్కగా ఈ అధ్యాయంలోనే స్పష్టీకరించడమయింది.

ఓం తత్సదితి శ్రీమద్ భగవద్ గీతాసూపనిషత్సు బ్రహ్మ విద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే 'యజ్ఞ కర్మ స్పష్టీ కరణం' నామ చతుర్థోऽధ్యాయః ॥**4**॥

ఈ ప్రకారంగా శ్రీమద్భగవద్గీతా రూపమైన ఉపనిషత్తు మరియు బ్రహ్మవిద్యా మరియు యోగశాస్త్ర మనే విషయంలో శ్రీకృష్ణార్జునుల సంవాదంలో ''యజ్ఞ కర్మ స్పష్టీకరణమ్'అనే పేరుగల నాలుగవ అధ్యాయం పూర్తయింది.

ఇతి శ్రీమత్పరమహంస పరమానందస్య శిష్య స్వామీ అడగడానంద కృతే శ్రీమద్‌భగవద్ గీతాయాః-- **'యథార్థ గీతా'** భాష్యే **'యజ్ఞకర్మ స్పష్టీకరణం'** నామ చతుర్థోఽధ్యాయః।।**4**।।

ఈ ప్రకారంగా శ్రీమత్పరమహంస పరమానంద గారి యొక్క శిష్యుడు స్వామి అడగడానంద గారిచే రచించబడిన శ్రీమద్‌భగవత్‌గీతా యొక్క భాష్యం యదార్థ గీతాలో 'యజ్ఞ కర్మ స్పష్టీకరణ' అనే చతుర్థ అధ్యాయం పూర్ణమయింది.

।।హరి ఓం తత్సత్।।

ౘ

శ్రీ పరమాత్మనే నమః

# పంచమ అధ్యాయము

మూడవ అధ్యాయంలో అర్జునుడు ''భగవంతుడా! జ్ఞానయోగం మీకు శ్రేష్ఠ మనిపించినప్పుడు మీరు నన్ను భయంకర కర్మజాలంలో ఎందుకు పడేస్తున్నారు? అని ప్రశ్నించాడు. అర్జునుడికి నిష్కామకర్మ యోగానికంటే జ్ఞానయోగం కొంచెం సరళమని తోచినట్లుంది, ఎందుకంటే జ్ఞానయోగంలో ఓటమిలో దైవత్వం మరియు గెలుపులో 'మహామహిమ స్థితి' – రెండు దశలలోనూ లాభమే అనిపించింది. కానీ యిప్పటి వరకూ రెండు మార్గాలలోనూ కర్మ చేయవలసిందేనని అర్జునుడు చక్కగా అర్థం చేసుకున్నాడు. (యోగేశ్వరుడు అతణ్ణి సంశయరహితుడైన తత్త్వదర్శకుడైన మహాపురుషుని శరణు చేరమని కూడా ప్రేరేపించాడు, ఎందుకంటే అర్థం చేసుకొనేందుకు అది ఒక్కటే సరియైన స్థానం. రెండు మార్గాలలో నుంచి ఒకటి ఎన్నుకొనేముందు అతను ఇలా నివేదించుకొన్నాడు–

అర్జున ఉవాచ–

శ్లో ॥ సంన్యాసం కర్మణాం కృష్ణ పునర్యోగం చ శంససి ।
యచ్ఛ్రేయ ఏత యోరేకం తన్మే బ్రూహి సునిశ్చితం ॥**1**॥

''హే శ్రీ కృష్ణా! మీరు ఒకప్పుడు సన్యాసంతో కూడి చేసిన కర్మను, మరింకొక్కప్పుడు నిష్కామ దృష్టిలో చేసిన కర్మను ప్రశంసించుతారు. ఈ రెండింటిలోనూ ఒకటి, మీచే చక్కగా నిశ్చయించబడినది, పరమ కళ్యాణకారి అయిన దానిని నాకు చెప్పండి''. ఎక్కడికైనా వెళ్ళడానికి మీకు రెండు మార్గాలు చెప్పబడితే, మీరు సుఖకరమైన దారేదని తప్పకుండా అడుగుతారు. అలా అడగనట్లయితే మీకు వెళ్ళే అభిప్రాయమేలేదన్న మాట' అప్పుడు యోగేశ్వరుడయిన శ్రీకృష్ణుడు అంటాడు–

శ్రీ భగవానువాచ

శ్లో ॥ సంన్యాసః కర్మయోగశ్చ నిః శ్రేయస కరావుభౌ ।
తయోస్తు కర్మ సంన్యా సాత్కర్మయోగో విశిష్యతే ॥**2**॥

అర్జునా! సన్యాసంతో కూడి చేసే కర్మ అంటే జ్ఞాన మార్గంలో చేసే కర్మ మరియు 'కర్మయోగః'– నిష్కామ భావనతో చేసే కర్మ– ఈ రెండూ కూడా పరమశ్రేయాన్ని యింప్పించేవే, కానీ ఈ రెండు మార్గాలలో సన్యాసం, లేక జ్ఞాన దృష్టితో చేసే కర్మ కంటే నిష్కామ కర్మయోగం శ్రేష్ఠమైనది. ఎందుకు శ్రేష్ఠమైయిందనే ప్రశ్న స్వాభావికం కదా.

శ్లో ॥ జ్ఞేయఃస నిత్య సన్న్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి ।
నిర్ద్వన్ద్వోహి మహాబాహో సుఖం బన్ధాత్ప్రముచ్యతే ॥**3**॥

మహాబాహులు గల అర్జునా! ఎవరినీ ద్వేషించని వాడినీ, దేనినీ ఆకాంక్షించని వాడినీ, ఎప్పటికీ సన్యాసి అనే అనుకోవడం సముచితం. అతడు జ్ఞాన మార్గంలోగానీ లేక నిష్కామ కర్మయోగంలో గానీ ఉండవచ్చు. రాగద్వేషాది ద్వంద్వాలచే రహితుడైన ఆ పురుషుడు సుఖ పూర్వకంగా భవ– బంధం నుంచి ముక్తుడై పోతాడు.

శ్లో ॥ సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదన్తి పణ్డితాః।
ఏకమప్యా స్థితః సమ్య గుభయోర్విన్దతే ఫలమ్ ॥**4**॥

నిష్కామ కర్మయోగం మరియు జ్ఞాన యోగం ఈ రెండిటినీ ఈ మార్గం గురించి ఎవరికి చాలా తక్కువ తెలుసో అటువంటివారే ఈ రెండూ వేరు వేరు అని చెబుతారు. కానీ పూర్ణ జ్ఞానవంతులైన పండితులు అలా చెప్పరు. ఎందుకంటే రెండింటిలో నుంచి ఏ ఒక్క దానిలోనైనా సరే, చక్కగా స్థితుడైన పురుషుడు రెండింటి ఫలరూపుడైన పరమాత్ముణ్ణే పొందుతాడు. రెండింటి ప్రతి ఫలం ఒక్కటే, కాబట్టి రెండూ ఒక్కలాంటివే.

శ్లో ॥ యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే ।
ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి ॥**5**॥

సాంఖ్య దృష్టితో కర్మ చేసేవాడు ఎక్కడికి చేరుతాడో, అక్కడికే నిష్కామంగా కర్మ చేసేవాడు కూడా చేరుకుంటాడు, కాబట్టి ఎవరైతే రెండింటినీ ప్రతి ఫలం దృష్ట్యా ఒకటిగా చూస్తారో వారే యథార్థాన్ని తెలుసుకొన్నవారు. రెండు మార్గాలు ఒకే స్థానాన్ని చేర్చేటప్పుడు, నిష్కామ కర్మ యోగంలో విశేషం ఏమిటి? శ్రీ కృష్ణుడు అంటాడు–

శ్లో ॥ సన్న్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తుమయోగతః ।
యోగయుక్తో మునిర్బ్రహ్మ న చిరేణాధి గచ్ఛతి ॥**6**॥

అర్జునా! నిష్కామ కర్మయోగాన్ని ఆచరించకుండా 'సన్యాస'ః– అంటే సర్వస్వం యొక్క న్యాసం దుఃఖప్రదమయినది. యోగం యొక్క ఆచరణ ప్రారంభమే చేయనప్పుడు అది అసంభవమవుతుంది. కాబట్టి భగవత్స్వరూపాన్ని మననం చేసే మునులు, మనస్సుతో సహా ఇంద్రియాలు మౌనమై పోయిన ఆ మునులు నిష్కామ కర్మ యోగాన్ని ఆచరిస్తూ, పరమబ్రహ్మ అయిన పరమాత్ముణ్ణి శ్రీఘ్రంగానే పొందుతారు.

జ్ఞానయోగంలో కూడా నిష్కామ కర్మయోగ– ఆచరణే పాటించ వలసి ఉంటుందని స్పష్టమవుతుంది. ఎందుకంటే రెండింటిలోనూ క్రియ ఒక్కటే. అది యజ్ఞం యొక్క క్రియ. దాని అసలైన అర్థం– 'ఆరాధన', రెండింటిలో తేడా కేవలం కర్త యొక్క దృక్పథానికి సంబంధించినది మాత్రమే. ఒకడు తన శక్తిని అర్థం చేసుకొని లాభ నష్టాలను బేరీజు వేసుకొంటూ, అదే కర్మలో ప్రవృత్తుడవుతాడు. మరి ఇంకొకడు నిష్కామ కర్మయోగి. ఇష్టదైవంపై అధారపడి ఇదే కర్మలో ప్రవృత్తుడవుతాడు. ఉదాహరణకై ఒకడు ప్రయివేటుగా (ఎక్స్టర్నలుగా) చదివితే, రెండవవాడు విద్యాలయంలో చేరి చదువుతాడు. ఇద్దరి పాఠ్యక్రమ ఒక్కటే, పరీక్షా ఒక్కటే, పరీక్షించేవాడు– పేపరు దిద్దేవాడు కూడా ఒక్కడే, సరిగ్గా యిదే ప్రకారంగా ఇద్దరికీ సద్గురువే తత్త్వదర్శకుడు. మరి డిగ్రీ కూడా ఒక్కటే. కేవలం యిద్దరి దృక్పథాలే భిన్నమైనవి. అయితే స్కూలులో చదివే విద్యార్థికి దొరికే సదుపాయాలు అధికంగా ఉంటాయి.

ఇంతకు ముందు శ్రీకృష్ణుడు– ''కామం మరియు క్రోధాలు దుర్జయులైన శత్రువులు. అర్జునా! వీటిని నీవు చంపుము'' అని అన్నాడు. అర్జునుడికి ఇది కఠినమైన పనిగా తోచింది. కానీ శ్రీకృష్ణుడు– ''కాదు, శరీరంకంటే అతీతమైనవి ఇంద్రియాలు, ఇంద్రియాలకంటే అతీతమైనది మనస్సు, మనస్సుకంటే అతీతమయినది బుద్ధి. బద్ధి కంటే అతీతమైనది నీ స్వరూపం. నీవు దాని వలన ప్రేరణ పొందు'' అని అన్నాడు. ఈ ప్రకారంగా తన శక్తిని తెలుసుకొని, దానిని ముందు ఉంచుకొని స్వావలంబుడై, కర్మలో ప్రవృత్తుడవటాన్ని 'జ్ఞానయోగం' అంటారు. శ్రీ కృష్ణుడు అన్నాడు– ''చిత్తాన్ని ధ్యానావస్థలో ఉంచుతూ, కర్మను నాకు సమర్పించి, అశా, మమత సంతాప రహితుడవై, యుద్ధం చెయ్యి'' సమర్పణతో బాటు, ఇష్టదైవంపై ఆధారపడుతూ, కర్మలో ప్రవృత్తుడవటమే నిష్కామ కర్మ యోగం. రెండింటిలోని క్రియ ఒక్కటే. మరి పరిణామం కూడా ఒక్కటే.

దీనినే సమర్థిస్తూ యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు ఇలా అంటాడు– యోగాన్ని ఆచరించకుండా, సంన్యాసం అంటే శుభాశుభ కర్మల యొక్క చరమ స్థితిని పొందగలగడం అసంభవం. శ్రీకృష్ణుడు చెప్పినట్లు అలాంటి యోగం ఏదీ లేదు. కాలుపై కాలు వేసుక్కూర్చుని 'నేనే పరమాత్ముణ్ణి, శుద్ధమైన వాడిని, బుద్ధిమంతుణ్ణి, నాకోసం కర్మ లేదు. బంధం లేదు. నాలో మంచీచెడు కనిపిస్తే, అది ఇంద్రియాలు తమ తమ పరిధులలో వ్యవహరించడం వలనే, అనడానికి వీలయిన యోగం లేదు. ఇలా తన్నుతాను పొగడు కోవడం శ్రీకృష్ణుని మాటలలో లేనే లేదు. సాక్షాత్తూ యోగేశ్వరుడు కూడా తనకు అత్యంత ప్రియుడైన అర్జునుడికి కర్మ చేయకుండా ఈ స్థితిని ప్రసాదించలేక పోయాడు. అతనే గనక అలా చేయ గలిగితే, 'గీత' అవసరం ఏముంటుంది? కర్మ చేయక తప్పదు. కర్మ చేయుట ద్వారానే సంన్యాస స్థితిని పొందవచ్చును. మరియు యోగంతో యుక్తులైన పురుషులు శీఘ్రంగానే పరమాత్ముణ్ణి పొందుతారు. యోగయుక్తుడైన పురుషుని లక్షణాలు ఏమిటి? దీనిని గురించి ఇలా అంటాడు–

శ్లో ॥ యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మ జితేన్ద్రియః ।
సర్వ భూతాత్మ భూతాత్మా కుర్వన్నపి న లిప్యతే ॥7॥

'విజితాత్మ'– ఎవరి శరీరమైతే విశిష్టరూపంతో గెలవబడిందో, 'జితేంద్రియః' ఎవరి ఇందిర్రియాలైతే గెలవబడ్డాయో, 'విశుద్ధాత్మా'– ఎవరి అంతఃకరణమైతే విశిష్టంగా శుద్ధి చేయబడిందో, అలాంటి పురుషుడు 'సర్వభూతాత్మ భూతాత్మ'– సంపూర్ణ భూత– ప్రాణుల ఆత్మ యొక్క మూల– ఉద్గమం అయిన పరమాత్మునితో ఏకీభవమైన యోగంతో యుక్తమై ఉన్నాడు. అతను కర్మ చేస్తూ కూడా దానిచే బంధించబడడు. అలాంటప్పుడు ఎందుకు చేస్తాడు? తన తరువాతి వారిలో పరమ కళ్యాణానికి అవసరమగు బీజాన్ని నాటడం కోసం. ఎందుకు బంధింపబడడు? ఎందుకంటే సమస్త ప్రాణుల యొక్క మూల ఉద్గమమైన పరమతత్వమైన పరమాత్ముడి తత్త్వంలో స్థితుడై పోయాడు కాబట్టి. దాని కంటే అతీతమైనదింకో వస్తువులేదు. వెదుకుదామంటే కూడా. వెనుక వదలిన వస్తువులు చిన్నవై పోయాయి. ఇంకా ఎందులో ఆసక్తి చూపించాలి? కాబట్టి అతను కర్మలచే బంధించబడడు. ఇది యోగ యుక్తమైన వాని యొక్క పరాకాష్ఠ చిత్రణ. మళ్ళీ యోగయుక్తుడైన పురుషుడు ఉండే విధానాన్ని స్పష్టం చేస్తాడు.– అతను కర్మ చేస్తూ కూడా ఎందుకు బంధించబడడు?

శ్లో ॥ నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్ ।
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్ ॥8॥

శ్లో ॥ ప్రలపన్ విసృజన్ గృహ్ణన్నున్మిషన్ని మిషన్నపి ।
ఇన్ద్రియాణీన్ద్రి యార్థేషు వర్తన్త ఇతి ధారయన్ ॥9॥

పరమతత్త్వమైన పరమాత్మణ్ణి సాక్షాత్కార సహితంగా తెలుసుకున్న యోగయుక్తుడైన పురుషుని ఈ మనః స్థితి అంటే అనుభూతి ఏమిటంటే– నేను కించిన్మాత్రం కూడా ఏమీ చేయను. అని. ఇది అతని కల్పన కాదు. కానీ ఈ స్థితిని, అతను కర్మ చేసియే పొందాడు. ఎలాగంటే 'యుక్తో మన్యేత'– ఇప్పుడు పరమ స్థితిని పొందిన పిదప అతను అన్నీ వింటూ కూడా, త్యాగం చేస్తూ, గ్రహించుతూ, కళ్ళను తెరుస్తూ మరియు మూస్తూ కూడా 'ఇంద్రియాలు తమ తమ పరిధులలో వ్యవహరిస్తున్నాయి' అనే ధారణ గలవాడై ఉంటాడు. పరమాత్ముని మించి ఏమీ లేదు. అతను ఆ పరమాత్మునిలోనే స్థితుడై ఉన్నప్పుడు, అంతకు మించిన ఏ సుఖాన్ని కోరి, అతను ఇతరులను స్పృశించడం మొదలైనవి చేస్తాడు? ఏదైనా యింకో శ్రేష్ఠమైన వస్తువంటూ మిగిలితే, అతనికి ఆసక్తి తప్పకుండా ఉంటుంది. కానీ ఆ స్థితిని పొందిన పిదప ఇప్పుడింక ఎక్కడికి వెళతాడు? మరి వెనక ఏమి త్యజిచేస్తాడు? కాబట్టి యోగంతో యుక్తుడైన పురుషుడు బంధించబడడు. దీనినే ఒక ఉదాహరణ ద్వారా స్పష్టం చేస్తాడు.

శ్లో ॥ బ్రహ్మణ్యాధాయ కర్మాణి సఙ్గం త్యక్త్వా కరోతి యః ।
లిప్యతే న స పాపేన పద్మపత్రమివామ్భసా ॥10॥

కమలం బురదలో ఉంటుంది. దాని ఆకులు నీటిపై ఉంటాయి. అలలు దానిపై రాత్రింబగళ్ళు ప్రవహిస్తుంటాయి. కానీ ఆకులు ఎలా ఉంటాయి? ఒక నీటి బిందువు కూడా దానిపై నిలవలేదు. బురద, నీళ్ళలో ఉంటూకూడా అది వాటిచే బంధించబడదు. సరిగ్గా యిదే ప్రకారంగా ఏ పురుషుడైతే అన్ని కర్మలనూ పరమాత్మునిలో విలయం చేసి (సాక్షాత్కారంతో

బాటే కర్మలు విలయమవుతాయి, అంతకు ముందు కావు) ఆసక్తిని త్యాగం చేసి (ఇప్పుడు పొందదగిన ఇంకో వస్తువు ఏదీ లేదు. అందుచేత ఆసక్తి పుట్టదు, కాబటి ఆసక్తిని త్యాగం చేసి) కర్మ చేస్తాడో, అతను కూడా యిదే ప్రకారంగా లిప్తుడు కాడు. మరి అతనెందుకు కర్మ చేస్తాడు? మీ కోసం; సమాజ కళ్యాణం కోసం; తన తరువాతి వారికి మార్గ దర్శనం చేయడం కోసం. దీనినే ఇలా వివరిస్తాడు–

శ్లో ॥ కాయేన మనసా బుద్ధ్యా కేవలైరిన్ద్రియైరపి ।
యోగినః కర్మ కుర్వన్తి సఙ్గం త్యక్త్వాऽऽత్మ శుద్ధయే ॥**11**॥

యోగీజనులు కేవలం ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి మరియు శరీరం ద్వారా కూడా ఆసక్తిని త్యాగం చేసి, ఆత్మశుద్ధికై కర్మ చేస్తారు. కర్మలు బ్రహ్మలో విలయమై పోయినప్పుడు కూడా, ఆత్మ అశుద్ధంగానే ఉంటుందా? లేదు, వారు ''సర్వభూతాత్మ భూతాత్మ'' అయిపోయారు. సమస్త ప్రాణులలో వారు తమ ఆత్మ విస్తరణనే చూస్తారు. ఆ సమస్త ఆత్మల యొక్క శుద్ధి కోసం, మీ అందరి మార్గ– దర్శనం కోసం వారు కర్మలో వ్యవహరిస్తారు. (కర్మను ఆచరిస్తారు.) శరీరం, బుద్ధి, మనస్సు మరయు కేవలం ఇంద్రియాలతో వారు కర్మ చేస్తారు. స్వరూపంతో వారు ఏమీ చేయరు. స్థిరంగా ఉంటారు. బయట నుంచి వారు క్రియలు చేస్తూ కనబడతారు. కానీ లోపల వారిలో అంతులేని శాంతి ఉంటుంది. త్రాడు బూడిద అయిపోయింది. కానీ ఆ త్రాటి ఆకారం మాత్రామే మిగిలి ఉంది.

శ్లో ॥ యుక్తః కర్మ ఫలం త్యక్త్వా శాన్తి మాప్నోతి నైష్ఠికీం ।
అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే ॥**12**॥

'యోగ యుక్తుడు' అంటే యోగం యొక్క ప్రతిఫలమైన పరమాత్మను పొందిన పురుషుడు, అన్ని ప్రాణుల ఆత్మలయొక్క మూలమైన పరమాత్మునిలో స్థితుడై ఉన్న యోగి కర్మ ఫలాన్ని త్యాగం చేసి (కర్మ ప్రతిఫలమైన పరమాత్ముడు అతనితో వేరుగా లేడు. కాబట్టి కర్మ యొక్క ప్రతి ఫలాన్ని త్యాగం చేసి) 'నైష్ఠికీం శాంతిం అప్నోతి' –శాంతి యొక్క అంతిమ అవస్థను పొందుతాడు. దాని తర్వాత ఇంకా పొందదగిన శాంతి అనేది మిగిలి ఉండదు. దాని తరువాత అతడు ఎప్పుడూ అశాంతికి గురికాడు. కానీ ఏ పురుషుడు, కర్మ పరిణామంతో యుక్తుడు కాడో, ఇంకా దారిలో ఉన్నాడో– అలాంటి పురుషుడు ప్రతి ఫలాల్లో ఆసక్తుడై ప్రతి ఫలమైన పరమాత్ముని ఆసక్తి కలగడం అవసరం. కాబట్టి ప్రతి ఫలంతో ఆసక్తుడై 'కామకారేణ నిబద్యతే' కోరుకొనుట వలన బంధించ బడతాడు. అంటే చివరి వరకూ కోరికలు జాగృతమవుతూనే ఉంటాయి. అందుచేత సాధకుడు చివరి వరకూ సావధానుడై ఉండవలసి ఉంటుంది. 'గురుమహారాజులవారు' అనేవారు 'ఓహో! మనం భగవంతుడి నుంచి కొంచెం కూడా వేరుగా ఉన్నంత వరకు, మాయ సఫలమవవచ్చు' ఈ దశని రేపు పొందవచ్చు అయినా కూడా ఈ రోజు అతను అజ్ఞానుడే. ఇందువలన చివరి వరకూ సాధకుడు అజాగ్రత్తగా ఉండరాదు''. ఇదే విషయం క్రింది శ్లోకంలో చెప్పబడింది.

శ్లో ॥ సర్వ కర్మాణి మనసా సన్యస్యాస్తే సుఖం వశీ ।
నవద్వారే పురే దేహీ నైవ కుర్వన్న కారయన్ ॥ **13**॥

ఎవరైతే సంపూర్ణంగా స్వవశుడో, ఎవరైతే శరీరం, బుద్ధి, మనస్సు, ప్రకృతులకంటే అతీతంగా 'స్వయం'లో స్థితుడై ఉన్నాడో, అలాంటి స్వవశంలో ఉన్న పురుషుడు నిస్సందేహంగా ఏమీ చేయడు, ఏమీ చేయించడు. తరువాతి వారిచే చేయించడం కూడా అతని ఆంతరంగిక శాంతిని స్పృశించలేదు. అలాంటి స్వరూపస్థుడైన పురుషుడు శబ్దాది విషయాలను గ్రహించే తొమ్మిది ద్వారాలు (రెండు చెవులు, రెండు కళ్ళు, రెండు నాసిక రంధ్రాలు, ఒక నోరు, ఉపస్థ మరియు పాయువు) గల శరీర రూపమయిన యింటిలో అన్ని కర్మలనూ మనస్సుతో త్యాగం చేసి, స్వరూపానందంలోనే స్థితుడై ఉంటాడు. నిజానికి అతను ఏమీ చేయడు మరియు చేయించడు.

దీనినే శ్రీ కృష్ణుడు మళ్ళీ యింకోరకంగా– ''ఆ ప్రభువు చేయడు మరియు చేయించడు'' అని చెప్పాడు. సద్గురువు, భగవంతుడు, ప్రభువు స్వరూపస్థుడైన మహాపురుషుడు, యుక్తుడు మొదలైన పదాలు ఒకదాని కొకటి పర్యాయ వాచకాలు. భగవంతుడు వేరుగా ఏదో చేసెయ్యడానికంటూరాడు. అతను ఏదైనా చేస్తే ఇలాంటి స్వరూపస్థులైన ఇష్టుల చేత చేయిస్తాడు. మహాపురుషునికి శరీరం ఒక యిల్లు మాత్రమే. అందుచేత పరమాత్ముడు చేయడం అన్నా మరియు మహాపురుషుడు చేయడం అన్నా ఒకటే, ఎందుకంటే అతను వారి ద్వారానే చేస్తాడు. వాస్తవానికి అలాంటి పురుషుడు చేస్తూ కూడా ఏమీ చేయడు. తరువాతి శ్లోకం చూడండి.

శ్లో ॥ న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః ।
న కర్మఫల సంయోగం స్వభావస్తు ప్రవర్తతే ॥ **14**॥

ఆ ప్రభువు భూత ప్రాణుల కర్తృత్వ భావాన్ని గానీ, కర్మలను గానీ, కర్మ యొక్క ప్రతి ఫలాల సంయోగాన్ని గానీ చేయడు. కానీ స్వభావంలో స్థితమైన ప్రకృతి యొక్క ప్రభావ ప్రేరణల చేతనే అందరూ వ్యవహరిస్తారు. ప్రకృతిని బట్టి సాత్త్వికం, రాజసం లేక తామసం ఉంటుందో, ఆ విధంగానే వారు వ్యవహరిస్తారు. ప్రకృతి గొప్పది అయినా మీ స్వభావం ఎంత వికృతమైందో, లేక వికసితమయిందో మీ మీద అంతే ప్రభావాన్ని వేయగలదు.

సాధారణంగా లోకులు చేసేవాడు, చేయించేవాడు భగవంతుడే అని, మనం నిమిత్త మాత్రులమే అని అంటారు. మనచే మంచి చేయించినా సరే లేక చెడు చేయించిన సరే అంతా ఆ పరమాత్ముడు చేయించేదే. కానీ యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు అంటాడు– ఆ ప్రభువు చేయడు, చేయించడు మరియు సంయోగాన్నే కుదర్చడు. లోకులు తమ స్వభావంలోగల ప్రకృతికి అనుగుణంగా వ్యవహరిస్తారు. స్వతః పని చేస్తారు. వారు తమ అలవాట్లచే, వివశులై పని చేస్తారు. భగవంతుడు చేయడు. అలాంటప్పుడు భగవంతుడే చేస్తాడని లోకులెందుకు అంటారు? యోగేశ్వరుడు అంటాడు.–

శ్లో ॥ నాదత్తే కస్యచిత్పాపం స చైవ సుకృతం విభుః ।
అజ్ఞానే నావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః ॥15॥

ఎవరినైతే యిప్పటి వరకూ ప్రభువు అన్నాడో, అతనినే యిక్కడ విభువు అనడమయింది, ఎందుకంటే అతను సంపూర్ణ వైభవంతో సంయుక్తుడైనవాడు కాబట్టి. ప్రభుతతో మరియు వైభవంతో సంయుక్తుడైన ఆ పరమాత్ముడు ఎవరిదైనా పాపకర్మాన్నిగానీ, పుణ్య కర్మాన్నిగానీ, గ్రహించడు. మరి లోకులెందుకు అంటారు? ఎందుకంటే అజ్ఞానం ద్వారా జ్ఞానం కప్పబడి ఉంది గనుక. వారికింకా సాక్షాత్కార సహితంగా జ్ఞానం లభించలేదు కాబట్టి. ప్రస్తుతానికి వారు జంతువులు. మోహవశంలో వారేమైనా అనవచ్చు. జ్ఞానం వలన ఏమవుతుంది? దీన్ని స్పష్టంగా చెప్పాడు-

శ్లో ॥ జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః ।
తేషా మాదిత్యవజ్ఞానం ప్రకాశయతి తత్పరమ్ ॥16॥

ఎవరి అంతః కరణంలోని అజ్ఞానం (ఏదైతే జ్ఞానాన్ని కప్పి ఉంచిందో) ఆత్మ సాక్షాత్కారం ద్వారా నష్టమయిపోతుందో, మరియు ఈ ప్రకారంగా ఎవరైతే జ్ఞానాన్ని పొందుతారో, వారి యొక్క ఆ జ్ఞానం సూర్యుని సదృశంగా ఆ పరమతత్త్వమైన పరమాత్ముని దర్శింప చేస్తుంది. అంటే ఆ పరమాత్మ అనేది ఏదైనా అంధకారం పేరా? కాదు, అతను 'స్వయం ప్రకాశరూపదిన- రాతీ' స్వయం ప్రకాశరూపం కలవాడు. కానీ మన ఉపయోగానికి కాదు. ఎందుకంటే ఆ పరమాత్ముడు కనిపించడు కదా. ఎప్పుడైతే జ్ఞానం ద్వారా అజ్ఞానం యొక్క ఆచ్ఛాదన తొలగిపోతుందో అప్పుడు ఆ జ్ఞానం సూర్యుని సదృశంగా పరమాత్ముని తనలో లీనమగునట్లు చేస్తుంది. మరింక ఆ పురుషునికి ఎటువంటి అంధకారమూ ఉండదు. అజ్ఞానం యొక్క స్వరూపమేమిటి?

శ్లో ॥ తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠాస్తత్పరాయణాః ।
గచ్ఛన్త్యపునరావృత్తిం జ్ఞాన నిర్ధూతకల్మషాః ॥17॥

ఎప్పుడైతే ఆ పరమతత్త్వమైన పరమాత్మునికి అనుగుణంగా బుద్ధి ఉంటుందో, తత్త్వానికి అనుగుణంగా ప్రవహించే మనస్సు ఉంటుందో, పరమతత్త్వమైన పరమాత్మలో ఏకీభావంతో అతను ఉంటాడో, అతనిలో నిమగ్నుడై ఉంటాడో- అటువంటి దశ పేరే జ్ఞానం. జ్ఞానం కల్లబొల్లి కబుర్లు, లేక వాదవివాదాల పేరు కాదు. ఈ జ్ఞానం ద్వారా పాపరహితుడైన పురుషుడు పునరాగమన రహితమైన పరమగతిని పొందుతాడు. పరమగతిని పొంది పూర్ణంగా తెలివి తేటలతో యుక్తుడైన పురుషుణ్ణే పండితుడు అని కూడా అంటారు. తరువాత-

శ్లో ॥ విద్యా వినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని ।
శుని చైవ శ్వపాకే చ పణ్డితాః సమదర్శినః ॥18॥

జ్ఞానం ద్వారా ఎవరి పాపాలైతే నశించి పోయాయో, ఎవరైతే 'అపునరావర్తి పరమగతి'ని పొందారో, అలాంటి జ్ఞానులు వినయ సంపన్నుడైన బ్రాహ్మణుని పట్ల, చండాలుని పట్ల, ఆవు, మరియు కుక్క పట్ల ఏనుగు పట్ల సమానమైన దృష్టిగలవారై ఉంటారు. వారి

దృష్టిలో విద్యా వినయ సంపన్నుడైన బ్రాహ్మణుడు గొప్పకాడు. మరి చండాలుడు తక్కువా కాడు. ఆవు ధర్మం కాదు మరియు కుక్క అధర్మం కాదు, మరియు అలాగే ఏనుగు పెద్ద శరీరాన్ని కలిగి ఉండదు. అలాంటి పండితులు, జ్ఞాన సంపన్నులు, సమదర్శులు, సమవర్తులు అయి ఉంటారు. వారి దృష్టి చర్మంపై గాక ఆత్మపై పడుతుంది వారికి కనిపించే భేధమేదంటే విద్యావినయ సంపన్నుడు స్వరూపానికి దగ్గరలో ఉంటే, మిగిలిన వారు కొంచెం దూరంలో, కొంత మంది ముందు మజిలీ చేరి ఉంటే, కొందరు వెనుక మజిలీలో ఉన్నారు. శరీరం వస్త్రం మాత్రమే. వారి దృష్టి వస్త్రం యొక్క మహత్వాన్ని చూడదు. కానీ అతని హృదయంలో గల అత్మపై పడుతుంది. కాబట్టి వారెలాంటి భేదాన్నీ చూపరు.

శ్రీకృష్ణుడు పర్యాప్తమైన గోసేవ చేసాడు. అతను ఆవుల గురించి గౌరవ ప్రదంగా మాట్లాడాలి కదా! కానీ అతను అలా మట్లాడలేదు. శ్రీకృష్ణుడు ఆవుకి ధర్మంలో ఎలాంటి స్థానమూ ఇవ్వలేదు. మిగిలిన జీవాత్మలలోలాగానే ఆవులలో కూడా ఆత్మ ఉందని అతను ఒప్పుకున్నాడు. ఆవుల ఆర్థిక మహత్త్వం ఏదైనా, వాటి ధార్మిక మహాత్త్వం మాత్రం తరువాత తరం వారిచే యివ్వబడింది. శ్రీకృష్ణుడు ఇంతకు ముందు చెప్పాడు– ''అవివేకుల బుద్ధి అనంత శాఖలు గలదై ఉంటుంది. కాబట్టి వారు అనంత క్రియలను విస్తరింప చేసుకొంటారు. ఆడంబరమైన, శోభాయుక్తమైన భాషలో వాటిని వారు వ్యక్తపరుస్తారు. వారి మాటల యొక్క ప్రభావం ఎవరి చిత్తంపై పడుతుందో, వారి బుద్ధి కూడా భ్రష్టమయి పోతుంది. వారేమీ పొందలేరు, భ్రష్టులయి పోతారు. ''కానీ నిష్కామ కర్మయోగంలో అర్జునా! నిర్ధారించబడిన క్రియ ఒక్కటే. అది యజ్ఞం యొక్క ప్రక్రియ– 'ఆరాధన'. ఆవు, కుక్క, ఏనుగు, రావి చెట్టు, నది మొదలైన వాటి ధార్మిక మహత్త్వం యిలాంటి అనంత శాఖలు గల అవివేకుల అభిప్రాయం మాత్రమే. వీటికే గనుక నిజంగా ధార్మిక మహత్త్వం ఉంటే శ్రీకృష్ణుడు చెప్పి ఉండే వాడే. గుడి–మసీదు వగైరా పూజాస్థలాలు ఆరంభంలో అవసరమైనవే. అక్కడ ప్రేరణ కలిగించే సామూహిక ఉపదేశాలు ఇవ్వబడతాయి. కాబట్టి వాటి ఉపయోగం తప్పకుండా ఉంటుంది. అవి ధర్మోపదేశం వినిపించే కేంద్రాలు.

ప్రస్తుత శ్లోకంలో రెండు రకాల పండితుల గురించి చర్చించ బడింది. ఒక పండితుడు పూర్ణ జ్ఞాత. మరి రెండవ రకం పండితుడు విద్యా– వినయ సంపన్నుడు. వారు రెండు రకాలు ఎలా? వాస్తవానికి ప్రతి విషయానికీ రెండు హద్దులు ఉంటాయి– ఒకటి అత్యధికమయినది, పరాకాష్ట; మరి రెండోది ప్రారంభిక దశకు చెందినది, లేదా నిమ్నతమమయినది. ఉదాహరణకై, ఎక్కడ నుంచైతే భక్తి మొదలవుతుందో, వివేకం– వైరాగ్యం మరియు ధ్యానంతో ఆరాధించడం మొదలవుతుందో, అది భక్తి యొక్క నిమ్నతమ హద్దు. ఎక్కడైతే భక్తి తన పరిణామాన్ని యిచ్చే స్థితిలోకి చేరుకుంటుందో, అది భక్తి యొక్క ఉచ్చతమ హద్దు. ఇదే ప్రకారంగా బ్రాహ్మణశ్రేణిలో కూడా, ఎప్పుడైతే బ్రహ్మలో ప్రవేశం పొందే యోగ్యతలు వస్తాయో, ఆ సమయంలో విద్య, వినయం చేకూరుతాయి. మనసు మరియు ఇంద్రియాలపై నియంత్రణ, అనుభవం యొక్క సంచారం, నిరంతరంగా చింతన, ధ్యానం మరియు సమాధి మొదలైన బ్రహ్మలో ప్రవేశం

ఇప్పించే అన్ని యోగ్యతలు అతని అంతరాళంలో స్వాభావికంగా కార్యరతములై ఉంటాయి. ఇది బ్రాహ్మణత్వం యొక్క నిమ్నతమ (కనిష్ఠ)మైన హద్దు. ఎప్పుడైతే క్రమంగా ఉన్నతం అవుతూ, ఆ బ్రహ్మ యొక్క దిగ్దర్శనం చేసి, అతనిలో ప్రవేశం పొందుతాడో అప్పుడు అత్యుత్తమ హద్దు వస్తుంది. తెలుసుకోవలసిన దాన్ని తెలుసుకున్నాడు. అతను పరిపూర్ణమైన జ్ఞాని.

జన్మమరణ రహితుడైన అలాంటి పురుషుడు విద్యా-వినయ సంపన్నుడైన బ్రాహ్మణునిపై, ఛండాలునిపై, కుక్కపై, ఏనుగు మరియు ఆవుపై సమానమైన దృష్టిగలవాడవుతాడు. ఎందుకంటే అతని దృష్టి హృదయ స్థితమైన ఆత్మ స్వరూపంపైన పడుతుంది. అలాంటి మహాపురుషునికి పరమగతిలో ఏం దొరికింది, ఎలా దొరికింది? అనే విషయం స్పష్టం చేస్తూ యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు అంటాడు-

శ్లో॥ ఇహైవ తైర్జితః సర్గో యేషాం సామ్యే స్థితం మనః ।
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితా ః ॥**19**॥

ఎవరి మనస్సైతే సమత్వంలో స్థితమై ఉంటుందో, అలాంటి పురుషులు జీవించి ఉన్న అవస్థలోనే సమస్త ప్రపంచాన్ని గెలుస్తారు. మనసు యొక్క సమత్వానికీ ప్రపంచాన్ని గెలవడానికీ గల సంబంధమేమిటి? ప్రపంచం నాశనమై పోతే, ఆ పురుషుడు ఉండేదెక్కడ? శ్రీకృష్ణుడు 'నిర్దోషం హి సమం బ్రహ్మ'- ఆబ్రహ్మ నిర్దోషి మరియు సమత్వం కలవాడు' అని అంటాడు. ఇక్కడ అతని మనస్సు కూడా నిర్దోషి మరియు సమత్వస్థితి పొందినటువంటిది. 'తస్మాద్ బ్రహ్మణితే స్థితాః' -కాబట్టి అతడు ఆ బ్రహ్మలో స్థితుడయిపోతాడు. దీని పేరే 'అపునరావర్తి పరమగతి. ఇది ఎప్పుడు లభిస్తుంది? సంసార రూపమైన శత్రువు జయించబడినప్పుడు. సంసారం ఎప్పుడు జయించబడుతుంది? ఎప్పుడు మనస్సు నిరోధించబడుతుందో, సమత్వంలో ప్రవేశం దొరుకుతుందో (ఎందుకంటే మనస్సు యొక్క ప్రసారమే జగత్తు) అప్పుడు. ఎప్పుడైతే ఆ బ్రహ్మలో స్థితుడై పోతాడో, అప్పుడు ఆ బ్రహ్మజ్ఞాని లక్షణాలు ఏమిటి? అతడు ఉండే విధానాన్ని స్పష్టం చేస్తాడు శ్రీకృష్ణుడు:-

శ్లో॥ న ప్రహృష్యేత్ప్రియం ప్రాప్య నోద్విజేత్ప్రాప్య చాప్రియమ్ ।
స్థిర బుద్ధి రసమ్మూఢో బ్రహ్మవిద్బ్రహ్మణి స్థితః ॥**20**॥

అతనికి ప్రియం - అప్రియం అంటూ ఉండదు. కాబట్టి దేనినైతే లోకం ప్రియమైనదంటుందో, దానిని పొంది అతను ఆనందించడు, మరియు దేనినైతే లోకులు అప్రియమైనదంటారో (అది ఎలాంటిదంటే ధర్మావలంభి సూచించే చిహ్నాన్ని (గుర్తు) పెట్టడం.) దానిని పొంది ఉద్వేగాన్ని పొందడు. అటువంటి స్థిరమైన బుద్ధి గలవాడు, 'అసంమూఢః సంశయ రహితుడైనవాడు, 'బ్రహ్మవిద్' బ్రహ్మతో సంయుక్తుడైన బ్రహ్మవేత్తః 'బ్రహ్మణి స్థితః'- పరాత్పర బ్రహ్మలో ఎల్లప్పటికీ స్థితుడై ఉంటాడు.

శ్లో ॥ బహ్యాస్పర్శేష్వసక్తాత్మా విన్దత్యాత్మని యత్సుఖమ్ ।
స బ్రహ్మ యోగయుక్తాత్మా సుఖమక్షయమశ్నుతే ॥**21**॥

బయటి సాంసారిక భోగాల పట్ల అనాసక్తుడైన పురుషుడు అంతరాత్మలో స్థితమైన ఏ సుఖమైతే ఉందో, ఆ సుఖాన్ని పొందుతాడు. ఆ పురుషుడు 'బ్రహ్మయోగ యుక్తాత్మా'- పరబ్రహ్మ పరమాత్మునితో కలిసినటువంటి ఆత్మకలవాడు. కాబట్టి అతను ఏ ఆనందానికైతే ఎప్పటికీ అంతులేదో, అటువంటి శాశ్వతమైన ఆనందాన్ని అనుభవించుతాడు. ఈ ఆనందాన్ని ఎవరు అనుభవించవచ్చు? ఎవరైతే బయటి విషయ భోగాలపట్ల అనాసక్తులౌతారో, వారు. అంటే భోగించడం (సుఖించడం) తప్పా? భగవంతుడైన శ్రీకృష్ణుడు ఇలా అంటాడు-

శ్లో ॥ యే హి సంస్పర్శజా భోగా ధుఃఖయోనయ ఏవ తే ।
అద్యన్తవన్తః కౌన్తేయ న తేషు రమతే బుధః ॥**22**॥

కేవలం చర్మం మాత్రమే కాదు, ఇంద్రియాలన్నీ స్పర్శ భావాన్ని అనుభవిస్తాయి. చూడటం- కళ్ళ యొక్క స్పర్శ, వినటం- చెవులయొక్క స్పర్శ. ఈ ప్రకారంగా ఇంద్రియాల విషయాల సంయోగంచే ఉత్పన్నమయ్యే అన్ని భోగాలు (సుఖాలు) ప్రీతికరమైనవిగా అనిపిస్తాయి, కానీ నిస్సందేహంగా అవి అన్నీ 'దుఃఖయోనయః' దుఃఖప్రదమైన జన్మలకు కారణం అవుతాయి. ఈ భోగాలే ముందు జన్మలకి కారణం అవుతాయి. ఇంతేకాదు, ఆ భోగాలు, జనన-మరణాలు కలవి, నశ్వరాలు. కాబట్టి కౌంతేయా! వివేకవంతుడయిన పురుషుడు వాటిలో చిక్కుకొనిపోడు. ఇందియాల ఈ స్పర్శలలో ఏముంటుంది? కామ-క్రోధాలు, రాగ ద్వేషాలు ఉంటాయి. దీనిని గురించి శ్రీకృష్ణుడు ఇలా అంటాడు-

శ్లో ॥ శక్నోతీహైవ యః సోఢుం ప్రాక్శరీర వి మోక్షణాత్ ।
కాయక్రోధోద్భవం వేగం స యుక్తః స సుఖీ నరః ॥**23**॥

కాబట్టి ఏ మనుష్యుడైతే శరీరం నాశమవడానికి ముందే కామం మరియు క్రోధాల నుండి ఉత్పన్నమయ్యే వేగాన్ని సహించడంలో (నాశనం చేయడంలో) సమర్థుడౌతాడో, అతడే నరుడు (రమించనివాడు). అతడే ఈ లోకంలో యోగంతో యుక్తుడైనవాడు మరియు అతడే సుఖంగా ఉండేవాడు. దేని వెనుకనైతే దుఃఖం లేదో, ఆ సుఖంలో అంటే పరమాత్మలో స్థితుడైన వాడు. జీవిస్తూ ఉండగానే ఈ సుఖాన్ని పొందవచ్చు. మరణించిన తర్వాత కాదు. (దీనిని పొందే విధానం సంత్ కబీరు దీనినే యింకా స్పష్టంగా చెప్పాడు- 'అవధూ! జీవిత్ మే కర్ ఆశా! మరణాంతర ముక్తి గురించి చెప్పే గురువు స్వార్థపరుడు, అబద్ధపు విశ్వాసాన్ని కలిగించేవాడు). ఇదే యోగేశ్వరుడైన శ్రీకృష్ణుని అభిప్రాయం కూడా- శరీరం ఉండగానే, మరణానికి ముందే, ఎవరైతే కామక్రోధాల వేగాన్ని నశింప చేయడంలో సమర్థులవుతారో, ఆ పురుషుడే ఈ లోకంలో యోగి, అతనే సుఖంగా ఉండేవాడు. కామం, క్రోధం వంటి బాహ్య స్పర్శలే శత్రువులు. వీటిని మీరు జయించండి. ఇలాంటి పురుషుని లక్షణాలనే మళ్ళీ చెబుతాడు.

శ్లో ॥ యోఽన్తః సుఖోఽ న్తరారామ స్తథాన్తర్జ్యోతిరేవ యః ।
సయోగీ బ్రహ్మ నిర్వాణం బ్రహ్మభూతోఽధి గచ్ఛతి ॥**24**॥

ఏ వ్యక్తి అయితే అంతరాత్మలోనే సుఖం కలవాడో 'అంతరారామః'– అంతరాత్మలోనే విశ్రమించువాడో, ఎవరైతే అంతరాత్మలోనే ప్రకాశం కలవాడో (సాక్షాత్కారం పొందినవాడో) అతనే యోగి. 'బహ్మభూతః– బ్రహ్మతో ఒక్కటై 'బ్రహ్మనిర్వాయం' వాక్కులకు అతీతమైన బ్రహ్మ., శాశ్వత బ్రహ్మను పొందుతాడు. అంటే మొదట వికారాల (కామ, క్రోధాలు) నాశనం మరి తర్వాత దర్శనం, అటు తర్వాత ప్రవేశం. ఇంకా ముందు చూద్దాం–

శ్లో ॥ లభన్తే బ్రహ్మ నిర్వాణ మృషయః క్షీణ కల్మషాః ।
చిన్నద్వైధా యతాత్మానః సర్వభూత హితే రతాః ॥**25**॥

పరమాత్ముడి సాక్షాత్కారం వలన ఎవరి పాపాలు నాశనమయి పోయాయో, ఎవరి సంశయాలు నశించిపోయాయో, సంపూర్ణ ప్రాణుల హితానికై ఎవరు పాటు పడుతున్నారో, (ఎవరు పరమాత్మ సాక్షాత్కారం పొందినవారో, వారే ఇలా చేయగలరు. తాము గోతిలో పడ్డవారు ఇతరుల నెలా బయటికి తీయగలరు. కాబట్టి కరుణ అనేది మహాపురుషులకు స్వాభావికమైన గుణం అయిపోతుంది) 'యతాత్మానః' – జితేంద్రియులైన బ్రహ్మజ్ఞానులు అయిన పురుషులు, శాంత పరబ్రహ్మను పొందుతారు. ఆ మహాపురుషుల స్థితిని గురించి మళ్ళీ వివరిస్తాడు.

శ్లో ॥ కామక్రోధ వియుక్తానాం యతీనాం యతచేతసామ్ ।
అభితో బ్రహ్మ నిర్వాణం వర్తతే విదితాత్మనామ్ ॥**26**॥

కామక్రోధ రహితులైన గెలవ బడ్డ చిత్తం గలవారై, పరమాత్ముని యొక్క సాక్షాత్కారం చేసుకొన్న జ్ఞానులైన పురుషులకు అన్ని వైపుల నుండి శాంత పరబ్రహ్మ లభిస్తాడు. దాని వలన ప్రేరణ పొందాలని, యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు ఆ పురుషుడు ఉండే విధానాన్ని మరీ మరీ వివరించాడు. ప్రశ్న రమారమి పూర్తయింది. ఇప్పుడు అతడు మళ్ళీ వివరించి చెప్పేది ఏమిటంటే, ఈ స్థితిని పొందడానికై చేయవలసిన వాటిలో అవసరమైనది 'శ్వాస ప్రశ్వాసల యొక్క చింతన'. యజ్ఞం యొక్క ప్రక్రియలో ప్రాణాన్ని అపానంలో ఆహుతి చేయడం, అపానాన్ని ప్రాణంలో ఆహుతి చేయడం, ప్రాణాపానాల గతి నిరోధం చేయడం గురించి అతడు ఇదివరకే చెప్పాడు. దాన్నే బోధపరుస్తున్నాడు.

శ్లో ॥ స్పర్శాన్ కృత్వా బహిర్బా హ్యాంశ్చక్షుశ్చైవాన్తరే భ్రువోః ।
ప్రాణా పానౌ సమౌకృత్వా నాసాభ్యన్తర- చారిణౌ ॥**27**॥

శ్లో ॥ యతేన్ద్రియ- మనోబుద్ధిర్మునిర్మోక్ష పరాయణః ।
విగతేచ్ఛాభయక్రోధో యః సదా ముక్త ఏవ సః ॥**28**॥

అర్జునా! బయటి విషయాల గురించి, దృశ్యాల గురించి చింతన చేయకుండా, వాటిని త్యాగం చేసి, దృష్టిని భృకుటి మధ్యలో స్థిరపరచి, భ్రువోః అంతరే' అంటే అర్థం కళ్ళ మధ్య భాగంలోగానీ, లలాట మధ్య భాగంలోగానీ దృష్టిని నిలపమనికాదు, భ్రకుటి మధ్యన అంటే అసలు అర్థం– తిన్నగా కూర్చున్నప్పుడు దృష్టి భ్రకుటికి సరిగా మధ్యనుంచి తిన్నగా

ముందుకు పడాలని. కుడి– ఎడమ, అక్కడ– ఇక్కడ చూడకూడదని అర్థం. ముక్కు యొక్క ఎముకపై తిన్నగా దృష్టిని నిలుపుతూ (ముక్కునే చూస్తూ ఉండకండి), ముక్కులో చరించే ప్రాణాపాన వాయువులని సమం చేస్తూ, అంటే దృష్టిని అక్కడ స్థిరం చేస్తూ, ధ్యానాన్ని శ్వాసపై ఉంచుతూ– శ్వాస లోపలకి ఎప్పుడు వెళ్ళింది? ఎంత సేపు ఆగింది? రమారమి అరసెకండు ఆగుతుంది. దాన్ని ప్రయత్నించి ఆపవద్దు. శ్వాస ఎప్పుడు బయటకు వచ్చింది? ఎంతసేపు బయట ఆగింది? శ్వాసలో వీచే నామం యొక్క ధ్వని వినబడుతూ ఉండాలనేది వేరుగా చెప్పనవసరం లేదు. ఈ ప్రకారంగా శ్వాస– ప్రశ్వాసలపై ధ్యానం ఉండిపోయినప్పుడు, మెల్లమెల్లగా శ్వాస అచలంగా, స్థిరంగా ఉండిపోయినప్పుడు, సమం అయిపోతుంది. లోపల సంకల్పాలు కలగవు. బయటి సంకల్పాలు లోపలికి ప్రవేశించవు. బాహ్య భోగాల చింతన బయటే త్యజించబడుతుంది, లోపల కూడా సంకల్పాలు జాగృతం కావు. ధ్యానం నూనె ధారలాగా నిలబడుతుంది. నూనె ధార నీటి ధారలాగా టపటప మంటూ పడదు, పడ్డంత సేపూ ఏకధారగానే పడుతుంది. ఈ ప్రకారంగా ప్రాణాపానాల గతిని స్థిరం మరియు సమంచేసి, ఇంద్రియాలని, మనస్సు, బుద్ధిని, గెలిచినవాడైన; కోరికలు భయ క్రోధాలులేని, మననశీలతలో చరమ సీమకు చేరి మోక్షపరాయణుడైన ముని ఎప్పటికీ 'ముక్తి'ని పొందిన వాడే. ముక్తుడై అతను ఎక్కడకి వెళతాడు? ఏం పొందుతాడు? దీనిని గూర్చి ఇలా చెప్పాడు–

శ్లో ॥ భోక్తారం యజ్ఞ తపసాం సర్వలోక మహేశ్వరమ్ ।
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాన్తిమృచ్ఛతి ॥**29**॥

ముక్తుడైన ఆ పురుషుడు, నన్ను యజ్ఞాలను మరియు తపస్సులను అనుభవించే సమస్త లోకాల ఈశ్వరునికి కూడా ఈశ్వరుడిని కాబట్టి సమస్త ప్రాణులకు స్వార్థ రహితుడైన హితైషి గాను సాక్షాత్తుగా తెలుసుకొని, శాంతిని పొందుతాడు. శ్రీకృష్ణుడు అంటాడు– ఆ పురుషుని యొక్క శ్వాస– ప్రశ్వాసల, యజ్ఞం మరియు తపస్సుల యొక్క భోక్తను నేనే. యజ్ఞం మరియు తపస్సులు చివరకు దేనిలోనైతే లయించి పోతాయో అది నేనే. అతడు నన్ను పొందుతాడు. యజ్ఞం చివర దొరికేది, దేని పేరైతే శాంతియో, అది నా స్వరూపమే. ఆ ముక్తుడైన పురుషుడు నన్ను తెలుసుకుంటాడు. మరియు తెలుసుకోగానే నన్ను పొందుతాడు. దీని పేరే శాంతి. ఎలాగైతే నేను ఈశ్వరులకు కూడా ఈశ్వరుణ్ణో అలాగే అతను కూడా ఈశ్వరులకు కూడా ఈశ్వరుడైపోతాడు

సారాంశం :

ఈ అధ్యాయం ఆరంభంలో అర్జునుడు ఒకప్పుడు మీరు నిష్కామ కర్మ యోగాన్ని ప్రశంసిస్తారు. ఒకప్పుడు సన్యాస మార్గంలో చేసే కర్మను ప్రశంసిస్తారు. దేనినైతే మీరు నిశ్చయించారో, ఏదైతే పరమ కళ్యాణకారియో ఈ రెండింటిలో ఒక దానిని గురించి చెప్పండి అని అడుగుతాడు. శ్రీ కృష్ణుడు అంటాడు– ''అర్జునా! రెండింటిలోనూ పరమ కళ్యాణం ఉంది. రెండింటిలోనూ, నిర్ధారితమైన యజ్ఞం యొక్క ఒకే క్రియ చేయబడుతుంది. అయినా కూడా నిష్కామ కర్మయోగం విశిష్టమైనది. ఇది చేయకుండా సన్యాసం (శుభాశుభ కర్మల

అంతం) కాదు. సన్యాసం మార్గం కాదు, అది ఒక మజలీ పేరు. యోగంతో యుక్తుడైన వాడే సంన్యాసి''. యోగయుక్తుడైన వాని లక్షణాలు చెప్పాడు- అతడే ప్రభువు. అతడు ఏమీ చేయడు, ఏమీ చేయించడు. కానీ స్వభావంపై ప్రకృతి యొక్క ప్రభావానికి అనుగుణంగా లోకులు కర్మలు చేస్తారు. ఎవ్వరైతే సాక్షాత్తుగా నన్ను తెలుసుకొంటారో, వారే జ్ఞానులు, వారే పండితులు. యజ్ఞం యొక్క ఫలంగా లోకులు నన్ను తెలుసుకుంటారు. శ్వాస-ప్రశ్వాసల యొక్క జపం మరియు యజ్ఞం, తపస్సులు ఎవరిలోనైతే విలయమవుతాయో, అది నేనే, యజ్ఞం యొక్క ఫలస్వరూపమైన నన్ను తెలుసుకొని వారు ఏ శాంతినైతే పొందుతారో, అది కూడా నేనే. శ్రీకృష్ణుడి వంటి, మహాపురుషుల వంటి స్వరూపం సాక్షాత్కారం పొందిన వారికి కూడా లభిస్తుంది. అతడు కూడా ఈశ్వరులకు ఈశ్వరుడు. ఆత్మలకు కూడా ఆత్మ స్వరూపమయుడయి పోతాడు. ఆ పరమాత్మునితోబాటు ఏకీభావాన్ని పొందుతాడు (అలా అవడానికి ఎన్ని జన్మలు పట్టినా సరే). ఈ అధ్యాయంలో స్పష్టం చేయబడిందేమిటంటే యజ్ఞం- తపస్సు వీటి యొక్క భోక్త, మహాపురుషులలో కూడా ఉండే శక్తి ఈ రెండూ మహేశ్వరుడే.

ఓం తత్సదితి శ్రీమద్ భగవద్ గీతాసూపనిషత్సు బ్రహ్మ విద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే 'యజ్ఞ భోక్తా-మహాపురుషస్థ మహేశ్వరః' నామ పంచమోऽధ్యాయః ||**5**||

ఈ ప్రకారంగా శ్రీమద్భగవద్గీతా రూపమైన ఉపనిషత్తు, మరియు బ్రహ్మవిద్యా మరియు యోగశాస్త్ర విషయంలో శ్రీకృష్ణుడు మరియు అర్జునుడి యొక్క సంవాదంలో 'యజ్ఞ భోక్తా-మహాపురుషస్థుడు మహేశ్వరుడు' అనే పేరుగల ఐదవ అధ్యాయం పూర్తయింది.

ఇతి శ్రీమత్పరమహంస పరమానందస్య శిష్య స్వామీ అడగడానంద కృతే శ్రీమద్‌భగవద్‌గీతా యాః-- 'యథార్థ గీతా' భాష్యే 'యజ్ఞ భోక్తా మహాపురుషస్థ మహేశ్వరః' నామ పంచమోऽధ్యాయః||**5**||

ఈ ప్రకారంగా శ్రీమత్పరమహంస పరమానందగారు యొక్క శిష్యుడు స్వామి అడగడానంద గారిచే రచించడిన శ్రీమద్‌భగవద్ గీతా యొక్క భాష్యం ''యతార్ధగీతాలో యజ్ఞభోక్తా మహాపురుషస్థ మహేశ్వరః'' అనే పంచమ అధ్యాయం పూర్తయింది

||హరి ఓం తత్సత్||

ॐ

శ్రీ పరమాత్మనే నమః

# షష్ఠ అధ్యాయము

ప్రపంచంలో మతం పేరు మీద ఆచార-వ్యవహారాలు, పూజా-పద్ధతులు, సాంప్రదాయాలు బహుళమైనప్పుడు, దురాచారాలను నశింప చేయడానికీ, ఈశ్వరుడు ఒకడే అని నిరూపించడానికీ, అతణ్ణి పొందు ప్రక్రియను ప్రశస్తం చేయడానికీ ఎవరో ఒక మహాపురుషుడు ఆవిర్భవించడం జరుగుతుంది. క్రియలను వదిలి పెట్టి, కాలి మీద కాలు వేసుకొని కూర్చుని, జ్ఞానులమని చెప్పుకోనే దురాచారం కృష్ణునికాలంలో కూడా అత్యంత వ్యాపకంగా ఉండేది. కాబట్టి ఈ అధ్యాయం ఆరంభంలోనే యీ విషయాన్ని నాల్గవసారి స్వయంగా ప్రస్తావించాడు. జ్ఞాన యోగం మరియు నిష్కామ కర్మయోగం రెండింటిలోనూ కర్మ చేయవలసిందే.

రెండో అధ్యాయంలో అతను- ''అర్జునా! క్షత్రియుడికి యుద్ధాన్ని మించిన కళ్యాణ ప్రదమైన ఇంకో మార్గం లేదు. ఈ యుద్ధంలో ఓడిపోతే దైవత్వం, మరియు గెలిస్తే మహామహిమ స్థితిదొరుకుతుందని అనుకొంటూ, యుద్ధం చెయ్యి 'అని అంటాడు. అర్జునా ! ఈ విషయం నీకు జ్ఞాన యోగం సందర్భంలో చెప్పబడింది. ఏ విషయం? అదే యుద్ధం చేయమని. జ్ఞాన యోగమంటే కాలు మీద కాలు వేసుకొని కూర్చోవడం కాదు. జ్ఞానయోగంలో తమ లాభనష్టాలను స్వయంగా నిశ్చయించుకొంటూ, తమ శక్తిని అర్థం చేసుకొని, కర్మలో ప్రవృత్తులం కావాలి, కానీ ప్రేరణ కలిగించేవాడు మహాపురుషుడే. జ్ఞాన యోగంలో కూడా యుద్ధం చేయడం తప్పనిసరి.

మూడో అధ్యాయంలో అర్జునుడు- భగవాన్! నిష్కామ కర్మయోగంతో పోలిస్తే జ్ఞాన యోగం శ్రేష్ఠమని మీరనుకొంటే, మరి నన్ను ఘోర కర్మలలో ఎందుకు పడేస్తారు?'' అని ప్రశ్నించాడు. అర్జునుడికి నిష్కామ కర్మ యోగం కఠినం అని అనిపించింది. అప్పుడు యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు- రెండు యోగాలు నా ద్వారానే చెప్పబడినవి, కానీ ఏ పథంలోనూ కర్మను త్యజించేసి వెళ్ళే పద్ధతి లేదు. కర్మను ఆరంభం చేయకుండానే నైష్కర్మ్య సిద్ధిని పొందడమనేది గానీ, ఆరంభం చేసిన క్రియను త్యజించడం చేత, ఆ పరమసిద్ధిని (ప్రాప్తి) పొందడమనేది గానీ, జరగనే జరగదు. రెండు మార్గాలలోనూ 'నియత కర్మ' యజ్ఞం యొక్క ప్రక్రియను చేయవలసిందే.

ఇప్పుడు అర్జునుడికి, చక్కగా అర్థమయ్యిందేమంటే జ్ఞాన మార్గం నచ్చినా లేక నిష్కామ కర్మయోగం నచ్చినా, రెండింటిలోనూ కర్మ చేయవలసిందే. అయినా, ఐదవ అధ్యాయంలో అతను ప్రశ్నించాడు- ప్రతిఫలాన్ని బట్టి చూస్తే ఏది శ్రేష్ఠమయినది? ఏది సుకరమయినది? శ్రీకృష్ణుడు అన్నాడు- అర్జునా! రెండూ కూడా పరమశ్రేయాన్ని యిచ్చేవే. రెండూ ఒకే గమ్యాన్ని చేరుస్తాయి. అయినా గానీ సాంఖ్యంతో పోలిస్తే నిష్కామ కర్మయోగం శ్రేష్ఠమయినది, ఎందుకంటే నిష్కామ కర్మను ఆచరించకుండా ఎవరూ సన్యాసి కాలేరు. రెండింటిలోనూ కర్మ ఒక్కటే. అందుచేత స్పష్టమయ్యేదేమిటంటే నిర్ధారితమైన ఆ కర్మను చెయ్యకుండా, ఎవరూ సన్యాసి కాలేరు. అంతేకాదు, ఎవరూ యోగి కూడా అవలేరు. ఈ పథంపై నడిచే పథికులకు రెండు రకాలైన దృక్పథాలు ఉంటాయి. అవి యింతకు ముందే చెప్పబడ్డాయి-

శ్రీభగవానువాచ-

శ్లో ॥ అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః ।
స సన్యాసీ చ యోగీ చ ననిరగ్నిచాక్రియః ॥1॥

శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు - ''అర్జునా! కర్మ ఫలాశ్రయ రహితుడై అంటే కర్మ చేసే సమయంలో ఏ ప్రకారమైన కోరికలూ ఉంచుకోకుండా, ఎవ్వరైతే 'కార్యం కర్మ' చేయ యోగ్యమైన విశిష్టమైన ప్రక్రియను చేస్తాడో, అతనే సన్యాసి, అతనే యోగి. అగ్నిని త్యజించినవాడు గానీ, క్రియను త్యజించిన వాడు గానీ, సన్యాసికాడు, యోగీకాడు. క్రియలు చాలా ఉన్నాయి. వాటిలో 'కార్యం కర్మ'- చేయ యోగ్యమైన క్రియ 'నియత కర్మ'- నిర్ధారితమైన ఒక విశేష క్రియ. ఇదే యజ్ఞం యొక్క ప్రక్రియ. దాని అసలైన అర్థం 'ఆరాధన, అది ఆరాధ్య దైవంలో ప్రవేశం ఇప్పించే విశేషమైన విధానం. దానికి కార్యరూపం ఇవ్వడమే కర్మ. ఎవ్వరైతే దానిని చేస్తారో, వారే సన్యాసి, వారే యోగి అవుతారు. 'మేము అగ్నిని ముట్టుకోము' అంటూ అగ్నిని త్యజించే వారు గానీ, 'నాకు కర్మ లేనే లేదు, నేను ఆత్మజ్ఞానుణ్ణి'' అంటూ కర్మను విడిచేసే వారు గానీ, లేక కర్మ ఆరంభం చేయనివారు గానీ, లేక చేయడానికి యోగ్యమైన విశేష క్రియను చేయనివారు గానీ, సన్యాసులు కాలేరు, యోగులూ కారు. దీనిని గురించి యింకా చూద్దాం-

శ్లో ॥ యం సన్యాసమితి ప్రాహుర్యోగం తం విద్ధి పాండవ ।
న హ్యసం న్యస్త సంకల్పో యోగీ భవతి కశ్చన ॥2॥

అర్జునా! దేనినైతే 'సన్యాస' మంటారో, దానినే నీవు యోగం అని తెలుసుకో, ఎందుకంటే సంకల్పాలను త్యాగం చేయకుండా, ఏ పురుషుడు కూడా యోగి కాలేడు. అంటే కోరికలను త్యాగం చేయడం, రెండు మార్గాల వారికీ అవసరమే. అలాంటప్పుడు 'మేము సంకల్పం చేయం' అని మాటలతో అనగానే సరిపోదు, వారు యోగి-సన్యాసులు కాలేరు. శ్రీకృష్ణుడు అంటాడు- ఇలా ఎప్పటికీ జరగదు-

శ్లో ॥ ఆరురుక్షోర్మునే ర్యోగం కర్మ కారణ ముచ్యతే।
యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే ॥3॥

యోగ మార్గంలో పురోగమించాలనే కోరికగల మనన శీల పురుషులకై, యోగం యొక్క ప్రాప్తి కర్మ చేయడం వల్లనే సాధ్యం అవుతుంది. మరియు యోగం యొక్క అనుష్ఠానం చేస్తూ చేస్తూ, ఎప్పుడైతే అది ఫలితం ఇచ్చే దశకు వస్తుందో, ఆ యొగారూఢతలో 'శమః కారణం ఉచ్యతే'- సంపూర్ణ సంకల్పాలు లేకుండా పోవడమే కారణం అవుతుంది. అంత వరకూ సంకల్పాలు సాధకుణ్ణి వదలవు మరియు–

శ్లో ॥ యదా హి నేంద్రియార్థేషు న కర్మస్వనుషజ్జతే ।
సర్వ సంకల్ప సన్యాసీ యోగారూఢస్త దోచ్యతే ॥4॥

ఏ కాలంలో పురుషుడు ఇంద్రియ భోగాల పట్ల ఆసక్తుడు కాడో, కర్మలో ఆసక్తుడు కాడో (యోగం యొక్క పరిపక్వావస్థలోకి చేరినప్పుడు ఇంక ముందు కర్మ చేసి వెదికేదెవరిని? అందుచేత నియతకర్మ అయిన ఆరాధన ఉండదు. కాబట్టి అతను కర్మలో కూడా ఆసక్తుడు కాడు), ఆ కాలంలో 'సర్వ సంకల్ప సంన్యాసీ' –సర్వ సంకల్పాలు తిరోహితమవుతాయి. అదే సన్యాసం. అదే యోగారూఢుడవడం అంటే. మార్గమధ్యంలో సన్యాసం పేరు గల వస్తువు ఏదీ ఉండదు. ఈ యోగారూఢత వలన లాభమేమిటి?–

శ్లో ॥ ఉద్ధరేదాత్మనా త్మానం నాత్మానమవసాధయేత్ ।
ఆత్మైవ హ్యాత్మనో బన్ధురాత్మైవ రిపురాత్మనః ॥5॥

అర్జునా! మనుష్యుడికి కావలసిందేమిటంటే తన వల్లనే తనను ఉద్ధరించుకోవడం. తన ఆత్మను అధోగతిలో పడనివ్వకూడదు, ఎందుకంటే యీ జీవాత్మ స్వయంగా తనకు మిత్రుడు మరియు అదే తనకు శత్రువు కూడా. ఎప్పుడది శత్రువవుతుంది? మరెప్పుడు మిత్రుడౌతుంది? ఇలా అంటాడు శ్రీకృష్ణుడు–

శ్లో ॥ బంధురాత్మాత్మనస్తస్య యేనాత్మైవాత్మనా జితః ।
అనాత్మనస్తు శత్రుత్వే వర్తే తాత్మైవ శత్రువత్ ॥6॥

ఎవరి జీవాత్మ ద్వారా మనస్సు మరియు ఇంద్రియ సహితంగా శరీరం గెలవబడిందో, అతనికి తన జీవాత్మ మిత్రుడు. మరియు ఎవరి ద్వారా మనస్సు మరియు ఇంద్రియ సహితంగా శరీరం గెలవబడలేదో, అతని పట్ల అదే స్వయంగా శత్రుత్వంతో వ్యవహరిస్తుంది.

ఈ రెండు శ్లోకాలలో శ్రీకృష్ణుడు ఒకే మాట అంటాడు– తమ ద్వారా తమ ఆత్మను ఉద్ధరించుకోండి, దానిని అథోగతిలోకి పడనివ్వకండి, ఎందుకంటే ఆత్మయే మన మిత్రుడు. ఈ సృష్టిలో ఇంకో శత్రువుగానీ, యింకో మిత్రుడు గానీ లేడు. ఏ ప్రకారంగా ? ఎవరి ద్వారా మనస్సహితంగా ఇంద్రియాలు గెలవబడ్డాయో, అతనికి అతని ఆత్మ మిత్రుడై మిత్రత్వంలో వ్యవహరిస్తుంది, పరమ కళ్యాణాన్ని చేసేదవుతుంది, మరియు ఎవరి ద్వారా మనస్సహితంగా ఇంద్రియాలు గెలవబడలేదో, అతని పట్ల అతని ఆత్మ శత్రువై శత్రుత్వంతో వ్యవహరిస్తుంది, నీచమైన జన్మలు మరియు యాతనలవైపుకి లాక్కెళుతుంది. సాధారణంగా లోకులేమంటారంటే

''నేను ఆత్మను'. గీతలో,, ''దీనిని శస్త్రాలు నరకలేవు, అగ్ని కాల్చలేదు, వాయువు ఎండ బెట్టలేదు. అది నిత్యమైనది, అమృత స్వరూపిణి, మార్పు చెందనిది, శాశ్వతమైనది మరియు ఆ ఆత్మ నాలోనే ఉంది గదా!'' అని చెప్పబడింది. కానీ లోకులు గీతలోని యీ పంక్తులను గమనించరు. ''ఆత్మ అధోగతిలో కూడా పడిపోతుంది. ఆత్మ యొక్క ఉద్ధారణం కూడా జరుగుతుంది, దీనికై 'కార్యం కర్మ'- చేయ యోగ్యమైన క్రియను ఆచరించియే ఉద్ధరించబడుతుంది'' అని చెప్పబడింది. ఇప్పుడు అనుకూలమైన ఆత్మ యొక్క లక్షణాలు ఏమిటో చూద్దాం-

శ్లో // జితాత్మనః ప్రశాంతస్య పరమాత్మా సమాహితః ।
శీతోష్ణ సుఖదుఃఖేషు తథా మానాప మానయోః ॥7॥

చలి-వేడి, సుఖం-దుఃఖం, మరియు మానం, అవమానాలలో ఎవరి అంతః కరణం యొక్క ప్రవృత్తులు చక్కగా శాంతమై ఉంటాయో, అలాంటి స్వాధీనమైన ఆత్మగల పురుషునిలో పరమాత్ముడు ఎల్లప్పుడూ స్థితుడై ఉంటాడు, ఎప్పటికీ వేరు కాడు. 'జితాత్మ' అంటే ఎవ్వరైతే మనస్సహితంగా ఇంద్రియాలను గెలుచుకున్నాడో, వాడు. అతని ప్రవృత్తి పరమశాంతిలో మిళితమయి పోయింది. (ఇదే ఆత్మ యొక్క ఉద్ధరించబడిన దశ) ఇక ముందు ఇలా అంటాడు.

శ్లో // జ్ఞాన విజ్ఞాన తృప్తాత్మా కూడస్థో విజితేంద్రియః ।
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మ కాంచనః ॥8॥

ఎవరి అంతః కరణం జ్ఞాన- విజ్ఞానాలతో తృప్తి పొందిందో, ఎవరి స్థితి అచంచలంగాను, స్థిరంగాను మరియు వికార రహితంగాను ఉందో, ఎవ్వరైతే ఇంద్రియాలను విశేషంగా గెలిచాడో, ఎవరి దృష్టిలో మట్టి, రాయి మరియు సువర్ణం సమానమో- అలాంటి యోగిని 'యుక్తు'డంటారు. 'యుక్త అంటే యోగంలో సంయుక్తుడైన వాడని అర్థం. ఇది యోగం యొక్క పరాకాష్ఠ. దీనినే యోగేశ్వరుడు ఐదవ అధ్యాయంలో ఏడునుంచి పన్నెండవ శ్లోకం వరకు వర్ణించాడు. పరమ తత్త్వమైన పరమాత్ముని యొక్క సాక్షాత్కారంతో బాటుగా ఏదైతే తెలుసుకోబడిందో అదే జ్ఞానం. అంటే యిష్టదైవం నుంచి ఒక్క అంగుళం దూరంగా ఉన్నా కూడా, తెలుసుకోవాలనే కోరిక ఉన్నంత వరకూ అతను అజ్ఞానియే. ఆ ప్రేరకుడెలా సర్వ వ్యాప్తమై ఉన్నాడు? ఎలా ప్రేరణనిస్తాడు? అనేక ఆత్మలకు ఒకేసారి ఎలా మార్గ దర్శనం చేస్తాడు? అతను ఎలా భూత. భవిష్యద్వర్తమానాల జ్ఞాత? ఆ ప్రేరకుడైన యిష్టదైవం యొక్క కార్య ప్రణాళిక జ్ఞానమే, విజ్ఞానము. ఏ రోజు నుండైతే ఇష్టదైవం హృదయంలో ఆవిర్భవిస్తాడో, ఆరోజు నుంచే అతను నిర్దేశించడం మొదలు పెడతాడు, కానీ ప్రారంభంలో సాధకుడు అర్థం చేసుకోలేడు. పరాకాష్ఠ కాలంలోనే యోగి అతని అంతరంగిక కార్యప్రణాళికను పూర్తిగా అర్థం చేసుకోగలుగుతాడు. ఈ అర్థం చేసుకోవడమే విజ్ఞానం. యోగారూఢుడైన లేక యుక్త పురుషుడి అంతః కరణం జ్ఞాన విజ్ఞానాలతో తృప్తి పొంది ఉంటుంది. ఈ ప్రకారంగా యోగ యుక్తుడైన

పురుషుని స్థితిని నిరూపించుతూ యోగేశ్వరుడు మళ్ళీ ఇలా అంటాడు.

శ్లో ॥ సుహృన్మిత్రార్యుదాసీనమధ్యస్థద్వేష్యబంధుషు।
సాధుష్వపి చ పాపేషు సమబుద్ధిర్విశిష్యతే ॥9॥

ప్రాప్తి పొందిన తర్వాత మహాపురుషుడు సమదర్శుడు మరియు సమవర్తి అవుతాడు. క్రిందటి శ్లోకంలో చెప్పినట్లుగా ఎవరైతే పూర్ణ జ్ఞానంతో కూడిన పండితుడో, అతను విద్యావినయ సంపన్నుడైన బ్రాహ్మణునిలో, చండాలునిలో, ఆవు, కుక్క, ఏనుగులో సమానమైన దృష్టిగలవాడవుతాడు. దాని పూరకమే ఈ శ్లోకం. హృదయ పూర్వకంగా సహాయం చేసే సహృదయుడు, మిత్రుడు, వైరి, ఉదాసీనుడు, ద్వేషి బంధుగణం, దర్మాత్ముడు మరియు పాపులపట్ల కూడా సమానమైన దృష్టిగల యోగయుక్తుడైన పురుషుడు, అతి శ్రేష్ఠుడు. అతను వారి కార్యకలాపాల్పై దృష్టి నిలపడు, కానీ వారి లోపల గల ఆత్మ యొక్క సంచారంపై అతని దృష్టి పడుతుంది. ఈ అందరిలోనూ అతనికి కనిపించే భేదం ఏమిటంటే కొందరు క్రింది మెట్టుపై నిలబడితే, కొందరు నిర్మలత్వానికి సమీపంలో ఉన్నారు. కానీ ఆ సామర్థ్యం అందరిలోనూ ఉంది. ఇక్కడ యోగ యుక్తుని లక్షణాలు మళ్ళీ చెప్పబడ్డాయి.

ఎవరైనా యోగయుక్తుడు ఎలా అవుతాడు? అతను ఎలాంటి యజ్ఞం చేస్తాడు? యజ్ఞస్థలం ఎలా ఉండాలి? ఆసనం ఎలా ఉండాలి? ఆ సమయంలో ఎలా కూర్చోవాలి? కర్తద్వారా పాటించవలసిన నియమాలు, ఆహార- విహారాలు, నిద్రపోవడం, మేల్కొని ఉండడంలాంటి వాటి సంయమన, మరియు కర్మ, ఎలా చేయ్యాలి? మొదలైన విషయాలను గురించి యోగేశ్వరుడు శ్రీకృష్ణుడు ఈ తరువాతి ఐదు శ్లోకాలలోను వివరణ ఇస్తాడు. వీటి వలన మీరు కూడా మీ యజ్ఞాన్ని సుసంపన్నం చేసుకోవచ్చును.

మూడో అధ్యాయంలో అతను 'యజ్ఞం' అన్న పదాన్ని పలుకుతూ ఇలా చెప్పాడు- 'యజ్ఞం యొక్క ప్రక్రియే, నియతమైన కర్మ. నాలుగో అధ్యాయంలో యజ్ఞం స్వరూపాన్ని విస్తారంగా వివరించాడు, దానిలో ప్రాణాన్ని అపానంలో ఆహుతి, అపానాన్ని ప్రాణంలో ఆహుతి, ప్రాణాపానాలగతి నిరోధించి మనస్సును నిలపడం మొదలయినవి చేయబడతాయి. అంతా కలిపి చెప్పాలంటే యజ్ఞం యొక్క అసలు సిసలైన అర్థం ఆరాధన. మరియు ఆ ఆరాధ్య దైవం వరకు గల దూరాన్ని ప్రయాణింపజేసే ప్రక్రియ కర్మ. దీనిని గురించి ఐదవ అధ్యాయంలో కూడా చెప్పాడు. కానీ దాని కోసం ఆసనం, భూమి, చేసే విధి మొదలైనవాటిని గురించి చెప్పలేదు. వాటిని గురించి యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు ఇక్కడ వివరణ ఇస్తాడు.

శ్లో ॥ యోగీ యుఞ్జీత సతత మాత్మానం రహసి స్థితః।
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీరపరిగ్రహః॥ 10॥

చిత్తాన్ని జయించడంలో నిమగ్నమైన యోగి, మనస్సునీ ఇంద్రియాలనీ మరియు శరీరాన్ని వశంలో ఉంచుకొని, కోరికల నుండి మరియు విషయ సంగ్రహాల నుండి విముఖుడై ఏకాంత స్థానంలో ఒంటరిగానే చిత్తాన్ని (ఆత్మోపలబ్ధిని చేయించు) యోగ క్రియలో నిమగ్నం

చేయాలి. దాని కోసం ఎలాంటి స్థానం ఉండాలి? ఆసనం ఎలా ఉండాలి.

శ్లో ॥ శుచౌదేశే ప్రతిష్ఠాప్య స్థిర మాసన మాత్మనః ।
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చైలాజినకుశోత్తరం ॥ **11**॥

శుద్ధి చేయబడిన నేలపై, కుశగడ్డి, జింక చర్మం, వస్త్రం, లేక యింకోకటేదైనా సరే (పట్టు, ఉన్ని, బల్ల ఏదైనా) పరచి మీ ఆసనాన్ని అతి ఎత్తు కాకుండానూ, అతి క్రిందికి కాకుండానూ, స్థిరంగా స్థాపించండి. శుద్ధి చేయబడిన నేల అంటే ఊడ్చడం వంటివి చేయడంతో శుభ్రమైన నేల పైన ఏదో ఒకటి పరచుకోవాలి– జింక చర్మం కావచ్చు లేక చాప లేక ఏదైనా వస్త్రం, బల్ల. ఏది లభ్యమయితే అది పరచుకోవాలి. ఆసనం కదిలేది మెదిలేది అయిఉండ కూడదు. నేల నుంచి అతి ఎత్తుగా గానీ లేక మరీ క్రిందకిగానీ ఉండకూడదు. 'పూజ్య గురువుగారు' రమారమి ఐదు అంగుళాల ఎత్తైన ఆసనంపై కూర్చొనేవారు. ఒకసారి భక్తులు ఒక అడుగు ఎత్తుగల పాలరాతితో చేసిన ఒక ఆసనాన్ని తెప్పించారు, గురువుగారు దానిపై ఒకే ఒక రోజు కూర్చున్నాక అన్నారు– ''వద్దులే చాలా ఎత్తయి పోయింది. సాధువు ఎత్తుగా కూర్చోకూడదు. అహంకారం పెరిగిపోతుంది. మరీ క్రిందకు కూడా కూర్చోకూడదు, హీనతా భావం ఎర్పడుతుంది, తన పై తనకే అసహ్యమేర్పడుతుంది.'' అంతే దానిని ఎత్తించేసి అడవిలో ఒక తోట ఉండేది, అందులో వేయించారు. అక్కడికి గురువుగారు ఎప్పుడూ వెళ్ళేవారు కాదు, ఇప్పుడు కూడా ఎవరూ వెళ్ళరు. అలా ఉండేది ఆ మహాపురుషుని యొక్క క్రియాత్మకమైన శిక్షణ. ఇలాగే సాధకునికి కూడా చాలా ఎత్తైన ఆసనం ఉండరాదు. లేకపోతే భజన సంగతి వదలిపెట్టి ముందు అహంకారం పెరిగిపోతుంది. తరువాత భగవానుడంటాడు–

శ్లో ॥ తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియ క్రయః ।
ఉపవిశ్యాసనే యుఞ్జ్యాద్యోగమాత్మ విశుద్ధయే ॥ **12**॥

ఆ ఆసనంపై కూర్చుని (కూర్చొని మాత్రమే ధ్యానం చేసే విధానం ఉంది) మనస్సు ఏకాగ్రం చేసి, చిత్తం మరియు ఇంద్రియాల క్రియల్ని వశం చేసుకొంటూ, అంతః కరణం యొక్క శుద్ధి కోసం యోగాభ్యాసాన్ని చేయాలి. ఇప్పుడు కూర్చునే విధానం గురించి చెప్తాడు–

శ్లో ॥ సమం కాయ శిరోగ్రీవం ధారయన్నచలం స్థిరః ।
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్ ॥ **13**॥

శరీరం, మెడ మరియు శిరస్సును తిన్నగా, కదలకుండా, స్థిరంగా ఉంచి (ఏదైనా కొయ్యబద్దను పాతి పెట్టినట్లుగా) ఈ ప్రకారంగా తిన్నగా, నిటారుగా కూర్చొని, నాసికాగ్రభాగాన్ని చూస్తూ (ముక్కు కొనని చూడమని ఆదేశించలేదు, కానీ తిన్నగా కూర్చున్నప్పుడు ముక్కుకి ఎదురుగా ఎక్కడ దృష్టి పడుతుందో, అక్కడ దృష్టి ఉండాలి. కుడి ఎడమలని చూసే చాంచల్యం ఉండరాదు) మిగిలిన దిశలవైపు చూడకుండా స్థిరంగా కూర్చొని ఉండాలి. మరియు–

శ్లో ॥ ప్రశాంతాత్మా విగత భీర్బ్రహ్మచారివ్రతే స్థితః ।
మనః సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః ॥ **14**॥

బ్రహ్మచర్య వ్రతాన్ని పాటించుతూ (సాధారణంగా లోకులు ఏమంటారంటే జననేంద్రియాల్ని సంయమనం చేయడమే బ్రహ్మ చర్యమని, కానీ మహాపురుషుల అనుభవం ఏమిటంటే– మనస్సుతో విషయాలను స్మరణచేస్తూ, కళ్ళతో అలాంటి దృశ్యాలను చూస్తూ, చర్మంతో స్పృశిస్తూ, చెవులతో విషయోత్తేజకమైన శబ్దాలను వింటూ, జననేంద్రియాలను సంయమనం చేయడం సంభవం కాదు. బ్రహ్మచారి అంటే వాస్తవిక అర్థం **'బ్రహ్మ ఆచరతి చ బ్రహ్మచారీ'**– బ్రహ్మ యొక్క ఆచరణ ఏమిటంటే నియత కర్మ, యజ్ఞం యొక్క ప్రక్రియ, దాన్ని చేసే వారు **'యాంతి బ్రహ్మ సనాతనం'**–సనాతన బ్రహ్మలో ప్రవేశం పొందుతారు. దీనిని చేసే సమయంలో **'స్పర్శాంకృత్వా బహిర్బాహ్యాన్'** –బయటి స్పర్శను, మనస్సు మరియు అన్ని ఇంద్రియాల స్పర్శలను బయటనే త్యజించి, చిత్తాన్ని బ్రహ్మచింతనలో, శ్వాస-ప్రశ్వాసలలో, ధ్యానంలో ఉంచాలి. మనస్సు బ్రహ్మచింతనలో లగ్నమైనప్పుడు, బయటి విషయాలను ఎవరు స్మరిస్తారు? బయటి విషయాల స్మరణే గనక ఉంటే అప్పుడు మనస్సెక్కడ ఏకాగ్రమయింది? వికారాలు శరీరంపైన కాదు, మనస్సు యొక్క తరంగాలలో ఉంటాయి. మనస్సు బ్రహ్మచరణంలో నిమగ్నమైనప్పుడు, ఒక్క జననేంద్రియాలే సంయమనం కావడమే కాకుండా, సకలేంద్రియాల సంయమనం స్వాభావికంగా జరిగిపోతుంది. కాబట్టి బ్రహ్మచరణంలో వుంటూ భయరహితుడై మరియు శాంతియుతమైన అంతఃకరణము కలిగి, మనస్సును సంయమనం చేస్తూ, నాలో నిమగ్నమైన చిత్తంతో యుక్తుడవై నా పరాయణుడవై ఉండు. ఇలా చేయడం వలన ఫలితం ఏమిటి?

శ్లో || యుఞ్జన్నేవం సదాత్మానం యోగీ నియత మానసః ।
శాంతిం నిర్వాణ పరమాం మత్సం స్థామధిగచ్ఛతి || **15**||

ఈ ప్రకారంగా తనను తాను నిరంతరం ఆ చింతనలో నిమగ్నం చేస్తూ, సంయమనం చేయబడిన మనస్సుగల యోగి నాలో స్థితమై ఉన్న, పరాకాష్ఠకు చెందిన శాంతిని పొందుతాడు. కాబట్టి మీరు నిరంతరం కర్మలోనే నిమగ్నమవ్వండి. ఇక్కడితో ఈ ప్రశ్న పూర్తవుతుంది. ఇకపై రెండు శ్లోకాలలో అతను పరమానందాన్ని ఇప్పించే శాంతి కోసం కావలసిన శారీరక సంయమనం, ఆహార విహారాలను గురించి చెబుతాడు–

శ్లో || నాత్యశ్నతస్తు యోగోఽస్తి నచైకాంతమనశ్నతః।
నచాతి స్వప్నశీలస్య జాగ్రతోనైవ చార్జున || **16**||

అర్జునా! ఈ యోగాన్ని అతిగా తినేవారు సిద్ధించుకోలేరు. మరియు ఏమీ తిననివారు కూడా సిద్ధింప చేసుకోలేరు, అలాగే అతిగా నిద్రపోయేవాడుగానీ, లేక ఎక్కువ సేపు మేల్కొని ఉండేవాడు గానీ సిద్ధింప చేసుకోలేరు. మరి ఎవరు సిద్ధింపచేసుకోగలరు?

శ్లో || యుక్తాహార విహారస్య యుక్త చేష్టస్య కర్మసు ।
యుక్త స్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా || **17**||

దుఃఖాలను నశింపజేసే ఈ యోగం ఉచిత ఆహార-విహారాలు, కర్మలో వినియోగించబడిన ప్రయత్నాలు మరియు సంతులితమైన శయన-జాగరణలు చేసేవారి చేతనే నిర్వహించబడుతుంది. అధిక భోజనం చేయుట వలన బద్ధకం, నిద్ర మరియు అలసటలు

చుట్టు ముడతాయి. అప్పుడు సాధన జరగదు. భోజనం వదలి వేయడం వలన ఇంద్రియాలు శిథిలమయి పోతాయి. కదలకుండా స్థిరంగా కూర్చునే సామర్థ్యం ఉండదు. ''పూజ్యగురువుగారు' 'కావలసిన దానికన్న' ఒక-రెండు ముద్దలు అన్నం తక్కువ తినాలి', అని అనేవారు. విహారం అంటే సాధనకు అనుకూలంగా విచరణ, ఎంతో కొంత పరిశ్రమం కూడా చేస్తూ ఉండాలి, ఏదో ఒక పని చేయాలి. అన్యథా రక్త-సంచారం శిథిలమయిపోతుంది. రోగాలు చుట్టు ముట్టుతాయి. ఆయువు పడుకోవడం మరియు మెలకువగా ఉండటం ఆహారం మరియు అభ్యాసాలపై తరుగుతూ- పెరుగుతూ ఉంటుంది. ''పూజ్య గురువుగారు' ''యోగి నాలుగు గంటలు పడుకోవాలి మరియు నిరంతరం చింతనలోనే ఉండాలి. మొండితనం చేసి పడుకోని వారు శీఘ్రంగా పిచ్చివారయిపోతారు''. అని అనేవారు. కర్మకు అనుగుణంగా తగిన చేష్టలు కూడా ఉండాలి అంటే నియత కర్మయైన ఆరాధనకి అనురూపంగా నిరంతరం ప్రయత్నశీలురై ఉండాలి. బయటి విషయాలను స్మరణ చేయకుండా, ఎల్లప్పుడు సాధనలోనే ఉండేవాడి యోగమే సిద్ధిస్తుంది. (సఫలమవుతుంది) దానితో బాటుగా-

శ్లో // యదా వినియతం చిత్త మాత్మన్యే వావతిష్ఠతే ।
నిః స్పృహః సర్వకామేభ్యోయుక్త ఇత్యుచ్యతే తదా ॥ **18**॥

ఈ ప్రకారంగా యోగాభ్యాసంతో విశేషంగా వశం చేసుకొన్న చిత్తం ఏకాలంలోనైతే పరమాత్మునిలో చక్కగా స్థితమై పోతుందో, విలీనం అయిపోతుందో, ఆకాలంలో సంపూర్ణ కోరికలచే రహితుడైన పురుషుడు యోగయుక్తుడనబడతాడు. ఇప్పుడు విశేషంగా గెలవబడిన చిత్తం యొక్క లక్షణాలు ఏమిటి ?

శ్లో // యథా దీపో నివాతస్థో నేంగతే సోపమా స్మృతా ।
యోగినో యతచిత్తస్య యుఞ్జతో యోగమాత్మనః ॥ **19**॥

ఏ ప్రకారంగా వాయురహిత స్థానంలో ఉంచిన దీపం కదలిక లేనిదిగా ఉంటుందో, జ్వాల (దీపశిఖ) తిన్నగా పైకి పోతుందో, అందులో కంపన ఉండదో, అదే ఉపమాలంకారాన్ని పరమాత్ముణ్ణి ధ్యానించడంలో నిమగ్నమయిన యోగి యొక్క గెలవబడిన చిత్తాన్ని వర్ణించేటప్పుడు వాడబడింది. దీపం ఉదాహరణ మాత్రమే. ఈ రోజుల్లో దీపం వాడుక తగ్గి పోతుంది. ఊదువత్తిని వెలిగించితే, గాలి వీచకపోతే, పొగ తిన్నగా పైకి వెళుతుంది. ఇది యోగి యొక్క గెలవబడ్డ చిత్తానికి ఒక ఉదాహరణ మాత్రమే. ఇప్పుడు చిత్తం గెలవబడి ఉన్నా, నిరోధించబడి ఉన్నా, ఇంకా చిత్తం అనేది ఉంది గదా! ఎప్పుడైతే నిరుద్ధం చేయబడిన చిత్తం కూడా విలీనమయి పోతుందో, అప్పుడే 'విభూతి' (పరమస్థితి) లభిస్తుంది? చూద్దాం-

శ్లో // యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగ-సేవయా ।
యత్ర చైవాత్మనాऽత్మానం పశ్యన్నాత్మని తుష్యతి ॥**20**॥

ఏ అవస్థలోనైతే యోగాభ్యాసంచే (అభ్యాసం లేకుండా ఎప్పటికీ నిరోధం కాదు, అందుచేత యోగాభ్యాసంచే) నిరుద్ధం చేయబడిన చిత్తం కూడా విలీనమయిపోతుందో, కలిసి పోతుందో, వినష్టమై పోతుందో, ఆ దశలో **'ఆత్మనా'**- తమ ఆత్మ ద్వారా **'ఆత్మానం'**- పరమాత్ముడిని చూస్తూ **'ఆత్మని ఏవ'**- తమ ఆత్మలోనే సంతుష్టి, పొందుతాడు. పరమాత్ముడినే

చూస్తాడు, కానీ సంతుష్టి తమ ఆత్మ ద్వారానే కలుగుతుంది, ఎందుకంటే ప్రాప్తి కాలంలో పరమాత్ముని సాక్షాత్కారం జరుగుతుంది, కానీ తరువాతి క్షణంలోనే అతను తన ఆత్మను ఆ శాశ్వత ఈశ్వరీయ విభూతులతో కూడి ఉండటం గమనిస్తాడు. బ్రహ్మ అజరుడు, అమరుడు, శాశ్వతుడు, అవ్యక్తుడు మరియు అమృత స్వరూపుడు అయితే, ఇటు వైపు ఆత్మకూడా అజరం, అమరం, శాశ్వతం, అవ్యక్తం మరియు అమృత స్వరూపం అయి ఉంటుంది. ఉన్నా గానీ అచింత్యం కూడా, ఎప్పటి వరకు చిత్తం యొక్క తరంగాలు ఉంటాయో, అప్పటి వరకు అది మీకు ఉపయోగ పడదు. చిత్తం నిరోధించబడడం మరియు నిరుద్ధచిత్తం యొక్క విలయ కాలంలో పరమాత్ముని సాక్షాత్కారం అవుతుంది. మరియు దర్శనం అయిన రెండవ క్షణంలోనే ఆ ఈశ్వరీయ గుణధర్మాలతో యుక్తమైన తన ఆత్మను పొందుతాడు. కాబట్టే తన ఆత్మలోనే సంతుష్టుడై ఉంటాడు. ఇదే అతని స్వరూపం. ఇదే పరాకాష్ఠ. దీని పూరకమైన తరువాత శ్లోకాన్ని చూద్దాం.

శ్లో ॥ సుఖమాత్యంతికం యత్తద్బుద్ధిగ్రాహ్యమతీంద్రియమ్ ।
వేత్తి యత్రన చైవాయం స్థిత శ్చలతి తత్త్వతః ॥**21**॥

మరియు ఇంద్రియాల కంటే అతీతమైన, కేవలం శుద్ధమైన, సూక్ష్మ బుద్ధి ద్వారా గ్రహించడానికి యోగ్యమైన, ఏ అనంత ఆనందం ఉందో, దానిని ఏ అవస్థలోనైతే అనుభవించుతాడో మరియు ఏ అవస్థలోనైతే స్థితుడైన యోగి భగవత్స్వరూపాన్ని తత్త్వంతో సహా తెలుసుకొని చలాయమానం కాడో, ఎప్పటికీ అందులోనే ప్రతిష్ఠితమై ఉంటాడు మరియు–

శ్లో ॥ యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః ।
యస్మిన్స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే ॥**22**॥

పరమేశ్వరుని ప్రాప్తిరూపమైన లాభాన్ని, పరాకాష్ఠ యొక్క శాంతిని పొంది, అంతకంటే అధికమైనది ఇంకొకటి లేదను కొని, మరియు భగవత్ప్రాప్తి దశలో స్థితుడై ఉన్న యోగి అతి గొప్ప దుఃఖం వలన కూడా చలించడు. దుఃఖం యొక్క భ్రాంతి కూడా కలగదు, ఎందుకంటే భ్రాంతిని కలిగించే చిత్తం నష్టమయిపోయింది కనుక ఈ ప్రకారంగా–

శ్లో ॥ తం విద్యాద్ దుఃఖ సంయోగ వియోగం యోగసంజ్ఞితమ్ ।
న నిశ్చయేన యోక్తవ్యో యోగో నిర్విణ్ణ చేతసా ॥**23**॥

ఏదైతే ప్రపంచంలోని సంయోగ వియోగాలచే రహితమై ఉన్నదో, దాని పేరే యోగం. ఏదైతే అత్యంత సుఖప్రదమైనదో, దానితో కలవడమే యోగం. ఎవరినైతే పరమతత్త్వమైన పరమాత్ముడంటారో, అతనితో కలవడం పేరే యోగం. ఆయోగాన్ని, విసుగుచెందని చిత్తంతో నిశ్చయ పూర్వకంగా చేయడమే కర్తవ్యం. ఓర్పుతో ధైర్యంతో లగ్న చిత్తుడై ఉండే వాడే యోగంలో సఫలుడు కాగలడు.

శ్లో ॥ సంకల్ప ప్రభవాన్ కామాంస్త్యక్త్వా సర్వాన శేషతః ।
మన సైవేంద్రియగ్రామం వినియమ్య సమన్తత ః ॥**24**॥

కాబట్టి మనష్యునికి కావలసిందేమిటంటే సంకల్పాలతో ఉత్పన్నమయే కోరికలన్నింటినీ, వాసనా మరియు ఆస్తక్తి పూర్తిగా త్యజించి, మనస్సు ద్వారా ఇంద్రియాల

సముదాయాన్ని అన్ని వైపుల నుండి చక్కగా వశం చేసుకొని–

శ్లో ॥ శనైః శనై రూపరమే ద్బుద్ధ్యా ధృతి గృహీతయా ।
ఆత్మ సంస్థం మనః కృత్వాన కించిదపి చిన్తయేత్ ॥**25**॥

క్రమక్రమంగా అభ్యాసం చేస్తూ, బాహ్యవిషయాల నుండి మనస్సును మరలించవలెను. చిత్తాన్ని నిరోధించి మరయు క్రమంగా చిత్తాన్ని విలీనం చేయాలి. తదనంతరం ఆ సహన (ఓర్పు) యుక్తమైన బుద్ధి ద్వారా మనస్సును పరమాత్ముని యందు స్థిరం చేసి వేరే ఎటువంటి చింతన చేయరాదు. నిరంతరం పట్టుదలతో సాధించే విధానం ఇది, కానీ ఆరంభంలో మనస్సు నిలవదు. దీనిపై యోగేశ్వరుడు ఇలా అంటాడు–

శ్లో ॥ యతో యతో నిశ్చరతి మనశ్చంచల మస్థిరమ్ ।
తతస్తతో నియమ్యైతదాత్మన్యేవ వశం నయేత్ ॥**26**॥

స్థిరంగా ఉండని చంచలమైన మనస్సు ఏఏ కారణాల చేత ప్రాపంచిక పదార్థాలలో విహరిస్తుందో, దానిని వాటి నుంచి మరల్చి, అంతరాత్మలోనే నిరోధించు. సాధారణ లోకులు మనస్సు ఎక్కడికి వెళ్ళినా సరే, వెళ్ళ నియ్యి, ప్రకృతిలోకే కదా వెళ్ళేది మరియు ప్రకృతి కూడా ఆ బ్రహ్మలో అంతర్గతమైనదే గదా! ప్రకృతిలో విచరించడం అంటే బ్రహ్మను వదిలి వేయడం కాదు, అని అంటారు కానీ శ్రీకృష్ణుని అభిప్రాయానుసారం ఇది తప్పు. గీతలో యిలాంటి తర్కాలకు తావులేదు. శ్రీకృష్ణుడు 'మనస్సు ఎక్కడెక్కడికి వెళుతుందో, ఏ మాధ్యమాల ద్వారా వెళుతుందో, ఆ మాధ్యమాల ద్వారానే ఆపి, పరమాత్మలోకి తీసుకొని రావాలి' అంటాడు. మనస్సును నిరోధించడం సాధ్యమే. ఈ నిరోధం యొక్క పరిణామం ఏమిటి?

శ్లో ॥ ప్రశాంత మనసం హ్యేనం యోగినం సుఖముత్తమమ్ ।
ఉపైతి శాంత రజసం బ్రహ్మ భూతమకల్మషమ్ ॥**27**॥

ఎవరి మనస్సైతే పూర్తిగా శాంతి వహించిందో, ఎవ్వరైతే పాపాలు లేనివాడో, ఎవరి రజోగుణం శాంతమయిపోయిందో, బ్రహ్మలో ఏకీభూతుడైన అలాంటి యోగికి సర్వోత్తమమైన ఆనందం లభ్యమవుతుంది, దానికంటే ఉత్తమమయినది మరొకటి లేదు.

శ్లో ॥ యఞ్జన్నేవం సదాఽఽత్మానం యోగీ విగత కల్మషః ।
సుఖేన బ్రహ్మ సంస్పర్శ మత్యన్తం సుఖమశ్నుతే ॥**28**॥

పాపారహితుడైన యోగి ఈ ప్రకారంగా ఆత్మను నిరంతరం ఆ పరమాత్మునిలో నిమగ్నం చేస్తూ, సుఖ పూర్వకంగా పరబ్రహ్మ– పరమాత్ముణ్ణి పొంది, అనంత ఆనందాన్ని అనుభవిస్తాడు. అతను 'బ్రహ్మ సంస్పర్శ' అంటే బ్రహ్మ యొక్క స్పర్శ, ప్రవేశాలతో బాటు, అనంత ఆనందాన్ని అనుభవిస్తాడు. అందువల్ల భజన చేయడం అనివార్యం. దీని గురించి ఇంకా ఇలా అంటాడు–

శ్లో ॥ సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని ।
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః ॥**29**॥

యోగ పరిణామంచేత యుక్తులైన ఆత్మగల మరియు అన్నిటినీ సమభావంతో చూడగలిగే యోగి, ఆత్మ అన్ని ప్రాణాలలోనూ వ్యాప్తమయి ఉన్నట్లుగా చూస్తాడు. మరియు సమస్త భూతాలు ఆత్మలోనే ప్రసరించడం చూస్తాడు. ఈ ప్రకారంగా చూడడం వలన లాభమేమి?

శ్లో ॥ యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి ।
తస్యాహం న ప్రణశ్యామి స చ మేన ప్రణశ్యతి ॥**30**॥

ఏ పురుషుడైతే సమస్త భూతాలలో పరమాత్ముడనైన నన్ను చూస్తాడో, సర్వ వ్యాప్తంగా చూస్తాడో మరియు సమస్త భూతాలను పరమాత్ముడనైన నాలో చూస్తాడో, అతనికి నేను అదృశ్యుడను కాను. అతడు నాకు అదృశ్యుడుకాడు. ఇదే ప్రేరకుడితో ఎదురుబొదురుగా కలయిక, మైత్రీ భావం, సామీప్యముక్తి.

శ్లో ॥ సర్వ భూత స్థితం యో మాం భజత్యేకత్వమా స్థితః ।
సర్వథా వర్తమానోऽ పి స యోగీ మయి వర్తతే ॥**31**॥

ఏ పురుషుడైతే పైన చెప్పబడిన విధంగా అనేకత్వం కంటే అతీతమైన ఏకత్వ భావంతో పరమాత్ముడనైన నన్ను భజిస్తాడో, ఆ యోగి అన్ని ప్రకారాల కార్యాలలో వ్యవహరిస్తూ కూడా నాలోనే ప్రవర్తిస్తాడు, ఎందుకంటే నేనుగాక అతనికి ఈ ప్రపంచంలో ఏమీ లేదు కదా. అతనికి బాహ్యమూ, అంతరమూ వినష్టమయి పోయాయి. కాబట్టి అతను ఇప్పుడు లేచినా– కూర్చున్నా, ఏం చేసినా కూడా, నా సంకల్పం వల్లనే చేస్తాడు.

శ్లో ॥ ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోऽర్జున ।
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః ॥**32**॥

హే అర్జునా! ఏ యోగి అయితే తనతో సమానంగా సమస్త భూతాలను సమంగా చూస్తాడో, తనలాగానే చూస్తాడో, సుఖ దుఃఖాలను కూడా అందరిలో సమానంగా చూస్తాడో, ఆయోగి (అతని భేద భావం సమాప్తమయిపోయింది) పరమశ్రేష్ఠుడిగా చెప్పబడుతాడు. ఈ ప్రశ్న పూర్తయింది, తరువాత అర్జునుడు యింకో ప్రశ్న వేస్తాడు–

అర్జున ఉవాచ

శ్లో ॥ యోऽయం యోగస్త్వయా ప్రోక్తః సామ్యేన మధుసూదన ।
ఏ తస్యాహం న పశ్యామి చఞ్చలత్వాత్ స్థితిం స్థిరామ్ ॥**33**॥

హే మధుసూదనా! ఏ యోగం గురించైతే ఇప్పటి వరకూ మీరు చేబుతూ వచ్చారో, దేని వల్లనైతే సమత్వ భావంగల దృష్టి లభిస్తుందో అటువంటి యోగంలో, మనస్సు చంచలమైన దయినందున చాలా సమయం వరకు నిలువ గలిగే స్థితిని నేను నాలో చూడలేక పోతున్నాను.

శ్లో ॥ చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢమ్ ।
తస్యాహం నిగ్రహం మాన్యే వాయోరివ సుదుష్కరం ॥**34**॥

హే కృష్ణా! ఈ మనస్సు చాలా చంచలమైనది, ప్రమథన శీలమయినది (ప్రమథనం

అంటే క్షోభను కలిగించునదని అర్థం) మొండిది మరియు బలవంతమైనది. కాబట్టి దీనిని వశం చేసుకోవడం గాలిని గుప్పెటలో పట్టుకున్నంత కష్టతరమైనదని భావిస్తాను. తుఫాను గాలిని ఆపడం మరియు దీనిని ఆపగలగడం సమానమే. దీనిని గురించి యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు ఇలా అంటాడు–

శ్రీ భగవానువాచ

శ్లో ॥ అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్ ।
అభ్యాసేన తు కౌన్తేయ వైరాగ్యేణ చ గృహ్యతే ॥**35**॥

మహాకార్యాలను చేయడానికి ప్రయత్నశీలుడవైన మహాబాహువులు గల అర్జునా! నిస్సందేహంగా మనస్సు చంచలమయినది, చాలా కష్టం మీద వశంలోకి వస్తుంది, కానీ కౌంతేయా ! అది అభ్యాసం మరియు వైరాగ్యం ద్వారా వశంలోకి వస్తుంది. ఎక్కడ చిత్తాన్ని నిమగ్నం చేయాలో, అక్కడ చిత్తాన్ని స్థిరం చేయడం కోసం మళ్ళీ–మళ్ళీ ప్రయత్నం చేయడం పేరే అభ్యాసం మరియు చూసిన–వినిన విషయాల పట్ల, వస్తువుల పట్ల (సంసారం లేక స్వర్గాది భోగాలు) రాగం అంటే ప్రేమను వదలి వేయడమే వైరాగ్యం. శ్రీకృష్ణుడు మనస్సును వశం చేసుకోవడం కఠినమైన పని, కానీ అభ్యాసం మరియు వైరాగ్యం ద్వారా అది సాధ్యమవుతుందని అంటాడు.

శ్లో ॥ అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః ।
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తుముపాయతః ॥**36**॥

అర్జునా! మనస్సును వశం చేసుకోలేని పురుషునికి యోగాభ్యాసం కఠినమైన పని కానీ స్వవశంలో ఉన్న మనస్సుగల, ప్రయత్నశీలుడైన పురుషునికి యోగం సహజంగా లభిస్తుంది. అది నాదైన ఒక ఆలోచన. మనస్సును వశం చేయుట ఎంత కఠినమని నీవనుకుంటున్నావో అది అంత కఠినమైనది కాదు. కాబట్టి దీనిని కఠినమని అనుకొని వదిలివేయకు, ప్రయత్నపూర్వకంగా యోగాన్ని సాధించు, ఎందుకంటే మనస్సుని వశం చేసుకోవడం చేతనే యోగం సాధ్యపడుతుంది. అప్పుడు అర్జునుడు ఇలా ప్రశ్నించాడు–

అర్జున ఉవాచ–

శ్లో ॥ అయతిః శ్రద్ధయోపేతో యోగాచ్చలి తమానసః ।
అప్రాప్య యోగ సంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి ॥**37**॥

యోగాన్ని ఆచరిస్తూన్నప్పుడు ఎవరి మనస్సైనా చలించి పోయినట్లయితే, యోగం పట్ల శ్రద్ధ ఉండి కూడా, అలాంటి పురుషుడు భగవత్సిద్ధిని పొందకుండా, ఏగతిని పొందుతాడు?

శ్లో ॥ కచ్చిన్నోభయ విభ్రష్టశ్ఛిన్నాభ్రమివ నశ్యతి ।
అప్రతిష్ఠో మహాబాహో విమూఢో బ్రహ్మణః పథి ॥**38**॥

మహాబాహువైన శ్రీకృష్ణా! భగవత్ప్రాప్తి యొక్క మార్గంలో విచలితుడైన, మోహితుడైన ఆ పురుషుడు ఛిన్నా–భిన్నమైన మేఘాలవలె రెండు వైపులనుండి నష్ట భ్రష్టుడు కాడా? చిన్న

మేఘం గనుక, ఆకాశంలో ఉంటే, అది కురువలేదు, తిరిగి పెద్ద మేఘాలతో కలవనూ లేదు, కానీ చూస్తూండగానే విన్నష్టమై పోతుంది. అదే ప్రకారంగా శిథిల ప్రయత్న శీలుడైన పురుషుడు, కొంతకాలం వరకు సాధన చేసి విరమించుకొన్న వాడు విన్నష్టమైపోడా? మీలోనూ ప్రవేశించలేక పోయాడు భోగాలను కూడా అనుభవించలేక పోయాడు. అలాంటి వానికి ఏ గతి లభిస్తుంది?

శ్లో ॥ ఏతన్మే సంశయం కృష్ణ ఛేత్తుమర్హస్యశేషతః ।
త్వదన్యః సంశయస్యాస్య ఛేత్తా నహ్యుపపద్యతే ॥**39**॥

హే శ్రీకృష్ణా! నా ఈ సంశయాన్ని సంపూర్ణంగా నశింపచేయడానికి మీరే సమర్థులు. మీరు తప్ప ఇతరులెవరూ యీ సంశయాన్ని నశింప చేయడానికి సమర్థులు కారు. అప్పుడు యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు అంటాడు–

శ్రీ భగవానువాచ–

శ్లో ॥ పార్థ నైవేహ నాముత్ర వినాశస్తస్య విద్యతే ।
నహీ కళ్యాణకృత్క-శ్చిద్దుర్గతిం తాత గచ్ఛతి ॥**40**॥

పార్థివ శరీరాన్నే రంథంగా మార్చుకొని, లక్ష్యంవైపు పురోగమిస్తున్న అర్జునా! ఆ పురుషుడు యీ లోకంలో గానీ, లేక పరలోకంలో గానీ నాశనం కాడు. పరమ కళ్యాణకారి అయిన ఆ నియత కర్మను చేయువాడు దుర్గతిని పొందడు. అతనికి ఏమవుతుంది?

శ్లో ॥ ప్రాప్య పుణ్యకృతాం లోకానుషిత్వా శాశ్వతీః సమాః ।
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోऽభిజాయతే ॥**41**॥

మనస్సు చంచల మగుటచే, యోగభ్రష్టుడైన ఆ పురుషుడు పుణ్యాత్ముల లోకాలలో సుఖాలను అనుభవించి (ఏ సుఖాల కొరకైతే అతను భ్రష్టుడయ్యాడో, భగవంతుడు కొద్ది సమయంలోనే అన్నీ చూపించి–వినిపించుతాడు, వాటిని అనుభవించి) అతను' శుచీనాం శ్రీమతాం'– శుద్ధ ఆచరణలు గల శ్రీమంతుల ఇంటిలో జన్మమెత్తుతాడు. (ఎవ్వరైతే శుద్ధ ఆచరణగల వారో, వారే శ్రీమంతులు)

శ్లో ॥ అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్ ।
ఏ తద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్ ॥**42**॥

అలాగ అక్కడ జన్మమెత్తలేక పోతే కూడ, స్థిర బుద్ధిగల యోగుల కులంలో అతను ప్రవేశం పొందుతాడు. శ్రీమంతుల ఇంట్లో పవిత్రమైన సంస్కారాలు చిన్నతనం నుండే అలవడుతాయి, కానీ అక్కడ జన్మనెత్తలేక పోతే, అతను యోగులకులంలో (యింట్లో కాదు), శిష్య పరంపరలో ప్రవేశం పొందుతాడు. కబీర్, తులసీదాసు, రైదాసు, వాల్మీకి మొదలగువారు శుద్ధ ఆచరణగల శ్రీమంతుల ఇంట్లో కాకుండా, యోగుల కులంలో ప్రవేశం పొందారు. సద్గురువు యొక్క కులంలో, సంస్కారాల పరివర్తన కూడా ఒక జన్మే, మరియు అలాంటి జన్మ ప్రపంచంలో నిస్సందేహంగా దుర్లభమవుతుంది. యోగుల వద్ద జన్మమంటే అర్థం వారి శరీరం నుండి పుత్రునిగా ఉత్పన్నమవడమని కాదు. గృహాన్ని వదలివేయడానికి

ముందు పుట్టిన కొడుకులు మోహవశం చేత మహాపురుషుణ్ణి తండ్రిగానే భావించవచ్చు. కానీ మహాపురుషునికి మాత్రం తన ఇంటి వారంటూ ఎవరూ ఉండరు. ఏ శిష్యులయితే అతని నియమాలను అనుష్టిస్తారో, వారి మహత్వం కొడుకుల కన్న కూడా చాలా అధికమని భావించబడుతుంది. వారే అతనికి నిజమైన పుత్రులు.

ఎవరైతే యోగ సంస్కారాలతో యుక్తులు కారో, వారిని మహాపురుషులు తమ వారిగా చేసుకొనరు. 'పూజ్యగురువుగారు' గనుక సాధువులను తయారు చేస్తూ పోతే, వేల మంది విరక్తులు వారి శిశ్యులయి ఉండేవారు. కానీ వారు కొందరికి దారి ఖర్చులు యిచ్చి, కొందరి యిళ్ళకు కబురు పంపించి, జాబులు వ్రాసి, నచ్చచెప్పి సముదాయించి అందరినీ తమ తమ ఇళ్ళకు పంపించి వేశారు. కొంతమంది మొండితనం చేస్తే, వారికి అపశకునమయ్యేది. లోపలి నుంచి అంగీకారం స్ఫురించేది కాదు. ఇతనిలో సాధువుకావడానికి ఒక్క లక్షణం కూడా లేదు. ఇతణ్ణి ఉంచుకోవడం మంచిది కాదు. ఇతను తరించలేడు, అని అనుకొని వారిని తమ వద్ద ఉంచుకోవడానికి ఇష్టపడేవారు కాదు, నిరాశ చెంది ఒకరిద్దరు కొండ మీద నుంచి దూకి తమ ప్రాణాల్ని కూడా వదిలేశారు. కానీ గురవుగారు వారిని తమ వద్ద ఉంచుకోలేదు. తరువాత విషయం తెలిసినప్పుడు అనేవారు– ''అతను చాలా వ్యాకులత చెంది ఉన్నాడని నాకు తెలుసు, కానీ నిజంగానే చచ్చిపోతాడనుకుంటే ఉంచేసే వాడినే. ఒక పతితుడు ఉండేవాడు, అంతకన్నా ఏమవుతుంది?'' మమత్వం వారిలో కూడా ఎక్కువగానే ఉండేది, అయినా వారు ఉంచుకోలేదు. ఆరేడు మందిని, గురువుగారు ఆదేశ ప్రకారం ఉంచుకోవడం జరిగింది. వారి గురించి ''ఈరోజు ఒక యోగభ్రష్టుడు వస్తున్నాడు, జన్మ జన్మల నుంచి దారి తప్పి ఉన్నవాడు నడచి వస్తున్నాడు, ఈ పేరు మరియు ఈ రూపంతో వస్తున్నాడు, అతణ్ణి ఉండనివ్వండి. బ్రహ్మ విద్యను ఉపదేశించు, అతణ్ణి ముందుకు నడుపు'' అని భగవంతుడు గురువుగారికి ఆదేశమిచ్చాడు. కేవలం వారిని మాత్రమే ఉంచుకున్నారు. ఈ నాటికి కూడా వారిలో నుంచి ఒక మహాపురుషుడు 'ధారకుండి' లో ఉన్నారు. ఇంకోకతను అనుసూఇయాలో, ఒకరిద్దరు వేరేచోట్ల కూడా ఉన్నారు. వారికి సద్గురువు కులంలో ప్రవేశం దొరికింది. అలాంటి మహాపురుషులను పొందడం అతి దుర్లభమే.

శ్లో ॥ తత్ర తం బుద్ధి సంయోగం లభతే పౌర్వదేహికం।
యతతే చ తతో భూయః సంసిద్ధౌ కురునందన ॥**43**॥

అక్కడ ఆ పురుషుడు ఇంతకు ముందు ఉండిన శరీరంలో సాధన చేయబడిన బుద్ధి సంయోగంతో అంటే పూర్వ జన్మలో చేయబడిన సాధన సంస్కారాలను అనాయాసంగానే పొందుతాడు మరియు హే కురునందనా! వాటి ప్రభావం వలన అతను తిరిగి 'సంసిద్ధౌ' భగవత్ప్రాప్తి అను పరమసిద్ధి కోసం ప్రయత్నాన్ని చేయ మొదలు పెడతాడు.

శ్లో ॥ పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోऽపి సః ।
జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతి వర్తతే ॥**44**॥

శ్రీమంతుల యింటిలో విషయాల వశంలో ఉండి కూడా, అతను పూర్వ జన్మలో

చేసిన అభ్యాసము వలన, భగవత్పథం వైపు ఆకర్షితుడవుతాడు. మరియు యోగంలో శిథిల ప్రయత్నం చేసిన వాడైన ఆ జిజ్ఞాసువు కూడా వర్ణాతీతమైన నిర్వాణ పథాన్ని పొందుతాడు. దానిని పొందడానికి యిదే పద్ధతి. ఎవరూ ఒక్క జన్మలో దానిని పొందలేరు కూడా.

శ్లో ॥ ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః ।
అనేక-జన్మ సంసిద్ధస్తతో యాతి పరాం గతిమ్ ॥**45**॥

అనేక జన్మల నుంచి ప్రయత్నం చేసిన యోగి పరమసిద్ధిని పొందుతాడు. ప్రయత్న పూర్వకంగా అభ్యాసం చేసే యోగి అన్ని పాపాల నుంచీ చక్కగా శుద్ధమై పరమగతిని పొందుతాడు. పరమగతిని పొందడానికి ఇదే క్రమం. మొదట శిథిల ప్రయత్నంతోటే ఈ యోగం ప్రారంభమవుతుంది. మనస్సు చలించడం వలన జన్మ నెత్తవలసి వస్తుంది. సద్గురువు కులంలో ప్రవేశం దొరకుతుంది, మరియు ప్రతి జన్మలో అభ్యాసం చేస్తూ, దేని పేరైతే పరమగతియో పరమ ధామమో, అక్కడికే చేరుకుంటాడు. శ్రీకృష్ణుడు 'ఈ యోగంలో బీజం యొక్క నాశనం లేదు. మీరు రెండడుగులు మాత్రం నడవండి చాలు, ఆ సాధన ఎప్పటికీ నశించదు'' అన్నాడు. అన్ని రకాల పరిస్థితులలో ఉంటూ కూడా పురుషుడు ఇలా చేయగలుగుతాడు, కారణమేమిటంటే కొద్ది సాధనను పరిస్థితులలో చిక్కుకున్న వ్యక్తే చేయగలుగుతాడు. ఎందుకంటే అతని వద్ద సమయం ఉండదు గనుక. మీరు నలుపైనా, తెలుపైనా, లేక ఎక్కడి వారైనా సరే, గీత అందరి కోసం, మీ కోసం కూడా ఉంది, కాకుంటే ఒకే ఒక్క షరతు. అదేమిటంటే మీరు మనుష్యులయితే చాలు. తీవ్ర ప్రతయ్నం చేయువాడెవ్వరైనా సరేగానీ, శిథిల ప్రయత్నం చేసేవాడు మాత్రం గృహస్థుడే అవుతాడు. గీత గృహస్థ- విరక్తుడు, శిక్షితుడు- అశిక్షితుడు ఎవ్వరైనా సరే సర్వ సాధారణ మానవ మాత్రులందరిదీ. ఎవరో 'సాధువు' అనే పేరుగల విచిత్ర ప్రాణికి మాత్రమే కాదు. చివర్లో యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు తన నిర్ణయాన్ని చెప్తాడు.

శ్లో ॥ తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞాని భ్యోఽపి మతోఽధికః ।
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున ॥**46**॥

తపస్వుల కంటే, జ్ఞానులకంటే కూడా యోగి శ్రేష్ఠుడుగా భావించబడతాడు. కర్మ చేసే వారి కంటే కూడా యోగి శ్రేష్టుడు, కాబట్టి అర్జునా! నువ్వు యోగివి కమ్ము.

తపస్వి-

తపస్వి మనస్సహితంగా ఇంద్రియాలను, యోగదశలకి తేవడానికై, తపింపచేస్తాడు, ప్రస్తుతానికి అతనిలో యోగం లేదు.

కర్మచేసేవాడు-

కర్మచేసేవాడు ఈ నియత కర్మను తెలుసుకొని అందులో ప్రవృత్తుడవుతాడు. అతను తన శక్తిని తెలుసుకొని ప్రవృత్తుడు కాడు మరియు సమర్పణ చేసుకొని ప్రవృత్తుడు కాడు. కర్మ చేస్తాడు అంతే.

జ్ఞాని-

జ్ఞాన మార్గంలో ప్రవర్తించేవాడు నియత కర్మ, యజ్ఞం యొక్క విశేష ప్రక్రియను, చక్కగా అర్థం చేసుకొని, తన శక్తిని ముందుంచుకొని, దానిలో ప్రవృత్తమవుతాడు. అతని లాభ నష్టాల బాధ్యత అతనిదే. దానిపై దృష్టి ఉంచి ఆచరిస్తాడు.

యోగి-

నిష్కామ కర్మయోగి యిష్ట దైవంపై ఆధారపడి, పూర్ణసమర్పణ భావంతో బాటు నియత కర్మ అదే, 'యోగ సాధన'లో ప్రవృత్తమవుతాడు. అటువంటివారి యోగక్షేమాల బాధ్యత భగవంతుడు, యోగేశ్వరుని పైన ఉంటుంది. పతనమయ్యే పరిస్థితులు ఏర్పడినా కూడా, అతనికి పతనమయ్యే భయం ఉండదు, ఎందుకంటే ఏ పరమ తత్త్వాన్నైతే అతను కోరుకొంటాడో, అదే అతనిని సంబాళించే బాధ్యతను కూడా తీసుకొంటుంది.

తపస్వి ఇంకా యోగాన్ని పొందటానికై ప్రయత్నం చేసేవాడు మాత్రమే. కర్మ చేసే వాడు కర్మను తెలుసుకొని చేస్తాడు అంటే వారు పతన మవవచ్చును, ఎందుకంటే వారిరువురిలోనూ సమర్పణభావం లేదు మరియు తమ లాభనష్టాలనుచూసుకొనే సామర్థ్యం లేదు, కానీ జ్ఞాన యోగికి పరిస్థితులు తెలుసు, తన శక్తిని గురించి తెలుసు, అతని బాధ్యత అతనిపైనే ఉంది. నిష్కామ కర్మయోగి సమస్తం యిష్టదైవంపై వదిలేస్తాడు, ఆ యిష్టదైవం అతని తోడుగా నిలుస్తాడు. పరమకళ్యాణ పథంలో ఈ యిద్దరూ సరిగ్గానే నడుస్తారు, కానీ ఎవరి భారమైతే యిష్టదైవం వహిస్తాడో, అతను వీరిలో శ్రేష్ఠుడు, ఎందుకంటే ప్రభువు అతణ్ణి స్వీకరించాడు, అతని హాని-లాభాలు ప్రభువే చూస్తాడు. కాబట్టి యోగియే శ్రేష్ఠుడు. కనుక అర్జునా! నీవు యోగివి కమ్ము. సమర్పణభావంతో కూడి యోగాన్ని ఆచరించు.

యోగిశ్రేష్ఠుడు, కానీ వారిలో కూడా అంతరాత్మతో కూడి ప్రయత్నించేయోగి సర్వశ్రేష్ఠుడు. ఇంకా ఇలా అంటాడు-

శ్లో || యోగినామపి సర్వేషాం మద్గతేనాన్తరాత్మనా ।
శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమోమతః ॥**47**॥

నిష్కామ కర్మ యోగులందరిలో కూడా ఎవరైతే శ్రద్ధా నిమగ్నుడై, అంతరాత్మతో, అంతర్చింతనతో నన్ను నిరంతరం భజిస్తాడో, ఆ యోగియే నాకు పరమశ్రేష్ఠుడిగా మాన్యుడిగా కనిపిస్తాడు. భజన ఇతరులకు చూపించే, లేక ప్రదర్శించే వస్తువుకాదు. దీని పట్ల సమాజం అనుకూల్యంగా ఉంచవచ్చు, కానీ ప్రభువు మాత్రం ప్రతికూలమయి పోతాడు. భజన అత్యంత గోప్యమైనది. అది అంతఃకరణంతో జరుగుతుంది. దాని పెరుగుదల – తరుగుదలలు అంతః కరణ పైనే ఆధారపడి ఉంటాయి.

సారాంశం :

ఈ అధ్యాయం ప్రారంభంలో యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు అన్నాడు- ప్రతిఫలాన్ని, ఆశించకుండా ఎవరైతే 'కార్యం కర్మ' అంటే యోగ్యమైన ప్రక్రియా' విశేషాన్ని ఆచరిస్తాడో, అతనే సన్యాసి మరియు అట్టి కర్మ చేసే వాడే యోగి. క్రియలను గానీ, లేక అగ్నిని గానీ

వదిలేసినంత మాత్రం చేత ఎవరూ 'సన్యాసి' లేక యోగీ కాలేరు. 'సంకల్పాలను త్యజించకుండా ఎవ్వరైనా సన్యాసి లేక యోగి కాలేరు. ''మేము సంకల్పాలు చేయము'' అలా చెప్పినంత మాత్రాన సంకల్పాలు మనల్ని వదలవు. యోగంపై అరూఢుడు కావాలని కోరుకునే పురుషుడు ఏం చేయాలంటే 'కార్యంకర్మ'ను చేయాలి మరియు కర్మ చేస్తూ చేస్తూ ఎప్పుడైతే యోగారూఢుడు అవుతాడో అప్పుడే సర్వసంకల్పాలు లేకుండా పోతాయి, అంతకు పూర్వం కాదు. సర్వసంకల్పాలు లేకుండా పోవడమే సన్యాసము.

యోగేశ్వరుడు మళ్ళీ ఇలా అన్నాడు- ఆత్మ అధోగతిలోకి పడిపోగలదు. మరియు దాన్ని ఉద్ధరించడం కూడా జరుగుతుంది. ఏ పురుషునిచే మనస్సహితంగా ఇంద్రియాలు గెలవబడ్డాయో, అతని పట్ల అతని ఆత్మ మిత్రుడిగా మారి మిత్రత్వంలో వ్యవహరిస్తుంది . మరియు పరమ కళ్యాణ ప్రదం అవుతుంది. ఎవరిచే ఇవి గెలవబడలేదో, అతని పట్ల అతని ఆత్మ శత్రువుగా మారి శత్రుత్వంతో వ్యవహరిస్తుంది, యాతనలకు కారణమవుతుంది. ఇందువల్ల మనుష్యులు ఏం చేయాలంటే తమ ఆత్మను అధోగతిలో పడవేయరాదు. తమ ద్వారా తమ ఆత్మను ఉద్ధరించుకోవాలి.

ప్రాప్తిని పొందిన, యోగి ఉండే విదానాన్ని గురించి అతను చెప్పాడు- యజ్ఞస్థలి' కూర్చునేటందుకు ఆసనం మరియు కూర్చునే పద్ధతిని గురించి అతను చెప్పాడు- స్థానం ఏకాంతం, శద్ధమైనదిగా ఉండాలి, వస్త్రం జింక చర్మం లేక గడ్డి ఆసనం ఉండాలి. కర్మకు అనుగుణంగా చేష్టలు యుక్త ఆహార- విహారాలు నిద్రించడం- మేల్కొనే సంయమం గురించి శ్రీకృష్ణుడు నొక్కి చెప్పాడు. యోగి యొక్క నిరుద్ధమైన చిత్తాన్ని పోల్చడానికి వాయురహిత స్థానంలో ఉన్న దీపం యొక్క అకంపిత శిఖ (జ్వాల)ను ఉపమానంగా చెప్పాడు. ఈ ప్రకారంగా నిరుద్ధమైన ఆ చిత్తం కూడా ఎప్పుడు విలీనమయిపోతుందో, ఆ సమయంలో అతను యోగం యొక్క పరాకాష్ఠ, అనంత ఆనందాన్ని పొందుతాడు. సంసారం యొక్క సంయోగ- వియోగాలతో రహితమైన అనంత సుఖం పేరే మోక్షం. యోగం అంటే అర్థం దానితో కలవడం. ఏయోగి అయితే ఇందులో ప్రవేశం పొందుతాడో, అతను సమస్త భూతాలపట్ల సమదృష్టి గలవాడవుతాడు. తన ఆత్మలో అందరి ఆత్మలను చూడగలుగుతాడు. అతను పరమ పరాకాష్ఠయైన శాంతిని పొందుతాడు. కాబట్టి యోగం ఆవశ్యకం. మనస్సు ఎక్కడెక్కడికి వెళ్ళినా అక్కడక్కడి నుంచి లాక్కొచ్చి, మళ్ళీ మళ్ళీ దాన్ని నిరోధించాలి. శ్రీకృష్ణుడు మనస్సును వశం చేసుకోవడం కఠినమైన పని అని ఒప్పుకుంటాడు, కానీ దానిని వశం చేసుకోవచ్చునంటాడు. అది అభ్యాసం మరియు వైరాగ్యాల వలన వశంలోకి వస్తుంది. శిథిల ప్రయత్నం చేసేవాడు కూడా అనేక జన్మల అభ్యాసంతో అక్కడికే చేరుతాడు, దాని పేరే పరమగతి, లేక పరందామం. తపస్వుల కంటే, జ్ఞాన మార్గంలో వేళ్ళేవారి కంటే, కేవలం కర్మ చేసే వారి కంటే యోగి శ్రేష్ఠుడు.

కాబట్టి! అర్జునా! నీవు యోగివి కమ్ము. సమర్పణతో కూడి అంతః మనస్సుచే యోగాన్ని ఆచరించు. ప్రస్తుత అధ్యాయంలో యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు ప్రముఖంగా యోగాన్ని సాధించడానికై అభ్యాసం యొక్క అవసరాన్ని నొక్కి చెప్పాడు.-

ఓం తత్సదితి శ్రీమద్భగవద్ గీతాసూపనిషత్సు బ్రహ్మ విద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే **'అభ్యాసయోగో' నామ షష్ఠోऽధ్యాయః ॥6॥**

ఈ ప్రకారంగా శ్రీమద్భగవద్గీతా రూపమైన ఉపనిషత్తు మరియు బ్రహ్మవిద్యా మరియు యోగ శాస్త్రమనే విషయంలో శ్రీకృష్ణార్జునుల సంవాదంలో ''అభ్యాసయోగం'అనే పేరుగల ఆరవ అధ్యాయం పూర్తయింది.

ఇతి శ్రీమత్పరమహంస పరమానందస్య శిష్య స్వామీ అడగడానంద కృతే శ్రీమద్ భగవద్ గీతా యాః-- **'యథార్థ గీతా' భాష్యే అభ్యాసయోగో' నామ షష్ఠోऽధ్యాయః॥ 6॥**

ఈ ప్రకారంగా శ్రీమత్పరమహంస పరమానందగారి యొక్క శిష్యుడు స్వామి అడగడానంద గారిచే రచించబడిన శ్రీమద్భగవద్ గీతా యొక్క భాష్యం ''యతార్థ గీతాలో 'అభ్యాసయోగం' అనే ఆరవ అధ్యాయం పూర్తయింది

॥హరి ఓం తత్సత్॥

ఓం

శ్రీ పరమాత్మనే నమః

# సప్తమ అధ్యాయము

గత అధ్యాయంలో 'గీత'లోని ముఖ్యమైన అంశాలపై అన్ని ప్రశ్నలు పూర్తి అయిపోయాయి. నిష్కామ కర్మయోగం, జ్ఞాన యోగం, కర్మ, యజ్ఞ స్వరూపం, దానివిధి, యోగం యొక్క వాస్తవిక స్వరూపం మరియు దాని పరిణామం, మరియు, అవతారం, వర్ణసంకరం, సనాతనము, ఆత్మలో స్థితులైన మహాపురుషులు కూడా లోకహితానికై కర్మ చేయడం, యుద్ధం మొదలగు వాటిని గురించి విశదంగా చర్చించడమయింది. ఈ అధ్యాయంలో యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు వీటికే సంబంధించిన అనేక పూరక ప్రశ్నలను తీసుకొన్నాడు. వాటి సమాధానాలు మరియు అనుష్ఠానం– ఆరాధనలో సహాయకరమవుతాయి.

ఆరవ అధ్యాయం చివరి శ్లోకంలో యోగేశ్వరుడు ఏమన్నాడంటే– ఏ 'యోగి అయితే 'మద్గతేనాంతరాత్మనా' నాలో బాగా స్థితమైన అంతః కరణం గలవాడో, అతనిని నేను అతిశయ శ్రేష్ఠ యోగిగా భావిస్తాను', అలా అని, ఒక ప్రశ్నకు స్వయంగా అవకాశం కల్పించాడు. పరమాత్మునిలో బాగుగా స్థితుడవటమంటే ఏమిటి? చాలా మంది యోగులు పరమాత్ముని పొందుతారు, అయినా కూడా ఎక్కడో ఏదో లోటు వారికి కనిపిస్తుంది. లేశమాత్రం కూడా లోటు వుండకూడదు. ఇలాంటి దశ ఎప్పుడు వస్తుంది? పరమాత్ముని గురించి సంపూర్ణంగా ఎప్పుడు తెలుసుకోవడమవుతుంది? ఎప్పుడు సాధ్యపడుతుంది? దీనిని గురించి యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు ఇలా అంటాడు–

శ్రీభగవానువాచ–

శ్లో ॥ మయ్యాసక్తమనాః పార్థ యోగం యుఞ్జన్మదాశ్రయః ।
అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు ॥1॥

పార్థా! బయటి విషయాల పట్లగాక నీవు నా పట్ల ఆసక్తిగల మనస్సు గలవాడవై 'మదాశ్రయః'– అంటే (మత్పరాయణుడవై) నా పరాయణుడవై, యోగం యొక్క ఆచరణ చేస్తూ (కర్మను వదిలేసి కాదు), సంశయ రహితుడవై నన్ను తెలుసుకొనే విధానం గురించి విను. దానిని తెలుసు కొన్న తరువాత కొంచెం కూడా సంశయం ఉండదు. విభూతుల యొక్క ఆ సమగ్ర జ్ఞానం గురించి తిరిగి ఇలా అంటాడు–

శ్లో ॥ జ్ఞానంతేఽహం సవిజ్ఞాన మిదం వక్ష్యామ్య శేషతః ।
యత్ జ్ఞాత్వా నేహ భూయోఽన్యత్ జ్ఞాతవ్యమవశిష్యతే ॥**2**॥

నేను నీ కోసం ఈ జ్ఞానాన్ని, విజ్ఞాన సహితంగా సంపూర్ణంగా చెపుతాను. సమాప్తం అయ్యే కాలంలో యజ్ఞం దేనినైతే సృష్టిస్తుందో, ఆ అమృత తత్వాన్ని పొందుటతో బాటు లభించే తెలివి తేటల పేరే జ్ఞానం. పరమతత్త్వమైన పరమాత్ముడి ప్రత్యక్షానుభూతియే జ్ఞానం. మహా పురుషులకు సర్వత్రా ఒకేసారి పని చేయుటకై ఏ సామర్థ్యమైతే లభిస్తుందో, అదే విజ్ఞానం. ఆ ప్రభువు ఒకేసారి అందరి హృదయాలలోనూ ఎలా పని చేస్తాడు? ఏ ప్రకారంగా అతను కూర్చోబెడతాడు, లేపుతాడు మరియు ఏ విధంగా ప్రకృతి యొక్క ద్వంద్వాలనుండి వెలికి తీసి స్వస్వరూపం వరకు గల దూరాన్ని అధిగమింప జేస్తాడు? అతని యొక్క ఈ కార్య ప్రణాళిక పేరే విజ్ఞానం. ఈ విజ్ఞాన సహితంగా జ్ఞానాన్ని సంపూర్ణంగా చెబుతాను, దానిని తెలుసుకొన్నచో (వినడం మాత్రమే కాదు) ప్రపంచంలో యింక దేనిని గురించీ తెలుసుకోవలసినది ఉండదు. తెలుసుకోగలవారి సంఖ్య చాలా తక్కువ.

శ్లో ॥ మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే ।
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః ॥**3**॥

వేల మంది మనుష్యులలో ఎవడో ఒకడే నన్ను పొందుటకై ప్రయత్నిస్తాడు, మరియు అలా ప్రయత్నం చేసే వారిలో కూడా ఎవరో దుర్లభమైన ఒక పురుషుడే నన్ను తత్త్వంతో (సాక్షాత్కారంతో) బాటు తెలుసుకొంటాడు. ఇప్పుడు సమగ్రమైన తత్త్వం ఎక్కడ ఉంది? ఒక స్థానంలో పిండరూపంలో ఉందా, లేక సర్వత్రా వ్యాప్తమయి ఉందా? అప్పుడు యోగేశ్వరుడు శ్రీకృష్ణుడు అంటాడు.

శ్లో ॥ భూమిరాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవచ ।
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా ॥**4**॥

అర్జునా! భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం మరియు మనస్సు, బుద్ధి, అహంకారం, ఇలాంటి యీ ఎనిమిది ప్రకారాల భేదం గలది నా ప్రకృతి, ఇది ఎనిమిది మూలల ప్రకృతి. ఎనిమిది విధాలుగా ఉంటుంది.

శ్లో ॥ అపరేయమితస్త్వన్యాం ప్రకృతిం విద్ధిమే పరామ్ ।
జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్॥**5**॥

'ఇయం' అంటే ఈ ఎనిమిది ప్రకారాలుగా గల ఇది నా అపరా ప్రకృతి– అంటే జడ ప్రకృతి. మహాబాహో అర్జునా! దీని కంటే భిన్నమైన ఇంకొక దానిని జీవరూపమైన 'పరా' అంటే చేతన ప్రకృతిగా తెలుసుకో, దానిచే సమస్త జగత్తు ధారణ చేయబడి వుంది. అదే జీవాత్మ. జీవాత్మ కూడా ప్రకృతితో కూడుకొని ఉన్నది కాబట్టి అది కూడా ప్రకృతే.

శ్లో ॥ ఏతద్యోనీని భూతాని సర్వాణీత్యుపధారయ।
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయస్తథా ॥6॥

అర్జునా! సమస్త భూతాలు ('ఏతధ్యోనీని') ఈ మహాప్రకృతుల నుంచే, పరా, అపరా ప్రకృతుల నుంచే ఉత్పన్నం అవుతాయని అర్థం చేసుకో. ఈ రెండూ ప్రకృతిలో ఉన్న యోనులు. సమస్త జగత్తు యొక్క ఉత్పత్తి నానుంచే జరుగుతుంది మరియు (ప్రళయం) విలయం కూడా నాలోనే అవుతుంది. ఎప్పటి వరకు ప్రకృతి విద్యమానమై ఉందో, అప్పటి వరకు నేనే దాని ఉత్పత్తికి కారకుడను. మరియు ఎప్పుడైనా ఒక మహాపురుషుడు ప్రకృతిని తరించి వేస్తాడో, అప్పుడు నేనే అనుభవంలోకి వచ్చే మహా ప్రళయాన్ని కూడా.

సృష్టి యొక్క ఉత్పత్తి మరియు ప్రళయం అనే ప్రశ్నను మానవ సమాజం చాలా కుతూహలంతో చూచింది. ప్రపంచంలోని అనేక శాస్త్రాలలో దీనిని ఎదో ఒక రకంగా బోధపరచడానికి ప్రయత్నాలు చేయబడుతూనే ఉన్నాయి. కొందరంటారు– ప్రళయంలో ప్రపంచమే మునిగిపోతుంది అని, యింకొందరు సూర్యుడు ఎంత క్రిందకి వచ్చేస్తాడంటే పృథ్వి భస్మమై పోతుంది. అని అంటారు. కొందరు దీనినే 'కయామత్' అన్నారు అంటే ఆరోజు అందరికీ తీర్పు చెప్పబడుతుందని, అయితే కొందరు నిత్య ప్రళయం, నైమిత్తిక ప్రళయాలు గుణించడంలో నిమగ్నులై ఉన్నారు. కానీ యోగేశ్వరుడైన శ్రీకృష్ణుని అభిప్రాయానుసారంగా ప్రకృతి అనాది, పరివర్తన శీలమూ అయినది, కానీ అది ఎప్పుడూ లయం కాలేదు.

భారతీయ ధర్మ గ్రంథాల ప్రకారంగా మనువు ప్రళయాన్ని చూచాడు. అతనితోబాటు పదకొండు మంది ఋషులు చేప కొమ్ముకి నావను కట్టేసి హిమాలయాలలోని ఒక ఉత్తుంగ శిఖరాన్ని చేరి శరణు పొందారు. లీలాకారుడయిన శ్రీకృష్ణుని ఉపదేశాలు మరియు జీవనానికి సంబంధించి అతని సమకాలీన శాస్త్రం భాగవతంలో మృకుండముని పుత్రుడు మార్కండేయుని ద్వారా ప్రళయాన్ని కళ్ళకు కట్టినట్లుగా వివరించడం జరిగింది. అతను హిమాలయాలకు ఉత్తరభాగాన పుష్ప భద్రానది ఒడ్డున ఉండేవాడు.

భాగవతం యొక్క పన్నెండవ స్కంధంలోని ఎనిమిది మరియు తొమ్మిదవ అధ్యాయాలలో శౌనకాది ఋషులు సూత మహర్షిని అడిగారు. మార్కండేయుడు మహాప్రళయకాలంలోని మఱ్ఱి ఆకుపై భగవంతుడైన బాలముకుందుణ్ణి దర్శనం చేసుకొన్నాడు, అతను మా వంశంలోని వాడే, మాకన్నా కొద్దిగా పూర్వపువాడు. అతని జన్మ తరువాత ఎలాంటి ప్రళయం జరగలేదు, మరియు సృష్టిలో ఎలాంటి మార్పులేదు. అన్నీ యథాతథంగానే ఉన్నాయి. అలాంటప్పుడు అతను ఎలా ప్రళయాన్ని చూసాడు.

సూత మహర్షి చెప్పాడు– మార్కండేయుని యొక్క ప్రార్థనలచే ప్రసన్నులయిన నరనారాయణులు అతనికి దర్శనమిచ్చారు. మార్కండేయుడు ప్రార్థించాడు– 'దేని వలననైతే ప్రేరితమయి ఈ ఆత్మ అనంత యోనులలో భ్రమణం చేస్తూందో, అటువంటి మీ మాయను నేను చూడాలని కోరుకుంటున్నాను'. భగవంతుడు అతని ప్రార్థనను అంగీకరించాడు. అతడు భగవంతుని చింతనలో తన్మయుడై ఉండగా అతనేం చూసాడంటే, నాలుగు వైపుల నుంచి

సముద్రము పొంగుతూ అతనిపైకి రాసాగింది. దానిలో మొసళ్ళు ఎగిరెగిరి పడుతున్నాయి. వాటి పట్టులోకి మార్కండేయ ఋషి కూడా వస్తున్నాడు. అతను స్వరక్షణకై ఇటూ-అటూ పరుగెడుతున్నాడు. ఆకాశం, సూర్యుడు, పృథ్వి, చంద్రుడు, స్వర్గం, జ్యోతిర్ మండలం, అన్నీ ఆ సముద్రంలో మునిగి పోయాయి. అంతలోనే మార్కండేయునికి ఒక మఱ్ఱి ఆకు, దానిపై ఒక శిశువు కనిపించారు. శ్వాసతో బాటుగా మార్కండేయుడు ఆశిశువు ఉదరంలోనికి వెళ్ళిపోయాడు, మరియు తన ఆశ్రమాన్ని, సూర్య మండలం సహితంగా మొత్తం సృష్టిని యథాతథంగా అతను చూచాడు. మళ్ళీ శ్వాసతో బాటుగా అతను ఆ శిశువు ఉదరంలో నుంచి బయటకు వచ్చేశాడు. కళ్ళు తెరచేటప్పటికి మార్కండేయుడు తన్ను తన ఆశ్రమంలో తన ఆసనంపైనే ఉండటం చూచాడు.

దీని వల్ల స్పష్టమయ్యే దేమిటంటే కోట్ల సంవత్సరాల భజన పిదప ఆ ముని ఈశ్వరీయ దృశ్యాన్ని తన హృదయంలో చూచాడు, అనుభవంలో చూచాడు, బయట అన్నీ యథాతథంగా వున్నాయి. కాబట్టి ప్రళయమనేది యోగి యొక్క హృదయంలో ఈశ్వరుని ద్వారా లభించే అనుభూతి. భజన పూర్తికాలంలో యోగి యొక్క హృదయంలో ప్రపంచం యొక్క ప్రవాహం నశించి అవ్యక్త పరమాత్ముడే మిగులుతాడు. అదే ప్రళయమనేది. బయట ప్రళయమనేది జరగదు. శరీరం ఉంటూండగానే అద్వైతం యొక్క ఒక అనిర్వచనీయ స్థితినే మహాప్రళయం అంటారు. ఇది క్రియాత్మకం. కేవలం బుద్ధితో నిర్ణయించడం వలన భ్రమ పుడుతుంది. యింకా చూద్దాం-

శ్లో || మత్తః పరతరం నాన్యత్కించిదస్తి దనంజయ ।
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ ||**7**||

ధనంజయా! నన్ను తప్పించి కించిన్మాత్రం కూడా యింకో వస్తువంటూ లేదు. ఈ సంపూర్ణ జగత్తు దారంలో మణుల్లాగా నాలో గుచ్చబడింది. ఉందికానీ తెలుసుకొనేదెప్పుడు? ఈ అధ్యాయం మొదటి శ్లోకంలో చెప్పినట్లుగా ఎప్పుడైతే యోగి అనన్య ఆసక్తి (భక్తి)తో నా పరాయణుడవుతాడో, అప్పుడు. అలా కాకుండా యింకో మార్గం లేదు. యోగాచరణ తప్పదు.

శ్లో || రసోఽహమప్సు కౌంతేయ ప్రభాస్మి శశి-సూర్యయోః ।
ప్రణవః సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు ||**8**||

కౌంతేయా! నీటిలో రసాన్ని నేను. చంద్రుడు మరి సూర్యుడిలోని ప్రకాశం నేను. సంపూర్ణ వేదాలలో ఓంకారాన్ని (ఓ+అహం+కార) స్వయం ఆకారాన్ని నేను. ఆకాశంలో శబ్దాన్ని మరియు పురుషులలో పురుషత్వాన్ని నేను. మరియు నేను-

శ్లో || పుణ్యో గంధః పృథివ్యాం చతేజశ్చాస్మి విభావసౌ।
జీవనం సర్వ భూతేషు తపశ్చాస్మి తప స్విషు ||**9**||

ప్రథ్విలో పవిత్ర సువాసన మరియు అగ్నిలోని తేజాన్ని నేను. సమస్త జీవులలొ జీవాన్ని మరియు తపస్వులలోని తపస్సు నేనే.

శ్లో ॥ బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనమ్।
బుద్ధిర్బుద్ధి మతామస్మి తేజస్తేజస్వినామహమ్ ॥ **10**॥

పార్థా! సమస్త భూతాలకు సనాతన కారణం అంటే బీజాన్ని నేనే అని నీవు తెలుసుకో. బుద్ధిమంతులలో బుద్ధిని మరియు తేజస్వులలోని తేజాన్ని నేనే. ఇదే క్రమంలో యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు అంటాడు-

శ్లో ॥ బలం బలవతాం చాహం కామరాగ వివర్జితమ్ ।
ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్ష భ ॥ **11**॥

హే భరతులలో శ్రేష్ఠుడైన అర్జునా! బలవంతులలోని కోరిక మరియు ఆసక్తి రహితమైన బలాన్ని నేను. ప్రపంచంలో అందరూ బలవంతులే అవుతారు. కొందరు కసరత్తులు చేయడం మొదలెట్టితే, మరికొందరు పరమాణు శక్తి చేకూర్చుకుంటారు, కానీ అలా కాకుండా శ్రీకృష్ణుడు అంటాడు- కామం మరియు రాగాల అతీతమైన ఏ బలముందో, అది నేను. అదే వాస్తవికమైన బలం. అన్ని భూతాలలోనూ ధర్మానికి అనుకూలమైన కోరికను నేను. పరబ్రహ్మ పరమాత్ముడే ఏకమాత్ర ధర్మము. ఏదైతే అందరినీ ధరించి ఉన్నదో, శాశ్వతమైన ఆత్మ ఏదైతే ఉందో, అదే ధర్మం. ఏకోరికైతే దానికి అవిరోధంగా ఉందో, అదీ నేనే. ఇంతకు ముందు కూడా శ్రీకృష్ణుడు అన్నాడు- అర్జునా! నన్ను పొందుటకై యిచ్ఛగలవాడవు కమ్ము. అన్ని కోరికలూ వర్జితమయినవే, కానీ ఆ పరమాత్ముని పొందు కోరిక ఆవశ్యకము. అన్యథా మీరు సాధన కర్మలో ప్రవృత్తులు కాలేరు. అలాంటి కోరిక కూడా నా ఆశీర్వాదం వల్లనే కలుగుతుంది.

శ్లో ॥ యే చైవ సాత్త్వికా భావా రాజసాస్తామసాశ్చయే ।
మత్త ఏవేతి తాన్విద్ధిన త్వహం తేషు తే మయి ॥ **12**॥

మరియు సత్వగుణంచే ఉత్పన్నమయ్యే భావన, రజోగుణం మరియు తమోగుణాల ద్వారా ఉత్పన్నమయ్యే భావనలు- అన్నింటినీ నా నుంచి ఉత్పన్నమయ్యే వాటిగానే తెలుసుకో. కానీ వాస్తవానికి వాటిలో నేనుగానీ, నాలో అవిగానీ లేవు. ఎందుకంటే నేను వాటిలో మునిగి పోలేదు మరియు అవి నాలో ప్రవేశించ లేవు. ఎందుకంటే నాకు కర్మ యొక్క స్పృహ లేదు. నేను నిర్లిప్తుడను, నాకు వీటి నుండి ఏమీ అక్కరలేదు, కాబట్టి అవి నాలో ప్రవేశించలేవు. అలా అయినప్పటికీ.

ఏ ప్రకారంగా ఆత్మ యొక్క ఉనికి వల్లనే శరీరానికి ఆకలి, దాహం అవుతాయో, (ఆత్మకు అన్నం నీళ్ళతో ఎలాంటి అవసరమూ లేదు) అదే ప్రకారంగా పరమాత్ముడి ఉనికిలోనే ప్రకృతి తన పని చేయ గలుగుతుంది, కానీ పరమాత్ముడు దాని గుణాల నుంచి మరియు కార్యకలాపాల నుంచి నిర్లిప్తుడై ఉంటాడు.

శ్లో // త్రిభిర్గుణమయైర్భావై రేభిః సర్వమిదం జగత్।
మోహితం నాభిజానాతి మామేభ్యః పరమవ్యయమ్ ॥ 13॥

సాత్వికం, రాజసం మరియు తామసం– ఈ మూడు గుణాల యొక్క కార్యరూపాలైన భావాలతో ఈ జగత్తంతయూ మోహితమవుతూ ఉంది. అందుచేతనే జనులు ఈ మూడు గుణాలకు అతీతమైన, అవినాశుడైన నన్ను, తత్త్వంతో చక్కగా తెలుసుకోలేరు. నేను ఈ మూడు గుణాల కంటే అతీతమైన వాడిని. అంటే ఎప్పటి వరకు ఈ మూడు గుణాల ఆచ్ఛాదన కొంచెం కూడా మిగిలి ఉంటుందో, అప్పటి వరకూ ఎవరూ నన్ను తెలుసుకోలేరు. అతను (సాధకుడు) ఇంకా పురోగమించాలి. అతను ఇంకా బాటసారియే. మరియు–

శ్లో // దైవీ హ్యేషా గుణమయీ మమ మయా దురత్యయా ।
మామేవ యే ప్రపద్యంతే మయామేతం తరంతితే ॥ 14॥

ఈ త్రిగుణాలతో సంయుక్తమైన నాఅద్భుత మాయ దుష్కరమైనది, కానీ ఏ పురుషుడైతే నన్నే నిరంతరం భజన చేస్తాడో, అతను ఈ మాయను, దాటగలుగుతాడు. ఈ మాయ దైవ సంబంధమైనదే కానీ ఊదువత్తులు, వెలిగించి దీనికి పూజలు చేయకండి, దీనిని దాటాలి.

శ్లో // న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యంతే నరాధమాః ।
మాయయా పహృతాజ్ఞానా అసురం భావమాశ్రితాః ॥ 15॥

ఎవరైతే నిరంతరం నా భజన చేస్తారో, వారికే, ఈ విషయం తెలుసును. అయినా లోకులు భజన చేయరు. ఎవరి జ్ఞానమైతే మాయ ద్వారా అపహరించబడిందో, ఎవరైతే ఆసురీ స్వభావాన్ని ధారణ చేసి (కలిగి) ఉన్నారో, ఎవరైతే మనుష్యులలో అధములో, కామ–క్రోధాది దుష్కర్మలను చేస్తారో, అటువంటి మూఢులు నా భజన చేయరు. మరి భజన చేసేదెవరు?

శ్లో // చతుర్విధా భజంతే మాం జనాః సు కృతినోऽర్జున।
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ ॥ 16॥

హే భరతులలో శ్రేష్ఠుడైన అర్జునా! 'సుకృతినః' ఉత్తమం అంటే నియత కర్మ (దేని పరిణామంగా శ్రేయం ప్రాప్తమవునో, దానిని) చేసేవారు, ''అర్థార్థి'' అంటే సకాములు, ''ఆర్తః'' అంటే దుఃఖాల నుంచి ముక్తిని కోరుకునేవారు. 'జిజ్ఞాసు' అంటే ప్రత్యక్షంగా తెలుసుకోవాలనే కోరికగలవాడు మరియు జ్ఞానులు అంటే ప్రవేశం పొందే స్థితిలో ఉన్నవారు. ఈ నాలుగు రకాల భక్తులు నన్ను భజిస్తారు.

'అర్థం' అంటే దేని వలనైతే మనశరీరానికి, లేక దానికి సంబంధించిన కోరికలు పూర్తవుతాయో, ఆవస్తువు, కాబట్టి ''అర్థ'', కోరికలు అన్నీ ఆ భగవంతుని ద్వారా ముందే పూర్తవుతాయి. శ్రీకృష్ణుడు అంటాడు– నేనే పూర్తి చేస్తాను, కానీ 'అర్థ' అంటే వాస్తవానికి యింతే కాదు. ఆత్మ యొక్క సంపత్తే స్థిర సంపత్తి– అదే అసలైన 'అర్థం'

ప్రాపంచిక 'అర్థం' పూర్తి చేస్తూ చేస్తూ (కోరికలను తీరుస్తూ) భగవంతుడు వాస్తవిక 'అర్థం' ఆత్మిక సంపత్తి వైపుకు నడిపించుతాడు, ఎందుకంటే ఇంతటితోనే తన భక్తుడు సుఖం

పొందలేడని అతనికి తెలుసు. కాబట్టే అతను ఆత్మిక సంపత్తిని కూడా ఇవ్వడం మొదలు పెడతాడు. 'లోక లాహుపరలోక నిబాహు' లోకంలో లాభం మరియు పరలోకంలో నిర్వాహం- యీ రెండూ భగవంతుని వస్తువులు. తన భక్తుణ్ణి వట్టిగా వదిలి వేయడు.

''ఆర్త'' అంటే దుఃఖించేవారు. 'జిజ్ఞాసు- సమగ్రంగా తెలుసుకోవాలనే కోరిక గలవారు. జిజ్ఞాసువులు నా యొక్క భజన చేస్తారు. సాధన యొక్క పరిపక్వ- అవస్థలో దిగ్దర్శనం (ప్రత్యక్ష దర్శనం) చేసే దశలోగల జ్ఞానులు కూడా నా భజన చేస్తారు. ఈ ప్రకారంగా నాలుగు రకాల భక్తులు నా భజన చేస్తారు, వారిలో జ్ఞానులు శ్రేష్ఠులు అంటే జ్ఞానులు కూడా భక్తులే, వీరందరిలో కూడా-

శ్లో ॥ తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే ।
ప్రియో హి జ్ఞానినోऽత్యర్థమహం స చ మమప్రియః ॥ **17**॥

అర్జునా! వారిలో కూడా నిత్యం నాలో ఏకీభావంతో స్థితులైన, అనన్య భక్తులైన జ్ఞానులు విశిష్టమైన వారు, ఎందుకంటే సాక్షాత్కార సహితంగా తెలుసుకునే జ్ఞానులకు నేను అత్యంత ప్రియుడను, మరియు ఆ జ్ఞానులు కూడా నాకు అత్యంత ప్రియులు. ఆ జ్ఞాని నా స్వరూపం కలవాడే.

శ్లో ॥ ఉదారాః సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్ ।
ఆస్థితః సహి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిమ్ ॥ **18**॥

ఆ నాలుగు రకాల భక్తులు ఉదారులే (ఏ ఉదారత చూపించారు? మీరు భక్తి చూపడం వలన దేవుడికేమయినా-లాభమా? భగవంతుడిలో ఏదైనా తక్కువ ఉంది గనకనా? ఆలోటును మీరు పూడుస్తారా? అలాకాదు, వాస్తవానికి ఎవడు తన ఆత్మను అధోగతిలో పడెయ్యక, దాన్ని ఉద్ధరించడానికై అగ్రసరుడవుతాడో అతనే ఉదారుడు. ఈ ప్రకారం వారందరూ ఉదారులే) అయినా కానీ జ్ఞానులు మాత్రం సాక్షాత్తు నా స్వరూపులే, అలా అని నేను భావిస్తాను, ఎందుకంటే ఆస్థిరబుద్ధిగల జ్ఞానులైన భక్తులు సర్వోత్తమ గతి స్వరూపమైన నాలోనే స్థితులై ఉంటారు. అంటే వారే నేను. నాలో వారుంటారు. నాలోనూ, వారిలోనూ ఏ భేదం లేదు. దీనిపై మళ్ళీ నొక్కి చెప్పాడు.

శ్లో ॥ బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్మాం ప్రపద్యతే ।
వాసుదేవః సర్వమితి స మహాత్మా సుదుర్లభః ॥ **19**॥

అభ్యాసం చేస్తూ, చేస్తూ, చాలా జన్మల తర్వాత చివరి జన్మలో; పరమాత్ముణ్ణి పొందే జన్మలో, సాక్షాత్కారాన్ని పొందిన జ్ఞానులు ''అంతా' 'వాసుదేవ మయం' అంటూ నా భజన చేస్తారు. అటువంటి మహాత్ములు చాలా అరుదు. అతను ఏ వాసుదేవుని ప్రతిమనూ ప్రతిష్ఠించడు, కానీ తనలోనే ఆ పరమదేవుడు ఉండడాన్ని చూస్తాడు. ఆ జ్ఞాని, ఆ మహాత్ముణ్ణే శ్రీకృష్ణుడు తత్త్వదర్శకుడని కూడా అంటాడు. ఇలాంటి మహాపురుషుల వల్లనే బయటి సమాజానికి కళ్యాణం జరుగుతుంది. ఇటువంటి ప్రత్యక్ష తత్త్వ దర్శకుడైన మహాపురుషుడు, శ్రీకృష్ణుని దృష్టిలో చాలా అరుదు.

శ్రేయం, మరియు ప్రేయం (ముక్తి మరియు భోగాలు) రెండూ భగవంతుని వల్లనే

దొరుకుతాయి, అలాంటప్పుడు అందరూ భగవంతుడి భజన చేయాల్సి ఉంది, కానీ లోకులు అతనిని భజించరు. ఎందువలన? శ్రీకృష్ణుడి మాటలలోనే–

శ్లో ॥ కామైస్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యంతేఽన్య దేవతాః।
తం తం నియమ మాస్థాయ ప్రకృత్యానియతాః స్వయా ॥**20**॥

''ఆ తత్త్వదర్శకుడైన మహాత్ముడే, లేక పరమాత్ముడే సర్వస్వం'' అని లోకులు తెలుసుకోలేరు, ఎందుకంటే భోగాల్పై కోరికల వలన లోకుల వివేకం అపహరించబడింది. కాబట్టి వారు తమ ప్రకృతి అంటే జన్మ జన్మాంతరాల నుంచి ఆర్జించిన సంస్కారాల స్వభావంచే ప్రేరితులై పరమాత్ముడైన నన్ను వదలి అన్యదైవతలను మరియు వారికై ప్రచలితమయిన నియమాల శరణు పొందుతారు. ఇక్కడ అన్య దేవతల ప్రసంగం మొదటి సారిగా వచ్చింది.

శ్లో ॥ యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయార్చితుమిచ్ఛతి ।
తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్ ॥**21**॥

ఏ ఏ కోరికలుగల భక్తులు ఏ ఏ దేవతల స్వరూపాన్ని శ్రద్ధతో పూజిస్తారో, నేను అదే దేవత రూపం పట్ల వారి శ్రద్ధను స్థిర పరుస్తాను. నేను స్థిర పరుస్తాను. ఎందుకంటే ఆ దేవత పేరు గల వస్తువంటూ ఉంటే గదా! ఉంటే ఆ దేవతే శ్రద్ధను స్థిరం చేసుకొనేది. గదా!

శ్లో ॥ స తయా శ్రద్ధయా యుక్తస్తస్యారాధన మీహతే ।
లభతే చ తతః కామాన్మయైవ విహితాన్హితాన్ ॥**22**॥

ఆ పురుషుడు అటువంటి శ్రద్ధతో యుక్తుడై ఆ దైవీ విగ్రహాన్ని పూజించడానికి తత్పరుడవుతాడు మరియు ఆ దేవత మాధ్యమంగా నా ద్వారా నిర్మితమైన ఆ కోరుకున్న భోగాల్ని నిస్సందేహంగా పొందుతాడు. భోగాలు ఎవరు ఇస్తారు? నేనే ఇస్తాను. అతని శ్రద్ధ యొక్క పరిణామమే ఆభోగాలు, కానీ ఏ దేవతా యిచ్చినవి కావు. అతను ప్రతి ఫలాన్ని పొందుతాడు. గదా! ఇందులో తప్పేముంది? శ్రీకృష్ణుడు అంటాడు.

శ్లో ॥ అంతవత్తు ఫలం తేషాం తద్భవత్యల్పమేధసామ్ ।
దేవాన్ దేవయజో యాంతి మద్భక్తా యాంతి మామపి ॥**23**॥

కానీ ఆ అల్పబుద్ధి గల వారి ఆ ప్రతిఫలం నశ్వరమైనది. ఈనాడు ప్రతిఫలం ఉంది, కానీ అనుభవించుతూ ఉంటే వినష్టమై పోతుంది. కాబట్టి అది నశించిపోయేది. దేవతలను పూజించువారు దేవతలనే పొందుతారు. అంటే దేవత కూడా నశించునది. దేవతల నుంచి మొదలుకొని యావన్మాత్ర జగత్తంతయూ పరివర్తనశీలము మరియు మరణ ధర్మం గలది. నా భక్తుడు నన్నే పొందుతాడు. 'ఏదైతే అవ్యక్తమో' అలాంటి నైష్ఠిక పరమశాంతినే పొందుతాడు. మూడో అధ్యాయంలో యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు అన్నాడు– ఈ యజ్ఞం ద్వారా మీరు దేవతలను అంటే దైవీ సంపదను ఉన్నతం చేయ్యండి. ఎలా దైవీ సంపద యొక్క ఉన్నతి అవుతుందో, అదే మీ ఉన్నతి. క్రమంగా ఉన్నతి చెందుతూ చెందుతూ, పరమశ్రేయాన్ని పొందండి. ఇక్కడ దేవతలంటే ఆ దైవీ సంపద యొక్క సమూహం. దాని వలన పరమదేవుడైన పరమాత్ముని దైవత్వం ఆర్జించబడుతుంది. దైవీ సంపద మోక్షానికి అవసరం. దాని యొక్క యిరవైనాలుగు లక్షణాల నిరూపణ గీత యొక్క పదహారవ అధ్యాయంలో చేయబడింది.

'దేవత హృదయంలోని అంతరంగంలో పరమదేవుడైన పరమాత్ముని యొక్క దైవత్వాన్ని అర్జించి పెట్టే సద్గుణాల పేరు. ఇదిలోపలి వస్తువైనా సరే, తరువాతి కాలంలో లోకులు లోపలి వస్తువును బయట చూడటం ప్రారంభించారు. విగ్రహాల్ని స్థాపించారు. కర్మకాండలను రచించారు. మరియు వాస్తవికత నుంచి దూరమై పోయారు. శ్రీకృష్ణుడు ఈ భ్రాంతినిపై నాలుగు శ్లోకాలలో ఖండించాడు. గీతలో మొదటిసారిగా 'అన్యదేవతలు' అంటూ అతను అన్నాడు- దేవతలు లేనే లేరు. లోకుల శ్రద్ధ ఎక్కడైతే ఏర్పడుతుందో, అక్కడ నేనే నిలబడి వారి శ్రద్ధను దృఢపరుస్తాను. నేనే అక్కడ ఫలాన్ని కూడా ఇస్తాను. ఆఫలం కూడా నశ్వరమైనది. ప్రతి ఫలం వినష్టమయి పోతుంది, దేతతలు నష్టమయి పోతారు మరియు దేవతలను పూజించువారు కూడా నష్టమయిపోతారు. ఎవరి వివేకమైతే నష్టమయి పోతుందో, అలాంటి మూఢ బుద్ధి గల వారే అన్య దేవతలను పూజించుతారు. శ్రీకృష్ణుడు ఇంకా ఏమంటాడంటే అన్య దేవతలను పూజించే విధానమే అయుక్తి సంగతమయింది. (అధ్యాయం-9/ -శ్లోకం-23)

శ్లో ॥ అవ్యక్తం వ్యక్తి మా పన్నం మ న్యంతే మామబుద్ధయః ।
పరం భావమజానంతో మమావ్యయమనుత్తమమ్ ॥**24**॥

దేవతల పేరు మీద, దేవతల పేరుగల ఏ వస్తువూలేనప్పుడు, ఏ ప్రతిఫలమైతే దొరుకుతుందో, అది కూడా నశించునదైనప్పటికీ లోకులు నన్ను భజించరు, ఎందుకంటే బుద్ధిహీనులైన పురుషులు (పోయిన శ్లోకంలో చెప్పినట్లుగా కోరికల ద్వారా ఎవరి జ్ఞానమైతే అపహరించబడిందో, వారు) నా సర్వోత్తమ అవినాశీ పరమ ప్రభావాన్ని తెలుసుకోలేరు. కాబట్టి వారు అవ్యక్త పురుషుడనైన నన్ను వ్యక్తి భావాన్ని పొందిన వానిగా అనుకొంటారు మనుష్యుడనని అనుకొంటారు. అంటే శ్రీకృష్ణుడు శరీరధారియైన యోగి, యోగేశ్వరుడు. ఎవరైతే స్వయంగా యోగో, మరియు ఇతరులకు కూడా యోగాన్ని ప్రదానం చేయగల సామర్థ్యం ఎవరి దగ్గర ఉంటుందో, వారిని యోగేశ్వరుడు అంటారు. సాధన యొక్క సరియైన దారిలో క్రమంగా ఉత్థానమవుతూ, మహాపురుషుడు కూడా ఆ పరమభావంలో స్థితుడై పోతాడు. శరీరధారులై ఉంటూ కూడా వారు అదే అవ్యక్త స్వరూపంలో స్థితులై పోతారు. అయినా గానీ కోరికలచే వివశులయిన మంద బుద్ధిగల లోకులు అతణ్ణి సాధారణ వ్యక్తిగానే భావిస్తారు. అతను మనలాగే పుట్టాడు, భగవంతుడెలా అవగలడు? అని అనుకుంటారు. అలాంటి వారి దోషమేమిటి? దృష్టికి మొదట శరీరమే కనిపిస్తుంది. వారు మహాపురుషుని వాస్తవిక స్వరూపాన్ని ఎందుకు చూడలేరు? యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు అంటాడు-

శ్లో ॥ నాహం ప్రకాశః సర్వస్యం యోగ మాయా సమావృతః ।
మూఢోఽయం నా భిజానాతి లోకోమామజమవ్యయమ్ ॥**25**॥

సామాన్య మనుష్యుడికి మాయ ఒకతెర. దాని కారణంగా పరమాత్ముడు కనిపించక, ఎప్పటికీ దాగి ఉంటాడు. 'యోగసాధన' తెలుసుకొని సాధకుడు దానిలో ప్రవృత్తమవుతాడు. దాని తరువాత యోగమాయ అంటే యోగ క్రియ కూడా ఒక అచ్ఛాదనమే. యోగాన్ని అనుష్ఠిస్తూ, దాని పరాకాష్ఠమైన యోగారూఢత వచ్చినప్పుడు, ఆ దాగివున్న పరమాత్ముడు

దర్శనమిస్తాడు. యోగేశ్వరుడు అంటాడు- నేను యోగమాయద్వారా కప్పబడి ఉన్నాను, కేవలం యోగం యొక్క పరిపక్వ అవస్థలో ఉన్నవారే నన్ను యథార్థంగా చూడగలుగుతారు. నేను అందరికీ ప్రత్యక్షంగా కనిపించను. కాబట్టి అజ్ఞానులైన మనుష్యులు నా జన్మరహితమైన (ఎవరైతే యిప్పుడింకా జన్మనెత్త నవసరం లేదో) అవినశ్వరమైన (ఎవరైతే నాశనం కారో) అవ్యక్తమైన (ఎవరికైతే మళ్ళీ వ్యక్తం కానవసరం లేదో) నా స్వరూపాన్ని తెలుసుకోలేరు. అర్జునుడు కూడా శ్రీకృష్ణుడిని తన లాగానే మనుష్యుడనే అనుకొన్నాడు. మున్ముందు అతను దృష్టిని యిచ్చినప్పుడు గడ గడ లాడాడు. ప్రార్థించడం మొదలు పెట్టాడు. వాస్తవానికి అవ్యక్త మహాపురుషుణ్ణి గుర్తించడంలో మనం సాధారణంగా అంధులమే. ఇంకా ఇలా అంటాడు.

శ్లో ॥ వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున।
భవిష్యాణి చ భూతాని మాం తు వేదన కశ్చన ॥**26**॥

అర్జునా! ఇంతకు ముందున్న ప్రాణులూ వర్తమానంలోనూ మరియు భవిష్యత్తులోనూ పుట్టబోయే సమస్త ప్రాణులు నాకు తెలుసు, కానీ నన్ను ఎవ్వరూ తెలుసుకోలేరు. ఎందుకు తెలుసుకోలేరు?

శ్లో ॥ ఇచ్ఛాద్వేషసముత్థేన ద్వంద్వమోహేన భారత ।
సర్వభూతాని సమ్మోహం సర్గే యాంతి పరంతప ॥**27**॥

భరత వంశీయుడైన అర్జునా! కోరికలు మరియు ద్వేషం అంటే రాగ ద్వేషాది ద్వంద్వాలచే ప్రపంచంలోని సమస్త ప్రాణులూ అత్యంత మోహాన్ని పొందుతున్నారు, కాబట్టి నన్ను తెలుసుకోలేరు. అయితే ఎవ్వరూ తెలుసుకోలేరా? దీని గురించి యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు ఇలా అంటాడు-

శ్లో ॥ యేషాం త్వంతగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్ ।
తే ద్వంద్వ మోహనిర్ముక్తా భజంతే మాం దృఢవ్రతాః ॥**28**॥

కానీ పుణ్య కర్మను (ఏదైతే ప్రపంచమును అంతం చేయునదో, దేనీ పేరైతే కార్యమ్ కర్మ, అనబడినదో, దేని పేరు నియతకర్మ యజ్ఞము యొక్క ప్రక్రియ అని చెప్పి దేనినైతే విశదపరచానో, ఆ కర్మ) చేయు భక్తుల పాపం వినష్టమై పోతుంది. అటువంటి వారు రాగ ద్వేషాది ద్వంద్వామోహం నుంచి చక్కగా ముక్తులయి ధ్యానంలో ధృడంగా ఉంటూ నా భజన చేస్తారు. ఎందుకని భజన చేస్తారు?

శ్లో ॥ జరామరణ మోక్షాయ మమా శ్రిత్య యతంతి యే ।
తే బ్రహ్మ తద్విదుః కృత్స్నమధ్యాత్మం కర్మ చాఖిలమ్ ॥**29**॥

ఎవరైతే నాశరణుజొొచ్చి జరామరణాల నుంచి ముక్తి పొందడానికై ప్రయత్నం చేస్తారో, ఆ పురుషులు ఆ బ్రహ్మను, సంపూర్ణ ఆధ్యాత్మిక తత్త్వము మరియు సంపూర్ణ కర్మను గురించి తెలుసుకొంటారు మరియు ఇదే క్రమంలో

శ్లో ॥ సాధి భూతాధిదైవం మాం సాధియజ్ఞం చ యే విధుః।
ప్రయాణ కాలేऽపి చ మాంతే విదుర్యుక్త చేతసః ॥30॥

ఏ పురుషుడైతే అధి భూతం, అధి దైవం మరియు అధి యజ్ఞాల సహితంగా నన్ను తెలుసుకొంటాడో, నాలో సమాహితమైన చిత్తం గల వాడౌతాడో, ఆ పురుషుడు అంతిమ దశలో కూడా నన్నే తెలుసు కొంటాడు. నాలోనే స్థితుడై ఉంటాడు. మరియు ఎల్లప్పుడూ నాకు అందుభాటులో ఉంటాడు. ఇరవై ఆరవ మరి ఇరవై ఏడవ శ్లోకాలలో శ్రీకృష్ణుడు ఈ విధంగా చెప్పాడు- నన్నెవరూ తెలుసుకోలేరు, ఎందుకంటే వారు మోహగ్రస్తులై ఉన్నారు. కానీ ఎవరైతే ఆ మోహం నుంచి ముక్తికై ప్రయత్నశీలురై ఉంటారో, వారు (1) సంపూర్ణ బ్రహ్మను, (2) సంపూర్ణ ఆధ్యాత్మను (3) సంపూర్ణ కర్మను. (4) సంపూర్ణ అధి భూతాన్ని, (5) సంపూర్ణ అధిదైవాన్ని మరి (6) సంపూర్ణ అధియజ్ఞం సహితంగా నన్ను తెలుసుకొంటారు. అంటే వీటన్నింటికీ పరిణామం నేనే (సద్గురువే). వారే నన్ను తెలుసుకొంటారు. ఎవరూ నన్ను తెలుసుకోలేరని కాదు.

సారాంశం :

ఏడవ అధ్యాయంలో యోగేశ్వరుడు శ్రీకృష్ణుడు చెప్పాడు- అనన్య భావంతో నాకు సమర్పితమై, నా ఆశ్రితులై, ఎవరైతే యోగాన్ని ఆచరిస్తారో, వారు సమగ్రంగా నన్ను తెలుసుకొంటారు. నన్ను తెలుసుకునేందుకు వేలాదిమందిలో ఎవరో ఒక్కరే ప్రయత్నం చేస్తారు. మరియు ప్రయత్నం చేసేవారిలో కూడా ఎవరో ఒక్కరే తెలుసుకోగలరు. అతడు నన్ను పిండరూపంలో ఏదో ఒక దేశానికి చెందినవానిగా కాకుండా సర్వత్ర వ్యాప్తమై ఉన్నట్లు చూస్తాడు. ఎనిమిది భేదాలు గలదై నాజడ ప్రకృతి ఉంది. మరియు దీని అంతరాళంలో జీవరూపమైన నా చేతన ప్రకృతి ఉంది. ఈ రెండింటి సంయోగంతోనే ఈ జగత్తు నిలిచి ఉంది. తేజస్సు మరియు బలం నా వల్లనే లభిస్తాయి. రాగం మరియు కోరికలు లేని బలం, దర్మాను కూలమైన కోరికను కూడా నేను. అలాగయితే కోరికలన్నీ కూడా వర్జింపబడేవే, కానీ నన్ను పొందవలెనని కోరుకొనుము. అలాంటి కోరిక కలగడం కూడా నా ప్రసాదమే. కేవలం పరమాత్మను పొందాలనే కోరికే ధర్మానుకూలమైన కోరిక.

శ్రీకృష్ణుడు అన్నాడు- నేను మూడు గుణాల కంటే అతీతమైన వాణ్ణి. పరమాన్ని స్పృశించి పరమభావంలో స్థితుడైన వాణ్ణి, కానీ భోగాసక్తుడైన మూఢ పురుషుడు తిన్నగా నన్ను భజించక, అన్య దేవతలను ఉపాసిస్తాడు, అయినా అక్కడ దేవతలు అనే వాళ్ళు ఎవ్వరూ లేరు. రాళ్ళు-నీళ్ళు- చెట్లు, దేనిని వారు పూజించ దలచినా, దానిలోనే వారి శ్రద్ధను నేను దృఢం-స్థిరం చేస్తాను. వాని వెనక నిలబడి నేనే ప్రతిఫలాన్ని ఇస్తాను, ఎందుకంటే అక్కడ ఏ దేవతా లేదు, దేవతల వద్ద ఎలాంటి భోగమూలేదు. లోకులు నన్ను సాధారణ మనుష్యుడనుకొని, భజన చేయరు, ఎందుకంటే నేను యోగ ప్రక్రియ ద్వారా కప్పబడి ఉన్నాను. అనుష్ఠానం చేస్తూ-చేస్తూ యోగమాయను దాటిన వారే శరీర ధారుడనైన నన్ను అవ్యక్త రూపంలోనే (అన్య స్థితులలో కాదు) తెలుసు కొంటారు.

నా భక్తులు నాలుగు రకాలు- అర్థార్థి, ఆర్తుడు, జిజ్ఞాసువు మరియు జ్ఞాని, చింతన

చేస్తూ– చేస్తూ అనేక జన్మల తరువాత అంతిమ జన్మలో పరమాత్ముణ్ణి పొందు జ్ఞాని నాయొక్క స్వరూపుడే. అంటే అనేక జన్మలలో చింతనచేసి, ఆ భగవత్స్వరూపాన్ని పొందవచ్చును. రాగద్వేషాల మోహంలో కూరుకుపోయిన మనుష్యులు నన్ను ఎప్పటికీ తెలుసుకోలేరు, కానీ రాగద్వేషాలచే రహితులై, ఎవరైతే నియత కర్మ (దానినే సంక్షిప్తంగా ఆరాధన అనవచ్చును) యొక్క చింతన చేస్తూ, జరామరణాల నుంచి ముక్తి పొందాలని ప్రయత్నం చేస్తాడో, ఆ పురుషుడు సంపూర్ణ రూపంతో నన్ను తెలుసుకొంటాడు. వారు సంపూర్ణ బ్రహ్మను, సంపూర్ణ ఆధ్యాత్మ తత్త్వమును, సంపూర్ణ అధిదైవాన్ని, సంపూర్ణ కర్మను మరియు యజ్ఞంతో సహితంగా సంపూర్ణంగా నన్ను తెలుసుకొంటారు. వారు నాలో ప్రవేశించుతారు. మరియు చివరి కాలంలో కూడా నన్నే తెలుసుకొంటారు. అంటే మళ్ళీ ఎప్పుడూ విస్మృతి పొందరు (మరచిపోరు)

ఈ అధ్యాయంలో పరమాత్ముణ్ణి సమగ్రంగా తెలుసుకొనే వివరణ ఉన్నది, అందుచేత–

ఓం తత్సదితి శ్రీమద్భగవద్ గీతాసూపనిషత్సు బ్రహ్మ విద్యాయాం యోగశాస్త్రే శ్రీకృ ష్ణార్జున సంవాదే 'సమగ్రభోధః' నామ సప్తమోధ్యాయః ॥6॥

ఈ ప్రకారంగా శ్రీమద్భగవద్గీతా రూపి ఉపనిషత్తు మరియు బ్రహ్మవిద్యా మరియు యోగ శాస్త్రమనే విషయంలో శ్రీకృష్ణుడు మరియు అర్జునుడి సంవాదంలో ''సమగ్రభోధ' అనే ఏడవ అధ్యాయం పూర్తయింది.

ఈ ప్రకారంగా శ్రీమత్పరమహంస పరమానందగారి యొక్క శిష్యుడు స్వామి అడగడానంద గారిచే రచించబడిన శ్రీమద్భగవద్ గీతా యొక్క భాష్యం ''యతార్థ గీతాలో 'సమగ్రభోధ' అనే ఏడవ అధ్యాయం పూర్తయింది

॥హరి ఓం తత్సత్॥

ॐ

శ్రీ పరమాత్మనే నమః

# అష్టమ అధ్యాయము

ఏడవ అధ్యాయం చివరలో యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు అన్నాడు– పుణ్యకర్మ (నియత కర్మ, ఆరాధన)ను చేసే యోగి సంపూర్ణ పాపాల నుంచి ముక్తి పొంది, ఆ వ్యాప్త బ్రహ్మను తెలుసుకొంటాడు. అంటే కర్మ ఆ వ్యాప్త బ్రహ్మ గురించి తెలుపుతుంది. ఆ కర్మను చేసేవారు వ్యాప్త బ్రహ్మను, సంపూర్ణ కర్మను, సంపూర్ణ అధ్యాత్మాన్ని, సంపూర్ణ అధిదైవాన్ని, అధిభూతాన్ని మరియు అధియజ్ఞం సహితంగా నున్న తెలుసుకొంటారు. అంటే కర్మ వీటన్నింటితో పరిచయం చేయిస్తుంది. వారు చివరి సమయంలో కూడా నన్నే తెలుసుకొంటారు. వారికి తెలిసింది ఎప్పటికీ విస్మరించబడదు.

ఇది విని అర్జునుడు ఈ అధ్యాయం ప్రారంభంలోనే అతని మాటలలోనే ప్రశ్నిస్తాడు.

అర్జున ఉవాచ–

శ్లో ॥ కిం తద్బ్రహ్మ కిమధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ ।
అధిభూతం చ కిం ప్రోక్తమధిదైవం కిముచ్యతే ॥1॥

హే పురుషోత్తమా! ఆ బ్రహ్మ అంటే ఏమిటి? అధ్యాత్మం ఏమిటి? కర్మ ఏమిటి? అధిభూతం, అధిదైవం అని వేటిని అంటారు?

శ్లో ॥ అధి యజ్ఞః కథం కోఽత్ర దేహేఽస్మిన్మధుసూదన ।
ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః ॥2॥

హే మధుసూదనా! ఇక్కడ అధియజ్ఞం ఎవరు? అతను ఈ శరీరంలో ఎలా ఉన్నాడు? దీని వలన నిరూపితమయ్యే అధియజ్ఞం అంటే యజ్ఞం యొక్క అధిష్ఠాత. అతను మనుష్య శరీరంపై ఆధారపడినవాడు. సమాహితమైన చిత్తంగల పురుషునిచే చివరి సమయంలో మీరు ఏ ప్రకారంగా తెలుసుకోబడతారు? ఈ ఏడు ప్రశ్నలకు క్రమంగా సమాధానమిస్తూ యోగేశ్వరుడు ఇలా అన్నాడు –

శ్రీభగవానువాచ-

//శ్లో // అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మముచ్యతే ।
భూతభావోద్భవకరో విసర్గః కర్మ సంజ్ఞితః ॥3॥

'అక్షరం బ్రహ్మ పరమం'- ఏదైతే అక్షయమో, ఏదైతే క్షయం కాదో, అదే పరబ్రహ్మము. ''స్వభావః అధ్యాత్మం ఉచ్యతే,'' స్వయంలో స్థిర భావమే అధ్యాత్మం, అంటే ఆత్మ యొక్క ఆధిపత్యం. దీనికంటే ముందు అందరూ మాయయొక్క ఆధిపత్యంలో ఉంటారు. కానీ ఎప్పుడైతే 'స్వ' భావం అంటే స్వరూపంలో స్థిర భావం (స్వయంలో స్థిర భావం) దొరుకుతుందో అప్పుడు ఆత్మ యొక్క ఆధిపత్యం అందులో ప్రసరణమవుతుంది. ఇదే అధ్యాత్మం, అధ్యాత్మం యొక్క పరాకాష్ఠ. 'భూత భావోద్భవకరః'- ఏదో ఒకటి ఉద్భవింపచేసే భూతాల యొక్క ఆ భావాలు, అంటే ప్రాణుల యొక్క ఆ సంకల్పాలు, మంచి లేక చెడు సంస్కారాలను పుట్టిస్తాయి. వాటి విసర్జనం, అవి నశించి పోవడమే కర్మ యొక్క పరాకాష్ఠ ఇదే సంపూర్ణ కర్మ, దీనిని గురించి యోగేశ్వరుడు అన్నాడు- అతను సంపూర్ణ కర్మను తెలుసుకొంటాడు. అక్కడ కర్మ పూర్తవుతుంది, ఆ పిదప దాని (నియత కర్మ) అవసరం ఉండదు. ఈ అవస్థలో భూతాలలోని ఆ భావాలు ఏవైతే ఏదో ఒకటి సృష్టిస్తాయో, మంచి, లేక చెడు సంస్కారాలను కూడ బెడతాయో, తయారు చేస్తాయో, అవి ఎప్పుడైతే శాశ్వతంగా శమనమై పోతాయో, అదే కర్మ యొక్క సంపూర్ణత, దాని తరువాత కర్మ చేయవలసిన అవసరం ఉండదు. అంటే కర్మ ఎలాంటి వస్తువంటే, భూతాలలోని సంపూర్ణ సంకల్పాలను, ఏదో ఒక సంస్కారాలను సృష్టి చేసే వాటిని నాశనం చేస్తుంది. కర్మ (ఆరాధన) అంటే అర్థం చింతన, అది యజ్ఞంలో ఉంది.

శ్లో // అధి భూతం క్షరో భావః పురుషశ్చాధి దైవతం ।
అధి యజ్ఞోఽహమేవాత్ర దేహే దేహభృతాం వర ॥4॥

ఎప్పటి వరకూ అక్షయ భావం లభించదో, అప్పటి వరకూ వినష్టమయ్యే సంపూర్ణ క్షర భావం 'అధిభూతం' అంటే భూతాల యొక్క అధిష్ఠానం. అదే భూతాల యొక్క ఉత్పత్తికి కారణం. 'పురుషః చ అధి దైవతం' మరియు ప్రకృతి కంటే అతీతమయిన పరమ పురుషుడే అధిదైవం అంటే సంపూర్ణ దైవాల (దైవీ సంపద) యొక్క అధిష్ఠాత. దైవీ సంపద ఆ పరమ దేవునిలోనే విలీన మయిపోతుంది. దేహధారులలో శ్రేష్ఠుడైన అర్జునా ! ఈ మనుష్య తనువులో నేనే 'అధియజ్ఞం' అంటే యజ్ఞాల యొక్క అధిష్ఠాతను. అంటే ఈ శరీరంలో అవ్యక్త స్వరూపంలో స్థితుడైన మహాపురుషుడే అధియజ్ఞం; శ్రీకృష్ణుడు ఒక యోగి. అతనే సంపూర్ణ యజ్ఞాల భోక్త, చివరిలో యజ్ఞాలు అతనిలోనే ప్రవేశం పొందుతాయి. అదే పరమస్వరూపం. ఈప్రకారంగా అర్జునుని యొక్క ఆరు ప్రశ్నలకు సమాధానాలు ఇవ్వబడ్డాయి. ఇప్పుడు చివరి ప్రశ్న, ''అంతమయ్యేకాలంలో ఎప్పటికీ విస్మృతి పథంలో పోనట్లు మీరు ఏ విధంగా తెలియబడతారు?'' అన్న దానిపై యోగేశ్వరుడు శ్రీకృష్ణుడు అంటాడు-

శ్లో ॥ అంతకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కలేబరమ్ ।
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః ॥5॥

ఏ పురుషుడైతే అంత్యకాలంలో అంటే మనస్సు నిరోధం మరియు విలీన కాలంలో నన్నే స్మరించుతూ, శరీరంతో సంబందాన్ని వదలి, వేరయిపోతాడో, అతను 'మద్భావం'- సాక్షాత్తు నా స్వరూపాన్నే పొందుతాడు. ఇందులో సంశయం లేదు.

శరీరం మరణించడం అసలైన అంత్యకాలం కాదు. మరణించిన తరువాత కూడా శరీరాల క్రమం వెంబడించే ఉంటుంది. సంచితమైన సంస్కారాలు ఎల్లప్పటికీ నశించి పోవడంతో బాటే మనస్సు నిరోధించబడుతుంది. మరియు ఆ మనస్సు కూడా ఎప్పుడు విలీనం అయిపోతుందో, అప్పుడే అంత్యకాలం అనబడుతుంది. దాని తరువాత శరీరాల్ని ధరించవలసిన అవసరం ఉండదు. ఇది క్రియాత్మకమైనది, కేవలం చెప్పడంచే గానీ. సంభాషణంగా వినడంచే గానీ అర్థం కాదు. ఎప్పటి వరకూ వస్త్రాల లాగానే శరీరాల పరివర్తనం జరుగుతుంటే, శరీరం యొక్క అంతం ఎక్కడ అయింది? మనస్సును నిరోధించి మరియు నిరోధించబడిన మనస్సు కూడా విలీనమయ్యే కాలంలో, జీవించుతూ ఉండగానే శరీరంతో సంబంధం విచ్ఛిన్నమయిపోతుంది. మరణించిన తరువాత గనుక యీ స్థితి లభించేదయితే, శ్రీకృష్ణుడు కూడా పూర్ణ వ్యక్తి కాలేడు. అతను అంటాడు -అనేక జన్మల అభ్యాసంచే ప్రాప్తి పొందిన జ్ఞాని, సాక్షాత్తు నా స్వరూపమే. నేనే అతను. అతను నాలో ఉన్నాడు. లేశ మాత్రం కూడా అతనిలోనూ మరియు నాలోనూ తేడా లేదు. ఇదే జీవించుతూ ఉండగానే ముక్తి పొందడం. ఇంకెప్పుడూ మళ్ళీ శరీరధారణ చేయకపోవడమే. అదే శరీరం యొక్క అంతం.

ఇది వాస్తవిక శరీరం అంతం గురించిన వివరణ. దీని తరువాత జన్మ నెత్తవలసిన అవసరం లేదు. రెండవ రకమైన శరీరాంతం మృత్యువు, ఇది లోకంలో ప్రచలితమైంది, కానీ ఈ శరీరాంతం తరువాత జన్మ నెత్తవలసి వస్తుంది.

శ్లో ॥ యం యం వాపి స్మరం భావం త్యజత్యంతే కలేవరం ।
తం తమేవైతి కౌన్తేయ సదా తథ్భావ భావితః ॥6॥

కౌన్తేయా! మృత్యు సమయంలో మనుష్యుడు ఏ భావాన్ని స్మరిస్తూ శరీరాన్ని విడిచి వేస్తాడో, అతను ఆభావాన్నే పొందుతాడు. అలాంటప్పుడిది చాలా చవక బేరం. జీవితకాలమంతా భోగాలు అనుభవిద్దాం, చనిపోయేటప్పుడు భగవంతుని స్మరణ చేద్దాం. కానీ శ్రీకృష్ణుడు అంటాడు- 'అలా జరగదు' 'సదా తద్భావ భావితః'- ఆ భావం యొక్క చింతనే చేయగలుగుతాడు, ఏదైతే యావజ్జీవం చేశాడో. అది తప్ప యింకొకటి స్మరణకు రాదు. అందుచేత-

శ్లో ॥ తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్యచ ।
మయ్యర్పితమనోబుద్ధి ర్మామేవైష్యస్య సంశయం ॥7॥

కాబట్టి అర్జునా! నువ్వు ఎల్లప్పుడు నన్నే స్మరిస్తూ యుద్ధం చెయ్యి. నాకై అర్పితమయిన మనస్సు, బుద్ధులతో యుక్తమైన నీవు నిస్సందేహంగా నన్నే పొందుతావు.

నిరంతరం చింతన మరియు యుద్ధం ఒకేసారి ఎలా సంభవం అవుతాయి? నిరంతరం చింతన మరియు యుద్ధం అనే దాని స్వరూపం 'జయము జయము కన్నయ్యా','జయము జయము భగవంతుడా' అంటూ బాణాల్ని వదలడము కాదు. కానీ స్మరణ స్వరూపాన్ని తరువాత శ్లోకంలో స్పష్టం చేస్తూ, యేగేశ్వరుడైన శ్రీకృష్ణుడు అంటాడు-

శ్లో॥ అభ్యాస యోగ యుక్తేన చేతసా నాన్య గామినా ।
పరమం పురుషం దివ్యం యాతి పార్థాను చింతయన్ ॥8॥

హే పార్థా! ఆ స్మరణ కోసం, యోగం యొక్క అభ్యాసంతో యుక్తుడవై ('నా చింతన' మరియు యోగం యొక్క అభ్యాసం' అనేవి పర్యాయాలు) నన్ను కాదని యింకో వైపుకు వెళ్ళని చిత్తంతో నిరంతరం చింతన చెయ్యి. అలా చేసేవాడు పరమ ప్రకాశస్వరూపుడైన దివ్య పురుషుణ్ణి అంటే పరమాత్ముణ్ణి పొందుతాడు. ఈ పెన్సిలే భగవంతుడు అనుకోండి, అపుడు ఇది కాక యింకే వస్తువు యొక్క స్మరణ రారాదు. దీని చుట్టు పక్కల మీకు పుస్తకం కనిపించినా సరే, యింకేది కనిపించినా సరే, అప్పుడు మీ స్మరణ ఖండిత మయిపోయింది. స్మరణ అనేది యింత సూక్ష్మమైనప్పుడు, యిష్టదైవాన్ని తప్పించి యింకే వస్తువు స్మరణ కూడా రాకూడదో, మనస్సులో అలలు కూడా లేవ కూడదో, అప్పుడు స్మరణ మరియు యుద్ధం రెండూ ఒకేసారి ఎలా సాధ్యపడతాయి? వాస్తవానికి ఎప్పుడైతే మీరు చిత్తాన్ని అన్ని వైపుల నుంచీ లాక్కొచ్చి, మీ యొక్క ఆరాధ్య దైవం యొక్క స్మరణలో ప్రవృత్తులవుతారో, అప్పుడు ఆ సమయంలో మాయా ప్రవృత్తులు- కామ-క్రోధాలు, రాగ ద్వేషాలు అడ్డు గోడల రూపంలో ముందు ప్రత్యక్షమవుతాయి. మీరు స్మరణ చేస్తారు, కానీ అవి మీ లోపల ఉద్వేగాన్ని పుట్టిస్తాయి, మీ మనస్సు స్మరణ ప్రక్రియనుంచి పలాయనం చేయాలని చూస్తుంది. ఈ బాహ్య ప్రవృత్తులపై విజయం పొందటమే యుద్ధం. నిరంతర చింతన ద్వారానే వీటిని అంతం చేయవచ్చు. కాబట్టే నిరంతరం చింతనతో బాటే యుద్ధం సంభవం. గీతలోని ఒక్క శ్లోకం కూడా బయటి వారిని చంపడం-నరకడాలను సమర్థించదు. చింతన ఎవరిని గురించి చేయాలి? దీనిని గూర్చి అంటాడు-

శ్లో॥ కవిం పురాణ మనుశాసితారమణోరణీయాం సమనుస్మరేధ్యః।
సర్వస్వధాతా రమచింత్య రూపమాదిత్యవర్ణం తమసః పరస్తాత్ ॥9॥

ఆ యుద్ధంతో బాటుగా ఆపురుషుడు సర్వజ్ఞుడైన, అనాది అయిన, అందరికీ నియంత అయిన, సూక్ష్మమైన, అందరి లాలన పాలన చేయువాడైన, అచింత్యుడైన (ఎప్పటి వరకు చిత్తము మరియు చిత్తంలో కోరికలు ఉంటాయో, అంత వరకూ అతను కనిపించడు. చిత్తం యొక్క నిరోధం మరియు విలీన కాలంలోనే విదితమవుతాడు) నిత్య ప్రకాశ స్వరూపుడైన మరియు అవిద్య కంటే అతీతమైన ఆ పరమాత్ముని స్మరిస్తాడు. ఇంతకు ముందు అన్నాడు- నాయొక్క చింతన చేస్తాడు. ఇక్కడ ''పరమాత్ముడి యొక్క స్మరణ'' అని అంటాడు. అందుచేత ఆ పరమాత్ముని చింతన (ధ్యానం) యొక్క మాధ్యమం తత్త్వస్థితుడయిన మహాపురుషుడే. ఇదే క్రమంలో-

శ్లో ॥ ప్రయాణకాలే మనసాऽచలేన
భక్త్యాయుక్తో యోగబలేన చైవ।
భ్రువోర్మధ్యే ప్రాణ మావేశ్య సమ్యక్
స తం పరం పురుష ముపైతి దివ్యం॥ 10॥

ఎవరైతే నిరంతరం ఆ పరమాత్మని స్మరణ చేస్తాడో, ఆ భక్తి యుక్తుడైన పురుషుడు 'ప్రయాణకాలే' మనస్సు విలీన దశలో, యోగబలంచే అంటే ఆ నియత కర్మ యొక్క ఆచరణ ద్వారా, భ్రుకుటి మధ్యలో ప్రాణాన్ని చక్కగా నిలవరించి (ప్రాణాపానాలను చక్కగా సమంచేసి, లోపలి నుంచి ఉద్వేగం పుట్టకుండా, బాహ్య సంకల్పాలను గ్రహించకుండా, సాత్త్వికం-రాజస - తామసాలు చక్కగా శాంతమై పోగా ధ్యానం ఇష్టదైవంలోనే స్థితమైపోయే, కాలంలో) అచంచలమయిన మనస్సు అంటే స్థిరబుద్ధిగల పురుషుడు ఆ దివ్యపురుషుడైన పరమాత్మణ్ణి పొందుతాడు. కాబట్టి గుర్తుంచుకోవలసిందేమిటంటే ఆ పరమాత్మని ప్రాప్తి విధానం ఒక్క యోగం మాత్రమే. దానికై నియత క్రియ ఆచరణమే యోగక్రియ. దానిని సవిస్తరంగా వర్ణన యోగేశ్వరుడు నాలుగు, ఆరు అధ్యాయాలలో చేశాడు. ఇప్పుడు అతను అన్నాడు- 'నిరంతరం నన్నే స్మరించు'. స్మరించడం ఎలా? అంటే ఈ యోగ ధారణలో స్థిరంగా ఉంటూ స్మరించాలి. అలా చేసేవారు దివ్యపురుషుణ్ణే పొందుతారు, అతను ఇంకెప్పుడూ విస్మృతి పొందడు. 'మీరు ప్రయాణ కాలంలో ఎలా తెలుసుకోబడతారనే ప్రశ్నకు యిక్కడ సమాధానం పూర్తయింది. పొందవలసిన పదవి వివరణ చూద్దాం. ఇది గీతలో చాలా చోట్ల వచ్చింది.

శ్లో ॥ యదక్షరం వేదవిదో వదంతి
విశంతి యద్యతయో వీతరాగాః।
యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి
తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే ॥ 11॥

'వేదవిద్' అంటే అవిదిత తత్త్వాన్ని ప్రత్యక్షంగా తెలుసుకొనే వారు ఏ పరమ పదాన్ని 'అక్షరం'- అక్షయమంటారో, వీతరాగ మహాత్ములు దేనిలో ప్రవేశాన్ని కోరుతారో, ఏ పరమ పదాన్ని కోరుకుంటూ, బ్రహ్మచర్యం వ్రత పాలన చేస్తారో (బ్రహ్మచర్యం అంటే జననేంద్రియాలను మాత్రం నిరోధించడమని కాదు, 'బ్రహ్మ ఆచరతి స బ్రహచారీ' బాహ్య స్పర్శలను మనస్సు నుంచి త్యజించివేసి, బ్రహ్మ యొక్క నిరంతర చింతనయే బ్రహ్మచర్యము. అది బ్రహ్మ దర్శనం చేయించి అతనిలో స్థానం యిప్పించి శాంతమై పోతుంది. ఈ ఆచరణ వలన యింద్రియ సంయమమే కాకుండా, సకలేంద్రియ సంయమనం స్వతహాగా జరిగిపోతుంది. ఈ ప్రకారమైన ఆచరణ బ్రహ్మచర్యం) ఏదైతే హృదయంలో కూడబెట్టడానికి యొగ్యమైనదో, ధారణచేయడానికి యోగ్యమైనదో, ఆ పదవి గురించి నేను నీకు చెప్తాను. ఆ పదవి ఏమిటి? దానిని ఎలా పొందవచ్చు? దీనిని గురించి యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు ఇలా అంటాడు-

శ్లో || సర్వద్వారాణి సంయమ్య మనోహృది నిరుధ్యచ ।
మూర్థ్న్యాధాయాత్మనః ప్రాణమాస్థితో యోగధారణామ్ || **12**||

ఇంద్రియ ద్వారాలనన్నింటినీ మూసివేసి, అంటే కోరికల నన్నింటినీ త్యజించి వేసి, మనస్సును హృదయంలో స్థిరం చేసి (ధ్యానం హృదయంలోనే చేయబడుతుంది, బయట కాదు. పూజ బయట చేయబడదు) ప్రాణం అనగా అంతః కరణం యొక్క వ్యాపారాన్ని మస్తిష్కంలో నిరోధించి, యోగధారణలో స్థితమై (యోగాన్ని ధారణ చేసి ఉండాలి, ఇంకో మార్గం లేదు) ఈ ప్రకారంగా–

శ్లో || ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్।
యః ప్రయాతి త్యజందేహం స యాతి పరమాంగతిం || **13**||

ఏ పురుషుడైతే 'ఓం ఇతి' అక్షర బ్రహ్మ యొక్క పరిచాయకమైన 'ఓం ని జపిస్తూ, నన్నే స్మరిస్తూ శరీరాన్ని త్యాగం చేస్తాడో, ఆ పురుషుడు పరమగతిని పొందుతాడు. శ్రీకృష్ణుడు ఒక యోగేశ్వరుడు, పరమతత్త్వంలో స్థితుడైన మహాపురుషుడు, సద్గురువు. యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు అన్నాడు– 'ఓం' అక్షయ బ్రహ్మ యొక్క పరిచాయకము, నీవు దానిని జపించు. మరియు నన్ను ధ్యానించు, పరమబ్రహ్మను పొందిన ప్రతి మహాపురుషుని పేరు, అతను ప్రాప్తి పొందిన విలీనమయిన, అదే 'ఓం' అవుతుంది. కాబట్టే పేరు 'ఓం' అని చెప్పాడు. మరియు తన రూపు చూడమన్నాడు. యోగేశ్వరుడు 'కృష్ణా కృష్ణా' అని జపించమని చెప్పలేదు, తరువాతి కాలంలో భావుకులు అతని పేరు (శ్రీకృష్ణుని పేరు) కూడా జపించడం ఆరంభించారు మరియు వారు తమ శ్రద్ధకి అనుగుణంగా ఫలాన్ని కూడా పొందుతారు. ఎలాగంటే మనుష్యులకు శ్రద్ధ ఎక్కడ ఏర్పడుతుందో, అక్కడ నేనే అతని శ్రద్ధను దృఢం చేస్తాను. మరియు నేనే ఫలాన్ని కూడా ఇస్తాను.

భగవంతుడు శివుడు 'రామ' శబ్దాన్ని జపించడం గూర్చి వివరించాడు. **'రమంతే యోగినః యస్మిన్ సరామ:' 'రా ఔర్ మ కే బీచ్ మే కబిరా రహా లుకాయ.'** 'రా' మరియు 'మ' ఈ రెండు అక్షరాల మధ్య తన మనస్సుని నిలపడంలో కబీరు సమర్థుడయ్యాడు.

శ్రీకృష్ణుడు 'ఓం' గూర్చి వివరించాడు. 'ఓహాం స ఓం' అంటే ఆ శక్తి నాలోనే ఉంది, బయట ఎక్కడా వెతకొద్దు. ఈ 'ఓం' కూడా ఆ పరమ సత్తా యొక్క పరిచయం యిప్పించి, శాంతమయి పోతుంది. వాస్తవానికి ఆ ప్రభువుకి అనంతమైన పేర్లు ఉన్నాయి. కానీ జపం చేయడానికి చిన్నగా ఉన్న పేర్లే సార్థకాలు. శ్వాసలో ఇమిడి పోయేవి మరియు ఒక పరమాత్ముణ్ణే సంబోధించేవి అయి ఉండాలి. వాటి కన్నా భిన్నమైన దేవీ-దేవతలనే అవివేక పూర్ణమైన కల్పనలలో ఇరుక్కుని లక్ష్యం నుంచి దృష్టి మళ్ళించకండి.

'పూజ్య గురువుగారు' అనేవారు– నా రూపాన్ని చూడండి. మరియు మీమీ శ్రద్ధానుసారంగా ఏదో రెండు-రెండున్నర అక్షరాలుగల పేరు – 'ఓం', 'రామ', 'శివ' వంటి వాటిలో ఏదో ఒకటి జపించండి. దాని చింతన చేయండి. మరియు దాని అర్థ స్వరూపమైన ఇష్ట దేవుని స్వరూపాన్ని ధ్యానించండి. ''ధ్యానం సద్గురువుదే చేయబడుతుంది. మీరు రామ, కృష్ణా

లేక 'వీతరాగ విషయం వా చిత్తం' వీతరాగ మహాత్ముల లేక 'యథాభిమతధ్యానాద్వా' (పాతంజల యోగశాస్త్రం 1/37,39) ఎవరిదైన స్వరూపాన్ని ఆశ్రయించుకోండి, వారు అనుభవంలో మిమ్ములను కలుస్తారు. మిమ్మల్ని సమకాలీనులయిన సద్గురువు వైపు నడిపిస్తారు, వారి మార్గదర్శనంలో మీరు మెల్ల మెల్లగా ప్రకృతి యొక్క క్షేత్రాన్ని అధిగమిస్తూ పోతారు. నేను కూడా ప్రారంభంలో ఒక దేవత (కృష్ణుని విరాట్ రూపం) యొక్క చిత్రాన్ని ముందుంచుకొని ధ్యానం చేసే వాడిని, కానీ పూజ్య గురువుగారి అనుభవ పూర్ణమైన ప్రవేశంతో బాటు అది శాంతమయిపోయింది.

ప్రారంభంలో సాధకుడు నామాన్ని జపిస్తాడు, కానీ మహాపురుషుని స్వరూపాన్ని ధ్యానం చేయడంలో వెనకాడతాడు. వారు తాము ఆర్జించిన భావాల్ని వదలి పెట్టలేరు. వారు యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు నిషేధించిన అన్య దేవతలని ద్యానం చేస్తారు. అందుచేత పూర్ణ సమర్పణ భావంతో బాటు ఎవరైనా అనుభవం గల మహాపురుషుని శరణు పొందాలి. పుణ్యం పురుషార్థం ధృఢమవుతూనే, కుతర్కాలు నశించుతాయి. మరియు యధార్థ క్రియలో ప్రవేశం లభిస్తుంది. యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు చెప్పినట్లుగా ఈ ప్రకారంగా 'ఓం' శబ్దాన్ని జపించాలి. మరియు పరమాత్ముని స్వరూపుడైన సద్గురువు యొక్క స్వరూపాన్ని నిరంతరం స్మరిస్తే మనస్సు నిరోధించబడుతుంది. మరియు విలీనం అవుతుంది మరియు అదే క్షణంలో శరీర సంబంధం త్యజించబడుతుంది. మరణించినంత మాత్రాన శరీరం వెంటబడటం మానదు.

శ్లో ॥ అనన్య చేతాః సతతం యో మాం స్మరతి నిత్యశః ।
తస్యాహం సులభః పార్థ నిత్య యుక్తస్య యోగినః ॥ **14**॥

''నేను తప్పించి వేరేవరూ చిత్తంలో లేనే లేరు''– అటువంటి వేరేవరి చింతనా చేయనట్టి మరియు అనన్య చిత్తంలో స్థిరమై ఎవరైతే నిరంతరం నన్ను స్మరిస్తాడో, అటువంటి నాలోనే నిత్యయుక్తుడైన యోగికి నేను సులభమైనవాడిని. పరమాత్ముడు సులభమగుట వలన ఏమి దొరుకుతుంది?

శ్లో ॥ మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయమశాశ్వతమ్ ।
నాప్నువంతి మహాత్మానః సంసిద్ధిం పరమాం గతాః ॥ **15**॥

నన్ను పొంది, వారు దుఃఖాలకు ఆకరమై, క్షణ భంగురమైన పునర్జన్మను పొందరు. పరమ సిద్ధిని పొందుతారు, అంటే నన్ను పొందడం (లేక) పరమసిద్ధిని పొందడం అనేవి ఒకటే. ఒక్క భగవంతుణ్ణి పొందితేనే ఆ పురుషుడు పునర్జన్మను పొందడు. మరి పునర్జన్మ యొక్క హద్దు ఎంత వరకు?

శ్లో ॥ ఆ బ్రహ్మ భువనాల్లోకాః పునరావర్తినోఽర్జున ।
మాముపేత్యతుకౌంతేయ పునర్జన్మ న విద్యతే ॥ **16**॥

అర్జునా! బ్రహ్మ నుంచి–క్రిమి–కీటకాదుల వరకూ అన్ని లోకాలూ పునరావర్తమయ్యేవే, జన్మ నెత్తడం మరియు మరణించడం మరియు మళ్ళీ మీళ్ళీ ఇదే క్రమంలో కొనసాగుతుంటాయి. కానీ కౌంతేయా! నన్ను పొందిన ఆ పురుషుడు పునర్జన్మ నెత్తడు.

ధర్మ గ్రంథాలలోని లోక-లోకాంతరాల పరికల్పనలు, ఈశ్వర పథంలోని విభూతులను బోధ పరిచే ఆంతరికమైన అనుభవాలు (లేక) రూపకాలు మాత్రమే. అంతరిక్షంలో క్రిములు కరిచే గొయ్యి (నరకం) లేదు మరియు స్వర్గమనబడే మహలూలేదు. దైవీ సంపదతో యుక్తుడైన మనుష్యుడే దేవత మరియు అసరీ సంపదతో యుక్తుడైన మనుష్యుడే అసురుడు. శ్రీకృష్ణుని సొంత బంధువులైన కంసుడు మరియు బాణాసురుడు దైత్యులు. దేవ, మానవ, తిర్యక్ యోనులే విభిన్న లోకాలు. శ్రీకృష్ణుడు చెప్పినట్లుగా జీవాత్మ మనస్సహితంగా ఐదు ఇంద్రియాలతో బాటు, జన్మ-జన్మాంతరాల సంస్కారాలకు అనుగుణంగా క్రొత్త శరీరాలను ధరించుతుంది.

అమరులనబడే దేవతలు కూడా మరణధర్ములే (చనిపోయేవారే). 'క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి'. ఇంత కన్న గొప్ప నష్టం ఇంకోటుందా? పుణ్యం కూడా సమాప్తమయి పోయే దేవతా శరీరం దేనికి పనికి వస్తుంది? దేవ లోకం, పశులోకం, క్రిమి-కీటకాల లోకం భోగాలు అనుభవించడానికి ఉన్న లోకాలు మాత్రమే. కేవలం మనుష్యుడు మాత్రమే కర్మల యొక్క రచయిత. వాటి ద్వారా అతను ఆ పరంధాముణ్ణి కూడా పొందగలడు, అక్కడి నుంచి పునరావృత్తి ఉండదు. యథార్థమైన కర్మను ఆచరించి మనుష్యుడు దేవతగా కావచ్చు, బ్రహ్మ యొక్క స్థితిని కూడా పొందవచ్చు, కానీ ఎప్పటి వరకూ అతనుమనస్సును నిరోధించి మరియు నిరోధించడంతో బాటు పరమాత్ముని సాక్షాత్కారం చేసుకొని, అదే పరమభావంతో ఆ స్థితిని పొందడో అంత వరకూ, అతను పునర్జన్మ నుంచి తప్పించుకోలేడు. ఉపనిషత్తులు కూడా ఇదే సత్యాన్ని ఉద్ఘాటించి చెపుతాయి. ఉదాహరణకై

శ్లో // యదా సర్వే ప్రముచ్యంతే కామా యే ऽ స్య హృది స్థితాః ।
అథ మర్త్యోమృతో భవత్యత్ర సమశ్నుతే ॥

(కఠోపనిషత్తు-2/3/14)

ఎప్పుడైతే హృదయంలో ఉన్న సమస్త కోరికలూ సమూలంగా నశించి పోతాయో, అప్పుడే మరణ ధర్ముడైన మనుష్యుడు అమరుడవుతాడు. ఇక్కడే, ఈ ప్రపంచంలో, ఈ మనుష్య శరీరంతోనే పరబ్రహ్మ- సాక్షాత్కార- అనుభవాన్ని పొందుతాడు.

ఇక్కడ ప్రశ్నేమిటంటే బ్రహ్మకూడా మరణ ధర్ముడేనా, (మరణించేవాడేనా)? అని, మూడో అధ్యాయంలో యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు ప్రజాపతి బ్రహ్మ యొక్క ప్రసంగంలో ఏం చెప్పాడంటే, ప్రాప్తిని పొందిన తర్వాత బుద్ధి ఒక యంత్రం మాత్రంగానే ఉండిపోతుంది. దాని ద్వారా పరమాత్ముడే వ్యక్తమవుతాడు. అలాంటి మహాపురుషుల ద్వారానే యజ్ఞం యొక్క సంరచన చేయబడింది; మరి ఇక్కడ అంటాడు- 'బ్రహ్మ' స్థితిని పొందిన వారు కూడా పునరావర్తులే. యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు ఏం చెప్పాలను కొంటున్నాడు?

వాస్తవానికి ఏ మహాపురుషుల ద్వారా పరమాత్ముడే వ్యక్తమవుతాడో ఆ మహాపురుషుల బుద్ధి కూడా బ్రహ్మ కాదు, కానీ లోకులకు ఉపదేశం చేసే కారణం వలన, కళ్యాణానికి సూత్రపాదులయ్యే కారణంగా బ్రహ్మ అనబడతారు. స్వయంగా వారు

బ్రహ్మకాదు. వారి దగ్గర తమదంటూ బుద్ధి వుండనే వుండదు. కానీ దానికి ముందు సాధనా కాలంలో బుద్ధే బ్రహ్మ. ''అహంకారశివ, బుద్ధి అజ, మన శశి, చిత్త మహాన్'.

సాధారణ మనుష్యుని బుద్ధి బ్రహ్మ కాదు. బుద్ధి ఎప్పుడైతే యిష్టదైవంలో ప్రవేశించడం మొదలెడుతుందో, అప్పటి నుంచి బ్రహ్మ రూపుదిద్దు కోవడం మొదలవుతుంది, దానికి నాలుగు సోపానాలు అని మునీషులు అన్నారు. ఇంతకు ముందు మూడో అధ్యాయంలో ఇవి చెప్పబడ్డాయి, మళ్ళీ ఒకసారి జ్ఞాపకం చేసుకుందాం. బ్రహ్మవిదుడు, 'బ్రహ్మ విద్వరుడు, బ్రహ్మ విద్యరియానుడు, బ్రహ్మ విద్వరిష్టుడు ; బ్రహ్మవిద్యతో సంయుక్తమై ఉన్న బుద్ధి గలవానిని బ్రహ్మవిదుడు అంటారు. బ్రహ్మవిద్యలో శ్రేష్ఠతను పొందిన వాడిని బ్రహ్మవిద్వరుడు అంటారు. బ్రహ్మవిద్యలో దక్షతతో బాటుగా దాని నియంత్రణ చేసేవాడు, సంచాలకుడు అయిపోయినవాడిని బ్రహ్మవిద్వారీయానుడంటారు. బ్రహ్మ విద్వరిష్టుడు అంటే ఇష్టదైవం ప్రవాహితమయ్యే బుద్ధి యొక్క అంతిమ అవస్థ. ఇక్కడి వరకు బుద్ధి యొక్క అస్తిత్వం ఉంటుంది, ఎందుకంటే ప్రవాహితమయ్యే యిష్టదైవం వేరుగానూ, గ్రహణ కర్తయిన బుద్ధి వేరుగానూ ఉంటాయి. ఇప్పుడింకా అతను ప్రకృతి యొక్క సరిహద్దులోనే ఉన్నాడు, ఇలాంటి శ్రేష్ఠదశను పొందిన పురుషుడు కూడా పునర్జన్మ యొక్క పరిధిలోనే ఉన్నాడు. ఎప్పుడు స్వయం ప్రకాశ స్వరూపంలో బుద్ధి (బహ్మ) ఉంటుందో, జాగృతమై ఉంటుందో, అప్పుడు సంపూర్ణ భూతాలు (చింతన యొక్క ప్రవాహం) జాగృతమై ఉంటాయి. అవిద్యలో ఉన్నప్పుడు అచేతనమై ఉంటంది. దీనినే ప్రకాశం మరియు అంధకారం, పగలు మరియు రాత్రి అని సంబోధించడమవుతుంది.

బ్రహ్మ అంటే బ్రహ్మ విద్వేత్త అంటే యిష్టదైవం ప్రవాహితమయ్యే శ్రేణిలో ఉన్న, దానిని పొందిన సర్వోత్కృష్టమైన బుద్ధిలో కూడా విద్య (ఏదైతే స్వయం ప్రకాశ స్వరూపమో, అతనితో కలుపుతుందో) అనే పగలు మరియు అవిద్య అనేరాత్రి, ప్రకాశం మరియు అంధకారం యొక్క క్రమం ఉంటుంది. ఇక్కడి వరకూ సాధకునిలో మాయ సఫలమవవచ్చు. ప్రకాశకాలంలో అచేతనంగా ఉండే భూతాలు సచేతనమయి పోతాయి, వారికి లక్ష్యం కనిపించుతుంటుంది మరియు బుద్ధి యొక్క అంతరాళంలో అవిద్య యొక్క రాత్రి ప్రవేశించిన కాలంలో భూతాలన్నీ అచేతనమయిపోతాయి. బుద్ధి దేనినీ నిశ్చయం చేయలేక పోతుంది. స్వరూపం వైపు వెళ్ళడం ఆగి పోతుంది. ఇదే బ్రహ్మ యొక్క పగలు. ఇదే బ్రహ్మ యొక్క రాత్రి. పగటి ప్రకాశంలో బుద్ధి యొక్క వేల ప్రవృత్తులలో ఈశ్వరీయ ప్రకాశం వ్యాప్తిస్తుంది. అవిద్య అనే రాత్రిలో ఈ వేల కొద్ది పొరలలో అచేతనావస్థ యొక్క అంధకారం పులుముకుపోతుంది.

శుభం మరియు అశుభం, విద్యా మరియు అవిద్య ఈ రెండు ప్రవృత్తులూ శాంతమయినప్పుడు అంటే అచేతనం మరియు సచేతనం, రాత్రిలో విలీనం మరియు పగటిలో ఉత్పన్నమయ్యే రెండు రకాల భూతాలు (సంకల్ప ప్రవాహాలు) నశించినప్పుడు, బుద్ధి కంటే కూడా అతి అతీతమైన శాశ్వతమైన అవ్యక్త భావం లభిస్తుంది. అది మళ్ళీ ఎన్నటికీ నష్టం కాదు. భూతాల యొక్క అచేతన సచేతన స్థితులు నశించినప్పుడే ఆ సనాతన భావం లభిస్తుంది.

బుద్ధి యొక్క పై నాలుగు దశలనూ అధిగమించిన పురుషుడే మహాపురుషుడు. అతని అంతరాళంలో బుద్ధి లేదు, బుద్ధి పరమాత్ముని యొక్క ఒక యంత్రంవలె మారి పోయింది. కానీ లోకులకు అతను ఉపదేశం చేస్తాడు, నిశ్చయంగా ప్రేరణ ఇస్తాడు, అందుచేత అతనిలో బుద్ధి ఉన్నట్లుగా అనిపిస్తుంది. కానీ అతను బుద్ధి యొక్క స్థాయి నుంచి అతీతమై పోయినవాడు. అతను పరమ అవ్యక్త భావంలో స్థితుడై ఉన్నాడు. అతనికి పునర్జన్మ లేదు, కానీ ఆ అవ్యక్త స్థితి కంటే ముందు, ఎప్పటి వరకు అతని వద్ద తన బుద్ధి ఉందో, అప్పటి వరకు అతను బ్రహ్మ, అప్పటి వరకు అతను పునర్జన్మ యొక్క పరిధిలోనే ఉంటాడు. ఈ తథ్యాలను వివరిస్తూ యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు ఇలా అంటాడు–

శ్లో // సహస్రయుగ పర్యంత మహర్యద్ బ్రహ్మణో విదుః।
రాత్రిం యుగ సహస్రాంతాం తేఽహోరాత్రవిదో జనాః ॥ **17**॥

ఎవరైతే వేయి చతుర్యుగాల బ్రహ్మ యొక్క రాత్రిని మరియు వేయి చతుర్యుగాల అతని పగటిని సాక్షాత్తుగా తెలుసుకొంటారో, ఆ పురుషులు సమయం యొక్క తత్త్వాన్ని యథార్థంగా తెలుసుకొన్నవారు.

ప్రస్తుత శ్లోకంలో పగలు మరియు రాత్రి అనేవి విద్య మరియు అవిద్యలకు రూపకాలు. బ్రహ్మవిద్యతో సంయుక్తమైన బుద్ధి బ్రహ్మ యొక్క ప్రారంభం మరియు బ్రహ్మ విద్వరిష్ట బుద్ధి బ్రహ్మ యొక్క పరాకాష్ఠ. విద్యచే సంయుక్తమైన బుద్ధే బ్రహ్మయొక్క పగలు. ఎప్పుడైతే విద్య కార్యరతమవుతుందో, ఆ సమయంలో యోగి స్వరూపం వైపుకు అగ్రసరుడవుతాడు. అంతః కరణంలోని వేల ప్రవృత్తులు ఈశ్వరీయ ప్రకాశం యొక్క సంచారంతో జాగృతమవుతాయి. ఈ ప్రకారంగానే అవిద్యా అనే రాత్రి వచ్చినప్పుడు అంతః కరణంలోని వేల ప్రవృత్తులలో మాయ యొక్క ద్వంద్వం ప్రవాహితమవుతుంది. వెలుతురు మరియు అంధకారాల సరిహద్దు యింత వరకే. ఆ తరువాత అవిద్య ఉండదు. మరియు విద్య వుండదు. పరమతత్త్వమైన ఆ పరమాత్ముడు విధితమయిపోతాడు. ఎవరైతే దీనిని తత్త్వంతో సహా తెలుసుకోగలుగుతారో, ఆ యోగీజనులు కాలం యొక్క తత్త్వాన్ని తెలుసుకోగలరు. అంటే
అవిద్య అనే రాత్రి ఎప్పుడు? విద్య అనే పగలు ఎప్పుడు? కాలం యొక్క ప్రభావం ఎంత వరకు ఉంటుంది. (లేక) సమయం ఎంత వరకు వెంటాడుతుంది? మొదలగు విషయాలు తెలుసుకుంటారు.

ప్రారంభంలో మునీషులు అంతఃకరణాన్ని చిత్తము (లేక) అప్పుడప్పుడు బుద్ధి అంటూ సంబోధించేవారు. తరువాతి కాలంలో అంతః కరణాన్ని మనస్సు, బుద్ధి, చిత్తం మరియు అహంకారం అనే నాలుగు ప్రముఖమైన ప్రవృత్తులుగా విభజించారు. వాస్తవానికి అంతఃకరణ యొక్క ప్రవృత్తులు అనంతం. బుద్ధి యొక్క అంతరాళంలోనే అవిద్య అనే రాత్రి అవుతుంది. మరియు ఆబుద్ధిలోనే విద్య అనే పగలు కూడా వస్తుంది. ఇవే బ్రహ్మయొక్క రాత్రిం బగళ్ళు. జగత్తు అనే రాత్రిలో జీవులన్నీ అచేతనంగా పడి ఉంటాయి. ప్రకృతిలో చరిస్తూ, అతని బుద్ధి ఆ ప్రకాశ స్వరూపాన్ని చూడలేక పోతుంది, కానీ యోగాన్ని ఆచరించే యోగులు దీనినుండి జాగృతులయి పోతారు, వారు నిత్య స్వరూపం వైపుకు అగ్రసరులవుతారు.

ఎలాగంటే గోస్వామి తులసీదాసు రామచరిత మానసంలో ఇలా వ్రాశాడు-

**కబహుం దివస్ మహా నివిడతమ్, కబహుక్ ప్రగట్ పతంగ్।**
**బిన సిఇ ఉపజయ గ్యాన్ జిమి, పాయి కుసంగ్-సుసంగ్**

(రామచరిత్/15ఖ)

విద్యతో సంయుక్తమైన బుద్ధి దుస్సంగతిని పొంది అవిద్యగా మార్పు చెందుతుంది. మళ్ళీ సుసంగతిచే విద్య యొక్క సంచారం అదే బుద్ధిలో అవుతుంది. ఈ మార్పులు అనేవి చివరి వరకూ జరుగుతూనే ఉంటాయి. ఇదే బ్రహ్మ యొక్క పగలు, రాత్రి అనే రూపకం. వేల సంవత్సరాల రాత్రి ఉండదు. వేల చతుర్యుగాల పగలూ ఉండదు. ఎక్కడా నాలుగు ముఖాలుగల బ్రహ్మ లేడు. పైన చెప్పిన బుద్ధి యొక్క నాలుగు అవస్థలే బ్రహ్మ యొక్క నాలుగు ముఖాలు. అంతః కరణం యొక్క నాలుగు ప్రముఖ ప్రవృత్తులే అతని చతుర్యుగాలు. రాత్రి, పగలు యీ ప్రవృత్తులలోనే ఉద్భవిస్తాయి. ఏ పురుషుడైతే వీటి భేదాన్ని తత్త్వంతో సహా తెలుసుకోగలడో, ఆ యోగీ జనులు కాలం యొక్క రహస్యాన్ని, కాలం ఎంత వరకు వెంటాడుతుంది మరియు ఏ పురుషుడు కాలంకంటే కూడా అతీత మవగలడు? అనే వాటిని తెలుసుకోగలడు. రాత్రి మరియు పగలు, అవిద్య మరియు విద్యలలో జరిగే కార్యాన్ని శ్రీకృష్ణుడు ఇలా స్పష్టం చేస్తాడు-

శ్లో ॥ అవ్యక్తాద్ వ్యక్తయః సర్వాః ప్రభవంత్య హరాగమే ।
రాత్ర్యాగమే ప్రలీయంతే తత్రైవావ్యక్త సంజ్ఞకే ॥ **18**॥

బ్రహ్మ యొక్క పగలు ప్రవేశించు కాలంలో అంటే విద్య (దైవీ సంపద) ప్రవేశించు కాలంలో, సమస్త ప్రాణులు అవ్యక్త బుద్ధిలో జాగృతమవుతాయి మరియు రాత్రి ప్రవేశించు కాలంలో అదే అవ్యక్త- అదృశ్యబుద్ధిలో జాగృతి యొక్క సూక్ష్మ తత్త్వాలు అచేతనులయిపోతాయి. ఆ ప్రాణులు అవిద్య అనే రాత్రిలో స్వరూపాన్ని స్పష్టంగా చూడలేరు. కానీ వారి అస్తిత్వం ఉంటుంది. జాగృతులవడం (లేక) అచేతనమవడంలో ఆ బుద్ధి మాధ్యమంగా ఉంటుంది, అది అందరిలోనూ అవ్యక్తమయి ఉంటుంది. అది దృష్టి గోచరం కాదు.

శ్లో ॥ భూత గ్రామః స ఏవాయం భూత్వా భూత్వా ప్రవీయతే ।
రాత్ర్యాగమేఽవశః పార్థ ప్రభవత్యహరాగమే ॥ **19**॥

హే పార్థా! ప్రాణులందరూ ఈ ప్రకారంగా జాగృతులై, ప్రకృతి కారణంగా వివశులై, అవిద్యారూపమయిన రాత్రి వచ్చినప్పుడు అచేతనులయి పోతారు. తమ లక్ష్యమేమిటన్నది వారు చూడలేరు. పగలు ప్రవేశించుకాలంలో వారు మళ్ళీ జాగృతులయి పోతారు. ఎప్పటి వరకూ బుద్ధి ఉంటుందో, అప్పటి వరకూ దాని అంతరాళంలో విద్య మరియు అవిద్యల క్రమం జరుగుతూనే ఉంటుంది. అంతవరకూ అతను సాధకుడే, మహాపురుషుడు కాదు.

శ్లో ॥ పరస్తస్మాత్తు భావోఽన్యోఽవ్యక్తో వ్యక్తాత్సనాతనః ।
యః స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి ॥**20**॥

మొదటిది బ్రహ్మ అంటే బుద్ధి అవ్యక్తమయినది. ఇంద్రియాలచే చూడబడదు.

మరియు దీని కంటే కూడా అతీతమైన సనాతన అవ్యక్త భావం ఉంది, అది భూతాలు వినష్టమయి పోయినా కూడా నష్టం కాదు అంటే విద్యలో సచేతమయ్యే మరియు అవిద్యలో అచేతనమయ్యే, పగలు ఉత్పన్నమయ్యే మరియు రాత్రి విలీనమయ్యే భావాలు గల అవ్యక్త బ్రహ్మ కూడా నశించినపుడే ఆ సనాతన అవ్యక్త భావం లభిస్తుంది, అది వినష్టం కాదు. బుద్ధిలో జరిగే పై రెండు మార్పులూ, ఎప్పుడు నశించిపోతాయో, అప్పుడు సనాతన అవ్యక్త భావం లభిస్తుంది, అదే నా 'పరంధామం'. ఎప్పుడైతే సనాతన అవ్యక్త భావం ప్రాప్తమవుతుందో, అప్పుడే బుద్ధి కూడా అదే భావంలో తను లీనమైయిపోతుంది, అదే భావాన్ని ధరించుతుంది. కాబట్టి ఆ బుద్ధి స్వయంగా విలీనమైపోతుంది, దాని స్థానంలో సనాతన అవ్యక్త భావమే అవశేషంగా మిగిలిపోతుంది.

శ్లో ॥ అవ్యక్తోఽక్షర ఇత్యుక్తస్తమాహుః పరమాం గతిం ।
యం ప్రాప్య న నివర్తంతే తద్ధామ పరమం మమ ॥**21**॥

ఆ సనాతన అవ్యక్తభావం అక్షరం అంటే అవినశ్వరం అని అనబడుతుంది. దానినే 'పరమగతి' అంటారు. అదే నా పరమధామం, దానిని పొంది మనుష్యుడు వెనుకకు రాడు. అతనికి పునర్జన్మ ఉండదు. ఈ సనాతన అవ్యక్త భావం యొక్క ప్రాప్తికై విధానాన్ని చూపించుతాడు శ్రీకృష్ణుడు–

శ్లో ॥ పురుషః స పరః పార్థ! భక్త్యా లభ్యస్త్వ నన్యయా ।
యస్యాంతః స్థాని! భూతాని యేన సర్వమిదం తతమ్ ॥**22**॥

పార్థా! ఏ పరమాత్మునిలో సంపూర్ణ భూతాలు ఉన్నాయో, ఎవరిచే సంపూర్ణ జగత్తు వ్యాప్తమై ఉందో, సనాతన అవ్యక్త భావమైన ఆ పరమ పురుషుడు, అనన్య భక్తిచే లభిస్తాడనడం యోగ్యమైనది. అనన్యభక్తి అంటే తాత్పర్యం పరమాత్ముడు గాక ఇంక ఎవరినీ స్మరించకుండా, అతనిలో కలసిపోవడం. అనన్యభావంతో ఉండే పురుషుడు కూడా ఎప్పటి వరకు పునర్జన్మ యొక్క పరిధిలో ఉంటాడు, మరి ఎప్పుడు అతను పునర్జన్మను అతిక్రమించి పోతాడు? అప్పుడు యోగేశ్వరుడు ఇలా అంటాడు–

శ్లో ॥ యత్రకాలే త్వనావృత్తి మావృత్తిం చైవ యోగినః॥
ప్రయాతా యాంతి తం కాలం వక్ష్యామి భరతర్షభ॥**23**॥

హే అర్జునా! ఏ కాలంలో శరీరాన్ని త్యాగం చేసి వెళితే యోగీ జనులు పునర్జన్మ నెత్తరో మరియు ఏ కాలంలో శరీరాన్ని త్యాగం చేస్తే పునర్జన్మ నెత్తుతారో? నేనిప్పుడు ఆ కాలం గురించి వర్ణించుతాను.

శ్లో ॥ అగ్ని ర్జ్యోతిరహః శుక్లః షణ్మాసా ఉత్తరాయణమ్ ।
తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః ॥**24**॥

శరీర సంబంధాన్ని త్యాగం చేసే సమయంలో ఎవరి దగ్గర జ్యోతిర్మయమైన అగ్ని ఉంటుందో, పగటి యొక్క వెలుతురు వ్యాపించి ఉంటుందో, సూర్యుడు ప్రకాశిస్తూ ఉంటాడో, శుక్ల పక్షంలో చంద్రుడు పెరుగుతూ ఉంటాడో, ఉత్తరాయణం యొక్క నిరభ్ర (మేఘాలులేని)

సుందరమైన ఆకాశం ఉంటుందో, ఆ కాలంలో మహా ప్రయాణం చేసే (శరీరత్యాగం చేసే) బ్రహ్మ వేత్తలైన యోగీజనులు బ్రహ్మను పొందుతారు.

అగ్ని బ్రహ్మ తేజస్సుకు ప్రతీక. పగలు విద్య యొక్క ప్రకాశము శుక్ల పక్షం నిర్మలత్వాన్ని తెలియ చేస్తుంది. వివేకం, వైరాగ్యం, శమం, దమం తేజస్సు మరియు ప్రజ్ఞా-ఈ షడైశ్వర్యాలే షణ్మాసాలు, ఊర్ధ్వ రేతస్కమైనస్థితే ఉత్తరాయణం. ప్రకృతి కంటే సర్వదా అతీతమైన ఈ దశలో వెళ్ళే (శరీర త్యాగం చేసే )బ్రహ్మ వేత్తలయిన యోగీ జనులు బ్రహ్మని పొందుతారు. వారికి పునర్జన్మ లేదు, కానీ అనన్య చిత్తంలో ఉన్న యోగీజనులే ఈ ఆలోకాన్ని (ప్రకాశాన్ని) పొందలేకపోతే, సాధన పూర్తికాకపోతే వారిగతి ఏమవుతుంది? దీనిని గురించి ఆయన ఇలా అంటాడు-

శ్లో ॥ ధూమో రాత్రిస్తథా కృష్ణః షణ్మాసా దక్షిణాయనమ్ ।
తత్ర చాంద్రమసం జ్యోతి ర్యోగీ ప్రాప్య నివర్తతే ॥**25**॥

ఎవరి ప్రయాణ కాలంలో (మరణకాలంలో) పొగ వ్యాపించి ఉంటుందో. (యోగాగ్ని ఉండీ (యజ్ఞ-ప్రక్రియలో ఉండే అగ్ని యొక్క స్వరూపం) అది పొగచే ఆచ్ఛాదితమై ఉంటుందో, అవిద్య అనే రాత్రి ఉంటుందో, చీకటి ఉంటుందో, కృష్ణపక్షం యొక్క చంద్రుడు క్షీణమవుతూ ఉంటాడో, నలుపు బహుళంగా ఉంటుందో, షడ్వికారాల (కామం, క్రోధం లోభం మోహం, మదం మరియు మాత్సర్యం)తో యుక్తమైన దక్షిణాయనం అంటే బహిర్ముఖీనమై ఉంటుందో (ఎవరైతే పరమాత్మునిలో ప్రవేశించకుండా, బయటే ఉన్నారో) ఆ యోగి పునర్జన్మ ఎత్తవలసి ఉంటుంది, అంటే శరీరంతో బాటుగా ఆయోగి యొక్క సాధన నష్టమై పోతుందా? దీనిని గురించి యోగేశ్వరుడు ఇలా అంటాడు-

శ్లో ॥ శుక్ల కృష్ణే గతీ హ్యేతే జగతః శాశ్వతే మతే ।
ఏకయా యాత్య నావృత్తిమన్యయాऽవర్తతే పునః ॥**26**॥

పైన చెప్పబడిన శుక్ల మరియు కృష్ణ-రెండు రకాల గతులు జగత్తులో శాశ్వతమైనవి అంటే సాధన ఎప్పటికీ వినాశం కాదు. ఒక (శుక్ల) దశలో ప్రయాణం చేసే (శరీరత్యాగం చేసేవారు) వెనకకు రావలసిన అవసరం లేని పరమగతిని పొందుతారు. మరి రెండో దశలో, క్షీణమైన వెలుతురు మరియు చీకటి ఉంటే అలాంటి దశలో, వెళ్ళిన వారు (మరణించినవారు) వెనకకు తిరిగి వస్తారు, జన్మ నెత్తుతారు. పూర్తి ప్రకాశం లభించనంత వరకూ అతను భజన చేయాల్సిందే. ప్రశ్న పూర్తయింది. ఇప్పుడు దీనికోసం సాధనను గురించి వివరణ ఇలా చెప్తాడు-

శ్లో ॥ నైతే సృతీ పార్థ జానన్యోగీ ముహ్యతి కశ్చన ।
తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున ॥**27**॥

హే పార్థా! ఈ ప్రకారంగా ఈ మార్గాలను తెలుసుకొన్న ఏ యోగి కూడా మోహితుడు కాడు. అతను పూర్ణ ప్రకాశాన్ని పొందినప్పుడు బ్రహ్మను పొందుతానని తెలుసుకుంటాడు.

ప్రకాశం క్షీణంగా ఉన్నప్పటికీ కూడా పునర్జన్మలో సాధన నష్టం కాదని తెలుసుకుంటాడు. రెండు మార్గాలూ శాశ్వతమైనవే. అందుచేత అర్జునా! నీవు అన్ని వేళలా యోగంతో యుక్తుడవు కమ్ము. అంటే నిరంతరం సాధన చెయ్యి.

శ్లో ॥ వేదేషు యజ్ఞేషు తపఃసు చైవ
దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టం ।
అత్యేతి తత్సర్వమిదం విదిత్వా
యోగీ పరం స్థానము పైతి చాద్యం ॥**28**॥

దీనిని సాక్షాత్కార సహితంగా తెలుసుకొని (అనుకొని కాదు) యోగి వేదాలు, యజ్ఞం, తపస్సు, దాన పుణ్యఫలాలను నిస్సందేహంగా అతిక్రమించి పోతాడు, సనాతన పరమపదాన్ని పొందుతాడు. అవిదిత పరమాత్ముని సాక్షాత్తుగా తెలుసుకోవడం, అనేదాని పేరే వేదం. ఆ అవిదిత తత్త్వమే విదితమయిపోయినప్పుడు, ఇంక తెలుసుకోవాల్సింది ఏమిటి? అందుచేత విదితమయిపోయిన పిదప వేదాల వలన కూడా ప్రయోజనం లేకుండా పోతుంది, ఎందుకంటే తెలుసుకొని వారు ఆతత్త్వానికి భిన్నంగా లేరు కదా! యజ్ఞం యొక్క అంటే ఆరాధన, నియత క్రియ యొక్క అవసరం ఉండేది, కానీ ఆ తత్త్వం విదితమయిపోయిన తరువాత ఇంక ఎవరిని భజించాలి? మనస్సు సహితంగా ఇంద్రియాలను లక్ష్యానికి అనుగుణంగా తపింపచేయడమే తపస్సు. లక్ష్యమే సిద్ధించినప్పుడు ఇంక దేనికోసం తపస్సు చేయాలి? మనసా, వాచా, కర్మణా సర్వతోభావంతో సమర్పితం కావాడానికే దానం అని పేరు. వీటి అన్నింటి పుణ్య ఫలం– 'పరమాత్ముని ప్రాప్తి. ప్రతిఫలం కూడా ఇప్పుడు వేరుగా లేదు కాబట్టి వీటన్నింటి అవసరం యిప్పుడింక లేదు. ఆ యోగి యజ్ఞం, తపస్సు దానాలు మొదలగు వాటి ప్రతిఫలాన్ని కూడా దాటి అతను పరమపదాన్ని పొందుతాడు.

సారాంశం:

ఈ అధ్యాయంలో అయిదు ప్రముఖమైన విషయాలను గురించి ఆలోచించడం జరిగింది, వాటిలో సర్వప్రథమంగా ఏడో అధ్యాయం చివరలో యోగేశ్వరుడు బీజారోపణ చేసిన ప్రశ్నలను స్పష్టంగా అర్థం చేసుకోవాలనే జిజ్ఞాసతో ఈ అధ్యాయం ఆరంభంలోనే అర్జునుడు ఏడు ప్రశ్నలు అడిగాడు– 'భగవాన్! మీరు చెప్పిన బ్రహ్మ ఏమిటి? అధ్యాత్మం ఏమిటి? సంపూర్ణ కర్మ ఏమిటి? అధిదైవం, అధిభూతం మరియు అధియజ్ఞం అంటే ఏమిటి? మరియు అంత్య కాలంలో మీరు ఎప్పటికీ విస్మృతం కాకుండా ఏ ప్రకారంగా తెలుసుకోబడతారు? యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు ఇలా చెప్పాడు– వినాశనం లేని వాడే పరబ్రహ్మ. తనకు లభించే పరమ భావమే అధ్యాత్మం. జీవుడు మాయ యొక్క ఆధిపత్యం నుంచి వెలువడి ఆత్మ యొక్క ఆధిపత్యలోకి వచ్చే విధానమే అధ్యాత్మం. సర్వ భూతాల శుభాశుభ సంస్కారాలను ఉత్పన్నం చేసే, ఆ భావాలు ఆగిపోవడం 'విసర్గః'– నశించిపోవడమే కర్మ యొక్క సంపూర్ణత్వం. ఆ తరువాత కర్మ చేయవలసిన అవసరం ఉండదు. కర్మ సంస్కారాల ఉద్గమాన్నే నశింపచేయగలిగినది.

ఈ ప్రకారంగా క్షరభావం అధిభూతం అంటే నష్టమయ్యే భూతాలను ఉత్పన్నం చేయడానికి సాదనం అవుతుంది. అదే భూతాలకు అధిష్ఠాత. పరమపురుషుడే అధిదైవం అతనిలోనే దైవీ సంపద విలీనమవుతుంది. ఈ శరీరంలో అధియజ్ఞం నేనే. అంటే ఎవరిలోనైతే యజ్ఞం విలీనమవుతుందో, అది నేనే, యజ్ఞం యొక్క అధిష్ఠాతను నేనే. అతను నా స్వరూపాన్నే పొందుతాడు. అంటే శ్రీకృష్ణుడు ఒక యోగి. అధియజ్ఞం ఎలాంటి పురుషుడంటే ఈ శరీరంలోనే ఉంటాడు బయట కాదు. చిట్ట చివరి ప్రశ్న ఏమిటంటే అంతిమ సమయంలో మీరు ఎలా తెలుసుకోబడతారు? అతను అంటాడు– ఎవ్వరైతే నన్ను నిరంతరం స్మరించుతారో, నన్ను తప్పించి ఇంకో విషయ వస్తువులను గురించి ఆలోచించరో మరియు అలా చేస్తూ శరీరం యొక్క సంబంధాన్ని త్యజించి వేస్తారో, వారు సాక్షాత్తు నాయొక్క స్వరూపాన్ని పొందుతారు, వారికి చివరిలో కూడా అదే ప్రాప్తిస్తుంది. శరీరం నశించడంతోటే, అది లభిస్తుందని కాదు. మరణించిన పిదప దొరికేదైతే శ్రీకృష్ణుడు పూర్ణుడై ఉండేవాడే కాదు, అనేక జన్మలు గడచిన తరువాత పొందే జ్ఞాని కూడా అతని స్వరూపాన్ని పొందలేడు. మనస్సు యొక్క నిరోధం మరియు నిరుద్ధమయిన మనస్సు కూడా విలయమయ్యే సమయమే అంత్యకాలం, అక్కడ నుంచి శరీరాలను ఉత్పత్తి చేసే సాధనం నశించి పోతుంది. ఆ సమయంలో అతను పరమభావంలో ప్రవేశం పొందుతాడు. అతడు పునర్జన్మ రహితుడవుతాడు.

ఈ ప్రాప్తికై అతను స్మరణ చేసే విధానాన్ని తెలిపాడు అర్జునా! నిరంతరం నన్నే స్మరించు. యుద్ధం చెయ్యి. రెండు పనులూ ఒకేసారి ఎలా సాధ్యపడతాయి? 'జయగోపాల, హేకృష్ణా' అంటూ, దుడ్డు కర్రను కూడా త్రిప్పుతుంటారేమో? స్మరణ యొక్క స్వరూపాన్ని స్పష్టం చేస్తూ ఇలా అంటాడు– యోగధారణలో స్థిరంగా ఉంటూ, నన్ను తప్ప ఏ ఇతర వస్తువునూ స్మరించక, నిరంతరం నా స్మరణ చెయ్యి. స్మరణ అనేది ఇంత సూక్ష్మమైనప్పుడు యుద్ధం ఎవరు చేస్తారు? ఉదాహరణకై. ఈ పుస్తకం భగవంతుడని అనుకోండి. అప్పుడు దీని చుట్టు ప్రక్కలున్న వస్తువులుగానీ, ముందు కూర్చున్న మనుష్యులు గానీ, లేక చూచిన– వినిన యింకే వస్తువుగానీ సంకల్పంలోకి కూడా రాకూడదు. కనిపించకూడదు. అలా గాక కనిపిస్తే అది స్మరణ కాదు, అలాంటి స్మరణలో యుద్ధం ఎలా చేయడం? వాస్తవానికి ఎప్పుడైతే మీరు ఈ ప్రకారమైన నిరంతర స్మరణలో ప్రవృత్తులౌతారో, అప్పుడు అదే క్షణంలో అసలైన యుద్ధం యొక్క స్వరూపం మీ కళ్ళకు కట్టినట్లుగా కనబడుతుంది. ఆ సమయంలో మాయా ప్రవృత్తులు అడ్డు గోడలుగా ప్రత్యక్షమవుతాయి. కామ క్రోధాలు, రాగ ద్వేషాలు దుర్జయ శత్రువులు. ఈ శత్రువులు నా స్మరణ చేయనివ్వవు. వాటిని దాటగలగడమే యుద్ధం. అంటే, ఈ శత్రువులు నశించినప్పుడే వ్యక్తి పరమగతిని పొందుతాడు.

ఈ పరమగతిని పొందడానికై అర్జునా! నీవు 'ఓం' శబ్దాన్ని జపించు. నన్నే ధ్యానించు అంటే శ్రీకృష్ణుడు ఒక యోగి. నామ-రూపాలు ఆరాధన సాఫల్యానికి కారణభూతములు.

పునర్జన్మ ఏమిటి? దాని పరిధిలోకి ఎవరెవరు వస్తారు? అనే ప్రశ్నకు కూడా

యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు ఇలా జవాబిచ్చాడు. బ్రహ్మ మొదలుకొని యావత్ జగత్తు పునరావృత్తమయ్యేదే (జనన-మరణాలతో కూడుకొన్నది) వీరందరూ నశించి పోయినా కూడా, నా పరమ అవ్యక్త భావమూ అందులోని స్థితి సమాప్తం కావు.

ఈ యోగంలో ప్రవిష్టుడైన పురుషునికి రెండు మార్గాలున్నాయి. ఎవరైతే పూర్ణ ప్రకాశాన్ని పొంది, షడైశ్వర్యాలతో సంపన్నుడై ఊర్ధ్వరేతస్కుడై ఉంటాడో, ఎవరిలో లేశమాత్రంగానైనా ఏ లోటూ లేదో, అతను పరమగతిని పొందుతాడు. అలాకాకుండా ఆయోగకర్తలో లేశమాత్రంగానైనా కృష్ణ పక్షంలాంటి నలుపు ఉంటే, అలాంటి దశలోనే శరీరం సమాప్తమయ్యే యోగి మళ్ళీ జన్మ నెత్తవలసి ఉంటుంది. అతను సామాన్య జీవుల లాగా జన్మ మరణ చక్రంలో యిరుక్కోడు, కానీ జన్మ నెత్తి ఆ జన్మలో మిగిలిన సాధనను పూర్తి చేస్తాడు.

ఈ ప్రకారంగా వచ్చే జన్మలో అదే క్రియను ఆచరిస్తూ అతను కూడా అక్కడికే, ఆ పరమధామానికి చేరుకుంటాడు. ఇంతకు ముందు కూడా శ్రీకృష్ణుడు చెబుతూనే వచ్చాడు- దీని స్వల్ప సాధన కూడా జనన మరణమనే మహా భయం నుంచి తప్పకుండా రక్షిస్తుంది. 'రెండు మార్గాలూ శాశ్వతాలే, నశించనివే' – ఈ మాటను తెలుసుకొని ఏ పురుషుడు కూడా యోగం నుండి చాలాయమానం కాడు. అర్జునా, నీవు యోగివి కమ్ము. యోగి వేదాలు, తపస్సు, యజ్ఞం మరియు దానాల పుణ్యఫలాన్ని కూడా ఉల్లంఘించి పరమగతిని పొందుతాడు.

ఈ అధ్యాయంలో చాలా చోట్ల పరమగతి చిత్రణ చేయబడింది, దానినే అవ్యక్తం, అక్షయం మరియు అక్షరం అని సంభోధించడమయింది. దానికి ఎప్పటికీ క్షయం గానీ, వినాశం గానీ లేదు. అందుచేత-

ఓం తత్సదితి శ్రీమద్భగవద్ గీతాసూపనిషత్సు బ్రహ్మ విద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే **'అక్షర బ్రహ్మ యోగో'** నామ అష్టమోऽధ్యాయః ||**8**||

ఈ ప్రకారంగా శ్రీమద్భగవద్గీతా రూపమైన ఉపనిషత్తు మరియు బ్రహ్మవిద్యా మరియు యోగ శాస్త్రమనే విషయంలో శ్రీకృష-అర్జున సంవాదంలో ''అక్షర బ్రహ్మ యోగం'అనే పేరుగల ఎనిమిదవ అధ్యాయం పూర్తయింది.

యితి శ్రీమత్పరమహంస పరమానందస్య శిష్య స్వామీ అడగడానంద కృతే శ్రీమద్‌భగవద్‌గీతా యాః-- **'యథార్థ గీతా'**భాష్యే **'అక్షర బ్రహ్మయోగో'** నామ అష్టమోऽధ్యాయః||**8**||

ఈ ప్రకారంగా శ్రీమత్పరమహంస పరమానందగారి శిష్యుడు స్వామి అడగడానంద గారిచే రచించబడిన శ్రీమద్‌భగవత్‌గీతా యొక్క భాష్యం యథార్థ గీతాలో 'అక్షర బ్రహ్మయోగం'అనే ఎనిమిదవ అధ్యాయం పూర్తయింది.

||హరి ఓం తత్సత్||

ఓం

శ్రీ పరమాత్మనే నమః

# నవమోऽధ్యాయము

అధ్యాయం ఆరు వరకు యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు యోగాన్ని గూర్చి క్రమబద్ధంగా విశ్లేషణ చేసాడు. దాని అసలైన అర్థం, యజ్ఞం యొక్క ప్రక్రియ. యజ్ఞం ఆపరంలో ప్రవేశాన్ని యిప్పించే ఆరాధన యొక్క విధి విశేషం యొక్క చిత్రణ, ఇందులో చరాచర జగత్తు హోమ సామగ్రి రూపంలో ఉన్నాయి. మనస్సు యొక్క నిరోధము, నిరోధించబడిన మనస్సు యొక్క విలయకాలంలో ఆ అమృత తత్త్వం విదితమయి పోతుంది. పూర్తయిన కాలంలో యజ్ఞం దేనిని సృష్టిస్తుందో, దానిని త్రాగేవారే జ్ఞానులు. వారు సనాతన బ్రహ్మలో ప్రవేశాన్ని పొందుతారు. ఆ కలవడం యొక్క పేరే యోగం. ఆ యజ్ఞానికి కార్యరూపు యివ్వడాన్నే కర్మ అంటారు. ఏడవ అధ్యాయంలో అతను చెప్పాడు– ఈ కర్మను చేయువాడు వ్యాప్తమైన బ్రహ్మ, సంపూర్ణ కర్మ, సంపూర్ణ అధ్యాత్మం, సంపూర్ణ అధిదైవం, అధిభూతం మరియు అధియజ్ఞాల సహితంగా నన్ను తెలుసుకొంటాడు. ఎనిమిదవ అధ్యాయంలో అతను ఇదే పరంగతి, యిదే పరంధామం అని అన్నాడు.

ప్రస్తుత అధ్యాయంలో యేగేశ్వరుడైన శ్రీకృష్ణుడు స్వయంగా చర్చించినదేమంటే యోగయుక్తుడైన పురుషుని యొక్క ఐశ్వర్యం ఎలా వుంటుంది? అందరిలో వ్యాప్తమై ఉండి కూడా అతను ఎలా నిర్లిప్తుడు? చేస్తూ కూడా అతను ఎలా అకర్త? ఆ పురుషుని యొక్క స్వభావం మరియు ప్రభావాన్ని గూర్చి వివరించాడు, యోగాన్ని ఆచరణలో పెట్టేటప్పుడు వచ్చే దేవతాది విఘ్నాల గురించి సావధాన పరచాడు మరియు ఆ పురుషుని శరణు వేడుమని నొక్కి చెప్పాడు.

శ్రీభగవానువాచ

శ్లో ॥ ఇదంతు తే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే।
జ్ఞానం విజ్ఞాన సహితం యజ్ఞా త్వా మొక్ష్యసేఽశుభాత్ ॥1॥

యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు. అర్జునా! అసూయా (ఈర్ష్యా) రహితుడవైన, నీకు నేను యీ పరమ గోపనీయ జ్ఞానాన్ని విజ్ఞాన సహితంగా చెప్తాను. అంటే ముక్తి పొందిన తరువాత మహాపురుషుడు ఉండే విధానం కూడా చెప్తాను- ఆ మహాపురుషుడు సర్వత్రా ఒకే సారిగా ఎలా కర్మ చేస్తాడు? అతను జాగృతిని ఎలా ప్రదానం చేస్తాడు? ఆత్మతో కూడి రథుడై ఎల్లప్పుడూ ఎలా ఉంటాడు? అనేవి. 'యత్ జ్ఞాత్వా'- దీనిని సాక్షాత్తుగా తెలుసుకొని నీవు దుఃఖ సాగరం నుంచి ముక్తుడవయి పోతావు. ఆ జ్ఞానం ఎలాంటిది? దీనిని గూర్చి అంటాడు-

శ్లో ॥ రాజ విద్యా రాజగుహ్యం పవిత్ర మిదముత్తమం।
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయం ॥2॥

విజ్ఞానంతో సంయుక్తమైన ఈ జ్ఞానం అన్ని విద్యలలో రాజువంటిది. విద్యా అంటే అర్థం భాషాజ్ఞానం (లేక) చదువు అని కాదు. 'విద్యాహి కా బ్రహ్మగతి ప్రదా యా' 'సా విద్యా యా విముక్తయే' తన దగ్గరకు వచ్చిన వారిని జాగృతం చేసి బ్రహ్మ పథంపై నడిపిస్తూ, మోక్ష ప్రదానం చేసే దానిని విద్య అంటారు. అలా కాకుండా దారిలో రిద్ధులు-సిద్ధులలో గానీ ప్రకృతిలో గానీ చిక్కుకుపోతే అవిద్య సఫలమయిందనే అర్థం. అది విద్యకాదు. ఈ రాజ విద్య ఎలాంటిదంటే నిశ్చయంగా కళ్యాణం (మేలు) కలిగించేదే. ఇది గోపనీయమైనది.అన్నింటిలోకి రాజువంటిది. అవిద్య మరియు విద్యల యొక్క మొత్తం ఆచ్ఛాదన తొలగిపోయి, యోగంతో యుక్తమైన పిదపే, దీనితో కలవడం జరుగుతుంది.

ఇది అతి పవిత్రమైనది, ఉత్తమమైనది. మరియు ప్రత్యక్షఫలాన్నిచ్చేది. 'ఇలా చెయ్యి -అలా పుచ్చుకో' -అలాంటి ప్రత్యక్ష (సద్యః ఫలాన్నిచ్చేది. ఈ జన్మలో సాధన చెయ్యి- ఇంకో జన్మలో ప్రతిఫలం దొరుకుతుందనే మూఢ విశ్వాసం కాదిది. ఇది పరమ ధర్మమైన పరమాత్మునితో సంయుక్తమైనది. విజ్ఞాన సహితంగా ఈ జ్ఞానం ఆచరించడంలో సరళమైనది. ఇది అవినశ్వరమైనది.

రెండో అధ్యాయంలో యోగేశ్వరుడు ఇలా అన్నాడు అర్జునా! ఈ యోగంలో బీజానికి నాశనం లేదు. దీని అల్ప సాధన కూడా జనన మరణమనే మహా భయం లేకుండా చేస్తుంది. ఆరవ అధ్యాయంలో అర్జునుడు అడిగాడు- భగవాన్! శిథిల ప్రయత్నం చేయు సాధకుడు నష్ట భ్రష్టుడు కాడు గదా? శ్రీకృష్ణుడు చెప్పాడు- అర్జునా! మొదట కర్మను అర్థం చేసుకోవటం చాలా అవసరం. మరియు అర్థం చేసుకున్న తరువాత స్వల్పమైన సాధన కూడా చేయగలిగితే అది ఏ జన్మలోనూ, ఎప్పటికీ వినాశం కాదు, కానీ ఆ కొంచెం అభ్యాసం ప్రభావంచే ప్రతి జన్మలోనూ అదే చేస్తాడు. అనేక జన్మల పరిణామంగా పరమగతి అంటే

పరమాత్ముని చేరుకుంటాడు. దానినే యోగేశ్వరుడు ఇక్కడ కూడా అంటాడు– ఈ సాధన చేయడానికి చాలా సులభమైనది మరియు అవినశ్వరం కూడా, కానీ దీనికై శ్రద్ధ చాలా అవసరం.

శ్లో ॥ అశ్రద్ధ ధానాః పురుషా ధర్మస్యాస్య పరన్తప ।
అప్రాప్య మాం నివర్తన్తే మృత్యుసంసారవర్త్మని ॥**3**॥

పరంతప అర్జునా! ఈ ధర్మం పట్ల (దేని స్వల్ప సాధనచేస్తే వినాశం కాదో) శ్రద్ధారహితుడైన పురుషుడు (ఒకే ఇష్టదైవంపై మనస్సును కేంద్రీకరించలేని పురుషుడు) నన్ను పొందక, సంసార క్షేత్రంలో భ్రమణం చేస్తూ ఉంటాడు. ఇందువల్ల శ్రద్ధ అనివార్యమైనది. మీరు ప్రపంచంకంటే అతీతులా? దీనిని గూర్చి అంటాడు–

శ్లో ॥ మయా తతమిదం సర్వం జగదవ్యక్త మూర్తినా ।
మత్స్థాని సర్వ భూతాని న చాహం తేష్వవస్థితః ॥**4**॥

నా యొక్క అవ్యక్త స్వరూపంచే ఈ జగత్తంతా వ్యాప్తమై ఉంది. అంటే నేను ఏ స్వరూపంలో స్థితుడనై ఉన్నానో అది సర్వత్రంగా వ్యాపించి ఉంది. ప్రాణులందరూ నాలో స్థానాన్ని పొందారు. కానీ నేను వారిలో స్థితుడనై లేను, ఎందుకంటే నేను అవ్యక్త స్వరూపంలో స్థితుడై ఉన్నాను. మహాపురుషుడు ఏ అవ్యక్త స్వరూపంలో స్థితుడై ఉన్నాడో, అక్కడి నుంచే (శరీరాన్ని వదలిన అవ్యక్త స్థాయి నుంచి) మాట్లాడతాడు. ఇదే క్రమంగా ఇలా అంటాడు.

శ్లో ॥ న చ మత్స్థాని భూతాని పశ్యమే యోగమైశ్వరం ।
భూతభృన్న చ భూతస్థో మమాత్మా భూత భావనః ॥**5**॥

వాస్తవానికి అన్ని భూతాలు కూడా నాలో స్థితమై లేవు, ఎందుకంటే అవి మరణ ధర్మములు, ప్రకృతిని ఆశ్రయించి ఉన్నవి; కానీ నా యోగ మాయ యొక్క ఐశ్వర్యాన్ని చూడు. జీవధారుల ఉత్పత్తి మరియు పోషణ చేసే నా ఆత్మ, భూతాలలో స్థితమై లేదు. నేను ఆత్మ స్వరూపుడను కాబట్టి నేను ఆ భూతాలలో స్థితుడనై లేను. ఇదే యోగం యొక్క ప్రభావం. దీనిని స్పష్టం చేయడం కొరకై యోగేశ్వరుడు ఒక దృష్టాంతాన్ని చెప్తాడు–

శ్లో ॥ యథాऽకాశస్థితో నిత్యం వాయుః సర్వత్రగోమహాన్ ।
తథా సర్వాణి భూతాని మత్స్థానీత్యుపధారయ ॥**6**॥

ఆకాశంలోనే ఉత్పన్నమయ్యే మహా గొప్ప వాయువు ఆకాశంలోనే ఎల్లప్పుడూ స్థితమై ఉంటుంది, కానీ దానిని మలినం చేయలేదు– సరిగ్గా అలాగే సంపూర్ణ భూతాలూ నాలో స్థితమై ఉన్నాయి. – అలా అని తెలుసుకో. సరిగ్గా ఇదే విధంగా నేను ఆకాశం లాగానే నిర్లిప్తుడను. అవి నన్ను మలినం చేయలేవు. ప్రశ్న పూర్తయింది, ఇదే యోగం యొక్క ప్రభావం. ఇప్పుడు యోగి ఏం చేస్తాడు? దీనిని గూర్చి అంటాడు–

శ్లో ॥ సర్వభూతాని కౌన్తేయ ప్రకృతిం యాన్తి మామికామ్ ।
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహం ॥**7**॥

అర్జునా! కల్ప విలయ కాలంలో అన్ని భూతాలూ నా ప్రకృతిని అంటే, నా స్వభావాన్ని పొందుతాయి మరియు కల్పం మొదట్లో నేను వాటిని మళ్ళీ మళ్ళీ 'విసృజామి' -విశేష రూపంతో సృజిస్తాను. అవి మొదటి నుండి ఉండేవే. కానీ వికృతమై ఉండేవి, వాటిని సృష్టిస్తాను, అలంకరిస్తాను. ఏవైతే అచేతనంగా ఉన్నాయో, వాటిని జాగృతం చేస్తాను. కల్పం కోసం ప్రేరేపిస్తాను. కల్పం అంటే తాత్పర్యం ఉత్తానోన్ముఖ పరివర్తనం. ఆసురీ సంపద నుంచి వెలువడి ఎలా పురుషుడు దైవీ సంపదలోకి ప్రవేశం పొందుతాడో, అక్కడి నుంచే కల్పం ఆరంభమవుతుంది. మరియు ఎప్పుడైతే ఈశ్వర భావం ప్రాప్తమవుతుందో, అప్పుడే కల్పం విలయమయి పోతుంది. భజన యొక్క ఆరంభం కల్పం యొక్క ఆది, మరియు భజన యొక్క పరాకాష్ఠ ఎక్కడైతే లక్ష్యం విదితమవుతుందో, అక్కడే కల్పం అంతం అవుతుంది. ఎప్పుడైతే ఈ ప్రత్యగాత్మ, జన్మలకు కారణభూతమైన రాగద్వేషాల నుంచి ముక్తి పొంది తన శాస్వత స్వరూపంలో స్థిరమైపోతుందో. దీనినే శ్రీకృష్ణుడు 'వారు నా ప్రకృతిని పొందుతారు' అని అన్నాడు.

ఒక మహాపురుషుడు ప్రకృతిని విలయం చేసి, స్వరూపంలో ప్రవేశం పొందితే, అతని ప్రకృతి ఎలాంటిది? అతనిలో ప్రకృతి శేషముంటుందా? ఉండదు. 3/33లో యోగేశ్వరుడు ఇలా అన్నాడు- అన్ని ప్రాణులు తమ ప్రకృతినే పొందుతాయి. ఎలా అతని ప్రకృతి యొక్క గుణాల ప్రభావం ఉంటుందో, అలాగే చేస్తాడు. మరియు 'జ్ఞాన వానపి' ప్రత్యక్ష దర్శనంతో బాటు స్వరూపాన్ని తెలుసుకొన్న జ్ఞాని కూడా తన ప్రకృతికి సదృశంగా చేష్టలు చేస్తాడు. అతను తన తరువాతి వారి కళ్యాణానికై (మేలుకై) చేస్తాడు. పూర్ణ జ్ఞానుడైన, తత్త్వస్థితుడైన మహా పురుషుడు ఉండే తీరే అతని ప్రకృతి. అతను తన ఈ స్వభావంతోనే వ్యవహరిస్తాడు. కల్ప చివరికాలంలో లోకులు మహాపురుషుని యొక్క ఈ తీరునే పొందుతారు. మహాపురుషుల యొక్క యీ కృతిత్వాన్ని మళ్ళీ వివరిస్తున్నాడు.

శ్లో // ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః ।
భూతగ్రామమిమం కృత్స్నమవశం ప్రకృతేర్వశాత్ ॥8॥

తమ ప్రకృతిని, అంటే మహాపురుషులు ఉండే తీరుని స్వీకరించి 'ప్రకృతేశ్వరాత్'- తమ తమ స్వభావంలో స్థితమైన ప్రకృతి యొక్క గుణాలచే పరవశమయిన ఈ సంపూర్ణ భూతాల సముదాయాన్ని నేను మళ్ళీ మళ్ళీ 'విసృజామి' - విశేషంగా సృజిస్తాను, విశేష రూపంతో అలంకరిస్తాను. వాటిని తమ స్వరూపం వైపుకు అగ్రసరులవడానికి ప్రేరేపిస్తాను. అలాంటప్పుడు మీరు ఈ కర్మచే బంధించ బడ్డారు.

శ్లో // న చ మాం తాని కర్మాణి నిబధ్నన్తి ధనంజయ।
ఉదాసీనవదాసీన మసక్తం తేషు కర్మసు ॥9॥

అధ్యాయం 4/9లో యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు ఏమన్నాడంటే- మహాపురుషుని కార్య ప్రణాళిక అలౌకికమైనది. అధ్యాయం 9/4లో అంటాడు- నేను అవ్యక్త రూపంతో చేస్తాను. ఇక్కడ కూడా అదే అంటాడు- ధనంజయా! నేను అదృశ్యరూపంతో ఏ కర్మలను

చేస్తానో వాటి పట్ల నా ఆసక్తి ఉండదు. పరమాత్మ స్వరూపుడనైన, నిర్లిప్తతకు సదృశమైన స్థితిలో ఉంటున్న నన్ను ఆ కర్మలు బంధించలేవు, ఎందుకంటే కర్మ యొక్క పరిణామంలో ఏ లక్ష్యం లభిస్తుందో, అందులో నేను స్థితుడనై ఉన్నాను. కాబట్టి వాటిని చేయడానికై నేను వివశుణ్ణి కాను.

ఇది స్వభావంతో బాటు కూడి ఉన్న ప్రకృతి కార్యాలను గురించిన ప్రశ్న. మహా పురుషులు ఉండే తీరు, వాటి సృష్టి. ఇప్పుడు నా ఆశ్రయంలో మాయ సృష్టించేది ఏమిటి? అది కూడా ఒక కల్పమే-

శ్లో ॥ మయాऽధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరం ।
హేతునానేన కౌన్తేయ జగద్వి పరివర్తతే ॥ **10**॥

అర్జునా! నా అధ్యక్షతలో అంటే సర్వత్ర వ్యాప్తమైన నా ఆశ్రయంలో ఈ మాయ (త్రిగుణమయీ ప్రకృతి, అష్టధా మూల ప్రకృతి మరియు చేతనం రెండూ) చరాచర జగత్తును సృష్టిస్తుంది, అది క్షుద్ర కల్పం. మరియు ఈ కారణం చేతనే ఈ ప్రపంచం ఆవాగమన మనే (జనన మరణాలనే) చక్రంలో తిరుగుతూ ఉంటుంది. ఈ క్షుద్ర కల్పాన్ని, కాలం యొక్క పరివర్తనతో కూడినది, నా ఆశ్రయం వలన ప్రకృతే సృజిస్తుంది, నేను సృజించను, కానీ ఏడవ శ్లోకంలో కల్పం అంటే ఆరాధన యొక్క సంచరణం మరియు చివరి వరకు మార్గదర్శనం చేసే కల్పాన్ని, మహాపురుషులు స్వయంగా సృజిస్తారు. ఒక స్థానంలో అతను స్వయం కర్త. అక్కడ అతను విశేషరూపంగా సృజిస్తాడు. ఇక్కడ కర్త ప్రకృతి, అది కేవలం నా మూలాన ఈ క్షణిక పరివర్తనను కలిగిస్తుంది, యిందులో శరీరాల పరివర్తన, కాల పరివర్తన, యుగ పరివర్తన మొదలగునవి వస్తాయి. అలాంటి వ్యాప్త ప్రభావం ఉన్నప్పటికీ, మూఢులైన వారు నన్ను తెలుసుకోలేరు, పైగా-

శ్లో ॥ అవజానన్తి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్ ।
పరం భావమజానన్తో మమ భూత మహేశ్వరమ్ ॥ **11**॥

సంపూర్ణ భూతాలకు మహా ఈశ్వరుడనైన నా పరమభావాన్ని తెలుసుకోలేనివారు మూఢులు. వారు నన్ను మనుష్య శరీరంపై ఆధారపడిన వానిననీ, తుచ్ఛుడిననీ అనుకొంటారు. సంపూర్ణ ప్రాణుల ఈశ్వరులకు కూడా మహాఈశ్వరుడున్నాడే, ఆ పరమభావంలో నేను స్థితుడనై ఉన్నాను, కానీ మనుష్య శరీరధారుణ్ణే. మూఢులు ఇది తెలుసుకోలేరు. వారు నన్ను మనుష్యుడంటూ సంబోధిస్తారు. వారి దోషం కూడా ఏముంది? వారెప్పుడు చూచినా, మహాపురుషుని యొక్క శరీరమే గదా కనిపించేది. మీరు మహా ఈశ్వర భావంలో స్థితుడైనట్లున్నారని ఎలా తెలుసుకోగలరు? వారెందుకు చూడలేరు? దీనిని గూర్చి అంటాడు-

శ్లో ॥ మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః ।
రాక్షసీ మాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః ॥ **12**॥

వారు వృథా ఆశ (ఎప్పటికీ సంతృప్తి పొందని ఆశ), వృథా కర్మ (బంధించే కర్మ),

వృధా జ్ఞానం (వాస్తవానికి అజ్ఞానం), 'విచేతసః'– విశేషంగా అచేతనులై ఉండే, రాక్షసుల మరియు అసురుల లాంటి మోహంలో చిక్కుకుపోయే స్వభావాన్ని కలిగి ఉంటారు. అంటే ఆసురీ స్వభావం గలవారై ఉంటారు. కాబట్టే నన్ను మనుష్యుడనని అనుకొంటారు. అసురత్వం మరియు రాక్షసత్వం అనేవి మనస్సు యొక్క ఒక విశిష్ట స్వభావమే గానీ వేరే జాతి (లేక) జన్మ కాదు. ఆసురీ స్వభావం గలవారు నన్ను తెలుసుకోలేరు, కానీ మహాత్ములు నన్ను గుర్తించగలరు మరియు వారు నన్ను భజిస్తారు.

శ్లో ॥ మహాత్మానస్తు మాం పార్థ దైవీం ప్రకృతి మాశ్రితాః ।
భజన్త్య నన్య మనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్ ॥ **13**॥

హే పార్థా! దైవీ ప్రకృతి అంటే దైవీ సంపదను ఆశ్రయించిన మహాత్ములు నన్ను భూతాలన్నింటికీ ఆది కారణుడననీ, అవ్యక్తుడననీ, అక్షరమైన వాడిననీ తెలుసుకొని, అనన్య మనస్సుతో అంటే మనస్సు యొక్క అంతరాళంలో ఇంక దేనికీ తావివ్వకుండా, కేవలం నాపట్లనే శ్రద్ధ కలిగి ఉండి నిరంతరం నా భజన చేస్తారు. ఏ ప్రకారంగా భజన చేస్తారు ? దీనిని గూర్చి అంటాడు–

శ్లో ॥ సతతం కీర్తయన్తో మాం యతన్తశ్చ దృఢవ్రతాః।
నమస్యన్తశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే ॥ **14**॥

వారు నిరంతరం చింతన వ్రతంలో అచంచలంగా ఉంటూ నా గుణాల యొక్క చింతన చేస్తూ ముక్తికై ప్రయత్నిస్తారు మరియు నాకు మళ్ళీ మళ్ళీ నమస్కారాలు చేస్తూ ఎల్లప్పుడూ నాతో సంయుక్తులై, అనన్య భక్తితో నా ఉపాసన చేస్తారు. అవిరళంగా చేస్తూనే ఉంటారు. ఏ ఉపాసన చేస్తారు? అది ఎలాగుంటుంది? ఏదో వేరే ఉపాసన చేయరు కానీ అదే 'యజ్ఞం' చేస్తారు. అదే ఆరాధన గురించి యిక్కడ సంక్షేపంగా యోగేశ్వరుడు శ్రీకృష్ణుడు యింకోసారి చెప్తాడు–

శ్లో ॥ జ్ఞాన యజ్ఞేన చాప్యన్యే యజన్తో మాముపాసతే ।
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతో ముఖమ్ ॥ **15**॥

వారిలో కొందరు సర్వవ్యాప్త విరాట్ పరమాత్ముడనైన నా ఉపాసన జ్ఞాన యజ్ఞం ద్వారా చేస్తారు. అంటే తమ లాభ నష్టాలను మరియు శక్తిని అర్థం చేసుకొని ఇదే నియత కర్మైన యజ్ఞంలో ప్రవృత్తులవుతారు. కొందరు ఏకత్వ భావంతో నా ఉపాసన చేస్తారు, ఎలాగంటే 'నేను యిందులోనే ఏకమవ్వాలి' అనుకొంటూ మరియు మిగిలిన వాటి నుంచి నన్ను వేరు చేసి నాకే సమర్పణ చేసి, నిష్కామ సేవా భావంతో నా ఉపాసన చేస్తారు. చాలా రకాలుగా ఉపాసన చేస్తారు. ఎందుకంటే ఇవన్నీ ఒకే యజ్ఞం యొక్క ఉచ్ఛ–నీచ స్థాయిలు. యజ్ఞం యొక్క ప్రారంభం సేవతో మొదలవుతుంది, కానీ దాని అనుష్ఠానం ఎలా జరుగుతుంది ? యోగేశ్వరుడు

శ్రీకృష్ణుడు అంటాడు– యజ్ఞం నేను చేస్తాను. మహాపురుషుడే గనుక రథుడు కాకపోతే యజ్ఞం పూర్తి కాదు. అతని నిర్దేశనలతోనే సాధకుడు 'ఇప్పుడతను ఏ స్థాయిలో ఉన్నాడు, ఎంత వరకు చేరుకున్నాడు?' అనే వాటిని అర్థం చేసుకోగలడు. వాస్తవానికి యజ్ఞ కర్త ఎవరు? దీనిని గురించి యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు అంటాడు–

శ్లో ॥ అహం క్రతురహం యజ్ఞః స్వధాహమహమౌషధం।
మంత్రోఽహమహమేవాజ్య మహమగ్నిరహం హుతమ్ ॥ 16॥

కర్తను నేనే. వాస్తవానికి కర్త వెనక ఉండి ప్రేరకుడి రూపంలో ఎప్పుడూ సంచాలన చేసేది ఇష్టదైవమే. కర్త ద్వారా చేయబడేది, నేను యిచ్చిందే. యజ్ఞం నేనే. యజ్ఞం అనేది ఆరాధన యొక్క విధి విశేషం. సమాప్తమయిన కాలంలో యజ్ఞం దేనిని సృష్టిస్తుందో, ఆ అమృతాన్ని త్రాగే పురుషులు సనాతన బ్రహ్మలో ప్రవేశాన్ని పొందుతారు. స్వధానేనే అంటే అతీతమైన అనంత సంస్కారాలను విలయం చేయడం, వాటిని తృప్తిపరచడం అనేది నేను యిచ్చేదే. భవరోగాన్ని నశింపచేసే ఔషధాన్ని నేనే. నన్ను పొంది లోకులు యీ రోగం నుంచి ముక్తులవుతారు. మంత్రాన్ని నేనే. మనస్సుని శ్వాస యొక్క అంతరాళంలో నిరోధించడమనేది నేను యిచ్చేదే. ఈ నిరోధ క్రియలో తీవ్రతను తీసుకొచ్చే వస్తువు 'ఆజ్యం' (హోమం) కూడా నేనే. అగ్ని నేనే. నా ప్రకాశం లోనే మనస్సు యొక్క అన్ని ప్రవృత్తులూ విలయమవుతాయి మరియు ఆహుతి అంటే సమర్పణ కూడా నేనే.

ఇక్కడ యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు మాటిమాటికీ 'నేనే' 'నేనే' అంటాడు. దీని ఆశయం నేనే ప్రేరకుడి రూపంలో ఆత్మతో అభిన్నుడనై నిలబడతాను. మరియు నిరంతరం నిర్ణయాలను ఇస్తూ యోగక్రియను పూర్తి చేయిస్తాను, అని, మాత్రమే. దీని పేరే విజ్ఞానం. 'పూజ్య గురువుగారు' అనేవారు ఎప్పటి వరకు యిష్టదైవం రథుడై శ్వాస–ప్రశ్వాసలపై నియంత్రణ చేయడో, అప్పటి వరకూ భజన ఆరంభమే కాదు; ఎవరైనా సరే లక్షసార్లు కళ్ళు మూసినా, భజన చేసినా, శరీరాన్ని తపింప చేసినా సరే, ఎప్పటి వరకు ఏ పరమాత్ముని కొరకై మన కోరిక కలదో, ఏ స్థాయిలో మనం నిలబడ్డామో, అతను ఆ స్థాయికి దిగి ఆత్మతో అభిన్నుడై జాగృతం కాడో, అప్పటి వరకూ సరైన పరిమాణంలో భజన స్వరూపం అర్థం కాదు. కాబట్టి 'గురువుగారు' అనే వారు–'నా స్వరూపాన్ని పట్టుకో, అన్నీ నేను యిస్తాను'. అని; శ్రీకృష్ణుడు అంటాడు– 'అన్నీ నా వలన అవుతాయి'. అని.

శ్లో ॥ పితాऽహమస్య జగతో మాతా ధాతా పితామహః ।
వేధ్యం పవిత్రమోంకార ఋక్సామ యజురేవచ ॥ 17॥

అర్జునా! నేనే సంపూర్ణ జగత్తు యొక్క 'ధాతా' అంటే ధరించే వాడను, 'పితా' అంటే పాలన చేసేవాడను, 'మాతా' అంటే ఉత్పన్నం చేసే వాడను; పితామహః' అంటే మూల ఉద్గమాన్ని దానిలో అందరూ ప్రవేశం పొందుతారు. మరియు తెలుసుకొనుటకు యోగ్యమైన ఓంకారాన్ని అంటే 'అహం ఆకారః యితి ఓంకారః' ఆ పరమాత్ముడు నా స్వరూపంలో

ఉన్నాడు, 'సోఽహం', 'తత్త్వమసి' యిత్యాదులు ఒకదాని కొకటి పర్యాయాలు. అలా తెలుసుకోనుటకు యోగ్యమైన స్వరూపాన్ని నేనే. 'ఋక్' అంటే సంపూర్ణ ప్రార్థన, 'సామ' అంటే సమత్వాన్ని ఇప్పించే ప్రక్రియ, 'యజుః' అంటే భజన యొక్క విధి విశేషం కూడా నేనే. యోగ అనుష్ఠానానికి కావలసిన పై మూడు అంగాలూ నా వలన జరుగుతాయి.

శ్లో ॥ గతిర్భర్తా ప్రభుః సాక్షీ నివాస శ్శరణం సుహృత్ ।
ప్రభవః ప్రలయః స్థానం నిధానం బీజమవ్యయమ్ ॥ 18॥

హే అర్జునా! 'గతిః' అంటే ముక్తి పొందటానికి యోగ్యమైన, పరమగతిని 'భర్తా' అంటే భరణ- పోషణ చేసే వాడను, అందరికీ స్వామిని; 'సాక్షీ' అంటే ద్రష్ట రూపంలో స్థితుడనై అంతా తెలుసుకొనేవాడిని, అందరి వాసస్థానాన్ని, శరణునివ్వడానికి యోగ్యుడను, అకారణమైన ప్రేమికుడను, మిత్రుడను, ఉత్పత్తి మరియు ప్రళయం అంటే శుభాశుభ సంస్కారాల యొక్క విలయం మరియు అవినాశానికి కారణం నేనే. అంటే చివర్లో ఎవరిలో ప్రవేశం లభిస్తుందో, ఆ మొత్తం విభూతులన్నీ నేనే.

శ్లో ॥ తపామ్యహమహం వర్షం నిగృహ్ణామ్యుత్సృజామి చ ।
అమృతం చైవ మృత్యుశ్చ సదాసచ్చాహమర్జున ॥ 19॥

నేను సూర్యుని రూపంతో తపించుతాను, వర్షాన్ని ఆకర్షించుతాను. మృత్యువుకంటే అతీతమైన అమృత తత్త్వం, మరియు మృత్యువు, సత్యం మరియు అసత్యం అన్నీ నేనే. అంటే ఎవరైతే పరమ ప్రకాశాన్ని ప్రదానం చేస్తాడో, ఆ సూర్యుణ్ణి నేనే. అప్పుడప్పుడు భజన చేసే వారు నేను అసత్యమని అనుకొంటారు, వారు మృత్యువును కోరుకుంటారు. తరువాత ఈ ప్రకారంగా అంటాడు-

శ్లో ॥ త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా
యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయన్తే ।
తే పుణ్యమాసాద్య సురేంద్రలోక
మశ్నన్తి దివ్యాన్దివి దేవభోగాన్ ॥20॥

ఆరాధనా విద్యకు మూడు అంగాలు-ఋక్, సామ, యజుర్- అంటే ప్రార్థన, సమత్వ ప్రక్రియ. యజ్ఞాన్ని ఆచరించే వారు, సోమం అంటే చంద్రుడి క్షీణ ప్రకాశాన్ని పొందేవారు, పాపాల నుంచి ముక్తులయి పవిత్రులయిన పురుషులు యజ్ఞం యొక్క ఆ నిర్ధారిత ప్రకియ ద్వారా నన్నే తమ యిష్ట రూపంలో పూజించి, స్వర్గం కోసం ప్రార్థిస్తారు. ఇదే అసత్తు యొక్క కోరిక. దీని వలన వారు మృత్యువును పొందుతారు, ఇంతకు వెనుక శ్లోకంలో చెప్పినట్లుగా వారికి పునర్జన్మ కలుగుతుంది, వారు పూజించేది నన్నే, అదే నిర్ధారిత విధి ద్వారానే పూజిస్తారు, కానీ ప్రతిఫలంగా స్వర్గం యాచిస్తారు. ఆ పురుషులు వారి పుణ్య ఫల రూపంగా ఇంద్రలోకాన్ని పొంది, స్వర్గంలో దేవతల దివ్య భోగాలను అనుభవిస్తారు. అంటే ఆ భోగాలు కూడా నేనే ఇస్తాను.

శ్లో ॥ తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి ।
ఏవం త్రయీ ధర్మమను ప్రపన్నా
గతాగతం కామకామా లభన్తే ॥21॥

వారు ఆ విశాల స్వర్గాన్ని అనుభవించి పుణ్యం క్షీణించిన తరువాత మృత్యులోకాన్ని అంటే జన్మ-మృత్యువులను పొందుతారు. ఈ ప్రకారంగా 'త్రయి ధర్మం'- ప్రార్థన. సమత్వం మరియు యజ్ఞం యొక్క మూడు విధులచే ఒకే రకపు యజ్ఞం యొక్క అనుష్ఠానం చేసే వారు, నా శరణు పొంది కూడా కోరికలు గల పురుషులు మళ్ళీ మళ్ళీ జనన-మరణాలను అంటే పునర్జన్మలను పొందుతారు. కానీ వారి మూలం నాశనం కాదు. ఎందుకంటే ఈ పథంలో బీజానికి నాశనం లేదు, కానీ ఏ ప్రకారమైన కోరికలూ కోరని వారికి ఏం లభిస్తుంది?

శ్లో ॥ అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే ।
తేషాం నిత్యాభి యుక్తానాం యోగక్షేమం వహామ్యహం ॥22॥

'అనన్య భావం'తో నాలో స్థితుడైన భక్తుడు పరమాత్ముని స్వరూపమైన నాగురించి నిరంతరం చింతన చేస్తాడు 'పర్యుపాసతే' లేశమాత్రం కూడా దోషం లేకుండా నా ఉపాసన చేస్తాడు, ఆ విధంగా నిత్యమైన ఏకీభావంతో సంయుక్తుడైన పురుషుని యొక్క యోగక్షేమాలను నేను స్వయంగా చూసుకొంటాను, అంటే వారి యోగ రక్షణ పూర్తి భాధ్యతను నేను వహిస్తాను. ఇంత అయినా కూడా, లోకులు అన్య దేవతలను పూజిస్తారు-

శ్లో ॥ యేఽప్యన్య దేవతా భక్తా యజన్తే శ్రద్ధ యాన్వితాః ॥
తేఽపి మా మేవ కౌన్తేయ యజన్త్యవిధి పూర్వకమ్ ॥23॥

కౌన్తేయా! శ్రద్ధతో యుక్తుడైన ఏ భక్తుడైనా సరే వేరే-వేరే దేవతలను పూజించినా, వారు కూడా నన్నే పూజించినవారవుతారు, ఎందుకంటే దేవతలు అంటూ ఏదీ లేదు కదా! కానీ వారి ఆ పూజ అవిధి పూర్వకమైనది. నన్ను పొందు విధిచే రహితమైనది.

ఇక్కడ యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు రెండవసారి దేవతల ప్రస్తావన చేశాడు. సర్వ ప్రథమంగా ఏడో అధ్యాయంలో (ఇరవై నుంచి ఇరవై మూడో శ్లోకం వరకు) అతను అన్నాడు -అర్జునా! కౌరికల మూలంగా ఎవరి జ్ఞానమైతే అపహరించబడిందో, అలాంటి మూఢ బుద్ధిగల పురుషులు అన్యదేవతలను పూజిస్తారు. వారు పూజచేసే చోట దేవత పేరుగల సక్షమమైన, సత్తా అంటూ ఏదీ లేదు. కానీ రావిచెట్టు, రాయి, భూత భావనీ లేక ఏక్కడైనా సరే, వారికి శ్రద్ధ ఏర్పడుతుంది. కానీ నిజానికి అక్కడ ఎలాంటి దేవతా లేదు. నేను సర్వత్ర ఉన్నాను. ఆ స్థానంలో నేనే నిలబడి వారి దైవీ శ్రద్ధను ఆయా స్థానాలలో స్థిరపరుస్తాను. నేనే ప్రతిఫలం విధానాన్ని ఏర్పాటు చేస్తాను, ప్రతిఫలాన్ని ఇస్తాను. ప్రతిఫలం నిశ్చయంగా దొరుకుతుంది, కానీ వారి ప్రతిఫలం నశించేదే. ఈరోజు ఉంటే, రేపు అనుభవించడానికి ఉంటుంది. మరుసటిరోజు వినష్టమయి పోతుంది, కానీ నా భక్తుడు నాశనం కాడు. అపహరించ బడిన జ్ఞానం గల ఆ మూఢ బుద్ధి గల వారే అన్యదేవతలను పూజిస్తారు.

ప్రస్తుత అధ్యాయం 9లో ఇరవై మూడు నుంచి ఇరవై అయిదవ శ్లోకం వరకు యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు మళ్ళీ ఇలా చెప్తాడు- అర్జునా! ఎవరైనా సరే, శ్రద్ధతో వేరు-వేరు దేవతలను పూజిస్తారో, వారు నిజానికి నన్నే పూజిస్తారు; కానీ అవిధి పూర్వకంగా చేస్తారు. అక్కడ దేవతలు అనే పేరుతో సక్షమమైన వస్తువంటూ ఏదీ లేదు, వారిని పొందుటకై చేసిన విధానం తప్పు. ఇప్పుడు కలిగే ప్రశ్న ఏమిటంటే వారు కూడా అప్రత్యక్షంగా మిమ్మల్నే పూజిస్తారు మరియు ప్రతిఫలాన్ని పొందుతారు కదా, మరి అందులో దోషమేమిటి?

శ్లో ॥ అహం హి సర్వ యజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ ।
నతు మామభిజానన్తి తత్త్వేనాతశ్చ్యవంతి తే ॥**24**॥

సంపూర్ణ యజ్ఞాల యొక్క భోక్త అంటే యజ్ఞం ఎవరిలోనైతే విలయ మవుతుందో, యజ్ఞ పరిణామంగా ఎవరు దొరుకుతారో, అది నేనే. స్వామిని కూడా నేనే, కానీ వారు నన్ను తత్త్వంతో సహా తెలుసుకోలేరు, కాబట్టి 'చ్యవంతి' - పడిపోతారు. (పతనం చెందుతారు) అంటే వారు అప్పుడప్పుడు అన్యదేవతల పాలుబడతారు మరియు ఎప్పటి వరకు తత్త్వంతో సహా తెలుసుకోలేరో, అప్పటి వరకు కోరికల నుండి కూడా పతనమైపోతారు. వారి గతేమిటి?

శ్లో ॥ యాన్తి దేవవ్రతా దేవాన్ పితౄ న్యాంతి పితృవ్రతాః ।
భూతాని యాన్తి భూతే జ్యా యాంతి మద్యాజినోఽపిమాం ॥**25**॥

అర్జునా! దేవతలను పూజించు వారు దేవతలను పొందుతారు. దేవతలు పరివర్తనమయ్యే సత్తా కలవారు. వారు తమ సత్కర్మానుసారంగా జీవనాన్ని గడుపుతారు. పితరులను పూజించువారు పితరులనే పొందుతారు అంటే అతీతంలోనే చిక్కుకుపోయి ఉంటారు. భూతాలను పూజించువారు భూతాలవుతారు. శరీరాన్ని ధరించుతారు. కానీ నా భక్తుడు నన్నే పొందుతాడు. వారు సాక్షాత్తుగా నా స్వరూపులవుతారు. వారు పతనం కారు. ఇంతే కాదు, నన్ను పూజించే విధానం కూడా సరళమైంది.

శ్లో ॥ పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి ।
తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః ॥**26**॥

భక్తి ఇక్కడి నుంచే మొదలవుతుంది. పత్రం, పుష్పం, ఫలం, నీళ్ళు యిత్యాది ఏవైనా సరే, ఎవరైనా సరే, నాకు భక్తి పూర్వకంగా అర్పిస్తే, మనస్సుతో ప్రయత్నం చేసే ఆ భక్తులు ఇచ్చేవన్నీ నేను స్వీకరిస్తాను కాబట్టి-

శ్లో ॥ యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసియత్ ।
యత్త పస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణం ॥**27**॥

అర్జునా! నీవు ఏ కర్మ (యథార్థ కర్మ) చేసినా, ఏది తిన్నా, ఏది ఆహుతి యిచ్చినా, ఏది సమర్పించినా, దానం ఇచ్చినా, మనస్సు సహితంగా ఇంద్రియాలను నా అనుగుణంగా తపింపచేసినా, అవన్నీ నాకే అర్పించు, అంటే నా పట్ల సమర్పితభావం కలిగి ఇవన్నీ చెయ్యుము. సమర్పణ చేయడం వలన యోగం యొక్క క్షేత్రానికి సంబంధించిన బాధ్యతను నేను గ్రహిస్తాను.

శ్లో ॥ శుభాశుభ ఫలైరేవం మోక్ష్యసే కర్మ బంధనైః ।
సన్న్యాస యోగ యుక్తాత్మా విముక్తో మాముపైష్యసి ॥**28**॥

ఈ ప్రకారంగా సర్వస్వం యొక్క న్యాసం అంటే సన్యాస యోగంతో యుక్తమై ఉన్న నీవు శుభాశుభ ఫలాల నిచ్చే కర్మల బంధాల నుండి విముక్తుడవయి నన్ను పొందుతావు.

పైన చెప్పబడిన మూడు శ్లోకాలలో యోగేశ్వరుడు క్రమబద్ధంగా, సాధన మరియు దాని పరిణామం గురించి వివరించాడు. మొదటి పత్రం-పుష్పం, ఫలం-జలం వీటిని పూర్తి శ్రద్ధతో అర్పణ, రెండవదిగా సమర్పణతో కూడిన కర్మ యొక్క ఆచరణ మరియు మూడవది పూర్ణ సమర్పణతో సర్వస్వ త్యాగం. వీటి ద్వారా కర్మ బంధాల నుండి విముక్తి (విశేషమైన ముక్తి) లభిస్తుంది. ముక్తి వలన ఏం లభిస్తుంది? అంటే ఇలా అన్నాడు- నన్ను పొందవచ్చు. ఇక్కడ ముక్తి మరియు ప్రాప్తి పొందడం అనేవి ఒకదాని కొకటి పూరకాలు. మిమ్మలను ప్రాప్తి పొందుటయే ముక్తి అయితే, దాని వలన లాభమేమిటి? దీనిని గూర్చి అంటాడు-

శ్లో ॥ సమోఽహం సర్వ భూతేషు నమే ద్వేష్యోఽస్తిన ప్రియః ।
యే భజన్తి తు మాం భక్త్యామయి తే తేషు చాప్యహం ॥**29**॥

నేను అన్ని భూతాలలో సమంగా ఉన్నాను. సృష్టిలో నాకు ఎవరూ ప్రియులు కారు మరియు ఎవరూ అప్రియులు కారు, కానీ ఎవ్వరైతే అనన్య భక్తులో, వారు నాలో ఉన్నారు. మరియు నేను వారిలో ఉన్నాను. ఇదే నా బంధుత్వం. అతనిలో పరిపూర్ణుడనయిపోతాను. నాలోనూ మరి అతనిలోనూ ఏ మాత్రమూ తేడా ఉండదు. అలాంటప్పుడు చాలా అదృష్టశాలురైనవారే భజన చేస్తారా? భజన చేసే అధికారం ఎవరికుంది? దీనిని గురించి యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు ఇలా అంటాడు-

శ్లో ॥ అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్ ।
సాధురేవ స మంతవ్యః సమ్యగ్వ్యవసితో హి సః ॥**30**॥

అత్యంత దురాచారుడయినా కూడా, అనన్య భావంతో అంటే (అన్య+న) నన్ను తప్పించి ఇంకే వస్తువు (లేక) దేవతను భజించక, కేవలం నన్నే నిరంతరం భజిస్తే, అతను కూడా సాధువు అనే అనబడతాడు. ఇప్పుడతను యింకా సాధువు కాలేదు, కానీ అతను సాధువవడంలో సందేహం కూడా లేదు, ఎందుకంటే అతను యథార్థమైన నిశ్చయంతో మొదలు పెట్టాడు. కాబట్టి భజన మీరు కూడా చేయవుచ్చు, కానీ ఒకే ఒక షరతు. ఏమిటంటే మీరు మనుష్యులయి ఉండాలి, ఎందుకంటే మనుష్యుడే యధార్థమైన నిశ్చయం కలవాడవుతాడు. గీత పాపులను ఉద్ధరిస్తుంది మరియు ఆ మార్గస్థుడు-

శ్లో ॥ క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి ।
కౌన్తేయ ప్రతి జానీహి న మే భక్తః ప్రణశ్యతి ॥**31**॥

ఈ భజన యొక్క ప్రభావం వలన ఆ దురాచారుడు కూడా శీఘ్రంగానే ధర్మాత్ముడయిపోతాడు, పరమ ధర్మ పరమాత్మునితో సంయుక్తుడైపోతాడు మరియు ఎల్లప్పుడూ ఉండే పరమశాంతిని పొందుతాడు. కౌంతేయా! 'నా భక్తుడు ఎప్పటికీ నష్టం కాడు అనే ఈ

నిశ్చయ పూర్వకమైన సత్యాన్ని నీవు తెలుసుకొనుము. ఒక జన్మలో గనుక దాటలేకపోతే, తరువాత జన్మల్లో కూడా అదే సాధన చేసి శీఘ్రంగానే పరమశాంతిని పొందుతాడు. కాబట్టి సధాచారికీ, దురాచారికీ అంతెందుకు, అందరికీ భజన చేసే అధికారం ఉంది. యింతే కాదు, కానీ–

శ్లో // మాం హి పార్థ వ్యపాశ్రిత్యయేఽపిస్యుః పాపయోనయః ।
స్త్రీ యో వైశ్యాస్తథా శూద్రాస్తేపి యాంతి పరాంగతిమ్ ॥**32**॥

పార్థా! స్త్రీ, వైశ్య, శూద్రాదులు మరియు ఇంకే పాప జన్మల వారైనా సరే, నా ఆశ్రితులయిన వారందరూ పరమగతిని పొందుతారు. కాబట్టి ఈ 'గీత' మనుష్య మాత్రుల కోసం, ఏం చేసే వాడయినా సరే, ఎక్కడ పుట్టిన వాడైనా సరే. అందరికీ ఇది సమానమైన కళ్యాణ (శుభ) ప్రదమైన ఉపదేశాన్ని ఇస్తుంది. 'గీత' అన్ని దేశాలవారికీ, అన్ని కాలాలవారికీ మార్గదర్శకం, శుభప్రదం.

'పాపయోనివిః'– అధ్యాయం 16/7–21లో ఆసురీ వృత్తుల లక్షణాల గురించి భగవానుడు ఇలా చెప్పాడు– ఎవరైతే శాస్త్ర విధిని త్యజించి నామ మాత్రపు యజ్ఞం ద్వారా ఆడంబరంగా పూజలు చేస్తారో, వారు నరులలో అధములు. అది నిజమైన యజ్ఞం కాదు, పేరుకు మాత్రమే. ఆడంబరం కోసం పూజలు చేసే వారు క్రూర కర్ములు మరియు పాపాచారులు (పాప జన్ములు) పరమాత్మనైన నన్ను ద్వేషించేవారే పాపులు. వైశ్య–శూద్ర అనే వర్గాలు భగవత్పథంలోని మెట్లు. స్త్రీల పట్ల ఒకప్పుడు గౌరవభావం మరోకప్పుడు హీన భావం ఉండేడిది. కానీ యోగ ప్రక్రియలో స్త్రీ మరియు పురుషులు ఇద్దరికీ సమానమైన ప్రవేశం కలదు.

శ్లో // కిం పునర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయస్తథా ।
అనిత్యమసుఖం లోకమిమం ప్రాప్య భజస్వమామ్ ॥**33**॥

అలాంటప్పుడు బ్రాహ్మణ మరియు క్షత్రియు శ్రేణి భక్తుల గురించి ఏం చెప్పాలి? బ్రహ్మణమనేది ఒక దశా విశేషమే, అందులో బ్రహ్మలో ప్రవేశం ఇప్పించే అన్ని యోగ్యతలూ ఉంటాయి. శాంతి, ఆర్జవం అనుభవంతో కూడిన ఉపలబ్ధి, ధ్యానం మరియు ఇష్ట దైవం యొక్క నిర్దేశానుసారం ఎవరిలోనైతే ఆచరణచేసేటటువంటి సామర్థ్యం ఉంటుందో ఇవే బ్రాహ్మణ–దశకు లక్షణాలు. రాజర్షులయిన క్షత్రియులలో రిద్ధుల, సిద్ధుల సంచారం, శౌర్యం ఆధిపత్య భావం, వెనకంజ వేయని స్వభావం ఉంటాయి. ఈ యోగస్థాయిని చేరిన యోగులు తరించి పోగలరు, వారి గురించి ఇంకేం చెప్పాలి? కాబట్టి అర్జునా! నీవు సుఖరహిత, క్షణ భంగురమయిన ఈ మనుష్యశరీరాన్ని పొంది నన్నే భజించు. ఈ నశ్వర శరీరం పట్ల మమకారం, దాని పోషణలో సమయాన్ని వ్యర్థం చేయవద్దు.

యోగేశ్వరుడయిన శ్రీకృష్ణుడు యిక్కడ నాలుగో సారిగా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రుల గురించి చర్చించాడు. రెండో అధ్యాయంలో అతను అన్నాడు. క్షత్రియుడికి

కల్యాణం కోసం యుద్ధం కన్నా వేరే మార్గం లేదు. మూడో అధ్యాయంలో అతను అన్నాడు– స్వధర్మ పాలనలో మరణం కూడా శ్రేయస్కరమే. నాలుగో అధ్యాయంలో అతను సంక్షేపంగా అన్నాడు– నాలుగు వర్ణాల సృష్టి నేను చేసాను. అంటే మనుష్యులను నాలుగు కులాలుగా విభజించాడా? అంటే అన్నాడు– లేదు. 'గుణ కర్మ విభాగశః'– గుణాల ఆధారంగా, కర్మను నాలుగు శ్రేణులుగా చేయడమయింది. శ్రీకృష్ణుడి అభిప్రాయానుసారంగా కర్మ అంటే యజ్ఞం ప్రక్రియ. కాబట్టి ఈ యజ్ఞాన్ని చేయువారు నాలుగు రకాలు. ప్రవేశకాలంలో ఈ యజ్ఞకర్త శూద్రుడు, అల్పజ్ఞుడు. కొంచెం చేయడం నేర్చుకున్నాక, ఆత్మిక సంపత్తిని చేకూర్చుకుంటే, అదే యజ్ఞకర్త వైశ్యుడయి పోతాడు. దీని కంటే ఉన్నతమయినప్పుడు ప్రకృతి యొక్క మూడు గుణాలను ఖండించే సామర్థ్యం వచ్చినప్పుడు, అదే సాధకుడు క్షత్రియ శ్రేణికి చెందుతాడు. మరియు ఎప్పుడయితే ఇదే సాధకుడి స్వభావంలో బ్రహ్మలో ప్రవేశం కలిగించే యోగ్యతలు వస్తాయో, అప్పుడు అతనే బ్రహ్మణుడు. వైశ్య మరియు శూద్రుల కంటే క్షత్రియ మరియు బ్రాహ్మణ శ్రేణి సాధకుడు ముక్తికి సమీపంలో ఉంటాడు. శూద్రుడు మరియు వైశ్యుడు కూడా అదే బ్రహ్మలో ప్రవేశం పొంది శాంతి పొందుతారు, మరి అంతకంటే పై దశ వారిని గురించి ఏం చెప్పాలి? వారి బ్రహ్మప్రవేశం నిశ్చయమే గదా!

'గీత' ఏ ఉపనిషత్తుల సారసర్వస్వమో, వాటిలో బ్రహ్మ–విదుషీ మహిళల గురించి ఎన్నో కథలు ఉన్నాయి. ధర్మభీరువులు సంప్రదాయబద్ధులు అని చెప్పబడతున్నవారు వేదాధ్యయనం యొక్క అధికారం– అనధికారాల గురించి చర్చించి తలలు పగలగొట్టు కొంటారు, కానీ యోగేశ్వరుడు శ్రీకృష్ణుడు స్పష్టంగా ఉద్ఘాటించిందేమిటంటే యజ్ఞార్థ కర్మల యొక్క నిర్ధారిత ప్రక్రియలో స్త్రీ పురుషులందరూ ప్రవేశించ వచ్చును.

కాబట్టి అతను భజన చేయడాన్ని ప్రోత్సహిస్తాడు–

శ్లో ॥ మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।
మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః ॥**34**॥

అర్జునా! నాపై మనస్సు గలవాడని కమ్ము. నేను కాక ఇంకో భావం మనస్సులోకి రానే కూడదు. నా అనన్యభక్తుడవు కమ్ము, అనవరతంగా చింతనలో ఉండు. శ్రద్ధా సహితంగా నన్నే నిరంతరం పూజించు. మరియు నాకే నమస్కారం చెయ్యి. ఈప్రకారంగా నాశరణుజొచ్చి, ఆత్మను నాతో ఏకీభావంతో స్థితం చేస్తే నీవు నన్నే పొందుతావు అంటే నాతో ఏకత్వాన్ని పొందవచ్చు.

సారాంశం :

ఈ అధ్యాయం ఆరంభంలో శ్రీకృష్ణుడు ఇలా చెప్పాడు– అర్జునా! దోషరహిత భక్తుడవైన నీకోసం నేను ఈ జ్ఞానాన్ని విజ్ఞాన సహితంగా చెబుతాను, దీనిని తెలుసుకొన్న పిదప తెలుసుకోవలసినదింకేది కూడా ఉండదు. దీనిని తెలుసుకొని నీవు సంసార బంధం నుంచి ముక్తుడవయిపోతావు. ఈ జ్ఞానం సమస్త విద్యలలో శ్రేష్ఠమయినది. పరమ బ్రహ్మలో ప్రవేశం ఇప్పించేదే అసలైన విద్య. ఈ జ్ఞానం దానికి కూడా రాజు అంటే నిశ్చయంగా కళ్యాణం

(మేలు) కలిగించేది. ఇది సమస్త గోపనీయ విషయాలలో కూడా శ్రేష్ఠమయినది. గోపనీయ వస్తువును కూడా ప్రత్యక్షం చేయించేది. ఇది ప్రత్యక్ష ఫలాన్నిచ్చేది. సాధన చేయడంలో సుగమమైనది మరియు నశ్వరముకానిది. స్వల్పంగానైనా దీని సాధన చేయగలిగితే, దీనికి ఎప్పటికీ నాశనం లేదు, పై పెచ్చు దీని ప్రభావం వలన ఆ పరమ శ్రేయం వరకు చేరవచ్చును. కానీ దీనిలో ఒక షరతు. శ్రద్ధా విహీనుడయిన పురుషుడు పరమగతిని పొందక, సంసార చక్రంలో చిక్కుకొని పోతాడు.

యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు యోగం యొక్క మహత్త్వం గూర్చి కూడా వివరణ ఇచ్చాడు, దుఃఖ సంయోగంతో వియోగమే యోగం, అంటే ఏదైతే సంసారం యొక్క సంయోగ వియోగాలచే రహితమైందో దాని పేరే యోగం. పరమాత్మునిలో కలవడమే యోగం యొక్క పరాకాష్ఠ. ఎవరైతే ఇందులో ప్రవేశం పొందారో, ఆ యోగి యొక్క ప్రభావాన్ని గమనించు- సమస్త భూతాలకు ప్రభువును మరియు జీవధారుల పోషించునదైనప్పటికీ నా ఆత్మ ఆ భూతాలలో స్థితమై లేదు. నేను ఆత్మ స్వరూపంలో స్థితమై ఉన్నాను. నేను ఆత్మనే. ఎలాగైతే ఆకాశంలో ఉత్పన్నమయి, సర్వత్ర చరించే వాయువు ఆకాశంలో స్థితమయిఉంటుంది. కానీ దానిని మలినం చేయలేదు గదా! అలాగే సమస్త భూతాలు నాలో స్థితమై ఉంటాయి, కానీ వాటిలో లిప్తుడను కాను.

అర్జునా! కల్ప ప్రారంభంలో నేను భూతాలను విశేషంగా సృష్టిస్తాను, అలంకరిస్తాను మరియు కల్పం పూర్తయ్యే కాలంలో సంపూర్ణ భూతాలు, నా ప్రకృతిని అంటే యోగారూఢుడైన మహాపురుషుడు ఉండే తీరుని, వారి అవ్యక్త భావాన్ని పొందుతాయి. మహాపురుషుడు ప్రకృతి కంటే అతీతమయిన వాడే, కానీ బ్రహ్మ ప్రాప్తి పిదప స్వభావ, అంటే స్వయంలో స్థితుడై ఉంటూ లోక కళ్యాణం కోసం ఏ కర్మ చేస్తాడో, అది అతని ఒకరకపు జీవన విధానం అతని జీవన విదానపు కార్య కలాపాలను ఆ మహాపురుషుని ప్రకృతి అంటూ చెప్పారు.

ఒక సృష్టికర్తను నేను, భూతాలను కల్పం కోసం ప్రేరేపించుతాను. మరియు ఇంకో సృష్టికర్త త్రిగుణాత్మకమైన ప్రకృతి, అది నానీడన చరాచర భూతాలను సృష్టిస్తుంది. అది కూడా ఒక కల్పమే, అందులో శరీర పరివర్తనం, స్వభావ పరివర్తనం మరి కాల పరివర్తనం అనేవి నిహితమై ఉంటాయి. గోస్వామి తులసీదాసు కూడా అదే అంటారు-

ఏక్ దుష్ట్ అతిశయ దుఃఖ్ రూపా ।
జా బస్ జీవ్ పరా భవ కూపా ॥ (రామచరితమానస, 3/14/5)

ప్రకృతికి రెండు భేదాలు- విద్య మరియు అవిద్య ఉన్నాయి. దీనిలో అవిద్య దుష్టమైనది, దుఃఖరూపమైనది, దీనికి వివషమై జీవుడు భవ కూపంలో ఉన్నాడు. దీనిచే ప్రేరితమైన జీవుడు కాలము, కర్మ, స్వభావము మరియు గుణములచే చుట్టబడుతాడు. రెండవది విద్యా మాయ, దీనినే శ్రీకృష్ణుడు ''నేను రచిస్తాను'' అంటాడు. గోస్వామి

తులసీదాసు అభిప్రాయంలో ప్రభువు మాయని రచించాడు.

ఏక రచఇ జగగున బస్ జాకే ।
ప్రభు ప్రేరిత నహీం నిజ్ బలతాకే ॥ (రామచరిత మానస, 3/14/6.)

ఇది జగత్తును సృష్టిస్తుంది, దీన్ని ఆశ్రయించుకొని గుణాలు ఉన్నాయి. కళ్యాణకారి అయిన గుణాలు కేవలం ఈశ్వరునిలోనే ఉన్నాయి. ప్రకృతిలో ఎలాంటి గుణమూ లేదు. అది నశించునది, విద్యలో ప్రభువే ప్రేరకుడయి క్రియ చేస్తాడు.

ఈ ప్రకారంగా కల్పాలు రెండు రకాలు. ఒకటి వస్తు కల్పం అది శరీరాన్ని మరియు కాలాన్ని పరివర్తనం చేస్తుంది. కానీ ఈ పరివర్తనను ప్రకృతే నా ఆశ్రయంలో ఉంటూ చేస్తుంది. కానీ దీని కంటే గొప్పదైన కల్పం, ఆత్మకు నిర్మల స్వరూపాన్ని ప్రదానం చేసేది. దానిని సింగారించేది మహాపురుషులే. వారు అచేతనములయిన భూతాలను సచేతనాలుగా చేస్తారు. భజన ప్రారంభమే యీ కల్పానికి మొదలు మరియు భజన యొక్క పరాకాష్టే ఈ కల్పానికి అంతం. ఈ కల్పం భవరోగాన్ని పూర్తిగా నయం చేసి శాశ్వత బ్రహ్మలో ప్రవేశం (స్థితి) ఇప్పించుతుంది, ఆ ప్రవేశ కాలంలో యోగి నేను ఉండే తీరును మరియు నా స్వరూపాన్ని పొందుతాడు. ముక్తి తరువాత మహాపురుషుడు ఉండే తీరే అతని ప్రకృతి.

ధర్మ గ్రంథాల కథలను బట్టి నాలుగు యుగాలు గడచిన తరువాత కల్పం ముగుస్తుంది. మహా ప్రళయం వస్తుంది, సాధారణంగా లోకులు దీని యథార్థాన్ని తెలుసుకోరు. 'యుగం' అంటే అర్థం రెండు. మీరు వేరు, అరాధ్య దైవం వేరుగా ఉన్నంత వరకు యుగ ధర్మం ఉంటుంది. గోస్వామి తులసీదాసు రామచరిత మానస, ఉత్తరకాండలో దీని గురించి చర్చించారు. ఎప్పుడు తామసీ గుణం కార్యం చేస్తుంటుందో, రజోగుణం అల్పమాత్రంగా ఉంటుందో, నాలుగు వైపులా వైరులు-విరోధులు ఉంటారో, అలాంటి వ్యక్తి కలియుగంలో ఉండేవాడు, అతను భజన చేయలేడు, కానీ సాధన ప్రారంభమయినప్పుడు యుగ పరివర్తనం జరుగుతుంది. రజోగుణం పెరగడం మొదలవుతుంది, తమోగుణం క్షీణమవుతూ పోతుంది. కొంచెం సత్త్వ గుణం కూడా స్వభావంలోకి వస్తుంది, హర్షం మరియు భయం అనే ద్వంద్వాలు ఉంటాయి. అప్పుడు అదే సాధకుడు ద్వాపరం దశలోకి వస్తాడు. క్రమంగా సత్వగుణం బహుళమయినప్పుడు రజోగుణం స్వల్పంగా ఉండి పోతుంది, ఆరాధనా కర్మ పట్ల ఆసక్తి పెరుగుతుంది, అలాంటి త్రేతా యుగంలో విషయాలను వదలి వేయగల స్థితిలో ఉన్న సాధకుడు అనేక యజ్ఞాలు చేస్తాడు. 'యజ్ఞానాం జప యజ్ఞోస్మి' యజ్ఞ శ్రేణికి చెందిన జపం (దాని పెరుగుదల తరుగుదల శ్వాస-ప్రశ్వాసలపై ఆధారపడి ఉంటుంది.) చేసే సామర్థ్యం ఉంటుంది. ఎప్పుడైతే సత్వగుణం మాత్రం ఉండి అసమానత నశించి, సమత్వం వస్తుందో, అప్పుడు కృతయుగం అంటే కృతార్థ యుగం (లేక) సత్యయుగం ప్రభావం వస్తుంది. ఆ సమయంలో యోగులందరూ వైజ్ఞానికులవుతారు, ఈశ్వర స్థితిలో లీనమయ్యే వారవుతారు, స్వాభావికంగానే ధ్యానస్థుడయ్యే సామర్థ్యం వారిలో ఏర్పడుతుంది.

వివేకశీలురు యుగ ధర్మాల పెరుగుదల-తరుగుదలను మనస్సులోనే అర్థం చేసుకుంటారు. మనస్సును నిరోధించడం కోసం అధర్మాన్ని పరిత్యజించి, ధర్మంలో ప్రవృత్తులవుతారు. నిరుద్ధమయిన మనస్సు కూడా విలయమయిపోయినప్పుడు, యుగాలతో బాటుగా కల్పం కూడా అంతమైపోతుంది. పూర్ణత్వంలో ప్రవేశం ఇప్పించి కల్పం కూడా శాంతమైపోతుంది. ఇదే ప్రయళం అంటే, అప్పుడు ప్రకృతి పురుషునిలో విలీనమయిపోతుంది. దీని తరువాత మహాపురుషుడు ఏ తీరుగా ఉంటాడో, అదే అతని ప్రకృతి, అతని స్వభావం.

యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు అంటాడు-అర్జునా! మూఢులు నన్ను తెలుసుకోలేరు. ఈశ్వరులకు ఈశ్వరుడినైన నన్ను తుచ్ఛుడనని అనుకొంటారు, సాధారణ మనష్యుడిగా భావిస్తారు. ప్రతి మహాపురుషుని పట్ల ఇటువంటి భ్రమ ఏర్పడింది. సమకాలీన సమాజం అతణ్ణి ఉపేక్షించింది. అతని పట్ల విరోధభావం చూపించింది. శ్రీకృష్ణుడు కూడా దీని నుండి తప్పించుకోలేకపోయాడు. అతనంటాడు- నేను పరమభావంలో స్థితుడనై ఉన్నాను. కానీ నా శరీరం కూడా మనుష్యుడిదే. కాబట్టి మూఢులు నన్ను తుచ్ఛుడనీ, మనుష్యుడనీ సంభోధించారు. అలాంటి వారు వ్యర్థంగా బ్రహ్మపదాన్ని ఆశించేవారు, వ్యర్థంగా కర్మ చేసేవారు, వ్యర్థమైన జ్ఞానం గలవారు, ఏదో ఒకటి చేసేసి మాకు కోరికలు లేవు' అనేస్తే చాలు. వారు నిష్కామ కర్మ యోగులయిపోతారా? ఆ ఆసురీ స్వభావం గలవారు నన్ను చూడలేరు. కానీ దైవీ సంపదను పొందిన వారు అనన్య భావంతో నా ధ్యానం చేస్తారు. నా గుణాలను గురించి నిరంతరం చింతన చేస్తారు.

అనన్య ఉపాసన అంటే యజ్ఞార్థ కర్మ. దానికి రెండే మార్గాలు. మొదటిది జ్ఞాన యజ్ఞం అంటే తమ విశ్వాసంతో, తమ శక్తిని అర్థం చేసుకొని, ఆ నియత కర్మలో ప్రవృత్తులవడం. రెండవ విధి స్వామి- సేవక భావం, దానిలో సద్గురువు పట్ల సమర్పిత భావం కలిగి ఉండి అదే కర్మను చేయడం. ఈ రెండు దృష్టులతోనే లోకులు నన్ను ఉపాసిస్తారు. కానీ వారి ద్వారా చేయబడే ఆ యజ్ఞం, ఆ ఆహుతి, ఆకర్త, శ్రద్ధ మరియు భవరోగానికి చికిత్స జరిగే ఔషధి, అవన్నీ నేనే. చివరకు ఏగతి అయితే ప్రాప్తిస్తుందో, అది కూడా నేనే.

ఇదే యజ్ఞాన్ని లోకులు 'త్రై విద్యా'- ప్రార్థన, యజ్ఞం మరియు సమత్వం ఇప్పించే విధులతో నెరవేరుస్తారు, కానీ దానికి బదులుగా స్వర్గాన్ని కోరుకుంటారు, అప్పుడు నేను స్వర్గాన్ని కూడా ఇస్తాను. దాని ప్రభావం వలన వారు ఇంద్ర పదవిని పొందుతారు, దీర్ఘకాలం దాకా దానిని అనుభవిస్తారు. కానీ పుణ్యం క్షీణించినప్పుడు వారు పునర్జన్మను పొందతారు. వారి క్రియ సరి అయినదే, కానీ భోగాలను కోరుకోవడం వలన పునర్జన్మను పొందతారు. కాబట్టి భోగాలను కోరుకోరాదు. ఎవరైతే అనన్య భావంతో అంటే 'నేను తప్పించి యింకొకరు లేరు' ఇలాంటి భావంతో నిరంతరం నా చింతన చేస్తారో, లేశమాత్రం కూడా లోటు ఉండనివ్వరో, అలా ఎవరైతే నా భజన చేస్తారో, వారి యోగ రక్షణ భారాన్ని నేను వహిస్తాను.

ఇంత జరిగినా కూడా కొందరు అన్యదేవతలను పూజిస్తారు. అట్టివారు కూడా

నన్నే పూజిస్తారు కానీ అది నన్ను పొందే విధికాదు. సంపూర్ణ యజ్ఞాల భోక్తగా వారు నన్ను తెలుసుకోలేరు, అంటే వారి పూజలకు ఫలంగా నేను లభించను. కాబట్టి వారు పతనమయిపోతారు. వారు దేవతలు, భూతాలు (లేక) పితరులనే కల్పిత రూపాలలో నివసిస్తారు, అలా గాక నా భక్తులు సాక్షాత్తు నాలో నివసిస్తారు, నా స్వరూపులయి పోతారు.

యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు యజ్ఞార్థ కర్మలు చాలా సుగమమని చెప్పాడు-ఎవరైనా సరే ఫలం-పుష్పం ఏదైనా సరే శ్రద్ధతో సమర్పిస్తే నేను స్వీకరించుతాను. కాబట్టి అర్జునా నీవు ఎంత ఆరాధన చేసినా సరే, నాకే సమర్పించు. ఎప్పుడైతే సర్వస్వః న్యాసమయిపోతుందో, అప్పుడు యోగంతో యుక్తుడవైన నీవు కర్మ బంధాల నుండి ముక్తుడవయిపోతావు మరియు ఆ ముక్తీ నా స్వరూపమే.

ప్రపంచంలోని ప్రాణులందరూ నావారే. ఏ పాణిపైనా నాకు ప్రేమ లేదు, ద్వేషమూ లేదు. నేను తటస్థుడను, కానీ ఎవరైతే నా అనన్య భక్తులో, నేను వారిలో ఉంటాను ; వారు నాలో ఉన్నారు. అత్యంత దురాచారుడు ఘోరపాపి అయినా సరే అనన్య శ్రద్ధా-భక్తులతో నా భజన చేస్తే, వారు సాధువులుగానే భావించబడతారు. వారి నిశ్చయం స్థిరమైనది, అయితే వారు శీఘ్రంగానే పరమాత్ముడి సంయుక్తమయి పోతారు. మరియు నిత్యమయిన పరమశాంతిని పొందుతారు. ధార్మికుడెవరన్నది యిక్కడ శ్రీకృష్ణుడు స్పష్టం చేసాడు. సృష్టిలో జన్మించే ఏ ప్రాణియైనా సరే, అనన్య భావంతో ఒక్క పరమాత్ముడి భజనచేస్తే, అతడి చింతన చేస్తే శీఘ్రంగానే ధార్మికుడయిపోతాడు. కాబట్టి ఎవరైనా ఒకే పరమాత్మున్ణి స్మరిస్తే అతనే ధార్మికుడు. చివరిలో అతని పట్లు విశ్వాసం ఉన్నప్పుడు అతనేం చేస్తాడో చెప్తాడు- అర్జునా! నా భక్తుడు ఎప్పటికీ నశించడు. శూద్రుడైనా, నీచుడయినా. ఆదివాసుడయినా, పురుషుడయినా లేదా స్త్రీ అయినా, లేక పాప జన్ముడైనా, తిర్యక్ జన్ముడయినా కూడా, నాశరణుజొచ్చి పరమ శ్రేయాన్ని పొందుతాడు. కాబట్టి అర్జునా! సుఖరహితమైన, క్షణ భంగురమైన, దుర్లభమయిన మనుష్య శరీరాన్ని పొందినందు వలన నాభజన చెయ్యి. అలాంటప్పుడు బ్రహ్మలో ప్రవేశం ఇప్పించే అర్హతలతో యుక్తుడైన, ఆ బ్రాహ్మణుని గురించిగానీ లేక రాజర్షిత్వ స్థాయిలో భజన చేసే ఆయోగి గురించిగానీ చేప్పేదేముంటంది? వారు తరించి పోయినట్లే. కాబట్టి అర్జునా! నిరంతరం నాలో మనస్సు గలవాడివి కమ్ము, నిరంతరం నాకు నమస్కారం చెయ్యి. ఈ ప్రకారంగా నా శరణులోకి వచ్చిన నీవు నన్నే పొందుతావు. అక్కడి నుంచి వెనుకకు రానవసరం ఉండదు. (పునర్జన్మ ఉండదు).

ప్రస్తుత అధ్యాయంలో శ్రీకృష్ణుడు స్వయంగా జాగృతం చేసే ఆ విద్యను చర్చించడమైంది. అది రాజవిద్య, అది ఒకసారి జాగృతమైతే, నిశ్చయంగా కళ్యాణం (మేలు) చేస్తుంది.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మ విద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే **'రాజ విద్యాః జాగృతిః'** నామ నవమోఽధ్యాయః ॥**9**॥

ఈ ప్రకారంగా శ్రీమద్భగవద్గీతా రూపమైన ఉపనిషత్తు మరియు బ్రహ్మవిద్యా

మరియు యోగశాస్త్ర విషయంలో శ్రీకృష్ణార్జున సంవాదంలో 'రాజ విద్యా జాగృతి' అనే పేరుగల తొమ్మిదవ అధ్యాయం పూర్తయింది.

ఇతి శ్రీమత్పరమహంస పరమానందస్య శిష్య స్వామీ అడగడానంద కృతే శ్రీమద్‌భగవద్‌గీతా యాః 'యథార్థ గీతా' భాష్యే 'రాజవిద్యా జాగృతి' నామ నవమోఽధ్యాయః॥ **9**॥

ఇతి శ్రీమత్పరమహంస పరమానందగారి శిష్యుడు స్వామి అడగడానంద గారిచే రచించబడిన 'శ్రీమద్భగవద్గీతా'' యొక్క భాష్యం ''యదార్థ గీతా''లో 'రాజవిద్యా జాగృతి' అనే తొమ్మిదవ అధ్యాయం పూర్తయింది.

॥హరి ఓం తత్సత్॥

ఓం

శ్రీ పరమాత్మనే నమః

# దశమోఽధ్యాయము

గత అధ్యాయంలో యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు గుప్తమైన, నిశ్చయంగా కళ్యాణకారి అయిన రాజ విద్యను వర్ణించాడు. పదవ అధ్యాయంలో అతను ఇలా చెబుతున్నాడు. మహాబాహు అర్జునా! నా పరమ రహస్యయుక్తమైన వాక్కులను మళ్ళీ విను. ఇక్కడ అర్జునునికి రెండవసారి చెప్పవలసిన అవసరం ఏముంది? వాస్తవానికి సాధకునికి పూర్తిదాకా అపాయం వెన్నంటి ఉంటుంది. అతను స్వరూపంలో లీనమయిపోతున్న కొద్దీ ప్రకృతి ఆవరణ సూక్ష్మమైపోతుంది, క్రొత్త క్రొత్త దృశ్యాలు కనవస్తాయి. వాటి గురించి మహాపురుషుడే తెలుపుతూ ఉంటాడు. సాధకుడికి తెలీదు. అతను గనుక మార్గదర్శనం చేయడం మానేస్తే, సాధకుడు స్వరూపం యొక్క ఉపలబ్ధిని కోల్పోతాడు. అతను స్వరూపం నుంచి దూరంగా ఉన్నంత వరకు ప్రకృతి యొక్క ఏదో ఒక ఆవరణ అతనిపై ఉంటుంది, జారడానికీ. తూలడానికీ అవకాశం ఉంటుంది. అర్జునుడు శరణాగత శిష్యుడు. అతను అన్నాడు– **'శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నం'** భగవాన్! నేను మీ శిష్యుణ్ణి మీ శరణు జొచ్చాను,. నన్ను రక్షించండి'. కాబట్టి అతని హితాన్ని కోరుకుంటూ, యోగేశ్వరుడు శ్రీకృష్ణుడు మళ్ళీ అదే విషయం చెప్పాడు–

శ్రీభగవానువాచ

శ్లో ॥ భూయ ఏవ మహాబాహో శృణు మే పరమం వచః।
యత్తేఽహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా ॥1॥

మహాబాహువైన అర్జునా! పరమ ప్రభావయుక్తమైన నా మటల్ని మళ్ళీ విను, అవి నేను అతిశయ ప్రేమను కలిగియున్న నీ హితాన్ని కోరుతూ, చెప్తుతున్నాను.

శ్లో ॥ న మే విదుః సురగణాః ప్రభవం న మహర్షయః ।
అహమాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః ॥2॥

అర్జునా! నా ఉత్పత్తిని దేవతలు తెలుసుకోలేరు మరియు మహా ఋషులూ తెలుసుకోలేరు. శ్రీకృష్ణుడు అన్నాడు **'జన్మ కర్మచ మే దివ్యం'** – నా జన్మ మరియు కర్మ అలౌకికమైనవి, ఈ చర్మ–చక్షువులతో చూడనలవి కానివి. కాబట్టి ఈ నా ఉద్భవాన్ని దేవతల మహర్షుల స్థాయికి చేరిన వారు కూడా తెలుసుకో లేరు. నేను దేవతలందరి పుట్టుకకు కారకుడను.

శ్లో ॥ యో మామజమనాధిం చ వేత్తి లోక మహేశ్వరమ్ ।
అసంమ్మూఢః స మర్త్యేషు సర్వ పాపైః ప్రముచ్యతే ॥3॥

జన్మ–మృత్యువులచే రహితుడనైన, ఆది–అంతములచే రహితుడనైన, అన్ని లోకాలకూ మహేశ్వరుడ (ప్రభువు) నయిన నన్ను సాక్షాత్కార సహితంగా విదితం చేసుకున్న ఆ పురుషుడు మరణ ధర్ములైన మనుష్యులలో కెల్ల జ్ఞానవంతుడు అంటే అజుడైన, అనాది అయిన సర్వలోకాలకూ మహేశ్వరుడైన పరమాత్మను చక్కగా తెలుసుకోవడమే జ్ఞానం. అలా తెలుసుకొన్న వారు సమస్త పాపాల నుండీ ముక్తులైపోతారు, పునర్జన్మను పొందరు. శ్రీకృష్ణుడు ఇలా అంటాడు– ఈ ఉపలబ్ధికూడా నేను యిచ్చేదే.

శ్లో ॥ బుద్ధిర్జ్ఞానమ సమ్మోహః క్షమా సత్యం దమః శమః ।
సుఖం దుఃఖం భావోఽభావో భయం చాభయమేవచ ॥4॥

అర్జునా! నిశ్చయాత్మకమైన బుద్ధి, సాక్షాత్కార సహితమైన జ్ఞానం, లక్ష్యంలో వివేక పూర్వకమైన ప్రవృత్తి, క్షమ, శాశ్వత సత్యం, ఇంద్రియాల నియంత్రణ, మనస్సు యొక్క నిరోధం, అంతఃకరణంలో ప్రసన్నత, చింతన పథంలో అవరోధాలు, పరమాత్ముడి జాగృతి, స్వరూపం యొక్క ప్రాప్తికాలంలో సర్వస్వం విలయమై పోవడం, ఇష్టదైవం పట్ల క్రమశిక్షణా పూర్వక భయం, ప్రకృతి పట్ల నిర్భయత్వం మరియు–

శ్లో ॥ అహింసా సమతా తుష్టిస్తపో దానం యశోఽయశః ।
భవన్తి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః ॥5॥

అహింసా అంటే తమ అత్మను అధోగతిలో పడవేయని ఆచరణ, సమానత్వం, విషమత లేని, సంతోషం, మనస్సహితంగా ఇంద్రియాలను లక్ష్యానికి అనుగుణంగా తపింప చేయడం, దాన, అంటే సర్వస్వం యొక్క సమర్పణ, భగవత్పథంలో మాన–అపమానాలను, సహించడం– ప్రాణులలో పైన చెప్పబడిన భావాలు నా వల్లనే ఏర్పడతాయి. ఈ భావాలన్నీ దైవీ–చింతన పద్ధతి యొక్క లక్షణాలు. ఇవి లేకపోవడమే 'ఆసురీ సంపద'కు లక్షణం.

శ్లో ॥ మహర్షయః సప్తపూర్వే చత్వారోమనవస్తథా ।
మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః ॥6॥

సప్తర్షులు అంటే యోగం యొక్క ఏడు భూమికలు (శుభేచ్ఛ), సువిచారణ, తనుమానస,

సత్వాపత్తి, అసంసక్తి, పదార్థాభావన మరియు తుర్యగా) మరియు వీటికి అనుగుణంగా అంతః కరణ చతుష్టయం (మనస్సు, బుద్ధి, చిత్తం మరియు అహంకారం) దానికి అనుగుణంగా నాపై భావం గల మనస్సు, ఇవన్నీ నా సంకల్పం చేతనే (నా ప్రాప్తికై సంకల్పం చేత మరియు నా ప్రేరణ చేతనే జరుగుతాయి. రెండూ ఒకదానికొకటి పూరకాలు.) ఉత్పన్నం అవుతాయి. ఈ ప్రపంచంలో సమస్త దైవీ సంపదలూ వీని ద్వారా కలిగేవే. ఎందుకంటే ఏడు భూమికల సంచారంలో దైవీ సంపదే ఉన్నది, మరి ఇంకేమీ లేదు.

శ్లో ॥ ఏతాం విభూతిం యోగం చ మమయో వేత్తి తత్త్వతః ।
సోఽవికమ్పేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః ॥7॥

ఏ పురుషుడు యోగాన్ని పైన చెప్పబడిన నా విభూతులనూ సాక్షాత్కారంతో బాటుగా తెలుసుకొంటాడో, అతను స్థిర ధ్యాన యోగం ద్వారా నాలో ఏకీభావంతో స్థితుడై ఉంటాడు. ఇందులో ఏమాత్రం సంశయం లేదు. ఏ ప్రకారంగా వాయు రహిత స్థానంలో ఉంచిన దీప శిఖ తిన్నగా ఉంటుందో, ప్రకంపనలు ఉండవో, యోగి యొక్క గెలవబడిన చిత్తానికి కూడా ఇదే నిర్వచనం చెప్పవచ్చును. ప్రస్తుత శ్లోకంలోని 'అవి కంపేన' అనే శబ్దం ఈ ఆశయాన్నే తెలియజేస్తుంది.

శ్లో ॥ అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే ।
ఇతి మత్వా భజన్తే మాం బుధా భావసమన్వితాః ॥8॥

నేను సమస్త జగదుత్పత్తికీ కారకుడను. నా వలన సంపూర్ణ జగత్తు క్రియాశీలమవుతుంది. ఈ ప్రకారంగా భావించుకొని శ్రద్ధా-భక్తులతో యుక్తులై వివేకులు నన్నే నిరంతరం భజిస్తారు. తాత్పర్యమేమిటంటే యోగికి నా అనుగుణంగా ఏ ప్రవృత్తయితే ఏర్పడుతుందో, దానిని నేనే ఏర్పరుస్తాను. అది నా ప్రసాదమే. (ఎలాగ? దీనిని గురించి వెనక చాలా చెప్పబడింది) వారు నిరంతరం భజన ఏ ప్రకారంగా చేస్తారు? అప్పుడు ఇలా అంటాడు-

శ్లో ॥ మచ్చిత్తా మద్గత ప్రాణా బోధయన్తః పరస్పరమ్।
కథయన్తశ్చ మాం నిత్యం తుష్యంతి చ రన్తితి చ ॥9॥

వేరే ఇంకెవరికీ స్థానం ఇవ్వకుండా, నాపైనే నిరంతరం చిత్తాన్ని ఉంచేవారు, నాలోనే ప్రాణాల్ని స్థితం చేసే వారు, ఎల్లప్పుడూ నా ప్రక్రియలనే బోధించుతారు. నా గుణాల్ని గానం చేస్తూనే సంతుష్టులవుతారు. నిరంతరం నాలోనే ఆనందిస్తారు.

శ్లో ॥ తేషాం సతత యుక్తానాం భజతాం ప్రీతి పూర్వకం ।
దదామి బుద్ధి యోగం తం యేన మాము పయాన్తితే॥ 10॥

నిరంతరం నాధ్యానం చేస్తూ మరియు ప్రేమపూర్వకంగా భజన చేసే ఆ భక్తులకు నేను ఆ బుద్ధియోగాన్ని, అంటే యోగంలో ప్రవేశింపచేసే బుద్ధిని యిస్తాను, దాని వలన వారు నన్ను పొందుతారు. అంటే యోగం యొక్క జాగృతి ఈశ్వరుడు యిచ్చేదే. ఆ అవ్యక్త పురుషుడు, 'మహా పురుషుడు' యోగంలో ప్రవేశం యిప్పించే బుద్ధిని ఎలా యిస్తాడు?

శ్లో ॥ తేషామేవానుకమ్పార్థ మహమజ్ఞానజం తమః ।
నాశయామ్యాత్మ భావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥ **11**॥

అతనిపై పూర్ణ అనుగ్రహం చూపడం కొరకు నేను అతడి ఆత్మతో అభిన్నుడనై ఉండి రథుడనై, అజ్ఞానం నుంచి ఉత్పన్నమయ్యే అంధకారాన్ని, జ్ఞాన రూపమయిన దీపం ప్రకాశింపజేసి, పటాపంచలు చేస్తాను. వాస్తవానికి స్థితప్రజ్ఞుడైన యోగి ద్వారా ఎప్పటి వరకు ఆ పరమాత్ముడు ఆత్మలోనే జాగృతుడయి, క్షణ క్షణం సంచాలనం చేయడో, నియంత్రణ చేయడో, ప్రకృతి యొక్క ద్వంద్వాలనుండి రక్షిస్తూ స్వయంగా ముందుకు నడిపించడో, అప్పటి వరకు వాస్తవంగా యథార్థమైన భజన ఆరంభమే కాదు.అలాగనుకుంటే భగవానుడు అన్నివైపుల నుండీ మాట్లాడుతూనే ఉంటాడు, కానీ ప్రారంభంలో స్వరూపస్థుడైన మహాపురుషుని ద్వారానే మాట్లాడతాడు. అలాంటి మహాపురుషుడు గనక మీకు లభించకపోతే, అతను మీకు స్పష్టంకాడు.

ఇష్టదైవం లేక సద్గురువు, లేక పరమాత్ముడు రథుడనేది ఒకటే. సాధకుని ఆత్మలో జాగృతమయి పోయినప్పుడు అతని నిర్దేశాలు నాలుగు రకాలుగా లభిస్తాయి. మొదట స్థూల ధ్యానానికి సంబంధించిన అనుభవాలు అవుతాయి. మీరు చింతనలో కూర్చున్నారనుకోండి. ఎప్పుడు మీ మనస్సు లగ్నం అయింది? ఎంత వరకు అయింది? ఎప్పుడు మనస్సు పారిపోవాలనుకుంటోంది? ఎప్పుడు పారిపోయింది? వీటిని గురించి ప్రతి నిమిషం-ప్రతి సెకెండు ఇష్ట దైవం అంగ స్పందనల ద్వారా సంకేతం ఇస్తాడు. అంగాలు స్పందించడం (అదరడం) అనేది స్థూల ధ్యానానికి సంబంధించిన అనుభవం. అది ఒకే క్షణంలో, రెండు నాలుగు చోట్ల, ఒకే సారిగా జరగడం మొదలవుతుంది. మీరు వికృతమైనప్పుడు నిముష-నిమిషానికీ స్పందించడం జరుగుతుంది. ఇష్ట దైవం యొక్క స్వరూపాన్ని మీరు అనన్య భావంతో గ్రహించినప్పుడే ఈ సంకేతాలు వస్తాయి. అన్యథా సాధారణ జీవులలో సంస్కారాల ప్రభావం వలన అంగస్పందనలు అవుతూనే ఉంటాయి, వీటికీ ఇష్ట దైవం వలన అయ్యే స్పందనలకూ ఎలాంటి సంబంధమూ లేదు.

రెండో రకం అనుభవం స్వప్నధ్యానానికి సంబంధించినది. సాధారణ మనుష్యులు తమ కోరికలకు సంబంధించిన స్వప్నాలు చూస్తారు, కానీ ఎప్పుడైతే మీరు యిష్టదైవాన్ని ఆశ్రయిస్తారో, అప్పుడు ఈ కలలు కూడా నిర్ధేశాలుగా మారి పోతాయి. యోగి కలలు చూడడు, కాబోయేది చూస్తాడు.

పైన చెప్పబడిన రెండు అనుభవాలు ప్రారంభిక దశకు చెందినవి. ఇవి తత్త్వస్థితుడైన మహాపురుషుని సాన్నిధ్యం వలన మనస్సులో అతని పట్ల శ్రద్ధను ఏర్పరచుకోవడం వలన, అతనికి ఎంతో కొంతసేవ చేయడం వలన జగృతమయిపోతాయి, కానీ ఈ రెండింటి కన్నా సూక్ష్మమైన మిగిలిన రెండు అనుభవాలు క్రియాత్మకం అయినవి, వాటిని క్రియాత్మకంగా ఆచరించే చూడగలము-

మూడో రకం అనుభవం సుషుప్తి ధ్యానానికి సంబంధించినది. ప్రపంచంలో

అందరూ పడుకొనే ఉంటారు గదా. మోహమనే మత్తులో అందరూ అచేతనులై పడి ఉంటారు. రాత్రింబగళ్ళు ఏం చేస్తున్నా సరే, స్వప్నమే గదా. సుషుప్తి అంటే అసలైన అర్థం ఏమిటి?, పరమాత్మునితో చింతన యొక్క సంబంధం ఎలా ఏర్పడాలంటే, ధ్యానం చింతన ఒక్కసారిగా స్థిరమైపోవాలి, శరీరం మెలకువలో ఉండాలి మరియు మనస్సు సుప్తమయిపోవాలి. అలాంటి దశలో ఆ ఇష్టదైవం మళ్ళీ సంకేతం చేస్తాడు. యోగానికి అనుగుణంగా ఒక రూపకం (దృశ్యం) వస్తుంది, అది సరియైన దిశను ప్రదానం చేస్తుంది. భూత భవిష్యత్తుల గురించి అవగతం చేయిస్తుంది. 'పూజ్య గురువుగారు' అనేవారు– ''డాక్టరు ఎలా మత్తు ఇచ్చి, సరైన చికిత్స చేసిన తరువాత తెలివిలోకి తెస్తాడో, అలాగే భగవానుడు మార్గం చూపిస్తాడు''.

నాలుగోది మరియు చివరి అనుభవం సమధ్యానానికి సంబంధించినది. ఇందులో మీరు ధ్యానం అవలంబించుచున్నారు. ఆ పరమాత్మునితో సమత్వం ప్రాప్తమయిపోతుంది, దాని తరువాత నిల్చున్నా కూర్చున్నా, నడస్తూన్నా–తిరుగుతున్నా సర్వత్రా పరమాత్ముడి అనుభూతి కలుగుతుంది. ఇలాంటి యోగి త్రికాలజ్ఞుడవుతాడు. ఈ అనుభవాన్ని మూడు కాలాలకతీతమైన అవ్యక్త స్థితి పొందిన మహాపురుషుడు ఆత్మ నుండి జాగృతుడయి అజ్ఞానజనితమైన అంధకారాన్ని జ్ఞాన దీపంతో నష్ట పరుస్తాడు. అప్పుడు అర్జునుడు ఇలా ప్రశ్నించాడు–

అర్జునఉవాచ

శ్లో ॥ పరం బ్రహ్మ పరం ధామ పవిత్రం పరమం భవాన్ ।
పురుషం శాశ్వతం దివ్యమాది దేవమజం విభుమ్ ॥ **12**॥
ఆహు స్త్వాంఋషయః సర్వే దేవర్షిర్నారదస్తథా ।
అసితో దేవలో వ్యాసః స్వయం చైవ బ్రవీషిమే ॥ **13**॥

భగవాన్ ! మీరు పరంబ్రహ్మ, పరంధాములు మరియు పరమ పవిత్రులు, ఎందుకంటే మిమ్మల్ని ఋషులందరూ సనాతనుడనీ, దివ్యపురుషుడనీ, దేవతల కూ్కడా ఆది దేవుడనీ, అజన్ముడనీ మరియు సర్వవ్యాప్తుడనీ అంటారు. పరమపురుషుడు, పరంధాముడనే వాటికే దివ్యపురుషుడు, అజన్ముడు, మొదలైనవి పర్యాయ పదాలు. దేవర్షి నారదుడు, అసితుడు, దేవలుడు, వ్యాసుడు మరియు స్వయంగా మీరూ నాతో అదే అంటున్నారు. అంటే మొదట్లో, భూతకాలం ఉండిన మహర్షులు అలా అన్నారు. ఇప్పుడు వర్తమానంలో నాకు ఎవరి సహవాసం ఉపలబ్ధమయ్యిందో, నారదుడు, దేవలుడు అసితుడు మరియు వ్యాసుడు కూడా అదే అంటున్నారు, (వీరు అర్జునుడికి సమకాలీనులు, సత్పురుషుల సహవాసం అర్జునుడికి లభించింది) మీరు కూడా అదే అంటున్నారు. కాబట్టి–

శ్లో ॥ సర్వమేతదృతం మన్యే యన్మాం వదసి కేశవ ।
న హి తే భగవన్ వ్యక్తిం విదుర్దేవా న దానవాః ॥ **14**॥

హే కేశవా! మీరు ఏం చేబుతున్నారో, దానిని నేను పూర్తిగా సత్యమనే భావిస్తున్నాను. మీ వ్యక్తిత్వం దేవతలకు గానీ, దానవులకుగానీ తెలియనటువంటిది.

శ్లో // స్వయమేవాత్మనాత్మానం వేత్థ త్వం పురుషోత్తమ ।
భూత భావన భూతేశ దేవదేవ జగత్పతే ॥ **15**॥

హే! భూతాలను ఉత్పన్నం చేసే వాడా! భూతాలకు ఈశ్వరుడా! దేవ దేవా! హే జగద్ ప్రభూ! పురుషులలో ఉత్తముడా! స్వయంగా మీరే మిమ్ములను తెలుసుకుంటారు, లేదా ఎవరి ఆత్మను జాగృతం చేసి, మీరు తెలియ బరుస్తారో, వారే తెలుసుకుంటారు. అది కూడా మీ ద్వారానే, మిమ్ములను తెలుసుకోవడమయింది కాబట్టి-

శ్లో // వక్తుమర్హస్య శేషేణ దివ్యా హ్యాత్మ విభూతయః।
యాభిర్విభూతిభి ర్లోకానిమాంస్త్వం వ్యాప్య తిష్ఠసి ॥ **16**॥

మీరే మీ యొక్క ఆ దివ్య విభూతులను సంపూర్ణంగా, లేశమాత్రంగా కూడా శేషముంచకుండా, చెప్పడంలో సమర్థులు. ఆ విభూతుల ద్వారా మీరు ఈ లోకాలన్నింటిలో వ్యాపించి స్థితులై ఉన్నారు.

శ్లో // కథం విద్యామహం యోగిస్త్వాం సదా పరిచింతయన్ ।
కేషు కేషు చ భావేషు చింన్త్యోऽసి భగవన్మయా ॥ **17**॥

హే యోగిన్! (శ్రీకృష్ణుడు ఒక యోగి). నేను ఏ ప్రకారంగా నిరంతరం చింతన చేస్తూ మిమ్మల్ని తెలుసుకోగలను? హే భగవన్! నేను ఏఏ భావాల ద్వారా మీ స్మరణ చేయగలను?

విస్తరేణాత్మనో యోగం విభూతిం చ జనార్ధన ।
భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేऽమృతం ॥ **18**॥

హే జనార్ధనా! మీ యోగశక్తిని గురించి, యోగం యొక్క విభూతులను గురించి మళ్ళీ విస్తార పూర్వకంగా చెప్పండి. సంక్షేపంగా యీ అధ్యాయం ఆరంభంలో చెప్పారు, మళ్ళీ చెప్పండి, ఎందుకంటే అమృతతత్వాన్ని ఇప్పించే ఈ వచనాలను వింటుంటే నాకు ఇంకా తృప్తి కలగటం లేదు.

రామచరిత జేసునత్ అఘాహీ ।
రస్ విశేష్ జానా తిన్హి నా హీ ॥ (రామచరిత మానసం 7/52/1)

ఎప్పటి వరకు బ్రహ్మలో ప్రవేశం దొరకలేదో అప్పటి వరకు ఆ అమృతత్వాన్ని పొందాలనే పిపాస ఉంటుంది. ఎప్పటి వరకు బ్రహ్మలో ప్రవేశించడానికి పూర్వమే, దారిలోనే 'చాలా తెలుసుకొన్నాను' అని అనుకొని ఎవరైనా ఆగిపోతే, అతను ఏమీ తెలుసుకో లేదన్న మాట. దాని వలన తెలిసే దేమిటంటే మార్గంలో అడ్డంకులు ఏర్పడుతున్నాయి. కాబట్టి సాధకుడికి చివరి వరకూ ఇష్ట దైవం యొక్క నిర్ధేశాలను ఆశ్రయించుకొని ఉండవలసి ఉంటుంది. మరియు వాటిని ఆచరణలో పెట్టవలసి ఉంటంది. అర్జునుడి యీ జిజ్ఞాసను చూసి యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు-

శ్రీభగవానువాచ-

శ్లో ॥ హన్త తే కథయిష్యా మిదివ్యా హ్యాత్మవిభూతయః।
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ నాస్త్యన్తో విస్తరస్య మే ॥ **19**॥

కురుశ్రేష్ఠుడవైన అర్జునా! ఇప్పుడు నా విభూతులను గురించి, అందులోనూ ప్రముఖమైన విభూతులను గురించి, నీకు చెబుతాను, ఎందుకంటే నా విభూతుల విస్తారానికి అంతం లేదు.

శ్లో ॥ అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః।
అహమాదిశ్చ మధ్యం చ భూతానామన్త ఏవ చ ॥**20**॥

అర్జునా! నేను అన్ని భూతాల హృదయాలలో స్థితుడనైన, అందరి ఆత్మను. సంపూర్ణ భూతాల ఆది, మధ్య, అంతములు నేనే అంటే జన్మ-మృత్యువు మరియు జీవనం కూడా నేనే.

శ్లో ॥ ఆదిత్యానామహం విష్ణుర్జ్యోతిషాం రవిరంశుమాన్।
మరీచిర్మరుతామస్మి నక్షత్రాణామహం శశీ ॥**21**॥

నేను అదితి యొక్క పన్నెండుమంది పుత్రులలో విష్ణువును మరియు జ్యోతులలో ప్రకాశమానమైన సూర్యుడను. వాయువుల యొక్క రకాలలో మరీచి పేరుగల వాయువును. నక్షత్రాలలో చంద్రుడను.

శ్లో ॥ వేదానాం సామవేదోఽస్మి దేవానామస్మి వాసవః।
ఇంద్రియాణాం మనశ్చాస్మి భూతానామస్మి చేతనా ॥**22**॥

వేదాలలో నేను సామ వేదాన్ని అంటే పూర్ణ సమత్వాన్ని ప్రదానం చేసే గీతాన్ని. దేవతలలో నేను వారి అధిపతియైన ఇంద్రుణ్ణి. ఇంద్రియాలలో మనస్సును, ఎందుకంటే మనస్సును నిగ్రహించడం వల్లనే నన్ను తెలుసుకోవచ్చును మరియు ప్రాణులలో వారి చైతన్యాన్ని.

శ్లో ॥ రుద్రాణాం శంకరశ్చాస్మి విత్తేశో యక్షరక్షసాం ॥
వసునాం పావకశ్చాస్మి మేరుః శిఖరిణామహం ॥**23**॥

ఏకాదశ రుద్రులలో నేను శంకరుణ్ణి. శంక+హర స శంకరః అంటే శంకలను హరించే అవస్థ నేను. యక్షులు మరియు రాక్షసులలో నేను ధనానికి స్వామి అయిన కుబేరుణ్ణి. ఎనిమిదిమంది వసువులలో నేను అగ్నిని. మరియు శిఖరాలలో సుమేరువుని. అంటే శుభాల యొక్క కలయికని నేను. అదే సర్వోన్నతమైన శిఖరం అది పర్వతం కాదు. వాస్తవానికి ఇవన్నీ యోగ సాధనలోని ప్రతీకలు, యోగశాస్త్ర పారిభాషిక పదాలు.

పురోధసాం చ ముఖ్యం మాం విద్ధి పార్థ బృహస్పతిం।
సేనానీ నామహం స్కన్దః సరసామస్మి సాగరః ॥**24**॥

పురాన్ని రక్షించు పురోహితులలో బృహస్పతి నేనే అని తెలుసుకో. అతని వలన దైవీ సంపద యొక్క సంచారం జరగుతుంది మరియు హే పార్థా! సేనాపతులలో నేను కార్తికేయుణ్ణి.

కర్మ యొక్క త్యాగమే కార్తికము, దాని వలన చరాచరం యొక్క సంహారం, ప్రళయం మరియు ఇష్టదైవం యొక్క ప్రాప్తి జరుగుతాయి. జలాశయాలలో నేను సముద్రాన్ని.

శ్లో ॥ మహర్షీణాం భృగురహం గిరమస్మ్యేకమక్షరం ।
యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః ॥**25**॥

మహర్షులలో నేను భృగువును. మరియు వాక్కులలో ఒక అక్షరమైన 'ఓం' కారాన్ని, అది ఆ బ్రహ్మ యొక్క పరిచాయకం. అన్ని ప్రకారాల యజ్ఞాలలో నేను జపయజ్ఞాన్ని. యజ్ఞం పరమాత్మనిలో ప్రవేశాన్ని ఇప్పించే ఆరాధన యొక్క విధి విశేషం. దాని సారాంశమేమిటంటే– స్వరూప స్మరణం. మరియు నామ జపం. రెండు వాక్కులను అతిక్రమించి పోయినప్పుడు నామం ఎప్పుడైతే యజ్ఞం యొక్క శ్రేణిలోకి వస్తుందో, అప్పుడు వాక్కు ద్వారా నామం జపించబడదు, చింతన ద్వారా కూడా కాదు, కంఠంతో కూడా కాదు, కానీ అది శ్వాసలో జాగృతమయిపోతుంది. కేవలం ధ్యానాన్ని శ్వాస వద్ద ఉంచి, మనస్సుతో అవిరళంగా జపం చేయవలసి ఉంటుంది. యజ్ఞం యొక్క శ్రేణిని చేరిన నామం యొక్క పెరుగుదల–తరగుదలలు శ్వాసపై ఆధారపడి ఉంటుంది. ఇది క్రియాత్మకమైనది. స్థిరంగా ఉండే వాటిలో నేను హిమాలయాన్ని, శీతలమైనది, సమమైనది మరియు అచంచలమైనది ఒక్క పరమాత్ముడే. ప్రళయం వచ్చినప్పుడు మనువు ఆ శిఖరానికి బంధించబడ్డాడు. అచంచలమైన, సమమైన మరియు శాంతమయిన బ్రహ్మకు ప్రళయం లేదు. ఆ బ్రహ్మ యొక్క స్థావరాన్ని నేను.

శ్లో ॥ అశ్వత్థః సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదః ।
గంధర్వాణాం చిత్రరథః సిద్ధానాం కపిలో మునిః ॥**26**॥

వృక్షాలన్నింటిలోకి నేను అశ్వత్థాన్ని **అ శ్వః** రేపటి వరకు కూడా ఉంటుందనే గ్యారంటీలేదు. అలాంటి **'ఊర్ధ్వ మూలమధః శాఖం అశ్వత్థమ్;**– పైన పరమాత్ముడే దానికి మూలం, క్రింద ప్రకృతి దాని శాఖలు! అలాంటి ప్రపంచమే ఒక వృక్షం, దానికి రావి చెట్టు అని సంకేతం ఇవ్వబడింది. –సామాన్య రావి చెట్టనుకొని పూజించడం మొదలెట్టకండి. తరువాత అంటాడు– అది నేనే. మరియు దేవర్షులలో నేను నారదుణ్ణి. 'నాద రంధ్రః స నారద'. దైవీ సంపద ఎంత సూక్ష్మమయి పోతుందంటే శ్వాసలో ఉత్పన్నమయే ధ్వని (నాదం) పట్టులోకి వస్తుంది, అలాంటి జాగృతి' నేనే. గంధర్వులలో నేను చిత్రరథుడను అంటే పాటపాడే (చింతన చేసే) వారి ప్రవృత్తులలో ఎప్పుడైతే స్వరూపం చిత్రితమవడం మొదలవుతుందో, ఆ దశావిశేషాన్ని నేను. సిద్ధులలో నేను కపిలమునిని. కాయ (శరీరం) మే కపిలుడు. దీనిలో ఎప్పుడైతే గురి ఏర్పడుతుందో, అట్టి ఈశ్వరీయ సంచారం యొక్క దశను నేను.

శ్లో ॥ ఉచ్చైః శ్రవసమశ్వానాం విద్ధి మామమృతోద్భవం ।
ఐరావతం గజేంద్రాణాం నరాణాం చ నరాధిపం ॥**27**॥

అశ్వాలలో నేను అమృతం నుంచి ఉత్పన్నమయ్యే ఉచ్చైశ్రవం అనే పేరుగల అశ్వాన్ని. ప్రపంచంలోని ప్రతి వస్తువూ నశించేదే. ఆత్మ ఒక్కటే అజరం, అమరం, అమృత స్వరూపం. ఈ అమృత స్వరూపం దేనిలో సంచారమవుతుందో, అ గుఱ్ఱాన్ని నేను. గుఱ్ఱం గతికి ప్రతీకం.

ఆత్మ తత్త్వాన్ని గ్రహించడానికి ఎప్పుడైతే మనస్సు అటు పరిగెడుతుందో, అదే గుఱ్ఱం. అలాంటి గతి (పరుగు)ని నేను. ఏనుగులలో 'ఐరావతం' పేరుగల ఏనుగుని. మనుష్యులలో రాజుగా నన్ను తెలుసుకో. వాస్తవానికి మహాపురుషుడే రాజు. అతనికి ఏ లోటూ ఉండదు.

శ్లో ॥ ఆ యుధానామహం వజ్రం ధేనూనా మస్మి కామధుక్ ।
ప్రజనశ్చాస్మి కందర్పః సర్పాణామస్మి వాసుకిః ॥**28**॥

ఆయుధాలలో నేను వజ్రాయుధాన్ని. గోవులలో కామధేనువును. కామధేనువు ఆవుకాదు. పాలకు బదులు మనస్సుకిష్టమైన భోజన పదార్థాలను ఇచ్చేది అంతకంటే కాదు. ఋషులలో వశిష్ఠుని వద్ద కామధేనువు ఉండేది. వాస్తవానికి 'గో' అంటే యింద్రియాలు. ఇష్టదేవుణ్ణి వశం చేసుకొనే వారి వద్ద ఇంద్రియాల సంయమనాన్ని చూడవచ్చు. ఎవరి ఇంద్రియాలయితే ఈశ్వరునికి అనుగుణంగా స్థిరపడిపోతాయో, వారికి వారి ఇంద్రియాలే కామధేనువులుగా మారి పోతాయి. మరి అప్పుడు **'జో యిచ్ఛా కరిహవు మన్ మాహీ, హరి ప్రసాద్ కఛు దుర్లభ్ నాహీ** (రామచరిత మానసం 7/113/4).

అతనికి ఏదీ దుర్లభం కాదు. ప్రజననం చేయువారిలో క్రొత్త స్థితులను ప్రకటించే వాణ్ణి నేను. 'ప్రజననం' అంటే పిల్లలను పుట్టించడం. చరాచరజగత్తులో రాత్రింబగళ్ళు ఎలకలు –చీమలు పుడుతూనే ఉంటాయి. రాత్రి, పగలు పుట్టిస్తూనే ఉంటాయి. అలా కాకుండా ఒక స్థితి నుంచి రెండో స్థితికి వృత్తులు పరివర్తనం చేయబడతాయి, ఈ పరివర్తిత స్వరూపాన్ని నేను. సర్పాలలో నేను వాసుకిని.

శ్లో ॥ అనన్తశ్చాస్మి నాగానాం వరుణో యదసామహమ్ ।
పితౄణామర్యమా చాస్మి యమః స్సంయమతామహమ్ ॥**29**॥

నాగులలో నేను అనంతుణ్ణి అంటే శేషనాగుని. అలా అనుకొంటే ఇది సర్పము కాదు. ''గీతకు సమకాలీనమైన పుస్తకం శ్రీమద్భాగవతం. దీనిలో శేషనాగుస్వరూపం చర్చ గురించి ఉంది. ఈ పృథ్వి నుంచి ముప్పైవేల యోజనాల దూరంలో ఆ పరమాత్ముని యొక్క వైష్ణవీ శక్తి ఉంది, దాని శిరస్సుపై ఈ పృథ్వి ఆవగింజ అంత భార రహితంగా నిలబడి ఉంది. ఆ యుగంలో యోజనం అంటే ఎంత దూరమో, కానీ ఇది మాత్రం చాలా– చాలా దూరమే. వాస్తవానికి ఇది ఆకర్షణ శక్తి యొక్క చిత్రణ. వైజ్ఞానికులు దీనినే 'ఈథరు' అని భావిస్తున్నారు. గ్రహాలు, ఉపగ్రహాలు అన్నీ ఈ శక్తి ఆధారంగానే నిలబడి ఉన్నాయి. ఆ శూన్యంలో గ్రహాలకు ఎలాంటి భారం లేదు. ఆ శక్తి సర్పం యొక్క కుండలిలాగా అన్ని గ్రహాలను చుట్టు చుట్టుకొని ఉంది. ఇదే ఆ అనంతుడు. దీని వలన పృథ్వీ ధారణ చేయ బడింది. శ్రీకృష్ణుడు అంటాడు– అలాంటి ఈశ్వరీయ శక్తిని నేను. జలచరాలలో వాటి అధిపతియైన 'వరుణుణ్ణి నేను మరియు పితరులలో ఆర్యముడను. అహింస, సత్యం, అస్తేయం బ్రహ్మచర్యం మరియు అపరిగ్రహం అనేవి అయిదు యమ నియమాలు. వీటిని ఆచరించడంలో వచ్చే వికారాలను ఖండించడమే 'అరః' అంటే. వికారాలు నశించడంతోనే, పితృ అంటే భూత–సంస్కారాలు తృప్తి పొందుతాయి, నివృత్తి ప్రదానం చేస్తాయి. పరిపాలన చేసే వారిలో నేను యమరాజును అంటే పైన చెప్పబడిన

యమ నియమాల నియామకుణ్ణి.

శ్లో ॥ ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతామహమ్ ।
మృగాణాం చ మృగేంద్రోఽహం వైనతేయశ్చ పక్షిణాం ॥30॥

నేను దైత్యులలో ప్రహ్లాదుణ్ణి (పర+ఆహ్లాదం– ఇతరులకై ఆహ్లాదం) ప్రేమే ప్రహ్లాదుడు. ఆసురీ సంపదలో ఉంటూ ఈశ్వరుని కోసం ఆకర్షణ వ్యాకులత పుట్టుకొస్తాయి, దాని వలనే పరమ ప్రభువు దిగ్దర్శనం అవుతుంది. అలాంటి ప్రేమోల్లాసాన్ని నేను. లెక్క పెట్టువారిలో నేను సమయాన్ని. ఒకటి, రెండు, మూడు, నాలుగు ఇలాంటి లెక్క గానీ లేక క్షణం –గడియ–దినం–పక్షం–మాసం మొదలగునవి కాను. కానీ ఈశ్వర చింతనలో నిమగ్నమైన సమయాన్ని నేను. ఎంత వరకూ అంటే 'జాగత్ మే సుమిరన్ కరె. సోవత్ మే లవ్ లాయ్ (మేలుకున్నప్పుడు స్మరణ చేయి, పడుకొన్నప్పుడు ధ్యానం) అలాంటి అనవరతమైన చింతనలో సమయాన్ని నేను. పశువులలో మృగరాజును (యోగి కూడా మృ+గ అంటే యోగరూపమైన అడవిలో గమనం చేసేవాడు). పక్షులలో గరుడుడను నేనే. జ్ఞానమే గరుడుడు. ఎప్పుడైతే యీశ్వరీయ అనుభూతి కలగడం మొదలవుతుందో, అప్పుడు ఈ మనస్సే తన ఆరాధ్య భగవంతునికి వాహనమై పోతుంది మరియు యిదే మనస్సు ఎప్పుడైతే సంశయాలతో యుక్తమై ఉంటుందో, అప్పుడు 'సర్పం' అయి కాటేస్తు ఉంటుంది, అనేక జన్మలలోకి విసిరేస్తుంది. గరుడుడు విష్ణుని వాహనం. విశ్వంలో అణురూపంలో సంచారితమవుతున్న సత్తాను జ్ఞానంతో సంయుక్తమైన మనస్సు తనలో ధరిస్తుంది, దాని వాహనంగా మారిపోతుంది. శ్రీకృష్ణుడు అంటాడు– ఇష్టదైవాన్ని ధరించే మనస్సును నేనే.

శ్లో ॥ పవనః పవతామస్మి రామః శస్త్ర భృతామహమ్ ।
ఝషాణాం మకరశ్చాస్మి స్రోతసామస్మి జహ్నవీ ॥31॥

పవిత్రం చేయువాటిలో నేను వాయువును, శస్త్రధారులలో రాముణ్ణి, **'రమంతి యోగినః యస్మిన్ సరామః'** – యోగులు దేనిలో రమిస్తారు? అనుభవంలో. ఈశ్వరుడు ఇష్టదైవంగా ఏ నిర్దేశనలు ఇస్తాడో, యోగి వాటిలో రమిస్తాడు. ఆ జాగృతి యొక్క పేరే రాముడు. ఆ జాగృతిని నేనే. చేపలలో మొసలిని మరియు నదులలో గంగను నేనే.

శ్లో ॥ సర్గాణా మాదిరన్తశ్చ మధ్యం చైవా హమర్జున ।
అధ్యాత్మ విద్యా విద్యానాం వాదః ప్రవదతామహం ॥32॥

హే అర్జునా! సృష్టుల ఆది, అంతం మరియు మధ్య నేనే. విద్యలలో ఆధ్యాత్మ విద్యను నేనే. ఏదైతే ఆత్మకు ఆధిపత్యాన్ని ఇప్పిస్తుందో, ఆ విద్యను నేనే. ప్రపంచంలో ఎక్కువ శాతం ప్రాణులు మాయ ఆధిపత్యంలో ఉన్నారు. రాగ ద్వేషం, కాలం, కర్మ, స్వభావం మరియు గుణాలచే ప్రేరితులయి ఉన్నారు. వీటి ఆధిపత్యంలో నుండి ముక్తుల్ని చేసి, ఆత్మ యొక్క ఆధిపత్యంలోకి తీసుకెళ్ళే విద్యను నేను, దానినే ఆధ్యాత్మిక విద్య అంటారు. పరస్పరం జరిగే వివాదాలలో బ్రహ్మ చర్చలలో ఏదైతే నిర్ణాయకమో, అలాంటి ప్రసంగాన్ని నేనే. మిగిలిన

నిర్ణాయాలు నిజానికి అనిర్ణయాలే.

శ్లో ॥ అక్షరాణామకారోఽస్మి ద్వన్ద్వః సామాసికస్య చ ।
అహమే వాక్షయః కాలో ధాతాహం విశ్వతోముఖః ॥**33**॥

నేను అక్షరాలలో 'అ' కారాన్ని – ఓం కారాన్ని మరియు సమాసాలలో ద్వంద్వ సమాసాన్ని. అక్షయ కాలాన్ని నేనే. కాలం ఎల్లప్పుడూ పరివర్తన శీలం, కానీ ఏ సమయమైతే అక్షయం, అజరం, అమరమైన పరమాత్మునిలో చోటు ఇప్పిస్తుందో, ఆ దశను నేనే. విరాట్ స్వరూపాన్ని అంటే సర్వత్ర వ్యాప్తమై ఉండే, అందరి ధారణ, పోషణ చేసే వాడిని కూడా నేనే.

శ్లో ॥ మృత్యుః సర్వహరశ్చాహముద్భవశ్చ భవిష్యతాం ।
కీర్తిః శ్రీ ర్వాక్చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా ।**34**॥

నేను అందరినీ నాశనం చేసే మృత్యువుని మరియు కాబోయే ఉత్పత్తికి కారకుడను. స్త్రీలలో నేను యశస్సు, శక్తి, వాక్పటుత్వం, స్మృతి, మేధా అంటే బుద్ధి, ధైర్యం మరియు క్షమా గుణాన్ని నేనే.

యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడ చెప్పినట్లు– ''ద్వావిమౌ పురుషాలోకే క్షరాశ్చాక్షర ఏవచ!'' (అధ్యాయం 15 శ్లోకం 16) ప్రపంచంలో రెండు రకాల పురుషులే ఉంటారు, క్షరం మరియు అక్షరం. సంపూర్ణ భూతాదికాల ఉత్పన్నం మరియు వినాశనం అయ్యే ఈ శరీరం క్షర పురుషుడు. వారు పురుషులయినా లేక స్త్రీలయినా, ఏమన్నా సరే, శ్రీకృష్ణుడి అభిప్రాయ ప్రకారం అందరూ పురుషులే. రెండవ రకంవారు అక్షర పురుషుడు వారు కూటస్థమయిన చిత్తం స్థిరమయ్యే కాలంలో కనిపిస్తారు. ఈ కారణం చేతనే ఈ యోగ మార్గంలో స్త్రీ, పురుషులందరూ సమానంగా మహాపురుషులవుతూ వచ్చారు. ఇక్కడ కూడా స్మృతి, శక్తి, బుద్ధి మొదలగు వాటిని స్త్రీ గుణాలుగానే చెప్పడమయింది. ఈ సద్గుణాల అవసరం పురుషులకు లేదా? శ్రీమంతుడు, కీర్తివంతుడు, వక్తా, స్మరణ శక్తిసంపన్నుడు, మేధావి, ధైర్యవంతుడు, మరియు క్షమావంతుడు కావాలని కోరుకోని పురుషుడెవడైనా ఉంటాడా? బౌద్ధిక స్థాయిలో వెనకబడిన పిల్లలలో ఈ గుణాలను వికసింప చేయాలనే ఉద్దేశ్యంతో తల్లి తండ్రులు అతని చదువుకోసమై, మరింత ఎక్కువగా ఏర్పాట్లు చేస్తారు. ఇక్కడ ఈ లక్షణాలు కేవలం స్త్రీలలోనే ఉంటాయి అని చెప్పబడింది. కాబట్టి మీరే అలోచించి చూడండి 'స్త్రీ' ఎవరన్నది? వాస్తవానికి మీ హృదయం యొక్క ప్రవృత్తే 'స్త్రీ' దానిలో ఈ గుణాల సంచారం జరగాలి. ఈ గుణాలను కలిగి ఉండడమనేది స్త్రీ లింగం, పుల్లింగం– అందరికీ ఉపయోగ కరమైనదే. అవి నానుంచే కలుగుతాయి.

శ్లో ॥ బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛందసామహం ।
మాసానాం మార్గ శీర్షోఽహం ఋతూనాం కుసుమాకరః ॥**35**॥

గానానికి యోగ్యమైన శృతులలో నేనే బృహత్సామాన్ని అంటే బృహత్తుతో సంయుక్తమైన సమత్వాన్ని ఇప్పించే గేయాన్ని. అంటే అలాంటి జాగృతిని నేను. ఛందాలలో

గాయత్రీ ఛందాన్ని నేను. గాయత్రి ఏదో మంత్రం కాదు, దానిని చదవడం వల్ల ముక్తి దొరకదు, కానీ అది ఒక సమర్పణాత్మకమైన ఛందం. మూడు సార్లు వ్రత భంగం అయిన తరువాత ఋషి విశ్వామిత్రుడు తనను ఇష్టదైవానికి సమర్పితం చేసుకొంటూ ఇలా అన్నాడు–

ఓం భూర్భువః స్వః తత్సవితుర్వరేణ్యం
భర్గోదేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్!

'అంటే భూః, భువః మరియు స్వః మూడు లోకాలలో తత్త్వ రూపంలో వ్యాప్తుడైన ఓ దేవా! మీరే వరేణ్యులు. మాకు అలాంటి బుద్ధి ఇవ్వండి, అలాంటి ప్రేరణ కలిగించండి. దాని వలన మేము లక్ష్యాన్ని పొందగలగాలి. అది ఒక ప్రార్థన మాత్రమే. 'నేను ఎప్పుడు సరిగ్గా ఉన్నాను. లేక ఎప్పుడు తప్పుగా ఉన్నాను? అనే నిర్ణయాన్ని సాధకుడు తన బుద్ధితో తీసుకోలేడు. సమర్పిత భావంతో అతను చేసే ప్రార్థన నేనే, దాని వలన నిశ్చయంగా మేలు జరగుతుంది. ఎందుకంటే అతను నా ఆశ్రయం పొందాడు. మాసాలలో శీర్షస్థమైన మార్గం నేను. మరియు ఎల్లప్పుడూ పువ్వులతో ఉండే ఋతువునూ, హృదయం యొక్క అలాంటి అవస్థను కూడా నేనే.

శ్లో ॥ ద్యూతం ఛల యతామస్మి తేజస్తేజస్వి నామహమ్ ।
జయోऽస్మి వ్యవసాయోऽస్మి సత్త్వం సత్త్వవతామహమ్ ॥**36**॥

తేజస్వంతులయిన పురుషుల తేజాన్ని నేను. జూదంలో మోసం చేసే వారి మోసాన్ని నేను. ఇంకేం; జూదం ఆడదాం, అందులో అన్ని రకాల మోసాలు చేద్దాం, అదే భగవంతుడు గదా. కాదు అలా ఏం కాదు. ఈ ప్రకృతే ఒక జూదం. ఇదే మోసం చేసేది. ఈ ప్రకృతి ద్వంద్వాలనుంచి బయటపడడానికి, ఆడంబరాన్ని వదలి, దాక్కొని గుప్తంగా భజన చేయడమే మోసం. మోసం కాదు గానీ తప్పించుకొనేందుకు ఇది అవసరం. జడ భరతుని లాగా, పిచ్చి, గుడ్డి, చెవుడు మరియు మూగ వారిలా, హృదయంలో అంతా తెలుసుకొంటూ కూడా బయటకు ఏమీ తెలియనివాడిలా ఉంటూ, వింటూ కూడా విననట్లు, చూస్తూ కూడా చూడనట్లు ఉండాలి. గుప్తంగా భజన చేసే విధానంతోనే సాధకుడు ప్రకృతి –పురుషుని జూదాన్ని తప్పించుకోగలడు. గెలిచే వారి గెలుపు నేను మరియు వ్యాపారుల నిశ్చయ (దీని గురించి రెండో అధ్యాయం శ్లోకం 41లో చెప్పడమయింది. ఈ యోగంలో నిశ్చయాత్మక క్రియ ఒక్కటే, బుద్ధి ఒక్కటే, దిశకూడా ఒక్కటే,) క్రియాత్మక బుద్ధిని నేనే. సాత్విక పురుషుల తేజస్సు మరియు ఓజస్సు నేనే.

శ్లో ॥ వృష్ణీనాం వాసుదేవోऽస్మి పాండవానాం ధనంజయః ।
మునీనామప్యహం వ్యాసః కవీనాముశనా కవిః ॥**37**॥

వృష్ణి వంశంలో నేను వసుదేవుడను అంటే సర్వత్రా నివసించు దేవుణ్ణి నేను. పాండవులలో ధనంజయుణ్ణి. పుణ్యమే పాండవులు. ఆత్మిక సంపత్తియే స్థిర సంపత్తి. పుణ్యంచే ప్రేరితమై అధ్యాత్మిక సంపత్తిని ఆర్జించే ధనంజయుణ్ణి నేనే. మునులలో నేను వ్యాసుణ్ణి. పరమ

తత్త్వాన్ని వ్యక్తం చేసే సామర్థ్యం ఎవరిలో ఉందో, ఆమునిని నేనే. కవులలో ఉశనుణ్ణి అంటే అందులో (బ్రహ్మలో) ప్రవేశం ఇప్పించే కావ్యకారుణ్ణి నేనే.

శ్లో ॥ దణ్డో దమయతామస్మి నీతిరస్మి జిగీషతామ్ ।
మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతామహం ॥**38**॥

అణచి వేయువారిలో అణచే శక్తిని నేనే. గెలవకోరుకునే వారికి నేను నీతిని, గుప్తంగా ఉంచవలసిన భావాలలో నేను మౌనాన్ని మరియు జ్ఞానవంతులలో సాక్షాత్కారంతో బాటుగా దొరికే జ్ఞానాన్ని, పూర్ణ జ్ఞానాన్ని నేనే.

శ్లో ॥ యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున ।
న తదస్తి వినా యత్స్యాన్మయా భూతం చరాచరం ॥**39**॥

అర్జునా! భూతాలన్నింటి ఉత్పత్తికి కారణం కూడా నేనే. ఎందుకంటే చర మరియు అచరమైన భూత సమూహంలో ఏదీ కూడా నాతో రహితమై లేదు. నేను సర్వత్రా వ్యాప్తుడను. అందరూ నా ఆధారం చేతనే ఉన్నారు.

శ్లో ॥ నాన్తోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరన్తప ।
ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతేర్విస్తరో మయా ॥**40**॥

పరంతపా! అర్జునా ! నాదివ్య విభూతులకు అంతం లేదు. నా విభూతుల విస్తారాన్ని నేను సంక్షేపంగా చెప్పాను. వాస్తవానికి అవి అనంతం.

ఈ అధ్యాయంలో కొన్ని విభూతులు స్పష్టీకరించబడ్డాయి, ఎందుకంటే వచ్చే అధ్యాయంలో అర్జునుడు వీటన్నింటినీ చూడాలనుకొంటాడు. ఎందుకంటే ప్రత్యక్ష దర్శనం చేతనే విభూతులను అర్థం చేసుకోవడానికి వీలవుతుంది. ఆలోచనా సరళిని అర్థం చేసుకోవడానికై, దీనిలో కొంచెం అర్థం చెప్పబడింది.

శ్లో ॥ యద్యద్విభూతి మత్సత్త్వం శ్రీ మదూర్జితమే వ వా ।
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశసమ్భవమ్ ॥**41**॥

ఏవైనా కూడా ఐశ్వర్య యుక్తమైన, కాంతి యుక్తమైన మరియు శక్తి యుక్తమైన వస్తువులు ఉంటే, అవి నా తేజం యొక్క ఒక అంశం మాత్రంచే ఉత్పన్నమైనవిగా తెలుసుకో

శ్లో ॥ అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున ।
విష్టభ్యాహమిదం కృత్స్నమేకాంశేన స్థితో జగత్ ॥**42**॥

అలాగాక అర్జునా! అంత ఎక్కువగా తెలుసుకోవడం వలన నీకేం ఉపయోగం ఉంది? నేను ఈ సమస్త జగత్తును ఒక అంశం మాత్రంచే ధరించి స్థితుడనై ఉన్నాను.

పైన చెప్పబడిన విభూతుల వర్ణనకు తాత్పర్యం మీరు గానీ లేక అర్జునుడు గానీ ఈ వస్తువులన్నింటినీ పూజించాలని కాదు. శ్రీకృష్ణుని ఆశ్రయమేమిటంటే ఈ వస్తువులన్నింటి పట్లగల శ్రద్ధనంతటినీ ఆ అవినశ్వరమైన పరమాత్ముని పట్ల చూపించమనియే. ఇంతటితో దాని ప్రయోజనం నెరవేరుతుంది.

సారాంశం :

ఈ అధ్యాయంలో శ్రీకృష్ణుడు అన్నాడు- అర్జునా! నేను నీకు మళ్ళీ ఉపదేశిస్తాను. ఎందుకంటే నీవు నాకు అతిశయంగా ప్రియమైన వాడివి. మొదట ఒకసారి చెప్పాడు, మళ్ళీ చెప్పబోతున్నాడు, ఎందుకంటే చివరి వరకూ సద్గురువు నోటి నుంచి వినవలసిన అవసరం ఉంటుంది. నా ఉత్పత్తిని దేవతలుగానీ మహర్షులుగానీ తెలుసుకోలేరు, ఎందుకంటే నేను వారికి కూడా ఆది కారకుణ్ణి, అవ్యక్తస్థితి తర్వాత సార్వభౌమ దశను, ఎవరైతే బ్రహ్మను చేరుకున్నారో వారే తెలుసుకోగలరు. అజన్ముడను, అనాదిని మరియు సంపూర్ణ లోకాలకు మహేశ్వరుడనైన నన్ను ఎవడైతే సాక్షాత్కార సహితంగా తెలుసుకొంటాడో, అతనే జ్ఞానవంతుడు.

బుద్ధి, జ్ఞానం, అసంమూఢత్వం, ఇంద్రియాలపై నియంత్రణ, మనస్సు యొక్క నిరోధం, సంతోషం, తపస్సు, దానం మరియు కీర్తి అంటే దైవీ సంపద యొక్క భావాలు- ఈ గుణాలన్నీ నేను యిచ్చేవే. ఏడుగురు మహర్షులు అంటే యోగి యొక్క ఏడు భూమికలు, దాని కంటే ముందు తదనుగుణమైన అంతఃకరణ చతుష్టయం మరియు వీటికి అనుకూలంగా స్వయంభువో, స్వయంగా సృష్టి చేసే మనస్సు, ఇవన్నీ నా పట్ల భావం, ప్రేమ మరియు శ్రద్ధ గలవిగా, వీటికి ప్రపంచంలో సమస్త సంతానం కలదు. ఇవన్నీ నానుంచే ఉత్పన్నమవుతాయి. అంటే సాధనామయమయిన ప్రవృత్తులు నాద్వారా ఉత్పన్నమయ్యేవే. ఉత్పత్తి తమ వలన కాదు, గురువువలనే సాధ్యపడుతుంది. ఎవరైతే పైన చెప్పబడిన నా విభూతులను సాక్షత్తుగా తెలుసుకొంటాడో, వారు నిస్సందేహంగా నాలో ఏకీభావంతో ప్రవేశం పొదడానికి యోగ్యమైన వారవుతాడు.

అర్జునా! 'నేనే అందరి ఉత్పత్తికీ కారకుడను' -అలా అని ఎవరైతే శ్రద్ధతో తెలుసుకొంటారో, వారు అనన్య భావంతో నా చింతన చేస్తారు, నిరంతరం నాలో మనస్సు, బుద్ధి మరియు ప్రాణాల్ని నిలిపినవారయి ఉంటారు, పరస్పరం నా గుణాల చింతనను చేసుకుంటారు మరియు నాలోనే రమించుతారు. అలా నిరంతరం నాతో సంయుక్తులై ఉండే పురుషులకు నేను యోగంలో ప్రవేశం కలిగించే బుద్ధిని ప్రదానం చేస్తాను. అది కూడా నేను యిచ్చేదే. ఏ ప్రకారంగా బుద్ధియోగాన్ని యిస్తారు? అర్జునా! 'ఆత్మ భావస్థ'- అతని ఆత్మలో జాగృతుడనై నిలబడతాను మరియు అతని హృదయంలో అజ్ఞానం వలన ఉత్పన్నమయిన అంధకారాన్ని జ్ఞానరూపమయిన దీపం చేత తొలగిస్తాను.

అర్జునుడు ప్రశ్నించాడు-'భగవన్ ! మీరు పరమ పవిత్రులు, సనాతనులు, దివ్యులు, అనాదులు, సర్వావ్యాప్తులు- అని మహర్షులు అంటారు. వర్తమానకాలంలో దేవర్షినారదుడు, దేవలుడు, వ్యాసుడు, మీరు కూడా అలాగే అన్నారు. మిమ్మల్ని దేవతలుగానీ, దానవులుగానీ తెలుసుకోలేరన్నది సత్యం. స్వయంగా మీరు ఎవరికైతే తెలియబరుస్తారో, వారే మిమ్ములను తెలుసుకోగలరు. మీ విభూతులను గురించి చెప్పడంలో మీరే సమర్థులు. కాబట్టి జనార్ధనా! మీరు మీ విభూతులను గురించి విస్తారంగా చెప్పండి. చివరి వరకూ ఇష్టదైవం నోటి నుంచి వినాలనే ఉంత్కంఠ ఉండాలి. తరువాత ఇష్ట దైవం

అంతరంగంలో ఏముందో, దానిని గురించి సాధకుడుకి ఏం తెలుసు? తరువాత యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు ఒకటొకటిగా తన ఎనభై ఒక్క విభూతుల లక్షణాలను సంక్షేపంగా చెప్పాడు- వానిలో కొన్ని యోగ సాధనలో ప్రవేశించగానే లభించే అంతరంగానికి చెందిన విభూతులు మరియు మిగిలినవి కొన్ని సమాజంలో ఋద్ధులు-సిద్ధులతో బాటు లభించే విభూతుల గురించి వివరించాడు. చివరిగా అతను నొక్కి చెప్పాడు- అర్జునా! చాలా తెలుసుకోవడం వలన నీకేం ఉపయోగం ఉంటుంది? ఈ ప్రపంచంలో ఏదైనా కూడా తేజస్సు మరియు ఐశ్వర్యంతో కూడిన వస్తువు ఉంటే, అది నా తేజస్సు యొక్క అంశం మాత్రంచే నిలబడి ఉంది. వాస్తవానికి నా విభూతులు అనంతములైనవి. అలా అంటూ యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు ఈ అధ్యాయాన్ని ముగించాడు.

సంపూర్ణ అధ్యాయంలో శ్రీకృష్ణుడు తన విభూతుల బౌద్ధిక జ్ఞానాన్ని మాత్రం చెప్పాడు. దాని వలన అర్జునుడి శ్రద్ధ అన్ని వైపులనుంచీ కూడ గట్టబడినదై ఒక్క ఇష్ట దైవం పట్ల కేంద్రీకృతం కావాలని ఆయన ఆశయం, కానీ మిత్రులారా! అన్నీ విన్న తరువాత, సూక్ష్మాతి సూక్ష్మంగా అర్థం చేసుకున్న తరువాత కూడా, పయనించి తెలుసుకోవడం మిగిలే ఉంటంది. అది క్రియాత్మకమైన మార్గం.

సంపూర్ణ అధ్యాయంలో యోగేశ్వరుని యొక్క విభూతుల వర్ణనే ఉంది.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మ విద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే 'విభూతి వర్ణనం' నామ దశమోऽధ్యాయః ॥ 10॥

ఈ ప్రకారంగా శ్రీమద్భగవద్గీతా రూపమైన ఉపనిషత్తు మరియు బ్రహ్మవిద్యా మరియు యోగశాస్త్రమనే విషయంలో శ్రీకృష్ణుడు మరియు అర్జునుడి సంవాదంలో ''విభూతి వర్ణన'' అనే పేరుగల పదవ అధ్యాయం పూర్తయింది.

ఇతి శ్రీమత్పరమహంస పరమానందస్య శిష్య స్వామీ అడగడానంద కృతే శ్రీమద్ భగవద్ గీతా యాః-- 'యథార్థ గీతా' భాష్యే 'విభూతి వర్ణనం' నామ దశమోऽధ్యాయః॥ 10॥

ఈ ప్రకారంగా శ్రీమత్పరమహంస పరమానందగారి శిష్యుడు స్వామి అడగడానంద గారిచే రచించబడిన శ్రీమద్భగవద్ గీతా యొక్క భాష్యం 'యథార్థగీతా''లో ''విభూతి వర్ణన'' అనే పదవ అధ్యాయం పూర్తయింది.

॥హరి ఓం తత్సత్॥

ఓం

శ్రీ పరమాత్మనే నమః

# ఏకాదశ అధ్యాయము

గత అధ్యాయంలో యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు తన అతి ప్రధానమయిన విభూతుల గురించి సంక్షిప్తంగా వివరించాడు, కానీ అర్జునుడికి సవిస్తారంగా విన్నట్లు అనిపించింది. అతను అన్నాడు– మీ మాటలు వినడంచే నా మోహమంతా నశించిపోయింది, అజ్ఞానం తొలగిపోయింది. కానీ మీరు చెప్పిన దానిని ప్రత్యక్షంగా చూడాలని ఉంది. వినడంలోనూ, చూడడంలోనూ, పడమర తూర్పులకు ఉన్నంత తేడా ఉంటుంది. వెళ్ళి చూసినప్పుడు వాస్తవ స్థితి ఇంకోలాగుంది. అర్జునుడు ఆ రూపాన్ని చూసి వణకడం మొదలెట్టాడు. క్షమాయాచన చేయ మెదలెట్టాడు. జ్ఞాని భయభీతుడు అవుతాడా? అతనికి ఏదైనా జిజ్ఞాస ఉంటుందా? ఉండదు, కానీ భౌద్ధిక స్థాయిలోని జ్ఞానం మసక వేసినట్లుగా ఉంటుంది. అది యథార్థాన్ని తెలుసుకోవడానికి ప్రేరణను మాత్రం తప్పక ఇస్తుంది. కాబట్టి అర్జునుడు నివేదించుకొన్నాడు.–

అర్జున ఉవాచ

శ్లో ॥ మదనుగ్రహాయ పరమం గుహ్యమధ్యాత్మ సంజ్ఞితమ్ ।
యత్త్వ యోక్తం వచస్తేన మోహోऽయం విగతో మమ ॥**1**॥

భగవాన్! నన్ను అనుగ్రహించి, గోపనీయమైన, అధ్యాత్మంలోకి ప్రవేశం యిప్పించే ఉపదేశం చెప్పారు. దానివలన నా అజ్ఞానం పటాపంచలయి పోయింది. నేను జ్ఞానవంతుణ్ణి అయిపోయాను.

శ్లో ॥ భవాప్యయౌ హి భూతానాం శృతౌ విస్తరశో మయా ।
త్వత్తః కమలపత్రాక్ష మహాత్మ్యమపి చావ్యయం ॥**2**॥

ఎందుకంటే హే కమల నేత్రా! నేనే భూతాల ఉత్పత్తి, ప్రళయాల గురించి మీచే విస్తారపూర్వకంగా విన్నాను. మరియు మీ అవినశ్వర ప్రభావాన్ని గురించి కూడా విన్నాను.

శ్లో ॥ ఏవ మేతద్య థాత్థత్వమాత్మానం పరమేశ్వర ।
ద్రష్టు మిచ్ఛామి తే రూపమైశ్వరం పురుషోత్తమ ॥3॥

హే పరమేశ్వరా! మీరు మిమ్మల్ని గురించి ఏం చెప్పారో, అది సరిగ్గా అలాగే ఉంటుంది. ఇందులో సందేహం ఏమీ లేదు. కానీ నేను దానిని గురించి కేవలం విన్నాను. కాబట్టి హే పురుషోత్తమా! ఆ ఐశ్వర్యయుక్తమైన స్వరూపాన్ని నేను ప్రత్యక్షంగా చూడాలని కోరుకొంటున్నాను.

శ్లో ॥ మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టుమితి ప్రభో ।
యోగేశ్వర తతో మే త్వం దర్శ యాత్మాన మవ్యయం ॥4॥

హే ప్రభో! నేను మీ యొక్క ఆ రూపాన్ని చూడడం సంభవమని మీరు భావించితే, యేగేశ్వరా! మీరు మీ అవినశ్వర స్వరూప దర్శనం చేయించండి. అప్పుడు యోగేశ్వరుడు ఎటువంటి అభ్యంతరం చెప్పలేదు. ఎందుకంటే మొదటి నుండి కూడా అతను మళ్ళీమళ్ళీ చెప్తూ వచ్చాడు –నీవు నా అనన్య భక్తుడవు మరియు ప్రియమైన మిత్రుడివి'. కాబట్టి చాలా ప్రసన్నంగా అతను తన స్వరూపాన్ని చూపించాడు.

శ్రీభగవానువాచ-

శ్లో ॥ పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః ।
నానా విధాని దివ్యాని నానా వర్ణాకృతీని చ ॥5॥

ప్రార్థా! నా వందల, వేల ప్రకారాలైన నానా వర్ణాలు మరియు ఆకృతులు గల దివ్య స్వరూపాన్ని చూడు.

శ్లో ॥ పశ్యాదిత్యాన్వసూన్ రుద్రానశ్వినౌ మరుతస్తథా ।
బహూన్య దృష్టపూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత ॥6॥

హే అర్జునా! అదితి యొక్క పన్నెండుగురు పుత్రులు, ఎనిమిదిమంది వసువులు, ఏకాదశ రుద్రులు, ఇద్దరు ఆశ్వినీ కుమారులు మరియు నలభైతొమ్మిది మరుత్ గణాలను చూడు. ఇంకా చాలా, యింతకు ముందు నీ ద్వారా చూడబడనటువంటి ఆశ్చర్యమయిన రూపాలను చూడు.

శ్లో ॥ ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్ ।
మమ దేహే గుడాకేశ యచ్చాన్య ద్రష్టుమిచ్ఛసి ॥7॥

అర్జునా! ఇప్పుడు నా ఈ శరీరంలో ఒకే స్థానంలో స్థితమయిఉన్న చరాచర సంపూర్ణ జగత్తును చూడు మరియు ఇంకా ఏదైనా కూడా చూడాలను కొంటే చూడు.

ఈ ప్రకారంగా మూడు శ్లోకాల వరకూ భగవంతుడు వరసగా చూపిస్తూ వెళ్ళిపోయాడు. కానీ అర్జునుడికి ఏమీ కనిపించలేదు. (అతను కళ్ళు నులుముకుంటూ ఉండి పోయాడు). కాబట్టి అలా చూపిస్తూ భగవంతుడు అకస్మాత్తుగా ఆగిపోయి ఇలా అంటాడు.

శ్లో ॥ నతు మాం శక్యసే ద్రష్టు మనేనైవ స్వచక్షుషా।
దివ్యం దదామి తే చక్షుః పశ్యమే యోగ మైశ్వరమ్ ॥8॥

అర్జునా! నీవు నన్ను నీ నేత్రాల ద్వారా అంటే భౌతిక దృష్టి ద్వారా చూడటానికి సమర్థుడవు కావు. కాబట్టి నేను నీకు దివ్య అంటే అలౌకిక దృష్టి ఇస్తాను. దానితో నీవు నా ప్రభావాన్ని మరియు యోగశక్తిని చూడు.

ఇక్కడ యోగేశ్వరుడైన శ్రీకృష్ణుని కృపాప్రసాదంతో అర్జునుడికి ఆదివ్య దృష్టి ప్రాప్తించింది, అతను చూసాడు మరియు అక్కడ యోగేశ్వరుడైన వ్యాసుని కృపాప్రసాదంతో అదే దృష్టి సంజయుడికి లభించింది. అర్జునుడేం చూసాడో, అక్షరాల అదే సంజయుడు కూడా చూసాడు. దాని ప్రభావంతో తనను కళ్యాణ పథానికి యోగ్యునిగా చేసుకొన్నాడు. దీని వలన స్పష్టమయ్యేదేమిటంటే శ్రీకృష్ణుడు ఒక యోగి సమకక్షంలో ఉన్నాడు.

సంజయ ఉవాచ-

శ్లో ॥ ఏవ ముక్త్వాతతో రాజన్‌మహాయోగేశ్వరో హరిః।
దర్శయామాస పార్థాయ పరమం రూపమైశ్వరం ॥9॥

సంజయుడు అన్నాడు- హే రాజా! మహా యోగేశ్వరుడైన హరి ఈ ప్రకారంగా అని, దాని తరువాత పార్థుడికి తన పరమ ఐశ్వర్యయుక్తమైన దివ్య స్వరూపాన్ని చూపించాడు. ఎవరు స్వయంగా యోగియో మరియు యితరులకు కూడా యోగాన్ని ప్రధానం చేయగల సామర్థ్యం గలవాడో, ఎవరు యోగానికి స్వామియో అతనిని యోగేశ్వరుడు అంటారు. ఇదే ప్రకారంగా సర్వస్వాన్ని హరించేవాడు హరి. ఒకవేళ కేవలం దుఖాలను హరించి, సుఖాలను వదిలేస్తే, దుఃఖం వస్తుంది. కాబట్టి అన్ని పాపాలనూ నాశనం చేయడంతో బాటు, సర్వస్వాన్ని హరించేసి, తన స్వరూపాన్ని ఇవ్వడంలో ఎవరు సమర్థులో, అతనే హరి. అతను పార్థుడికి తన దివ్య స్వరూపాన్ని చూపించాడు. ఎదురుగానే నిలబడ్డాడు గదా!

శ్లో ॥ అనేక వక్త్ర నయనమనేకాద్భుత- దర్శనం ।
అనేకదివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్ ॥ 10॥

అనేక ముఖాలు, నేత్రాలతో యుక్తమైన, అనేక అద్భుత దృశ్యాలుగల, దివ్యమైన అనేక అలంకారాలతో యుక్తమైన, అనేక దివ్య ఆయుధాలను చేతధరించి మరియు-

శ్లో ॥ దివ్య మాల్యామ్బరధరం దివ్యగన్ధానులేపనం ।
సర్వాశ్చర్యమయం దేవమనంతం విశ్వతో ముఖం ॥ 11॥

దివ్యమైన మాలలు, వస్త్రాలను ధరించి యున్న, దివ్య గంధాలను లేపనం చేసికొనియు ఉన్న, అన్ని ప్రకారాల ఆశ్చర్యాలతో యుక్తమై, సీమారహిత విరాట్ స్వరూపుడైన పరమదేవుణ్ణి దివ్యదృష్టి లభించడం చేత, అర్జునుడు చూసాడు.

అర్జునఉవాచ

శ్లో ॥ దివి సూర్య సహస్రస్య భవేద్యుగపదుత్థితా।
యది భాః సదృశీ సా స్యాద్భాసస్తస్య మహాత్మనః ॥ **12**॥

(అజ్ఞాన రూపి అయిన ధృతరాష్ట్రుడు, సంయమన రూపమైన సంజయుడు-వెనక చెప్పినట్లుగా) సంజయుడు అన్నాడు- హేరాజా! ఆకాశంలో ఒకేసారిగా వేల సూర్యులు ఉదయించినప్పుడు ఎంత ప్రకాశం ఉంటుందో, అది కూడా విశ్వరూపుడైన ఆ మహాత్ముని ప్రకాశంతో పోల్తే ఏ మాత్రం సమానం కాక పోవచ్చునేమో, ఇక్కడ శ్రీకృష్ణుడు మహాత్ముడే, యోగేశ్వరుడే.

శ్లో ॥ తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్తమనే కధా।
అపశ్య ద్దేవదేవస్య శరీరే పాణ్డవస్తదా ॥ **13**॥

పాండుపుత్రుడు అర్జునుడు (పుణ్యమే పాండువు. పుణ్యమే అనురాగానికి జన్మనిస్తుంది) ఆ సమయంలో అనేక ప్రకారాలుగా విభక్తమైన సంపూర్ణ జగత్తునూ ఆ పరమదేవుని శరీరంలో ఒకే చోట స్థితమై ఉండటం చూసాడు.

శ్లో ॥ తతఃస విస్మయావిష్టో హృష్టరోమా ధనంజయః।
ప్రణమ్య శిరసా దేవం కృతాఞ్జలిరభాషత ॥ **14**॥

అప్పుడు అర్జునుడు విస్మయమొంది పులకాంకితుడై చేతులు జోడించి దేవదేవునకు శిరము వంచి నమస్కరించుచు ఇట్లనెను. ముందు కూడా చేతులు జోడించినాడు గానీ ఆయన ప్రభావం చూసి శిరము వంచి నమస్కరించి హృదయ పూర్వకంగా ఇట్లనెను.

అర్జునా ఉవాచ-

శ్లో ॥ పశ్యామి దేవాంస్తవ దేవ దేహే!
సర్వాం స్తథా భూతవిశేష సంఘాన్ ।
బ్రహ్మాణమీశం కమలాసనస్థ
మృషీంశ్చ సర్వానురగాంశ్చ దివ్యాన్ ॥ **15**॥

హే దేవా! మీ శరీరంలోనే నేను దేవుళ్ళందరినీ, అనేక భూతాల సముదాయాల్నీ, కమలంలో ఆసీనుడై ఉన్న బ్రహ్మను, మహాదేవుణ్ణి, సమస్త ఋషులను, దివ్యసర్పాలను చూస్తున్నాను. ఇది ప్రత్యక్ష దర్శనం, వట్టి కల్పన కాదు, కానీ ఇలా ఎప్పుడు సంభవమవుతుంది? యోగేశ్వరుడు (పూర్ణత్వాన్ని పొందిన మహాపురుషుడు) హృదయంతో దృష్టిని ప్రదానం చేసినప్పుడే, ఇది సాధ్యమవుతుంది. ఇది సాధనాగమ్యం.

శ్లో ॥ అనేక బహూదరవక్త్రనేత్రం
పశ్యామి త్వాం సర్వతోऽనన్త రూపం ।
నాన్తం న మధ్యం న పునస్తవాదిం
పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప ॥ **16**॥

విశ్వానికి స్వామీ! నేను మిమ్మల్ని అనేక చేతులు– ఉదరములు, ముఖాలు మరియు నేత్రాలతో సంయుక్తుడిగానూ, అన్ని వైపుల అనంతమైన రూపాలుగల వాడిగానూ, చూస్తున్నాను. హే విశ్వరూపా! నేను మీ ఆది, మధ్య మరియు అంతాలను చూడలేక పోతున్నాను, అంటే మీ ఆది, మధ్య అంతాలను నిర్ణయించలేక పోతున్నాను.

శ్లో ॥ కిరీటినం గదినం చక్రిణం చ
తేజోరాశిం సర్వతో దీప్తిమన్తమ్ ।
పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమన్తాద్
ద్దీప్తానలార్కద్యుతి మప్రమేయమ్ ॥ **17**॥

నేను మిమ్మల్ని కిరీట యుక్తుడిగానూ, గదా యుక్తుడిగానూ, చక్ర యుక్తుడిగానూ, అన్ని వైపులనుంచీ ప్రకాశమానమైన తేజపుంజ స్వరూపుడిగానూ, ప్రజ్వలించిన అగ్ని మరియు సూర్యుడివలెనూ, దుర్నిరీక్షుడిగానూ, అనగా చూచుటకు కఠినమైన వానిగా, మరియు అన్ని వైపుల నుండి బుద్ధి మొదలైన వాటితో గ్రహింప శక్యంకాని అప్రమేయుడిగానూ చూస్తున్నాను. ఈ ప్రకారంగా సమస్త ఇంద్రియాలతో పరిపూర్ణంగా సమర్పితుడయి, యోగేశ్వరుడైన శ్రీకృష్ణుణ్ణి ఈ రూపంలో చూసి, అర్జునుడు అతనిని స్తుతించడం మొదలు పెట్టాడు–

శ్లో ॥ త్వమక్షరం పరమం వేదితవ్యం
త్వమస్య విశ్వస్య పరం నిధానమ్ ।
త్వమవ్యయః శ్శాశ్వత ధర్మ గోప్తా
సనాతనస్త్వం పురుషో మతోమే ॥ **18**॥

భగవాన్! మీరు తెలుసుకొనుటకు యోగ్యమైన పరమ అక్షరులు. అంటే అక్షయ పరమాత్మ. మీరు ఈ జగత్తుకు పరమ ఆశ్రయులు. మీరు శాశ్వత ధర్మం యొక్క రక్షకులు మరియు మీరు నాశనముకాని సనాతన పురుషులు – ఇది నా మతము. ఆత్మ యొక్క స్వరూపం ఏమిటి? శాశ్వతమైనది, సనాతనమైనది, అవ్యక్త రూపం కలది, అవినాశి అయినది. ఇక్కడ శ్రీకృష్ణుని స్వరూపమేమిటి? అదే శాశ్వతం, సనాతనం, అవ్యయం, అవినశ్వరం అంటే బ్రహ్మ ప్రాప్తి తరువాత మహాపురుషుడు కూడా అదే ఆత్మ భావంలో స్థితుడై పోతాడు. అందుచేతనే గదా భగవంతుడు మరియు ఆత్మ ఒకే లక్షణాలు గలిగి ఉన్నారు.

శ్లో ॥ అనాది మధ్యాన్త మనన్త వీర్య మనన్త బాహుం శశిసూర్య నేత్రమ్ ।
పశ్యామిత్వాం దీప్త హుతాశ వక్త్రం స్వతేజసా విశ్వమిదం తపన్తమ్ ॥19॥

హే పరమాత్మా! నేను మిమ్మల్ని ఆది-మధ్య-అంత రహితుడుగానూ, అనంత సామర్థ్యంతో యుక్తుడైన వానిగానూ, అనంత- హస్తములు గలవానిగానూ (మొదట వేలలో ఉండేవి, ఇప్పుడు అనంతమయి పోయాయి), చంద్రుడు మరియు సూర్య రూపమైన నేత్రాలు గల వానిగానూ (అంటే భగవంతుడు మెల్ల కళ్ళ వాడయి పోయాడన్న మాట. ఒక కన్ను చంద్రుడిలాగ క్షీణ ప్రకాశం గలదైతే, రెండవది సూర్యునిలాగ తీక్షణ ప్రకాశం అని అర్థమా? అలా ఏం కాదు. సూర్యుడితో సమానంగా ప్రకాశాన్నీ, చంద్రునిలాగ శీతలత్వాన్ని ప్రదానం చేయగల గుణం భగవంతుడిలో ఉంది. శశి-సూర్యులు ప్రతీకలు మాత్రమే. అంటే చంద్రుడు మరియు సూర్యుడి వంటి దృష్టి గలవాడు) మరియు ప్రజ్వలిత అగ్నిలాంటి నోరు గల వాడిగానూ, తన తేజస్సుతో ఈ జగత్తును తపింపచేస్తూన్నట్లుగా చూస్తున్నాను.

శ్లో ॥ ద్యావాపృథివ్యోరిదమన్తరం హి
వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః ।
దృష్ట్వాద్భుతం రూపముగ్రం తవేదం
లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్ ॥20॥

హే మహాత్మా! అంతరిక్షం మరియు పృథ్వీ-వీటి మధ్య ఉన్న సమస్త ఆకాశం మరియు అన్ని దిశలూ మీ ఒక్కరి చేతనే పరిపూర్ణంగా నిండి పోయాయి. మీ ఈ అలౌకికమైన భయంకర రూపాన్ని చూసి, మూడు లోకాలూ అత్యంతంగా వ్యథ చెందుతున్నాయి.

శ్లో ॥ అమీ హి త్వాం సుర సఙ్ఘా విశన్తి
కేచిద్భీతాః ప్రాఞ్జలయో గృణన్తి ।
స్వస్తీత్యుక్త్వా మహర్షి సిద్ధ- సఙ్ఘాః
స్తువన్తి త్వాం స్తుతిభిః పుష్కలాభిః ॥21॥

ఆ దేవతల సమూహం మీలోనే ప్రవేశించుచున్నది మరియు కొందరు భయ భీతులయి చేతులు జోడించి మీ గుణాలను పొగడుతున్నారు. మహర్షులు మరియు సిద్ధుల యొక్క సముదాయాలు స్వస్తివచనాలు అంటే 'జయము, జయము' అని అంటూ, సంపూర్ణ స్తోత్రాలతో మిమ్మల్ని స్తుతిస్తున్నారు.

శ్లో ॥ రుద్రాదిత్యా వసవోయే చ సాధ్యా
విశ్వేఽశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ ॥
గంధర్వ యక్షాసుర సిద్ధ సంఘా
వీక్షంతే త్వాం విస్మితాశ్చైవ సర్వే ॥22॥

రుద్రుడు, ఆదిత్యుడు, వసువు, సాధ్యుడు విశ్వదేవుడు, అశ్వనీ కుమారులు, వాయుదేవుడు, పితరులు, గంధర్వ-యక్ష-రాక్షసులు మరియు సిద్ధుల సముదాయాలు అందరూ

ఆశ్చర్యంతో మిమ్మల్ని చూస్తున్నారు. అంటే చూస్తూ కూడా అర్థం చేసుకోలేక పోతున్నారు. ఎందుకంటే వారి వద్ద దృష్టి లేదు. ఇంతకు ముందు శ్రీకృష్ణుడు అన్నాడు– ఆసురీ స్వభావం గల లోకులు నన్ను తుచ్ఛుడని సంబోధించుతారు. సామాన్య మనుష్యుడిగా భావిస్తారు కానీ నేను పరమభావమైన పరమేశ్వరునిలో స్థితుడనై ఉన్నాను. కానీ మనుష్య శరీరంపై ఆధారపడి ఉన్న వాడినే. దానినే విస్తారంగా ఇక్కడ చెప్పడమయింది– వారు ఆశ్చర్యంతో చూస్తున్నారు, యథార్థాన్ని అర్థం చేసుకోలేక పోతున్నారు– చూడలేక పోతున్నారు–

శ్లో ॥ రూపం మహత్తే బహువక్త్ర నేత్రం
మహాబాహో బహుబాహూరూపాదమ్ ॥
బహూదరం బహుదంష్ట్రాకరాళం
దృష్ట్వాలోకాః ప్రవ్యథితాస్తథాऽహమ్ ॥**23**॥

మహాబాహో! (శ్రీకృష్ణుడు మహాబాహుడు, అర్జునుడు కూడా. ప్రకృతికంటే అతీతమైన మహాసత్తాలో ఎవరి కార్యక్షేత్రముంటుందో, అతను మహాబాహుడు. శ్రీకృష్ణుడు మహత్వపూర్ణమైన క్షేత్రంలో పరిపూర్ణుడు, చివరి హద్దుని చేరినవాడు, అర్జునుడు దాని ప్రవేశంలో ఉన్నాడు, మార్గంలో ఉన్నాడు. లక్ష్యం మార్గానికి ముగింపే గదా) మహాబాహువైన యోగేశ్వరా! మీ యొక్క అనేక ముఖాలు, నేత్రాలు గల, చాలా చేతులు, తొడలు మరియు కాళ్ళు గల, చాలా ఉదరాలు గల అనేక భయంకర దంతాలు గల మహా రూపాన్ని చూసి, అన్ని లోకాలూ వ్యాకులమవుతున్నాయి. మరియు నేను కూడా వ్యాకులమవుతున్నాను. ఇప్పుడు అర్జునుడికి శ్రీకృష్ణుడి మహత్వాన్ని చూసి కొంచెం భయం వేస్తోంది.

శ్లో ॥ నభః స్పృశం దీప్త మనేక వర్ణం
వ్యాత్తాననం దీప్త విశాల నేత్రమ్ ।
దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాన్తరాత్మా
ధృతిం న విన్దామి శమం చ విష్ణో ॥**24**॥

విశ్వంలో సర్వత్రా అణురూపంలో వ్యాప్తమైన హే విష్ణూ! ఆకాశాన్ని స్పృశిస్తున్న, ప్రకాశమానమైన, అనేక రూపాలతో యుక్తమైన, వ్యాపించివున్న ముఖము మరియు ప్రకాశమానమైన విశాల నేత్రాలతో యుక్తమైన మిమ్మల్ని చూసి, విశేషంగా భయ భీతమైన అంతః కరణం గల వాడినైన నేను, ధైర్యం, మనస్సుకు సమాధానమిచ్చే శాంతిని పొందలేక పోతున్నాను.

శ్లో ॥ దంష్ట్రా కరాళాని చ తే ముఖాని
దృష్ట్వైవ కాలానల సన్నిభాని ।
దిశో న జానే న లభే చ శర్మ
ప్రసీద దేవేశ జగన్నివాస ॥**25**॥

మీ యొక్క వికరాళ దంతాలను మరియు కాలాగ్ని (కాలానికి కూడా అగ్ని

పరమాత్ముడు)కి సమానంగా ప్రజ్వలించుతున్న నోళ్ళను చూసి నేను దిశలను తెలుసుకోలేక పోతున్నాను. నాలుగు వైపుల ప్రకాశాన్ని చూసి దిశాభ్రమ కలుగుతోంది. మీ యొక్క ఈ రూపాన్ని చూస్తూంటే నాకు సుఖం లభించడం లేదు. దేవేశ! హే జగన్నివాస! మీరు ప్రసన్న మవ్వండి.

శ్లో ॥ అమీ చ త్వాం ధృతరాష్ట్ర స్య పుత్రాః
సర్వే సహైవా వనిపాల సంఘైః ।
భీష్మో ద్రోణః సూత పుత్ర స్తథా సౌ
సహాస్మదీయైరపి యోధముఖ్యైః ॥26॥

వారందరూ, రాజుల సముదాయంతోబాటుగా ధృతరాష్ట్రుని పుత్రులు మీలో ప్రవేశం చేస్తున్నారు. మరియు భీష్మ పితామహుడు, ద్రోణాచార్యుడు మరియు ఆ కర్ణుడు! (ఎవరి వలన అర్జునుడు చాలా భయ భీతుడైనాడో అట్టి కర్ణుడు) మరియు మా వైపు వారు కూడా ప్రధానమైన యోధులతో సహా అందరికందరూ-

శ్లో ॥ వక్త్రాణి తే త్వరమాణా విశన్తి
దంష్ట్రాకరాళాని భయనకాని ।
కేచిద్విలగ్నా దశనాన్తరేషు
సందృశ్యన్తే చూర్ణితైరుత్తమాంగైః ॥27॥

గొప్ప వేగంతో మీ యొక్క వికరాళ దంతాలు గల భయానకమైన నోళ్ళలోకి ప్రవేశిస్తున్నారు మరియు వారిలో ఎందరో చూర్ణమయి పోయిన శిరస్సుల సహితంగా, మీ దంతాల మధ్యలో కనిపిస్తున్నారు. వారు ఎంత వేగంతో ప్రవేశం చేస్తున్నారు? ఇప్పుడు వారి వేగాన్ని చూద్దాం-

శ్లో ॥ యథా నదీనాం బహవోऽమ్బువేగాః
సముద్రమేవాభిముఖా ద్రవంతి ।
తథా తవామీ నరలోక వీరా
విశంతి వక్త్రాణ్యభివిజ్వలంతి ॥28॥

ఎలాగైతే చాలా నదుల జల ప్రవాహాలు (తాము వికరాళమయి ఉండి కూడా) సముద్రం వైపుకు వెళుతాయో, సముద్రంలో ప్రవేశించుతాయో. సరిగ్గా అదే విధంగా ఆ శూర-వీరుల సముదాయాలు, ప్రజ్వలిస్తున్న మీ నోళ్ళలో ప్రవేశిస్తున్నారు. వారు శూరులూ-వీరులే, కానీ మీరు సముద్రంలాంటి వారు. మీ సమక్షంలో వారి బలం అత్యల్పమైంది. వారు ఎందుకని మరియు ఏ ప్రకారంగా నీలో ప్రవేశిస్తున్నారు! దీనికి ఒక ఉదాహరణ

ఇవ్వబడింది-

శ్లో ॥ యథా ప్రదీప్తం జ్వలనం పతఙ్గా
విశంతి నాశాయ సమృద్ధ వేగాః ।
తథైవ నాశాయ విశన్తి లోకా
స్తవాపి వక్త్రాణి సమృద్ధ వేగాః ॥**29**॥

ఎల్లాగైతే దీపపు పురుగులు నాశన మవడం కోసమే ప్రజ్వలించే అగ్నిలోకి అతి వేగంగా ప్రవేశిస్తాయో, అలాగే ఈ ప్రాణులందరూ కూడా తమ నాశనానికే మీ నోళ్ళలోకి అత్యంత వేగంతో ప్రవేశిస్తున్నారు.

శ్లో ॥ లేలిహ్యసే గ్రసమానః స్సమన్తా-
ల్లోకాన్ సమగ్రాన్ వదనైర్జ్వలద్భిః ।
తేజోభిరాపూర్య జగత్సమగ్రం
భాసస్తవోగ్రాః ప్రత పన్తి విష్ణో ॥**30**॥

మీరు ఆ సమస్తలోకాలనూ ప్రజ్వలిస్తున్న నోళ్ళతో అన్ని వేపుల నుండీ మింగుతూ నాకుతూ, వాటిని ఆస్వాదిస్తున్నారు; వ్యాప్తి చెందేగుణంగల హే పరమాత్మా! మీ ఉగ్రప్రభ తన తేజంతో వ్యాపించి సంపూర్ణ జగత్తునూ తపింప చేస్తున్నది. తాత్పర్యం యేమిటంటే మొదట ఆసురీ సంపద పరమతత్త్వంలో విలీనమయి పోతుంది, దాని తరువాత దైవీ సంపదతో ఉపయోగం ఉండదు. కాబట్టి అది కూడా అదే స్వరూపంలో విలీనమయి పోతుంది. కౌరవ పక్షం, ఆ తరువాత తన పక్షపు యోధులు శ్రీకృష్ణుని నోటిలోకి విలీన మయిపోతుండడం అర్జునుడు చూసాడు. అతను అడిగాడు-

శ్లో ॥ ఆఖ్యాహి మేకో భవానుగ్రరూపో
నమోऽస్తుతే దేవవర ప్రసీద ।
విజ్ఞాతుమిచ్ఛామి భవన్త మాద్యం
న హి ప్రజానామి తవ ప్రవృత్తిమ్ ॥**31**॥

ఈ భయంకర ఆకారం గల మీరెవరో నాకు చెప్పండి. దేవతల్లో శ్రేష్ఠుడా! మీకు నమస్కారాలు. మీరు ప్రసన్నులవ్వండి. ఆది స్వరూపా ! నేను మిమ్మల్ని చక్కగా తెలుసుకోవాలను కొంటున్నాను. (మీరెవరు? ఏం చేయాలనుకొంటున్నారు?) ఎందుకంటే మీ ప్రవృత్తిని, చేష్టలను అర్థం చేసుకోలేక పోతున్నాను. అప్పుడు యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు చెప్పాడు-

శ్రీ భగవానువాచ-

కాలోऽస్మి లోకక్షయ కృత్ప్రవృద్ధో
లోకాం సమాహర్తుమిహ ప్రవృత్తః ।
ఋతేऽపిత్వాం న భవిష్యంతి సర్వే
యేऽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః ॥32॥

అర్జునా! నేను లోకాల్ని నాశనం చేసే మహత్తర కాలాన్ని. మరియు ఇప్పుడు ఈ లోకాలను నాశనం చేయాలనే ప్రవృత్తి గలిగి ఉన్నాను. ప్రతిపక్షాల సేనలలో స్థితమై ఉన్న యోధులు, వారందరు నీవు లేకపోయినా ఉండరు. వారు బ్రతికి ఉండరు, కాబట్టే నేను సంహారానికై ప్రవృత్తుడనై ఉన్నాను.

శ్లో ॥ తస్మాత్త్వముత్తిష్ఠ యశో లభస్వ
జిత్వా శత్రూన్ భుఙ్క్ష్వ రాజ్యం సమృద్ధం ।
మయైవైతే నిహతాః పూర్వమేవ
నిమిత్త మాత్రం భవ సవ్య సాచిన్ ॥33॥

కాబట్టి అర్జునా! నీవు యుద్ధం చేయడానికై లెమ్ము. యశస్సును పొందుము. శత్రువులను జయించు. సంపన్నమైన రాజ్యాన్ని అనుభవించు. ఈ శూర వీరులందరూ నా ద్వారా మొదటే చంపబడ్డారు. సవ్యసాచీ! నీవు కేవలం నిమిత్త మాత్రుడవు కమ్ము.

శ్రీకృష్ణుడు సర్వసాధారణంగా, అన్నిచోట్లా చెప్పిందేమిటంటే – అ పరమాత్ముడు స్వయంగా ఏమీ చెయ్యడు, చేయించడు మరియు సంయోగాన్ని కలిగించడు. మోహవృత్తమైన బుద్ధి కారణంగా లోకులు పరమాత్ముడే చేయిస్తున్నాడంటారు. ఇక్కడ అతను మరీ మరీ అంటాడు– అర్జునా! కర్తా–ధర్తా అన్నీ నేనే. నా ద్వారా వీరు మొదటే చంపబడ్డారు. నీవు లేచి నిలబడు చాలు. యశస్సును పొందు. అలా ఎందుకుందంటే **'సో కేవల్ భగత్హ్న హితలాగీ'** (పరమాత్ముడు భక్తుల కోసమే అన్ని పనులూ చేస్తాడు.) అర్జునుడు ఆ అవస్థను ప్రాప్తి చేసుకొన్నాడు. అక్కడ భగవంతుడు స్వయంగా నిలబడ్డాడు. అనురాగమే అర్జునుడు. అనురాగవంతుడి కోసం భగవంతుడు ఎల్లప్పుడూ నిలబడి సిద్ధంగా ఉంటాడు. అతనికై కర్త అవుతాడు, రథుడై ఉంటాడు.

ఇక్కడ మూడవసారి సామ్రాజ్య ప్రసంగం వచ్చింది. మొదట అర్జునుడు పోరాడటానికే ఇష్టపడలేదు. అతను అన్నాడు, ఇంద్రియాలను తపింపజేస్తున్న నా ఈ శోకాన్ని తొలగించగల ఉపాయం (మార్గం) నాకు ధన ధాన్య సంపన్నమై కంటక (అవరోధ) రహితమైన సామ్రాజ్యంలోగానీ లేక దేవతలపై ఆదిపత్యంలోగానీ, లేక త్రిలోక సామ్రాజ్యంలోగానీ కనబడడం లేదు. ఈ దుఃఖం ఇలాగే ఉండేటట్లయితే, మాకు ఇవన్నీ అఖ్కర్లేదు. యోగేశ్వరుడు ఇలా అన్నాడు– ఈ యుద్ధంలో ఓడిపోతే దైవత్వం మరియు గెలిస్తే మహామహిమ స్థితి లభిస్తుంది. మరియు ఇక్కడ పదకొండవ అధ్యాయంలో అంటాడు : ఈ శత్రువులు నా వలన

చంపబడ్డారు. నీవు నిమిత్త మాత్రుడవయి, యశస్సును పొందుము మరియు సమృద్ధమైన రాజ్యాన్ని అనుభవించు. మళ్ళీ అదే మాట. ఏ మాట వలన అర్జునుడు ఉలిక్కిపడతాడో, ఏ రాజ్యప్రాప్తిలో అతను శోకం తగ్గడాన్ని చూడలేక పోతున్నాడో, శ్రీకృష్ణుడు మళ్ళీ అదే రాజ్యాన్ని ఇస్తాడా? లేదు, వాస్తవానికి వికారాల అంతంతో బాటు పరమాత్మ స్వరూపంలో స్థితే నిజమైన సమృద్ధి. అదియే స్థిరమైన సంపత్తి, దానికి ఎప్పటికీ వినాశనం లేదు– అది రాజయోగం యొక్క పరిణామం.

శ్లో॥ ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ
కర్ణం తథాన్యానపి యోథవీరాన్ ।
మయా హతాం స్త్వం జహి మా వ్యథిష్ఠా
యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్ ।**34**॥

ఈ ద్రోణుడు, భీష్ముడు, జయద్రథుడు, కర్ణుడు ఇంకా చాలా మంది ఇంతకుముందే నా ద్వారా చంపబడిన శూరవీర యోధులను నీవు చంపుము, భయపడకు. సంగ్రామంలో వైరులను నీవు నిశ్చయంగా గెలుస్తావు, కాబట్టి యుద్ధం చేయుము. ఇక్కడ కూడా శ్రీకృష్ణుడు అంటాడు– 'నా ద్వారా చంపబడినారు. ఈ మరణించిన వారిని నువ్వు చంపుము'. ఇక్కడ నేను కర్తనని స్పష్టం చేస్తాడు. కానీ ఐదవ అధ్యాయం 13-14 మరియు 15వ శ్లోకాలలో అతను భగవంతుడు కర్త కాడనీ, పద్దెనిమిదవ అధ్యాయంలో శుభాశుభప్రదాలైన ప్రతి కార్యం జరగడంలో అయిదు సాధనాలు ఉంటాయనీ (అవి అదిష్ఠానం, కర్త, కరణం, చేష్ట, దైవం అనేవి) అన్నాడు. కైవల్య స్వరూపుడైన పరమాత్ముడే చేస్తాడని, అనేవారు అవివేకులు, యథార్థాన్ని తెలియనివారు అంటే భగవంతుడు చేయడనే గదా. ఇలాంటి విరుద్ధ భావాల అర్థమేమిటి?

వాస్తవానికి ప్రకృతి మరియు ఆ పరమాత్మకు మధ్య ఒక సరిహద్దు రేఖ ఉంది. ప్రకృతి యొక్క పరమాణువుల ప్రాబల్యం ఎక్కువగా ఉన్నంత వరకూ మాయ ప్రేరేపిస్తూ ఉంటుంది. మరియు ఎప్పుడు సాధకుడు వాటికంటే అతీతం అయిపోతాడో, అప్పుడు యీశ్వరుడు, ఇష్టదైవం మరియు సద్గురువు యొక్క కార్యక్షేత్రంలోకి ప్రవేశం పొందుతాడు. దాని తరువాత సద్గురువు, యిష్టదైవం (గుర్తుంచుకోవలసిందేమిటంటే ప్రేరకుడికి సద్గురువు, ఆత్మ, పరమాత్మ, ఇష్ట దైవం, భగవంతుడు మొదలైనవి పర్యాయ వాచకాలు. ఏమన్నా సరే భగవంతుడే అంటాడు) హృదయానికి రథుడై పోతారు. ఆత్మలో జాగృతమయి ఆ అనురాగవంతుడైన సాధకుణ్ణి స్వయంగా సాధనా పథంలో సంచాలితుణ్ణి చేయ మొదలెడతాడు.

'పూజ్య గురువుగారు' అనేవారు– ''ఓహో, ఏ పరమాత్ముని పట్ల మనకు అభిలాష ఉందో, ఏ స్థాయిలో మనం నిలుచున్నామో, ఆ స్థాయికి ఆతను స్వయంగా దిగివచ్చి ఆత్మలో జాగృతం కానంత వరకూ సరైన పరిమాణంలో సాధన ఆరంభమే కాదు. ఆ తరువాత సాధకుడు నిమిత్త మాత్రుడై అతని సంకేతాల ప్రకారం మరియు ఆదేశాల ప్రకారం ఆచరిస్తూ

ఉంటాడు. సాధకుడి విజయం అతని ఆశీర్వాద ఫలం. అలాంటి అనురాగవంతుడి కోసం ఈశ్వరుడు తన దృష్టితో చూస్తాడు, చూపిస్తాడు మరియు తన స్వరూపం వరకు చేర్చుతాడు'' ఇదే శ్రీకృష్ణుడన్న మాటకు అర్థం. నా ద్వారా చంపబడిన ఈ వైరులను చంపుము. నిశ్చయంగా నీకు విజయం లభిస్తుంది, నేను నీకై నిలబడి ఉన్నాను.

సంజయ ఉవాచ-

శ్లో ॥ ఏత చ్ఛ్రుత్వా వచనం కేశవస్య
కృతాఞ్జలి ర్వేపమానః కిరీటీ ।
నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణం
సగద్గదం భీతభీతః ప్రణమ్య ॥**35**॥

సంజయుడు అన్నాడు- (అర్జునుడు ఏం చూసాడో, సరిగ్గా అదే సంజయుడు చూసాడు. అజ్ఞానంచే ఆచ్ఛాదితమైన మనస్సే అంధుడైన ధృతరాష్ట్రుడు, కానీ అలాంటి మనస్సు కూడా సంయమనం ద్వారా చక్కగా చూడగలదు, వినగలదు మరియు అర్థం చేసుకోగలదు) కేశవుని ఈ పైన చెప్పిన మాటల్ని విని కిరీటధారుడైన అర్జునుడు భయభీతుడై వణుకుతూ, చేతులు జోడించి నమస్కారం చేసి, మళ్ళీ శ్రీకృష్ణునితో ఈ ప్రకారంగా పూడుకు పోయిన కంఠంతో అన్నాడు-

అర్జున ఉవాచ-

శ్లో ॥ స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా
జగత్ప్ర హృష్యత్యనురజ్యతే చ ।
రక్షాంసి భీతాని దిశో ద్రవన్తి
సర్వే నమస్యన్తి చ సిద్ధ సంఙ్ఘాః ॥**36**॥

హే అంతర్యామివైన హృషీకేశ! మీ కీర్తిచేత ప్రపంచం హర్షితమవడం మరియు అనురాగాన్ని పొందడం ఉచితమైనదే. మీ మహిమ చేతనే భయభీతులైన రాక్షసులు నలు దిశల పారిపోతారు. మరియు సిద్ధులందరి సముదాయాలు మీ మహిమను చూసి నమస్కారం చేస్తాయి.

శ్లో ॥ కస్మాచ్చ తేననమేరన్మహాత్మన్
గరీయసే బ్రహ్మణోఽప్యాది కర్త్రే ।
అనన్త దేవేశ జగన్నివాస
త్వమక్షరం సదసత్తత్పరం యత్ ॥**37**॥

హే మహాత్మా! బ్రహ్మకు కూడా ఆది కర్తవైన మరియు అందరి కన్నా పెద్దవాడివైన మీకు వారందరూ నమస్కారం చేయకుండా ఎలా ఉండగలరు? ఎందుకంటే హే అనంతా! హే దేవేశా! హే జగన్నివాసా! సత్యం, అసత్యం, వాటి కంటే అతీతమైన అక్షరం అంటే అక్షయ

స్వరూపులు మీరే. అర్జునుడు అక్షయ స్వరూపాన్ని ప్రత్యక్షంగా దర్శనం చేసుకున్నాడు. కేవలం బౌద్ధిక స్థాయిలో కల్పన చేయడం వలనగానీ, లేక భావించడం మాత్రంచే గానీ అలాంటి అక్షయ స్థితి దొరకదు, అందరిలోనూ ఆ అక్షయముంది. అర్జునుని ప్రత్యక్షదర్శనం అతని ఆంతరికమైన అనుభూతియే. అతను సవినయంగా అన్నాడు–

శ్లో ॥ త్వమాది దేవః పురుషః పురాణ-
స్త్వ మస్య విశ్వస్య పరం నిధానం ।
వేత్తాऽసి వేద్యం చ పరం చ ధామ
త్వయా తతం విశ్వమనన్త రూప ॥**38**॥

నీవు ఆది దేవుడవు మరియు సనాతన పురుషుడవు. నీవు యీ జగత్తుకు పరమ ఆశ్రయుడవు. సర్వజ్ఞుడవు, తెలుసుకో యోగ్యమైన వాడవు, మరియు పరంధాముడవు. హే అనంత స్వరూపా! నీవు ఈ సంపూర్ణ జగత్తులో వ్యాపించి ఉన్నావు.

శ్లో ॥ వాయుర్యమోऽగ్నిర్వరుణః శశాఙ్కః
ప్రజాపతిస్త్వం ప్రపితామహశ్చ ।
నమో నమస్తేऽస్తు సహస్రకృత్వః
పునశ్చ భూయోऽపినమో నమస్తే ॥**39**॥

నీవే వాయువు, యమరాజువు, అగ్నివి, వరుణుడవు, చంద్రుడవు మరియు ప్రజల యొక్క ప్రభువు అయిన బ్రహ్మవు. ఆబ్రహ్మకు కూడా తండ్రివి. నీకు వేల నమస్కారాలు. మళ్ళీ తిరిగి తిరిగి నమస్కారాలు. అతిశయమైన శ్రద్ధా భక్తితో నమస్కారాలు చేస్తూ కూడా అర్జునుడికి తృప్తి కలగటం లేదు. అతను అంటాడు–

నమః పురస్తాదథ పృష్ఠతస్తే
నమోऽస్తు తే సర్వత ఏవ సర్వ ।
అనంత వీర్యామితవిక్రమస్త్వం
సర్వం సమాప్నోషి తతోऽసి సర్వః ॥**40**॥

హే అనంతమైన సామర్థ్యంగలవాడా! నీకు ముందునుంచి మరియు వెనక నుంచి కూడా నమస్కారాలు. హే సర్వాత్ముడా! నీకు అన్ని వైపుల నుంచీ నమస్కారాలు, ఎందుకంటే హే అత్యంత పరాక్రమశాలుడా! మీరు అన్ని వైపుల నుంచీ ప్రపంచంలో వ్యాపించి ఉన్నారు, కాబట్టి మీరే సర్వరూపులు మరియు సర్వత్రులు. ఈ ప్రకారంగా మళ్ళీ మళ్ళీ నమస్కారాలు చేసి భయభీతుడైన అర్జునుడు తన తప్పులకు క్షమాబిక్షను వేడుకొంటాడు.

శ్లో ॥ సఖేతి మత్వా ప్రసభం యదుక్తం
హే కృష్ణ హే యాదవ హే సఖేతి ।
అజానతా మహిమానం తవేదం
మయా ప్రమాదాత్ప్రణయేన వాపి ॥41॥

నీ యొక్క యీ ప్రభావాన్ని తెలుసుకోలేక నిన్ను మిత్రుడిగా భావించి నేను ప్రేమ (లేక) అజాగ్రత్తచే హే కృష్ణా! హే యాదవా! హే సఖా! ఈ ప్రకారంగా ఏదో ఒకటి మూర్ఖంగా అనేసాను కాబట్టి.

శ్లో ॥ యచ్చావహాసార్థ మసత్కృతోఽసి
విహార శయ్యాసనభోజనేషు ।
ఏకోఽథవాప్యచ్యుత తత్సమక్షం
తత్క్షామయే త్వా మహమప్రమేయం ॥42॥

హే అచ్యుతా! నవ్వులాటకై విహరించేటప్పుడు, పడుకొనేటప్పుడు, కూర్చున్నప్పుడు మరియు భోజనం చేసేటప్పుడు, ఒంటరిగా గానీ, లేక అందరి ముందుగానీ నీవు నాచే అవమానింపబడ్డావు. ఆ అన్ని అపరాధాలనూ క్షమించమని అచింత్య ప్రభావంగల నిన్ను నేను వేడుకుంటున్నాను. ఏ ప్రకారంగా క్షమించాలి?

శ్లో ॥ పితాసిలోకస్య చరాచరస్య
త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్ ।
నత్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యో
లోకత్రయేఽప్య ప్రతిమప్రభావ ॥43॥

మీరు యీ చరాచర జగత్తుకి తండ్రి. గురువుని మించిన పెద్ద గురువు మరియు అతి పూజ్యుడవు. ఏలాంటి ఉపమానం లేని అప్రతిమ ప్రభావంగల వాడా! నీ సమానంగా మూడు లోకాల్లోనూ యింకెవరూ లేరు, మరి అధికుడెలా ఉంటాడు. మీరు సఖుడు కూడా కాదు, ఎందుకంటే సఖుడు సమానమైన వాడవుతాడు.

శ్లో ॥ యస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వామహమీశ మీడ్యం ।
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుం ॥44॥

నీవు చరాచర జగత్తుకి తండ్రి, కాబట్టి నేను నా శరీరాన్ని నీ చరణాల వద్ద ఉంచి ప్రణామం చేస్తూ, స్తుతి చేయ యోగ్యమైన నీ లాంటి ఈశ్వరుణ్ణి ప్రసన్నుడవుకమ్మని ప్రార్థించుతున్నాను. హే దేవా! తండ్రి ఎలాగైతే పుత్రుణ్ణి, సఖుడు ఎలాగైతే సఖుణ్ణి మరియు పతి స్త్రీ యొక్క అపరాధాలను క్షమించుతాడో, అలాగే నీవు కూడా నా అపరాధాలను సహించ యోగ్యుడవు. అపరాధం ఏమిటి? నేను అప్పుడప్పుడు ' హే యాదవా! హే సఖా!

హే కృష్ణా!' అన్నాను. నలుగురి మధ్యలోగానీ, లేక ఏకాంతంలోగానీ అన్నాను. భోజనం చేసేటప్పుడుగానీ, లేక నిద్రించునప్పుడు గానీ అన్నాను. 'కృష్ణ' అనడం తప్పా? నల్లవాడే గదా, తెల్లవాడని ఎలా అనడం? యాదవుడనడం కూడా తప్పుకాదు, ఎందుకంటే యదుకులంలోనేగా జన్మించింది. సఖా అనడం కూడా తప్పుకాదు, ఎందుకంటే స్వయంగా శ్రీకృష్ణుడు కూడా అర్జునుడి సఖుడిగానే భావించేవాడు. కృష్ణుడు అనడం అపరాధమే అయితే ఒక్కసారి కృష్ణ అన్నందుకే అర్జునుడు చాలా సార్లు క్షమాయాచన చేస్తున్నాడు మరి ఎవరి పేరు జపించాలి? ఏ పేరు జపించాలి?

వాస్తవానికి చింతన యొక్క ఏ విధానాన్నయితే స్వయంగా శ్రీకృష్ణుడు చెప్పాడో, అలాగే మీరు చేయండి. అతను యింతకు ముందు చెప్పాడు– 'ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన మామనుస్మరన్' అర్జునా! 'ఓం' ఇదే అక్షయ బ్రహ్మ యొక్క పరిచాయకం. దీనిని నీవు జపించు మరియు ధ్యానంలో నన్ను వహించు, ఎందుకంటే ఆ పరమభావంలో ప్రవేశం దొరికిన తరువాత అవ్యక్తం యొక్క పరిచాయకమే మహాపురుషుని పరిచాయకం కూడా. ప్రభావం చూసిన తరువాత అర్జునుడు తెలుసుకొన్నదేమిటంటే 'అతను నల్లనివాడూ కాదు, తెల్లని వాడూ కాదు, సఖుడూ కాడు, యాదవుడూ కాడు' అతను అక్షయ బ్రహ్మ యొక్క స్థితిని పొందిన మహాత్ముడు.

సంపూర్ణ గీతలో యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు ఐదుసార్లు 'ఓం' యొక్క ఉచ్ఛారణను గురించి నొక్కి చెప్పాడు. మరిప్పుడు మీరు జపం చేయ దలిస్తే, 'కృష్ణ–కృష్ణ' అని కాకుండా 'ఓం ''ఓం'' అనే జపించండి. సాధారణంగా భావికులు ఏదో ఒక ఉపాయం కనిపెడతారు. కొందరు 'ఓం' జపించడం యొక్క అధికార అనధికారాల చర్చలతో భయభీతులయితే, మరి కొందరు మహాత్ముల ఆశీర్వాదాలనభ్యర్థిస్తే మరి కొందరు శ్రీకృష్ణుణ్ణే కాదు, అతని కంటే ముందు రాధ మరియు గోపికల పేర్లను కూడా అతణ్ణి శీఘ్రంగా ప్రసన్నం చేసుకునే లోభంతో జపిస్తారు. పురుషుడు శ్రద్ధామయుడు, కాబట్టి అతను ఇలా జపించడం అతని భావుకత్వం మాత్రమే. మీరే గనుక నిజమైన భావుకలయితే అతని ఆదేశాల్ని పాటించండి. అతను అవ్యక్తంలో స్థితుడై ఉంటూకూడా ఈనాడు మీ ముందు లేడు. కానీ అతని మాటలు మీ సమక్షంలో ఉన్నాయి. అతని ఆజ్ఞలను పాటించండి. లేకపోతే గీతలో మీ స్థానమేమిటో మీరే చెప్పండి. ఇది మాత్రం నిశ్చయం– ''అధ్యేషతే చ య ఇమం శ్రద్ధావానసూయశ్చ శృణుయాదపి యో నర' –ఎవరైతే అధ్యయనం చేస్తారో, వింటారో, అతను జ్ఞానం మరియు యజ్ఞాల గురించి తెలుసుకొంటాడు, శుభలోకాలను పొందుతాడు. కాబట్టి అధ్యయనం తప్పకుండా చేయండి.

ప్రాణాపానాల చింతనలో 'కృష్ణుని నామ క్రమం పట్టులోకి రాదు. చాలా మంది అనవసరమైన భావుకతకులోనై కేవలం 'రాధే, రాధే' అనడం మొదలెట్టారు. ఈ రోజుల్లో అధికారుల వల్ల పని జరగనప్పుడు, వారి బంధువులచేగానీ, ప్రేమికులచేగానీ లేక భార్యచేగానీ సిఫారసు చేయించి పని చేయించుకునే ఆచారం ఏర్పడింది. లోకులు ఏమనుకుంటారంటే భగవంతుని ఇంటిలో కూడా ఇలాగే జరుగుతుందేమోనని, కాబట్టి వారు 'కృష్ణ కృష్ణ' అనడం

ఆపేసి 'రాధే-రాధే' అనడం ఆరంభించారు. వారంటారు 'రాధే-రాధే, శ్యాముణ్ణి ఇప్పించు అని. కానీ రాధ ఒకసారి శ్యాముడి నుండి వేరుపడి మళ్ళీ శాముణ్ణి కలుసుకోలేక పోయింది, ఆమె మిమ్మల్నెలా శ్యాముడివద్దకు తీసుకొని వెళుతుంది? కాబట్టి ఇతరులెవరు చెప్పినా వినకుండా, శ్రీకృష్ణుడి ఆదేశాలనే మీరు అక్షరాల మన్నించండి, 'ఓం'ను జపించండి. రాధ మనకు ఆదర్శం అయ్యేంత వరకు ఉచితమే, ఆమెలాగా, అంతే పట్టుదలతో మనం కూడా భజన చెయ్యాలి. బ్రహ్మను పొందాలంటే మాత్రం రాధలాగ విరహవ్యాకుల చిత్తులమయిపోవాలి.

తరువాత కూడా అర్జునుడు 'కృష్ణ' అన్నాడు. 'కృష్ణ' అనేది అతని ప్రచలితమైన పేరు. 'గోపాలుడు' ఎలాగో ఇదీ అలాగే-కానీ చాలామంది సాధకులు 'గురు-గురు' అని గానీ లేక గురువుగారి ప్రచలితమైన పేరునుగానీ భావుకతావశంతో జపించాలను కొంటారు, కానీ బ్రహ్మ ప్రాప్తి పొందిన తర్వాత అవ్యక్తంలో స్థితి పొందిన మహాపురుషుడి యొక్క పేరూ అదే. చాలామంది శిష్యులు ''గురుదేవా! మీధ్యానం చేసేటప్పుడు, పాత నామమైన 'ఓం' మొదలగునవి ఎందుకు జపించాలి, 'గురు-గురు' అనిగానీ, లేక 'కృష్ణ-కృష్ణ' అని గానీ ఎందుకన కూడదు''? అని అడుగుతారు. కానీ ఇక్కడ యోగేశ్వరుడు స్పష్టం చేసాడు- అవ్యక్త స్వరూపంలో విలయమవడంతో బాటు మహాపురుషుని పేరు కూడా, అతను స్థితుడై ఉన్న బ్రహ్మ, అవుతుంది. 'కృష్ణ' అనేది ఒక సంబోధన మాత్రమే, జపించే నామం కాదు.

యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడితో అర్జునుడు తన అపరాధాలను క్షమించమని వేడుకొన్నాడు. అతనిని స్వాభావిక స్వరూపంలోకి రమ్మని ప్రార్థించాడు. శ్రీకృష్ణుడు ఒప్పుకొన్నాడు, సహజంగా అయిపోయాడు అంటే అతణ్ణి క్షమించాడు. అర్జునుడు ఇలా నివేదించు కొన్నాడు.

శ్లో ॥ అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా
భయేన చ ప్రవ్యథితం మనో మే।
తదేవ మే దర్శయ దేవరూపం
ప్రసీద దేవేశ జగన్నివాస ॥**45**॥

ఇప్పటి వరకూ అర్జునుని సమక్షంలో యోగేశ్వరుడు విశ్వరూపంలోనే ఉన్నాడు. కాబట్టి అతను అంటాడు- 'నేను ఇంతకు ముందు చూడని మీ ఆశ్చర్యమయమయిన రూపాన్ని చూసి, ఆనందిస్తున్నాను మరియు నా మనస్సు భయంతో అతి వ్యాకులమవుతోంది. 'మొదట సఖుడనే భావించేవాడు, ధనుర్విద్యలో తను కృష్ణుని కంటే ఎంతో కొంత గొప్ప అని అనుకొనేవాడు. కానీ ఇప్పుడు ప్రభావం చూసి భయపడుతున్నాడు. ఇంతకు ముందు అధ్యాయంలో ప్రభావం గురించి విని అతను తననొక జ్ఞానిగా భావించుకొన్నాడు. జ్ఞానికి ఎక్కడైనా భయం వేస్తుందా? వాస్తవానికి ప్రత్యక్షదర్శన ప్రభావమే విలక్షణంగా ఉంటుంది. అంతా విని మరి అర్థం చేసుకొన్న తరువాత కూడా అంతా ఆచరించి తెలుసుకోవలసింది

మిగిలే ఉంటుంది. అతను అంటాడు– ఇంతకు ముందు చూడని మీ ఈ రూపును చూసి ఆనందిస్తున్నాను. నా మనస్సు భయంతో వ్యాకుల మవుతున్నది. కాబట్టి హేదేవా! మీరు ప్రసన్నులు కండి. హేదేవేశా! హే జగన్నివాసా! మీరు మీ ఆ రూపమే నాకు చూపించండి. ఏ రూపు?

శ్లో ॥ కిరీటినం గదినం చక్రహస్త మిచ్ఛామి
త్వాం ద్రష్టు మహం తథైవ ।
తేనైవ రూపేణ చతుర్భుజేన
సహస్రభాహో భవవిశ్వమూర్తే ॥**46**॥

నేను మిమ్మల్ని అలాగే, అంటే ఇది వరకు లాగానే, శిరస్సుపై ముకుటాన్ని, చేతిలో గద మరియు చక్రాలను ధరించి ఉండటం చూడాలను కొంటున్నాను. కాబట్టి హే విశ్వరూపా! హే సహస్ర బాహూ! మీరు ఆ చతుర్భుజ రూపంలోకి రండి. ఏ రూపం చూడాలను కొన్నాడు? చతుర్భుజ రూపం. ఇప్పుడు చతుర్భుజ రూపం ఏమిటన్నది, గమనించాలి–

శ్రీ భగవానువాచ-

శ్లో ॥ మయా ప్రసన్నేన తవార్జునేదం
రూపం పరం దర్శత మాత్మ యోగాత్ ।
తేజోమయం విశ్వమనన్తమాధ్యం
యన్మే త్వదన్యేనన దృష్ట పూర్వం ॥**47**॥

ఈ ప్రకారమైన అర్జునుడి ప్రార్థనను విని శ్రీకృష్ణుడు అన్నాడు– అర్జునా! నేను అనుగ్రహ పూర్వకంగా నా యోగశక్తి ప్రభావం చేత నా పరమ తేజోమయమయిన, అందరికీ ఆది అయిన మరియు ఎల్లలు లేని విశ్వరూపాన్ని నీకు చూపించాను, దానిని నీవు గాక ఇంకెవరూ ఇంతకు ముందు ఎప్పుడూ చూడలేదు.

శ్లో ॥ న వేదయజ్ఞాధ్యయనైర్నదానై
ర్నచ క్రియాభిర్న తపోభిరుగ్రైః ।
ఏవం రూప శక్య అహం నృలోకే
ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర ॥**48**॥

అర్జునా! ఈ మనుష్యలోకంలో ఈ ప్రకారమైన విశ్వరూపాన్ని వేదాల వలనగానీ, యజ్ఞం వలన గానీ, అధ్యయనం వలన గానీ, క్రియ వలన గానీ, ఉగ్రతపస్సు వల్లగానీ, నీవు తప్ప అన్యులెవరూ చూడలేరు. అది అసంభవం. అంటే నీవు తప్ప అన్యులెవరూ ఈ రూపాన్ని చూడలేరు. అలాంటప్పుడు మీకు గీతవల్ల ఉపయోగం లేదు. భగవద్దర్శన యోగ్యతలు అర్జునుడి

వరకే పరిమితం అయిపోయాయి, కానీ ఇంతకు ముందు చెబుతూ వచ్చిందేమిటంటే– అర్జునా! రాగం భయం మరియు క్రోధాలచే రహితులై, అనన్యమైన మనస్సుతో నాశరణు జొచ్చి, చాలా మంది జ్ఞానమనే తపస్సుతో పవిత్రమైన సాక్షాత్ నా స్వరూపాన్ని పొందారు. ఇక్కడ నీవు తప్ప ఎవరూ చూడలేదు మరియు భవిష్యత్తులో ఎవరూ చూడలేరు అని అంటాడు. అలాంటప్పుడు అర్జునుడెవడు? ఎవ్వరైనా పిండధారుడా? ఎవ్వరైనా శరీరధారుడా? కాదు, వాస్తవానికి అనురాగమే అర్జునుడు. అనురాగ విహీనుడైన పురుషుడు ఇంతకు ముందు చూడలేదు. మరియు భవిష్యత్తులో ఎప్పుడూ చూడలేడు. అనురాగం అంటే అన్ని వైపుల నుంచి చిత్తాన్ని కూడగట్టుకొని, ఏక మాత్రుడైన ఇష్టదైవంలో రాగ పూర్వకంగా ఉంచడమే. అనురాగం గలవానికే బ్రహ్మప్రాప్తి పొందే యోగ్యత ఉంది.

శ్లో ॥ మాతే వ్యథా మా చ విమూఢ భావో
దృష్ట్వా రూపం ఘోరమీదృఙ్మమేదమ్ ।
వ్యపేతభీః ప్రీతమనాః పునస్త్వం
తదేవ మే రూపమిదం ప్రపశ్య ॥**49**॥

ఈ ప్రకారంగా నా ఈ వికరాళ రూపాన్ని చూసి నీవు వ్యాకులుడివి కారాదు. మరియు భయపడి వేరు కావాలనే మూఢభావం కూడా రారాదు. ఇప్పుడు నీవు భయరహితమైన మరియు ప్రీతి యుక్తమైన మనస్సుతో నా ఈ రూపాన్ని చూడు. అంటే చతుర్భుజ రూపాన్ని మళ్ళీ చూడు.

సంజయ ఉవాచ–

శ్లో ॥ ఇత్యర్జునం వాసుదేవస్త' థోక్త్వా
స్వకం రూపం దర్శయామాస భూయః।
ఆశ్వాసయామాస చ భీతమేనం
భూత్వా పునసౌమ్యవపుర్మహాత్మా ॥**50**॥

సంజయుడు అన్నాడు– సర్వత్రా నివాసం చేసే దేవుడు, ఆ వాసుదేవుడు అర్జునుడితో ఈ ప్రకారంగా అని మళ్ళీ అలాగే తన రూపాన్ని చూపించాడు. మళ్ళీ మహాత్ముడైన శ్రీకృష్ణుడు ''సౌమ్యవపుః' అంటే ప్రసన్నుడయి భయభీతుడైన అర్జునుడికి ధైర్యాన్నిచ్చాడు. అర్జునుడు అన్నాడు–

అర్జున వువాచ–

శ్లో ॥ దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన ।
ఇదా నీమస్మి సంవృత్త స్స చేతాః ప్రకృతిం గతః ॥**51**॥

జనార్ధనా! మీ ఈ అత్యంత శాంత మనుష్యరూపాన్ని చూసి, ఇప్పుడు నేను ప్రసన్న చిత్తుడనయి నా స్వభావాన్ని పొందాను. అర్జునుడు అన్నాడు– 'భగవాన్! ఇప్పుడు మీరు నాకు

ఆ చతుర్భుజ స్వరూపాన్ని దర్శనం చేయించండి! యోగేశ్వరుడు చేయించాడు, కానీ అర్జునుడు ఎప్పుడైతే చూసాడో, ఏం చూసాడు? 'మానుషం రూపం'– మనుష్య రూపాన్ని చూసాడు. వాస్తవానికి బ్రహ్మ ప్రాప్తి పొందిన తరువత మహాపురుషుడే చతుర్భుజా, అనంతభుజా అని పిలువబడతాడు. రెండు భుజాల మహాపురుషుడు అనురాగవంతుడికి ఎదురుగ్గానే కూర్చున్నాడు, కానీ ఎక్కడైనా, ఎవరైనా స్మరణ చేస్తే, అదే మహాపురుషుడు ఆ స్మరణ కర్తలో జాగృత (రథుడై) మై అతనికి కూడా మార్గదర్శనం చేస్తాడు. భుజం కార్యానికి ప్రతీక. వారు లోపల, బయట కూడా కార్యం చేస్తారు. ఇదే చతుర్భుజ స్వరూపం. అతని చేతులలో గల శంఖం, చక్రం, గద మరియు పద్మం క్రమంగా వాస్తవిక లక్ష్యఘోషణ, సాధనాచక్రం యొక్క ప్రవర్తన, యింద్రియాల నియంత్రణ మరియు నిర్మల – నిర్లిప్త కార్య క్షమతకు ప్రతీకలు మాత్రమే. ఇదే కారణంగా చతుర్భుజ రూపంలో అతణ్ణి చూసినా కూడా అర్జునుడు అతణ్ణి మనుష్య రూపంలోనే పొందాడు. 'చతుర్భుజం' అనేది మహాపురుషులు శరీరం మరియు స్వరూపంతో కార్యం చేసే విధి విశేషం యొక్క పేరే గానీ, నాలుగు చేతులు గల ఎవరో వ్యక్తి కాదు.

శ్రీ భగవానువాచ

శ్లో ॥ సుదుర్దర్శమిదం రూపం దృష్టవానసి యన్మమ।
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శన కాంక్షిణః ॥**52**॥

మహాత్ముడైన శ్రీకృష్ణుడు అన్నాడు – అర్జునా! నీవు చూచిన నా ఈ రూపం చూడటానికి అతి దుర్లభమైంది, దేవతలు కూడా సదా యీ రూపాన్నే కోరుకొంటారు. వాస్తవానికి అందరూ పుణ్యపురుషుణ్ణి పోల్చుకోలేరు. 'పూజ్య సత్సంగీ మహారాజులు' అంతః ప్రేరణ గల పూర్ణ మహాపురుషులు, కానీ లోకులు ఆయనను పిచ్చివాడను కొనేవారు. ఎవరో ఒక పుణ్యాత్ముడికి 'ఇతను సద్గురువు' అని ఆకాశవాణి వినిపించింది. కేవలం వారే అతణ్ణి హృదయంతో ఆకట్టుకొన్నారు, అతని స్వరూపాన్ని పొందారు మరియు తమ సద్గతిని పొందారు. ఇదే శ్రీకృష్ణుడు కూడా అంటాడు– ఎవరి హృదయంలో దైవీ సంపద జాగృతమైందో, ఆ దేవతలు కూడా సదా ఈ రూప దర్శనం చేసుకోవాలనే ఆకాంక్షతో ఉంటారు. అంటే మిమ్మల్ని యజ్ఞం, దానం మరియు వేదాధ్యయనాలతో చూడవచ్చా? ఆ మహాత్ముడు అంటాడు–

శ్లో ॥ నాహం వేదైర్న తపసా న దానేన న చే జ్యయా।
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్ట వానసి మాం యథా ॥**53**॥

వేదాల వలనగాగీ, తపస్సు వలనగానీ, దానాల వలనగానీ మరియు యజ్ఞాల వలనగానీ, నువ్వు చూసిన ప్రకారంగా చూడటానికి నేను లేను. అంటే మిమ్మల్ని చూసేటందుకు ఉపాయమే లేదా? ఆ మహాత్ముడు అంటాడు 'ఒక ఉపాయం ఉంది–

శ్లో ॥ భక్త్యా త్వనన్యయా శక్య అహమేవం విధోఽర్జున ।
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరన్తప ॥**54**॥

హే శ్రేష్ఠమైన తపస్సుగల అర్జునా! అనన్య భక్తి ద్వారా అంటే నన్ను తప్ప ఇంకే

దేవతనూ స్మరించకుండా, అనన్య శ్రద్ధ వలన నన్ను ఈ ప్రకారంగా ప్రత్యక్షంగా చూడటానికి, తత్త్వంతో సాక్షాత్తుగా తెలుసుకొనేందుకు మరియు ప్రవేశం పొందడానికి కూడా సాధ్యపడుతుంది. అంటే అతని ప్రాప్తికి ఒకే ఒక సుగమమైన మాధ్యమం ఉంది. అది అనన్య భక్తి మాత్రమే. చివర్లో జ్ఞానం కూడా అనన్య భక్తిలోకి పరిణతమయిపోతుంది. దీనినే ఏడో అధ్యాయంలో చెప్పడమయింది. ఇంతకు ముందు అతను – నీవు తప్ప ఇంకెవరూ చూడ లేదు మరియు యింకెవరూ చూడలేరు' అని అన్నాడు. కానీ ఇక్కడ అంటాడు అనన్య భక్తి వలన కేవలం నన్ను చూడటమేకాదు, సాక్షాత్తు తెలుసుకోవచ్చు. నాలో ప్రవేశం కూడా పొందవచ్చు.'' అంటే అనన్య భక్తికి మారుపేరే 'అర్జునుడు' అర్జునుడు ఒక అవస్థ యొక్క పేరు. అనురాగమే అర్జునుడు. చివర్లో యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు అంటాడు–

శ్లో ॥ మత్కర్మ కృన్మత్పరమో మద్భక్తః స్సఙ్గవర్జితః।
నిర్వైర స్సర్వభూతేషు యః స మామేతి పాణ్డవ ॥**55**॥

హే అర్జునా! ఏపురుషుడైతే నా ద్వారా నిర్దిష్టమైన కర్మను అంటే నియత కర్మను, యజ్ఞార్థ కర్మను ఆచరిస్తాడో, 'మత్పరమః' నా పరాయణుడై చేస్తాడో, ఎవ్వరైతే నా భక్తుడో, 'సంగవర్జితః'– సంగ దోషంతో రహితుడు కాకుండా కర్మ జరగదు, కాబట్టి సంగదోషంచే రహితుడై, సమస్త ప్రాణుల పట్ల వైరభావంచే రహితుడై, కర్మ చేస్తాడో, అతను నన్ను పొందుతాడు. అంటే అర్జునుడు యుద్ధం చేసాడా? ఒట్టు పెట్టుకొని అతను జయద్రథుడ్ని చంపాడా? – అతణ్ణి చంపి ఉంటే గనక భగవంతుణ్ణి చూసి ఉండేవాడు కాదు, కానీ అర్జునుడు చూసాడు. దీని వలన ఋజువు అయ్యే దేమిటంటే చంపడం. నరకడాలను సమర్థించే ఒక్క శ్లోకం కూడా గీతలో లేదు. నిర్దిష్ట కర్మ, యజ్ఞ ప్రక్రియను ఆచరించేవాడు, అనన్య భావంతో అతణ్ణి తప్ప యింకెవరినీ స్మరించను కూడా స్మరించనివాడు, సంగ దోషం నుండి రహితుడై ఉన్నవాడు, యుద్ధం ఎలా చేస్తాడు? మీతో ఎవ్వరూ లేనే లేనప్పుడు, మీరు ఎవరితో యుద్ధం చేయాలి? సంపూర్ణ భూత ప్రాణుల పట్ల ఎవ్వరైతే వైర భావం నుంచి రహితులో, మనస్సులో కూడా ఎవరినీ బాధపెట్టాలని ఊహించను కూడా ఊహించరో, వారే నన్ను పొందుతారు, అలాంటప్పుడు అర్జునుడు యుద్ధం చేసాడా? ఎల్లప్పటికీ చేయలేదు. వాస్తవానికి సంగదోషం నుంచి వేరుగా వుంటూ, ఎప్పుడైతే మీరు అనన్య చింతనలో మునిగి పోతారో, నిర్ధారించబడిన యజ్ఞం యొక్క క్రియలో ప్రవృత్తులవుతారో, ఆ సమయంలో పరి పంథులైన రాగద్వేషాలు, కామక్రోధాలు మొదలగు దుర్జయ శత్రువులు అడ్డు గోడలుగా ప్రత్యక్షమవుతాయి. వాటిని దాటగలగటమే యుద్ధం.

## సారాంశం:

ఈ అధ్యాయం ఆరంభంలో అర్జునుడు అన్నాడు–భగవాన్! మీ విభూతుల గురించి నేను సవిస్తారంగా విన్నాను. దాని వలన నా మోహం పటాపంచలయి పోయింది, అజ్ఞానం తొలగి పోయింది, కానీ మీరే మన్నారంటే 'నేను సర్వత్రా ఉన్నా'నని. దానిని నేను చూడగోరుతున్నాను. నా వలన గనక చూడ సంభవమయ్యేదయితే, దయచేసి చూపించండి.

అర్జునుడు ప్రియమైన సఖుడు, అనన్య సేవకుడు, ఆ పరిస్థితులలో యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు ఏ రకమైన ప్రతి వాదనలూ చేయక, వెను వెంటనే విశ్వరూపాన్ని చూపించడం ప్రారంభించాడు- ఇప్పుడు నా లోపలనే నిల్చున్న సప్తఋషులను మరియు వారి కంటే ముందు వచ్చిన ఋషులను చూడు, బ్రహ్మ మరియు విష్ణువులను చూడు. సర్వత్రా వ్యాపించిన నా తేజస్సును చూడు. నా శరీరంలోనే ఒక స్థానంలో నిలబడ్డ చరాచర జగత్తును చూడు, కానీ అర్జునుడు కళ్ళు నులుముకుంటూ ఉండి పోయాడు. ఈ ప్రకారంగా యోగేశ్వరుడు రెండు మూడు శ్లోకాల వరకూ ఆగకుండా చూపించుతూ పోయాడు, కానీ అర్జునుడికి ఏమీ కనిపించలేదు. విభూతులన్నీ యోగేశ్వరునితో అప్పుడు కూడా ఉన్నాయి, కానీ అర్జునుడికి అతను ఒక సామాన్య మనుష్యుడిలాగే కనిపిస్తూ ఉన్నాడు. అప్పుడు ఈ ప్రకారంగా చూపుతూ, చూపించుతూ యోగేశ్వరుడు ఒక్కసారిగా ఆగిపోయాడు. ఇలా అన్నాడు- అర్జునా! ఈ కళ్ళతో నువ్వు నన్ను చూడలేవు. నీ బుద్ధితో నువ్వు నన్ను పరికించలేవు. తీసుకో, ఇప్పుడు నేను నీకు ఆ దివ్య దృష్టిని ప్రదానం చేస్తున్నాను, దాని వలన నీవు నన్ను చూడగలవు. భగవంతుడు ముందరే నిలుచున్నాడు గదా! అర్జునుడు చూసాడు, వాస్తవంగానే చూసాడు. చూసిన తరువాత చిన్న చిన్న తప్పులకై క్షమించమని కోరడం మొదలు పెట్టాడు. అవి వాస్తవానికి తప్పులేకావు. ఉదాహరణ కోసం- భగవాన్ ! అప్పుడప్పుడు నేను మిమ్మల్ని 'కృష్ణా, యాదవా' అని, అప్పుడప్పుడు' సఖా' అని అన్నాను. మీరు నన్ను క్షమించండి. శ్రీకృష్ణుడు క్షమించాడు కూడా, ఎందుకంటే అర్జునుడి ప్రార్థనను స్వీకరించి, అతను సౌమ్య స్వరూపంలోకి వచ్చేసాడు, ధైర్యాన్ని యిచ్చాడు.

వాస్తవానికి 'కృష్ణా' అనటం తప్పుకాదు. అతను నల్లనివాడే గదా, తెల్లనివాడని ఎలా పిలవబడతాడు? యదు వంశంలోనే జన్మించాడు. శ్రీకృష్ణుడు తనను స్వయంగా సఖుడిగానే భావించాడు. వాస్తవానికి ప్రతి సాధకుడూ ముందు మహాపురుషుణ్ణి అలాగే అనుకుంటాడు. కొందరు అతనిని రూపం మరియు ఆకారాలతో సంబోధిస్తే, యింకొందరు అతని వృత్తిచే అతణ్ణి పిలుస్తారు. మరియు మరికొందరు అతణ్ణి తమ సమఉజ్జీగానే భావిస్తారు, అతని యథార్థ స్వరూపాన్ని అర్థం చేసుకోలేరు. అతని అచింత్య స్వరూపాన్ని అర్జునుడు అర్థం చేసుకోగలిగాడు, ఏమనంటే అతను నలుపూకాదు, తెలుపూకాదు, ఏ కులానికీ చెందిన వాడూ కాదు మరియు ఎవరికీ సమ ఉజ్జి (సమానుడు) కాదు. అతనికి సమానమైన వారెవరూ లేనే లేరు. అలాంటప్పుడు సఖుడెలా? సమానం ఎలా? అది ఒక అచింత్య స్వరూపం. అతను స్వయంగా ఎవరికి చూపించ దలుచుకున్నాడో, అతనే ఇతణ్ణి చూడగలడు. కాబట్టి అర్జునుడు తన ప్రారంభిక తప్పులకు క్షమాయాచన చేసాడు.

ఇప్పుడు తలేత్తే ప్రశ్న ఏమిటంటే 'కృష్ణా' అనడమే అపరాధమయితే, మరి అతని పేరుని ఎలా జపించడం? అలాంటప్పుడు యోగేశ్వరుడు దేనినైతే జపించమని స్వయంగా చెప్పాడో, జపించడానికి ఏ పద్ధతిని చూపాడో, ఆ పద్ధతిలోనే మీరు చింతన-స్మరణ చేయండి. అదేమిటంటే 'ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామను స్మరన్'-'ఓం' అక్షయ బ్రహ్మ

యొక్క పర్యాయం. 'ఓ అహం స ఓం'– ఏదైతే వ్యాప్తమై ఉందో, ఆ సత్తా నాలో ఉంది. ఇదే 'ఓం' యొక్క ఆశయం. మీరు దీనిని జపించండి మరియు నన్ను ధ్యానించండి. రూపు తనది, నామము 'ఓం'ది అని చెప్పాడు.

అర్జునుడు ప్రార్థించాడు–'చుతుర్భుజ రూపంలో దర్శనం ఇవ్వండి, అని. శ్రీకృష్ణుడు ఆ సౌమ్య స్వరూపాన్ని ధరించాడు. అర్జునుడు అన్నాడు! భగవాన్ ! మీ ఈ మానవ సౌమ్య స్వరూపాన్ని చూసి, ఇప్పుడు నేను మామూలు మనిషినయ్యాను. అడిగింది చతర్భుజ రూపం అయితే చూపించింది, మనుష్యరూపం. వాస్తవానికి శాశ్వతంలో ప్రవేశం పొందిన యోగి శరీరంతో ఇక్కడ కూర్చున్నా, బయట రెండు చేతులతో పని చేస్తాడు మరియు దానితో బాటే అంతరాత్మలో జాగృతమయి, ఎక్కడ నుంచి భావికుడు స్మరణ చేస్తే, ఒకేసారి సర్వత్రా అతని హృదయంలో జాగ్రుతుడయి, ప్రేరకుడి రూపంతో పని చేస్తాడు. చేతులు అతని పనికి ప్రతీకలు. ఇదే, చతుర్భుజం అంటే.

శ్రీకృష్ణుడు అన్నాడు– అర్జునా! నువ్వు తప్ప నా యీ రూపాన్ని ఎవరూ చూడలేదు మరియు భవిష్యత్తులో చూడలేరు. అలాంటప్పుడు గీత మనకోసం వ్యర్థమయిందేనా! కాదు, యోగేశ్వరుడు అంటాడు– ఒక ఉపాయం ఉంది. ఎవ్వరైతే నా అనన్యభక్తులో, నన్ను తప్ప ఇంకెవరినీ స్మరించరో, నిరంతరం నా చింతననే చేస్తారో, వారి అనన్య భక్తి వలన నేను ప్రత్యక్షంగా చూడడానికి (ఎల్లాగైతే నువ్వు చూసావో, అలా) తత్త్వంతో తెలుసుకొనేందుకూ, ప్రవేశం పొందడానికి సులభమైన వాడిని. అంటే అర్జునుడు అనన్య భక్తుడు. భక్తి యొక్క పరిమార్జిత రూపమే అనురాగం. ఇష్టదైవానికి అనుగుణంగా ప్రీతి. 'మిలహిం నరఘపతి బిను అనురాగ' (అనురాగం లేకుండా రఘుపతి లభించడు)– అనురాగ విహీనుడైన పురుషుడు ఎప్పుడూ తనను పొందలేదు మరియు ఎప్పుడూ పొందలేడు. అనురాగం లేకపోతే, ఎవ్వరైనా సరే, లక్ష యోగాలు చేసినా, జపాలు చేసినా, తపస్సులు చేసినా, లేక దానాలు చేసినా 'అతను దొరకడు. కాబట్టి యిష్టదైవానికి అనుగుణంగా ప్రీతి (లేక) అనన్య భక్తి అత్యంత ఆవశ్యకం. చివరిలో శ్రీకృష్ణుడు అన్నాడు– ''అర్జునా! నా ద్వారా నిర్దిష్ట కర్మ చేయి, నా అనన్య భక్తుడవై చెయ్యి, నా శరణు జొచ్చి చెయ్యి, సంగ–దోషం నుండి వేరుగా ఉండి. సంగ–దోషంలో ఈ కర్మ జరగదు. సంగ–దోషం ఈ కర్మ యొక్క ప్రాప్తిలో భాధకం. ఎవ్వరైతే వైర–ద్వేషాలతో రహితుడై ఉంటాడో వాడే నన్ను పొందగలడు. ఎక్కడైతే సంగ–దోషం లేదో, ఎక్కడైతే మనల్ని వదిలి వేరే ఎవ్వరూ లేరో, శత్రుత్వం యొక్క మానసిక సంకల్పం లేదు, అలాంటి యుద్ధం ఎలాంటిది? బయట ప్రపంచంలో యుద్ధాలు జరుగుతాయి. కానీ గెలిచిన వాడికి కూడా విజయము లభించదు. దుర్జయ సంసార రూపుడైన శత్రువుని అసంగ రూపమైన శస్త్రముతో నరికి పరమంలో ప్రవేశించడమే వాస్తవికమైన విజయం. దానికి ఓటిమి లేదు.

ఈ అధ్యాయంలో యేగేశ్వరుడైన శ్రీకృష్ణుడు మొదట అర్జునుడికి దృష్టిని ప్రదానం చేసాడు, మరి తన విశ్వరూప దర్శనం చేయించాడు.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే **'విశ్వ రూప దర్శన యోగో'** నామైకాదశోఽధ్యాయః ॥ **11**॥

ఈ ప్రకారంగా శ్రీమద్భగవద్గీతా రూపీ ఉపనిషత్తు మరియు బ్రహ్మవిద్యా మరియు యోగశాస్త్రమనే విషయంలో శ్రీకృషుడు మరియు అర్జునుడి సంవాదంలో 'విశ్వ రూపదర్శన యోగం' అనే పేరుగల పదకొండవ అధ్యాయం పూర్తయింది.

ఇతి శ్రీమత్పరమహంస పరమానందస్య శిష్య స్వామీ అడగడానంద కృతే శ్రీమద్భగవద్గీతా యాః-- **'యథార్థ గీతా'** భాష్యే **'విశ్వరూప దర్శన యోగో'** నామైకాదశోఽధ్యాయః॥ **11**॥

ఈ ప్రకారంగా శ్రీమత్పరమహంస పరమానందగారి శిష్యుడు స్వామి అడగడానంద గారిచే రచించబడిన శ్రీమద్భగవద్గీత యొక్క భాష్యం 'యథార్థ గీతా' వ్యాఖ్యలో 'విశ్వరూప దర్శన యోగం' అనే పేరుగల పదకొండవ అధ్యాయం పూర్తయింది.

॥హరి ఓం తత్సత్॥

ॐ

శ్రీ పరమాత్మనే నమః

# ద్వాదశ అధ్యాయము

పదకొండో అధ్యాయం చివర్లో శ్రీకృష్ణుడు మళ్ళీ మళ్ళీ నొక్కి చెప్పాడు– 'అర్జునా! నీవు చూచిన! నా యీ స్వరూపాన్ని, నీవు తప్ప యింతకు ముందు ఎప్పుడూ ఎవ్వరూ చూడలేదు మరియు భవిష్యత్తులో కూడా ఎవ్వరూ చూడలేరు. నన్ను తపస్సు చేత గానీ, యజ్ఞం చేతగానీ, మరియు ధ్యానం చేతగానీ చూడలేరు. కానీ అనన్య భక్తి ద్వారా అంటే నా పట్ల తప్ప ఇతరత్రా ఎక్కడా శ్రద్ధ ఏర్పడకుండా, నిరంతరం నూనెధారలాగా, నా చింతన ద్వారా, సరిగ్గా నువ్వు చూచిన విధంగా నన్ను ప్రత్యక్షంగా చూడటానికీ, తత్త్వంతో సాక్షాత్తుగా తెలుసుకోవడానికి మరియు ప్రవేశం పొందటానికి కూడా వీలవుతుంది. కాబట్టి అర్జునా! నువ్వు నిరంతరం నా చింతన చెయ్యి, భక్తుడివి కమ్ము. అధ్యాయం చివరిలో అతను, 'అర్జునా! నువ్వు నా ద్వారానే నిర్ధారించబడిన కర్మ చెయ్యి' అని అన్నాడు. 'మత్పరమః' నా పరాయణుడవయి కర్మ చెయ్యి. అనన్య భక్తియే అతని ప్రాప్తికి సాధనం. అప్పుడు అర్జునుడు వేసిన ప్రశ్న స్వాభావికమైనదే– అవ్యక్తమూ, అక్షరమూ అయిన దాన్ని ఉపాసించే సాధకుడు మరియు సగుణులయిన మిమ్ములను ఉపాసించే సాధకుడు– ఇద్దరిలో శ్రేష్ఠులెవరు?

ఇక్కడ ఈ ప్రశ్నను అర్జునుడు మూడవ సారి లేవనేత్తాడు. మూడో అధ్యాయంలో అతను– భగవాన్ ! నిష్కామ కర్మ యోగం కంటే సాంఖ్య యోగం మీకు శ్రేష్ఠ మనిపిస్తున్నప్పుడు, నన్ను భయంకర కర్మలలో ఎందుకు పడేస్తున్నారు? అని అడిగాడు. అప్పుడు శ్రీకృష్ణుడు– అర్జునా ! నిష్కామ కర్మయోగం అయినా, లేక జ్ఞాన మార్గం అయినా– రెండింటిలోనూ కర్మ చేయవలసిందే. ఇందులో కూడా ఎవ్వరైతే మొండిగా ఇంద్రియాలను నిరోధించి, మనస్సుతో విషయాలను స్మరిస్తాడో, అతను దంభాచారుడే గానీ, జ్ఞాని మాత్రం కాదు, కాబట్టి అర్జునా! నువ్వు కర్మ చెయ్యి. ఏ కర్మ చెయ్యాలి? అంటే 'నియతం కురు కర్మత్వం'– నిర్ధారితమైన కర్మ చెయ్యి. నిర్ధారితమైన కర్మ ఏది? అంటే ఇలా చెప్పాడు – యజ్ఞం యొక్క ప్రక్రియే, అసలైనకర్మ.

యజ్ఞం విధి గురించి చెప్పాడు, అది ఆరాధన -చింతన యొక్క విశిష్ట విధి. అది పరమంలో ప్రవేశం ఇప్పించే ప్రక్రియ. నిష్కామ కర్మ మార్గంలోనూ, జ్ఞాన మార్గంలోనూ, రెండింటిలోనూ కర్మ చేయవలసినప్పుడు, యజ్ఞార్థ కర్మ చేయవలసి వచ్చినప్పుడు, క్రియ ఒక్కటే అయినప్పుడు, మరి తేడా ఏమిటి? భక్తుడు కర్మలను సమర్పణచేసి, ఇష్ట దైవానికి ఆశ్రితుడయి యజ్ఞార్థ కర్మలో ప్రవృత్తుడవుతాడు, మరి రెండవ రకమైన సాంఖ్య యోగి తన శక్తిని అర్థం చేసుకొని (తన భాధ్యతతో), అదే కర్మలో ప్రవృత్తుడవుతాడు. పూర్తిగా శ్రమిస్తాడు.

ఐదో అధ్యాయంలో అర్జునుడు మళ్ళీ ప్రశ్నించాడు– 'భగవాన్! మీరు అప్పుడప్పుడు సాంఖ్యంద్వారా కర్మ చేయడాన్ని ప్రశంసిస్తే, అప్పుడప్పుడు సమర్పణ ద్వారా నిష్కామ కర్మ యోగాన్ని ప్రశంసిస్తారు– యీ రెండింటిలో శ్రేష్ఠమయినది ఏది? ఇప్పటికే అర్జునుడు రెండు పద్ధతులలోనూ కర్మ చేయాలనేది అర్థం చేసుకున్నాడు, కానీ రెండింటిలో శ్రేష్ఠమైన మార్గాన్ని ఎంచుకోవాలనుకొంటున్నాడు. శ్రీకృష్ణుడు అన్నాడు– అర్జునా! రెండు పద్ధతులలోనూ కర్మలో ప్రవృత్తులయ్యే వారు నన్నే పొందుతారు, కానీ సాంఖ్య మార్గానితో పోలిస్తే నిష్కామ కర్మ మార్గం శ్రేష్ఠమైనది. నిష్కామ కర్మ యోగాన్ని అనుష్ఠానం చేయకుండా, ఎవరూ యోగిగానీ మరియు జ్ఞాని గానీ కాలేరు, సాంఖ్య యోగం దుష్కరమైనది, అందులో విపత్తులు (అడ్డంకులు) అధికం.

ఇక్కడ మూడవ సారిగా అర్జునుడు అదే ప్రశ్న వేసాడు– భగవన్! మిమ్ములను అనన్య భక్తితో ఆశ్రయించే వాడు మరియు అవ్యక్త అక్షరమైనదాని ఉపాసన (సాంఖ్య మార్గంచే) చేసేవాడు, ఈ ఇద్దరిలో శ్రేష్ఠుడెవడు?

అర్జున ఉవాచ

శ్లో ॥ ఏవం సతతయుక్తా యే భక్తాస్త్వాం పర్యు పాసతే।
యే చాప్యక్షర మవ్యక్తం తేషాం కే యోగవిత్త మాః ॥**1**॥

''ఏవం'' అంటే ఈ ప్రకారంగా ఇప్పుడిప్పుడే మీరు చెప్పిన విధి విధానం ప్రకారంగా, అనన్య భక్తితో మీ శరణు జొచ్చి, మీచే నిరంతరం సంయుక్తుడయి మిమ్మల్ని చక్కగా ఉపాసించేవారు ఒకరకం; రెండో రకంవారు మీ శరణు పొందకుండా, స్వతంత్రంగా తమ విశ్వాసంతో మీరు స్థితులై ఉన్న అక్షయం అవ్యక్తమైన స్వరూపాన్ని ఉపాసిస్తారు. ఈ రెండు రకాల భక్తులలో ఉత్తముడైన యోగవేత్త, ఎవరు? అప్పుడు యేగేశ్వరుడైన శ్రీకృష్ణుడు అన్నాడు–

శ్రీ భగవానువాచ-

మయ్యావేశ్య మనో యే మాం నిత్య యుక్తా ఉపాసతే ।
శ్రద్ధయా పరమో పేతాస్తే మే యుక్తతమా మతాః ॥**2**॥

అర్జునా! నాలో మనస్సును ఏకాగ్రం చేసి, నిరంతరం నాతో సంయుక్తులైన భక్తులు పరమంతో సంబంధం ఉంచే, శ్రేష్ఠమైన శ్రద్ధతో యుక్తులై నా భజన చేసే వారిని నేను యోగులలో అతిఉత్తములైన యోగులుగా, భావిస్తాను.

శ్లో॥ యే త్వక్షరమనిర్దేశ్యమవ్యక్తం పర్యుపాసతే।
సర్వత్ర గమచింత్యం చకూటస్థ మచలం ధ్రువమ్ ॥3॥

శ్లో॥ సంని యమ్యేంద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః ।
తే ప్రాప్నువంతి మామేవ సర్వ భూత హితే రతాః ॥4॥

ఇంద్రియాల సముదాయాన్ని చక్కగా సంయమనం చేసి, మనస్సు, బుద్ధి యొక్క చింతన కంటే అత్యంత అతీతమైన, సర్వవ్యాప్తియైన, అనిర్వచనీయ స్వరూపం గల, సదా ఏకరసంలో ఉండే, నిత్యమైన, అచలమైన, అవ్యక్తమయిన, ఆకారరహితమైన, అవినశ్వర బ్రహ్మ ఉపాసన చేసేవారు సంపూర్ణ భూతాల హితానికై ఉన్నవారు మరియు అందరి పట్ల సమాన భావం గలవారు అయినట్టి ఆ యోగులు కూడా నన్నే పొందుతారు. బ్రహ్మ యొక్క పైన చెప్పబడిన విశిష్టతలు నాకు భిన్నంగా లేవు, కానీ–

శ్లో॥ క్లేశో ధికతరస్తే షామవ్యక్తాసక్త చేతసాం ।
అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భి రవాప్యతే ॥5॥

ఆ అవ్యక్త పరమాత్మ పట్ల ఆసక్తిఉన్న చిత్తంగల పురుషుల సాధన క్లేశంతో కూడుకొన్నవి. ఎందుకంటే దేహాభిమానులచే అవ్యక్త విషయక గతి దుఃఖ పూర్వకంగా ప్రాప్తిస్తుంది. దేహం యొక్క స్పృహ ఉన్నంత వరకూ అవ్యక్తం యొక్క ప్రాప్తి దుష్కరమయింది.

యేగేశ్వరుడైన శ్రీకృష్ణుడు ఒక సద్గురువు. అవ్యక్తమయిన పరమాత్ముడు అతనిలో వ్యక్తమయ్యాడు. అతను అంటాడు– మహాపురుషుడి శరణు పొందకుండా, ఏ సాధకుడు తనశక్తిని అర్థం చేసుకొని, ముందుకు వెళతాడో అతను 'నేను ఈ దశలో ఉన్నాను, ఇక ముందు ఈ దశలోకి వెళతాను, నేను నా అవ్యక్త శరీరాన్నే పొందుతాను, అది నారూపమే అవుతుంది, నేను అతణ్ణే, అని అనుకుంటూ ప్రాప్తికై నిరీక్షించక, తన శరీరాన్నే 'సోऽహం' అనడం మొదలు పెడతాడు. ఇదే ఈ మార్గంలో అన్నింటికంటే గొప్ప అడ్డంకి. అతను 'దుఃఖాలయం అశాశ్వతం' చుట్టూ తిరుగుతుంటాడు. కానీ ఎవరైతే నా శరణు జొచ్చి ఆచరిస్తారో, వారు–

శ్లో॥ యేతు సర్వాణి కార్మాణి మయి సంన్యస్య మత్పరాః ।
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత వుపాసతే ॥6॥

ఎవరైతే నా పరాయణులయి (నాయందు చిత్తముంచి) సంపూర్ణ కర్మలను అంటే ఆరాధనను నాకు అర్పించి, అనన్య భావంతో యోగం అంటే ఆరాధనా ప్రక్రియ ద్వారా నిరంతరం చింతన చేస్తూ భజన చేస్తారో–

శ్లో॥ తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్ ।
భవామి నచిరాత్పార్థ మయ్యా వేశిత చేతసామ్ ॥7॥

కేవలం నాలోనే చిత్తాన్ని ఉంచిన, ఆ భక్తులను నేను శీఘ్రంగానే మృత్యురూపమయిన సంసారసాగరం నుండి ఉద్ధరిస్తాను. ఈ ప్రకారంగా చిత్తాన్ని నిలపడానికైన ప్రేరణ మరియు దాని విధిని గురించి యేగేశ్వరుడు వివరణ ఇస్తాడు–

శ్లో ॥ మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ।
నివసిష్యసిమయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః ॥8॥

కాబట్టి అర్జునా! నువ్వు నాలోనే మనస్సు పెట్టు. నాలోనే బుద్ధి ఉంచు. ఆ తరువాత నువ్వు నాలోనే నివసిస్తావు. ఇందులో ఏ మాత్రం కూడా సంశయం లేదు. మనస్సు మరియు బుద్ధిని స్థిరం చేయలేక పోతే, అప్పుడో? (అర్జునుడు యింతకు ముందన్నాడు మనస్సుని ఆపడాన్ని నేను వాయువులాగ దుష్కరమనుకొంటున్నాను అని.) అప్పుడు యోగేశ్వరుడైన శ్రీకృషుడు ఇలా అన్నాడు.

శ్లో ॥ అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరం ।
అభ్యాస యోగేన తతో మామిచ్ఛాప్తుం ధనంజయ ॥9॥

నువ్వు గనక మనస్సును నాలో అచలంగా స్థిరపరచడంలో సమర్థుడవు కాలేక పోతే, హే అర్జునా! యోగాభ్యాసం ద్వారా నన్ను పొందు ఇచ్ఛను కలిగిఉండు. (చిత్తం ఎక్కడికెళ్ళినా సరే, అక్కడి నుంచి బలవంతంగా తీసుకొచ్చి, దానిని ఆరాధన- చింతన క్రియలలో నిమగ్నం చేయడానికి పెట్టిన పేరే అభ్యాసం) ఇది కూడా చేయలేని స్థితిలో-

శ్లో ॥ అభ్యాసేప్యసమర్థోఽసి మత్కర్మ పరమో భవ।
మదర్థమపి కర్మాణి కుర్వం సిద్ధి మవాప్స్యసి ॥ 10॥

నువ్వు గనక అభ్యాసంలో కూడా అసమర్థుడవయితే, కేవలం నా కొరకై కర్మ చెయ్యి, అంటే ఆరాధించడంలో తత్పరుడవు కమ్ము. ఈ ప్రకారంగా నా ప్రాప్తి కోసం కర్మను చేస్తూ, నువ్వు నా ప్రాప్తి రూపమయిన సిద్ధినే పొందుతావు. అంటే అభ్యాసం కూడా చేయలేని పరిస్థితులలో సాధనా పథంలో కొనసాగుతూ ఉండు.

శ్లో ॥ అథై తదప్యశక్తోఽసి కర్తుం మద్యోగమాశ్రితః ।
సర్వకర్మ ఫలత్యాగం తతః కురు యతాత్మవాన్ ॥ 11॥

ఇది కూడా చేయడంలో అసమర్థుడవయితే, సంపూర్ణ కర్మల ప్రతిఫలాన్ని త్యాగం చేసి అంటే లాభ నష్టాల యొక్క చింతన వదిలేసి, 'మద్యోగ'కు ఆశ్రితుడవయి అంటే సమర్పణ భావంతో బాటు ఆత్మవంతుడయిన మహాపురుషుని శరణులోకి వెళ్ళు. అతని వలన ప్రేరితమయి కర్మ స్వతహాగానే జరగడం మొదలవుతుంది. సమర్పణ భావంతోబాటు కర్మ ఫలాన్ని త్యాగం చేయడం యొక్క మహాత్యాన్ని గురించి చెబుతూ, యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు ఇలా అంటాడు-

శ్లో ॥ శ్రేయో హి జ్ఞానమభ్యాసాత్ జ్ఞానా ద్ధ్యానం విశిష్యతే ।
ధ్యానాత్కర్మఫల త్యాగస్త్యాగాచ్ఛాంతిరనంతరం ॥ 12॥

కేవలం చిత్తాన్ని నిరోధించే అభ్యాసంతో జ్ఞాన మార్గంతో కర్మలో ప్రవృత్తమవడం శ్రేష్ఠమైనది. జ్ఞాన మాధ్యమంతో కర్మకు కార్యరూపు నివ్వడంకంటే ధ్యానం శ్రేష్ఠమయింది, ఎందుకంటే ధ్యానంలో యిష్టదైవం ఉంటాడు గదా! ధ్యానం కంటే కూడా సంపూర్ణ కర్మల ఫలాన్ని త్యాగం చేయడం శ్రేష్ఠమయింది, ఎందుకంటే ఇష్ట దైవం పట్ల సమర్పణభావంతో

బాటుగా యోగంపై దృష్టి ఉంచుతూ, కర్మ ఫలాన్ని త్యాగం చేయడం చేత అతని యోగక్షేమాల బాధ్యత ఇష్ట దైవానిదై పోతుంది. కాబట్టి ఈ త్యాగంతో అతను వెంటనే పరమశాంతిని పొందుతాడు.

ఇప్పటి వరకూ యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు చెప్పిందేమిటంటే -అవ్యక్తం యొక్క ఉపాసన చేసే జ్ఞానమార్గుని కంటే, సమర్పణ భావంతో బాటు కర్మను చేసే నిష్కామ కర్మయోగి శ్రేష్ఠమైన వాడు. ఇద్దరూ ఒకే కర్మను చేస్తారు, కానీ జ్ఞానమార్గుడికి దారిలో అడ్డంకులు ఎక్కువ. అతని లాభ నష్టాల బాధ్యత అతనిదే అయి ఉంటుంది. అలాగాక సమర్పితుడైన భక్తుడి బాధ్యత మహాపురుషుని పై ఉంటుంది. కాబట్టి అతను కర్మ ఫలత్యాగం ద్వారా శీఘ్రంగానే శాంతిని పొందుతాడు. ఇప్పుడు శాంతిని పొందిన పురుషుని లక్షణాలను గురించి చెప్తాడు-

శ్లో ॥ అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవచ ।
నిర్మమో నిరహంకారః సమదుఃఖ సుఖః క్షమీ ॥ **13**॥

ఈ ప్రకారంగా శాంతిని పొందిన, ఏపురుషుడైతే భూతాలన్నింటి పట్ల ద్వేష భావరహితుడో, అందరినీ ప్రేమించువాడో మరియు కారణ రహితంగా దయాళుడో మరియు ఎవరైతే మమతచే రహితుడో, అహంకారంచే రహితుడో, సుఖ దుఃఖాలలో సమానత్వం గలవాడో మరియు క్షమించగలవాడో-

శ్లో ॥ సంతుష్టః సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః।
మయ్యర్పితమనో బుద్ధిర్యో మద్భక్తః స మే ప్రియః ॥ **14**॥

ఎవరైతే నిరంతరం యోగ పరాకాష్ఠతో సంయుక్తుడో, లాభనష్టాలలో సంతుష్టుడో, మనస్సు మరియు ఇంద్రియాల సహితంగా శరీరాన్ని వశం చేసుకున్నాడో, దృఢ నిశ్చయం గలవాడో, అతను నాలో సమర్పితమైన మనస్సు, బుద్ధి కలవాడు, అట్టి నా భక్తుడు నాకు ప్రియమైనవాడు.

శ్లో ॥ యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః ।
హర్షా మర్ష భయో ద్వేగైర్ముక్తోయః స చ మే ప్రియః ॥ **15**॥

ఎవరివలన ఏ జీవి కూడా ఉద్వేగాన్ని పొందడో, ఎవరైతే తను కూడా ఏజీవి వలన ఉద్విగ్నుడు కాడో, హర్ష సంతాప భయాలు, విక్షోభాలు లేనివాడో, ఆ భక్తుడు నాకు ప్రియమైనవాడు.

సాధకులకు ఈ శ్లోకం అత్యంత ఉపయోగకరమయినది. వారు ఈ రకంగా ఉండాలి- వారి వలన ఎవరి మనస్సు కూడా కష్టం కలగ కూడదు. ఇంతమాత్రం సాధకుడు చేయగలడు, కానీ ఇతరులు ఇలాంటి ఆచరణ చేయరు. వారు సంసారులు, వారు అగ్నిని కురిపిస్తారు. ఏమైనా అంటారు, కానీ సాధకునకు కావలసిందేమిటంటే తన హృదయం వారి వలన (వారి ఆఘాతాల వలన) అతలాకుతలం కారాదు, చింతనలో ఇష్టదైవంలో నిమగ్నుడై ఉండాలి.

క్రమం తెగరాదు. ఉదాహరణకై – మీరు స్వయంగా రోడ్డుపై నియమానుసారంగా ఎడమ వైపునే వెళుతున్నారనుకోండి, ఎవరో త్రాగుబోతు ఎదురుగా వస్తున్నాడనుకోండి, అతని బారి నుంచి తప్పించుకోవడం మీ బాధ్యతే.

శ్లో ॥ అనపేక్షః శుచిర్దక్షః వుదాసీనో గత వ్యథః ।
సర్వారంభ పరిత్యాగీ యో మద్భక్తః సమే ప్రియః ॥ **16**॥

ఏ పురుషుడైతే ఆకాంక్షలచే రహితుడో, సర్వథా పవిత్రుడో, 'దక్షః' అంటే ఆరాధనలో విశేషజ్ఞుడో (అలా కాకుండా దొంగతనం చేయడం వలన దక్షుడు కాడు. శ్రీకృష్ణుడు చెప్పినట్లు కర్మ ఒక్కటే, నియత కర్మ– ఆరాధన చింతన, అందులో ఎవరైతే దక్షుడో), ఎవరైతే పక్ష–ప్రతి పక్షాలకు అతీతుడో, దుఃఖాల నుంచి ముక్తుడో, ఆరంభాలన్నింటినీ త్యాగం చేసిన వాడో, అట్టి భక్తుడు నాకు ప్రియమైన వాడు. చేయడానికి యోగ్యమయిన ఏ క్రియా అతని వలన ఆరంభం చేయడానికి మిగిలిలేదు.

శ్లో ॥ యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి ।
శుభాశుభ పరిత్యాగీ భక్తిమాన్యః స మే ప్రియః ॥ **17**॥

ఎవరైతే ఎప్పుడూ హర్షితుడు కాడో, ద్వేషం కలిగి ఉండడో, శోకించడో, కోరికలు లేనివాడో, ఎవరైతే శుభాశుభ సంపూర్ణ కర్మ ఫలాన్ని త్యాగం చేస్తాడో, ఎక్కడైతే శుభం వేరుగా ఉండదో, అశుభం మిగిలి ఉండదో, భక్తి యొక్క ఈ పరాకాష్ఠచే యుక్తుడయిన ఆ పురుషుడు నాకు ప్రియమైన వాడు.

శ్లో ॥ సమః శత్రౌ చమిత్రేచ తథామానాపమానయోః ।
శీతోష్ణ సుఖ దుఃఖేషు సమః సంగవివర్జితః ॥ **18**॥

ఏ పురుషునికైతే శత్రువులు మరియు మిత్రులు, మానాపమానాలు సమానమో, ఎవరి యొక్క అంతః కరణంలోని వృత్తులు సర్వథా శాంతి పొందాయో, ఎవరైతే వేడి–చలి; సుఖం–దుఖం మొదలగు ద్వంద్వాలలో సమానంగా ఉంటాడో, ఆసక్తిరహితుడో మరియు–

శ్లో ॥ తుల్యనిందాస్తుతిర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్ ।
అనికేతః స్థిరమతిర్భక్తి మాన్మే ప్రియో నరః ॥ **19**॥

ఎవరైతే నిందా–స్తుతులను సమానమని తలుస్తాడో, మననశీలత యొక్క చరమసీమకు చేరుకుని ఎవరి ఇంద్రియాలు మనస్సహితంగా శాంతమయి పోయాయో, ఎవరైతే ఏదో విధమైన శరీర నిర్వహణలో సంతుష్టుడో, ఎవరైతే తన నివాస స్థానం పట్ల మమకార రహితుడో, భక్తి యొక్క పరాకాష్ఠను చేరిన ఆ స్థిర బుద్ధిగల పురుషుడు నాకు ప్రియమైన వాడు.

శ్లో ॥ యేతు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే ।
శ్రద్ధధానా మత్పరమా భక్తాస్తేఽతీవమే ప్రియాః ॥**20**॥

ఎవరైతే నా పరాయణుడయి (నాలో మనస్సుంచి) హృదయ పూర్వక శ్రద్ధాయుక్తుడైన వాడో, పైన చెప్పబడిన ధర్మమయమైన అమృతాన్ని చక్కగా సేవిస్తాడో, ఆ భక్తుడు నాకు అతిశయంగా ప్రియమైన వాడు.

సారాంశం:

గత అధ్యాయం చివరిలో యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు అన్నాడు– అర్జునా! నువ్వు తప్ప, నువ్వు చూసిన విధంగా ఇతరులు పొందలేదు, పొందలేరు. కానీ అనన్య భక్తి (లేక) అనురాగంతో ఎవ్వరైనా భజన చేస్తే, అతను ఇదే ప్రకారంగా నన్ను చూడవచ్చు, తత్త్వంతో సహా నన్ను తెలుసుకోవచ్చు మరియు నాలో ప్రవేశం కూడా పొందవచ్చు. అంటే పరమాత్ముడు ఎలాంటి వాడంటే, అతణ్ణి పొందవచ్చును. కాబట్టి అర్జునా! భక్తుడవు కమ్ము.

అర్జునుడు ఈ అధ్యాయంలో ప్రశ్నించాడు– 'భగవాన్! అనన్య భావంతో ఎవ్వరైతే మీ చింతన చేస్తారో మరియు రెండవ వారు ఎవ్వరైతే అక్షర అవ్యక్తాన్ని ఉపాసిస్తారో, ఈ ఇద్దరిలో ఉత్తముడైన యోగవేత్త ఎవరు? యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు చెప్పాడు– ఇద్దరూ నన్నే పొందుతారు, ఎందుకంటే నేను అవ్యక్త స్వరూపుణ్ణి. కానీ ఎవ్వరైతే ఇంద్రియాలను వశంలో ఉంచుకొంటూ మనస్సును అన్నివైపుల నుంచి కూడ గట్టుకొని అవ్యక్త పరమాత్ముని పట్ల ఆసక్తుడయి ఉంటాడో, అతని పథంలో ఆటంకాలు ఎక్కువ; ఎప్పటి వరకు దేహ అభిమానం ఉంటుందో, అప్పటి వరకూ అవ్యక్త స్వరూపం యొక్క ప్రాప్తి దుఃఖపూర్ణమయింది, ఎందుకంటే అవ్యక్త స్వరూప ప్రాప్తి చిత్తం యొక్క నిరోధం మరియు విలయ కాలంలో జరుగుతుంది. దానికి అతని శరీరమే అడ్డంకి అయిపోతుంది. ''నేనున్నాను, నేనున్నాను' నన్నే పొందాలి'– అంటూ తన శరీరం వైపు ఆసక్తుడై పోతాడు. అతను తడబడటానికి అవకాశం అధికం. కాబట్టి అర్జునా! నువ్వు సంపూర్ణ కర్మలను నాకే సమర్పించు, అనన్య భక్తితో నా చింతన చెయ్యి. ఎవ్వరైతే నా పరయణులయి (నా యందే మనస్సుంచి) సంపూర్ణ కర్మలను నాకే అర్పణ చేసి, మానవ శరీరధారుడనయిన నా సగుణ యోగి రూపాన్ని, ధ్యానం ద్వారా నిరంతరం చింతన చేస్తాడో, అతణ్ణి నేను శీఘ్రంగానే సంసార సాగరం నుంచి ఉద్ధరించే వాడినవుతాను. కాబట్టి భక్తి మార్గం శ్రేష్ఠమయింది.

అర్జునా! నాలో మనస్సును ఉంచు. మనస్సును ఉంచలేక పోతే దానికై అభ్యాసం చెయ్యి. ఎక్కడికైనా సరే చిత్తం వెళితే, కూడగట్టుకొని దానిని నిరోధించు. ఇది కూడా చేయడంలో అసమర్థుడవైతే నువ్వు కర్మ చెయ్యి. కర్మ ఒక్కటే, యజ్ఞార్థ కర్మ. నువ్వు 'కార్యం కర్మ'ను చేస్తూ ఉండు, ఇంకేమీ చెయ్యకు. తరించగలిగితే సరి, లేకపోయినా ఫరవాలేదు. ఇది కూడా చెయ్యడంలో అసమర్థుడవయితే స్థితప్రజ్ఞుడయిన, తత్త్వజ్ఞుడయిన ఆత్మవంతుడయిన మహాపురుషుని శరణుపొంది, సంపూర్ణ కర్మలఫలాన్ని త్యాగం చెయ్యి. అలాత్యాగం చేయడం వలన నువ్వు పరమ శాంతిని పొందుతావు.

దాని తరువాత పరమశాంతిని పొందిన భక్తుని లక్షణాలను గురించి చెబుతూ యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు అన్నాడు– ఎవ్వరైతే సంపూర్ణ భూతాల పట్ల ద్వేష భావంచే రహితుడో, కరుణచే యుక్తుడో, మరియు దయాళువో, మమత మరియు అహంకారాలచే రహితుడో, ఆ భక్తుడు నాకు ప్రియమైన వాడు. ఎవ్వరైతే ధ్యాన యోగంలో నిరంతరం తత్పరుడో మరియు ఆత్మవంతుడో, ఆత్మ స్థితుడయిన వాడో, ఆ భక్తుడు నాకు ప్రియమైనవాడు. ఎవ్వరైతే యితరులకు ఉద్వేగాన్ని కలిగించడో మరియు స్వయంగా కూడా

ఇతరులచే ఉద్వేగాన్ని పొందడో, అలాంటి భక్తుడు నాకు ప్రియమైన వాడు. ఎవరైతే శుద్ధుడో, దక్షుడో, వ్యథల నుంచి విశ్రామం పొందినవాడో, సర్వారంభాలను త్యాగం చేసి, తరించి పోయాడో, అలాంటి భక్తుడు నాకు ప్రియమైనవాడు. సంపూర్ణ కోరికలను త్యాగం చేసినవాడు మరి శుభాశుభాలను తరించివేయగలిగిన భక్తుడు నాకు ప్రియమైన వాడు. ఎవరైతే నిందాస్తుతులను సమానంగా భావించి మౌనంగా ఉంటాడో, మనస్సు సహితంగా ఎవరి ఇంద్రియాలు శాంతంగా మరియు మౌనంగా ఉన్నాయో, ఎవరైతే ఎలాంటి శరీర నిర్వాహణలోనైనా సంతుష్టుడో మరియు ఉండే స్థానం పట్ల మమకారరహితుడో, శరీర రక్షణలో కూడా ఎవరికైతే ఆసక్తి లేదో, అలాంటి స్థితప్రజ్ఞుడైన భక్తి యుక్తుడైన పురుషుడు నాకు ప్రియమైన వాడు.

ఈ ప్రకారంగా శ్లోకం పదకొండు నుంచి పందొమ్మిది వరకూ యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు శాంతి పొందిన, యోగయుక్తుడైన భక్తుడు ఉండే తీరును వివరించాడు. అది సాధకులకు ఉపదేశం. చివరిలో నిర్ణయం ఇస్తూ, అతను ఇలా అన్నాడు– ''అర్జునా! ఎవరైతే నా పరాయణుడై నామీద మనసు ఉంచి అనన్య శ్రద్ధతో యుక్తుడైన పురుషుడు ఈ పైన చెప్పిన ధర్మమయమైన అమృతాన్ని నిష్కామ భావంతో చక్కగా ఆచరిస్తాడో, ఆ భక్తుడు నాకు అతిశయంగా ప్రియమైన వాడు. కాబట్టి సమర్పణ భావంతోబాటు ఈ కర్మలో ప్రవృత్తుడవడం శ్రేయస్కరమయింది. ఎందుకంటే అతని లాభ నష్టాల భాధ్యత ఆ ఇష్ట దైవం, సద్గురువు స్వయంగా వహిస్తారు. ఇక్కడ శ్రీకృష్ణుడు స్వరూపస్థ మహాపురుషుని లక్షణాలు చెప్పాడు. అతని శరణులోకి వెళ్లమని అన్నాడు మరియు అంతంలో తన్ను శరణు పొందమని ప్రేరణ ఇస్తూ, తను కూడా ఆ మహాపురుషులతో సమానుణ్ణని ఉద్ఘోషించాడు. శ్రీకృష్ణుడు ఒక యోగీ మహాత్ముడు.

ఈ అధ్యాయంలో భక్తి యొక్క శ్రేష్ఠతను గూర్చి చెప్పడమయింది. కాబట్టి ఈ అధ్యాయం యొక్క నామకరణం ''భక్తి యోగం' యుక్తి సంగతమయింది.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే 'భక్తి యొగో' నామ ద్వాదశోఽధ్యాయః ॥ **12**॥

ఈ ప్రకారంగా శ్రీమద్భగవద్గీతా రూపమయిన ఉపనిషత్తు మరియు బ్రహ్మవిద్యా మరియు యోగశాస్త్ర విషయంలో శ్రీకృషుడు మరియు అర్జునుడి సంవాదంలో 'భక్తి యోగం ' అనే పేరుగల పన్నెండవ అధ్యాయం పూర్తయింది.

ఇతి శ్రీమత్పరమహంస పరమానందస్య శిష్యః స్వామీ అడగడానంద కృతే శ్రీమద్ భగవద్ గీతా యాః 'యథార్థ గీతా' భాష్యే 'భక్తి యోగో ' నామ ద్వాదశోఽధ్యాయః॥ **12**॥

ఈ ప్రకారంగా శ్రీమత్పరమహంస పరమానందగారి శిష్యుడు స్వామి అడగడానందవారిచే రచించబడిన శ్రీమద్భగవద్ గీతా యొక్క భాష్యం ''యథార్థగీతా''లో భక్తి యోగం అనే పన్నెండవ అధ్యాయం పూర్తయింది.

॥హరి ఓం తత్సత్॥

ఓం

శ్రీ పరమాత్మనే నమః

# త్రయోదశ అధ్యాయము

గీత ప్రారంభంలోనే ధృతరాష్ట్రుడు ఇలా ప్రశ్నించాడు– సంజయా! యుద్ధం చేసే కోరికతో ధర్మక్షేత్రంలో కురుక్షేత్రంలో చేరిన నా యొక్క మరియు పాండుని యొక్క పుత్రులు ఏం చేసారు? ఇప్పటి వరకూ యీ క్షేత్రం ఎక్కడ ఉందన్నది చెప్పలేదు. కానీ ఏ మహాపురుషుడైతే, ఏ క్షేత్రంలో యుద్ధం గురించి చెప్పాడో, అతనే స్వయంగా ఆ క్షేత్రం గురించి ప్రస్తుత అధ్యాయంలో నిర్ణయం చేస్తున్నాడు– ఆ క్షేత్రం వాస్తవానికి ఎక్కడ ఉంది?

శ్రీ భగవానువాచ–

శ్లో ॥ ఇదం శరీరం కౌంతేయ క్షేత్రమిత్యభిధీయతే ।
ఏతద్యోవేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ॥**1**॥

కౌంతేయా! ఈ శరీరమే ఒక క్షేత్రం మరియు దీనిని ఎవరైతే చక్కగా తెలుసుకుంటారో, అతనే క్షేత్రజ్ఞుడు. అతను ఇందులో చిక్కుకు పోలేదుగానీ, అతనే దీని సంచాలకుడు. ఈ తత్వాన్ని విదితం చేసుకొన్న మహాపురుషులు అలా అన్నారు.

శరీరం ఒక్కటే గదా! అందులో ధర్మ క్షేత్రం మరియు కురుక్షేత్రం– యీరెండు క్షేత్రాలు ఎలా ఉన్నాయి? వాస్తవానికి ఈ ఒక్క శరీరం లోపలనే అంతఃకరణం యొక్క రెండు ప్రవృత్తులూ పురాతనమయినవి. ఒకటేమో పరమధర్మ– పరమాత్మునిలో ప్రవేశం ఇప్పించే పుణ్యమయీ ప్రవృత్తి దైవీ సంపద. మరి రెండోది– ఆసురీ సంపద, దూషితమయిన దృష్టికోణం వలన సంఘటిత మయ్యాయి, అవి నశ్వర ప్రపంచం పట్ల విశ్వాసాన్ని కలిగిస్తాయి. ఎప్పుడైతే ఆసురీ సంపద బహుళమయి పోతుందో, అప్పుడు ఈ శరీరమే 'కురుక్షేత్రం' అయి పోతుంది. మరియు ఈ శరీరం యొక్క అంతరాళంలో ఎప్పుడైతే దైవీ సంపద బహుళమయిపోతుందో, అప్పుడు ఈ శరీరమే 'ధర్మక్షేత్రం' అనబడుతుంది. ఈ పెరగడం–తరగడం అనేది మామూలుగా అన్ని వేళలా ఉంటుంది. కానీ తత్త్వ దర్శకుడైన మహాపురుషుని

సాన్నిధ్యంలో, ఎవరైనా అనన్య భక్తి ద్వారా ఆరాధనలో ప్రవృత్త మవుతారో, అప్పుడు రెండు ప్రవృత్తుల మధ్య నిర్ణయాత్మకమైన యుద్ధానికి నాంది పలకబడతుంది. క్రమంగా దైవీ సంపద యొక్క ఉత్థానం మరియు ఆసురీ సంపద యొక్క శమనం జరుగుతాయి. ఆసురీ సంపద పూర్తిగా శమనం అయిన తరువాత, పరమం యొక్క దిగ్దర్శన దశ వస్తుంది. దర్శనంతో బాటుగా దైవీ సంపద యొక్క అవసరం కూడా తీరిపోతుంది. కాబట్టి అవి కూడా పరమాత్మునిలో స్వతహాగానే లీనమయి పోతాయి. భజన చేసే పురుషుడు పరమాత్మునిలో ప్రవేశం పొందుతాడు. పదకొండవ అధ్యాయంలో అర్జునుడు చూసిందేమిటంటే కౌరవ పక్షానికి చెందిన యోధుల తరువాత పాండవ పక్షపు యోధులు కూడా యోగేశ్వరునిలో విలీనమవుతూ పోయారు. ఈ విలయం తరువాత పురుషుని యొక్క ఏ స్వరూపమైతే ఉంటుందో, అదే క్షేత్రజ్ఞుడు. ముందు చూద్దాం–

శ్లో // క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత ।
క్షేత్రక్షేత్రజ్ఞ యోర్జ్ఞానం యత్తత్ జ్ఞానం మతం మమ ॥**2**॥

హే అర్జునా! నువ్వు క్షేత్రాలన్నింటిలో క్షేత్రజ్ఞుణ్ణి నేనే అని తెలుసుకో అంటే నేను కూడా క్షేత్రజ్ఞుణ్ణే, 'ఎవరైతే ఈ క్షేత్రాన్ని తెలుసుకుంటాడో, అతనే క్షేత్రజ్ఞుడు' అని సాక్షాత్తు తెలుసుకొన్న మహాపురుషులు అంటారు. శ్రీకృష్ణుడు అంటాడు– నేను కూడా క్షేత్రజ్ఞుణ్ణే అంటే శ్రీకృష్ణుడు కూడా ఒక యోగేశ్వరుడే– క్షేత్రం మరియు క్షేత్రజ్ఞుడు అనగా వికారాల సహితంగా ప్రకృతి మరియు పురుషులను తత్వంతో సహా తెలుసుకోవడమే జ్ఞానం. అలా అని నా అభిప్రాయం. అంటే సాక్షాత్కార సహితంగా వీటిని తెలుసుకోవడం అనే దాని పేరే జ్ఞానం. కేవలం వివాదాల పేరు జ్ఞానం కాదు.

శ్లో // తత్ క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చయత్ ।
సచయో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు ॥**3**॥

ఆ క్షేత్ర మెలాగుంటుంది మరి ఏ ఏ వికారాలు గలది? మరియు ఏఏ కారణాల వలన రూపొందినది, మరి ఆ క్షేత్రజ్ఞుడు కూడా ఎవరు, ఎలాంటి ప్రభావం గలవాడు? ఈ అన్నింటిని గురించి క్లుప్తంగా విను. క్షేత్రం వికారాలతో కూడినది, ఏవో కారణాల వలన రూపొందినది, కానీ క్షేత్రజ్ఞుడు ప్రభావం కలవాడు. నేనే చెబుతున్నానని కాదు. ఋషులు కూడా అలాగే అంటారు–

శ్లో // ఋషి భిర్బహుధా గీతం ఛందోభిర్వివిధైః పృథక్ ।
బ్రహ్మ సూత్ర పదైశ్చైవహేతుమద్భిర్వినిశ్చితైః ॥**4**॥

ఈ క్షేత్రం మరియు క్షేత్రజ్ఞుల తత్త్వం ఋషుల ద్వారా చాలా రకాలుగా చెప్పబడింది. నానా రకాలుగా వేదాల సలహా ద్వారా విభజించి కూడా చెప్పడమయింది. విశేషంగా నిశ్చితమైన యుక్తి యుక్త బ్రహ్మ సూత్రాల వాక్యాల ద్వారా కూడాచెప్పబడింది. అంటే వేదాంతం, ఋషులు, బ్రహ్మసూత్రాలు మరియు నేను, ఒకటే మాట చెప్పబోతున్నాము. ఏదైతే వీరందరూ చెప్పారో

శ్రీకృష్ణుడు అదే చెప్పాడు. ఎంతైతే కనిపిస్తుందో ఈ శరీరం (క్షేత్రం) అంతేనా? దీనిని గూర్చి ఇలా అంటాడు.

శ్లో ॥ మహాభూతాన్య హంకారో బుద్ధిరవ్యక్తమేవ చ ।
ఇంద్రియాణి దశైకం చ పంచచేన్ద్రియ గోచరాః ॥5॥

అర్జునా! పంచ మహాభూతాలు (పృథ్వి, జలం, అగ్ని, ఆకాశం, వాయువు), అహకారం, బుద్ధి మరియు చిత్తం, (చిత్తం పేరు చెప్పకుండా దానినే అవ్యక్త పరాప్రకృతి అనడం జరిగింది. అంటే పరాప్రకృతి కూడా సమ్మిళితమయి ఉన్న మూల ప్రకృతి స్పష్టం చేయబడింది. పైన చెప్పబడినవి ఎనిమిదీ అష్టధామూల ప్రకృతి), పదిఇంద్రియాలు (కళ్ళు, చెవులు, ముక్కు, చర్మం, జిహ్వా, రసనా, చేతులు, కాళ్ళు, ఉపస్థ మరియు గుద), మనస్సు మరియు ఐదు ఇంద్రియ విషయాలు (రూపు, రుచి, వాసన, శబ్దం మరియు స్పర్శ) మరియు–

శ్లో ॥ ఇచ్ఛా ద్వేషః సుఖం దుఃఖం సంఘాతశ్చేతనా ధృతిః ।
ఏతత్ క్షేత్రం సమాసేన సవికారముదాహృతం ॥6॥

కోరిక, ద్వేషం, సుఖదుఃఖాలు మరియు వీటన్నింటి సమూహం, స్థూలదేహం యొక్క ఈ పిండం, చైతన్యం మరియు ధైర్యం, ఈ ప్రకారంగా ఈ క్షేత్రం గురించి వికారాల సహితంగా చెప్పడమయింది. క్లుప్తంగా యిదే క్షేత్రం యొక్క స్వరూపం, దీనిలో నాటబడిన మంచి మరియు చెడు బీజాలు సంస్కారాల రూపంతో మొలకెత్తుతాయి. శరీరమే క్షేత్రం. శరీరం సున్నం–మట్టి ఏవస్తువులతో చేయబడ్డది? అంటే అవే పంచ తత్త్వాలు, పది యింద్రియాలు, ఒక మనస్సు మొదలగు వాటి సామూహిక సమ్మిళిత పిండమే శరీరం అని అన్నాడు. ఎప్పటి వరకు ఈ వికారాలు ఉంటాయో, అప్పటి వరకూ యీ పిండం కూడా ఉంటుంది. ఎందుకంటే ఇది వికారాలతో చేయబడింది. ఇప్పుడు ఆ క్షేత్రజ్ఞుడి స్వరూపాన్ని చూద్దాం, ఎవరైతే యీ క్షేత్రంచే బంధించబడలేదో, కానీ నివృత్తుడై ఉన్నాడో, అతను క్షేత్రజ్ఞుడు.

శ్లో ॥ అమానిత్వమదంభిత్వ మహింసా క్షాంతిరార్జవం ।
అచార్యోపాసనం శౌచం స్థైర్యమాత్మ వినిగ్రహః ॥7॥

హే అర్జునా! మానాపమానాలు లేకపోవడం, దంభాచారం లేకపోవడం, అహింసా (అంటే తన మరియు ఇతరుల ఆత్మకు కష్టం కలిగించక పోవడమే అహింస, చీమను చంపకు అనేదే అహింసకు అర్థం కాదు. శ్రీకృష్ణుడన్నాడు– నీ ఆత్మను అదోగతిలో పడేయ్యకు. దానిని అధోగతిలో పడేయ్యడమే హింస మరియు దాని ఉత్థానమే అసలైన అహింస. అలాంటి పురుషుడు ఇతర ఆత్మల ఉత్థానానికి కూడా ఉన్ముఖుడై ఉంటాడు. ఇది ఎవరికీ కష్టం కలగించక పోవడంతో ఆరంభమవుతుంది. ఇది దాని యొక్క ఒక అంశం మాత్రమే.) కాబట్టి అహింసా, క్షమాభావం, మనస్సు–వాక్కులలో సారళ్యం, ఆచార్యోపాసన అంటే శ్రద్ధా భక్తులతో సద్గురువు సేవ మరియు ఉపాసన, పవిత్రత, అంతః కరణ స్థిరత్వం, మనస్సు మరియు ఇంద్రియాల సహితంగా శరీరం యొక్క నిగ్రహం మరియు–

శ్లో ॥ ఇంద్రియార్థేషు వైరాగ్యమనహంకార ఏవ చ।
జన్మ మృత్యు జరావ్యాధి- దుఃఖ దోషాను దర్శనమ్ ॥8॥

ఈలోకం మరియు పరలోకాలలో చూసిన, వినిన భోగాలలో ఆసక్తి లేకపోవడం, ఆహంకారం లేకపోవడం, జన్మ-మృత్యువు వృద్ధావస్థలు, రోగాలు మరియు భోగాదుల దుఃఖ దోషాలనుగురించి మళ్ళీ మళ్ళీ ఆలోచించడం-

శ్లో ॥ అసక్తిరన భిష్వంగః పుత్రధార గృహాదిషు ।
నిత్యం చ సమచిత్తత్వమిష్టా నిష్టోపపత్తిషు ॥9॥

పుత్రులు, స్త్రీలు, ధనం మరియు గృహాదుల పట్ల ఆసక్తి లేకపోవడం, ప్రియమైన మరియు అప్రియమైనవి ప్రాప్తించినప్పుడు, చిత్తం ఎప్పుడూ సమభావంతో ఉండటం.

శ్లో ॥ మయి చానన్యయోగేన భక్తి రవ్యభిచారిణీ ।
వివిక్త దేశసేవిత్వమరతిర్జన సంసది ॥ 10॥

నా పట్ల (శ్రీ కృష్ణుడు ఒకయోగి అంటే అలాంటి ఎవరో ఒక మహాపురుషుని పట్ల) అనన్య యోగంచే అంటే యోగం తప్ప ఇక దేన్నీ స్మరించకుండా, అవ్యభిచారిణీ భక్తితో (ఇష్టదైవాన్ని తప్ప యింకదేన్నీ గురించీ చింతించ కుండ), ఏకాంత స్థానంలో ఉంటూ, మనుష్యుల మధ్య ఉండేటందుకు ఆసక్తి లేకుండా మరియు-

శ్లో ॥ అధ్యాత్మజ్ఞాన నిత్యత్వం తత్వజ్ఞానార్థ దర్శనం ।
ఏతద్ జ్ఞానమితి ప్రోక్తమజ్ఞానం యదతోఽన్యథా ॥ 11॥

ఆత్మ యొక్క ఆధిపత్యంగల జ్ఞానంతో ఏకరసంగా (ఒకే విధంగా) స్థితుడవడం మరియు తత్త్వజ్ఞానానికి అర్థస్వరూపమైన పరమాత్ముని యొక్క సాక్షాత్కారం- యివన్నీ జ్ఞానం. మరి దీనికి విరుద్ధంగా ఉన్నవన్నీ అజ్ఞానం- అలా చెప్పబడింది. ఆ పరమతత్త్వుడైన పరమాత్ముని సాక్షాత్కారంతో బాటు లభించే తెలివి తేటల యొక్క పేరే జ్ఞానం. (నాలుగో అధ్యాయంలో అతను ఇలా అన్నాడు- యజ్ఞం పూర్తయ్యేటప్పుడు, యజ్ఞం దేన్నైతే మిగుల్చుతుందో, ఆ జ్ఞానామృతాన్ని త్రాగేవారు సనాతన బ్రహ్మలో ప్రవేశం పొందుతారు. కాబట్టి బ్రహ్మ యొక్క సాక్షాత్కారంతోబాటు దొరికే తెలివితేటలే జ్ఞానం. ఇక్కడ కూడా అదే అంటాడు- తత్త్వ స్వరూపుడైన పరమాత్ముని సాక్షాత్కారం యొక్క పేరే జ్ఞానం.) దీనికి విరుద్ధమైనవన్నీ అజ్ఞానమే. అమానిత్వము మొదలుగాగల పైన చెప్పబడిన లక్షణాలు ఈ జ్ఞానానికి పూరకాలు. ఈ ప్రశ్న పూర్తయింది.

శ్లో ॥ జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వాఽమృతమశ్నుతే ।
అనాది మత్పరం బ్రహ్మ న సత్త న్నా సదుచ్యతే ॥ 12॥

అర్జునా! ఏదైతే తెలుసుకోనుటకు యోగ్యమైనదో మరియు దేనినైతే తెలుసుకొని మర్త్యుడైన మనుష్యుడు అమృతత్త్వాన్ని పొందుతాడో, దానిని గురించి బాగుగా చెప్తాను.

ఆదిరహితుడైన ఆ పరం బ్రహ్మ సత్యమనబడడు మరి అసత్యమనబడడు, ఎందుకంటే ఎప్పటి వరకూ అతను వేరుగా ఉంటాడో, అప్పటి వరకూ సత్యం మరియు ఎప్పుడైతే మనుష్యుడు అతనిలో సమాహితమయి పోతాడో, అప్పుడు ఎవరు ఎవరితో చెప్పాలి? ఒక్కడే ఉండి పోతాడు. రెండవ వాని స్ఫృహే ఉండదు. అలాంటి స్థితిలో ఆ బ్రహ్మ సత్యమూ కాదు, అసత్యమూ కాదు, కానీ ఏదైతే సహజమో అదే అతను.

శ్లో ॥ సర్వతః పాణిపాదం తత్సర్వతోఽక్షి శిరోముఖమ్ ।
సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి ॥ **13**॥

ఆ బ్రహ్మ అన్ని వైపులా చేతులు-కాళ్ళు గలవాడు, అన్నివైపులా నేత్రాలు- శిరస్సులు మరియు నోళ్ళు గలవాడు మరియు అన్ని వైపుల నుండీ వినగలిగేవాడు; ఎందుకంటే ఈ ప్రపంచంలోని అందరిలోనూ వ్యాప్తుడై స్థితుడై ఉన్నాడు.

శ్లో ॥ సర్వేంద్రియ గుణాభాసం సర్వేంద్రియ వివర్జితమ్ ।
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృచ ॥ **14**॥

అతను సమస్త ఇంద్రియాల విషయాలను తెలుసుకోగలవాడు, అయినా కూడా అన్ని ఇంద్రియాలచే రహితుడు. అతను ఆసక్తి రహితుడు, గుణాలకంటే అతీతుడయినప్పటికీ, అందరినీ ధరించేవాడు. మరియు పోషించేవాడు మరియు అన్ని గుణాలనూ అనుభవించేవాడు. అంటే ఒకటొకటిగా అన్ని గుణాలనూ తనలో లయం చేసుకుంటాడు. శ్రీకృష్ణుడు చెబుతూవచ్చాడు- యజ్ఞాలను మరియు తపస్సులను అనుభవించేవాడిని నేనే, అలా, చివరిలో సమస్త గుణాలు నాలో విలయమయి పోతాయి-

శ్లో ॥ బహిరంతశ్చ భూతానామచరం చరమే వ చ ।
సూక్ష్మత్వాత్త దవిజ్ఞేయం దూరస్థం చాంతికే చ తత్ ॥ **15**॥

ఆ బ్రహ్మ జీవధారులందరిలోను బయట, లోపల పరిపూర్ణుడయి ఉన్నాడు. చరాచర రూపం కూడా అతనే. సూక్ష్మమవడంచే అతను కనిపించడు. అవిజ్ఞేయుడు, మనస్సు మరియు ఇంద్రియాల కంటే అతీతుడు మరియు అతి సమీపంగాను మరియు అతి దూరంగాను అతనే ఉన్నాడు.

శ్లో ॥ అవిభక్తం చ భూతేషు విభక్తమివ చ స్థితం ।
భూతభర్తృ చ తద్ జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ ॥ **16**॥

అవిభాజ్యుడయి కూడా అతను సమస్త భూతాలలో వేరు వేరుగా ఉన్నట్లు ప్రతీతమవుతాడు. తెలుసుకోయోగ్యమైన ఆ పరమాత్ముడు సమస్త భూతాలను ఉత్పన్నం చేసేవాడు, భరణ-పోషణ చేయువాడు మరియు అంతంలో సంహారం చేసే వాడు. ఇక్కడ బయట మరియు లోపల రెండు బావాలవైపు సంకేతం చేయబడింది. ఎలాగంటే బయట జన్మం మరియు లోపల జాగృతి, బయట పాలన మరియు లోపల యోగక్షేమం యొక్క నిర్వాహణ,

బయట శరీరం యొక్క పరివర్తన మరియు లోపల సర్వస్వం యొక్క విలయం అంటే భూతాల ఉత్పత్తి యొక్క కారణాల లయం మరియు ఆ లయంతో బాటుగానే తన స్వరూపాన్ని పొందుతారు. ఇవన్నీ ఆ బ్రహ్మ యొక్క లక్షణాలే.

శ్లో ॥ జ్యోతిషామపి తజ్జ్యోతిస్తమసః పరముచ్యతే ।
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్ ॥ **17**॥

ఆ జ్ఞేయబ్రహ్మ జ్యోతులకు కూడా జ్యోతి, తమస్సు (అంధకారం)కు అతి అతీతమైన వాడనబడతాడు. అతను పూర్ణ జ్ఞానస్వరూపుడు, పూర్ణజ్ఞాని, తెలుసుకొనయోగ్యమైనవాడు మరియు జ్ఞానం ద్వారానే పొందగలిగిన వాడు. సాక్షాత్కారంతో బాటుగా దొరికే తెలివితేటల పేరే జ్ఞానం. అలాంటి జ్ఞానం ద్వారానే ఆ బ్రహ్మను చేరటము సంభవం అవుతుంది. అతను అందరి హృదయాలలోనూ స్థితుడై ఉన్నాడు, అతని నివాస స్థానం హృదయం. అన్యత్ర వెతికితే అతను దొరకడు. కాబట్టి హృదయంలో ధ్యానం మరియు యోగాచరణ ద్వారానే ఆ బ్రహ్మను చేరగలుగు విధానం కలదు.

శ్లో ॥ ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః ।
మద్భక్త ఏతద్విజ్ఞాయ మద్భావాయోప పద్యతే ॥ **18**॥

హేఅర్జునా! క్షేత్రం, జ్ఞానం మరియు తెలుసుకోదగిన పరమాత్ముని యొక్క స్వరూపం గురించి ఇంతే చెప్పబడింది. దీనిని తెలుసుకొని నా భక్తులు సాక్షాత్తుగా నా స్వరూపాన్నే పొందుతారు.

ఇప్పటి వరకూ యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు దేనినైతే క్షేత్రం అన్నాడో, దానినే ప్రకృతి అని మరియు ఎవరినైతే క్షేత్రజ్ఞుడు అన్నాడో, దానినే యిప్పుడు పురుషుడు అని అంటాడు–

శ్లో ॥ ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ వుభావపి ।
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతి సంభవాన్ ॥ **19**॥

ఈ ప్రకృతి మరియు పురుషుడు ఇద్దరూ అనాది అనే తెలుసుకో; మరియు సంపూర్ణ వికారాలు త్రిగుణాత్మకమైన ప్రకృతి నుంచే ఉత్పన్నమయినట్లుగా తెలుసుకో.

శ్లో ॥ కార్యకరణ కర్తృత్వే హేతుః ప్రకృతిరుచ్యతే ।
పురుషః సుఖ దుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే ॥**20**॥

కార్యము మరియు కరణము – (దేని ద్వారా నైతే కార్యం చేయబడుతుందో, వివేకం, వైరాగ్యం మొదలయినవి మరియు అశుభ కార్యం అయినప్పుడు కామం, క్రోధం మొదలయినవి కరణాలు) వీటిని ఉత్పన్నం చేయడంలో కారణం ప్రకృతి అనబడుతుంది. మరియు ఆ పురుషుడు సుఖ దుఃఖాలను అనుభవించడంలో కారణం అనబడతాడు. తలెత్తే ప్రశ్న ఏమిటంటే అతను అనుభవించుతూనే ఉంటాడా, లేక ఎప్పుడైనా విరామం పొందుతాడా?

అనేది. ప్రకృతి-పురుషుడు ఇద్దరూ అనాది అయినప్పుడు ఎవరైనా వీటినుంచి ఎలా తప్పించుకోగలరు? దీనిని గూర్చి అంటాడు-

శ్లో ॥ పురుషః ప్రకృతి స్థో హి భుంక్తే ప్రకృతి జాన్గుణాన్ ।
కారణం గుణ సంగోఽస్య సదసద్యో నిజన్మసు ॥21॥

ప్రకృతి మధ్యలో నిలబడిన పురుషుడే ప్రకృతి నుంచి ఉత్పన్నమయిన గుణాలయొక్క కార్యరూపాలైన పదార్థాలను అనుభవించుతాడు. ఈ గుణాలతో సాంగత్యమే ఈ జీవాత్మ మంచి, లేక చెడు జన్మలెత్తడానికి కారణం అవుతుంది. ఈ కారణం అంటే ప్రకృతి యొక్క గుణాలతో సాంగత్యం అనేది సమాప్తమయినప్పుడే, జన్మ మృత్యువుల నుంచి ముక్తి లభిస్తుంది. ఇప్పుడు ఆ పురుషుని గూర్చి, నొక్కి చెప్తాడు. అతను ఏ రకంగా ప్రకృతిలో నిలబడ్డాడు?

శ్లో ॥ ఉపద్రష్టానుమంతా చ భర్తా భోక్తా మహేశ్వరః ।
పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః ॥22॥

ఆ పురుషుడు ఉపద్రష్ట హృదయ దేశానికి అతి సమీపంగా, చేతులు-కాళ్ళు-మనస్సు మీకు ఎంత సమీపంగా ఉన్నాయో, అంతకన్నా కూడా అతి దగ్గరగా ద్రష్టవలె స్థితుడై ఉన్నాడు. అతని సమీపంలో మీరు మంచిచేసినా, చెడు చేసినా అతనికి వాటితో ఏ ప్రయోజనమూ ఉండదు. అతను సాక్షి రూపంతో ఉన్నాడు. సాధన యొక్క సరైన క్రమం ఆచరణలోకి వచ్చినప్పుడు, సాధకుడు కొంచెం పైకి లేస్తే, అతని వైపు నడిస్తే, అప్పుడు ద్రష్టగా ఉన్న పురుషుని క్రమం మారి పోతుంది. అతను 'అనుమంతా' అనుమతి ఇవ్వడం మొదలు పెడతాడు, అనుభవం ఇవ్వడం మొదలు పెడతాడు. సాధన ద్వారా ఇంకా సమీపంగా చేరినప్పుడు, అదే పురుషుడు 'భర్త' అయి భరణ పోషణ చేయ మొదలు పెడతాడు, దానిలో మీ యోగక్షేమం వ్యవస్థ కూడా చేస్తాడు. సాధన యింకా సూక్ష్మం అయిపోయినప్పుడు అతనే 'భోక్తా' అయిపోతాడు. 'భోక్తారం యజ్ఞ తపసాం'- యజ్ఞం, తపస్సు, ఏదైనా చేయగలిగితే, వాటన్నింటినీ ఆ పురుషుడు గ్రహించుతాడు, మరియు ఎప్పుడైతే గ్రహించుతాడో, ఆ తరువాతి దశలో 'మహేశ్వరః'- మహా ఈశ్వరునిగా పరిణతి చెందుతాడు. అతను ప్రకృతికి యజమాని అయిపోతాడు, కానీ యిప్పుడింకా ప్రకృతి జీవించే ఉంది, అప్పుడే గదా దానికి యజమాని ఉంటాడు. దీనికంటే కూడా ఉన్నతమైన దశలో అదే పురుషుడు 'పరమాత్మేతి చాప్యుక్తో' ఎప్పుడైతే పరమాత్మునితో సంయుక్తుడయి పోతాడో, అప్పుడు పరమాత్ముడనబడతాడు. ఈ ప్రకారంగా శరీరంలో ఉంటూ కూడా, ఆ పురుషుడు అంటే ఆత్మ 'పరః యే గదా, సర్వదా యీ ప్రకృతి కంటే అతీతమే గదా. తేడా ఏమిటంటే మొదట్లో అది ద్రష్టగా ఉండేది, క్రమంగా ఉన్నతమవుతూ- అవుతూ, 'పరమం'ని స్పృశించి పరమాత్మునిగా పరిణతి చెందుతుంది.

శ్లో ॥ య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైః స్సహ ।
సర్వథా వర్తమానోఽపి నస భూయోఽభిజాయతే ॥23॥

ఈ ప్రకరాంగా పురుషుడిని మరియు గుణాల సహితంగా ప్రకృతిని ఏ మనుష్యుడయితే సాక్షాత్కారంతోసహా విదితం చేసుకొంటాడో, అతను అన్ని రకాలుగా వ్యవహరిస్తూ కూడా

మళ్ళీ జన్మించడు, అంటే అతనికి పునర్జన్మ లేదు. ఇదే ముక్తి. ఇప్పటి వరకూ యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు బ్రహ్మ మరియు ప్రకృతి యొక్క ప్రత్యక్ష జ్ఞానంతో బాటు దొరికే పరమగతిని అనగా అతను పునర్జన్మ నుంచి నివృత్తి పొందడాన్ని గూర్చి వివరించాడు. మరియు ఇప్పుడు అతను ఆ యోగాన్ని, దేని ప్రక్రియ ఆరాధనో, దానిని సమర్థిస్తాడు. ఎందుకంటే ఈ కర్మకు కార్యరూపం ఇవ్వకుండా ఎవరూ పొందలేరు–

శ్లో ॥ ధ్యానేనాత్మని పశ్యంతి కేచి దాత్మాన మాత్మనా ।
అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే ॥**24**॥

హే అర్జునా! ఆ 'ఆత్మానం'– పరమాత్మున్ని ఎంత మంది మనుష్యులో 'ఆత్మనా' తమ (ఆత్మ) చింతనచే, ధ్యానం ద్వారా ''ఆత్మని'– హృదయ దేశంలో చూస్తారు. ఎంతోమంది సాంఖ్య యోగం ద్వారా (అంటే తమ శక్తిని అర్థం చేసుకొంటూ అదే కర్మలో ప్రవృత్తులవుతారు) మరియు చాలా మంది అతణ్ణి నిష్కామ కర్మ యోగం ద్వారా చూస్తారు. సమర్పణ భావంతో బాటు అదే నియత కర్మలో ప్రవృత్తులవుతారు. ప్రస్తుత శ్లోకంలో ముఖ్యసాధన ధ్యానమని చెప్పబడింది. ఆ ధ్యానంలో ప్రవృత్తమవడానికి సాంఖ్య యోగం మరియు నిష్కామ కర్మ యోగం అనే రెండు దారులు ఉన్నాయి.

శ్లో ॥ అన్యే త్వేవమజానంతః శ్రుత్వాऽన్యేభ్య వుపాసతే ।
తేऽపి చాతితరంత్యేవ మృత్యుం శ్రుతి పరాయణాః ॥**25**॥

కానీ ఇతరులు, సాధన యొక్క జ్ఞానం లేనివారు ఈ ప్రకారంగా తెలుసుకోకుండా, 'అన్యేభ్యః– ఇతరుల వలన, తత్త్వం గురించి తెలిసిన మహాపురుషుని ద్వారా వినే ఉపాసన చేస్తారు. మరియు ఆ వినడం వలన భగత్పరాయణులయిన పురుషుడు కూడా మృత్యురూపమైన సంసార సాగరాన్ని నిస్సందేహంగా తరించి పోతాడు. కాబట్టి ఏమీ చేతగానప్పుడు సత్సంగం చేయండి.

శ్లో ॥ యావత్సం జాయతే కించిత్సత్త్వం స్థావరజంగమమ్ ।
క్షేత్ర క్షేత్రజ్ఞ సంయోగాత్త ద్విద్ధి భరతర్షభ ॥**26**॥

హే అర్జునా! స్థావర–జంగమ వస్తువులతో కూడి ఉత్పన్నమయిన సంపూర్ణ జగత్తును నువ్వు క్షేత్రం మరియు క్షేత్రజ్ఞ సంయోగంచే ఉత్పన్నమయినదిగా తెలుసుకో. ముక్తి ఎప్పుడు లభిస్తుంది? దీనిని గూర్చి అంటాడు–

శ్లో ॥ సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరమ్ ।
వినశ్యత్స్వ వినశ్యంతం యః పశ్యతి స పశ్యతి ॥**27**॥

ఏ పురుషుడైతే నష్టమయ్యే చరాచర భూతాలన్నింటిలో నాశరహితుడైన పరమేశ్వరుణ్ణి సమభావంతో స్థితుడైనట్లుగా చూస్తాడో, అతనే యథార్థాన్ని చూస్తాడు. అంటే ఆ ప్రకృతి నష్టమయినప్పుడే, ఆ పరమాత్మ స్వరూపం ఉంది. ఇంతకు ముందు కాదు. అని తెలుసుకుంటాడు. ఇంతకు ముందు ఎనిమిదో అధ్యాయంలో ఇలా అన్నాడు– 'భూత భావోద్భవకరో విసర్గః కర్మ సంజ్ఞితః' మంచి, లేక చెడు ఏవో సంస్కారాలను సృష్టించే భావాల

నాశనమే కర్మ యొక్క పరాకాష్ఠ. కర్మ పూర్తయినట్లే. ఇక్కడ కూడా అదే అంటాడు– ఎవరైతే చరాచర భూతాలు వినష్టమవుతూండగా మరియు పరమేశ్వరుణ్ణి సమభావంతో స్థితుడైనట్లుగా చూస్తాడో, అతనే యథార్థాన్ని చూస్తాడు.

శ్లో ॥ సమం పశ్యన్హి సర్వత్ర సమవస్థితమీశ్వరం ।
నహినస్త్యాత్మనాత్మానం తతో యాతి పరాం గతిం ॥**28**॥

ఎందుకంటే అ పురుషుడు సర్వత్రా సమభావంతో స్థితుడయిన పరమేశ్వరుణ్ణి సమానంగా (ఎలా ఉన్నాడో, అలాగే సమానంగా) చూస్తూ, తన ద్వారా తనను వినష్ట పరచుకోడు. ఎందుకంటే ఎలా ఉండేదో అలాగే అతను చూశాడు, కాబట్టి. అతను పరమగతిని పొందుతాడు, ముక్తి పొందిన పురుషుని లక్షణాలు ఇప్పుడు చెబుతాడు.

శ్లో ॥ ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః।
యః పశ్యతి తథాऽऽత్మానమకర్తారం స పశ్యతి ॥**29**॥

ఏ పురుషుడైతే అన్ని కర్మలనూ, అన్ని విధాలుగా, ప్రకృతి చేతనే చేయబడుట, చూస్తాడో అంటే ప్రకృతి ఉన్నంతవరకే కర్మలు జరగడం చూస్తాడో, మరియు ఆత్మను అకర్తగా చూస్తాడో, అతనే యథార్థాన్ని చూస్తాడు.

శ్లో ॥ యదా భూత పృథగ్భావమే కస్థమను పశ్యతి ।
తత ఏవ చ విస్తారం బ్రహ్మ సంపద్యతే తదా ॥**30**॥

ఏకాలంలో మనుష్యుడు భూతాల వేరు వేరు భావాలలో ఒకే పరమాత్మ ప్రసరిస్తూ స్థితుడవడం చూస్తాడో, మరియు ఆ పరమాత్మ నుండే సంపూర్ణ భూతాల విస్తారాన్ని చూస్తాడో, అప్పుడు అతను బ్రహ్మను పొందుతాడు. ఏ క్షణంలో ఈ దశ వస్తుందో, అదే క్షణంలో అతను బ్రహ్మను పొందుతాడు. ఈ లక్షణం కూడా స్థితప్రజ్ఞుడైన మహాపురుషునిదే.

శ్లో ॥ అనాదిత్వాన్నిర్గుణత్వాత్పరమాత్మాయమవ్యయః ।
శరీరస్థోఽపి కౌంతేయ న కరోతి న లిప్యతే ॥**31**॥

కౌంతేయ! అనాది అవడంచే మరియు గుణాతీత మవడంచే, ఆ అవినశ్వర పరమాత్ముడు శరీరంలో స్థితుడై ఉంటూ కూడా వాస్తవానికి ఏమీ చేయడు మరియు లిప్తుడు కాడు. ఏ ప్రకారంగా?

శ్లో ॥ యథా సర్వగతం సౌక్ష్మ్యాదాకాశం నోపలిప్యతే ।
సర్వత్రావస్థితో దేహే తథాऽऽత్మానో పలిప్యతే ॥**32**॥

ఏ రకంగానైతే సర్వత్రా వ్యాప్తమై ఉన్న ఆకాశం సూక్ష్మమయి ఉండడం చేత లిప్తంకాదో, సరిగ్గా అలాగే దేహంలో సర్వత్రా స్థితమై ఉంటూ కూడా, ఆత్మ గుణాతీతమైన కారణంగా దేహం యొక్క గుణాలచే లిప్తం కాదు. ఇంకా ఇలా అంటాడు–

శ్లో ॥ యథా ప్రకాశయత్యేకః కృత్స్నం లోకమిమం రవిః ।
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత ॥**33**॥

అర్జునా! ఒకే సూర్యుడు సమస్త ప్రపంచమునూ ప్రకాశింప చేయునట్లు క్షేత్రజ్ఞుడు క్షేత్రము నంతటినీ ప్రకాశింప జేయుచున్నాడు. అంతములో నిర్ణయము ఇస్తారు.

శ్లో ॥ క్షేత్రక్షేత్రజ్ఞ యోరేవ మంతరం జ్ఞాన చక్షుషా ।
భూత ప్రకృతి మోక్షం చ యే విదుర్యాంతితే పరం ॥**34**॥

ఈ ప్రకారంగా, క్షేత్రం మరియు క్షేత్రజ్ఞుల తేడాని మరియు వికార సహితమయిన ప్రకృతి నుండి ముక్తి పొందే ఉపాయాన్ని ఎవరైతే జ్ఞానమనే నేత్రం ద్వారా చూస్తారో, ఆ మహాత్ములు పరమబ్రహ్మ పరమాత్ముణ్ణి పొందుతారు. అంటే క్షేత్ర క్షేత్రజ్ఞులను చూసే కళ్ళు ''జ్ఞానం''. మరి జ్ఞానం సాక్షాత్కారానికి పర్యాయవాచకం.

సారాంశం:

గీత ఆరంభంలో ధర్మక్షేత్రం, కురుక్షేత్రం అనే పేర్లు చెప్పబడ్డాయి. కానీ ఆక్షేత్రం నిజానికి ఎక్కడ ఉంది? ఆ స్థలాన్ని చూపడం మిగిలి ఉంది, దానిని స్వయంగా శాస్త్రకారుడు ప్రస్తుత అధ్యాయంలో స్పష్టం చేసాడు- కౌంతేయా! ఈ శరీరమే ఒక క్షేత్రం. ఎవరైతే దీనిని తెలుసుకొంటాడో, అతను క్షేత్రజ్ఞుడు, అతను ఇందులో చిక్కుకోలేదు, నిర్లిప్తుడయి ఉన్నాడు. అతనే దీని సంచాలకుడు. అర్జునా! 'సంపూర్ణ క్షేత్రాలలో నేనూ క్షేత్రజ్ఞుడనే, అన్య మహాపురుషులతో తనను పోల్చుకున్నాడు. దీని వలన స్పష్టమయ్యే దేమిటంటే శ్రీకృష్ణుడు కూడా ఒక యోగి. ఎందుకంటే ఎవరైతే తెలుసుకొంటాడో, అతను క్షేత్రజ్ఞుడు, అలా అని మహాపురుషులు అన్నారు. నేను కూడా క్షేత్రజ్ఞుణ్ణే అంటే అన్య మహాపురుషులలాగే నేను కూడా.

క్షేత్రం ఎలా ఉంది, ఏ వికారాలతో ఉంది? క్షేత్రజ్ఞుడు ఎలాంటి ప్రభావం గలవాడు? అన్న వాటిని అతను వివరించాడు. నేనే అంటున్నానని కాదు, మహార్షులు కూడా ఇదే అన్నారు. వేద మంత్రాలలో కూడా దీనినే విభజించి చూపారు. బ్రహ్మ సూత్రాలలో కూడా ఇదే చెప్పబడింది.

శరీరం (ఏదైతే క్షేత్రమో) ఎంత కనిపిస్తోందో అంతేనా? ఈ శరీరం రూపొందటం వెనక ఎవరి ప్రమేయమైతే ఉందో, వాటిని లెక్కించుతూ చెప్పాడు- అష్టధా మూలప్రకృతి అవ్యక్త ప్రకృతి, పది ఇంద్రియాలు, మనస్సు, ఇంద్రియాల యొక్క అయిదు విషయాలు, ఆశ తృష్ణ, కోరికలు ఈ ప్రకారంగా ఈ వికారాల యొక్క సామూహిక మిశ్రమమే ఈ శరీరం. ఎప్పటి వరకు అవి ఉంటాయో, అప్పటి వరకూ ఏదో ఒక రూపంలో ఈ శరీరం ఉంటుంది. ఇదే క్షేత్రం. దీనిలో నాటిన మంచీ-చెడు బీజాలు సంస్కారాల రూపంలో మొలకెత్తుతాయి. ఎవరైతే దీనిని దాటి వేస్తాడో అతడే క్షేత్రజ్ఞుడు. క్షేత్రజ్ఞుని యొక్క స్వరూపాన్ని గురించి చెబుతూ అతను యాశ్వరీయ -గుణ -ధర్మాలను గురించి చెప్పాడు. క్షేత్రజ్ఞుడు ఈ క్షేత్రం యొక్క ప్రకాశకుడు అని చెప్పాడు.

అతను ఇలా అన్నాడు- సాధన పూర్తయ్యేకాలంలో పరమతత్త్వుడయిన పరమాత్ముని ప్రత్యక్ష దర్శనమే జ్ఞానం. జ్ఞానం అంటే అర్థం సాక్షాత్కారం. ఇది కాక

మిగిలినదంతా అజ్ఞానమే. తెలుసుకో యోగ్యమైన వస్తువు పరాత్పర బ్రహ్మ. అతను సత్యం కాదు, అసత్యం కూడా కాదు. ఈ రెండింటికీ పరమైనవాడు. అతణ్ణి తెలుసుకోవడానికి లోకులు బయట మూర్తిని స్థాపించడం కాకుండా హృదయంలో ధ్యానం చేస్తారు. చాలా మంది సాంఖ్య మాధ్యమంగా ధ్యానం చేస్తారు. మిగిలిన వారు నిష్కామ కర్మ యోగం, సమర్పణ భావంతో బాటుగా అతణ్ణి పొందుటకై అదే నిర్ధారితమైన కర్మ–ఆరాధన యొక్క ఆచరణ–చేస్తారు. ఎవరైతే ఆ విధిని గురించి జ్ఞానం ఆర్జించలేరో, వారు తత్త్వస్థితుడయిన మహాపురుషుని ద్వారా విని, ఆచరణ చేస్తారు. వారు కూడా పరమ కళ్యాణాన్ని పొందుతారు. కాబట్టి ఏమీ అర్థం కాకపోతే, జ్ఞాని అయిన మహాపురుషుని యొక్క సత్సంగం అవసరం అవుతుంది.

స్థితప్రజ్ఞుడయిన మహాపురుషుని లక్షణాల గురించి చెబుతూ యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు– ఎలాగైతే ఆకాశం సర్వత్రా సమంగా ఉంటూ కూడా నిర్లిప్తమై ఉంటుందో, ఎలాగైతే సూర్యుడు సర్వత్రా ప్రకాశాన్ని ఇస్తూ కూడా నిర్లిప్తంగా ఉంటాడో సరిగ్గా అదే ప్రకారంగా స్థిత ప్రజ్ఞుడయిన పురుషుడు, సర్వత్ర సమమైన ఈశ్వరుణ్ణి ఎలా ఉంటాడో అలాగే చూసే సామర్థ్యంగల పరుషుడు క్షేత్రం పట్లగానీ లేక ప్రకృతి పట్లగానీ నిర్లిప్తుడై ఉంటాడు. చివరిలో అతను నిర్ణయం ఇచ్చాడు– క్షేత్రం మరియు క్షేత్రజ్ఞుల గురించి తెలుసుకోవడం జ్ఞానమనెడి నేత్రాల ద్వారానే సాధ్యమవుతుంది. ఇంతకు ముందు చెప్పినట్లుగా, ఆ పరమాత్ముని యొక్క ప్రత్యక్ష దర్శనంతో లభించే తెలివి తేటలే జ్ఞానం. శాస్త్రాలను పిండికొట్టి వల్లెవేయడం జ్ఞానం కాదు. కానీ అధ్యయనం మరియు మహాపురుషులచే ఆ కర్మను అర్థం చేసుకొని, ఆ కర్మను ఆచరించి, మనస్సు సహితంగా ఇంద్రియాలను నిరోధించి మరియు ఆ నిరోదించినవి కూడా విలీనమయ్యే కాలంలో పరమతత్వాన్ని చూడటంతో ఏ అనుభవం అవుతుందో, ఆ అనుభవం యొక్క పేరే జ్ఞానం. క్రియ ఆవశ్యకమయింది. ఈ అధ్యాయంలో ముఖ్యంగా క్షేత్రజ్ఞుడి గురించి విస్తారంగా వర్ణించబడింది. నిజానికి క్షేత్రం యొక్క స్వరూపం వ్యాపకమయింది. శరీరం అనడం సరళమే, కానీ శరీరం యొక్క సంబంధం ఎంత వరకూ ఉంది? సమగ్ర బ్రహ్మాండం మూల ప్రకృతి యొక్క విస్తారమే. అనంత అంతరిక్షాల వరకు మీ యొక్క శరీరం విస్తరించి ఉంది. దాని వలన మీ జీవితం ఊర్జస్వితమై ఉంది, దాన్ని కాదని మీరు జీవించలేరు. ఈ భూమండలం, విశ్వం, జగత్తు, దేశ ప్రదేశాలు, కనిపించే శరీరాలన్నీ మూల ప్రకృతి యొక్క ఒక్క ముక్కపాటి కూడా కాదు. ఈ ప్రకారంగా క్షేత్రం గురించి ఈ అధ్యాయంలో విస్తారమయిన వర్ణన కలదు.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మావిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే 'క్షేత్రక్షేత్రజ్ఞ విభాగ యోగో' నామ త్రయోదశోఽధ్యాయః ॥ **13**॥

ఈ ప్రకారంగా శ్రీమద్భగవద్గీతా అనేడి ఉపనిషత్తు మరియు బ్రహ్మవిద్య మరియు

యోగశాస్త్ర విషయంలో శ్రీకృషుడు మరియు ఆర్జునుడి సంవాదంలో 'క్షేత్ర-క్షేత్రజ్ఞ విభాగయోగం ' అనే పేరుగల పదమూడవ అధ్యాయం పూర్తయింది.

ఇతి శ్రీమత్పరమహంస పరమానందస్య శిష్య స్వామీ అడగడానంద కృతే శ్రీమద్భగవద్గీతా యాః-- 'యథార్థ గీతా'భాష్యే 'క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగయోగో' నామ త్రయోదశోऽధ్యాయః।। **13**।।

ఈ ప్రకారంగా శ్రీమత్పరమహంస పరమానందగారి శిష్యుడు స్వామి అడగడానంద గారిచే రచించబడిన శ్రీమద్భగవద్గీత యొక్క భాష్యం 'యథార్థగీతా''లో ''క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగయోగమ్'' అనే పేరుగల పదమూడవ అధ్యాయం పూర్తయింది.

।।హరి ఓం తత్సత్।।

ॐ

శ్రీ పరమాత్మనే నమః

# చతుర్దశ అధ్యాయము

అనేక అధ్యాయాలలో యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు జ్ఞానం యొక్క స్వరూపాన్ని స్పష్టం చేసాడు. అధ్యాయం 4/19లో అతను ఇలా అన్నాడు– ఏ పురుషుని ద్వారా సంపూర్ణంగా ఆరంభం చేసిన నియత కర్మ యొక్క ఆచరణ, క్రమంగా వికసితమవుతూ ఎంత సూక్ష్మమయి పోతుందంటే కోరికలు మరియు సంకల్పాలు శాశ్వతంగా నశించిపోతాయి. ఆ సమయాన దేనినైతే అతను తెలుసుకోవాలనుకుంటున్నాడో, దాని ప్రత్యక్ష అనుభూతి కలుగుతుంది. ఆ అనుభూతి యొక్క పేరే జ్ఞానం. పదమూడో అధాయంలో శ్రీకృష్ణుడు జ్ఞానాన్ని నిర్వంచించాడు, 'అధ్యాత్మజ్ఞాన నిత్యత్వమ్,'తత్త్వజ్ఞానార్థ దర్శనం'– ఆత్మ జ్ఞానంలో ఒకే రకంగా స్థితుడయి మరియు తత్త్వం యొక్క అర్థ స్వరూపుడైన పరమాత్ముని యొక్క ప్రత్యక్ష దర్శనమే జ్ఞానం. క్షేత్ర–క్షేత్రజ్ఞుల తేడాను విదితం చేసుకోవడమే జ్ఞానం. జ్ఞానమంటే అర్థం శాస్త్రార్థం కాదు. శాస్త్రాలను గుర్తుంచు కోవడమే జ్ఞానం కాదు. ఎక్కడైతే ఆ తత్త్వం విదితమవుతుందో, అభ్యాసం యొక్క ఆ అవస్థ పేరే జ్ఞానం. పరమాత్ముని సాక్షాత్కారంతో బాటు లభించే అనుభూతి పేరే జ్ఞానం. దీనికి విరుద్ధమైనదంతా అజ్ఞానమే.

ఈ ప్రకారంగా అన్నీ చెప్పిన తరువాత కూడా ప్రస్తుత అధ్యాయంలో యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు ఇలా అంటాడు – అర్జునా ! ఈ జ్ఞానాలలో కూడా పరమ ఉత్తమమైన జ్ఞానాన్ని గురించి నేను నీకు మళ్ళీ చెబుతాను. యోగేశ్వరుడు దానిని మళ్ళీ చెప్పబోతున్నాడు, ఎందుకంటే 'శాస్త్ర సుచింతిత పునిపుని దేఖియే' చాలా చక్కగా చింతన చేయబడిన శాస్త్రాన్ని కూడా మళ్ళీ మళ్ళీ చూడవలసి ఉంటుంది. ఇంతే కాదు, ఎలా ఎలా మీరు సాధన పథంలో పురోగమిస్తారో, ఎలా ఎలా ఇష్టదైవంలో ప్రవేశం పొందుతారో, అలా అలా బ్రహ్మ నుంచి క్రొత్త క్రొత్త అనుభూతులు లభిస్తాయి. ఈ తెలుసుకోవడం సద్గురు మహాపురుషుని వల్లనే సాధ్యపడుతుంది. కాబట్టి శ్రీకృష్ణుడు అంటాడు నేను మళ్ళీ చెబుతాను.

సురతి (స్మృతి) ఎలాంటి పటలం (కేన్వాసు) అంటే, దాని మీద సంస్కారాలు అంకితమవుతూనే ఉంటాయి. సాధకుడి యొక్క ఇష్టదైవంలో ప్రవేశం ఇప్పించే జ్ఞానం గనుక మసక బారి పోతే, ఆ స్మృతి పటలంపై ప్రకృతి అంకితమవడం మొదలవుతుంది, అదే వినాశానికి కారణం. కాబట్టి చివరి వరకూసాధకుడు ఇష్టదైవానికి సంబంధించిన జ్ఞానాన్ని మళ్ళీ–మళ్ళీ జాగృతం చేసుకుంటూ ఉండాలి. ఈనాడు స్మృతి జీవవంతంగా ఉంది, కానీ ముందు – ముందు దశలలో ప్రవేశం దొరకడంతో యీ దశ ఉండదు. కాబట్టి 'పూజ్య గురువుగారు' ఇలా అనేవారు–''బ్రహ్మ విద్యను ప్రతిరోజూ చింతన చెయ్యి. ఒక మాల ప్రతి రోజూ త్రిప్పు. అది చింతన వల్లనే త్రిప్పబడాలి. బయటి (భౌతికమైన) జపమాల కాదు.''

ఇది సాధకుడికి సంబంధించినది, కానీ ఎవరైతే వాస్తవమైన సద్గురువో, అతను ఎల్లప్పుడూ ఆ సాధకుని వెంట–వెంటనే ఉంటాడు. లోపల అతని ఆత్మతో జాగృతుడయి, బయట తన క్రియా కలాపాల ద్వారా అతనికి క్రొత్త పరిస్థితులను అవగతం చేస్తూ ఉంటాడు. యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు కూడా మహాపురుషుడే. అర్జునుడు శిష్యుని స్థానంలో ఉన్నాడు, అతను శ్రీకృష్ణుణ్ణి తనను సంభాళించమని ప్రార్థించాడు. కాబట్టి యోగేశ్వరుడైన శ్రీకృష్ణుని కథనమేమిటంటే జ్ఞానాలలో కూడా ఉత్తమమైన జ్ఞానాన్ని, నేను మళ్ళీ నీకు చెబుతాను.

శ్రీ భగవానువాచ–

శ్లో ॥ పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞానముత్తమం ।
యద్ జ్ఞాత్వా మునయః సర్వే పరాం సిద్ధిమితో గతాః ॥**1**॥

అర్జునా! జ్ఞానాలలో కూడా అతి ఉత్తమమైన జ్ఞానం పరమ జ్ఞానాన్ని నేను మళ్ళీ నీకు చెబుతాను (దీనిని లోగడ చెప్పడమయింది), దీనిని తెలుసుకొని మునులందరూ ఈ సంసార సాగరం నుండి ముక్తులయి, పరమసిద్ధిని పొందుతారు (దాని తరువాత పొందడానికి ఇంకేమీ మిగిలి ఉండదు.)

శ్లో ॥ ఇందు జ్ఞానము పాశ్రిత్య మమ సాధర్మ్యమాగతాః ।
సర్గేఽపి నోపజాయంతే ప్రళయే న వ్యథంతి చ ॥**2**॥

'ఉపాశ్రిత్య' – ఈ జ్ఞానం యొక్క ఆశ్రయం తీసుకొని క్రియాత్మకంగా పయనించి బ్రహ్మ దగ్గరకు చేరి, నా స్వరూపాన్ని పొందిన వారు సృష్టి ఆదిలో మళ్ళీ జన్మించరు. మరియు ప్రళయ కాలంలో అంటే శరీరాంతం జరిగే సమయంలో వ్యాకుల పడరు; ఎందుకంటే మహాపురుషుని శరీరం, స్వరూపాన్ని పొందగానే అంతరించి పోతుంది. ఆ తరువాత అతని శరీరం ఉండటానికి ఒక యిల్లు మాత్రంగానే ఉండి పోతుంది. పునర్జన్మ స్థానమెక్కడ? లోకులు ఎక్కడ జన్మిస్తారు? అప్పుడు శ్రీకృష్ణుడు ఇలా అంటాడు.

శ్లో ॥ మమ యోనిర్మహాద్బ్రహ్మ తస్మిన్‌గర్భం దధామ్యహమ్ ।
సంభవ : సర్వభూతానాం తతో భవతి భారత ॥3॥

హే అర్జునా ! నా 'మహద్బ్రహ్మ' అంటే అష్టధా మూల ప్రకృతి సంపూర్ణ భూతాలకు మూలస్థానం యోని వంటిది. మరియు దానిలో నేనే చైతన్యమనే బీజాన్ని స్థాపించుతాను, అ జడ చైతన్యాల సంయోగంతో భూతాలన్నింటి ఉత్పత్తి జరుగుతుంది.

శ్లో ॥ సర్వ యోనిషు కౌంతేయ మూర్తయః సంభవంతి యాః ।
తాసాం బ్రహ్మ మహాద్యోనిరహం బీజ ప్రద ః పితా ॥4॥

కౌంతేయా! యోనులన్నింటిలోనూ ఎన్ని శరీరాలు ఉత్పన్నమవుతాయో, ఆ అన్నింటికీ 'యోనిః' గర్భధారణ చేయు తల్లి, ఎనిమిది రూపాలు గల మూల ప్రకృతి. నేనే బీజ స్థాపన చేసే తండ్రిని. బయట పేరుగా తల్లి, తండ్రి అంటూ ఎవరూ లేరు. ఎప్పటి వరకు జడ–చైతన్యాల సంయోగం జరుగుతూంటుందో, జన్మలు సంభవిస్తూనే ఉంటాయి, నిమిత్తులు మాత్రం ఎవరో ఒకరు అవుతూనే ఉంటారు. చైతన్య ఆత్మ, జడ ప్రకృతిలో ఎందుకు బంధించబడుతుంది? దీనిని గూర్చి ఇలా అంటాడు–

శ్లో ॥ సత్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతి సంభవాః ।
నిబధ్నంతి మహాబాహో దేహే దేహినమవ్యయమ్ ॥5॥

మహాబాహు అర్జునా! సత్వగుణం, రజోగుణం మరియు తమోగుణం మూడూ ప్రకృతిచే ఉత్పన్నయమ్యే గుణాలే. అవినశ్వర జీవాత్మను ఇవి శరీరంలో బంధిస్తాయి. ఏ ప్రకారంగా?

శ్లో ॥ తత్ర సత్త్వం నిర్మల త్వాత్ప్రకాశకమనామయం ।
సుఖ సంగేన బధ్నాతి జ్ఞాన సంగేన చానఘ ॥6॥

నిష్పాపుడవైన అర్జునా ! ఆ మూడూ గుణాలలో నిర్వికారమయిన సత్త్వగుణం 'నిర్మలత్వాత్' నిర్మలమయిన కారణంగా, సుఖం మరియు జ్ఞానాల పట్ల ఆసక్తి చేత, ఆత్మను శరీరంలో బందిస్తుంది. సత్త్వ గుణం కూడా బంధమే. తేడా ఏమిటంటే – సుఖం కేవలం పరమాత్మలోనే ఉంది. మరి జ్ఞానం, సాక్షాత్కారం పేరు. పరమాత్ముని సాక్షాత్కారం కానంత వరకూ, సత్వ గుణం బంధించే ఉంచుతుంది.

శ్లో ॥ రజో రాగాత్మకం విద్ధి తృష్ణా సంగ సముద్భవం ।
తన్ని బధ్నాతి కౌంతేయ కర్మ సంగేన దేహినమ్ ॥7॥

హే అర్జునా! ప్రీతి యొక్క జీవిత స్వరూపం రజోగుణం, దానిని నీవు కోరికలు మరియు ఆసక్తి చేత ఉత్పన్నమవుతాయని తెలుసుకో. అది జీవాత్మను

''కర్మసంగేన'' కర్మ మరియు దాని ఫలాసక్తి కారణంచే బంధించుతుంది. అది కర్మలో ప్రవృత్తుణ్ణి చేస్తుంది.

శ్లో ॥ తమస్త్వ జ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్ ।
ప్రమాదాలస్య నిద్రాభిస్తన్ని బధ్నాతి భారత ॥8॥

అర్జునా! సమస్త దేహధారులను మోహింప జేసే తమోగుణాన్ని, అజ్ఞానం నుంచి ఉత్పన్నమైనదిగా తెలుసుకో. అది ఈ ఆత్మను ప్రమాద అంటే వ్యర్థమైన చేష్ట, బద్దకం (రేపు చేద్దాంలే అనే భావన) మరియు నిద్ర ద్వారా బంధించుతుంది. నిద్ర అంటే అర్థం తమో గుణం గలవాడు ఎక్కువగా నిద్రపోవడమని కాదు. శరీరం పడుకుంది అని కూడా కాదు.'యా నిశా సర్వ భూతానాం తస్యాం జాగర్తి సంయమీ!' జగత్తే రాత్రి. తమో గుణం గల వ్యక్తి ఈ జగత్తు అనే నిషాలో రాత్రింబగళ్ళు బిజీగా ఉంటాడు. ప్రకాశస్వరూపం పట్ల అచేతనుడయి ఉంటాడు. తమో గుణం యొక్క నిద్ర అంటే ఇదీ అర్థం. ఎవరైతే ఇందులో ఇరుక్కుపోయారో, వారు పడుకొన్నవారు. ఇప్పుడు మూడు గుణాల యొక్క సామూహిక బంధ స్వరూపం గురించి చెబుతాడు.

శ్లో ॥ సత్త్వం సుఖే సంజయతి రజః కర్మణి భారత ।
జ్ఞాన మావృత్య తు తమః ప్రమాదే సంజయత్యుత ॥9॥

అర్జునా ! సత్వగుణం సుఖంలోకి పంపిస్తుంది, శాశ్వత పరమ సుఖం యొక్క ధారలో వదలుతుంది. రజోగుణం కర్మలో ప్రవృత్తుణ్ణి చేస్తుంది మరియు తమోగుణం జ్ఞానాన్ని ఆచ్ఛాదిత పరచి, అజాగ్రత్తలో అంటే అంతః కరణాన్ని వ్యర్థ చేష్టలలో పెడుతుంది. గుణాలు ఒకే స్థానంలో ఒకే హృదయంలో ఉండేటప్పుడు వేరు-వేరుగా ఎలా విభజించ బడ్డాయి? దీనిని గురించి యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు అంటాడు-

శ్లో ॥ రజస్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత ।
రజః సత్త్వం తమశ్చైవ తమః సత్త్వం రజస్తథా ॥10॥

హే అర్జునా! రజోగుణం మరియు తమోగుణాల్ని అణచి పెట్టితే, సత్వగుణం పెరుగుతుంది. అలాగే సత్వగుణం మరియు తమోగుణాల్ని తొక్కి పెట్టితే రజోగుణం పెరుగుతుంది. రజోగుణం మరియు సత్వగుణాల్ని అణచివేస్తే తమోగుణం పెరుగుతుంది. ఎప్పుడు ఏ గుణం పని చేస్తోందన్నది ఎలా గుర్తించవచ్చు.

శ్లో ॥ సర్వద్వారేషు దేహేऽస్మిన్ప్రకాశ ఉపజాయతే ।
జ్ఞానం యదా తదా విద్యాద్వివృద్ధం సత్త్వ. మిత్యుత ॥11॥

ఏ కాలంలోనయితే ఈ శరీరంలో మరియు అంతః కరణంలో మరియు సంపూర్ణ ఇంద్రియాలలో ఈశ్వరీయ ప్రకాశం మరియు బోధ శక్తి ఉత్పన్నమవుతుందో, ఆ సమయాన

సత్త్వగుణం వృద్ధి చెందిందని తెలుసుకోవాలి మరియు.

శ్లో ॥ లోభః ప్రవృత్తిరారంభః కర్మణామశమః స్పృహా ।
రజస్యేతాని జాయంతే వివృద్ధే భరతర్షభ ॥ **12**॥

హే అర్జునా! రజోగుణం ఎక్కువ అయినప్పుడు లోభం, పనిలో ప్రవృత్తమయ్యే చేష్టలు, కర్మల ఆరంభం, అశాంతి అంటే మనస్సు యొక్క చాంచల్యం, విషయాలను అనుభవించాలనే కోరిక, ఇవి ఉత్పన్నం అవుతాయి. మరి తమోగుణం పెరిగితే ఏం అవుతుంది?

శ్లో ॥ అప్రకాశోऽ ప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ ।
తమస్యేతాని జాయంతే వివృద్ధే కురునందన ॥ **13**॥

అర్జునా! తమోగుణం పెరిగినప్పుడు 'అప్రకాశః' (ప్రకాశం పరమాత్ముణ్ణి వ్యక్తం చేస్తుంది) ఈశ్వరీయ ప్రకాశం వైపు వెళ్ళలేనటువంటి స్వభావం, 'కార్యం కర్మ' – చేయ తగిన విశేష ప్రక్రియలో అప్రవృత్తి, అంతః కరణంలో వ్యర్థమైన చేష్టలు మరియు ప్రపంచం పట్ల ముగ్ధులయ్యే ప్రవృత్తులు ఇవన్నీ ఉత్పన్నం అవుతాయి. ఈ గుణాల గురించి తెలుసుకోవడం వలన లాభమేమిటి?

శ్లో ॥ యదా సత్త్వే ప్రవృద్ధే తు ప్రళయం యాతి దేహభృత్ ।
తదోత్తమవిదాం లోకానమలాన్ ప్రతిపద్యతే ॥ **14**॥

ఈ జీవాత్మ సత్త్వగుణం వృద్ధిఅయ్యే కాలంలో గనుక మృత్యువు సంప్రాప్తించితే, శరీరాన్ని త్యజిస్తే, అప్పుడు ఉత్తమమైన కర్మ చేసే, మలినరహితమైన దివ్య లోకాలను పొందుతుంది మరియు–

శ్లో ॥ రజసి ప్రళయం గత్వా కర్మ సంగిషు జాయతే ।
తథా ప్రలీన స్తమసి మూఢయోనిషు జాయతే ॥ **15**॥

రజోగుణం వృద్ధి అయినప్పుడు, మృత్యువును పొందినట్లయితే కర్మలలో ఆసక్తి గల మనుష్య జన్మ లభిస్తుంది. మరియు తమోగుణం వృద్ధి అయినప్పుడు, మృత్యువును పొందినట్లైతే, తమోగుణం వృద్ధి అయినప్పుడు మరణించే పురుషుడు, మూఢ యోనులలో క్రిమి కీటకాది పర్యంతం జన్మిస్తాడు. కాబట్టి గుణాలలో కూడా మనుష్యుడు సత్వగుణం గలవాడవ్వాలి. ప్రకృతి యొక్క ఈ బ్యాంకు మీరు ఆర్జించిన గుణాలను, మృత్యువు తరువాత కూడా వాటిని మీకు సురక్షితంగా తిరిగి ఇస్తుంది. ఇప్పుడు దీని పరిణామాన్ని చూద్దాం.

శ్లో ॥ కర్మణః సుకృతస్యాహుః సాత్త్వికం నిర్మలం ఫలం ।
రజసస్తు ఫలం దుఃఖ మజ్ఞానం తమసః ఫలమ్ ॥ **16**॥

సాత్త్విక కర్మ యొక్క ఫలం సాత్త్వికం, నిర్మల సుఖం, జ్ఞానం మరియు వైరాగ్యాదులని

చెప్పబడింది, రాజసకర్మయొక్క ఫలం దుఃఖం మరియు తామస కర్మ యొక్క ఫలం అజ్ఞానం. మరియు.

శ్లో ॥ సత్త్వాత్సం జాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ ।
ప్రమాదమోహౌ తమసో భవతో జ్ఞానమేవ చ ॥17॥

సత్వ గుణంచే జ్ఞానం ఉత్పన్నమవుతుంది. ( ఈశ్వరుని అనుభూతి యొక్క పేరు జ్ఞాన్నం), ఈశ్వరీయ అనుభూతి ప్రవహించుతుంది. రజోగుణం వలన నిస్సందేహంగా లోభం ఉత్పన్నమవుతుంది, మరియు తమోగుణం వలన అజాగ్రత్త, మోహం, బద్ధకం (అజ్ఞానం) ఉత్పన్నమవుతాయి. ఇవి ఉత్పన్నమయి ఏ గతులను ఇస్తాయి?

శ్లో ॥ ఊర్ధ్వం గచ్ఛంతి సత్త్వస్థా మధ్యే తిష్ఠంతి రాజసాః ।
జఘన్యగుణ వృత్తిస్థా అధో గచ్ఛంతి తామసాః ॥18॥

సత్త్వగుణంలో స్థితుడై ఉన్న పురుషుడు ' ఊర్ధ్వమూలం' – ఆ మూల పరమాత్ముని వైపు ప్రవహిస్తాడు, నిర్మల లోకాలలోకి వెళతాడు. రజోగుణంలో స్థితుడైన రాజస పురుషుడు మధ్యమ శ్రేణికి చెందిన మనుష్యుడవుతాడు, అతని వద్ద ' సాత్వికత్వం' వివేకం, వైరాగ్యాలు ఉండవు, కానీ అధమమైన క్రి మి–కీటకాల జన్మలెత్తడు. కానీ పునర్జన్మ పొందుతాడు. మరియు నిందనీయమైన తమోగుణంలో ప్రవృత్తుడై ఉన్న తామసీ పురుషుడు 'అధోగతిః' అంటే పశు, పక్షి, క్రిమి – కీటకాది అధమ జన్మలను పొందుతాడు. ఈ ప్రకారంగా మూడు గుణాలు ఏదో ఒక రూపమైన జన్మలకే కారణమవుతాయి. ఏ పురుషుడైతే గుణాలకు అతీతుడై పోతాడో, అతను జన్మబంధం నుండి విముక్తుడై పోతాడు మరియు నా స్వరూపాన్ని పొందుతాడు. దీనిని గూర్చి ఇలా అంటాడు–

శ్లో ॥ నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టాఽనుపశ్యతి ।
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి ॥19॥

ఏ కాలంలోనైతే ద్రష్ట అయిన ఆత్మ మూడు గుణాలను తప్ప ఇంకెవరినీ కర్తగా చూడదో మరియు మూడు గుణాలకంటే అత్యంత అతీతమైన పరమతత్త్వాన్ని 'వేత్తి' తెలుసు కుంటుందో, ఆ సమయంలో ఆ పురుషుడు నా స్వరూపాన్ని పొందుతాడు. గుణాలు గుణాల్లోనే వ్యవహరిస్తాయన్నది బౌద్ధిక సత్యం కాదు. సాధన చేస్తూ, చేస్తూ ఎలాంటి దశ వస్తుందంటే, అక్కడ ఆ అనుభూతి లభిస్తుంది. గుణాలు తప్ప ఇంకెవ్వరూ కర్తగా కనిపించరు, ఆ సమయంలో పురుషుడు మూడు గుణాలకంటే అతీతుడయి పోతాడు. ఇది కల్పితమైన భావన కాదు మరియు దీనిని గూర్చి అంటాడు–

శ్లో ॥ గుణానేతానతీత్య త్రీన్ దేహీ సముద్భవాన్ ।
జన్మ మృత్యుజరాదుఃఖై ర్విముక్తోఽమృతమశ్నుతే ॥20॥

పురుషుడు ఈ స్థూల శరీరం ఉత్పత్తికి కారణభూతాలైన మూడు గుణాలకంటే

అతీతుడయి, జన్మమృత్యు వృద్ధావస్థల నుంచి మరియు అన్ని రకాల దుఃఖాల నుంచి విశేషంగా ముక్తుడయి, అమృత తత్త్వాన్ని ఆస్వాదిస్తాడు. అర్జునుడు ఇలా ప్రశ్నించాడు-

అర్జునా ఉవాచ -

శ్లో॥ కైర్లింగై స్త్రీంగుణానేతానతీతో భవతి ప్రభో ।
కిమాచారః కథం చై తాన్ స్త్రీన్ గుణానతివర్తతే ॥**21**॥

ప్రభూ ! ఈ మూడు గుణాలకంటే అతీతుడయిన పురుషుడు ఏ ఏ లక్షణాలతో యుక్తుడవుతాడు మరియు ఏ ప్రకారమయిన ఆచరణగల వాడవుతాడు మరియు మనుష్యుడు ఏ ఉపాయంచే యీ మూడు గుణాలకంటే అతీతుడవగలడు?

శ్రీభగవానువాచ -

శ్లో॥ ప్రకాశం చ ప్రవృతిం చ మోహమేవ చ పాండవ ।
న ద్వేష్టి సం ప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి ॥**22**॥

అర్జునుడు అడిగిన పై మూడు ప్రశ్నలకు జావాబిస్తూ యోగేశ్వరుడైన శ్రీ కృష్ణుడు అన్నాడు-అర్జునా! ఏ పురుషుడైతే సత్వగుణం కార్యరూపు దాలిస్తే యీశ్వరీయ ప్రకాశం, రజోగుణం కార్యరూపుదాలిస్తే ప్రవృత్తి మరియు తమోగుణం కార్యరూపం దాలిస్తే మోహం ప్రవృత్తమవడాన్ని చెడుగా అనుకోడో మరియు నివృత్తమయినప్పుడు వాటిని ఆకాంక్షించడో మరియు

శ్లో॥ ఉదాసీనవాసీనో గుణైర్యో న విచాల్యతే ।
గుణా వర్తంత ఇత్యేవ యోऽవతిష్ఠతి నేంగతే ॥**23**॥

ఎవ్వరైతే ఈ రకంగా ఉదాసీన (నిర్లిప్త) సదృశ స్థితిలో ఉంటూ, గుణాల ద్వారా విచలితుడు కాడో; గుణాలు గుణాలలోనే వ్యవహరిస్తాయి, అలాంటి యథార్థస్థితిని తెలుసుకొని, ఆ స్థితి నుండి చంచలం కాడో, అతడే గుణాలకంటే అతీతుడు అవుతాడు.

శ్లో॥ సమదుఃఖ సుఖః స్వస్థః సమలోష్టాశ్మకాంచనః ।
తుల్యప్రియా ప్రియో ధీరస్తుల్యనిందాత్మ సంస్తుతిః ॥**24**॥

ఎవ్వరైతే నిరంతరం తనలో అంటే ఆత్మ భావంతో స్థితుడై ఉంటాడో, సుఖం మరియు దుఃఖంలో సమంగా ఉంటాడో, మట్టి, రాయి, బంగారంపట్ల కూడా సమాన భావం కలిగి ఉంటాడో, ధైర్యవంతుడో, ఎవ్వరైతే ప్రియమైన మరియు అప్రియమైన వాటిని సమానమని భావించుతాడో, నిందా స్తుతులలో కూడా సమాన భావం కలిగి ఉంటాడో మరియు

శ్లో॥ మానాపమానయోస్తుల్యస్తుల్యో మిత్రారిపక్షయోః ।
సర్వారంభ పరిత్యాగి గుయాతీతః స ఉచ్యతే ॥**25**॥

ఎవరైతే సమ్మానం మరియు అవమానంలో సమాభావం కలిగి ఉంటాడో, మిత్ర మరియు శత్రు పక్షంలో కూడా సమభావం కలిగి ఉంటాడో, అలాంటి సమస్త ఆరంభాల నుంచి రహితుడయి ఉన్న పురుషుడు గుణాతీతుడనబడతాడు.

శ్లోకం ఇరవయిరెండు నుంచి ఇరవయి అయిదు వరకు గుణాల కంటే అతీతుడయిన పురుషుని లక్షణాలు మరియు ఆచరణ గురించి చెప్పబడింది – అతడు విచలితుడు కాడు. గుణాల వలన విచలితుడు కాబడడు, స్థిరంగా ఉంటాడు. ఇప్పుడు గుణాల కంటే అతీతమయ్యే విధి ప్రస్తుతీకరించబడింది.

శ్లో ॥ మాం చ యోऽ వ్యభిచారేణ భక్తి యోగేన సేవతే ।
స గుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మ భూయాయ కల్పతే ॥**26**॥

ఏ పురుషుడైతే అవ్యభిచారిణీ భక్తి ద్వారా అంటే యిష్ట దైవాన్ని తప్ప అన్య ప్రాపంచికమైన స్మరణల నుంచి సదా రహితుడయి, యోగం ద్వారా అంటే అదే నియత కర్మ ద్వారా నన్ను నిరంతరం భజన చేస్తాడో, అతను ఈ మూడు గుణాలను బాగుగా తరించి పరబ్రహ్మతో ఏకమవడానికి యోగ్యుడవుతాడు. దాని పేరే కల్పం. బ్రహ్మతో ఏకీభావం కలగడమే వాస్తవికమైన కల్పం. అనన్య భావంతో నియత కర్మ యొక్క ఆచరణ చేయకుండా, ఎవరు కూడా గుణాలకు అతీతులు కాలేరు. చివరిలో యోగేశ్వరుడు ఈ నిర్ణయం ఇస్తాడు.

శ్లో ॥ బ్రహ్మణో హి ప్రతిష్టాऽహ మమృత స్యావ్యయస్య చ ।
శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాంతి కస్య చ ॥**27**॥

హే అర్జునా! ఆ అవినశ్వర బ్రహ్మ కి(దేనితో కూడి అతను కల్పం చేసాడో, దేనిలో అతను గుణాతీతమైన ఏకీభావంతో ప్రవేశించు తాడో), అమృతానికి, శాశ్వత ధర్మానికి మరియు అఖండ ఏకరస ఆనందానికి ఆశ్రయం నేను. అంటేపరమాత్మునిలో స్థితుడైన సద్గురువే వీటన్నింటికీ ఆశ్రయ స్థానం. శ్రీకృష్ణుడు ఒక యోగేశ్వరుడు. ఇప్పుడు గనుక మీకు అవ్యక్తమైన, అవినశ్వర బ్రహ్మ, శాశ్వత ధర్మం, ఏకరస ఆనందంతో అవసరం ఉంటే ఎవరైనా తత్త్వస్థితుడైన, అవ్యక్త స్థితుడైన మహాపురుషుని శరణు చేరండి. అతని ద్వారానే ఇవి సాధ్యపడతాయి.

సారాంశం ః

ఈ అధ్యాయం ఆరంభంలో యోగేశ్వరుడైన శ్రీ కృష్ణుడు అన్నాడు – అర్జునా! జ్ఞానాలలో కూడా అతి ఉత్తమమైన పరమ జ్ఞానాన్ని నేను మళ్ళీ నీకు చెబుతాను, దానిని తెలుసుకొని మునులు ఉపాసన ద్వారా నా స్వరూపాన్ని పొందుతారు. మళ్ళీ సృష్టి ఆదిలో వారు జన్మించరు, కానీ శరీరం మరణించక తప్పదు గదా. ఆ సమయంలో వారు వ్యాకులపడరు. వారు వాస్తవానికి ఏ రోజైతే స్వరూపాన్ని పొందారో, ఆ రోజే శరీరాన్ని త్యజించిన వారయినారు. ముక్తి అనేది జీవించి ఉండగానే లభిస్తుంది. కానీ శరీరం అంతమయ్యే సమయంలో కూడా వారు వ్యాకుల పడరు.

ప్రకృతి నుంచి ఉత్పన్నమయ్యే సత్త్వ, రజ, తమో గుణాలే ఈ జీవాత్మను శరీరంలో బంధించుతాయి. రెండుగుణాలను అణచి మూడవ గుణాన్ని పెంచవచ్చు. గుణాలు, పరివర్తనశీలమైనవి. ప్రకృతి అనాది అయినది, వినష్టం కాదు, కానీ గుణాల ప్రభావాన్ని అధిగమించవచ్చు. గుణాలు మనస్సుపై ప్రభావాన్ని వేస్తాయి. సత్వగుణం వృద్ధి అయినప్పుడు, ఈశ్వరీయ ప్రకాశం మరియు జ్ఞానం ఉంటాయి. రజోగుణం రాగాత్మకమయింది. ఆ సమయంలో కర్మ పట్ల లోభం ఉంటుంది, ఆసక్తి ఉంటుంది. మరియు అంతఃకరణంలోతమోగుణం కార్యరూపం దాల్చినప్పుడు బద్ధకం, అజాగ్రత్త చుట్టు ముట్టుతాయి. సత్వగుణం వృద్ధి చెందినప్పుడు మృత్యువును పొందిన పురుషుడు పైనున్న నిర్మల లోకాలలో జన్మనెత్తుతాడు. రజోగుణం వృద్ధిలో నున్నప్పుడు మృత్యువును పొందిన పురుషుడు మానవ యోనిలోకే తిరిగి వస్తాడు, మరియు తమోగుణం యొక్క వృద్ధి కాలంలో మనుష్యుడు శరీరాన్ని త్యజిస్తే (పశు – క్రిమి – కీటకాది) అధమ యోనులను పొందుతాడు. కాబట్టి మనుష్యులు క్రమంగా ఉన్నతమైన సాత్విక గుణంవైపు అగ్రసరులవ్వాలి. వాస్తవానికి మూడు గుణాలు ఏదో ఒక రకమైన జన్మకే కారణభూతమవుతాయి. గుణాలే ఆత్మను శరీరంలో బంధించుతాయి. కాబట్టి గుణాల కంటే అతీతులవ్వాలి.

దేని నుంచి ముక్తి పొందుతారో, దాని స్వరూపం గురించి యోగేశ్వరుడు ఇలా అన్నాడు – అష్టధా మూల ప్రకృతి అంటే గర్భాన్ని ధరించే తల్లి, మరియు నేనే బీజమునకు తండ్రిని; ఇంకో తల్లిగానీ, తండ్రిగానీ లేరు. ఎప్పటి వరకు ఈ క్రమం ఉంటుందో, అప్పటి వరకు చరాచర జగత్తులో నిమిత్తమాత్రంగా ఎవరో ఒకరు తల్లిదండ్రులవుతారు. కానీ వాస్తవానికి ప్రకృతే తల్లి మరియు నేనే తండ్రిని.

అప్పుడు అర్జునుడు మూడు ప్రశ్నలు వేశాడు – గుణాతీతమైన పురుషుని లక్షణాలు ఏమిటి? ఆచరణ ఏమిటి? మరియు ఏ ఉపాయంచే మనుష్యుడు ఈ మూడు గుణాలకు అతీతుడవగలడు? యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు గుణాతీతమైన పురుషుని లక్షణాలు మరియు ఆచరణ గురించి చెప్పి చివరిలో గుణాతీతమవడానికి ఉపాయం చెప్పాడు– ఏ పురుషుడైతే అవ్యభిచారిణీ భక్తితో మరియు యోగం ద్వారా నిరంతరం నా భజన చేస్తాడో, అతను మూడు గుణాలకు అతీతుడయిపోతాడు. వేరే ఎవరి చింతన చేయకుండా నిరంతరం ఇష్టదైవం యొక్క చింతన చేయడమే, అవ్యభిచారిణి భక్తి. ఏదైతే ప్రపంచం యొక్క సంయోగ వియోగాలతో రహితమై ఉందో, దాని పేరే యోగం. దానికి కార్య రూపం ఇచ్చే ప్రణాళిక పేరే కర్మ. యజ్ఞం దేని వలన పూర్తవుతుందో, దాని పేరే కర్మ, అవ్యభిచారిణీ భక్తి ద్వారా, ఆ నియత కర్మ యొక్క ఆచరణచేతనే, పురుషుడు మూడు గుణాలకు అతీతుడవుతాడు. మరియు అతీతుడయి బ్రహ్మలో ఏకీభావానికై, పూర్ణ కల్పాన్ని పొందటానికై యోగ్యుడవుతాడు. గుణాలు ఏ మనస్సుపై ప్రభావం వేస్తాయో, అది విలయమవుతూనే బ్రహ్మతో ఏకీభావం లభిస్తుంది, ఇదే వాస్తవిక కల్పం. కాబట్టి భజన చేయకుండా ఎవరూ గుణాలకు అతీతులు కాలేరు.

చివరిలో యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు ఇలా నిర్ణయం ఇస్తాడు – ఆ గుణాతీత పురుషుడు

ఏ బ్రహ్మతో ఏకీభావంలో స్థితుడై ఉన్నాడో, ఆ బ్రహ్మకు, అమృతత్వానికి, శాశ్వత ధర్మానికి మరియు అఖండ ఏకరస ఆనందానికి ఆశ్రయం నేనే. అంటే ప్రధాన కర్తను. ఇప్పుడు శ్రీకృష్ణుడు లేడు. ఇప్పుడు ఆ ఆశ్రయం లేదు. అలాంటప్పుడిది గొప్ప సంశయాస్పదమైన మాట. ఆ ఆశ్రయం యిప్పుడెక్కడ దొరుకుతుంది? మరేంపరవాలేదు, శ్రీకృష్ణుడు తమ పరిచయం ఇచ్చాడు. అతను ఒక యోగి, స్వరూపస్థుడయిన మహాపురుషుడు. 'శిష్యస్తేహం శాది మాం త్వాం ప్రపన్నం' అర్జునుడు అన్నాడు – నేను మీ శిష్యుణ్ణి, మీ శరణులో ఉన్నాను, నన్ను సంభాళించండి.అనేక చోట్ల శ్రీకృష్ణుడు తన పరిచయాన్నిచ్చాడు. స్థిత ప్రజ్ఞుడయిన మహాపురుషుని లక్షణాలు చెప్పి అతనిలో తనను పోల్చుకున్నాడు. కాబట్టి స్పష్టమయ్యేదేమిటంటే శ్రీకృష్ణుడు ఒక మహాయోగి. ఇప్పుడు గనుక మీకు అఖండమైన ఏకరస ఆనందంగానీ, శాశ్వత ధర్మంగానీ, లేక అమృత తత్వంగానీ అవసరమైతే, వీటి అన్నింటి కొరకు ఒకే ఒక సద్గురువును చేరండి. తిన్నగా పుస్తకాన్ని చదివి ఎవరూ దీనిని పొందలేరు. అదే మహాపురుషుడు ఆత్మనుంచి అభిన్నుడయి, రథుడయి (మార్గదర్శకుడయి) క్రమ క్రమంగా అనురాగయుక్తుడైన పురుషుణ్ణి నడిపిస్తూ తను స్వయంగా ప్రతిష్ఠితుడయి ఉన్న స్వరూపానికి చేరుస్తాడు. అతనే ఏకమాత్ర సాధనం. ఈ ప్రకారంగా యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు తననే అందరికీ ఆశ్రయంగా చెబుతూ, ఈ పదునాలుగవ అధ్యాయాన్ని ముగించాడు. దీనిలో గుణాలని గురించిన విస్తృత వర్ణన ఉంది.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే 'గుణత్రయ విభాగ యోగో' నామ చతుర్దశోధ్యాయః ॥ 14 ॥

ఈ ప్రకారంగా శ్రీమద్భగవద్గీతా రూపమయిన ఉపనిషత్తు మరియు బ్రహ్మ విద్య మరియు యోగశాస్త్రమనే విషయంలో శ్రీకృష్ణుడు మరియు అర్జునుడి సంవాదంలో 'గుణత్రయ విభాగయోగం' అనే పేరుగల పదునాలుగవ అధ్యాయం పూర్తి అయింది.

ఇతి శ్రీమత్పరమహంస పరమానందస్య శిష్య స్వామీ అడగడానందకృతే శ్రీమద్భగవద్గీతాయాః – 'యథార్థ గీతా' భాష్యే 'గుణత్రయ విభాగయోగో' నామ చతుర్దశోధ్యాయః ॥ 14 ॥

ఈ ప్రకారంగా శ్రీమత్పరమహంస పరమానంద గారి శిష్యుడు స్వామి అడగడానంద గారిచే రచించబడిన శ్రీమద్భగవద్ గీత యొక్క భాష్యం 'యథార్థ గీత'లో గుణత్రయ విభాగయోగం అనే పదునాలుగవ అధ్యాయం పూర్తి అయింది.

॥ హరి ః ఓం తత్సత్ ॥

ఓం

శ్రీ పరమాత్మనే నమః

# పంచదశ అధ్యాయము

మహాపురుషులు సంసారాన్ని విభిన్న దృష్టాంతాలతో అర్థం చేయించడంకోసమని ప్రయత్నాలు చేసారు. కొందరు దీనిని 'భావాటవి' అంటే, ఇంకొందరు 'సంసార సాగరం' అన్నారు. దశల తేడాల వలన దీనినే 'భవనది' అనీ, 'భవకూపం' అనీ కూడా అన్నారు. అప్పుడప్పుడు దీనిని 'గోపాదం'తో పోల్చారు. అంటే ఇంద్రియాల ఘన పరిమాణమంతే ఈ సంసారమని అర్థం. చివరిలో అలాంటి అవస్థ కూడా వచ్చింది అంటే ('నామలేత్ భవసింధు సుఖాయి') (నామం ఉచ్చరించగానే భవసింధు కూడా ఎండి పోయింది.) అంటే సంసారంలో అలాంటి సముద్రం ఉందా? యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు కూడా సంసారాన్ని సముద్రంతోటి,వృక్షంతోటీ పోల్చాడు. పన్నెండో అధ్యాయంలో అతను అన్నాడు - నా భక్తులయిన వారిని, సంసార సముద్రం నుంచి శీఘ్రంగానే ఉద్ధరించే వాడినవుతాను. ప్రస్తుత అధ్యాయంలో యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు ఇలా అంటాడు-సంసారం ఒక వృక్షం, దీనిని నరుకుతూనే యోగులు ఆ పరమపదాన్ని వెతుకుతారు చూద్దాం. అది ఎలాగో.

శ్రీభగవానువాచ-

శ్లో॥ ఊర్ధ్వ మూల మధః శాఖ మశ్వత్థం ప్రాహురవ్యయమ్ ।
ఛందాంసియస్య పర్ణాని యస్తం వేదస వేదవిత్ ॥**1**॥

అర్జునా! 'ఊర్ధ్వ మూలం' పై వైపున పరమాత్ముడే దీని మూలం, 'అధఃశాఖం' - క్రింద ప్రకృతే దీని శాఖలు. అలాంటి సంసారమనే రావి వృక్షాన్ని, 'అవినాశీ' అంటారు. (వృక్షం అశ్వః అంటే రేపటి వరకు కూడా ఉండనిది, ఎప్పుడు కావాలనుకుంటే అప్పుడు నరికేయబడేది, కానీ అవినశ్వరము). శ్రీకృష్ణుడు చెప్పినట్లు అవినశ్వరమైనవి రెండు ఉన్నాయి-

ఒకటి సంసారమనే వృక్షం, అవినశ్వరం రెండవది దానికంటే అతీతమైనది పరమ అవినశ్వరము. వేదాలు ఈ అవినశ్వర సంసార వృక్షం యొక్క ఆకులు అనబడ్డాయి, ఎవరైతే ఈ సంసారమనెడి వృక్షాన్ని (చూస్తూ) విదితం చేసుకొంటాడో, అతను వేదాల జ్ఞాత.

ఈ సంసారవృక్షాన్ని తెలుసుకొన్నవాడే వేదాలను తెలుసుకొన్నవాడు. కానీ గ్రంథాలను చదివి, వేదాలను అర్థం చేసుకోలేము. పుస్తకాలను చదివితే అటు వెళ్ళాలనే ప్రేరణ మాత్రం కలుగుతుంది. ఆకులకు బదులుగా వేదాల అవసరం ఏమిటి? వాస్తవానికి పురుషుడు తిరుగుతూ – తిరుగుతూ చివరి రెమ్మను అంటే చివరి జన్మ ఎత్తినప్పటి నుంచే వేద మంత్రాలు (కళ్యాణాన్ని (మేలు) చేసేవి) ప్రేరణ ఇస్తాయి, అక్కడి నుంచి వాటి ఉపయోగం, అక్కడి నుంచే తిరగడం (జననమరణాలు) సమాప్తమయి పోతాయి. అతను స్వరూపం వైపు ఉన్ముఖుడయి పోతాడు. మరియు

శ్రీ భగవానువాచ-

శ్లో || అధశ్చోర్ధ్వం ప్రసృతాస్తస్య శాఖా గుణ ప్రసృద్ధా విషయప్రవాలాః ।
అధశ్చ మూలాస్యను సంతతాని కర్మానుబంధీని మనుష్యలోకే ||**2**||

ఆ సంసార వృక్షం యొక్క మూడు గుణాల వలన వృద్ధి చెందిన విషయాలు మరియు భోగాలు అనే ఆకులుగల శాఖలు క్రింద, పైన వ్యాపించి ఉన్నాయి. క్రింది వైపున క్రిమి–కీటకాదుల వరకు మరియు పైన దైవీభావం నుంచి బ్రహ్మ వరకు అన్ని వైపులా వ్యాపించి ఉన్నాయి. కేవలం మనుష్య జన్మలోనే కర్మల అనుసారంగా బంధించుతుంది, మిగిలినజన్మ యోనులన్నీ భోగాలను అనుభవించేవి. కేవలం మనుష్యయోని మాత్రమే కర్మలనుబట్టి బంధాన్ని తయారు చేస్తుంది.

శ్లో || న రూపమస్యేహ తథోపలభ్యతే
నాంతో న చాదిర్న చ సంప్రతిష్ఠా ।
అశ్వత్థ మేనం సువిరూఢ మూల
మ సంగశస్త్రే ణ దృఢేన ఛిత్త్వా ||**3**||

కానీ ఈ సంసార వృక్షం యొక్క రూపం, చెప్పబడినట్లు ఇక్కడ కనిపించదు. ఎందుకంటే దీనికి ఆదిలేదు, అంతం లేదు మరియు చక్కని స్థితి కూడా లేదు (ఎందుకంటే అది పరివర్తన శీలమైనది). ఈ సుదృఢ మూలంగల సంసారమనే వృక్షాన్ని ధృఢ ' అసంగ శస్త్రేణ' – అసంగ అంటే వైరాగ్యం అనే ఆయుధం ద్వారా నరకాలి. (సంసార – వృక్షాన్ని నరకాలి. అలా గాక రావి చెట్టు వేరులో పరమాత్ముడు ఉంటాడని గానీ, లేక రావిచెట్టు ఆకులు వేదాలనిగానీ, అనుకొని హారతి పట్టకండి).

ఈ సంసార వృక్షం యొక్క మూలం స్వయంగా పరమాత్ముడే. అతను బీజరూపంగా ప్రసరించుతాడు. అంటే అతను కూడా నరకివేయబడతాడా? ధృఢమైన వైరాగ్యం వలన ఈ ప్రకృతి సంబంధం విచ్ఛిన్నమై పోతుంది. ఇదే నరకడం అంటే. నరికి ఏం చేయాలి?

శ్లో ॥ తత ః పదం తత్పరి మార్గితవ్యం
యస్మిన్ గతాన నివర్తంతి భూయ ః ।
తమేవ చాద్యం పురుషం ప్రపద్యే యత ః
ప్రవృతిః ప్రసృతా పురాణీ ॥**4**॥

దృఢ వైరాగ్యం ద్వారా సంసార వృక్షాన్ని నరకిన తర్వాత, ఆ పరమపదుడైన పరమేశ్వరుణ్ణి చక్కగా వెతకాలి. అతనిలో ప్రవేశించిన పురుషులు మళ్ళీ వెనుకకు (సంసారంలోకి) రారు. అంటే పూర్ణనివృత్తిని పొందుతారు. కానీ అతనిని వెదకడం ఏ రకంగా సంభవం? యోగేశ్వరుడు అంటాడు, దీనికై సమర్పణ భావం అవసరం. ఏ పరమేశ్వరుని వలన పురాతనమైన సంసార వృక్ష ప్రవృత్తి వ్యాపకాన్ని పొందిందో, ఆ ఆది పురుషుడైన పరమాత్మునికి శరణ్యం నేను (అతని శరణులోకి వెళ్ళకుండా వృక్షం నరక బడదు). ఇప్పుడు శరణంలో వెళ్ళిన, వైరాగ్యంలో స్థితుడైన పురుషుడు వృక్షం నరకబడిందని ఎలా తెలుసుకోగలడు? దాని గుర్తింపు ఏమిటి? అప్పుడు ఇలా అంటాడు.

శ్లో ॥ నిర్మానమోహా జితసంగదోషా
అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః ।
ద్వంద్వైర్విముక్తా ః సుఖ దుఃఖ సంజ్ఞై
ర్గచ్ఛంత్య మూఢాః పదమవ్యయం తత్ ॥**5**॥

పైన చెప్పబడిన రకంగా సమర్పణ భావంచే ఎవరి మోహం మరియు మానము వినష్టమయి పోయాయో, ఆసక్తి రూపమైన సంగదోషాన్ని ఎవరైతే గెలిచాడో, 'అధ్యాత్మనిత్యా' – పరమాత్ముని స్వరూపంలో ఎవరైతే నిరంతరం స్థితుడై ఉంటాడో, ఎవరి కోరికలైతే నివృత్తమయి పోయాయో మరియు సుఖదుఃఖాలనే ద్వంద్వాలనుంచి విముక్తుడైనాడో అట్టి జ్ఞాని ఆ అవినశ్వర పరమపదాన్ని పొందుతాడు. ఈ దశకు చేరుకోనంత వరకూసంసార వృక్షం నరక బడదు. ఇక్కడి వరకు వైరాగ్యం యొక్క అవసరం ఉంటుంది. దేనినైతే పొందుతారో, ఆ పరమ పదం యొక్క స్వరూపం ఏమిటి?

శ్లో ॥ న తద్భాసయతే సూర్యో నశశాంకో నపావక ః ।
యద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ ॥**6**॥

ఆ పరమ పదాన్ని సూర్యుడుగానీ, చంద్రుడుగానీ, లేక అగ్నిగానీ ప్రకాశింపజేయలేవు. ఏ పరమపదాన్ని పొంది మనుష్యుడు తిరిగి సంసారంలోకి రాడో, అదే నా పరమధామం అంటే అతనికి పునర్జన్మలేదు. ఈ పదం యొక్క ప్రాప్తికై అందరికీ సమానమైన అధికారం కలదు. దీనిని గురించి అంటాడు–

శ్లో ॥ మమై వాంశో జీవలోకే జీవభూతః సనాతన ః ।
మనః షష్ఠానీంద్రియాణి ప్రకృతి స్థాని కర్షతి ॥**7**॥

'జీవలోకే' అంటే ఈ దేహంలో (శరీరమే లోకం) ఈ జీవాత్మ నా యొక్క

సనాతన అంశం. అదే ఈ త్రిగుణమయీ మాయలో స్థితమై ఉండి మనస్సు సహితంగా ఐదు ఇంద్రియాలను ఆకర్షించుతుంది. ఏ రకంగా?

శ్లో ॥ శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః ।
గృహీత్వైతాని సంయాతి వాయుర్గంధాని వాశయాత్ ॥8॥

ఏ రకంగానైతే గాలి వాసనాస్థలం నుంచి వాసనను గ్రహించుతుందో, అలాగే దేహానికి స్వామియైన జీవాత్మ ఏ శరీరాన్ని ముందు త్యాగం చేసిందో, దాని నుంచి మనస్సు మరియు ఐదు ఇంద్రియాల కార్య కలాపాలను గ్రహించి (ఆకర్షించి, తోడు తీసుకొని) మళ్ళీ ఏ శరీరాన్ని పొందుతుందో, అందులోకి వెళుతుంది. (తరువాతి శరీరం అప్పటికప్పుడే నిశ్చితమయి ఉన్నప్పుడు, అన్నం పిండాలు చేసి ఎవరికి అర్పిస్తారు? తీసుకొనేవారెవరు ? కాబట్టి శ్రీకృష్ణుడు అర్జునుడితో అన్నాడు – పిండోదక క్రియలు లుప్తమయిపోతాయనే ఈ అజ్ఞానం నీకెక్కడ్నించి వచ్చింది) అక్కడకు వెళ్ళి ఏం చేస్తుంది? మనస్సు సహితంగా పంచ ఇంద్రియాలు ఏవి?

శ్లో ॥ శ్రోత్రం చక్షుః స్పర్శనం చ రసనం ఘ్రాణమేవ చ ।
అధిష్ఠాయ మనశ్చాయం విషయానుపసేవతే ॥9॥

ఈ శరీరంలో స్థితమై ఉన్న ఈ జీవాత్మ చెవులు, కళ్ళు చర్మం, నాలుక ముక్కు మరియు మనస్సులను ఆశ్రయించుకొని అంటే వీటన్నింటి సహాయంతో విషయాల ఆస్వాదం చేస్తుంది. కానీ అలాగని అనిపించదు. అందరూ అలాగని చూడలేరు. దీనిని గూర్చి శ్రీకృష్ణుడు అంటాడు–

శ్లో ॥ ఉత్క్రామంతం స్థితం వాపి భుంజానం వా గుణాన్వితమ్ ।
విమూఢా నాను పశ్యంతి పశ్యంతి జ్ఞాన చక్షుషః ॥10॥

శరీరాన్ని వదలి వెడుతూ, శరీరంలో ఉంటూ, విషయాలను అనుభవించుతూ లేక మూడు గుణాలతో యుక్తమై ఉంటూ కూడా జీవాత్మను ముఖ్యంగా మూఢులూ, అజ్ఞానులూ తెలుసుకోలేరు. కేవలం జ్ఞానమనెడి నేత్రాలు గలవారే దాని గురించి తెలుసుకుంటారు. దానిని చూస్తారు. ఇప్పుడు ఆ దృష్టి దొరికేదెలా? ముందుకు చూద్దాం.

శ్లో ॥ యతంతో యోగినశ్చైనం పశ్యంత్యాత్మన్యవస్థితమ్ ।
యతంతోఽప్యకృతాత్మానో నైనం పశ్యంత్య చేతస ః ॥11॥

యోగులు తమ హృదయంలో, చిత్తాన్ని అన్ని వైపుల నుంచి ఏకం చేసి, ఈ ఆత్మకై అన్వేషిస్తూ ప్రత్యక్షంగా దానిని చూస్తారు, కానీ 'అకృతాత్మ' గలవారు అంటే మలినమైన అంతః కరణం గలవారు, అజ్ఞానులు ప్రయత్నం చేసి కూడా ఈ ఆత్మను తెలుసుకోలేరు. (ఎందుకంటే వారి అంతః కరణం బయటి ప్రవృత్తులలో చిక్కుబడి ఉంది) చిత్తాన్ని అన్ని వైపుల నుంచి కూడ గట్టుకొని అంతరాత్మలో ప్రయత్నం చేయు భావికులే, దానిని పొందడానికి యోగ్యులు. కాబట్టి అంతః కరణం ద్వారా స్మరణ అవసరమయినది. ఇప్పుడు ఆ మహా పురుషుల స్వరూపంలో ఉన్న విభూతులను (వీటి గురించి, వెనుక చెప్పడమయింది) గూర్చి వివరణ ఇస్తాడు.

శ్లో ॥ యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఖిలమ్ ।
యచ్చంద్ర మసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్ ॥12॥

ఏ తేజమైతే సూర్యునిలో ఉంటూ సంపూర్ణ జగత్తును ప్రకాశింప చేస్తోందో, ఏ తేజమైతే చంద్రునిలో ఉందో మరియు ఏ తేజమైతే అగ్నిలో ఉందో, దానిని నువ్వు నాదిగానే తెలుసుకో. ఇప్పుడు మహాపురుషుని ద్వారా చేయబడే పనిని గురించి చెబుతాడు.

శ్లో ॥ గామావిశ్య చ భూతాని ధారయామ్యహ మో జసా ।
పుష్ణామి చౌషధీః సర్వాః సోమో భూత్వా రసాత్మకః ॥13॥

నేనే పృథ్విలో ప్రవేశించి నా శక్తితో భూతాలన్నింటినీ ధరిస్తాను. మరియు చంద్రునిలో రసస్వరూపుడనై అన్ని చెట్లనూ బలపరుస్తాను.

శ్లో ॥ అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః ।
ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్ ॥14॥

నేనే ప్రాణుల శరీరంలో అగ్ని రూపంలో ఉండి ప్రాణాపానాలచే యుక్తమైన నాలుగు రకాల అన్నాలను స్వీకరిస్తాను. నాలుగో అధ్యాయంలో స్వయంగా యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు ఇంద్రియాగ్ని, సంయమాగ్ని, యోగాగ్ని, ప్రాణ అపానాగ్నులు, బ్రహ్మాగ్ని, మొదలగు పదమూడు – పద్నాలుగు అగ్నులను గురించి చెప్పాడు. వాటన్నింటి పరిణామం జ్ఞానం. జ్ఞానమే అగ్ని. శ్రీకృష్ణుడు అంటాడు–అలాంటి అగ్ని స్వరూపమై, ప్రాణాపానాలచే యుక్తమైన నాలుగు విధులచే (జపం ఎల్లప్పుడు శ్వాస–ప్రశ్వాసలతో జరుగుతుంది. దానికి వైఖరీ, మధ్యమా, పశ్యంతీ, పరా అనే నాలుగు విధులచే) తయారయ్యే అన్నాలను నేను జీర్ణింపజేస్తాను. శ్రీకృష్ణుడి దృష్టిలో బ్రహ్మయే ఒక అన్నం. దాని వలన ఆత్మ తృప్తి పొందుతుంది, మరింకెప్పుడూ అతృప్తిని అనుభవించదు. శరీరం పోషణకై ప్రచలితమైన అన్నాలకు యోగేశ్వరుడు ఆహార (యుక్తాహార) సంజ్ఞను ఇచ్చాడు. వాస్తవికమైన అన్నం పరమాత్ముడే. వైఖరీ, మధ్యమ, పశ్యంతి మరియు పరా అనే నాలుగు విధుల గుండా వెలువడి ఆ అన్నం పరిపక్వమవుతుంది. దీనినే అనేక మంది మహాపురుషులు, నామం, రూపం, లీల మరియు ధామం అని కూడా అన్నారు. మొదట నామం జపం చేయబడుతుంది. క్రమంగా హృదయ దేశంలో ఇష్టదైవ స్వరూపం వ్యక్తం కావడం మొదలవుతుంది. దాని తరువాత అతని లీలలు బోధపడటం మొదలవుతుంది– ఆ ఈశ్వరుడు ఏ రకంగా అణువు అణువులో వ్యాపించి వున్నాడు? ఏ రకంగా అతను సర్వత్రా పని చేస్తాడు? ఈ రకంగా హృదయ దేశంలో క్రియా కలాపాల దర్శనమే లీల అంటే (బయట లభించే రామలీల రాసలీలలు కావు) మరియు ఆ ఈశ్వరీయ లీలల ప్రత్యక్ష – అనుభూతి పొందుతూ, ఎప్పుడైతే మూలమైన లీలాధారుని స్పృశించడం జరుగుతుందో, అప్పుడు ధామం అనే స్థితి వస్తుంది. అందులో ప్రతిష్ఠింపబడటం మరియు పరావాణి యొక్క పరిపక్వావస్థలో పరబ్రహ్మ యొక్క స్పర్శ చేసి, అతనిలో స్థితుడవ్వటం, రెండూ ఒకేసారి జరుగుతాయి.

ఈ రకంగా ప్రాణాపాన అంటే శ్వాసప్రశ్వాసలచే యుక్తమయి నాలుగు విధులచే అంటే వైఖరీ, మధ్యమ, పశ్యంతి క్రమముగా ఉత్థాన మవుతూ పరా పూర్తయ్యే కాలంలో, అన్నమైన ఆ బ్రహ్మ పరిపక్వమయి పోతాడు, దొరుకుతాడు కూడా, జీర్ణం కూడా అవుతాడు. మరియు పాత్ర కూడా పరిపక్వమై ఉంటుంది.

శ్లో॥ సర్వస్య చాహం హృదిసన్ని విష్టో
మత్తః స్మృతి ర్జ్ఞాన మపోహనం చ।
వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో
వేదాంత కృద్వేదవి దేవ చాహమ్ ॥**15**॥

నేనే ప్రాణులందరి హృదయాలలో అంతర్యామిగా స్థితమై ఉన్నాను. నా వలననే స్వరూపం యొక్క స్మృతి (ఏ పరమతత్వమయిన పరమాత్ముడు విస్మృతమయ్యాడో, అతని స్మరణ మరల రావడం) వస్తుంది. (ఇది ప్రాప్తి కాలం యొక్క చిత్రణ) స్మృతితో బాటుగా జ్ఞానం (సాక్షాత్కారం) మరియు 'అపోహనం' అంటే బాధల నుంచి విరామం, ఇదంతా ఇష్టదైవమైన నా వలననే జరుగుతుంది. అన్ని వేదాల ద్వారా తెలుసుకో యోగ్యమైన వాడను నేనే. వేదాంతం యొక్క కర్త అంటే 'వేదస్య అంతః వేదాంతః' (వేరుగా ఉండెను, అప్పుడే గదా తెలుసుకోవడమయింది. మరి తెలుసుకొంటూనే అదే స్వరూపంలో ప్రతిష్ఠితమై పోతే, ఎవరు ఎవరిని తెలుసుకోవాలి?) వేదాల అంతిమ స్థితి యొక్క కర్తను నేనే. 'వేదవిత్' కూడా నేనే అంటే వేదాల జ్ఞాతను : ఈ అధ్యాయం ఆరంభంలో అతను అన్నాడు–సంసారం ఒక వృక్షం. పైన పరమాత్ముడు వ్రేళ్ళు ; మరియు క్రింద ప్రకృతి పర్యంతం శాఖలు ఉన్నాయి. ఎవరైతే ఈ వ్రేళ్ళతో ప్రకృతిని విభజించి తెలుసుకొంటాడో, వ్రేళ్ళతో సహా తెలుసుకొంటాడో, అతను వేదవిత్తుడు. ఇక్కడ అంటాడు – 'నేను వేదవిత్తుడను'. శ్రీకృష్ణుడు కూడా తత్త్వజ్ఞుడైన ఒక మహాపురుషుడు. యోగులకు కూడా పరమయోగి. ఇక్కడితో ఈ ప్రశ్న పూర్తయింది. సంసారంలో పురుషుని స్వరూపం రెండు రకాలు అన్నదాన్ని గురించి చెప్తాడు.

శ్లో॥ ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవచ।
క్షర : సర్వాణి భూతాని కూట స్థోఽక్షరఉచ్యతే ॥**16**॥

అర్జునా! ఈ సంసారంలో 'క్షర' – క్షయమయ్యే, పరివర్తన పొందే మరియు 'అక్షర' అక్షయం, పరివర్తనంలేని, ఇలా రెండు రకాల పురుషులు ఉన్నారు. వారిలో భూతప్రాణుల శరీరాలన్నీ నశించేవే, క్షరపురుషులే, ఈ రోజు ఉంటారు, రేపు ఉండకపోవచ్చు మరియు, రెండవది ఆ కూటస్థ పురుషులు అవినశ్వరులనబడతారు. సాధన ద్వారా మనస్సుతో సహా ఇంద్రియాలు నిరోధించబడి, ఎవరి ఇంద్రియాల సమూహం కూటస్థ మయిందో, అతనే అక్షరమనబడతాడు. మీరు స్త్రీ అనబడినా, పురుషుడనబడినా, ఒక వేళ శరీరం మరియు శరీరం రూపొందటానికి కారణమైన సంస్కారాల క్రమం తగుల్కొని ఉన్నంత వరకూ మీరు క్షర పురుషులు మరియు ఎప్పుడైతే మనస్సు సహితంగా ఇంద్రియాలు కూటస్థమైనాయో అప్పుడు అతడే అక్షర పురుషుడు అనబడతాడు. కానీ అది కూడా పురుషుని యొక్క ఒక విశిష్ట దశ మాత్రమే. ఈ రెండింటి కంటే కూడా అతీతమైన ఇంకో పురుషుడు ఉన్నాడు.

శ్లో ॥ ఉత్తమ ః పురుషస్త్వస్య ః పరమాత్మేత్యుదాహృతః।
యో లోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః ॥17॥

ఈ ఇద్దరి కంటే అతి ఉత్తమ పురుషుడు వేరే ఉన్నాడు. అతను మూడులోకాల్లో ప్రవేశంచేసి అందరి పాలన – పోషణ చేస్తాడు. మరియు అతణ్ణి అవినశ్వరుడని, పరమాత్ముడని, ఈశ్వరుడని అనడమయింది. పరమాత్ముడు, అవ్యక్తుడు, అవినశ్వరుడు, పురుషోత్తముడు మొదలగునవి అతనిని పరిచయం చేసే పదాలు. వాస్తవానికి అతను అనిర్వచనీయుడు. ఇది క్షరం–అక్షరం కంటే అతీతమైన మహాపురుషుని అంతిమ దశ. పరమాత్ముడు అనే ఆ స్థితిలో యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు తన పరిచయాన్ని కూడా ఇస్తాడు. ఎలా అంటే.

శ్లో ॥ యస్మాత్క్షరమతీతోఽ హమక్షరాదపి చోత్తమః ।
అతో స్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః ॥18॥

నేను. పైన చెప్పబడిన నశించే, పరివర్తనమయ్యే క్షేత్రం కంటే, సర్వదా అతీతమైన వాణ్ణి. మరియు అక్షర – అవినశ్వర, కూటస్థ పురుషుని కంటే కూడా ఉత్తముణ్ణి. లోకంలో మరియు వేదాలలో పురుషోత్తముడనే పేరుతో ప్రసిద్ధమైన వాణ్ణి.

శ్లో ॥ యో మామేవ మసంమూఢో జానాతి పురుషోత్తమమ్।
స సర్వవిద్భజతి మాం సర్వభావేన భారత ॥19॥

హే భరతవంశీయుడా, పైన చెప్పబడిన జ్ఞానులయిన పురుషులు పురుషోత్తముడినయిన నన్ను సాక్షాత్తుగా తెలుసుకొంటారు. అలాంటి సర్వజ్ఞులయిన పురుషులు అన్ని రకాలుగా పరమాత్ముడనయిన నన్నే భజిస్తారు. అతడు నానుంచి వేరుగా లేడు.

శ్లో ॥ ఇతి గుహ్యతమం శాస్త్రమిదముక్తం మయానఘ ।
ఎ తద్బుద్ధ్వా బుద్ధిమాన స్యాత్కృత కృత్యశ్చ భారత ॥20॥

హే నిష్పాపుడైన అర్జునా! ఈ ప్రకారంగా ఈ అతి గోపనీయమైన శాస్త్రం నాచే చెప్పబడింది. దీనిని తత్వంతో సహా తెలుసుకొన్న మనుష్యుడు పూర్ణ జ్ఞాని, కృతార్థుడు అయిపోతాడు. కాబట్టి యోగేశ్వరుడైన శ్రీకృష్ణుని వాక్కులు స్వయంగా ఒక పరిపూర్ణమయిన శాస్త్రం.

శ్రీ కృష్ణుడు చెప్పిన ఈ రహస్యం అత్యంత గుప్తంగా ఉన్నది. అతను కేవలం అనురాగం గలవారికి చెప్పాడు. ఇది యోగ్యులయినవారి కోసమే. అందరి కోసం కాదు, కానీ ఇదే రహస్యం (శాస్త్రం) లిపి బద్ధం చేయబడితే అందరి ఎదురుగా పుస్తక రూపంలో ఉంటుంది, కాబట్టి శ్రీకృష్ణుడు అందరికి చెప్పినట్లుగా అనిపిస్తుంది. కానీ వాస్తవానికి ఇది యోగ్యులకై చెప్పబడింది. శ్రీకృష్ణుని ఈ స్వరూపం అందరికోసం కాదు కూడా. కొందరు అతనిని రాజుగాను, కొందరు దూతగాను మరి ఇంకొందరు యాదవునిగాను భావించేవారు, కానీ అధికారుడయిన (పాత్రుడయిన) అర్జునుడి నుండి అతనేమీ దాచి ఉంచలేదు. అతను కనుగొన్న దేమిటంటే తను (కృష్ణుడు) పరమ సత్యమయిన పురుషోత్తముడని. దాచి పెట్టి ఉంచితే అతనికి మేలే జరిగేది కాదు.

ఇదే విశిష్ఠత బ్రహ్మప్రాప్తి పొందిన ప్రతి మహాపురుషునిలోనూ కనిపిస్తుంది. రామకృష్ణ పరమహంస ఒకసారి చాలా ప్రసన్నంగా ఉన్నారు. భక్తులు అడిగారు-'ఈ రోజు మీరు ఇంత ప్రసన్నంగా ఉన్నారేమిటి?, అని, అతను అన్నాడు-''ఈ రోజు నేను 'ఆ' పరమహంసనయిపోయాను.'' ఆయన సమకాలీనుడు ఎవరో మంచి మహాపురుషుడు పరమహంస ఉండేవారు. అతనివైపు సంకేతం చేస్తూ ఇలా అన్నారు. కొంత సేపయిన తరువాత మనోవాక్కాయాల పట్ల విరక్తి ఆశతో వెనుకనున్న సాధకులతో అన్నాడు-'చూడు, ఇప్పుడు మీరు సందేహించ కూడదు, ''నేనే, త్రేతాయుగంలో అవతరించిన రాముణ్ణి. ద్వాపరంలో అవతరించిన కృష్ణుణ్ణి, నేను వారి పవిత్ర ఆత్మనే, అదే స్వరూపాన్ని, బ్రహ్మప్రాప్తి పొందాలనుకుంటే నన్ను చూడు.

సరిగ్గా ఇదే ప్రకారంగా 'పూజ్య గురువుగారు'' కూడా అందరి ఎదురుగా అనేవారు, ''ఓహో, నేను భగవంతుడి దూతను. ఎవరైతే అసలైన సాధువో, అతను భగవంతుడి దూతే. మాద్వారానే అతని (పరామాత్ముని) సందేశం దొరుకుతుంది''. యేసు ప్రభువు అన్నాడు- ''నేను భగవంతుడి పుత్రుణ్ణి, నాదరికి రమ్ము''-ఎందుకంటే ఈశ్వరుడి పుత్రుడనబడుదువు. కాబట్టి అందరూ పుత్రులవవచ్చు. దగ్గరకూ రా అంటే తాత్పర్యం అతని వరకు సాధన, సాధనా క్రమంలో నడుస్తూ పూర్తి చేయడం. మహమ్మదు సాహెబు అన్నాడు-''నేను అల్లా యొక్క సందేశవాహకుడను''. ''పూజ్య గురువుగారు'' అందరితో ఇలాగే అనేవారు-''ఏ విచారానికి ఖండన, మండన లేదు''. కానీ ఏ విరక్తులయితే వెంటబడేవారో, వారితో అనేవారు-''కేవలం నా స్వరూపాన్నే చూడు. నీకు ఆ పరమతత్వాన్ని పొందాలనే కోరిక ఉంటే నన్ను చూడు, సందేహించకు'' చాలా మంది సందేహించారు. అలాంటి వారికి అనుభవంలో చూపించి, తిట్టీ-కొట్టీ ఆ బాహ్య ఆలోచనల నుంచి తప్పించి, (వాటిలో యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు చెప్పినట్లుగా (అధ్యాయం-2/40-43) అనంత పూజా పద్ధతులను) తమ స్వరూపాన్ని పట్టించారు. వారు నేటి వరకూ మహాపురుషుని రూపంలో అవస్థితులై ఉన్నారు. ఇదే ప్రకారంగా శ్రీకృష్ణుడి స్థితి గోపనీయమైనదే. కానీ తన అనన్యభక్తుడు, పూర్ణ అధికారి, అనురాగి అయిన అర్జునుడి పట్ల అతను దానిని ప్రకాశింపచేశాడు. ప్రతి భకుడికీ అది సాధ్యమే. మహా పురుషుడు లక్షల మందిని ఆ దారిలో నడిపించగలడు.

సారంశం:

ఈ అధ్యాయం ఆరంభంలో యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు ఇలా చెప్పాడు- సంసారం ఒక వృక్షం. రావి చెట్టులాంటి వృక్షం. రావి చెట్టు ఒక ఉదాహరణ మాత్రమే. పైన దీని వ్రేళ్ళు పరమాత్ముడు. మరి క్రింద ప్రకృతి పర్యంతం దీని శాఖలు-ఉపశాఖలు ఉన్నాయి. ఎవరైతే ఈ వృక్షాన్ని వ్రేళ్లతో సహా అర్థం చేసేసుకొంటాడో, అతను వేదాల జ్ఞాత. ఈ సంసార వృక్షం శాఖలు పైన, క్రింద సర్వత్రా వ్యాప్తి చెంది ఉన్నాయి. మరియు 'మూలాన్ని' దీని వేళ్లు కూడా పైన, క్రింద సర్వత్రా వ్యాపించి ఉన్నాయి, ఎందుకంటే ఆ వేళ్ళు ఈశ్వరుడు, మరియు అతనే బీజ రూపంగా ప్రతి జీవుని హృదయంలో నివసించుతున్నాడు.

పౌరాణిక కథ ఏమిటంటే, ఒకసారి కమలంపైకూర్చున్న బ్రహ్మ ఇలా అనుకున్నాడు–''నా ఉద్గమం ఎక్కడ్నుంచి?'' ఎక్కడనుంచైతే అతను పుట్టాడో, ఆ కమలం యొక్క కాండంలో ప్రవేశించుతూ వెళ్ళిపోయాడు. అనవరతంగా వెళుతూనే ఉన్నాడు, కానీ తన ఉద్గమస్థానం కనిపించలేదు. అప్పుడు హతాశుడయి అతను అదే కమలం యొక్క ఆసనంపైన కూర్చుండిపోయాడు. చిత్తాన్ని నిరోధించడం మొదలు పెట్టాడు. మరియు ధ్యానం ద్వారా అతను తనమూల ఉద్గమాన్ని చూడగలిగాడు. పరమతత్త్వం యొక్క సాక్షాత్కారం అయింది, స్తుతించాడు. పరమస్వరూపం నుంచి ఆదేశం లభించింది–''నేను సర్వత్రా ఉన్నాను, కానీ నన్ను పొందే స్థానం హృదయం మాత్రమే. హృదయదేశంలో ఎవరైతే ధ్యానం చేస్తారో, అతను నన్ను పొందుతాడు.

బ్రహ్మ ఒక ప్రతీక మాత్రమే. యోగ సాధన యొక్క ఒక పరిపక్వ దశలో ఈస్థితి జాగృతమవుతుంది. ఈశ్వరుని వైపు ఉన్ముఖమై బ్రహ్మవిద్యతో సంయుక్తమైన బుద్ధే బ్రహ్మ. కమలం నీటిలో వుంటూ కూడా నిర్మలంగానూ నిర్లిప్తంగానూ ఉంటుంది. బుద్ధి ఎప్పటి వరకు ఇక్కడ, అక్కడ వెతుకుతూ ఉంటుందో, అప్పటి వరకు అది లక్ష్యాన్ని పొందదు. ఎప్పుడయితే ఈ బుద్ధి నిర్మలత్వమనే ఆసనం పై ఆసీనమై, మనస్సహితంగా ఇంద్రియాలను కూడ గట్టుకొని హృదయ దేశంలో నిరోధించుతుందో, మరియు ఆ నిరోధించినది, కూడా విలీనీ కరణమయ్యే దశలో తన హృదయంలోనే పరమాత్మను పొందుతుంది.

ఇక్కడ యోగేశ్వరుడైన శ్రీకృష్ణుని మాటలలో సంసారం ఒక వృక్షం, దాని వేళ్ళు సర్వత్రా వ్యాపించియున్నాయి. మరియు శాఖలు కూడా సర్వత్రా ఉన్నాయి. 'కర్మాను బంధీని మనుష్యలోకే' కర్మల అనుసారంగా కేవలం మనుష్య జన్మలో బంధాల్ని తయారు చేస్తాయి. బంధించుతాయి. అన్య జన్మలు ఈ కర్మల అనుసారంగా భోగాలను అనుభవించుతాయి. కాబట్టి ధృఢవైరాగ్యమనే ఆయుధం ద్వారా ఈ సంసారమనే రావి చెట్టును నువ్వు నరికివేయి. ఆ పరమపదాన్ని వెతుకు. దానిలోకి వెళ్ళిన మహార్షులు పునర్జన్మను పొందరు.

సంసార వృక్షం నరికివేయబడిందని ఎలా తెలుస్తుంది? యోగేశ్వరుడు అంటాడు–ఎవరైతే సమ్మానం మరియు మోహాలచే సర్వదా రహితుడో, ఎవరైతే సంగదోషాన్ని గెలిచాడో, ఎవరి కోరికలు నివృత్తమయిపోయాయో మరియు ఎవరైతే ద్వంద్వాల నుంచి విముక్తుడై పోయాడో, ఆ పురుషుడు ఆ పరమ తత్వాన్ని పొందుతాడు. ఆ పరమ పదాన్ని సూర్యుడుగానీ, చంద్రుడు గానీ లేక అగ్ని గానీ ప్రకాశింప చేయలేరు. అది స్వయం ప్రకాశ రూపం. దానిలోకి వెళ్ళినవారు వెనుకకు తిరిగిరారు, అది నా పరంధామము. దానిని పొందే అధికారం అందరికీ ఉంది. ఎందుకంటే ఈ జీవాత్మ నా యొక్క శుద్ధమైన అంశం.

శరీరాన్ని త్యాగంచేసే సమయంలో జీవాత్మ మనస్సు మరియు పంచజ్ఞానేంద్రియాల కార్య కలాపాలను వెంట తీసుకొని క్రొత్త శరీరాన్ని ధరించుతుంది. సంస్కారం సాత్వికమైనదయితే సాత్వికస్థాయిని చేరుతుంది, రాజసమయితే మధ్య స్థానాన్ని మరియు తామసికం అయితే

అధమ జన్మలకు చేరుకుంటుంది. మరియు ఇంద్రియాలకు అదిష్ఠాత అయిన మనస్సు ద్వారా విషయాలను చూస్తుంది, అనుభవిస్తుంది. ఇది చూడనలవి కానిది, దీనిని చూడటానికి సాధనం జ్ఞానమే. ఏదో ఒకటి గుర్తుంచుకోవడం జ్ఞానం కాదు. యోగులు హృదయంతో చిత్తాన్ని కూడ గట్టుకొని ప్రయత్నం చేస్తేనే దానిని చూడగలుగుతారు. కాబట్టి జ్ఞానం సాధన గమ్యమయింది. అధ్యయనం వలన దాని పట్ల ఆసక్తి ఉత్పన్నమవుతుంది. సంశయ యుక్తుడయిన, అకృతాత్ములు ప్రయత్నం చేస్తూ కూడా, దానిని పొందలేరు.

ఇక్కడ ముక్తి పొందు స్థానం వర్ణించబడింది. కాబట్టి ఆ దశలో విభూతుల ప్రవాహం స్వాభావికం. వానిని వివరించుచూ యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు అంటాడు– సూర్యుడు మరియు చంద్రుడిలోని తేజాన్ని నేను, అగ్నిలో తేజాన్ని నేనే, నేనే ప్రచండ అగ్ని రూపంలో నాలుగు రకాలుగా పరిపక్వమయ్యే అన్నాన్ని స్వీకరిస్తాను. శ్రీకృష్ణుడి మాటల్లో అన్నం అంటే ఏకైక పరబ్రహ్మ, ('అన్నం బ్రహ్మ వ్యజానాత్' తైత్తిరీయ ఉపనిషత్తు 2/1) దానిని పొంది ఈ ఆత్మ తృప్తి పొందుతుంది. వైఖరీ నుంచి పరా వరకు అన్నం పరిపక్వమయి జీర్ణమవుతుంది. ఆ పాత్ర కూడా అంతరించి పోతుంది. ఈ అన్నాన్ని నేనే జీర్ణింపజేస్తాను. అంటే సద్గురువు ఎప్పటి వరకు రథుడుకాడో, అప్పటి వరకు ఇది లభించదు.

దీనిని గూర్చి నొక్కి చెప్తూ, యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు మళ్ళీ అంటాడు–సమస్త ప్రాణుల అంతర్దేశంలో స్థితుడనయి ఉంటూ నేనే స్మృతిని ఇప్పిస్తాను. ఏ స్వరూపం విస్మృతం కాబడిందో, దాన్ని తిరిగి స్మృతిలోకి తెస్తాను. స్మృతితో బాటు దొరికే జ్ఞానం కూడా నేనే. దానిలో వచ్చే బాధల నివారణ కూడా నావలననే జరుగుతుంది. తెలిసికొన యోగ్యమయిన వాడను నేనేనని తెలుసుకో. మరియు విదితమయి పోయిన తరువాత జ్ఞానం యొక్క అంతఃకర్తను కూడా నేనే. ఎవరు ఎవరిని తెలుసుకోవాలి? నేను వేదవిదుడను. ఈ ఆధ్యాయం ఆరంభంలో ఇలా అన్నాడు–ఎవరైతే సంసార వృక్షాన్ని వేళ్ళతో సహా తెలుసుకుంటాడో, అతను వేదవిదుడు, కానీ దానిని నరికే వాడే తెలుసుకోగలడు. ఇక్కడ అంటాడు–నేను కూడా వేదవిదుడనే. వేద విదులలో తనని కూడా లెక్కించుకుంటాడు. కాబట్టి శ్రీకృష్ణుడు కూడా వేదవిదుడైన పురుషోత్తముడే, అతన్ని పొందు అధికారం మానవ మాత్రులకు ఉంది.

చివరిలో అతను అన్నాడు – లోకంలో మూడు రకాల పురుషులు ఉన్నారు. భూతాదుల సంపూర్ణ శరీరాలు క్షరం (నశించేవి), మనస్సు యొక్క కూటస్థ అవస్థను పొందిన పురుషుడు అక్షరుడు, కానీ ద్వంద్వాత్మకుడై ఉంటాడు, మరియు దీనికంటే కూడా అతీతంగా ఏ పరమాత్మ–పరమేశ్వరుడు, అవ్యక్తుడు మరియు అవినశ్వరుడు అనబడే అది వాస్తవానికి వేరైనది. ఇది క్షర–అక్షరం కంటే అతీతమయిన దశ, ఇదే పరమస్థితి.

దీనితో పోల్చుకుంటూ అంటాడు–నేను కూడా క్షర–అక్షరాల కంటే అతీతమైన వాడిని. కాబట్టి లోకులు నన్ను పురుషోత్తముడంటారు. ఈ ప్రకారంగా ఉత్తమ పురుషుణ్ణి ఎవరైతే తెలుసుకుంటారో, జ్ఞానులైన ఆ భక్తులు ఎల్లప్పుడూ, అన్ని వేళల నా భజనే చేస్తారు. వారి జ్ఞానంలో తేడా లేదు. అర్జునా! ఈ అత్యంత గోపనీయమైన రహస్యాన్ని నేను నీ కొరకు

చెప్పాను. ముక్తి పొందిన మహా పురుషులు అందరికీ చెప్పరు. కానీ అధికారుల (యోగ్యుల) నుండి దాచరు కూడా. దాచి ఉంచితే, వారు ఎలా పొందుతారు?

ఈ ఆధ్యాయంలో ఆత్మ యొక్క మూడు స్థితులు, క్షరం, అక్షరం మరియు అతి ఉత్తమ పురుషుని రూపంలో స్పష్టం చేయబడ్డాయి. ఇలా ఇంతకు ముందు ఏ అధ్యాయంలోనూ లేదు.

*ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మ విద్యాయాం యోగశాస్త్ర శ్రీకృష్ణార్జున సంవాదే 'పురుషోత్తమ యోగో' నామ*
*పంచదశోఽధ్యాయ॥ 15*

ఈ ప్రకారంగా శ్రీమద్భగవద్గీతా అనెడి ఉపనిషత్తు మరియు బ్రహ్మ విద్య మరియు యోగశాస్త్రమనే విషయంలో శ్రీకృష్ణుడు మరియు అర్జునుడి సంవాదంలో 'పురుషోత్తమ యోగం' అనే పేరుగల పదిహేనవ అధ్యాయం పూర్తి అయింది.

*ఇతి శ్రీమత్పరమహంస పరమానందస్య శిష్య స్వామీ అడగడానందకృతే శ్రీమద్‌భగవద్‌గీతా యాః- 'యాథార్థ గీతా' భాష్యే 'పురుషోత్తమ యోగో' నామ*
*పంచదశోధ్యాయః ॥ 15*

ఈ ప్రకారంగా శ్రీమత్పరమహంస పరమానంద గారి శిష్యుడు స్వామి అడగడానంద గారిచే రచించబడిన శ్రీమద్‌భగవద్ గీత యొక్క భాష్యం 'యథార్థగీత'లో పురుషోత్తమ యోగం అనే పేరుగల పదిహేనవ అధాయం పూర్తి అయింది.

*॥ హరిః ఓం తత్సత్ ॥*

ૐ

శ్రీ పరమాత్మనే నమః

# షోడశ అధ్యాయము

యోగేశ్వరుడైన భగవాన్ శ్రీకృష్ణుడికి ఒక విషయాన్ని ప్రస్తుతీకరించడానికి తనదంటూ ఒక విశిష్టమైన శైలిఉంది. మొదట అతను విశిష్టతలను గురించి చెబుతాడు. దాని వలన పురుషుడు దాని పట్ల ఆసక్తుడవుతాడు. దాని తరువాత అతను ఆ ప్రకరణాన్ని స్పష్టం చేస్తాడు. ఉదాహరణకై కర్మను తీసుకోండి. అతను రెండో అధ్యాయంలోనే ప్రేరణ కలిగించాడు-అర్జునా! కర్మ చెయ్యి. నిర్ధారితమైన కర్మ ఏమిటి? అంటే అన్నాడు-యజ్ఞం యొక్క ప్రక్రియే కర్మ. అప్పుడు అతను యజ్ఞ స్వరూపాన్ని గురించి చెప్పకుండా మొదట ఏంచెప్పాడంటే-యజ్ఞం ఎక్కడి నుంచి వచ్చింది? మరియు ఏమి ఇస్తుంది? అని. నాలుగో అధ్యాయంలో పదమూడు -పదునాలుగు విధి-విధానాలతో యజ్ఞం యొక్క స్వరూపాన్ని స్పష్టం చేసాడు. దానిని చేయడమే కర్మ. ఇక్కడ కర్మ స్వరూపం స్పష్టమవుతుంది, దాని అసలైన అర్థం-యోగచింతన, ఆరాధన అది మనస్సు, ఇంద్రియాల క్రియలచే ఆచరణలోకి వస్తుంది.

ఇదే ప్రకారంగా అతను తొమ్మిదో అధ్యాయంలో దైవీ మరియు ఆసురీ సంపదల పేర్లు మాత్రం చెప్పాడు. వాటి విశిష్టతలను గూర్చి చెప్పాడు అర్జునా! ఆసురీ స్వభావం కలవారు నన్ను తచ్ఛుడని అంటారు. నేను కూడా మనుష్య శరీరంపై ఆధారపడి ఉండేవాడినే, ఎందుకంటే మనుష్య శరీరంలోనే నాకు ఈస్థితి లభించింది. కానీ ఆసురీ స్వభావం కలవారు, మూఢ స్వభావం గలవారవుతారు. నా భజన చేయరు. అలా కాకుండా దైవీ సంపదతో యుక్తులైన భక్తులు అనన్య శ్రద్ధతో నన్ను ఉపాసించుతారు. కానీ ఈ సంపదల స్వరూపం గానీ, అవి సంఘటితమవ్వడం గురించి గానీ యిప్పటివరకూ చెప్పలేదు. ఇప్పుడు పదహారో అధ్యాయంలో యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు వాటిని స్పష్టం చేయబోతున్నాడు. మొదట దైవీ సంపద లక్షణాలు ప్రస్తుతీకరించాడు.

శ్రీభగవానువాచ-

శ్లో ॥ అభయం సత్త్వసంశుద్ధిర్జ్ఞాన యోగవ్య వస్థితిః ।
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయస్తప ఆర్జవమ్ ॥**1**॥

ఎప్పటికీ భయం లేకపోవడం, అంతః కరణం యొక్క శుద్ధత్వం, తత్త్వజ్ఞానం కోసం ధ్యానంలో దృఢమైన స్థితి, లేక నిరంతర శ్రద్ధ, సర్వస్వ సమర్పణ, ఇంద్రియాల నియంత్రణ, యజ్ఞ ఆచరణ (స్వయంగా శ్రీకృష్ణుడు నాలుగో అధ్యాయంలో చెప్పాడు సంయమాగ్నిలో ఆహుతి మరియు ఇంద్రియాగ్నిలో ఆహుతి, ప్రాణాపానాలలో ఆహుతి మరియు చివరిలో జ్ఞానాగ్నిలో ఆహుతి అంటే ఆరాధన ప్రక్రియ. అది మనస్సు మరియు ఇంద్రియాల ఆంతరిక క్రియలచే నిర్వహింపబడుతుంది. నువ్వులు, అక్షింతలు, వేదిక మొదలగు సామగ్రులచే చేయబడు యజ్ఞానికీ గీతలో చెప్పిన యజ్ఞానికి ఎలాంటి సంబంధమూ లేదు. శ్రీకృష్ణుడు ఇలాంటి కర్మకాండల్ని యజ్ఞంగా భావించలేదు) స్వాధ్యాయం అంటే స్వ-స్వరూపంవైపు పురోగమింపచేసే అధ్యయనం. తపస్సు అంటే మనస్సహితంగా ఇంద్రియాలను ఇష్టదైవానికి అనుగుణంగా మార్చుకోవడం. 'అర్జవం' శరీరం మరియు ఇంద్రియాలతో సహా అంతః కరణం యొక్క సరళత్వం.

శ్లో ॥ అహింసా సత్యమక్రోధస్త్యాగః శాంతిరపై శునమ్ ।
దయా భూతేష్య లోలుప్త్వం మార్దవం హ్రీరచాపలమ్ ॥**2**॥

అహింస అంటే ఆత్మను ఉద్ధరించడం (ఆత్మను అధోగతిలోకి పంపడమే హింస శ్రీకృష్ణుడు అంటాడు- నేను గనుక సావధానుడనై కర్మలో వ్యవహరించకపోతే, ఈ సమస్త ప్రజలను చంపినవాడనవుతాను. మరియు వర్ణ సంకరానికి కర్త నవుతాను. ఆత్మ యొక్క అసలైన వర్ణం (రూపం) పరమాత్మ. అది ప్రకృతిలో సంచరించడమే వర్ణ సంకరం. అదే ఆత్మ యొక్క హింస. మరియు ఆత్మ యొక్క ఉద్ధారమే అహింస). సత్యం (సత్యం అంటే అర్థం యథార్థం మరియు ప్రియ భాషణం అని కాదు. మీరంటారు- ఈ వస్త్రం మాది' అని అంటే, మీరు సత్యం చెబుతున్నారా? దీనికంటే పెద్ద అబద్ధం ఇంకేది? శరీరమే మీది కానప్పుడు, నశించే దయినప్పుడు, దీనిని కప్పే వస్త్రం మీదెలా అయింది? వాస్తవానికి సత్యం యొక్క స్వరూపాన్ని గురించి యోగేశ్వరుడు స్వయంగా ఇలా చెప్పాడు- అర్జునా! సత్య వస్తువుకు మూడు కాలాలలోనూ లోటు లేదు. ఈ ఆత్మే సత్యం ఇదే పరమ సత్యం- ఈ సత్యంపైనే దృష్టి ఉంచు). క్రోధం కలగక పోవడం, సర్వస్వ సమర్పణ, శుభాశుభ కర్మ ఫలాల త్యాగం, ఎప్పుడూ చిత్త చాంచల్యం లేక పోవడం, లక్ష్యానికి విపరీతంగా నిందిత కార్యాలు చేయక పోవడం, సమస్త ప్రాణుల పట్ల దయాభావం, ఇంద్రియాల విషయాలతో సంయోగం అయినప్పుడు కూడా వాటిలో ఆసక్తి లేక పోవడం, కోమలత్వం, తమ లక్ష్యం నుంచి విముఖులవడంచే సిగ్గు పడడం, వ్యర్థపు చేష్టలు లేక పోవడం మరియు

శ్లో ॥ తేజః క్షమా ధృతిః శౌచమద్రోహో నాతి మానితా ।
భవంతి సంపదం దైవీ మభిజాతస్య భారత ॥**3**॥

తేజస్సు (కేవలం ఈశ్వరునిలో ఉంది, అతని తేజస్సుతోనే కార్యాలు జరుగుతాయి.

బుద్ధమహాత్ముని దృష్టి పడుతూనే అంగులీమాలుని ఆలోచనలు మారి పోయాయి. ఇది ఆ తేజస్సు పరిణామం, ప్రభావం దాని వలన మేలు జరుగుతుంది. ఆ తేజస్సు బుద్ధుడిలో ఉండేది). క్షమాగుణం, ధైర్యం, శుచి, ఎవరిపట్ల కూడా శత్రుభావం లేక పోవడం, తనను తాను పొగడుకొనే భావన లేకపోవడం ఇవన్నీ, హే అర్జునా! దైవీ సంపద పొందిన పురుషునిలో ఉంటాయి. ఈ ప్రకారంగా ఇర్వైపై ఆరు లక్షణాలు చెప్పాడు, ఇవన్నీ సాధనలో పరిపక్వ అవస్థలో ఉన్న పురుషునిలో సంభవమౌతాయి. మరియు ఆంశిక రూపంలో మీలో కూడా నిశ్చయంగా ఉన్నాయి. మరియు ఆసురీ సంపదతో ఆప్లావితులయిన మనుష్యులలో కూడా ఈ గుణాలు ఉన్నాయి, కానీ ప్రక్షిప్తంగా ఉంటాయి, అలాంటప్పుడే గదా ఘోర పాపికి కూడా మేలుపొందే అధికారంఉంది. ఇప్పుడు ఆసురీ సంపద యొక్క ప్రముఖమయిన లక్షణాలు చెప్పాడు–

శ్లో ॥ దంభో దర్పోऽభిమానశ్చ క్రోధః పారుష్యమేవచ ।
అజ్ఞానం చాభి జాతస్య పార్థ సంపదమాసురీమ్ ॥**4**॥

హే పార్థా!, ఆడంబరం, దర్పం, అభిమానం, క్రోదం, పరుషమైన వాక్కు మరియు అజ్ఞానం– ఇవన్నీ ఆసురీ సంపదను పొందిన పురుషుని లక్షణాలు. రెండు సంపదల పని ఏమిటి?

శ్లో ॥ దైవీ సంపద్వి మోక్షాయ నిబంధాయాసురీ మతా ।
మాశుచః సంపదం దైవీ మభిజాతోऽసి పాండవ ॥**5**॥

ఈ రెండు రకాల సంపదలలో దైవీ సంపద 'విమోక్షాయ'–విశేషమోక్షం కోసం అనీ, ఆసురీ సంపద బంధంకోసం అని చెప్పడమయింది. హే అర్జునా! దైవీ సంపదను పొంది ఉన్నావు గనుక నువ్వు శోకించకు. విశేషముక్తి పొందుతావు. అంటే నన్ను పొందుతావు. ఆసంపదలు ఎక్కడ ఉంటాయి?

శ్లో ॥ ద్వౌభూత సర్గౌ లోకేऽస్మిన్ దైవఆసుర ఏవ చ ।
దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ మే శృణు ॥**6**॥

హే అర్జునా! ఈ లోకంలో భూతాల స్వభావం రెండు రకాలుగా ఉంటుంది– దైవాలవలె మరియు అసురుల వలె, హృదయంలో దైవీ సంపద కార్య రూపంలోకి వచ్చినప్పుడు మనుష్యుడే దేవత. మరియు ఆసురీ సంపద బహుళంగా ఉన్నప్పుడు మనుష్యుడే అసురుడు. సృష్టిలో ఈ రెండే జాతులు ఉన్నాయి. అతను అరేబియాలో పుట్టినా సరే, లేక ఆస్ట్రేలియాలో, ఎక్కడ పుట్టినా సరే, నిశ్చయంగా ఈ రెండింటిలోంచే. ఇప్పటి వరకు దేవుళ్ళ యొక్క స్వభావమే విస్తారంగా చెప్పబడింది, ఇప్పుడు ఆసురుల స్వభావాన్ని విస్తార పూర్వకంగా విను.

శ్లో ॥ ప్రవృత్తిం చ నివృత్తించ జనా న విదురాసురాః ।
న శౌచం నా పి చాచారో న సత్యం తేషు విద్యతే ॥**7**॥

హే అర్జునా! అసురులకు 'కార్యంకర్మ'లో ప్రవృత్తులవడం మరియు అకర్తవ్య కార్యం నుంచి నివృత్తులవడం కూడా తెలీదు. కాబట్టి వారిలో శుచిత్వం, ఆచరణగానీ

మరియు సత్యంగానీ ఉండవు. ఆ పురుషుల ఆలోచనలు ఎలా ఉంటాయి?

శ్లో ॥ అసత్యమ ప్రతిష్ఠంతే జగదాహు రనీశ్వరమ్ ।
అపరస్పర సంభూతం కి మన్యత్కామ హైతుకమ్ ॥8॥

ఆసురీ ప్రకృతి గల ఆ మనుష్యులు ఇలా అంటారు–జగత్తు ఆశ్రయ రహితమయినది, ఎప్పటికీ అబద్ధమైనది, ఈశ్వరుడు లేకుండానే తనంత తానే, స్త్రీ పురుషుల సంయోగం వలన, ఉత్పన్నమయ్యేది. కాబట్టి కేవలం భోగాలను అనుభవించడానికే ఉంది. ఇది తప్ప ఇంకే ప్రయోజనముంది?

శ్లో ॥ ఏ తాం దృష్టి మవష్టభ్య నష్టాత్మానోऽ ల్ప బుద్ధయః ।
ప్రభవంత్యుగ్ర కర్మాణఃక్షయాయ జగతోऽ హితాః ॥9॥

ఈ మిథ్యా దృక్పథం మూలాన వినష్టమయి పోయిన స్వభావం గలవారు, మంద బుద్ధిగల, అపకారులు, క్రూర కర్మలు చేసే మనుష్యులు కేవలం జగత్తు యొక్క నాశనానికే ఉత్పన్నమయ్యారు.

శ్లో ॥ కామ మాశ్రిత్య దుష్పూరం దంభమాన మదాన్వి తాః ।
మో హాద్గృ హీత్వాऽసద్గ్రా హాన్ప్రవర్తంతేऽశుచివ్రతాః ॥10॥

ఆ మనుష్యులు డంబం, సమ్మానం మరియు మదం చేత యుక్తులయి, ఏ విధంగానయినా నెరవేరనటువంటి కోరికలను ఆశ్రయించి, అజ్ఞానం కారణంగా మిథ్యా సిద్ధాంతాలను గ్రహించి, అశుభ ప్రదాలూ, భ్రష్టమైనవ్రతాలచే యుక్తులయి, ప్రపంచంలో వ్యవహరిస్తారు. వారువ్రతాలు కూడా చేస్తారు, కానీ భ్రష్టమయినవి.

శ్లో ॥ చింతా మ పరిమేయాం చ ప్రలయాంతాము పాశ్రితా ।
కామోపభోగపరమా ఏతా వదితి నిశ్చితాః ॥11॥

వారు అంతిమ శ్వాస వరకూఅనంతమైన చింతలతో ఉంటారు. మరియు విషయాలను అనుభవించడంలో తత్పరులయినటువంటి వారు 'ఇంతే ఆనందం అంటే'– అలా అనుకొంటూ ఉంటారు. వారు అనుకొనే దేమిటంటే 'ఎంత వీలయితే అంత అనుభవించు, ఇంతకు మించి ఇంకేమీ లేదు.'

శ్లో ॥ ఆశాపాశశతైర్బద్ధాః కామక్రోధ పరయణాః ।
ఈ హంతే కామభోగార్థ మన్యాయేనార్థ సంచయాన్ ॥12॥

ఆశ అనే వందలాది ఉరిత్రాళ్ళతో (ఒక ఉరితోనే మనుష్యులు చనిపోతారు, యిక్కడ వంద ఉరిత్రాళ్ళు) బంధించ బడి ఉన్న, కామ–క్రోధ పరాయణులయిన, విషయాలను అనుభవించడానికై వారు అన్యాయంగా ధనం మొదలయిన చాలా పదార్థాలను కూడబెట్టు కొనేందుకు ప్రయత్నాలు చేస్తుంటారు. కాబట్టి ధనం కోసమై రాత్రిం బగళ్ళు వారు

అసామాజికమైన పనులు చేస్తూంటారు. ఇంకా అంటాడు-

శ్లో // ఇద మద్య మయా లబ్ధమిమం ప్రాప్స్యే మనోరథమ్ ।
ఇద మస్తీ దమపి మే భవిష్యతి పునర్ధనమ్ ॥ **13**॥

వారు 'నేను ఈ రోజు ఇది సంపాదించాను, ఈ మనో రథాన్ని నెరవేర్చుకుంటాను, నా వద్ద ప్రస్తుతం ఇంత ధనవుంది, అది ఇంత ఎక్కువ అయిపోతుంది అని అనుకొంటూ ఉంటారు.

శ్లో // అసామయా హతః శత్రుర్హనిష్యే చాపరానపి ।
ఈశ్వరోऽహమహం భోగీ సిద్ధోహం బలవాన్సుఖీ ॥ **14**॥

ఈ శత్రువు నా ద్వారా చంపబడ్డాడు, మరియు ఇతర శత్రువులను కూడా చంపుతాను. నేనే ఈశ్వరుణ్ణి మరియు ఐశ్వర్యాలను అనుభవించే వాడిని, నేనే సిద్ధులతో యుక్తమైన వాడిని; బలవంతుణ్ణి మరియు సుఖాలతో కూడి ఉన్నవాణ్ణి.

శ్లో // ఆఢ్యోऽభిజనవానస్మి కో/న్యోస్తి సదృశో మయా ।
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్య జ్ఞానవిమోహితాః ॥ **15**॥

నేనే ధనవంతుణ్ణి మరియు పెద్ద కుటుంబం గలవాడిని. నాతో సమానంగా ఇంకెవరున్నారు? నేను యజ్ఞం చేస్తాను. నేను దానం చేస్తాను, నాకు ఆనందం కలుగుతుంది- ఈ ప్రకారంగా అజ్ఞానంచే వారు విశేషంగా మోహితులయి ఉంటారు. యజ్ఞ దానాలు కూడా అజ్ఞానమేనా? దీనిని గురించి 17వ శ్లోకంలో స్పష్టం చేశాడు. ఇంతటితో వారు ఆగరు. అంతేగాక అనేక భ్రాంతులకు గురి అవుతారు. దీనిని గురించి అంటాడు-

శ్లో // అనేక చిత్త విభ్రాంతా మోహజాల సమావృతాః ।
ప్రసక్తాః కామభోగేషు పతంతి నరకేऽశుచౌ ॥ **16**॥

అనేక రకాలుగా భ్రమలకు లోనయిన చిత్తం గల, మోహజాలంలో చిక్కుకున్న, విషయానుభవాలలో అత్యంత ఆసక్తులయిన ఆసురీ స్వభావంగల ఆ మనుష్యులు అపవిత్రమైన నరకంలో పడిపోతారు. ఇక శ్రీకృష్ణుడు స్వయంగా నరకమేమిటన్నది చెప్తాడు.

శ్లో // ఆత్మ సంభావితాః స్తబ్ధా ధన మానమదాన్వితాః ।
యజంతే నామయజ్ఞైస్తే దంభేనా విధిపూర్వకమ్ ॥ **17**॥

తమకు తామే శ్రేష్ఠులమనుకొని, ధనం మరియు మానం యొక్క మదంచే యుక్తులయిన దర్పంగల ఆ మనుష్యులు శాస్త్ర విధిచే రహితమయిన, కేవలం నామ మాత్రపు యాజ్ఞాల ద్వారా ఆడంబరానికై పూజలు చేస్తారు. శ్రీకృష్ణుడు ఎలా చెప్పాడో అలాగే యజ్ఞం

చేస్తారా? అలా చేయరు, ఆ విధినివదలిపెట్టి చేస్తారు. ఎందుకంటే విధిని యోగేశ్వరుడు స్వయంగా చెప్పాడు (అధ్యాయం 4/24-33 మరియు అధ్యాయం 6/10-17)

శ్లో ॥ అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః ।
మామాత్మ పర దేహేషు ప్రద్విషంతోఽ భ్యసూయాకాః ॥**18**॥

ఇతరులను నిందించేవారు, అహంకారం, బలం, దర్పం, కోరికలు మరియు క్రోధాలలో నిమగ్నులైన పురుషులు, తమ శరీరంలో స్థితమయి ఉన్న అంతర్యామి పరమాత్మనయిన నన్ను ద్వేషిస్తారు. శాస్త్ర విధి ప్రకారం చేసే పరమాత్మస్మరణ ఒక యజ్ఞం. ఈ విధిని వదలి నామ మాత్రపు యజ్ఞం చేసేవారు, యజ్ఞం పేరిట ఏదో ఒకటి చేస్తూనే ఉండేవారు తమ శరీరంలో, ఇతరుల శరీరంలో స్థితుడై ఉన్న పరమాత్ముడయిన నన్ను ద్వేషించేవారే. లోకులు ద్వేషించుతూనే ఉంటారు. మరియు తప్పించుకుపోతారు కూడా. అంటే వీరు కూడా తప్పించుకపోతారా? దీనిని గూర్చి శ్రీకృష్ణుడు అంటాడు-తప్పించుకోరు.

శ్లో ॥ తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్ ।
క్షిపామ్యజ స్రమశుభానాసురీష్వేవ యోనిషు ॥**19**॥

నన్ను ద్వేషించే ఆ పాపాచారులను, క్రూరకర్మలు చేసే ఆ నరాధములకు నేను ప్రపంచంలో నిరంతరం ఆసురీ జన్మలే ఇస్తాను. శాస్త్ర విధిని వదిలేసి యజ్ఞం చేసే వారే పాప జన్ములు. వారే మనుష్యులలో అధములు; వీరినే క్రూర కర్మలు చేసే వారని కూడా అనబడింది. అన్యథా వేరే అథములు లేరు. ఇంతకు ముందు శ్రీకృష్ణుడు అన్నాడు-అలాంటి అధములను నేను నరకంలో పడేస్తాను. దానినే ఇక్కడ అంటాడు-వారికి ఎప్పటికీ ఆసురీ జన్మలే ఇస్తాను. ఇదే నరకం. మామూలు జైలు యాతనలే భయంకరంగా ఉంటాయి. మరి ఇక్కడ నిరంతరం ఆసురీ యోనులలో పడే క్రమం ఎంత దుఃఖ ప్రదమయిందో గదా! కాబట్టి దైవీ సంపద కోసం ప్రయత్న శీలురు కావలెను.

శ్లో ॥ ఆసురీం యోని మాపన్నా మూఢా జన్మని జన్మని ।
మామ ప్రాప్యైవ కౌంతేయ తతో యాంత్యధమాం గతిమ్ ॥**20**॥

కౌంతేయా! మూర్ఖులయిన మనుష్యులు జన్మ-జన్మాంతరాల వరకు ఆసురీ జన్మలను పొందుతూ, నన్ను పొందక, క్రమక్రమంగా అతి నీచమైన గతులను పొందుతారు. దాని పేరే నరకం. నరకం యొక్క ఉద్గమ మేమిటో ఇప్పుడు చూద్దాం.

శ్లో ॥ త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః ।
కామః క్రోధస్తథా లోభస్తస్మా దేత త్త్రయం త్యజేత్ ॥**21**॥

కామం, క్రోధం మరియు లోభం ఇవి మూడు రకాల నరకానికి మూలద్వారాలు.

ఇవి ఆత్మను నాశనం చేసి, దానిని అధోగతికి తీసుకెళ్ళేవి. కాబట్టి ఈ మూడింటిని విడిచి పెట్టాలి. ఈ మూడింటి మీదే ఆసురీ సంపద ఆధారపడి ఉంది. వీటిని వదలివేయడం వలన ఏమిటి లాభం?

శ్లో ॥ ఏతైర్విముక్తః కాంతేయ తమోద్వారైస్త్రిభిర్నరః ।
ఆచర త్యాత్మనః శ్రేయస్తతో యాతి పరాం గతిమ్ ॥**22**॥

కౌంతేయా! నరకంయొక్క ఈ మూడుద్వారాల నుంచి ముక్తుడయిన పురుషుడు తన పరమ కళ్యాణానికై ఆచరణ చేయగలుగుతాడు. దానివలన అతను పరమగతి అంటే నన్ను పొందుతాడు. ఈ మూడు వికారాలనూత్యాగం చేసినపుడే మనుష్యుడు నియత కర్మచేయగలడు. దాని పరిణామం పరమశ్రేయం.

శ్లో ॥ యః శాస్త్ర విధి ముత్సృజ్య వర్తతే కామకారతః ।
న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిమ్ ॥**23**॥

ఏ పురుషుడయితే పైన చెప్పబడిన శాస్త్ర విధిని త్యాగంచేసి (అంటే ఆ శాస్త్రం వేరే ఏదో కాదు 'ఇతి గుహ్యతమం శాస్త్రం' (15/20) గీత స్వయం సంపూర్ణమైన శాస్త్రం, శ్రీకృష్ణుడు స్వయంగా చెప్పిన విధిని విడిచేసి) తన ఇష్టం వచ్చినట్లుగా వ్యవహరించే పురుషుడు సిద్ధిని పొందడు, పరమగతిని గానీ, సుఖాన్ని గానీ పొందడు.

శ్లో ॥ తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ ।
జ్ఞాత్వా శాస్త్ర విధానోక్తం కర్మ కర్తు మిహార్హసి ॥**24**॥

కాబట్టి అర్జునా! నీ కోసం కర్తవ్యం మరియు అకర్తవ్యం అనే వ్యవస్థలో–'ఏం చెయ్యాలి, ఏం చేయకూడదు' అనే విధానంలో శాస్త్రమే ప్రమాణం. అలా తెలుసుకొని శాస్త్ర విధితో నియతమయిన కర్మయే చేయ తగినది. మూడో అధ్యాయంలోకూడా యోగేశ్వరుడు శ్రీకృష్ణుడు 'నియతం కురు కర్మత్వం' నియత కర్మను గూర్చి స్పష్టంగా ఇలా చెప్పాడు– యజ్ఞ ప్రక్రియే ఆ నియత కర్మ. ఆ యజ్ఞం ఆరాధన యొక్క విశిష్ట విధి; అది మనస్సును ఎప్పటికీ నిరోధించి, శాశ్వత బ్రహ్మలో ప్రవేశం ఇప్పిస్తుంది. ఇక్కడ అతను ఇలా అన్నాడు– కామం, క్రోధం మరియు లోభం అనేవి నరకానికి మూడు ప్రముఖ ద్వారాలు. ఈ మూడింటినీ విడిచి పెట్టినప్పుడే ఆ కర్మ యొక్క (నియత కర్మ యొక్క) ఆరంభం అవుతుంది. దీనినే నేను మళ్ళీమళ్ళీ చెప్పాను; ఇదే పరమ శ్రేయోదాయకమైన పరమ కళ్యాణాన్ని ఇప్పించే ఆచరణ. బయటి ప్రాపంచిక కార్యాలలో ఎవరు ఎంత నిమగ్నమై ఉంటారో, అంతగా వారివద్ద కామ, క్రోధ లోభాలు ఉంటాయి. కర్మ ఎలాంటి వస్తువంటే కామక్రోధ లోభాలను విడిచివేసినప్పుడే అందులో ప్రవేశం దొరుకుతుంది. కర్మ ఆచరణలో రూపు దిద్దుకుంటుంది. ఆ విధిని వదిలేసి తన ఇష్టం వచ్చినట్లు ఆచరణచేసే పురుషుడికి సుఖం,

సిద్ధి, పరమగతి, ఏమీ లేవు. ఇప్పుడు కర్తవ్య అకర్తవ్య విధాయక శాస్త్రమే ఏకైక ప్రమాణం, కాబట్టి శాస్త్ర విధికి అనుగుణంగానే నువ్వు కర్మ చేయడం మంచిది. ఆ శాస్త్రం 'గీత' తప్ప మరొకటి కాదు.

సారాంశం :

ఈ అధ్యాయం ప్రారంభంలో యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు దైవీ సంపద గురించి విస్తారంగా వర్ణించాడు. అందులో ధ్యానంలో స్థితి, సర్వస్వ సమర్పణ, అంతఃకరణ శుద్ధి, ఇంద్రియాల నియంత్రణ, మనస్సు యొక్క నిరోధం, స్వరూపాన్ని స్మరణచేయించే అధ్యయనం, యజ్ఞం కోసం ప్రయత్నం, మనస్సహితంగా ఇంద్రియాలను తపింప చేయడం, అక్రోధం, చిత్తంలో నిరంతరం శాంతి ఉండటం మొదలయిన ఇరవయి ఆరు లక్షణాలు చెప్పాడు. అవన్నీ ఇష్ట దైవానికి సమీపంగా చేరిన, యోగసాధనలో ప్రవృత్తుడయిన ఏ సాధకునిలో నయినా ఉంటాయి. ఆంశిక రూపంలో అందరిలోనూ ఉంటాయి.

తదనంతరం అతను ఆసురీసంపదలో ప్రధానమయిన ఐదు ఆరు వికారాల పేర్లు చెప్పాడు. అవేవంటే అభిమానం, దంభం కఠోరత్వం, అజ్ఞానం మొదలయినవి. చివరికి తన నిర్ణయం చెప్పాడు– అర్జునా! దైవీ సంపద 'విమోక్షాయ'– పూర్ణ నివృత్తి, పరమపదాన్ని లభింపజేస్తుంది. ఆసురీ సంపద బంధం మరియు అధోగతి కలిగిస్తుంది. అర్జునా! దైవీ సంపదను పొంది ఉన్నావు గనుక నువ్వు శోకించకు.

ఈ సంపదలు ఎక్కడ ఉంటాయి? అతను ఇలా అన్నాడు– ఈ లోకంలో మనుష్యుల స్వభావాలు రెండురకాలు– దేవతల వంటివి మరియు అసురుల వంటివి. దైవీ సంపద యొక్క బాహుళ్యం అయినప్పుడు మనుష్యుడు దేవతల వంటి వాడవుతాడు. మరియు ఆసురీ సంపద బాహుళమయినప్పుడు అసురులలాంటి వాడవుతాడు. ఎక్కడ పుట్టినా సరే, తన నేమని పిలుచుకున్నా సరే సృష్టిలో మనుష్యులు రెండే జాతులవారు.

ఆ పిదప అతను ఆసురీ స్వభావం గల మనుష్యుల లక్షణాలను విస్తారంగా వర్ణించాడు. ఆసురీ సంపద పొందిన పురుషుడు కర్తవ్య కర్మలో ప్రవృత్తుడవడం తెలుసుకోలేనివాడు మరియు అకర్తవ్య కర్మనుంచి నివృత్తి పొందడం తెలియనివాడు. అతను కర్మలో ప్రవృత్తే కానప్పుడు అతనిలో సత్యం, శుద్ధి మరియు ఆచరణ ఉండవు. అతని అభిప్రాయం ప్రకారం జగత్తు ఆశ్రయ రహితం. ఈశ్వరుడు లేకుండా స్త్రీ– పురుషుల సంయోగం చేత ఉత్పన్నమయింది. కాబట్టి భోగాలను అనుభవించడానికి ఉంది. ఇంతకు మించి యింకేముంది? చార్వాకుడే చెప్పాడనే కాదు. ఇలాంటి అభిప్రాయాలే కృష్ణుని కాలంలో కూడా ఉండేవి. ఇప్పుడూ ఉన్నాయి. ఎప్పుడూ ఉంటాయి. జనుల మనస్సులలో దైవీ– ఆసురీ సంపదలు పెరగడం– తరగడం ఉన్నంతకాలం ఈ అభిప్రాయాలు ఉంటాయి. శ్రీకృష్ణుడు అంటాడు– ఆ మంద బుద్ధి గలిగి, క్రూర కర్మలు చేసే పురుషులు అందరికీ అహితం (అహితం, అకళ్యాణం, కీడు) చేయడానికే వారు జగత్తులో పుడతారు.

వారు అంటారు– నా వలన ఈ శత్రువు చనిపోయాడు, వాణ్ణి నేను చంపుతాను. ఈ ప్రకారంగా అర్జునా! కామ క్రోధాలను ఆశ్రయించిన ఆ పురుషులు శత్రువులను చంపరు: కానీ తమ శరీరాలలో మరియు ఇతరుల శరీరాలలో స్థితమయి ఉన్న పరమాత్ముడనయిన నన్ను ద్వేషిస్తారు. అంటే అర్జునుడు ఒట్టు పెట్టి జయద్రధుడు మొదలయిన వారిని చంపాడా? చంపితే ఆసురీ సంపదగల వాడే అవుతాడు గదా? కనుక ఆ పరమాత్ముణ్ణి ద్వేషించువాడే. కానీ అర్జునుడితో శ్రీకృష్ణుడు స్పష్టంగా అన్నాడు– 'నువ్వు దైవీ సంపదను పొందావు, శోకించకు.' ఇక్కడ కూడా స్పష్టమయిన దేమిటంటే ఈశ్వరుని యొక్క నివాసం అందరి హృదయ దేశంలో ఉంటుంది. గుర్తు ఉంచుకోవలసిందేమిటంటే ఎవరో ఒకరు నిన్ను ఎల్లప్పుడూ చూస్తున్నారు. కాబట్టి ఎల్లప్పుడూ శాస్త్ర నిర్ధిష్టమయిన క్రియనే ఆచరించాలి, లేక పోతే శిక్ష తప్పదు.

యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు మళ్ళీ అన్నాడు– ఆసురీ స్వభావం గల క్రూర మనుష్యులను నేను మళ్ళీ మళ్ళీ నరకంలో పడేస్తాను. నరకం స్వరూపం ఏమిటి? అంటే అన్నాడు–మళ్ళీ మళ్ళీ నీచ జన్మలో పుట్టడం, నరకం, రెండూ ఒకదాని కొకటి పర్యాయాలు. ఇదే నరక స్వరూపం. కామ, క్రోధ, లోబాలు నరకానికి మూడు మూల ద్వారాలు. ఈ మూడింటి మీద ఆసురీ సంపద ఆధారపడి ఉంది. ఈ మూడింటినీ వదలి వేసినప్పుడు, నేను మళ్ళీ మళ్ళీ చెప్పిన ఆ కర్మ ఆరంభమవుతుంది. అంటే కర్మ ఎలాంటి వస్తువు అంటే కామ క్రోధ లోభాలను వదలి వేసినప్పుడే కర్మ ఆరంభమవుతుంది.

ప్రాపంచికపనులలో, మర్యాదా పూర్ణంగా సామాజిక విధులను నిర్వహించడంలో కూడా ఎవరు ఎంతగా నిమగ్నమై ఉంటారో, కామ, క్రోధ లోభాలు వారి వద్ద అంతే అధికంగా ఉంటాయి. వాస్తవానికి ఈ మూడింటినీ వదలివేసినప్పుడే పరమంలో ప్రవేశం ఇప్పించే నిర్ధారితమయిన కర్మలలో ప్రవేశం లభిస్తుంది. కాబట్టి 'ఏం చేయాలి, ఏం చేయకూడదు' అనే కర్తవ్య అకర్తవ్య వ్యవస్థకు శాస్త్రమే ప్రమాణం. ఏ శాస్త్రం? ఇదే గీతా శాస్త్రం, 'కిమన్యైః శాస్త్ర విస్తరైః' కాబట్టి ఈ శాస్త్రంచే నిర్ధారితమయ్యే విశిష్ట కర్మ (యథార్థ కర్మ)నే నువ్వు చెయ్యి.

ఈ అధ్యాయంలో యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు దైవీ మరియు ఆసురీ సంపదలను గురించి విస్తారంగా వర్ణించాడు. వాటి స్థానాన్ని మానవ హృదయంగా చెప్పాడు. వాటి ప్రతి ఫలాన్ని గురించి చెప్పాడు.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే 'దైవాసుర సంపద్వి భాగ యోగో' నామ షోడ శోధ్యయః ॥16

ఈ ప్రకారంగా శ్రీమద్భగవద్గీతా అనెడి ఉపనిషత్తు మరియు బ్రహ్మ విద్య మరియు యోగశాస్త్రమనే విషయంలో శ్రీకృష్ణుడు మరియు అర్జునుడి సంవాదంలో 'దైవాసుర సంపద్వి భాగ యోగం' అనే పేరుగల పదహారవ అధ్యాయం పూర్తయింది.

ఇతి శ్రీమత్పరమహంస పరమానందస్య శిష్య స్వామీ అడగడానందకృతే శ్రీమద్భగవద్గీతా యాః-'యాథార్థ గీతా' భాష్యే 'దైవాసుర సంపద్విభాగయోగో' నాను షోడశోధ్యాయః ॥16

ఈ ప్రకారంగా శ్రీమత్పరమహంస పరమానందగారి శిష్యుడు స్వామి అడగడానంద గారిచే రచించబడిన శ్రీమద్భగవద్ గీత'' యొక్క భాష్యం యదార్థ గీతలో దైవాసుర సంపద్విభాగ యోగం అనే పేరుగల పదహారవ అధ్యాయం పూర్తయింది.

॥ హరిః ఓం తత్సత్ ॥

ఓం

శ్రీ పరమాత్మనే నమః

# సప్తదశ అధ్యాయము

పదహారో అధ్యాయం చివరిలో యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు స్పష్టంగా చెప్పాడు కామక్రోధలోభాలను వదలివేసినప్పుడే, కర్మ ఆరంభమవుతుంది. దీనిని నేను మరీ మరీ చెప్పాను. ఈ నియత కర్మ చేయకుండా, సుఖంగానీ సిద్ధిగానీ, పరమగతి గానీ దొరకదు. కాబట్టి ఇప్పుడు నీకోసం కర్తవ్యాకర్తవ్య విధానంలో, 'ఏం చేయాలి, ఏం చేయకూడదు' అనే విషయంలో శాస్త్రమే ప్రమాణము. ఇంకేదో శాస్త్రం కాదు 'ఇతి గుహ్యతమం శాస్త్రమిదం' గీత స్వయంగా ఒక శాస్త్రము. అన్య శాస్త్రాలు కూడా ఉన్నాయి, కానీ యిక్కడ గీతశాస్త్రం పైనే దృష్టి ఉంచాలి, ఇంకో శాస్త్రం కోసం వెతకనవసరం లేదు. ఇతర చోట్లలో వెతికితే, ఈ క్రమబద్ధత్వం లభించదు, కాబట్టి దారి తప్పి పోతారు.

దీనిపై అర్జునుడు ప్రశ్నించాడు – భగవాన్! ఎవరైతే శాస్త్ర –విధిని త్యాగం చేసి పూర్ణశ్రద్ధతో 'యజన చేస్తారో, వారి యొక్క గతి ఏమిటి? సాత్వికం, రాజసికం, లేదా తామసికం ఉంటుందా? ఎందుకంటే వెనుక అర్జునుడు విన్నాడు – సాత్వికం, రాజసికం లేక తామసికం గుణాలు ఉన్నా, ఎప్పటి వరకు గుణాలు ఉంటాయో, అవి ఏదో ఒక యోనికి కారణం అవుతాయి. అందువల్ల ప్రస్తుత అధ్యాయం యొక్క మొదటిలోనే తను ప్రశ్నించాడు.

అర్జున ఉవాచ –

*శ్లో* // యే శాస్త్ర విధిముత్సృజ్యయజంతే శ్రద్ధ యాన్వితాః ।
తేషాం నిష్టా తు కా కృష్ణ సత్త్వమాహో రజస్తమః ॥**1**॥

హే కృష్ణా ! ఏ మనుష్యులయితే శాస్త్ర విధిని వదలి పెట్టి శ్రద్ధా సహితంగా యజ్ఞం చేస్తారో, వారి గతి ఏమిటి? సాత్వికమా, రాజసికమా లేక తామసికమా? 'యజ్ఞం' అనగానే దేవతలు – యక్షులు – భూతాలు మొదలయినవి అన్నీ వచ్చేస్తాయి.

శ్రీ భగవానువాచ-

శ్లో ॥ త్రివిధా భవతి శ్రద్ధా, దేహినాం సా స్వభావజా ।
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు ॥2॥

రెండో అధ్యాయంలో యోగేశ్వరుడు అన్నాడు - అర్జునా ! ఈ యోగంలో నిర్ధారితమైన క్రియ ఒక్కటే! అవివేకుల బుద్ధి అనంత శాఖలు గలదయి ఉంటుంది. కాబట్టి వారు అనంత క్రియలను విస్తరింప చేసుకుంటారు, ఆడంబరమైన, శోభాయుక్తమయిన మాటలలో వాటిని వ్యక్తం చేస్తారు. వారి మాటల ప్రభావం ఎవరి చిత్తంపై పడుతుందో, అర్జునా! వారి బుద్ధి కూడా వినష్టమయి పోతుందేగానీ, వారేమీ పొందలేరు. సరిగ్గా ఇదే ఇక్కడ పునరావృత్తమయింది - ఎవరైతే 'శాస్త్ర విధి ముత్సృజ్య' - శాస్త్ర విధిని విడిచేసి భజన చేస్తారో వారి శ్రద్ధ కూడా మూడు రకాలుగా ఉంటుంది.

దీనిమీద శ్రీకృష్ణుడు అంటాడు - మనుష్యుడి అలవాట్లచే ఉత్పన్నమయిన శ్రద్ధ సాత్వికం, రాజసం మరియు తామసం ఇలా మూడు రకాలుగా ఉంటుంది. వాటిని గురించి విను. మనుష్యుడి హృదయంలో ఈ శ్రద్ధ అవిరళంగా ఉంటుంది

శ్లో ॥ సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత ।
శ్రద్ధా మయోఽ యం పురుషో యోయ చ్ఛ్రద్ధః స ఏవ సః ॥3॥

హే భారతవంశీయుడా! మనుష్యులందు శ్రద్ధ వారి చిత్త వృత్తికి అనుగుణంగా ఉంటుంది. ఈ పురుషుడు శ్రద్ధా మయుడు. కాబట్టి ఏ పురుషుడు ఎలాంటి శ్రద్ధ గలవాడో అతను స్వయంగా కూడా అలాంటి వాడే. సాధారణంగా నేను ఎవరిని అని? లోకులు అడుగుతారు- కొందరు అంటారు- నేను ఆత్మను. కానీ కాదు, ఇక్కడ యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు అంటాడు- ఎలాంటి శ్రద్ధో, ఎలాంటి వృత్తో, అలాంటి పురుషుడు.

గీత యోగ దర్శనం. మహర్షి పతంజలి కూడా యోగియే. అతడు 'యోగదర్శనం' రచించాడు. యోగం అంటే ఏమిటి? అతను ఇలా అన్నాడు - 'యోగ ః చిత్తవృత్తి నిరోధః' చిత్త వృత్తులు ఆగిపోవడమే యోగం. ఎవరైనా శ్రమపడి ఆపేయగలిగితే లాభం ఏమిటి? 'తదా ద్రష్టుఃస్వరూపే వ స్థానం - ఆ సమయాన ఆ ద్రష్టా, జీవాత్మ తన శాశ్వత స్వరూపంలో స్థితి పొందుతుంది. అంటే స్థితి పొందడానికి ముందు అది మలినంగా ఉండిందా? పతంజలి అంటాడు- 'వృత్తి సారూప్య మితరత్ర', మిగిలిన సమయాలలో ఆద్రష్ట ప్రవృత్తి సారూప్యాన్ని పొందుతాడు. ఇక్కడ యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు అంటాడు- ఈ పురుషుడు శ్రద్ధామయుడు. శ్రద్ధతో నిండి పోయాడు. ఎక్కడో అక్కడ తప్పకుండా శ్రద్ధ ఉంటుంది. మరియు శ్రద్ధను బట్టి అతను, ఎలాంటి ప్రవృత్తో, అలాంటి పురుషుడు అయి ఉంటాడు. ఇప్పుడు మూడు రకాల శ్రద్ధలను విభజించుతాడు.

శ్లో ॥ యజంతే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః ।
ప్రేతాన్ భూత గణాంశ్చాన్యే యజంతే తామసా జనాః ॥4॥

వారిలో సాత్విక పురుషుడు దేవతలను పూజిస్తాడు, రాజస పురుషుడు యక్షులు,

రాక్షసులను పూజిస్తాడు. అన్య తామసపురుషులు ప్రేత భూతాలను పూజిస్తారు. వారు పూజించడానికి చాలా శ్రమిస్తారు కూడా.

శ్లో ॥ అశాస్త్రవిహితం ఘోరం తప్యంతే యే తపో జనాః ।
దంభాహం కార సంయుక్తా ః కామరాగ బలాన్వి తాః ॥5॥

ఆ మనుష్యులు, శాస్త్ర విధిచే రహితమైన, ఘోర కల్పితమయిన (కల్పిత క్రియలను సృష్టించి) తపస్సు చేస్తారు, దంభ, మరియు అహంకారాలతో యుక్తులయి, కోరికలు మరియు ఆసక్తుల వలన బలంగా బంధించ బడతారు.

శ్లో ॥ కర్షయంతః శరీరస్థం భూతగ్రా మమచేతసః ।
మాం చైవాంతః శరీరస్థం తాన్విద్ధ్యా సురనిశ్చయాన్ ॥6॥

వారు శరీరంరూపంలో స్థితులయి ఉన్న భూత సముదాయాలను మరియు అంతః కరణంలో స్థితుడయి ఉన్న అంతర్యామినయిన నన్ను కూడా కృశింపజేయువారు అంటే దుర్బలుల్ని చేసేవారు. ఆత్మ ప్రకృతి బొరియలలో పడి వికారాల వలన దుర్బలం మరియు యజ్ఞసాధనల వలన బలయుక్తం అవుతుంది. అట్టి అజ్ఞానులను (అచేతులను) నిశ్చయంగానే అసురులుగానే తెలుసుకో అంటే వారు అందరికందరూ అసురులే.

శాస్త్ర విధిని విడిచేసి భజన చేసే స్వాతిక పురుషులు దేవతలను, రాజస పురుషులు యక్ష–రాక్షసులను మరియు తామన పురుషులు ప్రేతాలను పూజిస్తారు. కేవలం పూజించడమే కాదు, ఘోరమైన తపస్సు చేస్తారు, కానీ అర్జునా! శరీరరూపంగా భూతాలను మరియు అంతర్యామి రూపంలో స్థితుడైన పరమాత్ముడనయిన నన్ను దుర్బలుణ్ణి చేస్తారు. నానుంచి దూరాన్ని పెంచుకుంటారే గానీ భజన చేయరు. వారిని నువ్వు అసురులని తెలుసుకో, అంటే దేవతలను పూజించే వారు కూడా అసురులే. ఇంతకంటే అధికంగా ఎవరేమనగలరు? కాబట్టి ఎవరి అంశ మాత్రంచే ఇవన్నీ ఉంటాయో ఆ మూలమైన పరమాత్ముణ్ణి భజించాలి. దీనిని పరమయోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు మరీ మరీ నొక్కి చెప్పాడు.

శ్లో ॥ ఆహార స్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః ।
యజ్ఞస్తపస్తథా దానం తేషాం భేద మిమం శృణు ॥7॥

అర్జునా! ఎలాగైతే శ్రద్ధ మూడు రకాలుగా ఉంటుందో, అలాగే అందరికీ తమ తమ ప్రకృతికి అనుగుణంగా భోజనం కూడా మూడు రకాలుగా ప్రియంగా ఉంటుంది. మరియు అలాగే యజ్ఞం, తపం, మరియు దానం కూడా మూడు రకాలుగా ఉన్నాయి. వాటి తెడాలను గురించి విను. మొదట ఆహారం గురించి చెప్పబడింది.

శ్లో ॥ ఆయుః సత్త్వ బలారోగ్య సుఖ ప్రీతి వివర్ధనాః ।
రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారాః సాత్త్విక ప్రియాః ॥8॥

ఆయువు, బుద్ధి, బలం, ఆరోగ్యం, సుఖం మరియు ప్రీతిని పెంపొందించునవి,

రసయుక్తమయినవి, మృదువైనవి చిరకాలం ఉండేది, మరియు స్వభావంచే హృదయానికి ఇంపనిపించే భోజన పదార్థాలు సాత్విక పురుషునికి ప్రియమైనవి.

యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు చెప్పినట్లుగా స్వభావంచే హృదయానికి ఇంపనిపించేవి, బలం, ఆరోగ్యం, బుద్ధి మరియు ఆయువులను పెంచే భోజన పదార్థాలే సాత్వికమయినవి. ఏభోజన పదార్థాలు సాత్వికములో, అవే సాత్వికులకు ప్రియమయినవవుతాయి. దీని వలన స్పష్టమయ్యేదేమిటంటే తినే ఏ వస్తువు కూడా సాత్వికంగానీ, రాజసం గానీ మరియు తామసంగానీ కాదు. దాని ప్రయోగం సాత్వికం గానీ, రాజసం గానీ, లేక తామసం గానీ అవుతుంది. పాలు సాత్వికం కాదు, ఉల్లిపాయ రాజసం కాదు మరియు వెల్లుల్లి తామసం కాదు.

ఎక్కడి వరకు బలం, బుద్ధి, ఆరోగ్యం మరియు హృదయానికి ప్రియమయిన దవడం అనే ప్రశ్న వస్తే, ప్రపంచంలో మనుష్యులకు తమ తమ ప్రకృతి, వాతావరణ మరియు పరిస్థితులకు అనుకూలంగా వేర్వేరు భోజన పదార్థాలు ప్రియమయినవవుతాయి. ఎలాగంటే బంగాలీలకు మరియు దక్షిణ భారతీయులకు అన్నం (బియ్యం) ప్రియమైనవి, అయితే మరి పంజాబీలకు గోధుమల రొట్టెలు ఇష్టం. అరబ్బులకు ఎద్దు మాంసం, చైనీయులకు కప్పలు ఇష్టం, యింకోవైపు ఉత్తర ధ్రువ శీతల ప్రదేశాలలో మాంసం లేకుండా జీవితమే గడవదు. రష్యా, మంగోలియా దేశాలలోని ఆదివాసులు తినటానికి గుర్రపు మాంసాన్ని ఉపయోగిస్తారు, ఐరోపాదేశస్తులు ఆవు, పంది మాంసం తింటారు. అయినా విద్య, బుద్ధుల వికాసం మరియు ఔన్నత్యంలో అమెరికస్తులు మరియు యురోపియనులు ప్రథమ శ్రేణిలో ఉన్నారు.

'గీత' ప్రకారంగా రసయుక్తమైన,నూనె గల మరియు చిరకాలం ఉండే భోజన పదార్థాలు సాత్వికమయినవి. దీర్ఘ ఆయువు, అనుకూల్యం, బలం బుద్ధి పెంచగల ఆరోగ్యవర్ధక పదార్థాలు సాత్వికమయినవి. స్వాభావికంగా హృదయానికి ప్రియం అనిపించే భోజన పదార్థాలు సాత్వికమయినవి. కాబట్టి తినే ఏ పదార్థాన్ని కూడా ఎక్కువ అని గానీ, తక్కువ అని గానీ అంచనావేయనవసరం లేదు. పరిస్థితులు, వాతావరణం, దేశకాలాలకు అనుగుణంగా ఏ భోజనపదార్థం స్వాభావికంగా ప్రియమనిపిస్తుందో మరియు జీవన శక్తిని ఇస్తుందో అదే సాత్వికమయినది. వస్తువు సాత్వికం, రాజసం మరియు తామసికం కాదు. కానీ దాని ప్రయోగం సాత్వికం. రాజసం మరియు తామసికం అవుతుంది.

దీని అనుకూలంగానే ఏ వ్యక్తి అయితే ఇల్లు, కుంటుంబాన్ని వదలివేసి, కేవలం ఈశ్వరారాధనలో లిప్తమయి పోతాడో, సన్యాస - ఆశ్రమంలో ఉంటాడో, అతనికి మాంసం, మదిర త్యాజ్యములు. ఎందుకంటే అనుభవంలో చూడదగిన దేమిటంటే ఈ పదార్థాలు అధ్యాత్మిక మార్గంలో అవరోధాలు కల్పించే మనోభావాలను ఉత్పన్నం చేస్తాయి. కాబట్టి వీటి వలన సాధన పథంలో భ్రష్టుడయ్యేందుకు అవకాశం ఎక్కువ. ఏకాంత స్థలంలో ఉంటూ, విరక్తుడుగా ఉన్న వ్యక్తికి యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు ఆరో అధ్యాయంలో ఆహారం విషయంలో ఒక నియమాన్ని చెప్పాడు - 'యుక్తా హార విహారస్య', దీనినే మనస్సులో ఉంచుకొని ఆచరించాలి. భజనలో సహాయకరమైనంత ఆహారాన్నే భుజించాలి.

శ్లో || కట్వమ్లలవణాత్యుష్ణ తీక్ష్ణరూక్ష విదాహినః ।
ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకామ య ప్రదాః ||9||

చేదు, పులుపు, ఎక్కువ ఉప్పు, ఎక్కువ వేడి, కారం, చూపుకే మంటను కలిగించే మరియు దుఃఖం, దిగులు మరియు రోగాలను ఉత్పన్నం చేసే ఆహారం రాజస పురుషులకు ప్రియమవుతుంది.

శ్లో || యాత యామం గతరసం పూతి పర్యుషితం చ యత్ ।
ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామస ప్రియమ్ ||10||

ఒక పూట (మూడు గంటలు) ముందుగానే తయారు చేయబడిన ఆహారం, 'గతరసం' – రస రహితం, దుర్గంధ యుక్తం, పాసి పోయినది, ఉచ్ఛిష్టం ( ఎంగిలి) మరియు అపవిత్రం అయినది– ఇట్టి భోజనం, తామస పురుషులకు ప్రియమయినది. ప్రశ్నకు జవాబు ఇవ్వబడింది. ఇప్పుడు 'యజ్ఞం' గురించి చెబుతున్నాడు.

శ్లో || అఫలాకాంక్షి భిర్యజ్ఞో విధి దృష్టో య ఇజ్యతే ।
యష్టవ్యమేవేతి మనః సమాధాయ స సాత్త్వికః ||11||

ఏ యజ్ఞమయితే 'విధిదృష్ట' – శాస్త్ర విధిచే నిర్ధారించబడింది (ఎలాగంటే వెనక మూడో అధ్యాయంలో యజ్ఞం యొక్క పేరు ఉటంకించ బడింది, నాలుగో ఆధ్యాయంలో యజ్ఞం యొక్క స్వరూపం చెప్పబడింది–చాలా మంది యోగులు ప్రాణాన్ని అపానంలో, అపానాన్ని ప్రాణంలో ఆహుతి ఇస్తారు. ప్రాణాపానాల గతిని నిరోధించి, ప్రాణాలగతిని స్థిరం చేస్తారు, సంయమాగ్నిలో ఆహుతి ఇస్తారు. ఈ రకంగా యజ్ఞం యొక్క పద్నాలుగు సోపానాలు చెప్పబడ్డాయి. అవన్నీ బ్రహ్మ వరకు గల దూరాన్ని తరింప చేయగలిగే ఒకే క్రియ యొక్క ఉచ్చ–నీచ అవస్థలు. సంక్షేపంగా యజ్ఞం అంటే విశిష్ట చింతనా ప్రక్రియ యొక్క చిత్రణ. దాని పరిణామం సనాతన బ్రహ్మలో ప్రవేశం. దాని విధానం ఈ శాస్త్రంలో ఇవ్వబడింది.)

ఆ శాస్త్ర విధానాన్ని మళ్ళీ సమర్థిస్తూ ఇలా అంటాడు– అర్జునా! శాస్త్ర విధిచే ఏది నియతమయినదో, దేనిని చేయడం కర్తవ్యమో, ఏదైతే మనస్సును నిరోధించుతుందో, ఏదైతే ఫలాన్ని కోరని పురుషుల ద్వారా చేయబడుతుందో, ఆ యజ్ఞం సాత్వికమయినది.

శ్లో || అభిసంధాయ తు ఫలం దంభార్థమపి చైవ యత్ ।
ఇజ్యతే భరత శ్రేష్ఠ తం యజ్ఞం విద్ధి రాజసమ్ ||12||

హే అర్జునా ! ఏ యజ్ఞమయితే కేవలం దంభాచారం కోసమే చేయబడుతుందో, లేక ఫలాన్ని ఆశించి చేయబడుతుందో, దాన్ని రాజసిక యజ్ఞంగా తెలుసుకో. దీని కర్తకు యజ్ఞం యొక్క విధి తెలుసు, కానీ దంభాచారం, లేక ప్రతిఫలాన్ని ఆశించుకొని చేస్తారు – ఫలానా వస్తువు దొరకుతుంది (లేక) లోకులు యజ్ఞం చేస్తున్నాడని గౌరవంగా చూస్తారు, ప్రశంసిస్తారు, అలాంటి యజ్ఞకర్త వాస్తవానికి రాజసగుణం కలవాడు. ఇప్పుడు తామస యజ్ఞం గురించి చెప్తాడు.

శ్లో // విధి హీనమసృష్టాన్నం మంత్ర హీన మదక్షిణమ్ ।
శ్రద్ధా విరహితం యజ్ఞం తామసం పరిచక్షతే ॥13॥

ఏ యజ్ఞమైతే శాస్త్ర విధిచే రహితమో, ఏదైతే అన్నాన్ని (పరమాత్మను) సృష్టించడంలో అసమర్థమయినదో, మనస్సును అంతరాళంలో నిరుద్ధం చేయగల సామర్థ్యంలేనిదో, 'దక్షిణ' అంటే సర్వస్వ సమర్పణ భావంచే రహితమో మరియు ఏదైతే శ్రద్ధారహితమో, అలాంటి యజ్ఞం తామస యజ్ఞం అనబడుతుంది. అలాంటి పురుషుడు వాస్తవిక యజ్ఞాన్ని గురించి తెలియని వాడు. ఇప్పుడు చెప్పబోయేది, తపస్సు–

శ్లో // దేవ ద్విజగురు ప్రాజ్ఞ పూజనం శౌచమార్జవం ।
బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే ॥14॥

పరమదేవుడైన పరమాత్ముడు, ద్వైతాన్ని జయించిన ద్విజుడు, సద్గురువు మరియు జ్ఞానులను పూజించడం, పవిత్రత, సారళ్య, బ్రహ్మచర్యం మరియు అహింస, వీటిని శరీరానికి సంబంధించిన తపస్సు అనడమయింది. శరీరం ఎప్పుడూ కోరికల వైపు పరుగులిడుతుంది. దీనిని అంతః కరణం యొక్క పైన చెప్పబడిన ప్రవృత్తులకు అనుగుణంగా తపింపచేయడమే శారీరక తపస్సు.

శ్లో // అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియ హితం చ యత్ ।
స్వాధ్యాయా భ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే ॥15॥

ఉద్వేగాన్ని కలిగించనటువంటి, ప్రియమయిన, హితకారకమయిన మరియు సత్యభాషణ మరియు పరమాత్మునిలో ప్రవేశం ఇప్పించే శాస్త్రాల గురించి చింతన యొక్క అభ్యాసం, నామ జపం, వీటిని వాక్ – సంబంధమైన తపస్సు అనడమయింది. వాక్కు విషయోన్ముఖమైన ఆలోచనలను కూడా వ్యక్తం చేస్తూ ఉంటుంది. దీనిని ఆవైపు నుంచి ఆకట్టుకొని, పరమ సత్యమయిన పరమాత్ముని దిశలో పెట్టడమే వాక్కుకు సంబంధించిన తపస్సు, ఇప్పుడు మనస్సుకు సంబంధించిన తపస్సు చూద్దాం–

శ్లో // మనః ప్రసాదః సౌమ్యత్వం మౌనమాత్మ వినిగ్రహః ।
భావ సం శుద్ధిరత్యేతత్తపో మానస ముచ్యతే ॥16॥

మనస్సు యొక్క ప్రసన్నత్వం, సౌమ్యభావం, మౌనం అంటే ఇష్ట దైవం తప్ప అన్య విషయాలు స్మరణ రాకుండుట, మనస్సు యొక్క నిరోధం, అంతః కరణం యొక్క పవిత్రత ఇవి మనస్సుకు సంబంధించిన తపస్సు అనబడ్తాయి. పైన చెప్పబడిన మూడు (శారీరిక, వాక్ మరియు మనస్సు) తపస్సులను కలిపి సాత్త్విక తపస్సు, అంటారు.

శ్లో // శ్రద్ధయా పరయా తప్తం తపస్తత్ త్రివిధం నరైః ।
అఫలా కాంక్షిభిర్యుక్తైః సాత్త్వికం పరిచక్షతే ॥17॥

ఫలాన్ని ఆశించకుండా అంటే నిష్కామ కర్మచే యుక్తులైన పురుషుల ద్వారా పరమ

శ్రద్ధతో చేయబడే పైనచెప్పబడిన మూడు తపస్సులను కలిపి సాత్వికతపస్సు అంటారు. ఇప్పుడు చెప్పబోయేది రాజస తపస్సు -

శ్లో || సత్కారమాన పూజార్థం తపో దంభేన చైవ యత్ ।
క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చలమధ్రువమ్ ||18||

ఏ తపస్సు సత్కారం, సమ్మానం మరియు పూజ కోసం (లేక) ఆడంబరం కోసం చేయబడుతుందో, అనిశ్చితమూ మరియు చంచల ఫలాన్నిచ్చే ఆ తపస్సును రాజస తపస్సు అంటారు.

శ్లో || మూఢ గ్రాహేణాత్మనో యత్పీడయా క్రియతే తపః ।
పరస్యోత్సాదనార్థం వా తత్తామసముదాహృతమ్ ||19||

ఏ తపస్సు మూర్ఖతా పూర్వాకంగా, మొండిగా, మనస్సు, వాక్కు మరియు శరీరాలను పీడిస్తూ (లేక) యితరులకు అనిష్టం చేసే ప్రతీకార భావనతో చేయబడుతుందో, ఆ తపస్సు తామసం అని చెప్పబడింది.

ఈ ప్రకారంగా సాత్విక తపస్సుచే శరీరం, మనస్సు మరియు వాక్కులను ఇష్ట దైవానికి అనుగుణంగా మార్చడం జరుగుతుంది. రాజస తపస్సులో తపస్సుయొక్క ప్రక్రియఅదే, కానీ దంభ-మాన-సమ్మానాలను ఆశిస్తూ తపించడం జరుగుతుంది. సాధారణంగా మహాత్ములు ఇల్లు - వాకిలి వదిలేసిన తరువాత కూడా ఈ వికారానికి గురయిపోతారు. మూడవ రకమైన తామస తపస్సు అవిధి పూర్వకంగా చేయబడుతుంది. ఇతరులకు బాధ చేకూర్చే దృక్పథంతో చేయబడుతుంది. ఇప్పుడు దానం గురించి చెబుతున్నాడు.

శ్లో || దాతవ్యమితి యద్దానం దీయతేऽను పకారిణే ।
దేశే కాలే చ పాత్రేచ తద్దానం సాత్వికం స్మృతమ్ ||20||

'దానం చేయడమే కర్తవ్యం' - యీ భావంతో ఏ దానమైతే దేశ (స్థానం), కాల (సమయానుకూలం) మరియు నిజమైన పాత్రుడు ప్రాప్తించినప్పుడు ప్రత్యుపకారమనే భావనచే రహితంగా, ఇవ్వబడుతుందో, ఆ దానం సాత్వికమయినదనబడుతుంది.

శ్లో || యత్తు ప్రత్యుపకారార్థం ఫల ముద్ధిశ్య వా పునః ।
దీయతే చ పరి క్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్ ||21||

ఏ దానమైతే క్లేశపూర్వకంగా (అది ఇవ్వాలని లేదు, కానీ ఇవ్వ వలసి వస్తోంది) మరియు ప్రత్యుపకార భావనతో 'యిది చేస్తే అది దొరకుతుంది' లేక ప్రతిఫలాపేక్షతో ఇవ్వబడుతుందో. ఆ దానం రాజసీ అనబడింది.

శ్లో || అ దేశకాలే యద్దాన మ పాత్రేభ్యశ్చ దీయతే ।
అసత్కృతమవజ్ఞాతం తత్తామసముదాహృతమ్ ||22||

ఏ దానమయితే సత్కారం లేకుండా, లేక తిరస్కార పూర్వకంగా చీదరించుతూ,

అయోగ్యమయిన దేశకాలాలలో అనధికారులకు ఇవ్వబడుతుందో, ఆదానం తామసీ అనబడింది. 'పూజ్య గురువుగారు' అనేవారు ''ఓహో! కు పాత్రుడికి దానమిస్తే దాత వినష్టమై పోతాడు,'' సరిగ్గా యిదే ప్రకారంగా శ్రీకృష్ణుడు దానం యివ్వడమే కర్తవ్యం. అన్నాడు.

దేశకాలాలు మరియు పాత్రుడు ప్రాప్తించినప్పుడు, ప్రత్యుపకారాన్ని ఆశించే భావన లేకుండా, ఉదారతా పూర్వకంగా ఇవ్వబడే దానం సాత్వికమయినది. కష్టంగా ఇవ్వబడే, ఫలాపేక్షతో ఇవ్వబడే దానం రాజసీ మరియు సత్కారం లేక, చీదరింపులతో ప్రతికూలమయిన దేశకాలాలలో కుపాత్రుడికి ఇచ్చే దానం తామసీ, కానీ ఇది కూడా దానమే, కానీ ఎవరైతే యిల్లు గిల్లు మొదలగునవి అన్నింటిపై మమతను వదిలేసి ఏకైక ఇష్టదైవం పైనే ఆధారపడిన వారి దానం చేసే విధానం దీనికంటే ఉన్నతమైనది, అది సర్వస్వం యొక్క సమర్పణ. సంపూర్ణ కోరికల నుండి తప్పుకొని మనస్సు యొక్క సమర్పణ భావం, శ్రీకృష్ణుడు చెప్పిన విదంగా 'మయ్యేవ మన ఆధత్స్వ' కాబట్టి దానం చాలా ఆవశ్యకమయినది. ఇప్పుడు ఓం, తత్ మరియు సత్ యొక్క స్వరూపం గురించి చెబుతాడు.

శ్లో ॥ ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణ త్రి విధః స్మృత ః ।
బ్రాహ్మణాస్తేన వేదశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా ॥**23**॥

అర్జునా! ఓం, తత్ మరియు సత్ – అలాంటి మూడు రకాల పేర్లు 'బ్రహ్మణః నిర్దేశఃస్మృతః' బ్రహ్మ యొక్క నిర్దేశాన్ని చెబుతాయి. స్మృతిని ఇప్పిస్తాయి అంటే బ్రహ్మ యొక్క పరిచాయకాలు. దాని నుంచే 'పురా పూర్వంలో (ఆరంభంలో) బ్రాహ్మణులు, యజ్ఞాలు మరియు వేదాలు రచించబడ్డాయి. అంటే బ్రాహ్మణులు, యజ్ఞాలు, వేదాలు 'ఓం' నుంచి పుట్టాయి. ఇవి యోగజన్యాలు. 'ఓం' యొక్క నిత్యచింతన నుంచే ఇవి ఉత్పన్నం అవుతాయి. ఇంకో విధానం లేదు.

బ్రాహ్మణులు, వేదాలు మరియు యజ్ఞాలు 'ఓం' యొక్క స్మరణ ద్వారా యోగి యొక్క అంతరాళంలో ప్రకటమయ్యే అవస్థలు. యజ్ఞం యోగసాధన యొక్క విధి. 'ఓం' యొక్క నిరంతర చింతన వల్లనే, యజ్ఞం యొక్క ఉత్తరోత్తర అవస్థలలోకి ప్రవేశం దొరుకుతుంది. ఇదే ప్రకారంగా వేదాలు కూడా. ఇది ఈశ్వరుని ద్వారా ప్రదత్తమయ్యే ఈశ్వరీయ జ్ఞానం. ఇటు జ్ఞానం ప్రాప్తించడం మరియు అటు బ్రహ్మతో ఏకీబావస్థితి పొందడం – ఇదే బ్రాహ్మణుడు అంటే. ' శమః దమః శౌచం' (18/42) మనస్సు యొక్క నిరోధం, ఇంద్రియాల నియంత్రణ, అనుభవ సంచారం మొదలగునవి బ్రహ్మలో విలయం కావడానికి యోగ్యతలు. ఇవి ఎప్పుడయితే స్వభావంలోకి దిగి వస్తాయో, అప్పుడు ఇది బ్రహ్మణత్వం యొక్క నిమ్నతమమయిన హద్దు – ప్రవేశిక. సాధన పూర్తయ్యే కాలంలో దర్శనంతో బాటు బ్రహ్మలో స్థితి బ్రహ్మణత్వపు పరాకాష్ఠ – ఈ మూడు– బ్రాహ్మణులు, యజ్ఞం– ప్రకృతిలో వస్తువులుగానీ, ప్రాణులుగానీ కావు. కానీ ఇవి ఈశ్వరీయ ఆలోకంలో అంతః కరణంలో ప్రకటమయ్యే స్థితులు మరియు ప్రతి భావికునకూ దొరకగలవు.

శ్లో ॥ తస్మాదో మిత్యు దాహృత్య యజ్ఞ దానతపః క్రియాః ।
ప్రవర్తంతే విధానోక్తాః సతతం బ్రహ్మ వాదినామ్ ॥**24**॥

కాబట్టి బ్రహ్మ యొక్క చింతన చేసే పురుషుల యొక్క శాస్త్ర విధిచే, నియతమయిన యజ్ఞం, దానం మరియు తపః క్రియలను నిరంతరం 'ఓం' అనే నామాన్ని ఉచ్చరించుతూనే, చేయబడుతాయి. దీనితో బ్రహ్మ యొక్క స్మరణ కూడా అయిపోతుంది. ఇప్పుడు 'తత్' శబ్దం యొక్క ప్రయోగం గురించి చెప్తాడు-

శ్లో ॥ తదిత్య నభి సంధాయ ఫలం యజ్ఞ తపఃక్రియ ః ।
దాన క్రియాశ్చ వివిధాఃక్రియంతే మోక్షకాంక్షిభిః ॥**25**॥

'తత్' అంటే అతనే (పరమాత్ముడే) సర్వత్రా ఉన్నాడు. ఈ భావనతో ఫలాన్ని ఆశించకుండా, శాస్త్రం ద్వారా నిర్దిష్టమైన నానా ప్రకారాలయిన యజ్ఞ, దానం మరియు తపస్సుల క్రియలు, పరమ కళ్యాణాన్ని కోరుకునే పురుషుల ద్వారా చేయబడతాయి. 'తత్' శబ్దం పరమాత్ముని పట్ల సమర్పణను సూచిస్తుంది. అంటే జపం 'ఓం' తోనే చేయండి. యజ్ఞం దానం మరియు తపస్సుల యొక్క క్రియలు అతనిపై ఆధారపడి చేయండి. ఇప్పుడు 'సత్' యొక్క ప్రయోగ స్థానం గురించి చెబుతాడు-

శ్లో ॥ సద్భావే సాధుభావే చ సదిత్యేతత్ప్ర యుజ్యతే ।
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ యుజ్యతే ॥**26**॥

ఇప్పుడు 'సత్'; 'సత్ ఏమిటన్నది యోగేశ్వరుడు చెప్పాడు. గీత ఆరంభంలోనే అర్జునుడు ప్రశ్నించాడు- కులధర్మమే శాశ్వతమయినది. సత్యమయినది అని. అప్పుడు శ్రీకృష్ణుడు అన్నాడు - అర్జునా! నీకు ఈ అజ్ఞానం ఎక్కడ నుంచి వచ్చింది? సత్య (సత్) వస్తువుకు మూడు కాలాల్లోను అభావం (లోటు) లేదు, దానిని నశింపజేయలేరు. మరియు అసత్య వస్తువుకు మూడు కాలాల్లో అస్థిత్వం లేదు. దానిని ఆపలేరు. దేనికైతే మూడు కాలాల్లోను అభావం లేదో, ఆ సత్య వస్తువు ఏది? మరియు దేనికైతే అస్థిత్వం లేదో ఆ అసత్య వస్తువు ఏది? అంటే ఇలా అన్నాడు- ఈ ఆత్మే సత్యమయింది మరియు సమస్త భూతాదుల శరీరాలు నశించేవి. ఆత్మే సనాతనం, అవ్యక్తం, శాశ్వతం మరియు అమృత స్వరూపం. ఇదే పరమ సత్యమయింది.

ఇక్కడ అంటాడు- 'సత్' పరమాత్ముని ఈ నామం 'సద్భావే' ఆ సత్యం పట్ల శ్రద్ధాభావంతో మరియు సాధుభావంతో ఉపయోగించ బడుతుంది. మరియు హే పార్థా! ఎప్పుడైతే కర్మ చక్కగా బాగుగా జరుగుతూ వుంటుందో, అప్పుడు 'సత్' శబ్దం యొక్క ప్రయోగం జరుగుతుంది. 'సత్' అంటే అర్థం 'ఈ వస్తువులు మావి' అనికాదు. శరీరమే మనది కానప్పుడు, దాని ఉపభోగానికి పనికి వచ్చే వస్తువులు మనవెలా అవుతాయి? ఇది 'సత్' కాదు. 'సత్' యొక్క ప్రయోగం కేవలం ఒక అర్థంలోనే జరుగుతుంది-'సద్భావంతో'. ఆత్మే పరమ సత్యం. ఈ సత్యం పట్ల భావం (ఆసక్తి) ఉంటే, దానిని సాధించడానికి సాధుబావం ఉంటే మరియు అతణ్ణి (పరమాత్మను) పొందడానికి కర్మ ప్రశస్తమయిన విధంగా జరిగితే, అప్పుడు 'సత్' శబ్ద ప్రయోగం జరుగుతుంది. దీని మీద యోగేశ్వరుడు ఇంకా ఇలా అంటాడు-

శ్లో ॥ యజ్ఞేతపసి దానేచ స్థితిః సదితి చోచ్యతే ।
కర్మ చైవ తదర్థీయం సదిత్యే వాభిధీయతే ॥27॥

యజ్ఞం, తపస్సు మరియు దానాలు చేయడంతో ఏ స్థితి లభిస్తుందో, దానిని కూడా 'సత్' - అని అంటారు. 'తదర్థీయం' - ఆ పరమాత్ముని ప్రాప్తికై చేయబడిన కర్మే' 'సత్' అని అంటారు. అంటే ఆ పరమాత్ముని ప్రాప్తి కలిగించే కర్మే 'సత్'. యజ్ఞ, దాన,తపస్సులు ఈ కర్మ యొక్క పూరకాలు. చివరిలో నిర్ణయం ఇస్తూ అంటాడు- వీటన్నింటికీ శ్రద్ధ అవసరం.

శ్లో ॥ అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్ ।
అసది త్యుచ్యతే పార్థనచ త ప్రేత్య నో ఇ హ ॥28॥

హే పార్థా! శ్రద్ధ లేకుండా చేసిన హోమం, ఇచ్చిన దానం, చేసినతపస్సు, మరియు చేసిన కర్మ - ఇవన్నీ 'అసత్' అని అంటారు. అవి ఈలోకంలోగానీ మరియు పరలోకంలో గానీ లాభదాయకాలు కావు. కాబట్టి సమర్పణ భావంతో బాటు శ్రద్ధ అత్యంత ఆవశ్యకము.

సారాంశం :

అధ్యాయం ఆరంభంలోనే అర్జునుడు ప్రశ్నించాడు - భగవన్ ! ఎవరైతే శాస్త్ర విధిని వదలివేసి మరియు శ్రద్ధతో యుక్తులయి యజ్ఞం చేస్తారో (లోకులు-దేవుళ్ళు , భూతాలు మొదలగువాటిని పూజిస్తూనే ఉంటారు) వారి శ్రద్ధ ఎటువంటిది? సాత్వికమా, రాజసమా లేక తామసమా? దీనిని గురించి యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు.

అర్జునా ! ఈ పురుషుడు శ్రద్ధా స్వరూపుడు. ఎక్కడో అక్కడ అతని శ్రద్ధ ఉంటుంది. శ్రద్ధ ఎలాంటిదో పురుషుడు అలాంటివాడే అవుతాడు. ప్రవృత్తి ఎలా ఉంటే పురుషుడు అలాంటి వాడే అవుతాడు. అతని శ్రద్ధ సాత్వికం, రాజసం మరియు తామసం అని మూడు రకాలుగా ఉంటుంది. సాత్విక శ్రద్ధ గల వారు దేవతలనూ, రాజస శ్రద్ధగలవారు యక్షులనూ (యశస్సును, శౌర్యాన్ని ఇచ్చేవారు) రాక్షసులనూ (సురక్షను ఇవ్వగలిగే వారు), మరియు తామస శ్రద్ధగలవారు భూత ప్రేతాలనూ పూజిస్తారు. శాస్త్ర విధిచే రహితమైన ఈ పూజల ద్వారా ఈ మూడు రకాల శ్రద్ధాళువులు శరీరంలో స్థితమయిన భూత సముదాయాలను అంటే తమ సంకల్పాలను మరియు హృదయ దేశంలో స్థితుడైన అంతర్యామినయిన నన్నుకూడా కృశింప చేస్తారు, కానీ పూజించరు. వీరందరినీ నిశ్చయంగా నువ్వు అసురులని తెలుసుకో. అంటే భూత ప్రేత యక్ష రాక్షసులను మరియు దేవతలను పూజించేవారు అసురులు.

దేవతలను గురించి శ్రీకృష్ణుడు ఇక్కడ మూడవసారి చర్చ చేశాడు. మొదట ఏడో అధ్యాయంలో అతను అర్జునా! కోరికలు ఎవరి జ్ఞానాన్నయితే అపహరించాయో, ఆ మూఢ బుద్ధిగలవారే అన్య దేవతలను పూజిస్తారు అని అన్నాడు. రెండోసారి తొమ్మిదో అధ్యాయంలో అదే ప్రశ్నను తిరిగి లేవదీసి ఇలా అన్నాడు, ఎవరైతే ఇతర దేవతలను పూజిస్తారో, వారు కూడా నన్నే పూజిస్తారు, కానీ వారి ఆ పూజ విధి పూర్వక మయినది కాదు. అంటే శాస్త్రంలో

నిర్ధారించబడిన విధికి భిన్నమయినది, కాబట్టి అది వినష్టమయి పోతుంది. ఇక్కడ పదిహేడో అధ్యాయంలో వారిని ఆసురీ స్వభావం గలవారని అన్నాడు. శ్రీకృష్ణుని మాటలలో ఒక్క పరమాత్ముడినే పూజించాలనే విధానం ఉంది.

ఆ తరువాత యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు నాలుగు విషయాలు గురించి చర్చించాడు. – ఆహారం, యజ్ఞం, తపస్సు మరియు దానం. ఆహారం మూడు రకాలు. సాత్త్విక పురుషులకు ఆరోగ్యాన్నియిచ్చే, స్వాభావికంగా ప్రియమయ్యే, స్నిగ్ధ ఆహారం ప్రియమయినది. రాజస పురుషులకు చేదు, అతి వేడి, కారం, మసాలా, రోగ వర్ధకం అయిన ఆహారం ప్రియమయినది. తామస పురుషులకు ఎంగిలి, పాసిపోయినది మరియు అపవిత్రమయిన ఆహారం ప్రియమయినది.

శాస్త్ర విధిచే నిర్ధిష్టమయిన యజ్ఞం (ఆరాధన యొక్క అంతః క్రియ), మనస్సును నిరోధించేది, ఫలాకాంక్షచే రహితమైనది, సాత్త్వికమయినది. ఆడంబర ప్రదర్శనం మరియు ప్రతిఫలం కోసం చేయబడితే అదే యజ్ఞం రాజస యజ్ఞం మరియు శాస్త్ర విధిచే రహితమయి, మంత్రదాన శ్రద్ధా రహితమై చేసిన యజ్ఞం తామస యజ్ఞం అవుతుంది.

పరమదేవుడయిన పరమాత్మునిలో ప్రవేశం ఇప్పించే అన్ని యోగ్యతలూ ఎవరిలో ఉన్నాయో, ప్రజ్ఞుడయిన ఆ సద్గురు అర్చన – సేవా, అంతః కరణంలో అహింస, బ్రహ్మచర్యం, ప్రవిత్రతలకు అనుగుణంగా శరీరాన్ని తపింపచేయడం శారీరిక తపస్సు. సత్యం, ప్రియమనిపించేట్లుగా మరియు హితవచనాలు చెప్పడం వాక్కు యొక్క తపస్సు, మరియు మనస్సును కర్మలో ప్రవృత్తం చేయడం, ఇష్టదైవాన్ని తప్ప విషయ చింతనపట్ల మనస్సును నిర్లిప్తంగా ఉంచడం – మనస్సుకి సంబంధించిన తపస్సు. మనస్సు, వాక్కు మరి శరీరం మూడింటినీ కలిపి పరమాత్మ వైపుకు తపింప చేయడం సాత్త్విక తపస్సు. రాజస తపస్సులో కోరికలతో బాటు ఆ తపస్సునే చేయడమవుతుంది, మరి తామసీ తపస్సు శాస్త్ర విధిచే రహితమయి, స్వేచ్ఛానుసారంగా చేయబడుతుంది.

కర్తవ్యమనుకొంటూ, దేశకాలాలూ మరియు పాత్రను ఎంచుకొని, శ్రద్ధా పూర్వకంగా యిచ్చిన దానం సాత్త్వికమయినది. ఏదో లాభానికై, లోభంతో, ఇష్టం లేకుండా బలవంతంగా ఇచ్చే దానం రాజస దానం. మరియు చీదరించుకొంటూ, అయోగ్యుడికి ఇచ్చే దానం తామసిక మయినది.

'ఓం' తత్ మరియు సత్‌ల స్వరూపం గురించి చెబుతూ యోగేశ్వరుడు ఇలా అన్నాడు – ఈ నామాలు పరమాత్ముణ్ణి స్మృతి పథంలోకి తెస్తాయి. శాస్త్ర విధిచే నిర్ధారితమయిన తపస్సు, దానం మరియు యజ్ఞాలను ఆరంభం చేయడంలో 'ఓం' యొక్క ప్రయోగం చేయబడుతుంది మరియు పూర్తయినప్పుడే 'ఓం' మనల్ని వదులుతుంది. తత్ అంటే అర్థం – ఆ పరమాత్ముడు. అతని పట్ల సమర్పితమయితేనే ఆ కర్మ పూర్తి అవుతుంది. మరియు ఎప్పుడైతే కర్మ ధారావాహికంగా అవుతుందో, అప్పుడు 'సత్' యొక్క ప్రయోగం అవుతుంది. భజనే సత్. సత్ పట్ల భావన మరియు సాధుబావంలోనే 'సత్' యొక్క ప్రయోగం జరుగుతుంది. పరమాత్ముని ప్రాప్తికలిగించే కర్మ, యజ్ఞం, దానం మరియు తపస్సు పరిణామంలో కూడా

'సత్' యొక్క ప్రయోగం జరుగుతుంది. మరియు పరమాత్మునిలో ప్రవేశం ఇప్పించే కర్మ నిశ్చయ పూర్వకమయిన 'సత్', కానీ వీటిన్నింటితో శ్రద్ధ అవసరం. శ్రద్ధచే రహితమయి చేసిన కర్మ, ఇచ్చిన దానం, చేసిన తపస్సు ఈ జన్మలో లాభదాయకమయినవి కావు మరియు వచ్చే జన్మలో కూడా కాలేవు. శ్రద్ధ తప్పనిసరిగా ఉండాలి.

సంపూర్ణ అధ్యాయంలో శ్రద్ధపై వివరణ ఇవ్వబడింది. మరియు చివరిలో 'ఓం' తత్, మరియు సత్ యొక్క విశిష్టమయిన వ్యాఖ్య ప్రస్తుతీకరించబడింది. ఇవి గీతాశ్లోకాలలో మొదటిసారి వచ్చాయి.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మ విద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే ఓం తత్సత్ శ్రద్ధాత్రయ విభాగ యోగో' నామ సప్తదశోధ్యాయః ॥17॥

ఈ ప్రకారంగా శ్రీమద్భగవద్గీతా రూపీ ఉపనిషత్తు మరియు బ్రహ్మ విద్య మరియు యోగశాస్త్రమనే విషయంలో శ్రీకృష్ణుడు మరియు అర్జునుడి సంవాదంలో ఓం తత్సత్ శ్రద్ధాత్రయ విభాగ యోగం, అనే పేరుగల పదిహేడవ అధ్యాయం పూర్తయింది.

ఇతి శ్రీమత్పరమహంస పరమానందస్య శిష్యస్వామీ అడగడానందకృతే శ్రీమద్ భగవద్గీతా యాః - 'యథార్థ గీతా' భాష్యే'ఓం తత్సత్ శ్రద్ధాత్రయ విభాగయోగో నామ సప్తదశోధ్యాయః ॥17॥

ఈ ప్రకారంగా శ్రీమత్పరమహంస పరమానందగారి శిష్యుడు స్వామి అడగడానంద గారిచే రచించబడిన శ్రీమద్ భగవద్ గీత యొక్క భాష్యం 'యథార్థ గీత'లో ఓం తత్సత్ శ్రద్ధాత్రయ విభాగ యోగమ్' అనే పేరుగల పదిహేడవ అధ్యాయం పూర్తయింది.

॥ హరి ః ఓం తత్సత్ ॥

ॐ

శ్రీ పరమాత్మనే నమః

# అష్టాదశ అధ్యాయము

ఇది గీత యొక్క అంతిమ అధ్యాయం. దీని పూర్వార్థంలో యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు అనేక ప్రశ్నలకు చెప్పిన సమాధానాలు ఉన్నాయి మరియు ఉత్తరార్థం 'గీత యొక్క ఉపసంహారం'- 'గీత' వలన లాభం ఏమిటి? అన్న విషయాలు ఉన్నాయి. పదిహేడవ అధ్యాయంలో ఆహారం, తపస్సు, యజ్ఞం, దానం మరియు శ్రద్ధల యొక్క స్వరూపం, విభాగ సహితంగా చెప్పబడింది, అదే సందర్భంలో త్యాగం యొక్క రకాలు మిగిలిపోయాయి. మనుష్యుడు ఏమైన చేస్తే వాటికి కారణం ఏమిటి? ఎవరు చేయిస్తారు? భగవంతుడు చేయిస్తాడా లేక ప్రకృతా? ఈ ప్రశ్న మొదటి నుంచే ఆరంభం అయింది. దానిని ఈ అధ్యాయంలో మళ్ళీ వివరించడం జరిగింది. ఇదే రకంగా వర్ణ వ్యవస్థను గురించిన చర్చ జరిగి ఉంది. సృష్టిలోదాని స్వరూపం విశ్లేషణ ఈ అధ్యాయంలో ప్రస్తుతీకరించబడింది. చివరిలో గీత వలన దొరికే విభూతుల గురించి వివరించబడింది.

గత అధ్యాయంలో అనేక విషయాల విభజనను గురించి విని, అర్జునుడు స్వయంగా ఒక ప్రశ్న వేశాడు-త్యాగం మరియు సన్యాసాలను గురించి కూడా విభాగసహితంగా చెప్పండి?

అర్జున ఉవాచ-

శ్లో ॥ సంన్యాసస్య మహాబాహో తత్త్వమిచ్ఛామి వేదితుమ్ ।
త్యాగస్య చ హృషీకేశ పృథక్కేశినిషూదన ॥1॥

అర్జునుడు అన్నాడు - హే మహాబాహో! హృదయం యొక్క సర్వస్వమైన వాడా! హేకేశిని షూదన! సన్యాసం మరియు త్యాగం యొక్కయథార్థం స్వరూపం గురించి వేరువేరుగా తెలుసుకోవాలనుకొంటున్నాను. పూర్ణత్యాగమే సన్యాసం. అందులో సంకల్పాలు మరియు సంస్కారాలు కూడా సమాప్తం అయిపోతాయి. దీని కంటే ముందు సాధన పూర్తి అయ్యే కాలంలో ఉత్తరోత్తరంగా ఆసక్తి త్యాగం చేయడమే నిజమైన త్యాగం. ఇక్కడ రెండు ప్రశ్నలున్నాయి-సన్యాసం యొక్క తత్వాన్ని తెలుసుకోవాలనుకుంటున్నాను. మరియు రెండవది త్యాగం యొక్క తత్వాన్ని తెలుసుకోవాలనుకొంటున్నాను. అప్పుడు యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు అన్నాడు.

శ్రీభగవానువాచ

శ్లో ॥ కామ్యానాం కర్మణాం న్యాసం సంన్యాసం కవయో విదుః ।
సర్వకర్మ ఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః ॥2॥

'అర్జునా! చాలా మంది పండితులు కామ్య కర్మలను త్యాగం చేయటాన్ని సన్యాసం అంటారు. మరియు చాలా మంది బుద్ధిమంతులు సంపూర్ణ కర్మఫలాలను త్యాగం చేయటాన్ని త్యాగం అంటారు.

శ్లో ॥ త్యాజ్యం దోష వదిత్యేకే కర్మ ప్రాహుర్మనీషిణః ।
యజ్ఞదానతపః కర్మన త్యాజ్యమితి చాపరే ॥3॥

చాలా మంది విద్వాంసులేమంటారంటే కర్మలన్నీ దోషయుక్త మయినవి, కాబట్టి త్యజించడానికి యోగ్యమయినవి. మరియు యితర విద్వాంసులేమంటారంటే-యజ్ఞం, దానం మరియు తపస్సులు వదలి వేయడానికి యోగ్యమైనవి కావు. ఈ ప్రకారంగా అనేక అభిప్రాయాలను వినిపింపి, యోగేశ్వరుడు తన, నిశ్చిత అభిప్రాయాన్ని చెప్తాడు.

శ్లో ॥ నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ ।
త్యాగో హి పురుషవ్యాఘ్ర త్రివిధః సంప్రకీర్తితః ॥4॥

హే అర్జునా! ఆ త్యాగం విషయంలో నువ్వు నా నిశ్చయాన్ని విను. హే పురుషశ్రేష్ఠా! ఆ త్యాగం మూడు రకాలని చెప్పబడింది.

శ్లో ॥ యజ్ఞదాన తపః కర్మ న త్యాజ్యం కార్యమేవ తత్ ।
యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్ ॥5॥

యజ్ఞం, దానం మరియు తపస్సు ఈ మూడు రకాల కర్మలు త్యాగం చేయడానికి యోగ్యమైనవి కావు. వీటిని తప్పకుండా చేయాలి. ఎందుకంటే యజ్ఞం, దానం మరియు తపస్సు-ఈ మూడే పురుషులను పవిత్రం చేసేవి.

శ్రీకృష్ణుడు ప్రచారంలో ఉన్న నాలుగు అభిప్రాయాలను చెప్పాడు. మొదటిది - కామ్యకర్మలను త్యాగం చేయడం, రెండవది-సంపూర్ణ కర్మఫలాలను త్యాగం చేయడం మూడవది దోషయుక్తంగా ఉండడం వలన అన్ని కర్మలనీ త్యాగం చేయడం మరియు నాలగవ అభిప్రాయం-యజ్ఞం, దానం మరియు తపస్సులు త్యాగం చేయ యోగ్యం కావు. వాటిలో నుంచి ఒక అభిప్రాయంతో తన అంగీకారం వ్యక్తం చేస్తూ అన్నాడు-అర్జునా! నాది కూడా యిదే నిశ్చితమయిన అభిప్రాయం- యజ్ఞం, దానం మరియు తపస్సులనబడే క్రియలు త్యాగం చేయ యోగ్యం కావు. దీని వలన ఋజువయ్యేదేమిటంటే కృష్ణుని కాలంలో కూడా చాలా అభిప్రాయాలు ప్రచారంలో ఉండేవి. వాటిలో ఒకటి యథార్థమయినది. ఈనాడు కూడా అదే పరిస్థితి. మహాపురుషులు ఈ ప్రపంచంలోకి వచ్చినప్పుడు, చాలా అభిప్రాయాల నుంచి కళ్యాణం చేసే అభిప్రాయాన్ని వెలికి తీసి, ముందు ఉంచుతారు. ప్రతి మహాపురుషుడుఇదే చేసాడు.

శ్రీకృష్ణుడు కూడా ఇదే చేసాడు. అతనేదో కొత్త మార్గం చూపలేదు, కానీ ప్రచారంలో ఉన్న అభిప్రాయాల నుంచి సత్యాన్ని సమర్థించి, దానిని స్పష్టం చేసాడు.

శ్లో // ఏ తాన్యపి తు కర్మాణి సంజ్గం త్యక్త్వా ఫలాని చ ।
కర్తవ్యానీతి మే పార్థ నిశ్చితం మత ముత్తమమ్ ॥6॥

యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు అంటాడు– పార్థా! యజ్ఞం, దానం మరియు తపస్సులనబడే కర్మలను, ఆసక్తి మరియు ఫలాన్ని త్యాగం చేసి, తప్పకుండా చేయాలి. ఇది నాచే నిశ్చయించబడిన ఉత్తమ అభిప్రాయం. ఇప్పుడు అర్జునుడి ప్రశ్నకు సమాధానంగా త్యాగాన్ని విశ్లేషించాడు–

శ్లో // నియతస్య తు సంన్యాసః కర్మణో నోపపద్యతే ।
మోహాత్తస్య పరిత్యాగస్తామసః పరికీర్తితః ॥7॥

హే అర్జునా నియత కర్మ (శ్రీకృష్ణుని శబ్దాలలో నియత కర్మ ఒక్కటే, యజ్ఞం యొక్క ప్రక్రియ. ఈ 'నియత' శబ్దాన్ని కనీసం ఎనిమిది–పదిసార్లు యోగేశ్వరుడు వాడాడు. దీనిపై సాధకుడు దారి తప్పి ఇంకేమీ చేయ కూడదనే ఉద్దేశ్యంతో, మరీ మరీ నొక్కి చెప్పాడు) ఈ శాస్త్రవిధిచే నిర్ధారితమయిన కర్మను వదలి వేయడం ఉచితమైనది కాదు. మోహం వలన దానిని త్యాగం చేయడాన్ని తామస త్యాగం అన్నారు. సంసారిక విషయ వస్తువుల పట్ల ఆసక్తిలో చిక్కుకొని కార్యం కర్మ (కార్యం కర్మ నియత కర్మ ఒకదానికొకటి పూరకాలు)ను త్యాగం చేయడం తామసీ త్యాగం. అలాంటిపురుషుడు 'అధః గచ్ఛతి' క్రిమి–కీటకాల అధమ జన్మలలోకి పోతాడు, ఎందుకంటే అతను భజన యొక్క ప్రవృత్తులను త్యాగం చేసాడు. ఇప్పుడు రాజసీ త్యాగం గురించి చెబుతాడు.

శ్లో // దుఃఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశభయాత్త్యజేత్ ।
సకృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్ ॥8॥

కర్మను దుఃఖ మయం అనుకొని, శారీరిక కష్టమనే భయం వలన, దానిని త్యాగం చేసే వ్యక్తి రాజసీ త్యాగం చేసి కూడా త్యాగం యొక్క ప్రతిఫలాన్ని పొందడు. ఎవరివలనైతే భజన పూర్తి కాదో మరియు 'కాయక్లేశభయాత్' శరీరానికి కష్టమవుతుందనే భయంతో కర్మను త్యాగం చేస్తే, ఆ మనుష్యుడి యొక్క త్యాగం రాజసీ త్యాగం అనబడుతుంది. అతనికి త్యాగం యొక్క ప్రతిఫలమయిన పరమశాంతి ప్రాప్తించదు. మరియు–

శ్లో // కార్యమిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున ।
సంజ్ఞం త్యక్త్వా ఫలం చైవస త్యాగః సాత్త్వికోమతః ॥9॥

హే అర్జునా! 'చేయడం కర్తవ్యం'– అలా అనుకొని ఏ 'నియతం' (శాస్త్ర విధిచే నిర్ధారితమయిన) కర్మను, సంగదోషాన్ని మరియు ఫలాన్ని త్యజించి చేయబడుతుందో, అది సాత్విక త్యాగం అనబడుతుంది. కాబట్టి నియత కర్మ చేయండి. మరియు ఇది తప్ప మిగిలిన

వాటన్నింటినీ త్యాగం చేయండి. ఈ నియత కర్మ కూడా ఎప్పటికీ చేస్తూనే ఉండాలా, లేక ఎప్పుడైనా దీన్ని త్యాగం చేయాలా? అప్పుడు శ్రీకృష్ణుడు అంటాడు, ఇప్పుడు అంతిమ త్యాగం యొక్క రూపు చూద్దాం.

శ్లో ॥ న ద్వేష్ట్య కుశలం కర్మ కుశలే నాను షజ్జతే ।
త్యాగీ సత్త్వ సమావిష్టో మేధావీ ఛిన్న సంశయః ॥**10**॥

హే అర్జునా! ఏ పురుషుడయితే 'అకుశలం కర్మ' అంటే అకళ్యాణ కారియగు కర్మ పట్ల (శాస్త్ర-నియత కర్మయే కళ్యాణకారి, దీనికి విరుద్ధంగా ఏదయినా సరే, ఈ లోకపు బంధమే, కాబట్టి అకళ్యాణ కారియే, అలాంటి కర్మలచే) ద్వేషం కలిగి ఉండడో మరియు కళ్యాణకారి అయిన కర్మలలో ఆసక్తుడు కాడో, చేయాల్సింది కూడా మిగిలిలేదు-అలాగ సత్వంతో కూడిన, సంశయ రహితుడయిన జ్ఞానవంతుడు త్యాగి అనబడతాడు. అన్నింటినీ వదిలి వేస్తాడు. కానీ బ్రహ్మప్రాప్తితో బాటు ఈ పూర్ణత్యాగమే సన్యాసం. ఇంకో సరళమయిన దారి ఉందేమో? అప్పుడు అంటాడు-లేదు. చూద్దాం.

శ్లో ॥ న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్య శేషతః ।
యస్తు కర్మఫల త్యాగీ స త్యాగీత్య భిధీయతే ॥**11**॥

దేహధారులయిన పురుషులచే (దేనినైతే మీరు చూస్తారో, కేవలం ఆ శరీరమే కాదు, శ్రీకృష్ణుడు చెప్పినట్లుగా ప్రకృతిచే ఉత్పన్నమయిన సత్వ-రజ తమ మూడు గుణాలే ఈ జీవాత్మను శరీరంలో బంధించుతాయి. ఎప్పటి వరకు గుణాలు జీవించి ఉంటాయో, అప్పటి వరకు అతను జీవాధారుడే. ఏదో ఒక రూపంగా శరీరం పరివర్తనమవుతూనే ఉంటుంది. దేహం యొక్క కారణం ఎప్పటి వరకు జీవించి ఉంటుందో) సంపూర్ణంగా అన్ని కర్మల త్యాగం సాధ్యం కాదు, కాబట్టి ఏ పురుషుడయితే కర్మ ఫలాన్ని త్యాగం చేస్తాడో, అతనే త్యాగి. అలా అని చెప్పబడింది. కాబట్టి ఎప్పటి వరకు శరీరానికి కారణం జీవించి ఉంటుందో, అప్పటి వరకు నియత కర్మ చేయండి. మరియు దాని ఫలాన్ని త్యాగం చేయండి. చేసిన కర్మకు బదులుగా ఏ ఫలాన్నీ ఆశించకండి. అలాగయితే కోరికలుగల పురుషుల కర్మలకు ఫలం కూడా ఉంటుంది.

శ్లో ॥ అనిష్టమిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలమ్ ।
భవత్యత్యాగినాం ప్రేత్య నతు సంన్యాసినాం క్వచిత్ ॥**12**॥

కోరికలుగల పురుషుల కర్మలకు మంచి, చెడు మరియు మిశ్రితమైన, అలా మూడు రకాల ప్రతి ఫలాలు, మరణించిన తరువాత కూడా ఉంటాయి. జన్మ జన్మాంతరాల వరకూ ఉంటాయి. కానీ 'సన్యాసినాం'-సర్వస్వం యొక్క న్యాసం (అంతం) చేసే పూర్ణత్యాగులయిన పురుషులకు, కర్మల యొక్క ప్రతిఫలం ఎప్పుడూ లభించదు. ఇదే అసలు సిసలైన సన్యాసం. సన్యాసం చరమోత్కృష్టమయిన అవస్థ. మంచి-చెడు కర్మల యొక్క ప్రతి ఫలం మరియు పూర్ణన్యాస కాలంలో వాటి అంతం అనే ప్రశ్నకు, సమాధానం లభించింది. ఇప్పుడు పురుషులచే శుభాశుభ కర్మలు జరగడానికి కారణం ఏమిటి? దీనిని గురించి-

శ్లో // పంచైతాని మహాబాహో కారణాని ని బోధమే ।
సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని సిద్ధయే సర్వ కర్మణామ్ ॥ **13**॥

హే మహాబాహో! సంపూర్ణ కర్మలు నెరవేరడంకోసం ఐదు కారణాలు సాంఖ్య సిద్ధాంతంలో చెప్పబడ్డాయి. వాటిని నువ్వు నా నుంచి చక్కగా తెలుసుకో.

శ్లో // అధిష్టానం తథా కర్తా కరణం చపృథ గ్విధం ।
వివిధాశ్చ పృథక్చేష్టా దైవం చైవాత్ర పంచమమ్ ॥ **14**॥

ఈ విషయంలో కర్త (ఈ మనస్సు), వేరు వేరు కరణలు (వేటి ద్వారా చేయబడతాయో అవి. శుభకార్యాలయితే వివేకం, వైరాగ్యం నిరోధం, నియంత్రణ, త్యాగం, అనవరత చింతన అనే ప్రవృత్తులు కరణాలు అవుతాయి. అశుభ కార్యాలయితే కామం, క్రోధం రాగద్వేషాలు, లోభం మొదలగునవి కరణాలు అవుతాయి. వీటి వల్లనే కర్మలు ప్రేరితమవుతాయి) నానా రకాలయిన వేరువేరు చేష్టలు (అనంతమయిన కోరికలు), ఆధారం! (అంటే సాధన, ఏ కోరికతో సాధన కలుస్తుందో, ఆ కోరిక నెరవేరుతుంది) మరియు ఐదవది హేతువు–దైవం (లేక) సంస్కారం.

శ్లో // శరీర వాఙ్మ నో భిర్యత్కర్మ ప్రారభతే నరః ।
న్యాయం వా విపరీతం వా పంచైతే తస్య హేతవః ॥ **15**॥

మనుష్యుని మనస్సు, వాక్కు, లేక శరీరంచే, శాస్త్రానికి అనుగుణంగా లేక విరుద్ధంగా ఏ కర్మ ఆరంభించినా సరే, వాటికి ఈ అయిదే కారణాలవుతాయి. కానీ ఇలా అయినా కూడా–

శ్లో // తత్రైవం సతి కర్తార మాత్మానం కేవలం తు యః ।
పశ్యత్య కృత బుద్ధిత్వాన్న స పశ్యతి దుర్మతిః ॥ **16**॥

ఏ పురుషుడయితే అశుద్ధ బుద్ధి కారణంగా ఆ విషయంలో కైవల్య స్వరూపమయిన ఆత్మను కర్తగా భావిస్తాడో, ఆ దుర్బుద్ధిగలవాడు యథార్థాన్ని చూడడు అంటే భగవంతుడు కర్త కాడు.

ఈ ప్రశ్నకు యోగ్వేరుడైన శ్రీకృష్ణుడు రెండవసారి వివరణ ఇచ్చాడు, ఐదో అధ్యాయంలో అతను అన్నాడు – ఆ ఈశ్వరుడు చేయడు, చేయించడు, క్రియల సంయోగాన్నే కుదర్చడు. మరి లోకులు అలా ఎందుకంటారు? మోహం చేత లోకుల బుద్ధి కప్పబడి ఉంది, కాబట్టివారు ఏమైనా అనవచ్చును. ఇక్కడ కూడా శ్రీకృష్ణుడు అంటాడు–కర్మ జరగడంలో ఐదు కారణాలు ఉంటాయి. దాని తరువాత కూడా ఎవరయితే కైవల్య స్వరూపుడయిన పరమాత్మను కర్తగా చూస్తాడో, ఆ మూఢ బుద్ధి (దుర్బుద్ధి) గలవాడు యథార్థాన్ని చూడడు, అంటే భగవంతుడు చేయడు; కానీ అర్జునుడి కొరకు అతను తొడలు కొట్టుకొని నిలబడతాడు 'నిమిత్త మాత్రం భవ' చేసే వాడిని, చేయించేవాడిని నేనే, నీవు 'నిమిత్త మాత్రుడవయి నిలబడు చాలు.' ఆఖరికి ఆ మహాపురుషుడు ఏం చెప్పాలనుకొంటున్నాడు?

వాస్తవానికి భగవంతుడు మరియు ప్రకృతుల మధ్య ఒక ఆకర్షణ రేఖ ఉంది. ఎప్పటి వరకు సాధకుడు ప్రకృతి యొక్క పరిధిలో ఉంటాడో, భగవంతుడు చేయడు. చాలా సమీపంలో ఉంటూ కూడా, ద్రష్టగానే ఉంటాడు. అనన్య భావంతో ఇష్టదైవాన్ని ఆశ్రయించినపుడు అతడు హృదయ దేశంలో సంచాలకుడు అయిపోతాడు. సాధకుడు ప్రకృతి యొక్క ఆకర్షణల పరిధి నుంచి వెలికి వచ్చి). అతని క్షేత్రంలోకి వచ్చేస్తాడు. అలాంటి అనురాగవంతుని కోసం అతను తొడలు కొట్టుకొని ఎల్లప్పుడూ నిలబడతాడు. కేవలం అతని కోసమే భగవంతుడు చేస్తాడు. కాబట్టి చింతనచేయండి. ప్రశ్నకు సమాధానం ముగిసింది. ఇంకా చూద్దాం-

శ్లో ॥ యస్య నాహం కృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే ।
హత్వాపి సఇమాన్ల్లోకాన్న హంతి న నిబధ్యతే ॥**17**॥

ఏ పురుషుడి యొక్క అంతః కరణంలో 'నేనే కర్తను' అనే భావం ఉండదో మరియు ఎవరి బుద్ధి, నిర్లిప్తమైనదో, ఆ పురుషుడు ఈ లోకాలన్నింటినీ చంపి కూడా, వాస్తవానికి చంపడు మరియు బంధించ బడడు. లోకానికి సంబంధించిన సంస్కారాల విలయమే లోక సంహారం. ఇప్పుడు ఆ నియత కర్మకు ప్రేరణ ఎలా కలుగుతుంది? దీనిని చూద్దాం.

శ్లో ॥ జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా ।
కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మ సంగ్రహః ॥**18**॥

అర్జునా! 'పరిజ్ఞాతా' అంటే పూర్ణ జ్ఞానులయిన మహాపురుషులచే, 'జ్ఞానం' దానిని తెలుసుకొను విధిచే మరియు 'జ్ఞేయం' తెలుసుకోదగ్గ వస్తువు (శ్రీకృష్ణుడు వెనుక చెప్పాడు- నేనే జ్ఞేయుడను, తెలుసుకో యోగ్యమయిన పదార్థాన్ని)చే కర్మ జేయడానికి ప్రేరణ లభిస్తుంది. మొదట పూర్ణ జ్ఞాని అయిన ఎవరో ఒక మహాపురుషుడు ఉండాలి. అతని ద్వారా ఆ జ్ఞానాన్ని తెలుసుకొనే విధి ప్రాప్తించాలి. లక్ష్యమైన జ్ఞేయంపై దృష్టి ఉండాలి. అప్పుడే కర్మకు ప్రేరణ దొరుకుతుంది. మరియు కర్త (మనస్సు యొక్క శ్రద్ధ), కారణం (వివేకం, వైరాగ్యం, నిరోధం, నియంత్రణ యిత్యాది) మరియు కర్మ యొక్క జ్ఞానం చేత, కర్మ సంగ్రహించబడుతుంది, కర్మ చేకూరడం మొదలవుతుంది. వెనుక చెప్పబడినట్లుగా-బ్రహ్మప్రాప్తి పొందిన తరువాత, ఆ పురుషుడు కర్మ చేయడం వలన ప్రయోజనం లేదు. మరియు వదిలేయడం వలన నష్టం లేదు. అయినా కూడా లోక హితానికై అంటే తరువాతి తరాలవారి హృదయంలో కళ్యాణకారి సాధన- సంగ్రహం కొరకు అతను కర్మలో వ్యవహరిస్తాడు. కర్త, కరణం మరియు కర్మల ద్వారా ఇవి కూడ బెట్ట బడతాయి. జ్ఞానం, కర్మ మరియు కర్తలు కూడా-మూడు-మూడు రకాలు.

శ్లో ॥ జ్ఞానం కర్మ చ కర్తాచ త్రిధైవ గుణ భేద తః ।
ప్రోచ్యతే గుణ సంఖ్యానే యథావచ్ఛృణు తాన్యపి ॥**19**॥

జ్ఞానం, కర్మ మరియు కర్త కూడా గుణాల తేడాల వలన సాంఖ్య శాస్త్రంలో మూడు రకాలని చెప్పబడింది, వాటిని కూడా నువ్వు యధావత్తుగా విను. మొదట జ్ఞానం యొక్క భేదాలు-

శ్లో ॥ సర్వభూతేషు యేనైకం భావమవ్యయ మీక్షతే ।
అవిభక్తం విభక్తేషు త జ్ఞానం విద్ధి సాత్త్వికమ్ ॥**20**॥

అర్జునా! ఏ జ్ఞానం వలన మనుష్యుడు వేరువేరుగా ప్రాణులన్నింటిలోనూ ఒకే ఒక అవినశ్వర పరమాత్మ భావాన్ని, విభాగ రహితంగా, ఏకైకంగా చూస్తాడో, ఆ జ్ఞానాన్ని నువ్వు సాత్వికమని తెలుసుకో. జ్ఞానం అనేది ప్రత్యేక్ష అనుభవం, దానితో బాటే గుణాలు అంతమయి పోతాయి. ఇది జ్ఞానం యొక్క పరిపక్వ అవస్థ. ఇప్పుడు రాజసి జ్ఞానం గురించి చూద్దాం.

శ్లో ॥ పృథక్త్వేన తు య జ్ఞానం నానా భావాన్ పృథగ్విధాన్ ।
వేత్తి సర్వేషు భూతేషు తజ్జ్ఞానం విద్ధి రాజసమ్ ॥**21**॥

ఏ జ్ఞానం సంపూర్ణ భూతాలలో విభిన్న రకాలయిన భావాలను వేరువేరుగా చేసి, యిది మంచి, యిది చెడు, అని తెలుసుకుంటుందో–ఆ జ్ఞానాన్ని నువ్వు రాజసీ జ్ఞానమని తెలుసుకో. అలాంటి స్థితి ఉంటే, రాజసీ స్థాయిలో నీ జ్ఞానం ఉంది. ఇప్పుడు చూద్దాం తామసీ జ్ఞానం–

శ్లో ॥ యత్తు కృత్స్న వదే కస్మి న్కార్యే సక్తమ హైతు కమ్ ।
అతత్త్వార్థ వదల్పం చ తత్తామ సముదాహృతమ్ ॥**22**॥

ఏ జ్ఞానం ఏక మాత్రం శరీరాన్నే సంపూర్ణం అని అనుకొని ఆసక్తమయి ఉంటుందో యుక్తిరహితంగా క్రియారహితంగా, తత్త్వానికి అర్థమైన పరమాత్ముని జ్ఞానం నుంచి వేరు చేస్తుందో మరియు తుచ్ఛమైనదో, అటువంటి ఆ జ్ఞానం తామసజ్ఞానం అనబడింది. ఇప్పుడు కర్మ యొక్క మూడు రకాలు.

శ్లో ॥ నియతం సంగరహిత మరాగ ద్వేషతః కృతమ్ ।
అఫల ప్రేప్సునా కర్మ యత్తత్సాత్విక ముచ్చతే ॥**23**॥

ఏ కర్మ 'నియతం' – శాస్త్ర విధిచే నిర్ధారిత మయిందో, వేరేదీ కాదో, ఏది సంగదోషం మరియు ప్రతిఫలాన్ని కోరని పురుషుని ద్వారా రాగద్వేషాలు లేకుండా చేయబడుతుందో, ఆ కర్మ సాత్త్విక కర్మ అనబడింది. (నియత కర్మ (ఆరాధన) చింతన, అది పరమంలో ప్రవేశం ఇప్పిస్తుంది.)

శ్లో ॥ యత్తు కామేప్సునా కర్మ సాహం కారేణ వా పునః ।
క్రియతే బహులా యాసం తద్రాజసముదాహృతమ్ ॥**24**॥

ఏ కర్మ చాలా శ్రమతో యుక్తమయినదో, ప్రతిఫలం పట్ల కోరికగలవానిచే మరియు అహంకార యుక్తుడయిన పురుషునిచే చేయబడుతుందో, ఆ కర్మ రాజసీ కర్మ అనబడింది. ఈ పురుషుడు కూడా నియత కర్మనే చేస్తాడు. కానీ తేడా ఏమిటంటే ప్రతిఫలవాంఛ మరియు అహంకారంతో యుక్తమై ఉంటాడు. కాబట్టి అతనిచే చేయబడే కర్మ రాజసీ కర్మ అవుతుంది. ఇప్పుడు చూద్దాం తామసీ కర్మ.

శ్లో ॥ అనుబంధం క్షయం హింసామన వేక్ష్య చ పౌరుషమ్ ।
మోహా దారభ్యతే కర్మ యత్తత్తామస ముచ్యతే ॥**25**॥

ఏ కర్మయితే చివరికి నష్టమయిపోతుందో, హింసా-సామార్థ్యన్ని చూడకుండా కేవలం మోహ వశంతో ఆరంభం చేయబడుతుందో. ఆ కర్మ తామస కర్మ అనబడుతుంది. ఇక్కడ స్పష్టమయ్యేదేమిటంటే ఆ కర్మ శాస్త్రం చెప్పిన నియత కర్మ కాదు. ఇది భ్రాంతి మాత్రమే. ఇప్పుడు కర్త యొక్క లక్షణాలు చూద్దాం-

శ్లో ॥ ముక్త సంగోఽనహం వాదీ ధృత్యుత్సాహసమన్వితః ।
సిద్ధ్య సిద్ధ్యోర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే ॥**26**॥

ఏ కర్తయితే సంగదోషంతో రహితుడు, అహంకారపు వచనాల్ని చెప్పనివాడు, ధైర్యం మరియు ఉత్సాహంచే యుక్తుడు, కార్యం నెరవేరడంలో మరియు నెరవేరకపోవడంలో హర్ష-శోకాలు మొదలగు వికారాలచే సర్వదా రహితుడు అయి కర్మలో (అహర్నిశలు) ప్రవృత్తుడవుతాడో, ఆ కర్త సాత్వికకర్త అనబడతాడు. ఇవే ఉత్తమ సాధకుని లక్షణాలు. కర్మ అదే-నియత కర్మ.

శ్లో ॥ రాగీ కర్మఫల ప్రేప్సుర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః ।
హర్షశోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః ॥**27**॥

ఆసక్తియుక్తుడు, కర్మల యొక్క ప్రతి ఫలాన్ని ఆశించువాడు, లోలుపుడు, ఇతర ప్రాణులకి కష్టం కలిగించువాడు, అపవిత్రుడు మరియు హర్ష-శోకాలచే లిప్తుడు అయిన ఆ కర్త రాజస కర్త అనబడతాడు.

శ్లో ॥ అయుక్తః ప్రాకృతః స్తబ్ధః శఠో నైష్కృతికోఽలసః ।
విషాదీ దీర్ఘ సూత్రీ చ కర్తా తామస ఉచ్యతే ॥**28**॥

చంచల చిత్తం గలవాడు, అసభ్యుడు, గర్వపోతు, ధూర్తుడు, ఇతరుల పనులలో అవరోధం (అడ్డంకులు) కలిగించువాడు, శోకించు స్వభావం గలవాడు, బద్ధకస్తుడు మరియు దీర్ఘసూత్రుడు, అంటే తరువాత చేద్దాంలే అనుకొనేవాడు అయిన ఆ కర్త తామసీ కర్త అనబడతాడు. దీర్ఘ సూత్రుడు కర్మను రేపటికి వాయిదా వేయువాడు, కానీ చేయాలనే కోరిక అతనికి కూడా ఉంటుంది. ఈ ప్రకారంగా కర్త యొక్క లక్షణాలు పూర్తయ్యాయి. ఇప్పుడు యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు క్రొత్త ప్రశ్నలను లేవదీస్తాడు-బుద్ధి, ధారణ మరియు సుఖాల యొక్క లక్షణాలు.

శ్లో ॥ బుద్ధేర్భేదం ధృతేశ్చైవ గుణత స్త్రివిధం శృణు ।
ప్రోచ్యమానమశేషేణ పృథక్త్వేన ధనంజయ ॥**29**॥

ధనంజయా! బుద్ధి మరియు ధారణా శక్తులు, గుణాల కారణంగా మూడు రకాలు. వాటిని సంపూర్ణంగా, విభాగ పూర్వకంగా నానించి విను.

శ్లో // ప్రవృత్తిం చ ని వృత్తిం చ కార్యాకార్యే భయాభయే ।
బంధం మోక్షం చ యా వేత్తి బుద్ధి స్సా పార్థ సాత్త్వికీ ॥30॥

పార్థా ఏ! ప్రవృత్తి-నివృత్తులను కర్తవ్యాకర్తవ్యాలను, భయా భయాలను మరియు బంధన- మోక్షాలను ఏ బుద్ధయితే యథార్థంగా తెలుసుకుందో, ఆ బుద్ధి సాత్విక బుద్ధి. అంటే పరమాత్మ పథం, ఆవాగమన (జనన-మరణచక్రం) రెండింటి గురించి చక్కగా తెలుసుకున్న బుద్ధి సాత్విక బుద్ధి, మరియు-

శ్లో // యయా ధర్మమధర్మం చ కార్యం చాకార్యమేవ చ ।
అయథా వత్ప్ర జానాతి బుద్ధి స్సా పార్థ రాజసీ ॥31॥

పార్థా! ఏ బుద్ధి ద్వారా మనుష్యుడు ధర్మాధర్మాలను మరియు కర్తవ్యాకర్తవ్యాలను కూడా యథావత్తు తెలుసుకోలేడో, అసంపూర్ణంగా తెలుసుకోగలడో, అలాంటి బుద్ధి రాజసీబుద్ధి, ఇప్పుడు తామసీ బుద్ధి యొక్క స్వరూపం చూద్దాం.

శ్లో // అధర్మం ధర్మమితి యా మన్యతే తమసాఽఽవృతా ।
సర్వార్థాన్ విపరీతాంశ్చ బుద్ధిస్సా పార్థ తామసీ ॥32॥

పార్థా! తమోగుణంచే కప్పబడి ఉన్న, ఏ బుద్ధి అధర్మాన్ని ధర్మంగా ఒప్పుకుంటుందో మరియు సంపూర్ణ హితాలను విపరీతంగా చూస్తుందో, ఆ బుద్ధి తామసీ బుద్ధి.

ఇక్కడ ముప్పయి నుంచి ముప్పై రెండు శ్లోకాల వరకు బుద్ధి యొక్క మూడు రకాలు చెప్పబడ్డాయి. మొదటి రకం బుద్ధి ఏ కార్యం నుంచి నివృత్తమవ్వాలి, ఏ కార్యంలో ప్రవృత్తమవ్వాలి, ఏది కర్తవ్యం మరియు ఏది అకర్తవ్యం, వీటి గురించి చక్కగా తెలుసుకుంటుంది, ఆ బుద్ధి సాత్త్విక బుద్ధి. ఏదయితే కర్తవ్యాకర్తవ్యాలను అస్పష్టంగా తెలుసుకుంటుందో, యథార్థాన్ని తెలుసుకోదో, అది రాజసీ బుద్ధి మరియు అధర్మాన్ని ధర్మమని, నశించేదానిని శాశ్వతమనీ, మరియు హితాన్ని అహితమనీ ఈ ప్రకారంగ విపరీతంగా తెలుసుకోనే బుద్ధి తామసీ బుద్ధి. ఈ ప్రకారంగా బుద్ధి యొక్క రకాల గురించి చెప్పడమయింది. ఇప్పుడు రెండవ ప్రశ్న 'ధృతి'-ధారణ మూడు రకాలు-

శ్లో // ధృత్యా యయా ధారయతే మనః ప్రాణేంద్రియక్రియాః ।
యోగేనా వ్యభిచారిణ్యా ధృతిః సా పార్థ సాత్త్వికీ ॥33॥

'యోగేన'-యోగీ ప్రక్రియ ద్వారా 'అవ్యభిచారిణీ' (యోగచింతన కాకుండా యింకేదైనా స్ఫురణకి రావడం వ్యభిచారం, చిత్తం తూలి పోవడమే వ్యభిచారం). కాబట్టి అలాంటి అవ్యభిచారిణీ ధారణచే మనుష్యుడు మనస్సు. ప్రాణం మరియు ఇంద్రియాల యొక్క క్రియలను ఏరకంగా ధారణ చేస్తాడో ఆ ధారణ సాత్విక ధారణ అనబడుతుంది. అంటే మనస్సు, ప్రాణం మరియు ఇంద్రియాలను ఇష్ట దైవం వైపుకు మళ్ళించడమే సాత్విక ధారణ మరియు-

శ్లో ॥ యయాతు ధర్మకామార్థాన్ ధృత్యా ధారయతేఽ ర్జున।
ప్రసంగేన ఫలాకాంక్షిధృతి స్సాపార్థ రాజసీ ॥**34**॥

హే పార్థా! ప్రతి ఫలాన్ని ఆశించే మనుష్యుడు అతి ఆసక్తిచే కేవలం, ధర్మం మరియు అర్థ, కామాలనే ధారణచేస్తాడో (మోక్షాన్ని కాదు) అది రాజసీ ధారణ. ఈ ధారణలో కూడా లక్ష్యం అదే, కేవలం వాంఛితుడవుతాడు, ఏం చేసినా సరే, దానికి బదులుగా ఏదో వాంఛిస్తాడు. ఇప్పుడు తామసీ ధారణ యొక్క లక్షణాలు చూద్దాం-

శ్లో ॥ యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవ చ ।
న విముంచతి దుర్మేధా ధృతి స్సా పార్థ తామసీ ॥**35**॥

హే పార్థా! దుష్ట బుద్ధి గల మనుష్యుడు ఏ ధారణ ద్వారా నిద్రా, భయం, చింతా, దుఃఖం మరియు అభిమానాలను (వీటిని వదిలి పెట్టడు) ధారణచేస్తూఉంటాడో, ఆధారణ తామసీ ధారణ. ఈ ప్రశ్నకు సమాధానం ఇవ్వబడింది. తరువాత ప్రశ్న-సుఖం.

శ్లో ॥ సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ ।
అభ్యాసాద్రమతే యత్ర దుఃఖాం తం చ ని గచ్ఛతి ॥**36**॥

అర్జునా! ఇప్పుడు సుఖం యొక్క మూడు రకాల్ని గురించి కూడా నా నుంచి విను. వానిలో ఏ సుఖంలో సాధకుడు అభ్యాసంచే రమించుతాడో అంటే చిత్తాన్ని కూడ గట్టి, యిష్టదైవంలో రమించుతాడో మరియు ఏదైతే దుఃఖాలను హరిస్తుందో, మరియు-

శ్లో ॥ యత్త దగ్రే విషమివ పరిణామేఽ మృతోపమం ।
తుత్సుఖం సాత్త్వికం ప్రోక్తమాత్మ బుద్ధి ప్రసాదజమ్ ॥**37**॥

పైన చెప్పబడిన సుఖం సాధన ఆరంభ కాలంలో విషంలాగా ఉంటుంది. (ప్రహ్లాదుడు శూలంపై ఎక్కించబడ్డాడు, మీరాకి విషం యివ్వబడింది. కబీరు అంటాడు- 'సుఖియా సబ్ సంసార్‌హై, ఖయో అవుర్ సోవే! దుంఖియా దాస్ కబీర్‌హై, జాగే అవుర్ రోవే' (సంపూర్ణ సంసారం తిని పడుకొని సుఖంగా వుంది, కానీ దాసు కబీరు మాత్రం మెలకువగా ఉండి ఏడుస్తూ, దుఃఖంలో ఉన్నాడు). కాబట్టి ఆరంభంలో విషంలాగ అనిపిస్తుంది.) కానీ పరిణామంలో మాత్రం అమృ తతుల్యం, అమృతత్వాన్ని ఇప్పిస్తుంది. కాబట్టి ఆత్మవిషయమనే బుద్ధి వలన ఉత్పన్నమయిన సుఖం సాత్విక సుఖం అనబడింది. మరియు-

శ్లో ॥ విషయేంద్రియ సంయోగాద్యత్త దగ్రేమృతోపమం ।
పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్ ॥**38**॥

ఏ సుఖమయితే విషయాలు మరియు ఇంద్రియాల సంయోగం, వలన లభిస్తుందో, అది అనుభవకాలంలో అమృతంలాగా ఉంటుంది. కానీ పరిణామంలో విషంలాగా ఉంటుంది, ఎందుకంటే అది జన్మ - మృత్యువులకు కారణం. ఆ సుఖం రాజసీ సుఖం అనబడింది.

శ్లో ॥ యదగ్రే చానుబంధే చ సుఖం మోహన మాత్మనః ।
నిద్రాలస్య ప్రమాదోత్థం తత్తామసముదాహృతమ్ ॥39॥

ఏ సుఖమయితే అనుభవించే కాలంలో మరియు పరిణామంలో కూడా ఆత్మను మోహంలో పడేస్తుందో, నిద్ర 'యానిశాసర్వభూతానం' జగత్తు అనే మత్తులో అచేతనంగా ఉంచుతుందో, బద్ధకం మరియు వ్యర్థమయిన చేష్టలచే ఉత్పన్నమయిన ఆ సుఖం తామస సుఖం అనబడింది. ఇప్పుడు యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు అందరినీ వెన్నంటి ఉన్న గుణాల ప్రభావం గురించి చెబుతాడు –

శ్లో ॥ న త దస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః ।
సత్త్వం ప్రకృతిజైర్ముక్తం యదేభి స్స్యాత్త్రిభిర్గుణైః ॥40॥

అర్జునా! పృధ్విలోగానీ, స్వర్గంలో గానీ, లేక దేవతలలో గానీ ఈ ప్రకృతి నుండి ఉత్పన్నమయిన మూడు గుణాలచే రహితమైనటువంటి ప్రాణి లేదు. బ్రహ్మ నుంచి క్రిమి – కీటకాల వరకు సమస్త జగత్తు – క్షణభంగురం, జనన – మరణాలతో కూడుకొన్నది, మూడు గుణాలకు లోనై ఉన్నారు. అంటే దేవతలు కూడా మూడు గుణాల ప్రభావానికి లోనైనవారే, నశ్వరులే.

ఇక్కడ బాహ్య దేవతల గురించి యోగేశ్వరుడు నాలుగవసారి చెప్పాడు. (ఏడు, తొమ్మిది, పదిహేడు మరియు యిక్కడ పద్దెనిమిదవ అధ్యాయంలో చెప్పడం జరిగింది) వీటన్నింటి అర్థం ఒక్కటే – దేవతలు మూడు గుణాలకు లోనైన వారే. వీరిని పూజించేవారు నశ్వరులయిన వారిని పూజిస్తారు. భాగవంతలో రెండవ స్కందంలో శుకదేవముని మరియు పరీక్షిత్తుల ప్రసిద్ధమైన కథ ఉంది, అందులో ఉపదేశం ఇస్తూ అతను ఇలా అంటాడు – స్త్రీ పురుషుల మధ్య ప్రేమ కోసం శంకరుడు–పార్వతిని, ఆరోగ్యం కోసం అశ్వనీ కుమారుల్ని, విజయంకోసం ఇంద్రుడ్ని మరియు ధనం కోసం కుబేరుణ్ణి పూజించాలి. ఇలాగే వివిధ కోరికలను గురించి చెబుతూ చివరిలో నిర్ణయం ఇస్తాడు – సమస్త కోరికలు తీరడానికి మరియు మోక్షానికి కేవలం నారాయణుణ్ణి పూజించాలి. 'తులసీ మూలహిం సీంచియే,, ఫూలయి ఫలయి అఘాయీ!' కాబట్టి సర్వవ్యాపకుడయిన ప్రభువు యొక్క స్మరణ చేయండి, దానికై సద్గురువు శరణు పొందండి. నిష్కపట భావంతో ప్రశ్నించి సేవించడమే ఏకైక ఉపాయం.

ఆసురీ మరియు దైవీ సంపదలు అంతః కరణం యొక్క రెండు ప్రవృత్తులు. వాటిలో దైవీ సంపద పరమదేవుడైన పరమాత్ముని యొక్క ద్దిగ్దర్శనం చేయిస్తుంది. కాబట్టిదైవీ అనబడుతుంది, కానీ ఇది కూడా మూడు గుణాలకు లోబడే ఉంది. గుణాలు శాంతించడంతో బాటు ఇవి కూడా శాంతించి పోతాయి. ఆ తరువాత ఆ అమృతతృప్తుడయిన యోగికి యింకే కర్తవ్యం మిగిలి ఉండదు. ఇప్పుడు చెప్పబోయేది లోగడ అడిగిన ప్రశ్నే. వర్ణవ్యవస్థకు సంబంధించినది. వర్ణం జన్మపై ఆధారపడిందా, లేక కర్మలచే పొందే అంతః కరణ యోగ్యత యొక్క పేరా? దీనిని గురించి ఆలోచిద్దాం.

శ్లో // బ్రాహ్మణ క్షత్రియ విశాం శూద్రాణాం చ పరం తప ।
కర్మాణి ప్రవి భక్తాని స్వభావ ప్రభవైర్గుణైః ॥41॥

హే పరంతపా ! బ్రహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రుల కర్మ స్వభావంచే ఉత్పన్నమయిన గుణాలచే విభజించబడింది. స్వభావంలో సాత్విక గుణం ఉంటే వారిలో నిర్మలత్వం ఉంటుంది., ధ్యానం - సమాధుల సామర్థ్యం ఉంటుంది. తామసీగుణం ఉంటే బద్ధకం, నిద్ర అజాగ్రత్త ఉంటాయి, అదే స్థాయిలో అతని కర్మ కూడా ఉంటుంది. ఏ గుణమయితే కార్యరతమై ఉంటుందో, అదే మీ వర్ణం, అదే స్వరూపం. ఈ ప్రకారంగానే సగం సాత్వికం మరియు సగం రాజసంచే కూడిన ఒక వర్గం క్షత్రియత్వంది. మరియు సగం కన్నా తక్కువ తామసీ మరియు విశేషంగా రాజసీచే ద్వితీయ వర్గం వైశ్య శ్రేణి అవుతుంది.

ఈ ప్రశ్నను యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు ఇక్కడ నాలుగవసారి చర్చించాడు. రెండో అధ్యాయంలో ఈ నాలుగు వర్ణాలలో ఒకటైన క్షత్రియులను ఉటంకిస్తూ ఇలా అన్నాడు - క్షత్రియులకోసం యుద్ధానికంటే మించిన శ్రేయస్కరమయిన ఇంకో మార్గం లేదు. మూడవ అధ్యాయంలో అతడు ఇలా అన్నాడు. దుర్బలమయిన గుణం గలవారు కూడా తమ స్వభావంచే ఉత్పన్నమయ్యే యోగ్యతలకి అనుగుణంగా ధర్మంలో ప్రవృత్తులవడం, దానిలో మరణించడం కూడ పరమ కళ్యాణ కరమయినది. ఇతరులను అనుకరించడం భయప్రదమయినది. నాలుగో అధ్యాయంలో ఇలా చెప్పాడు - నాలుగు వర్ణాలను నేను సృష్టించాను. ''అంటే మనుష్యులను నాలుగు జాతులుగా పంచాడా?'' అంటాడు-లేదు, 'గుణకర్మ విభాగశః' గుణాల యోగ్యతలచే కర్మను నాలుగు సోపానాలుగా విభజించడమయింది. ఇక్కడ గుణం ఒక కొలమానం మాత్రమే, దానిచే కొలిచి కర్మను చేసే సామర్థ్యాన్ని నాలుగు విభాగాలుగా పంచడమయింది. శ్రీకృష్ణుడి మాటలలో, కర్మ కేవలం అవ్యక్త పురుషుని ప్రాప్తికోసం చేసే క్రియ. ఈశ్వర ప్రాప్తి యొక్క ఆచరణే 'ఆరాధన'. దాని ప్రారంభం ఒకే ఇష్టదైవం పట్ల శ్రద్ధచే అవుతుంది. చింతన యొక్క విశేష విధిని, గురించి లోగడ చెప్పబడింది. ఈ యజ్ఞార్థ కర్మనే నాలుగు భాగాలుగా విభజించడమయింది. మనలో ఏ గుణం ఉంది మరియు ఏ శ్రేణికి చెందిన వారం అని ఎలా తెలుసుకోవడం? దీనిని గురించి యిక్కడ అంటాడు-

శ్లో // శమో దమస్తపః శౌచం క్షాంతిరార్జవమేవ చ ।
జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం బ్రహ్మకర్మ స్వభావజమ్ ॥42॥

మనస్సు యొక్క నిరోధం, ఇంద్రియాలపై నియంత్రణ, పూర్ణ పవిత్రత, మనస్సు వాక్కు మరియు శరీరాలను ఇష్టదైవానికి అనుగుణంగా తపింపచేయడం, క్షమాభావం, మనస్సు - ఇంద్రియాలు మరియు శరీరాల నిత్య సరళత్వం, ఆస్తిక బుద్ధి అంటే ఒకే ఇష్ట దైవంలో మంచి నమ్మకం, జ్ఞానం అంటే పరమాత్మని తెలుసుకొనే పద్ధతి, విజ్ఞానం అంటే పరమాత్ముడి నుంచి దొరికే నిర్దేశాల జాగృతి మరియు వాటికి అనుగుణంగా మసలే సామర్థ్యం, ఇవన్నీ స్వభావంచే ఉత్పన్నమయిన బ్రాహ్మణుని కర్మ. అంటే ఎప్పుడయితే స్వభావంలో ఈ యోగ్యతలన్నీ ఉంటాయో, కర్మ ధారావాహికంగా స్వభావంలో నెరవేరుతుందో, అప్పుడు అతను బ్రాహ్మణ శ్రేణికి చెందిన కర్త. మరియు

శ్లో ॥ శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధే చాప్యప లాయనమ్ ।
దానా మీశ్వర భావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్ ॥**43**॥

శూరవీరత్వం, ఈశ్వరీయ తేజస్సు దొరకడం, ధైర్యం, చింతనలో సామర్థ్యం అంటే 'కర్మ సు కౌశలం' కర్మ చేయడంలో దక్షత, ప్రకృతితో సంఘర్షణలో పారిపోని స్వభావం, దానం అంటే సర్వస్వం యొక్క సమర్పణం, అన్ని భావాలపై ఆధిపత్యం అంటే ఈశ్వరభావం-ఇవన్నీ క్షత్రియ 'స్వభావం నుంచి ఉత్పన్నమయ్యే కర్మలు, స్వభావంలో ఈ యోగ్యతలు ఉంటే ఆ కర్త క్షత్రియుడు. ఇప్పుడు వైశ్యుడు మరియు శూద్రుడి స్వరూపం గమనిద్దాం.

శ్లో ॥ కృషి గోరక్ష్యవాణిజ్యం వైశ్య కర్మ స్వభావజమ్ ।
పరిచర్యాత్మకం కర్మ శూద్ర స్యాపి స్వభావజమ్ ॥**44**॥

వ్యవసాయం, గోరక్షణ మరియు వాణిజ్యం వైశ్యుని స్వభావ జన్యమయిన కర్మలు, గోపాలనే ఎందుకు? గేదెలను చంపెయ్యాలా ? మేకల్ని ఉంచుకోకూడదా ? అదేం కాదు. విస్తృతమయిన వైదిక వాఙ్మయంలో 'గో' శబ్దం అంతః కరణం మరియు ఇంద్రియాలకు పర్యాయంగా ప్రచలితమయింది. గోరక్షణ అంటే అర్థం , ఇంద్రియాల రక్షణ, వివేకం - వైరాగ్యం-నిరోధం-నియంత్రణల ద్వారా ఇంద్రియాలు సురక్షితంగా ఉంటాయి. కామ,-క్రోధం-లోభం మోహాల ద్వారా ఇవి విభజించబడిపోతాయి. క్షీణించి పోతాయి. ఆత్మిక సంపత్తే స్థిరమయిన సంపత్తి. ఇది మన స్వంత ధనం, అది ఒకసారి తోడయిపోతే, ఎల్లప్పుడూతోడుగా ఉంటుంది. ప్రకృతి యొక్క ద్వంద్వాల నుంచి దానిని మెల్లమెల్లగా గ్రహించడమే వాణిజ్యం ('విద్యా ధనం సర్వ ధన-ప్రధానం'-దీనిని ఆర్జించడమే వాణిజ్యం) వ్యవసాయం ? శరీరమే ఒక క్షేత్రం (పొలం), దీని అంతరాళంలో నాటిన బీజాలు సంస్కారాల రూపంలో (మంచి-చెడు) మొలకెత్తుతాయి. అర్జునా! ఈ నిష్కామ కర్మలో బీజానికి అంటే ఆరంభానికి నాశనం లేదు. (కర్మ యొక్క ఈ మూడవ శ్రేణిలో కర్మ అంటే ఇష్టదైవ చింతన అదే నియత కర్మ) పరమతత్వం యొక్క చింతన అనే బీజం ఈ క్షేత్రంలో పడింది, దానిని సురక్షితంగా ఉంచుతూ, దానిలో వచ్చే విజాతీయ వికారాలను నిరాకరిస్తూ (కలుపుతీస్తూ) పోవడమే వ్యవసాయం.

శ్లో ॥ కృషీ వారహిం చతుర్ కిసానా ।
జిమి బుద్ తజహి మోహ మద్ మానా ॥॥ (మానసం 4/14/8)

ఈ ప్రకారంగా ఇంద్రియాల రక్షణ, ప్రకృతి ద్వంద్వాల నుంచి ఆత్మిక సంపత్తిని గ్రహించడం మరియు ఈ క్షేత్రంలో పరమతత్వ చింతన యొక్క సంవర్థనం - ఇవి వైశ్య శ్రేణి యొక్క కర్మలు.

శ్రీకృష్ణుడు చెప్పినట్లుగా 'యజ్ఞ శిష్టాశినః' పూర్తయ్యే కాలంలో యజ్ఞం దేనినైతే ఇస్తుందో, అదే-పరాత్పర బ్రహ్మ. దానిని ఆస్వాదించే సాధువులు సమస్త పాపాల నుండి విముక్తులయిపోతారు. అదే మెల్లమెల్లగా చింతన క్రియచే బీజారోపణ జరుగుతుంది. దాని

రక్షణే వ్యవసాయం. వైదిక శాస్త్రాలలో 'అన్నం' అంటే అర్థం పరమాత్ముడు. ఆ పరమాత్ముడే ఏకైక ఆహారం, అన్నం. చింతన పూర్తయ్యే కాలంలో ఆ ఆత్మ పరిపూర్ణంగా తృప్తి పొందుతుంది. ఇంకెప్పుడూ అతృప్తిని అనుభవించదు. జననమరణ చక్రంలోకి రాదు. ఈ అన్నం యొక్క బీజాన్ని నాటుతూ, ముందుకు వెళ్ళడమే వ్యవసాయం.

తమకంటే ఉన్నతమైన అవస్థలో ఉన్నవారికి, బ్రహ్మ ప్రాప్తి పొందిన గురుజనులకు సేవ చేయడం శూద్రుని యొక్క స్వభావజన్యమయిన కర్మ. శూద్రుడు అంటే అర్థం నీచుడని కాదు, అల్పజ్ఞుడని అర్థం. నిమ్నశ్రేణికి చెందిన సాధకుడే శూద్రుడు. ప్రవేశం పొందిన సాధకుడు పరిచర్యలతోనే ఆరంభించాలి. మెల్లమెల్లగా సేవలచే అతని హృదయంలో ఆ సంస్కారాలు వికసిస్తాయి. క్రమంగా పురోగమిస్తూ అతను వైశ్య, క్షత్రియ మరియు బ్రాహ్మణ శ్రేణికి చేరుకుంటాడు. ఆ తర్వాత వర్ణాలన్నింటినీ దాటివేసి అతను బ్రహ్మలో ప్రవేశం పొందుతాడు. స్వభావం పరివర్తన చెందేది. స్వభావం యొక్క పరివర్తనతో బాటు వర్ణ పరివర్తన కూడా జరుగుతుంది. వాస్తవానికి ఈ వర్ణాలు అతి ఉత్తమం, ఉత్తమం, మధ్యమం మరియు నికృష్టమనే నాలుగు దశలు. కర్మ పథంలో నడిచే సాధకులకు ఇవి ఉచ్చ – నీచమైన నాలుగు మెట్లు, ఎందుకంటే కర్మ అనేది ఒక్కటే, అది నియత కర్మ. శ్రీకృష్ణుడు అంటాడు–పరమ సిద్ధి ప్రాప్తికి ఇదే ఒక్క మార్గం–స్వభావంలో ఉన్న యోగ్యతలను బట్టి అక్కడి నుంచే సాధన మొదలు పెట్టాలి. దీనిని గమనిద్దాం.

శ్లో ॥ స్వే స్వే కర్మణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః ।
స్వ కర్మ నిరతః సిద్ధిం యథా విందతి తచ్ఛృణు ॥**45**॥

తమ తమ స్వభావంలో ఉండే యోగ్యతలను బట్టి కర్మను చేస్తున్న మనుష్యులు 'సంసిద్ధిం' భగవత్ప్రాప్తిరూపమైన పరమసిద్ధిని పొందుతారు. మొదట్లో కూడా అన్నాడు– ఈ కర్మచేసి నువ్వు పరమసిద్ధిని పొందుతావు. ఏ కర్మ – యజ్ఞార్థ కర్మ చెయ్యి. ఇప్పుడు స్వ కర్మ చేసే సామర్థ్యానికి అనుగుణంగా కర్మను చేస్తూన్న మనుష్యులు పరమసిద్ధిని ఏ ప్రకారంగా పొందుతారు? ఆ విధిని నువ్వు విను. (శ్రద్ధగా వినండి మీరందరూ)

శ్లో ॥ యతఃప్రవృత్తి ర్భూతానాం యేన సర్వమిదం తతమ్ ।
స్వ కర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః ॥**46**॥

ఏ పరమాత్ముని వలన భూతాలన్నింటి ఉత్పత్తి జరిగిందో, ఎవరు ఈ సమస్త జగత్తులో వ్యాప్తమయి ఉన్నాడో, ఆ పరమేశ్వరుని 'స్వకర్మణా' – తమ స్వభావంచే ఉత్పన్నమయిన కర్మద్వారా అర్చనచేసి, మానవ మాత్రులు పరమసిద్ధిని పొందుతారు. కాబట్టి పరమాత్ముని స్మరణ మరియు పరమాత్ముని సర్వాంగీణ అర్చన మరియు క్రమబద్ధ ఆచరణ అవసరం. చిన్న పిల్లలను పై తరగతిలో కూర్చోబెడితే, చిన్న తరగతిని కూడా పోగొట్టుకుంటాడు మరియు పెద్ద తరగతిలో కూడా ప్రవేశం దొరకనే దొరకదు. కాబట్టి కర్మ పథంలో సోపానాల వారిగా నడిచే విధానం ఉంది. అధ్యాయం 18/6లో చెప్పినట్లుగా. దీనిని తిరిగి వివరించి చెప్పాడు – మీరు అల్పజ్ఞులే అయినా సరే, అక్కడి నుంచే మొదలు పెట్టండి. ఆ విధి పరమాత్ముని పట్ల సమర్పణ భావం.

శ్లో // శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ ।
స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ॥**47**॥

చక్కగా అనుష్ఠానం చేసిన పరధర్మం కంటే, గుణరహితమయినా కూడా స్వధర్మం పరమ కళ్యాణాన్ని చేకూరుస్తుంది. 'స్వభావ నియతం'– స్వభావంచే నిర్ధారితమయిన కర్మ చేస్తూ మనుష్యుడు పాపం అంటే జనన మరణాలను పొందడు. సాధారణంగా సాధకులకు విసుగు పుడుతుంది – 'మేము సేవ చేస్తూనే ఉండాలి. మీరేమో ధ్యానస్తులయి ఉన్నారు, మంచి గుణాల కారణంగా వారికి ఆ గౌరవం లభిస్తున్నది' అని అనుకొని వెంటనే వారు సద్గురువును అనుకరించడం మొదలు పెడతారు. శ్రీకృష్ణుడు చెప్పినట్లు అనుకరణ, లేక ఈర్ష్య వలన ఏమీ లాభం ఉండదు. తమ స్వభావానికి అనుగుణంగా కర్మ చేసే సామర్థ్యాన్ని బట్టి కర్మ చేసే వారెవరయినా పరమసిద్ధిని పొందవచ్చు. కర్మ వదలి పెట్టి మాత్రం కాదు.

శ్లో // సహజం కర్మ కౌంతేయ సదోషమపి న త్యజేత్ ।
సర్వారంభా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః ॥**48**॥

కౌంతేయా ! దోషయుక్తుడు కూడా (అల్పజ్ఞుడయితే యిప్పుడింకా దోషాలు బహుళంగా ఉన్నాయనీ, అలాంటి దోషయుక్తుడనీ బుజువు అవుతుంది) 'సహజం కర్మ' – స్వభావంచే ఉత్పన్నమయిన సహజ కర్మను వదలివేయ కూడదు, ఎందుకంటే పొగచే అగ్ని ఆవృత్తమయినట్లు అన్ని కర్మలూ ఏదో ఒక దోషంచే ఆవృత్తమయి ఉంటాయి. బ్రాహ్మణశ్రేణి ఎందుకు కాకూడదు, కర్మ చేయక తప్పదు గదా. బ్రహ్మ స్థితి దొరకనంత వరకూ దోషాలు ఉండనే ఉంటాయి, ప్రకృతి యొక్క ఆవరణ కూడా ఉండనే ఉంటుంది. బ్రాహ్మణశ్రేణి యొక్క కర్మ కూడా బ్రహ్మలో ప్రవేశించడంతో విలయమయి పోయినప్పుడు ఆ దోషాలు నశించి పోతాయి. ఎప్పుడయితే కర్మ వలన ప్రయోజనం ఉండదో, అట్టి బ్రహ్మప్రాప్తి పొందిన వారి లక్షణాలు ఏమిటి?

శ్లో // అసక్త బుద్ధిః సర్వత్ర జితాత్మా విగతస్పృహః ।
నైష్కర్మ్య సిద్ధిం పరమాం సంన్యాసేనాధిగచ్ఛతి ॥**49**॥

ఎల్లప్పుడూ ఆసక్తిచే రహితమయిన బుద్ధి గలవాడు, స్పృహచే సర్వదా రహితుడయిన వాడు, అంతఃకరణాన్ని జయించిన పురుషుడు 'సన్యాసినాం' – సర్వస్వం యొక్క న్యాసం చేసిన దశలో పరమ నైష్కర్మసిద్ధిని పొందుతాడు. ఇక్కడ సన్యాసం మరియు నైష్కర్మ్య సిద్ధి రెండూ పర్యాయ వాచకాలు. ఎక్కడికయితే నిష్కామ కర్మయోగి చేరుతాడో, అక్కడికే సాంఖ్య యోగి కూడా చేరుతాడు. ఈ అవకాశం రెండు రకాల పథికులకూ సమానం. ఇప్పుడు పరమ నైష్కర్మ్య సిద్ధిని పొందిన పురుషుడు ఎలా బ్రహ్మను పొందుతాడు? దానిని సంక్షేపంగా వర్ణించాడు.

శ్లో // సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాప్నోతి ని బోధ మే ।
సమాసేనైవ కౌంతేయ నిష్ఠా జ్ఞానస్య యా పరా ॥**50**॥

కౌంతేయా ! జ్ఞానానికి పరానిష్ఠా, పరాకాష్ఠ అయిన ఆ పరమ సిద్ధిని పొందిన పురుషుడు

బ్రహ్మను ఎలా పొందుతాడో, ఆ విధిని నీవు సంక్షేపంగా నానుండి విను. తర్వాతి శ్లోకంలో ఆ విధిని గురించి చెప్పబోతున్నాడు, (శ్రద్ధగా వినండి).

శ్లో ॥ బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాత్మానం నియమ్య చ ।
శబ్దాదీన్ విషయాంస్త్యక్త్వా రాగ ద్వేషౌ వ్యుదస్య చ ॥**51**॥

శ్లో ॥ వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయ మానసః ।
ధ్యాన యోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః ॥**52**॥

అర్జునా ! విశేషంగా శుద్ధమయిన బుద్ధిచే యుక్తుడయి, ఏకాంతం మరియు శుభప్రదమైన ప్రదేశంలో ఉండే, సాధనకు సహాయకమైనంతే ఆహారాన్ని మాత్రమే తినే, మనస్సు వాక్కు మరియు శరీరాన్ని జయించిన, ధృడవైరాగ్యాన్ని చక్కగా పొందిన పురుషుడు నిరంతరం ధ్యానయోగ పరాయణుడయిన మరియు ఇలాంటి ధారణచే యుక్తుడయిన అంటే వీటన్నింటినీ ధారణ చేసిన మరియు అంతఃకరణాన్ని వశం చేసుకొని, శబ్దాది విషయాలను త్యజించి వేసిన, రాగద్వేషాలను దూరం చేసిన మరియు

శ్లో ॥ అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్ ।
విముచ్య నిర్మమః శాంతో బ్రహ్మభూయాయ కల్పతే ॥**53**॥

అహంకారాన్ని, బలాన్ని, దర్పాన్ని, కామాన్ని, క్రోధాన్ని, బయటి వస్తువులను మరియు లోపలి చింతనలను త్యజించి వేసిన, మమతా రహితుడయిన, శాంతమైన అంతః కరణంగల పురుషుడు పరబ్రహ్మతో ఏకీభావం పొందడానికి యోగ్యుడు. ముందుకు చూద్దాం.

శ్లో ॥ బ్రహ్మ భూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి ।
సమ స్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్ ॥**54**॥

బ్రహ్మతోబాటు ఏకీభావం పొందే యోగ్యతగల ఆ ప్రసన్న చిత్తుడయిన పురుషుడు ఏ వస్తువుకోసం కూడా శోకించడు మరియు దేనినీ ఆకాంక్షించడు. భూతాలన్నింటిలోనూ సమభావం గల అతను భక్తి యొక్క పరాకాష్ఠకు చెంది వున్నాడు. భక్తి తనపరిణామాన్ని ఇచ్చే స్థితిలో ఉంటుంది. అప్పుడు బ్రహ్మలో ప్రవేశం దొరుకుతుంది. ఇప్పుడు–

శ్లో ॥ భక్త్యా మామభిజానాతి యావాన్యశ్చాస్మి తత్త్వతః ।
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరమ్ ॥**55**॥

ఆ పరాభక్తి ద్వారా అతను నన్ను తత్వంతో సహా చక్కగా తెలుసుకొంటాడు, ఆ తత్వం ఏమిటి? నేను ఎలాంటి ప్రభావం గలవాడను? అజరం–అమరం శాశ్వతం మొదలగు ఎలాంటి అలౌకిక గుణధర్మాలు గలవాడిని? అన్న విషయాలను తెలుసుకొంటాడు. మరియు నన్ను తత్త్వంతో తెలుసుకొని వెంటనే నాలో ప్రవేశం పొందుతాడు. బ్రహ్మ ప్రాప్తి కాలంలో భగవంతుడు కనిపిస్తాడు. మరియు ప్రాప్తి పొందిన వెంటనే తక్షణం అతను తన ఆత్మస్వరూపాన్నే ఆ ఈశ్వరీయ గుణధర్మాలతో యుక్తమయి ఉండటం చూస్తాడు–ఆత్మే అజరం, అమరం, శాశ్వతం అవ్యక్తం మరియు సనాతనం.

రెండవ అధ్యాయంలో యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు అన్నాడు–ఆత్మే సత్యం, సనాతనం, అవ్యక్తం మరియు అమృత స్వరూపం, కానీ యీ విభూతులతో యుక్తమయిన ఆత్మను కేవలం తత్వదర్శకులు మాత్రమే చూస్తారు. ఇప్పుడు స్వాభావికంగా వచ్చే ప్రశ్న ఏమిటంటే తత్త్వ దర్శనం అంటే ఏమిటి? చాలా మంది ఐదు తత్వాలు, అరవయి అయిదు తత్వాలు అంటూ భౌతికమైన లెక్కలు మొదలు పెడతారు. కానీ శ్రీకృష్ణుడు ఇక్కడ పద్దెనిమిదో అధ్యాయంలో నిర్ణయం ఇచ్చాడు–పరమతత్త్వం పరమాత్ముడే. ఎవ్వరైతే అతనిని తెలుసుకొంటారో, అతనే తత్వ దర్శకుడు. ఇప్పుడు మీకు తత్త్వం పట్ల వాంఛ ఉంటే, భజన–చింతన తప్పకుండా చేయండి.

ఇక్కడ నలభై తొమ్మిది నుంచి యాభై అయిదు శ్లోకాల వరకూ యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు స్పష్టం చేసిందేమిటంటే సంన్యాస మార్గంలో కూడా కర్మచేయాలి. అతడు అన్నాడు–'సంన్యాసేన'–సంన్యాసం ద్వారా (అంటే జ్ఞాన యోగం ద్వారా) కర్మ చేస్తూ–చేస్తూ, వాంఛా రహితుడయి, ఆసక్తి రహితుడయిన మరియు శుద్ధమయిన అంతః కరణాన్ని గెలిచిన పురుషుడు ఏ ప్రకారంగా నైష్కర్మ్యమనే పరమసిద్ధిని పొందుతాడో, దానిని సంక్షేపంగా నేను చెబుతాను. అహంకారం, బలం, దర్పం, కామం, క్రోధం, మదం, మోహం మొదలుగాగల, ప్రకృతిలో పడవేసే వికారాలు ఎప్పుడైతే సర్వదా శాంతించుతాయో మరియు వివేకం, వైరాగ్యం, నిరోదం, నియంత్రణ, ఏకాంత స్థలంలో ఉండటం, ధ్యానం ఇత్యాది బ్రహ్మలో ప్రవేశం ఇప్పించే యోగ్యతలు ఎప్పుడయితే పూర్ణంగా పరిపక్వమయి పోతాయో, ఆ సమయంలో అతడు బ్రహ్మను తెలుసుకొనడానికి యోగ్యుడవుతాడు. ఆ యోగ్యత యొక్క పేరే పరాభక్తి. ఈ యోగ్యత ద్వారానే అతను తత్వాన్ని తెలుసుకొంటాడు. తత్త్వం ఏమిటి? నన్ను తెలుసుకోవడం. భగవంతుడన్న మాట ఏమిటి, ఏ విభూతులచే అతను యుక్తుడో, అన్న విషయాలు తెలుసుకుంటాడు మరియు నన్ను తెలుసుకొని తక్షణం నాలోనే స్థితుడయిపోతాడు. అంటే బ్రహ్మ, తత్వం, ఈశ్వరుడు, పరమాత్ముడు మరియు ఆత్మ ఇవన్నీ ఒకదాని కొకటి పర్యాయాలు. ఒకటి తెలుసుకోవడంతోటే మిగిలినవన్నీ తెలుసుకోబడతాయి. ఇదే పరమసిద్ధి, పరమగతి, పరమధామం కూడా.

కాబట్టి గీత యొక్క ధృడ నిర్ణయం ఏమిటంటే సంన్యాసం మరియు నిష్కామ కర్మయోగం–రెండిటిలోనూ పరమ నైష్కర్మ్యసిద్ధిని పొందడానికి నియతకర్మ (చింతన) చేయడం అనివార్యం.

ఇప్పటి వరకూ సంన్యాసి కోసం భజన–చింతనల గురించి వివరణయిచ్చాడు. ఇప్పుడు సమర్పణ అంటూ అదే విషయాన్ని నిష్కామ కర్మయోగి కోసం కూడా చెబుతాడు–

శ్లో || సర్వకర్మాణ్యపి సదాకుర్వాణో మద్వ్యపాశ్రయః ।
మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతం పదమవ్యయమ్ ||**56**||

నా మీద విశేషంగా ఆశ్రితుడయిన పురుషుడు అన్ని కర్మలనూ ఎల్లప్పుడూచేస్తూ, లేశ మాత్రం కూడా తప్పులేకుండా చేస్తూ, నా కృపా ప్రసాదంచే శాశ్వతమయిన, అవినశ్వరమైన పరమ

పదాన్ని పొందుతాడు. కర్మ అదే – నియత కర్మ, యజ్ఞం యొక్క ప్రక్రియ. పూర్ణ యోగేశ్వరుడైన సద్గురువును ఆశ్రయించిన సాధకుడు అతని కృపా ప్రసాదం వలన శీఘ్రంగానే అవినశ్వరపదాన్ని పొందుతాడు. కాబట్టి దానిని పొందుటకు సమర్పణ భావం అవసరం.

శ్లో ॥ చేతసా సర్వ కర్మాణి మయి సంన్యస్య మత్పరః ।
బుద్ధియోగ ముపాశ్రిత్య మచ్చిత్తః సతతం భవ ॥**57**॥

కాబట్టి అర్జునా! సంపూర్ణ కర్మలను (నీచే చేయవీలైనంత) మనః పూర్వకంగా నాకు అర్పించి, స్వశక్తిమీద గాక, నాకు సమర్పణచేసి, నా పరాయణుడవయి, బుద్ధియోగం అంటే యోగం యొక్క బుద్ధిని అవలంభించి నిరంతరం నాలో చిత్తాన్ని ఉంచుము. యోగం ఒక్కటే, అది సర్వదా దుఃఖాల్ని అంతం చేసేది మరియు పరమతత్వమయిన పరమాత్మునిలో ప్రవేశం యిప్పించేది. దాని క్రియ కూడా ఒక్కటే–యజ్ఞం యొక్క ప్రక్రియ, అది మనస్సు మరియు ఇంద్రియాల సంయమనంపై, శ్వాస– ప్రశ్వాసలు మరియు ధ్యానంపై ఆధారపడి ఉంటుంది. దాని పరిణామం కూడా ఒకటే–'యాంతి బ్రహ్మ సనాతనం'. దీనిని గురించి ఇంకా అంటాడు.

శ్లో ॥ మచ్చిత్తః సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి ।
అథ చేత్త్వమహంకారాన్న శ్రోష్యసి వినంక్ష్యసి ॥**58**॥

ఈ ప్రకారంగా నాలో నిరంతరం చిత్తాన్ని ఉంచిన వాడవయి నువ్వు నా కృప వలన మనస్సు మరియు ఇంద్రియాలనే సంపూర్ణ దుర్గాలను అనాయాసంగా తరించి పోతావు. యింద్రాన ద్వార్ ఝురోఖా నానా। తహి తహ సుర బైఠే కరి థానా ॥ అవత్ దేఖ హిం విషయ్ బయారీ । తే హఠి దేహిం కపాట్ వుధారీ ॥ ఇవే దుర్జయమయిన దుర్గాలు. నా కృపవలన నువ్వు ఈ బాధలను అతిక్రమించగలవు. కానీ అహంకార కారణంచే నామాటల్ని వినకపోతే నువ్వు నష్టపోతావు. పరమార్థం నుండి దూరమవుతావు. తిరిగి దీనిని గురించి వివరణ యిస్తాడు.

శ్లో ॥ యదహం కార మాశ్రిత్యన యోత్స్య ఇతి మన్యసే ।
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి ॥**59**॥

నువ్వు ఏ అహంకారాన్ని ఆశ్రయించి యుద్ధం చేయనని అనుకొంటున్నావో, ఆ నీ నిశ్చయం మిథ్య, ఎందుకంటే నీ స్వభావం నిన్ను బలవంతంగా యుద్ధంలో ప్రవృత్తుణ్ణి చేస్తుంది.

శ్లో ॥ స్వభావజేన కౌంతేయ నిబద్ధః స్వేన కర్మణా ।
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్ కరిష్యస్యవశోపి తత్ ॥**60**॥

కౌంతేయా! మోహవశుడవై నువ్వు ఏ కర్మనయితే చేయకూడదను కొంటున్నావో, దాన్ని కూడా నీ స్వభావంచే ఉత్పన్నమయిన కర్మచే బంధించబడి ఉన్నందున పరవశుడవై చేస్తావు. ప్రకృతి యొక్క సంఘర్షణ నుంచి పారిపోలేని నీ క్షత్రియ శ్రేణి యొక్క స్వభావం నిన్ను సరాసరి కర్మలో దింపుతుంది. ఈ ప్రశ్నకు సమాధానం ఇవ్వడమైంది. ఇప్పుడు ఆ ఈశ్వరుడు ఎక్కడుంటాడు? దీనిని గురించి అంటాడు–

శ్లో ॥ ఈశ్వరః సర్వ భూతానాం హృద్దేశేర్జున తిష్ఠతి ।
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా ॥61॥

అర్జునా! ఆ ఈశ్వరుడు సంపూర్ణ భూత ప్రాణుల యొక్క హృదయ దేశంలో నివసించి ఉన్నాడు. ఇంత సమీపంగా ఉంటే లోకులు తెలుసుకోరెందకు? మాయారూపమైన యంత్రంలో చిక్కుకొని జీవులందరూ భ్రమచే ఆవాగమన చక్రంలో తిరుగుతూ ఉంటారు. అందుచే వారు హృదయస్థమైన ఆత్మను తెలుసుకోలేరు. ఈ యంత్రము చాలా బాధను కలిగించేది, ఇది మళ్ళీ మళ్ళీ నశించే కళేబరాల (శరీరాల)లో జీవాత్మను త్రిప్పుతూ ఉంటుంది. అలాంటప్పుడు ఎవరి శరణు పొందాలి?

శ్లో ॥ తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత ।
తత్ప్రసాదాత్పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్ ॥62॥

కాబట్టి హే భారతా! సంపూర్ణ భావంతో (హృదయ దేశంలో ఉన్న) ఆ ఈశ్వరుని అనన్య శరణు పొందు. అతని కృపా ప్రసాదంతో నువ్వు పరమశాంతి, శాశ్వత పరమధామాన్ని పొందుతావు. కాబట్టి ధ్యానం హృదయ దేశంలో చేయండి. ఇది తెలిసి ఉండి కూడా గుడి, మసీదు, చర్చీ లేదా ఇతరత్రా వెతకడం, సమయాన్ని వృథా చేయడమే. తెలియనంత వరకు అది స్వాభావికమే. ఈశ్వరుని నివాస స్థానం హృదయమే. భాగవతంలోని చతుఃశ్లోకీ గీత యొక్క సారాంశం కూడా ఇదే-అలాగయితే నేను సర్వత్రా ఉన్నాను, కానీ ప్రాప్తి అయ్యేది మాత్రం హృదయ దేశంలో ధ్యానించడం వల్లనే.

శ్లో ॥ ఇతితే జ్ఞాన మా ఖ్యాతం గుహ్యాద్ గుహ్యతరం మయా ।
విమృశ్యైత దశేషేణ యథేచ్ఛసి తథా కురు ॥63॥

ఈ ప్రకారంగా గోపనీయం (రహస్యం) కంటే కూడా గోపనీయమైన జ్ఞానాన్ని నీకోసం చెప్పాను. ఈ విధానంలో సంపూర్ణంగా ఆలోచించి, అప్పుడు నువ్వెలా కావాలనుకొంటే అలాచెయ్యి. సత్యం ఇదే, శోధించవలసిన స్థలం ఇదే, ప్రాప్తి పొందే స్థలం కూడా ఇదే. కానీ హృదయంలో స్థితుడయిన ఈశ్వరుడు కనిపించడు, దీనికి ఒక ఉపాయం చెబుతాడు.

శ్లో ॥ సర్వగుహ్యతమం భూయః శృణు మే పరమం వచః ।
ఇష్టోసి మే దృఢమితి తతో వక్ష్యామి తే హితమ్ ॥64॥

అర్జునా! సంపూర్ణంగా గోప్యనీయం కంటే కూడా అతి గోప్యమయిన రహస్యయుక్తమయిన నా మాటల్ని నువ్వు మళ్ళీ విను. (చెప్పాడు, కానీ మళ్ళీ విను. సాధకుడి కోసం ఇష్టదైవం సదా సంసిద్ధుడై ఉంటాడు). ఎందుకంటే నువ్వు నాకు అతిశయంగా ప్రియమయిన వాడివి, కాబట్టి ఈ పరమ హితాన్ని చేసే మాటల్ని నేను నీకోసం మళ్ళీ చెబుతాను. అవి ఏమిటి?

శ్లో ॥ మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।
మామేవైష్యసి సత్యంతే ప్రతిజానే ప్రియో సి మే ॥65॥

అర్జునా! నువ్వు నాపైన అనన్య మనస్సు కలవాడవయి ఉండు, నాకు అనన్య భక్తుడవు కమ్ము, నాపై శ్రద్ధతో పూర్ణుడవు కమ్ము (నా సమర్పణ భావంలో అశ్రుపాతం కావాలి) నాకే నమస్కరించు. అలా చేస్తే నువ్వు నన్నే పొందుతావు. ఇది నేను నీకోసం సత్యమయిన ప్రతిజ్ఞ చేసి చెబుతున్నాను. ఎందుకంటే నువ్వు నాకు అనన్య ప్రియమయిన వాడవు. లోగడ అన్నాడు– ఈశ్వరుడు హృదయ దేశంలో ఉన్నాడు, అతని శరణులోకి వెళ్లు. ఇక్కడ అంటాడు నా శరణులోకిరా. ఈ అతి గోపనీయ రహస్య యుక్తమయిన మాట విను–నాశరణులోకి రా. వాస్తవానికి యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు ఏం చెప్పాలనుకుంటున్నాడు? అదే, సాధకునికి సద్గురువు యొక్క శరణు అత్యంత ఆవశ్యకము. శ్రీకృష్ణుడు ఒక పూర్ణ యోగేశ్వరుడు. ఇప్పుడు సమర్పణ చేసే విధిని గురించి చెబుతాడు.

శ్లో ॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।
అహం త్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥66॥

సంపూర్ణ ధర్మాలను త్యాగం చేసి (అంటే నేను బ్రహ్మణ శ్రేణికి చెందిన కర్తను (లేక) శూద్ర శ్రేణికి చెందిన వాడిని, క్షత్రియుణ్ణి (లేక) వైశ్యుణ్ణి ఇలాంటి ఆలోచనలను వదలిపెట్టి) కేవలం ఒక్క అనన్యమైన నా శరణును పొందు. నేను నిన్ను సంపూర్ణ పాపాల నుంచి ముక్తుణ్ణి చేస్తాను. నువ్వు శోకించకు.

ఈ బ్రహ్మణ–క్షత్రియ మొదలగు వర్ణాల యొక్క ఆలోచన చేయక (యీ కర్మ పథంలో ఏ స్థాయి వాడు అనే దానిని గురించి ఆలోచించక) ఎవరైతే అనన్య భావంతో శరణు పొందుతారో, ఇష్టదైవాన్ని తప్పించి అన్యతః ఎవరినీ చూడరో, అతని క్రమంగా వర్ణపరివర్తనలో ఉత్థానం మరియు పూర్ణ పాపాల నుండి నివృత్తి (మోక్ష్య) మొదలయినవాటి బాధ్యత ఆ ఇష్టదైవమైన సద్గురువు స్వయంగా తనే స్వీకరిస్తాడు.

ప్రతి మహాపురుషుడూ యిదే అన్నాడు. శాస్త్రం వ్రాయబడి నప్పుడు, అది అందరి కోసం అనే అనిపిస్తుంది, కానీ వాస్తవానికి అది శ్రద్ధ గలవారికి మాత్రమే. అర్జునుడు అధికారి (యోగ్యుడు) కాబట్టి అతనికి నొక్కి చెప్పాడు. ఇప్పుడు దాని (గీత శాస్త్రానికి) అధికారి ఎవరన్నది యోగేశ్వరుడు స్వయంగా నిర్ణయిస్తాడు.

శ్లో ॥ ఇదంతే నాతపస్కాయ నాభక్తాయ కదాచన ।
న చాశు శ్రూషవే వాచ్యం న చ మాం యోభ్యసూయతి ॥67॥

అర్జునా! ఈ ప్రకారంగా నీ హితం కోసం చెప్పబడిన ఈ గీతోపదేశాన్ని ఏ కాలంలోనూ, మరచిపోయికూడా, తపస్సుచే రహితుడయిన మనుష్యునికి చెప్పకూడదు. భక్తి రహితుడయిన వారికి కూడా చెప్పరాదు. వినడానికి ఇష్టపడని వారికి కూడా చెప్పరాదు. నన్ను నిందించువారికి,

ఈ దోషం, ఆ దోషం అంటూ తప్పుడు ఆలోచన చేసేవారికి కూడా చెప్పరాదు. శ్రీకృష్ణుడు గొప్ప మహాపురుషుడే గదా, అతని కాలంలో స్తుతించువారితో పాటు నిందించువారు కూడా ఉండే ఉంటారు. వీరితో చెప్పరాదు. కానీ స్వాభావికంగా అడిగే ప్రశ్న ఏమిటంటే ఎవరికి చెప్పవచ్చును? అని చూద్దాం.

శ్లో // య ఇమం పరమం గుహ్యం మ ద్భక్తేష్వభి ధాస్యతి ।
భక్తిం మయి పరాం కృత్వా మామే వైష్యత్య సంశయః ॥68॥

ఏ మనుష్యుడయితే నా పరా భక్తిని పొంది ఈ పరమ రహస్యయుక్తమయిన గీతోపదేశాన్ని నా భక్తులకు చెప్తాడో, అతను నిస్సందేహంగా నన్నే పొందుతాడు. విన్న వారు కూడా, ఎందుకంటే ఉపదేశాన్ని బాగుగా విని హృదయంగమం చేసుకుంటారు, దాని ప్రకారం నడుస్తారు మరియు తరించిపోతారు. ఇప్పుడు ఆ ఉపదేశం చేసేవారిని గురించి చెబుతాడు–

శ్లో // న చ తస్మాన్మను ష్యేషు కశ్చిన్మే ప్రియ కృత్తమః ।
భవితా న చ మే తస్మాదన్యః ప్రియతరో భువి ॥69॥

దాని కంటే నాకు, అతిశయంగా ప్రియమయిన పని చేసేవారు మనుష్యులలో మరొకరు వుండరు మరియు అతనికంటే నాకు అత్యంత ప్రియమయిన వాడు భూలోకంలో ఇంకొకడు ఉండడు. ఎవరికన్న? ఎవ్వరైతే నా భక్తులకు నా వుపదేశాన్ని చెప్తాడో, వారిని అటువైపు, ఆపథంపై నడిపిస్తాడో, ఎందుకంటే కళ్యాణానికి అదే ఒక మార్గం, రాజ మార్గం. ఇప్పుడు అధ్యయనం గురించి చూద్దాం.

శ్లో // అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సం వాదమావయోః ।
జ్ఞాన యజ్ఞేన తేనా హమిష్టః స్యామితి మే మతిః ॥70॥

ఏ పురుషుడయితే యీ ధర్మమయిన మన యిద్దరి సంవాదాన్ని 'అధ్యేష్యతే'– బాగుగా మననం చేస్తాడో, అతని ద్వారా నేను జ్ఞాన యజ్ఞంచే పూజింపబడుదును. అంటే అలాంటి యజ్ఞానికి పరిణామం జ్ఞానము. దాని స్వరూపం లోగడ చెప్పబడింది. దాని తాత్పర్యం–సాక్షాత్కారంతో బాటు లభించే జ్ఞానం. అలా అని నా నిశ్చితాభిప్రాయం.

శ్లో // శ్రద్ధా వాననసూయశ్చ శృణుయాదపి యో నరః ।
సోఽపి ముక్తః శుభాన్ల్లోకాన్ ప్రాప్నుయాత్పుణ్య కర్మణామ్ ॥71॥

ఏ పురుషుడయితే శ్రద్ధతో యుక్తుడయి మరియు ఈర్ష్యా రహితుడయి కేవలం వింటాడో, అతను కూడా పాపాలనుంచి ముక్తుడయి ఉత్తమ కర్మలు చేసే వారి యొక్క శ్రేష్ఠమయిన లోకాలను పొందుతాడు. అంటే చేయడం కూడా చేతకానప్పుడు వినండి చాలు, ఉత్తమ లోకం అప్పుడు కూడా ఉంటుంది. ఎందుకంటే అతను చిత్తంలో ఆ ఉపదేశాన్ని గ్రహించుతాడు గదా. ఇక్కడ అరవయి ఏడు నుంచి డెబ్బై ఒకటి వరకు అయిదు శ్లోకాలలో భగవాన్ శ్రీకృష్ణుడు ఏం చెప్పాడంటే గీతోపదేశాన్ని అనధికారులకు చెప్పరాదు. కానీ శ్రద్ధాయుక్తుడికి తప్పక చెప్పవలెను. దానిని వినిన భక్తుడు నన్ను పొందుతాడు. ఎందుకంటే అతి గోపనీయమయిన కథను విన్న పురుషుడు నడవడం

మొదలు పెడతాడు. ఎవ్వరైతే భక్తులకు చెబుతాడో, అంతకంటే అధికంగా ప్రియమయిన వక్త నాకు యింకొకడు లేడు. ఎవరయితే అధ్యయనం చేస్తాడో, అతని ద్వారా నేను జ్ఞాన యజ్ఞంచే పూజించబడుదును. యజ్ఞం యొక్క పరిణామమే జ్ఞానం. ఎవరయితే గీతానుసారంగా కర్మ చేయడంలో అసమర్థుడో, కానీ శ్రద్ధతో మాత్రం వింటాడో, అతను కూడా పుణ్యలోకాలను పొందుతాడు. ఈ ప్రకారంగా భగవాన్ శ్రీకృష్ణుడు గీతను చెప్పడం – వినడం మరియు అధ్యయనాల ప్రతిఫలం గురించి చెప్పాడు. ప్రశ్నకు సమాధానం ముగిసింది. ఇప్పుడు చివరిలో అతను అర్జునుణ్ణి అడుగుతాడు–ఏమయినా అర్థమయిందా?అని.

శ్లో ॥ కచ్చిదేత చ్ఛ్రుతం పార్థ త్వయై కాగ్రేణ చేతసా ।
కచ్చిదజ్ఞాన సంమోహః ప్రనష్టస్తే ధనంజయ ॥**72**॥

హే పార్థా! నా ఈ వచనాల్ని నువ్వు ఏకాగ్రచిత్తంతో విన్నావా? నీ అజ్ఞానంచే ఉత్పన్నమయిన మోహం నష్టమయిందా? అప్పుడు అర్జునుడు అంటాడు.

శ్లో ॥ నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్ర సాదాన్మయాచ్యుత ।
స్తితోస్మి గత సందేహః కరిష్యే వచనం తవ ॥**73**॥

అచ్యుతా! మీ కృపవలన నామోహం నష్టమయిపోయింది, నాకు స్మృతి లభించింది. (ఏ రహస్యమయ జ్ఞానాన్నైతే మనువు స్మృతి పరంపర ద్వారా కొనసాగించాడో, దానినే అర్జునుడు పొందినాడు.) ఇప్పుడు సందేహ రహితుడనయి సంస్థితుడనయి ఉన్నాను. మరియు మీ ఆజ్ఞను పాలిస్తాను, కానీ (మొట్టమొదట) సైన్యాన్ని పరీక్షించినప్పుడు, రెండు సేనలలోనూ స్వజనులను చూసి అర్జునుడు వ్యాకుల పడి పోయాడు. అతనేమని నివేదించుకున్నాడంటే – గోవిందా! స్వజనులను చంపి మేమెలా సుఖంగా ఉంటాము? ఇలాంటి యుద్ధం వలన శాశ్వత కుల ధర్మం నష్టమయిపోతుంది. పిండోదక క్రియలు లుప్తమయి పోతాయి, వర్ణ సంకరం జరుగుతుంది. మనం అర్థం చేసుకోగలవారమయి ఉండి కూడా పాపాన్ని చేయ ఉద్యుక్తులమయ్యాం. దీని నుంచి తప్పించుకోందుకు ఉపాయం ఎందుకు ఆలోచించరాదు? శస్త్ర ధారులయిన ఈ కౌరవులు శస్త్ర రహితుడనయిన నన్ను రణంలో చంపవచ్చుగాక, ఆ చావడం కూడా శ్రేయస్కరమే. గోవిందా నేను యుద్ధం చేయను అంటూ అతను రథం వెనక భాగంలో కూర్చుండి పోయాడు.

ఈ ప్రకారంగా గీతలో అర్జునుడు యోగేశ్వరుడైన శ్రీకృష్ణుని ముందు ప్రశ్నల పరంపరలను గుప్పించాడు. ఎలా అంటే అధ్యాయం 2/7 దేని వలనయితే నేను పరమశ్రేయాన్ని పొందగలనో, ఆ సాధనను నాకై చెప్పండి 2/54 స్థిత ప్రజ్ఞుడైన మహాపురుషుడి యొక్క లక్షణం ఏమిటి? 3/1లో మీ దృష్టిలో జ్ఞాన యోగం శ్రేష్ఠమయినప్పుడు నన్ను భయంకర కర్మలలో ఎందుకు పడేస్తారు? 3/36 లో మనుష్యుడు వద్దనుకుంటూ కూడా ఎవరి ప్రేరణ వలన పాపాల్ని ఆచరించుతాడు? 4/4లో మీరు ఇప్పుడు జన్మించారు మరియు సూర్యుడు చాలా పురాతనమయినవాడు. మరి కల్పానికి ఆదిలో యోగాన్ని సూర్యునికి మీరే చెప్పారని నేనెలా నమ్మాలి? 5/1లో అప్పుడప్పుడు మీరు సంన్యాసాన్ని ప్రశంసిస్తారు, అప్పుడప్పుడు నిష్కామకర్మను ప్రశంసిస్తారు. వీటిలో ఒక దానిని

నిశ్చయం చేసి, దేని వల్లనయితే నేను పరమ శ్రేయాన్ని పొందగలనో, దానిని నాకు చెప్పండి. 6/35లో మనస్సు చంచలమయింది, మరి శిథిల ప్రయత్నం చేసే శ్రద్ధగల పురుషులు మిమ్మల్ని పొందక ఏ దుర్గతిని పొందుతారు? 8/1-2లో గోవిందా! ఎవరినైతే మీరు వర్ణించి చెప్పారో, ఆ బ్రహ్మ ఏమిటి? ఆ ఆధ్యాత్మం ఏమిటి? అధిదైవం, అధిభూతం అంటేఏమిటి? ఈ శరీరంలో అధియజ్ఞం ఎవరు? ఆ కర్మ ఏమిటి ? చివరి సమయంలో మీరు ఏ ప్రకారంగా తెలుసుకోబడుతారు? ఏడు ప్రశ్నలు అడిగాడు. అధ్యాం 10/17లో అర్జునుడు జిజ్ఞాసను చూపాడు-నిరంతరం చింతన చేస్తూ నేను ఏ ఏభావాల ద్వారా మిమ్మల్ని స్మరించగలను? 11/4లో అతను నివేదించుకున్నాడు-ఏ విభూతులను మీరు వర్ణించి చెప్పారో, నేను ప్రత్యక్ష్యంగా వాటిని చూడాలనుకొంటున్నాను. 12/1లో ఒక రకం భక్తులు అనన్య శ్రద్ధతో చక్కగా మీ ఉపాసన చేస్తారు. మరియు రెండవ రకం వారు అక్షరం అవ్యక్తం యొక్క ఉపాసన చేస్తారు. ఈ ఇద్దరిలో ఉత్తమ యోగవేత్త ఎవరు? 14/21లో మూడు గుణాల కంటే అతీతుడయినపురుషుడు ఏ లక్షణాలు గలవాడవుతాడు మరియు మనుష్యుడు ఏ ఉపాయం చేత ఈ మూడు గుణాల కంటే అతీతుడు కాగలడు? 17/1లో ఏ మనుష్యుడయితే పైన చెప్పబడిన శాస్త్ర విధిని వదలి వేసి, కానీ శ్రద్ధతో యుక్తుడయి యజ్ఞం చేస్తాడో అతని గతి ఏమౌతుంది. 18/1లో హే మహాబాహో నేను త్యాగం మరియు సంన్యాసం యొక్క స్వరూపాల్ని వేరు వేరుగా తెలుసుకోవాలనుకుంటున్నాను.

ఈ ప్రకారంగా అర్జునుడు ప్రశ్నిస్తూ పోయాడు, వేటినయితే అతను అడగలేక పోయాడో, ఆ గోపనీయ రహస్యాలను భగవంతుడు స్వయంగా చెప్పాడు. వీటికి సమాధానాలు లభించగానే, అతను ప్రశ్నల నుంచి విరతుడయి పోయాడు. మరియు ఇలా చెప్పాడు-గోవిందా! ఇప్పుడు నేను మీ ఆజ్ఞను పాలిస్తాను. వాస్తవానికి ఈ ప్రశ్నలు మానవ మాత్రుల కోసమే. యీ ప్రశ్నలన్నింటికీ సమాధానాలు పొందకుండా ఏ సాధకుడు కూడా శ్రేయపథం పై పురోగమించ లేడు, కాబట్టి సద్గురువు యొక్క ఆదేశాలను పాటించడానికి, శ్రేయోపథంపై అగ్రసరులవడానికి, సంపూర్ణ గీత యొక్క శ్రవణం చాలా అవసరం. అర్జునుడికి సమాధానాలు దొరికాయి. దానితో బాటే యోగేశ్వరుడైన శ్రీకృష్ణుని శ్రీముఖం నుంచి (వెలువడిన) నిఃసృత వాణి ఉపసంహారం అయింది అప్పుడు సంజయుడు అన్నాడు.

(పదకొండవ అధ్యాంలో విరాట్ రూప దర్శనం చేయించిన తరువాత యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు అన్నాడు-అర్జునా! అనన్య భక్తి ద్వారా ఈ ప్రకారంగా చూడటానికి (నువ్వు చూసినట్లుగా), తత్వంతో తెలుసుకునేందుకు మరియు ప్రవేశం చేయడానికి సులభసాధ్యుణ్ణి. (11/54) ఈ ప్రకారంగా దర్శనం చేయువారు సాక్షాత్తు నా స్వరూపాన్ని పొందుతారు. మరియు యిక్కడ ఇప్పుడు అర్జునుణ్ణి అడుగుతాడు- నీ మోహం నష్టమయిందా? అర్జునుడు అన్నాడు-నా మోహం నష్టమయిపోయింది. నేను నాస్మృతిని తిరిగి పొందాను. మీరేం చెబుతారో, అదే చేస్తాను. దర్శనం అవడంతోనే అర్జునుడు ముక్తుడవ్వాల్సింది. వాస్తవానికి అర్జునుడు ఏం కావాలో అది అయిపోయాడు. కానీ శాస్త్రం, భవిష్యత్తులో వచ్చే తరం వారికోసం, వ్రాయబడుతుంది. దాని ఉపయోగం మీ అందరి కోసమే అవుతుంది)

సంజయ ఉవాచ-

శ్లో ॥ ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః ।
సంవాదమిమమ శ్రౌషమద్భుతం రోమహర్షణమ్ ॥74॥

ఈ ప్రకారంగా నేను వాసుదేవుడు మరియు మహాత్ముడైన అర్జునుడి (అర్జునుడు ఒక మహాత్ముడు, యోగి, సాధకుడు, అంతేగానీ చంపడానికై నిలబడ్డ ధనుర్ధారి కాడు, కాబట్టి మహాత్ముడైన అర్జునుడు) మధ్య జరిగిన ఈ విలక్షణమయిన మరియు రోమాంచకమయిన సంవాదాన్ని విన్నాను. అతనిలో వినే సామర్థ్యం ఎలా వచ్చింది? ఇంకా అంటాడు.

శ్లో ॥ వ్యాస ప్రసాదాచ్ఛ్రు తవానేతద్గుహ్య మహం పరం ।
యోగం యోగేశ్వరాత్కృష్ణాత్సాక్షాత్కథయతః స్వయమ్ ॥75॥

శ్రీవ్యాసుల వారు దయతో ప్రసాదించిన దివ్య దృష్టి కారణంగా, నేను యీ పరమ గోపనీయ యోగాన్ని సాక్షాత్తు యోగేశ్వరుడు శ్రీకృష్ణుడు స్వయంగా చెబుతూ ఉండగా విన్నాను. సంజయుడు శ్రీకృష్ణుని యోగేశ్వరుడుగా భావించాడు. ఎవరయితే స్వయంగా యోగి మరియు ఇతరులకు కూడా యోగం ప్రదానం చేసే సామర్థ్యం గలవాడో, అతను యోగేశ్వరుడు.

శ్లో ॥ రాజన్ సంస్మృత్య సంస్మృత్య సంవాదమిమమద్భుతం ।
కేశవార్జున యోః పుణ్యం హృష్యామి చ ముహుర్ముహు ॥76॥

హే రాజా! ధృతరాష్ట్రా! కేశవుడు మరియు అర్జునుడి ఈ కళ్యాణ కారకమయిన మరియు అద్భుతమయిన సంవాదాన్ని తిరిగి స్మరణ చేసుకొని నేను మరీ మరీ హర్షితుడనవుతున్నాను. కాబట్టి ఈ సంవాదాన్ని సర్వదా స్మరణ చేసుకొంటూ ఉండాలి మరియు దీని స్మృతి వలన ప్రసన్నంగా ఉండాలి. ఇప్పుడు అతని స్వరూపాన్ని స్మరణ చేసుకొని సంజయుడు అంటాడు-

శ్లో ॥ తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూప మత్యద్భుతం హరేః ।
విస్మయో మే మహాన్ రాజన్ హృష్యామి చ పునః పునః ॥77॥

హే రాజా! హరి యొక్క (ఎవరైతే సమస్త శుభాశుభాలను హరించేసి స్వయంగా తనే మిగిలి ఉంటాడో, ఆ హరి యొక్క) అతి అద్భుత రూపాన్ని తిరిగి-తిరిగి స్మరణ చేసుకొని, నా చిత్తంలో మహా ఆశ్చర్యం కలుగుతోంది మరియు నేను మరీ మరీ హర్షితుడనవుతున్నాను. ఇష్టదైవం యొక్క స్వరూపం మళ్ళీ-మళ్ళీ స్మరణచేయవలసిన వస్తువు. చివరిలో సంజయుడు నిర్ణయం చేస్తాడు-

శ్లో ॥ యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః ।
తత్ర శ్రీర్విజయో భూతిర్ధ్రువా నీతి ర్మతి ర్మమ ॥78॥

రాజా! ఎక్కడయితే యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు మరియు ధనుర్ధరుడు (ధ్యానమే ధనస్సు, ఇంద్రియాల ధృడత్వమే గాండీవం, అంటే స్థైర్యంతోబాటు ధ్యానాన్ని ధరించే మహాత్ముడు

అర్జునుడు) వున్నారో, అక్కడే 'శ్రీః' – ఐశ్వర్యం, విజయం– (అపజయం లేనటువంటి) ఈశ్వరీయ విభూతులు, మరియు చంచలంగా ఉండే ప్రపంచంలో అచంచలంగా ఉండే నీతి ఉంటాయి. అలా అని నా అభిప్రాయం.

ఈ రోజు ధనర్ధరుడయిన అర్జునుడు లేడు. అంటే ఈ నీతి, విజయం, విభూతులు అర్జునుడి వరకే నియమితమయి పోయాయా? తత్కామయికమేనా ఇది? అంటే ద్వాపరంలోనే సమాప్తమయి పోయిందా? కానీ అదేం లేదు. యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు అన్నాడు – నేను అందరి హృదయదేశంలో నివాసముంటాను. మీ హృదయంలో కూడా అతను ఉన్నాడు. అనురాగమే అర్జునుడు. అనురాగం అంటే మీ అంతః కరణంలో ఇష్టదైవోన్ముఖమయిన ప్రీతి, ఇలాంటి అనురాగం గనుక మీలో ఉంటే, సర్వదా వాస్తవమైన విజయం లభిస్తుంది. మరియు అచల స్థితిని ఇప్పించే నీతి కూడా సర్వదా వుంటుంది. అంతేగానీ ఎప్పుడో ఉందని కాదు. ఎప్పటి వరకు ప్రాణులు ఉంటాయో, పరమాత్ముడి నివాసం వారి హృదయ దేశంలో ఉంటుంది, వికలమయిన ఆత్మలు వాటిని పొందే కోరిక గలిగి ఉంటాయో మరియు వారిలో ఎవరి హృదయంలో నయినా అతనిని పొందాలనే అనురాగం ఉబుకుతుందో, అతనే అర్జునుడి శ్రేణికి చెందిన వాడవుతాడు. ఎందుకంటే అనురాగమే అర్జునుడు కాబట్టి మానవ మాత్రుడు దీనికి అభ్యర్థి కావచ్చు.

*సారాంశము:*

ఇది గీత యొక్క అంతిమ అధ్యాయం. ఆరంభంలోనే అర్జునుడు ప్రశ్నించాడు– ప్రభూ! నేను త్యాగం మరియు సన్యాసాల తేడాని మరియు స్వరూపాన్ని తెలుసుకోవాలను కుంటున్నాను. యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు దీనిని గురించి ప్రచలితమయి ఉన్న నాలుగు అభిప్రాయాలను గురించి చర్చించాడు. వాటిలో ఒకటి అసలయినది కూడా ఉంది. దీనితో కలసి మెలసి ఉండే ఒక అభిప్రాయాన్ని యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు తన నిర్ణయంగా చెప్పాడు – యజ్ఞం, దానం మరియు తపస్సులు ఏకాలంలోనూ త్యాగం చేయ యోగ్యం కానివి. ఇవి మనీషులను కూడా పవిత్రం చేసేవి. ఈ మూడింటినీ, ఉంచుకొని, వీటిని విరోధించే వికారాలను త్యాగం చేయడమే వాస్తవికమయిన త్యాగం. ఇది సాత్విక త్యాగం. ప్రతిఫలవాంఛతో చేసే త్యాగం రాజసత్యాగం. మోహం చేత నియతకర్మని త్యజించడం తామసి త్యాగం, మరియు సన్యాసం త్యాగం యొక్క చరమోత్కృష్ట దశ; నియత కర్మచే మరియు ధ్యానంచే పొందే సుఖం సాత్త్వికం. ఇంద్రియాల మరియు విషయాల అనుభవ సుఖం రాజస సుఖం. మరియు తృప్తిదాయక అన్నం ఉత్పత్తి చేయనటువంటి దుఃఖమయమయిన సుఖం తామస సుఖం.

మనుష్యమాత్రుని ద్వారా శాస్త్రానికి అనుకూలంగా, లేక విరుద్ధంగా కార్యం జరగడానికి ఐదు కారణాలు ఉన్నాయి – కర్త (మనస్సు), వేరు వేరు కారణాలు (వేటి ద్వారా చేయబడుతుందో, శుభకార్యమయితే వివేకం వైరాగ్యం నిరోధం, నియంత్రణ కారణాలు. అశుభ కార్యాలయితే కామం, క్రోధం, రాగద్వేషాలు ఇత్యాదులు కారణాలు అవుతాయి) నానారకాల కోరికలు–కోరికలు అనంతం, అన్నీ నెరవేరవు. ఏ కోరికతో ఆధారం సమ్మిళితమౌతుందో,

కేవలం ఆ కోరిక మాత్రమే, నెరవేరవచ్చు. నాలుగవ కారణం ఆధారం (సాధనం) మరియు ఐదవది హేతువు – దైవం (ప్రారబ్ధం లేక సంస్కారం) ప్రతి పనీ జరగడంలో ఇవే ఐదు కారణాలు, అయినా కూడా ఎవరైతే కైవల్య స్వరూపుడయిన పరమాత్ముణ్ణి కర్తగా భావిస్తాడో, ఆ మూఢ బుద్ధి గలవాడు యథార్థం తెలియని వాడు. అంటే భగవంతుడు చేయడు. కానీ లోగడ చెబుతూ వచ్చాడు – అర్జునా! నువ్వు నిమిత్త మాత్రుడవయి నిలబడుచాలు. కర్త–గిర్త అంతా నేనే. ఆఖరికి ఆ మహాపురుషుని ఆశయం ఏమిటి?

వాస్తవానికి ప్రకృతి మరియు పురుషునికి మధ్య ఒక ఆకర్షణ రేఖ ఉంది. ఎప్పటి వరకు మనుష్యుడు ప్రకృతిలో వ్యవహరిస్తాడో, అప్పటి వరకు మాయ ప్రేరణ ఇస్తుంది. మరియు ఎప్పుడయితే అతను దీనికంటే ఉన్నతుడయి ఇష్ట దైవానికి సమర్పితుడయి పోతాడో మరియు ఆ ఇష్ట దైవం ఎప్పుడైతే హృదయ దేశంలో రథుడయి పోతాడో, అప్పుడింక భగవంతుడు చేస్తాడు. అలాంటి స్థాయిలో అర్జునుడు ఉన్నాడు. సంజయుడు కూడా మరియు అందరూ యిందులోకి (తరగతి) చేరడానికి విధానం ఉంది. కాబట్టి ఇక్కడ భగవంతుడు ప్రేరణ ఇస్తాడు. పూర్ణ జ్ఞాతుడయిన మహాపురుషుడు, తెలుసుకోవడానికి విధి విధానం మరియు జ్ఞేయుడయిన పరమాత్ముడు ఈ మూడింటి సంయోగం చేతనే కర్మకు ప్రేరణ దొరుకుతుంది. కాబట్టి ఎవరైనా అనుభవంగల మహాపురుష (సద్గురువు)ని సాన్నిధ్యంలో అర్థం చేసుకొనే ప్రయాసం చేయాలి.

వర్ణ వ్యవస్థ యొక్క ప్రసంగాన్ని నాలుగవసారి ఎత్తుకుంటూ యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు అన్నాడు – ఇంద్రియాల నియంత్రణ, మనస్సు యొక్క నిరోధం, ఏకాగ్రత, శరీరం, వాక్కు మరియు మనస్సులను ఇష్టదైవానికి అనుగుణంగా తపింపచేయడం, ఈశ్వరీయ జ్ఞానం యొక్క సంచారం, ఈశ్వరీయ నిర్దేశనలపై నడిచే సామర్థ్యం యిత్యాది బ్రహ్మలో ప్రవేశం ఇప్పించే యోగ్యతలు బ్రాహ్మణ శ్రేణికి చెందిన కర్మ. శౌర్యం, వెనుకాడని స్వభావం, అన్ని భావాలపై ఆధిపత్యభావం, కర్మలో ప్రవృత్తుడయ్యే దక్షత, క్షత్రియ శ్రేణి యొక్క కర్మ. ఇంద్రియాల సంరక్షణ, ఆత్మిక సంపత్తి యొక్క సంవర్ధనం ఇత్యాది వైశ్యశ్రేణి యొక్క కర్మ. పరిచర్య శూద్రశ్రేణి యొక్క కర్మ. శూద్రుడు అంటే ఒకజాతి కాదు. శూద్రుడు అంటే అర్థం– అల్పజ్ఞుడయిన సాధకుడు, నియతకర్మ అయిన చింతనలో రెండు గంటలు కూర్చుని పదినిమిషాలు కూడా తన పక్షానికి త్రిప్పుకోలేడు. శరీరం మాత్రం కూర్చుంది, కానీ ఏమనస్సయితే కూర్చోవాలో, అది గాలితో కబుర్లు చెబుతోంది. అలాంటి సాధకుడికి కళ్యాణం (మేలు) ఎలా ఒనగూడుతుంది? అతను తనకంటే ఉన్నత దశలో గలవారికి, లేక సద్గురువుకి సేవలు చేయాలి. మెల్ల మెల్లగా అతనిలో కూడా సంస్కారాలు వికసిస్తాయి, వేగం పుంజుకుంటాయి. కాబట్టి ఈ అల్పజ్ఞుడి కర్మ సేవతో ప్రారంభమవుతుంది. కర్మ ఒక్కటే – నియతకర్మ, చింతన. దాని కర్త యొక్క నాలుగు శ్రేణులు – అతి ఉత్తమ, ఉత్తమం, మధ్యమం మరియు నికృష్టం. అవే బ్రహ్మణ, క్షత్రియ, వైశ్య శూద్ర శ్రేణులు. మనుషులను గాక గుణాలనుబట్టి కర్మను నాలుగు భాగాలుగా విభజించడమయింది. గీతోక్త వర్ణాలకు అర్థమిదే.

తత్వాన్ని స్పష్టం చేస్తూ అతను అన్నాడు – అర్జునా! ఆ పరమసిద్ధి యొక్క విధిని చెబుతాను, అదే జ్ఞానానికి పరాకాష్ఠ. వివేకం, వైరాగ్యం, నిరోధం, నియంత్రణ, ధారావాహిక చింతన మరియు ధ్యానం అనే ప్రవృత్తి, బ్రహ్మలో ప్రవేశాన్ని ఇప్పించగలిగే యోగ్యత ఇవన్నీ పరిపక్వమయినప్పుడు, ప్రకృతిలో చిక్కుపడేసే కామం, క్రోధం రాగ ద్వేషాది ప్రవృత్తులు పూర్తిగా శాంతించినప్పుడు, ఆ సమయంలో ఆ వ్యక్తి బ్రహ్మను తెలుసుకొనేందుకు యోగ్యుడవుతాడు. ఆ యోగ్యత పేరు పరాభక్తి. పరాభక్తి ద్వారానే అతను తత్వాన్ని తెలుసుకొంటాడు. తత్వం ఏమిటి? అంటే అన్నాడు – నేనేవరిని? ఏ ఏ విభూతులతో యుక్తుడనయి ఉన్నాను? దానిని తెలుసుకొంటాడు, అంటే పరమాత్ముడు ఎవరు? అవ్యక్తం, శాశ్వతత్వం, అపరివర్తనశీలము మొదలయిన అలౌకిక గుణధర్మాలు గలవాడు, దానిని తెలుసుకొంటాడు మరియు తెలుసుకొని తక్షణం అతను నాలో స్థితుడయిపోతాడు. కాబట్టి తత్వం అంటే పరమతత్వమే గానీ ఐదు లేక ఇరవయి అయిదు తత్వాలు కావు. బ్రహ్మ ప్రాప్తితో బాటే ఆత్మ ఆ స్వరూపంలోనే స్థితమయి పోతుంది. అవే గుణధర్మాలతో యుక్తమయి పోతుంది.

ఈశ్వరుని యొక్క నివాసం గురించి చెబుతూ యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు అన్నాడు, అర్జునా! ఆ ఈశ్వరుడు సమస్త భూతాల హృదయ దేశంలో నివసిస్తాడు. కానీ మాయారూపమయిన యంత్రం మీద ఆరూఢులయిన లోకులు దారి తప్పిపోతారు. కాబట్టి తెలుసుకోలేరు. కాబట్టి అర్జునా! నువ్వుహృదయంలో స్థితుడయిన ఆ ఈశ్వరుని శరణుపొందుము. దీనికంటే కూడా గోపనీయమైన రహస్యం యింకొకటుంది. అన్ని ధర్మాలను గురించి చింత వదలిపెట్టి నువ్వు నా శరణులోకి రా. నువ్వు నన్నుపొందుతావు. ఈ రహస్యాన్ని అనధికారులకు చెప్పరాదు, ఎవరైతే భక్తులు కారో, వారికి చెప్పరాదు. కానీ ఎవరైతే భక్తులో, వారితో తప్పకుండా చెప్పాలి. అతని నుంచి దాచి ఉంచితే, అతనికి కళ్యాణ మెలా అవుతుంది? చివరిలో యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు అడిగాడు–అరునా! నేను చెప్పినదంతా నువ్వు బాగుగా విన్నావా! అర్థం చేసుకొన్నావా? నీ మోహం నష్టమైందా? అర్జునుడు అన్నాడు–భగవాన్! నా మోహం వినష్టమయి పోయింది. నేను నా స్మృతిని పొందాను. మీరేం చెబుతున్నారో, అదే సత్యం మరియు ఇప్పుడు ఏది చెబితే, నేను అదే చేస్తాను.

వీరిద్దరి సంవాదాన్ని చక్కగా విన్న సంజయుడు నిర్ణయాన్ని ఇస్తాడు–శ్రీకృష్ణుడు మహాయోగేశ్వరుడు. మరియు అర్జునుడు ఒక మహాత్ముడు. వారి సంవాదాన్ని మళ్ళీ మళ్ళీ స్మరణ చేసుకొని, అతను హర్షితుడవుతున్నాడు. కాబట్టి దీని స్మరణ చేసుకుంటూ ఉండాలి. ఆ హరి యొక్క రూపుని గుర్తు చేసుకొని కూడా అతను మరీ మరీ హర్షితుడవుతున్నాడు. కాబట్టి మళ్ళీ మళ్ళీ స్వరూపాన్ని స్మరణకు తెచ్చుకుంటూ ఉండాలి. ధ్యానం చేస్తూ ఉండాలి. ఎక్కడయితే యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు మరియు మహాత్ముడు అర్జునుడు ఉంటారో అక్కడ 'శ్రీ' వుంటుంది. విజయం, విభూతులు మరియు ధృవనీతి కూడా వుంటాయి. సృష్టిలో నీతులు యీరోజు వుంటే రేపు మారి పోతాయి. ధృవుడు ఏక మాత్ర పరమాత్ముడు. అతనిలో ప్రవేశం ఇప్పించే నీతి, ధృవనీతి కూడా అక్కడే ఉంటుంది. శ్రీకృష్ణుడు మరియు అర్జునుడు ద్వాపర కాలంలోని విశేష వ్యక్తులు

అని భావిస్తే, ఈ రోజు అర్జునుడు గానీ, శ్రీకృష్ణుడు గానీ లేరు. అలాంటప్పుడు మీకు విజయం గానీ, విభూతులు గానీ దొరకరాదు. అప్పుడు గీత మీకోసం వ్యర్థమా? కాదు. శ్రీకృష్ణుడు ఒక యోగి, అనురాగంతో నిండిన హృదయంగల మహాత్ముడే అర్జునుడు. వీరు ఎల్లప్పటికీ ఉన్నారు. మరియు ఉంటారు. శ్రీకృష్ణుడు తన పరిచయాన్ని ఇస్తూ అంటాడు-నేను అవ్యక్తుడనే, కానీ ఏ భావాన్నయితే నేను పొంది ఉన్నానో, ఆ ఈశ్వరుడు అందరి హృదయ దేశంలో నివసించుతాడు. అతను ఎల్లప్పుడూ ఉన్నాడు మరియు ఉంటాడు. అందరూ అతని శరణులోకి వెళ్ళాలి. శరణు పొందే వారే ఆ మహాత్ములు, అనురాగవంతులు. అనురాగమే అర్జునుడు. దీనికోసం ఎవరైనా స్థితప్రజ్ఞుడయిన మహాపురుషుని శరణు పొందడం అత్యంత ఆవశ్యకమయినది. ఎందుకంటే అతనే దీనికి ప్రేరకుడు. ఈ అధ్యాయంలో సన్యాసం యొక్క స్వరూపం స్పష్టం చేయబడింది. సర్వస్వం యొక్క న్యాసమే సన్యాసం. కేవలం వేషధారణ చేసుకుంటే సన్యాసం కాదు. అంతే కాకుండా దీనితోబాటు ఏకాంత సేవను చేస్తూ, నియత కర్మలో తన శక్తిని తెలుసుకొని లేక సమర్పణ భావంతో కూడి నిరంతరం ప్రయత్నం చేస్తూ ఉండాలి. ప్రాప్తితో బాటుగా సంపూర్ణ కర్మల త్యాగమే సన్యాసం. అది మోక్షానికి పర్యాయం. ఇదే సన్యాసానికి పరాకాష్ఠ.

*ఓం తత్సదితి శ్రీమద్ భగవద్ గీతాసూపనిషత్సు బ్రహ్మ విద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే 'సంన్యాసయోగో' నామ అష్టాదశోధ్యాయః ॥ 18*

ఈ ప్రకారంగా శ్రీమద్భగవద్గీతా అనే ఉపనిషత్తు మరియు బ్రహ్మ విద్య మరియు యోగశాస్త్రమనే విషయంలో శ్రీకృష్ణుడు మరియు అర్జునుడి సంవాదంలో ''సన్యాస యోగం'' అనే పేరుగల పద్దెనిమిదవ అధ్యాయం పూర్తయింది.

ఇతి శ్రీమత్పరమహంస పరమానందస్య శిష్య స్వామీ అడగడానంద కృతే శ్రీమద్‌భగవద్ గీతా యాః- 'యథార్థ గీతా' భాష్యే 'సంన్యాసయోగో' నామ అష్టాదశోధ్యాయః ॥ 18

ఈ ప్రకారంగా శ్రీమత్పరమహంస పరమానందగారి శిష్యుడు స్వామి అడగడానంద గారిచే రచించబడిన శ్రీమద్ భగవద్ గీత యొక్క భాష్యం 'యథార్థ గీత'లో సన్యాసయోగం అనే పద్ధెనిమిదవ అధ్యాయం పూర్తయింది.

॥ హరిః ఓం తత్సత్ ॥

# ఉపసంహారం

సాధారణంగా వ్యాఖ్యానాలలో లోకులు క్రొత్తదనం గురించి వెతుకుతారు. కానీ వాస్తవానికి సత్యం సత్యమే. అది క్రొత్తది కాదు మరియు పాతబడదు. క్రొత్త వార్తలు వార్తా పత్రికలలో ముద్రించబడతాయి, అవి మరణాలు-జననాలకు సంబంధించిన సంఘటనల వివరాలు. సత్యం అపరివర్తన శీలం, మరి ఎవరైనా యింకోటి ఏం చెప్పగలరు! అలా కాకుండా చెప్పాడే అనుకుంటే, అతను బ్రహ్మ ప్రాప్తి పొందలేదు. సాధన చేస్తూ ఆ లక్ష్యం వరకు చేరుకున్న ప్రతి మహాపురుషుడూ ఒకటే మాట అంటాడు. అతను సమాజంలో భేదాలు సృష్టించలేడు. అలాకాకుండా భేదాలు సృష్టించేటట్లయితే, అతను జ్ఞానాన్ని పొందలేదని ఋజువు అవుతుంది. శ్రీకృష్ణుడు కూడా అదే సత్యాన్ని చెబుతాడు. సత్యాన్ని చూసిన, పొందిన పూర్వపు మనీషులు మరియు భవిష్యత్తులో పుట్టబోయే మహాపురుషులు కూడా ఇదే మాటన్నారు, అంటారు.

## మహాపురుషులు మరియు వారి కార్య ప్రణాళిక :-

మహాపురుషులు ప్రపంచంలో సత్యం పేరుతో వ్యాపించి ఉన్న, మరి సత్యం లాగా కనిపించే దురాచారాలను నశింపజేసి, కళ్యాణ పథాన్ని సంస్కరిస్తారు. ఆ మార్గం కూడా ప్రపంచంలో మొదటి నుంచి ఉన్నదే, కానీ దానికి సమాంతరంగా, దాని లాగే కనిపించే అనేక మార్గాలు ప్రచలితమయి పోతాయి. వాటిలో నుంచి సత్యాన్ని వేరుచేయడం కష్టసాధ్యమయి పోతుంది. వాస్తవానికి సత్యమేది? మహాపురుషులు సత్యంలో స్థితులవటం చేత వాటిలో సత్యాన్ని గుర్తిస్తారు, దానిని నిర్ణయిస్తారు మరియు ఆ సత్యం వైపుకు అభిముఖులు కావడానికై సమాజాన్ని ప్రేరేపిస్తారు. ఇదే రాముడు చేసాడు, మహావీరుడు చేసాడు, ఇదే బుద్ధ మహాత్ముడు చేసాడు, ఇదే యేసు చేసాడు మరియు ఇదే ప్రయత్నం మహమ్మదు చేసాడు. కబీరు, గురునానక్ మొదలగు వారందరూ ఇదే చేసారు. మహాపురుషులు నిర్వాణం చెందిన తరువాత వారి అనుయాయులు (శిష్యులు) వారు చూపిన మార్గం పై నడవక, అతని జన్మ స్థలాన్ని మృత్యు స్థలాన్ని మరియు అతను మెట్టిన స్థలాన్ని పూజించడం మొదలు పెడతారు. క్రమంగా వారు అతని మూర్తి స్థాపించి పూజించడం మొదలు పెడతారు. ఆరంభంలో శిష్యులు ఆయనకు సంబంధించిన స్మృతులనే ఆకళింపుచేసుకుంటారు, కానీ ఆ తరువాత కాలంలో భ్రమలో పడిపోతారు. అదే భ్రమ రూఢిగా, సంప్రదాయంగా మార్పు చెందుతుంది.

యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు కూడా తన సమకాలీన సమాజంలో సత్యం పేరిట పేరుకు పోయిన ఆచార-వ్యవహారాలను ఖండించి, సమాజాన్ని ప్రశస్త పథంపై నిలబెట్టాడు. అధ్యాయం 2/16 లో అతను ఇలా అన్నాడు - అర్జునా ! అసత్య వస్తువుకు అస్తిత్వం లేదు. మరియు సత్యానికి మూడు కాలాల్లోనూ లోపం లేదు. భగవంతుణ్ణి అయిన కారణంగా నేను మాత్రమే చెప్పడం లేదు, కానీ ఈ తేడాను తత్వదర్శకులు చూశారు మరియు అదే నేను కూడా చెప్పబోతున్నాను. పదమూడవ అధ్యాయంలో అతను క్షేత్ర క్షేత్రజ్ఞులను ఇదే ప్రకారంగా వర్ణించాడు. ఇదే 'ఋషి బిర్బహుధాగీతం', ఋషుల ద్వారా కూడా చెప్పబడింది. పద్దెనిమిదవ అధ్యాయంలో త్యాగం మరియు సన్యాసం యొక్క తత్వాన్ని వివరిస్తూ, అతను నాలుగు అభిప్రాయాలలో నుంచి ఒక దానిని గ్రహించి, దానిని సమర్థించాడు.

**సన్యాసం :** శ్రీకృష్ణుడి కాలంలో అగ్నిని ముట్టుకోనివారు, చింతనని కూడా వదలివేసి, యోగులమనీ, సన్యాసులమని చెప్పుకునేవారి సంప్రదాయాలు పెచ్చుమీరి పోయాయి. వీటిని ఖండించుతూ, అతను - జ్ఞాన మార్గం మరియు భక్తి మార్గం, రెండు మార్గాలలో ఎందులోనూ కూడా, కర్మను వదలివేసే విధానం లేదు. అని స్పష్టం చేశాడు. కర్మను చేయవలసిందే. కర్మను చేస్తూ - చేస్తూ సాధన ఎంత సూక్ష్మమయి పోతుందంటే, సమస్త సంకల్పాలు లేకుండా పోతాయి, అదే పూర్ణ సన్యాసం. మధ్యలో సన్యాసం పేరుతో ఏదీ లేదు. కేవలం క్రియలను త్యజించడం వలన కానీ, అగ్నిని ముట్టుకోకపోవడం వలనకానీ, ఎవరూ సన్యాసులు కారు, యోగులూ కారు, ఈ విషయాన్ని రెండు, మూడు, అయిదు, ఆరు మరియు విశేషంగా పద్దెనిమిదవ అధ్యాయాలలో గమనించవచ్చు.

**కర్మ :** ఇలాంటి భ్రాంతియే కర్మకు సంబంధించిన విషయంలో కూడా లభిస్తుంది. అధ్యాయం - 2/39లో అతను ఇలా అన్నాడు - అర్జునా ! ఇప్పటి వరకూ ఈ విషయం సాంఖ్య యోగ సందర్భంలో చెప్పబడింది. మరియు ఇప్పుడు దీనినే నువ్వు నిష్కామ కర్మ విషయంలో విను. దీనితో యుక్తుడవయితే నీవు కర్మల బంధాన్ని చక్కగా నాశనం చేయగలుగుతావు. దీని స్వల్ప - ఆచరణ కూడా జన్మ మరణాలనే మహాభయం నుంచి ఉద్ధరించేదవుతుంది. ఈ నిష్కామ కర్మలో నిశ్చయించబడిన క్రియ ఒక్కటే, బుద్ధి ఒక్కటే, దిశ కూడా ఒక్కటే, కానీ అవివేకుల బుద్ధి అనంత శాఖలు గలిగివుంటుంది, కాబట్టి వారు కర్మ పేరు మీద అనేక క్రియలను విస్తరింప చేసుకుంటారు. అర్జునా ! నువ్వు నియత కర్మ చెయ్యి. అంటే క్రియలు చాలా ఉన్నాయి, అవి కర్మలు కావు. కర్మ ఏదో ఒక నిర్ధారించబడిన దిశ. కర్మ ఎలాంటి వస్తువంటే, అది జన్మ జన్మాంతరాల నుంచి వస్తున్న శరీరాల యాత్రను అంతమొందిస్తుంది. ఒక్క జన్మయినా ఎత్త వలసి వస్తే, యాత్ర ముగిసినట్లు ఎలా చెప్పగలుగుతాము?

**యజ్ఞం** - ఆ నియత కర్మ ఏమిటి? శ్రీకృష్ణుడు స్పష్టం చేసిందేమిటంటే- 'యజ్ఞార్థాత్కర్మణో న్యత్ర లోకో యం కర్మ బంధనః' - అర్జునా! యజ్ఞం యొక్క ప్రకియే

కర్మ. ఇదిగాక లోకంలో ఏం చేసినా, అది లోకం యొక్క బంధమేగానీ కర్మకాదు. కర్మ ఈ సంసార బంధం నుంచి మోక్షాన్ని ఇప్పిస్తుంది. ఇప్పుడు దేనినైతే చేయడం వలన కర్మ సంపన్న మవుతుందో, ఆ యజ్ఞం ఏమిటి? నాలుగవ అధ్యాయంలో శ్రీకృష్ణుడు పదమూడు పదునాలుగు రకాలుగా యజ్ఞం యొక్క వర్ణనచేసాడు, అవి అన్నీ కలిపి పరమాత్మునిలో ప్రవేశం ఇప్పించే విశిష్ట విధాన చిత్రణ, యోగం యొక్క క్రియ. అది శ్వాసచే, ధ్యానంచే, చింతన మరియు ఇంద్రియ సంయమనం యిత్యాదులచే సిద్ధిస్తుంది. శ్రీకృష్ణుడు ఇది కూడా స్పష్టం చేసాడు – భౌతిక ద్రవ్యాలతో ఈ యజ్ఞానికి ఏ విధమైన సంబంధమూ లేదు. భౌతిక ద్రవ్యాలతో చేయబడే యజ్ఞం అత్యల్పమయింది. మీరు కోట్ల విలువచేసే హోమం చేసినాసరే, సంపూర్ణ యజ్ఞం మనస్సు మరియు ఇంద్రియాల అంతః క్రియలచే సిద్ధిస్తుంది. పూర్తయినప్పుడు ఈ యజ్ఞం దేనినైతే సృష్టిస్తుందో, ఆ అమృతత్వాన్ని తెలుసుకోవడానికి పేరే జ్ఞానం. ఆ జ్ఞానామృతాన్ని త్రాగే యోగి, సనాతన బ్రహ్మలో ప్రవేశం పొందుతాడు. దేనిలో ప్రవేశం పొందాలో అది పొందినప్పుడు, అట్టి పురుషునికి కర్మ చేయడం వలన కలిగే ప్రయోజనం ఏమీలేదు. కాబట్టి ఆ కర్మ అంతా సాక్షాత్కార సహితమయిన జ్ఞానంలో లీనమైపోతుంది. కర్మ చేయడమనే బంధం నుంచి అతను ముక్తుడయి పోతాడు. ఈ ప్రకారంగా నిర్ధారితమయిన యజ్ఞానికి కార్య రూపు నివ్వడమే కర్మ. కర్మ అంటే అసలైన అర్థం – 'ఆరాధన'.

ఈ నియత కర్మ, యజ్ఞార్థ కర్మ (లేక) తదర్థ కర్మ గాక గీతలో ఇంకే కర్మను గురించి వర్ణన లేదు. దీనిని గురించి శ్రీకృష్ణుడు మరీ మరీ వివరణ ఇచ్చాడు. ఆరో అధ్యాయంలో దీనినే 'కార్యం కర్మ' అన్నాడు. పదహారో అధ్యాయంలో ఇలా అన్నాడు–కామ, క్రోధ లోభాలను వదిలివేసినప్పుడే, ఆ కర్మ ప్రారంభం అవుతుంది. అదే పరమశ్రేయాన్ని కలిగిస్తుంది. సంసారిక కర్మలలో ఎవరెంత బిజీగా ఉంటారో, వారి వద్ద కామ క్రోధలోభాలు అంతే ఎక్కువగా ఉంటాయి, సమృద్ధిగా ఉంటాయి. ఈ నియత కర్మకే అతను 'శాస్త్ర విధానోక్త కర్మ' అని పేరు పెట్టాడు. గీత ఒక పరిపూర్ణ శాస్త్రం. అన్నింటినీ మించిన శాస్త్రం వేదం. వేదాల సారం ఉపనిషత్తులు. వాటన్నింటి సారాంశమే యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు ప్రవచించిన 'గీత'. పదిహేడో మరియు పద్దెనిమిదో అధ్యాయాలలో కూడా శాస్త్ర విధిచే నిర్ధారిత కర్మ, నియత కర్మ, కర్తవ్య కర్మ మరియు పుణ్య కర్మ అంటూ తెలియపరచి అతను మరీ మరీ సిద్ధాంతీకరించిందేమిటంటే నియత కర్మ పరమ కళ్యాణాన్ని చేకూర్చేది.

యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు ఇంత గట్టిగా చెప్పినా కూడా మీరు ఆ నియత కర్మను చేయకుండా, శ్రీకృష్ణుడు చెప్పింది వినకుండా, తలా తోకాలేని కల్పనలు చేసుకొని ప్రపంచంలో ఏం చేసినా కూడా అది కర్మే అవుతుందని అనుకుంటారు. ఉదాహరణకు ఏదీ విడిచి పెట్టనవసరం లేదు, కేవలం ప్రతిఫలాన్ని ఆశించకు, అదే నిష్కామ కర్మ యోగం అంటే. కర్తవ్య భావనతో చెయ్యి– అదే కర్తవ్య యోగం. ఏదైనా చేయండి, నారాయణుడికి సమర్పిస్తే – సమర్పణ యోగం అయిపోతుంది. ఈ ప్రకారంగానే యజ్ఞం పేరు ఉచ్చరించగానే మనం భూత యజ్ఞం, పితృయజ్ఞం, పంచయజ్ఞం, విష్ణువు నిమిత్తం చేయబడిన యజ్ఞం అంటూ కల్పించుకుంటాం,

మరియు దానిలో 'స్వాహా' చేర్చి నిలబడిపోతాం. శ్రీకృష్ణుడే గనక స్పష్టంగా చెప్పి ఉండకపోతే, మనం ఏమైనా చేయొచ్చు. అతను చెప్పి ఉంటే గనుక ఏం చెప్పాడో దాన్ని మనం ఒప్పుకోవాలి గదా. కానీ మనం ఒప్పుకోలేం. ఆనవాయితీగా వస్తున్న ఎన్నో ఆచార – వ్యవహారాలు, పూజా పద్ధతులు మన మస్తిష్కాన్ని ఆవరించుకొని ఉన్నాయి. బయటి వస్తువులను మనం అమ్మేసి పారిపోగలం, కానీ ఈ ఆనవాయితులు మన మస్తిష్కంలో ఉండిపోయి మనతో బాటే వస్తాయి. శ్రీకృష్ణుడి మాటల్ని కూడా మనం ఆనవాయితులకు అనుగుణంగానే గ్రహించుతాం. 'గీత' అత్యంత సులభంగా బోధపడే సరళమయిన సంస్కృతంలో ఉంది. మీరు తెలుగు అనువాదాన్ని తీసుకున్నా, సందేహం మాత్రం ఉండదు. ఇదే ప్రయత్నం ఈ పుస్తకంలో చేయబడింది.

**యుద్ధం** – యజ్ఞం మరియు కర్మ – ఈరెండిటినీ యథార్థంగా అర్థం చేసుకోగలిగితే యుద్ధం, వర్ణ–వ్యవస్థ, వర్ణ సంకరం, జ్ఞాన యోగం, కర్మయోగం క్లుప్తంగా గీత అంతా మీకు అర్థమయి పోతుంది. అర్జునుడు యుద్ధం చేయకూడదనుకోన్నాడు. అతను విల్లంబును వదిలేసి, రథం వెనకు భాగంలో కూర్చుండి పోయాడు, కానీ యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు ఒక్క కర్మ గురించి నేర్పి, కర్మను సమర్థించడమే కాదు, అర్జునుణ్ణి ఆ కర్మ మార్గంపై నడిపించాడు. యుద్ధం జరిగింది – ఇందులో సందేహం లేదు. గీతలో పదిహేను – యిరవై శ్లోకాలలో మళ్ళీ మళ్ళీ 'అర్జునా! నువ్వు యుద్ధం చెయ్యి అని చెప్పబడింది, కానీ ఒక్క శ్లోకం కూడా బయటి చంపడం – నరకడాలను సమర్థించేది లేదు. (చూడండి – అధ్యాయాలు 2, 3, 11, 15 మరియు 18), ఎందుకంటే ఏ కర్మ సమర్థించబడిందో, అది నియత కర్మ. అది ఏకాంత ప్రదేశంలో ఉండటం వలన, చిత్తాన్ని అన్ని వైపుల నుంచి కూడగట్టుకొని వచ్చి, ధ్యానంలో నిమగ్నం కావడం వలన సాధ్యపడుతుంది. కర్మస్వరూపం ఇదే అయినప్పుడు చిత్తం ఏకాంతంలో, ధ్యానంలో ఉన్నప్పుడు, యుద్ధ మెలా సాధ్యపడుతుంది? గీతలో చెప్పబడిన కళ్యాణం – యుద్ధం చేసే వారికే అయితే, మీరు 'గీత'ను వదలి పెట్టండి. అర్జునుడికి వలే మీ ముందు యుద్ధ పరిస్థితులు లేవు గదా! వాస్తవానికి ఆ పరిస్థితులు ఆ నాడు కూడా ఉన్నాయి మరియు నేటికి కూడా ఇలాగే ఉన్నాయి. చిత్తాన్ని అన్ని వైపుల నుంచి కూడగట్టుకొని వచ్చి హృదయ దేశంలో ధ్యానం చేయ మొదలు పెడితే, కామ, క్రోధ, రాగ ద్వేషాది వికారాలు చిత్తాన్ని ఏకాగ్రంగా ఉండనివ్వవు. ఆ వికారాలతో సంఘర్షించడమే, వాటిని అంతం చేయడమే యుద్ధం. ప్రపంచంలో యుద్ధాలు జరుగుతూనే ఉంటాయి. కానీ వాటి వలన కళ్యాణం కాదు, వినాశం జరుగుతుంది. దానిని శాంతి అనుకోండి (లేక) పరిస్థితులు అనుకోండి. ఇంకే రకమయిన శాంతి ఈ ప్రపంచంలో దొరకదు. ఆత్మ తన శాశ్వతత్త్వాన్ని పొందినప్పుడే, శాంతి దొరుకుతుంది. ఇదే ఏకైక శాంతి, దీని తరువాత అశాంతి లేదు. కానీ ఈ శాంతి సాధన గమ్యం. దాని కోసమే నియత కర్మ అనే విధానం.

**వర్ణం** – ఆ కర్మనే నాలుగు వర్గాలుగా విభజించడమయింది. చింతన అందరూ చేస్తారు, కానీ కొందరు శ్వాస ప్రశ్వాసల గతిని అదుపు చేయడంలో సమర్థులయితే, కొందరు ఆరంభంలో రెండు గంటలు చింతన చేసినా సరే, పది నిమిషాలు కూడా సాధించుకో లేడు.

ఇలాంటి స్థితిలోగల అల్పజ్ఞుడయిన సాధకుడు శూద్ర శ్రేణికి చెందినవాడు. అతను తన స్వాభావికమయిన సామర్థ్యానికనుగుణంగా పరిచర్య (సేవ) తోనే కర్మ ప్రారంభించాలి. క్రమంగా వైశ్య, క్షత్రియ విప్ర శ్రేణుల సామర్థ్యం అతని స్వభావంలో రూపు దిద్దుకుంటుంది. అతను పురోగమిస్తూ పోతాడు. కానీ ఆ బ్రాహ్మణ శ్రేణి కూడా దోషయుక్త మయినది. ఎందుకంటే అతను ఆ బ్రహ్మకు వేరుగా ఉన్నాడు. కానీ ఆ బ్రహ్మలో ప్రవేశం పొందిన పిదప అతడు బ్రహ్మణుడిగా కూడా ఉండడు. వర్ణ, అంటే అర్థం ఆకృతి. ఈ శరీరం మీ ఆకృతి కాదు. మీ ప్రవృత్తి ఎలా ఉంటుందో, మీ ఆకృతి కూడా అలాగే ఉంటుంది. శ్రీకృష్ణుడు ఇలా అంటాడు- అర్జునా! పురుషుడు శ్రద్ధామయుడు, కాబట్టి ఎక్కడో అక్కడ అతని శ్రద్ధ ఉంటుంది. ఆ పురుషుని శ్రద్ధ ఎలాంటిదో, అతడు కూడా అలాంటివాడే. ఎలాంటి ప్రవృత్తో, అలాంటి వాడే ఆ పురుషుడు. వర్ణం అనేది కర్మ సామర్థ్యం యొక్క ఆంతరిక కొలమానం, కానీ లోకులు నియత కర్మను వదలి పెట్టి, సమాజంలో జన్మ ఆధారంగా జాతులనే వర్ణంగా భావించి, జీవన విధానాన్ని నిర్ణయించారు, అది ఒక సామాజిక వ్యవస్థ మాత్రమే. వారు కర్మ యొక్క యథార్థ రూపాన్ని తమకు అనుకూలంగా మార్చుకొని, డొల్లపోయిన తమ సామాజిక మర్యాదలనీ జీవన సాధనాలనీ రక్షించుకొన్నారు. తరువాతి కాలంలో వర్ణ నిర్ధారణకు జన్మమే ఆధారమయింది. అది సరియైనది కాదు. శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు - నాలుగు వర్ణాలను నేను సృష్టించాను. అంటే భారతదేశానికి బయట సృష్టిలేదా? మిగిలిన చోట్లలో ఈ జాతుల అస్థిత్వం కూడా లేదే. భారత దేశంలోని దీని అంతర్గతంగా లక్షల జాతులు-ఉపజాతులు ఉన్నాయి. అంటే శ్రీకృష్ణుడు మనుష్యులను విభజించాడా? లేదు, 'గుణ కర్మ విభాగశః'- గుణాలు ఆధారంగా కర్మలు విభజించబడ్డాయి, ''కర్మాణి ప్రవిభక్తాని'' కర్మ విభాజించబడింది. కర్మ అర్థం అయితే, వర్ణం అర్థం అయిపోతుంది మరియు వర్ణం అర్థం అయితే, వర్ణ సంకరం యొక్క యథార్థ రూపాన్ని మీరు అర్థం చేసుకోగలరు.

**వర్ణసంకరం:** - ఈ కర్మ పథంలో పతనమవడమే వర్ణసంకరం. ఆత్మ యొక్క శుద్ధమయిన వర్ణం పరమాత్మ. అందులో ప్రవేశం ఇప్పించే కర్మ చేయడం మానుకొని, ప్రకృతిలో మిళితమవడమే (కలిసి పోవడమే) వర్ణ సంకరం. శ్రీకృష్ణుడు స్పష్టం చేసిందేమిటంటే- కర్మ చేయకుండా ఆ స్వరూపాన్ని ఎవరూ పొందలేరు. బ్రహ్మ ప్రాప్తి పొందిన మహాపురుషుడికి కర్మ చేయడం వలన లాభమూ లేదు, వదిలేయడం వలన హానీ లేదు. అయినా గానీ, లోక హితానికై వారు ఆ కర్మను ఆచరిస్తారు. ఆ మహా పురుషుల వలెనే నాకు కూడా పొంద యోగ్యమైన ఏ వస్తువూ అప్రాప్తంగా లేదు, అయినా కూడా నేను తరువాతి వారి హితాన్ని కోరుకొంటూ, కర్మలను ఆచరిస్తాను. నేను గనక కర్మ చేయకపోతే, అందరూ వర్ణ సంకరం పాలయి పోతారు. స్త్రీలు చెడిపోవడంచే వర్ణసంకరం గురించి వినడమయింది, కానీ ఇక్కడ శ్రీకృష్ణుడు అంటాడు-స్వరూపస్థుడయిన మహాపురుషుడు కర్మ చేయకపోతే, అప్పుడు లోకం వర్ణ సంకరమయిపోతుంది. ఆ మహాపురుషుని అనుకరించి ఆరాధనను ఆపివేసినవారు ప్రకృతిలో దారి తప్పి పోతారు, వర్ణ సంకరమయిపోతారు. కర్మను ఆచరిస్తే, ఆ పరమ నైష్కర్మ్యస్థితిని మరియు తమ శుద్ధ వర్ణమయిన పరమాత్ముని పొందవచ్చును.

**జ్ఞానయోగం మరియు కర్మయోగం :-** కర్మ ఒక్కటే, నియత కర్మ, ఆరాధన, కానీ దానిని ఆచరించే దృక్పథాలు రెండు. తమ శక్తిని అర్థం చేసుకొని, లాభనష్టాల నిర్ణయం తీసుకొంటూ ఈ కర్మను ఆచరించడం 'జ్ఞాన యోగం'. ఈ మార్గంలో సాధకుడు తెలుసుకొనేదేమంటే-ఈ రోజు నా స్థితి ఇది, మున్ముందు ఈ భూమికలోకి పరిణతుడనవుతాను. చివరికి నా స్వరూపాన్నే పొందుతాను. ' ఈ భావనతో కర్మలో ప్రవృత్తుడవుతాడు. తన స్థితి పట్ల జ్ఞానాన్ని ఉంచుకొని. నడుస్తాడు. కాబట్టే 'జ్ఞాన మార్గ సాధకుడు అనబడతాడు. సమర్పణ భావంతో బాటు అదే కర్మలో ప్రవృత్తమవడం, లాభ నష్టాల నిర్ణయాన్ని ఇష్టదైవంపై వదలి వేసి నడవటం, నిష్కామ కర్మయోగం, భక్తి మార్గం. ఇద్దరికీ ప్రేరకుడు సద్గురువే. ఒకే మహాపురుషుని వద్ద నేర్చుకొని, ఒకడు స్వావలంబుడై కర్మలో ప్రవృత్తుడవుతాడు మరియు రెండవవాడు అతని వద్ద నేర్చుకొని, అతనిపైనే ఆధారపడి కర్మలో ప్రవృత్తుడవుతాడు. తేడా యింతే. కాబట్టి యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు – అర్జునా ! సాంఖ్యం ద్వారా ఏ పరమ సత్యం లభిస్తుందో, అదే పరమ సత్యం నిష్కామ కర్మ యోగం ద్వారా కూడా లభిస్తుంది. ఎవరైతే రెండింటిని ఒకటిగా చూస్తాడో, అతనే యధార్థాన్ని చూస్తాడు. ఇద్దరికీ క్రియను నేర్పించే తత్వదర్శకుడు ఒక్కడే, క్రియ కూడా-ఆరాధన ఒక్కటే, కోరికలను ఇద్దరూ వదిలివేస్తారు. పరిణామం కూడా ఒక్కటే. కేవలం కర్మ చేసే దృక్పథాలే వేరు.

**ఒకే పరమాత్ముడు :-** నియత కర్మ అనేది మనస్సు మరియు ఇంద్రియాల నిర్ధారిత అంతః క్రియ. కర్మ స్వరూపం ఇదే అయినప్పుడు, బయట గుళ్ళు, మసీదులు, చర్చీలు కట్టి, దేవీ-దేవతల విగ్రహాలను, లేక ప్రతీకలను పూజించడం ఎంత వరకు సమంజసమయినది? భారతదేశంలో హిందూవులనబడే సమాజం (వాస్తవానికి వారు సనాతన ధర్ములు. వారి పూర్వులు పరమ సత్యాన్ని శోధించి దేశ – విదేశాలలో దాని ప్రచారం చేసారు. ఆ పథంపై నడిచేవారు ప్రపంచంలో ఎక్కడున్నాసరే సనాతన ధర్ములే. ఇంత గౌరవ ప్రదమయిన హిందూ సమాజం,) కోరికలకు లోబడిపోయి వివిధ భ్రాంతులలో పడిపోయింది. శ్రీకృష్ణుడు అంటాడు – అర్జునా! దేవస్థానం (గుడి మసీదు మొ.)లో దేవతలనే పేరుగల ఏ శక్తీ లేదు. దేని పట్లనయితే మనుష్యుని శ్రద్ధ ఏర్పడుతుందో, దాని వెనక నేనే ఉండి ప్రతిఫలాన్ని ఇస్తాను. అతని శ్రద్ధను బలపరుస్తాను, ఎందుకంటే నేనే సర్వత్రా ఉన్నాను. కానీ అతని ఆ పూజ అవిధి పూర్వకమయినది, దాని ఫలం నశించునటువంటిది. కోరికలచే ఎవరి జ్ఞానమయితే అపహరించబడిందో, అట్టి మూఢ బుద్ధి గల వారు అన్య దేవతలను పూజిస్తారు. సాత్వికులు దేవతలను పూజిస్తారు. రాజస గుణం గలవారు యక్షులు – రాక్షసులను, తామస గుణం గలవారు భూత ప్రేతాలను పూజిస్తారు, ఘోరతపస్సులను చేస్తారు. కానీ అర్జునా! వారు శరీరంలో స్థితులయిన భూతాల సముదాయాన్ని మరియు అంతః కరణంలో ఉన్న పరమాత్ముడనైన నన్ను కృశింపచేస్తారే గానీ పూజించరు. వారిని నిశ్చయంగా నువ్వు ఆసురీ స్వభావంతో సంయుక్తులయిన వారిగా తెలుసుకో. ఇంత కన్న అధికంగా శ్రీకృష్ణుడు ఏం చేయగలడు? అతను స్పష్టంగా అన్నాడు -అర్జునా! ఈశ్వరుడు అందరి హృదయదేశంలో ఉన్నాడు. కేవలం అతని శరణు పొందు. పూజ చేయు స్థలం హృదయంలో ఉంది, బయటకాదు.

అయినా కూడా లోకులు రాళ్ళు, నీళ్ళు,గుళ్ళు, మసీదులు, దేవీ – దేవతలను, ఆశ్రయిస్తూనే ఉంటారు. వాటితో బాటుగా శ్రీకృష్ణుడి ప్రతిమను కూడా చేర్చుకుంటారు. శ్రీకృష్ణుని సాధనా విధానాన్ని సమర్థిస్తూ, జీవితాంతం మూర్తి పూజను ఖండించిన, బుద్ధ భగవానుని ప్రతిమను కూడా అతని అనుయాయులు స్థాపించి పూజించడం ఆరంభించారు. కానీ బుద్ధుడు ఇలా అన్నాడు – ''ఆనంద్! తథాగతుని శరీరాన్ని పూజించడంలో సమయం నష్టం చేయ్యొద్దు.''

గుళ్ళు, మసీదులు, చర్చీలు, తీర్థాలు, విగ్రహాలు, స్మారకాల వలన పూర్వ మహాపురుషుల స్మృతులు నిత్య నూతనం అవుతాయి. వాటి వలన ఆ మహాపురుషులు సాధించిన ఆద్యాత్మిక ఉపలబ్ధి స్మరణకు వస్తుంది. స్త్రీ – పురుషులు అందరూ మహాపురుషులు అవుతూ వచ్చారు. జనకుని పుత్రిక 'సీత' వెనక జన్మలో ఒక బ్రాహ్మణ కన్య. తన తండ్రి ప్రేరణచే పరబ్రహ్మను పొందటానికై తపస్సు చేసింది, కానీ సఫలం కాలేక పోయింది. రెండవ జన్మలో ఆమె రాముణ్ణి పొందింది మరియు చిన్మయ, అవినశ్వర, ఆదిశక్తి రూపంలో ప్రతిష్టితమైంది. సరిగ్గా ఇదే ప్రకారంగా రాజకులంలో జన్మించిన 'మీరా'లో పరమాత్ముని పట్ల భక్తి ప్రస్ఫుటించింది. అన్నింటినీ వదలిపెట్టి, ఆమె భగవంతుని చింతనలో నిమగ్నమయిపోయింది. కష్టాలను సహించింది. తన సాధనలో సఫలమయింది. ఇట్టి వారి స్మృతిని చిరస్థాయిగా ఉంచడానికి గుళ్ళు కట్టించాలి, దాని వలన సమాజం వారి ఉపదేశాలచే ప్రేరితులు కావచ్చు. మీరా, సీత, లేక ఈకోవకు చెందిన ప్రతి మహాపురుషుడు మనకు ఆదర్శవంతులే. మనం వారి పదచిహ్నాలను అమసరించాలి గానీ కేవలం చరణాలలో పువ్వులు, వేసీ, వారి విగ్రహాలలలాటంపై చందనం పెట్టి మన కర్తవ్యమింతే అని కూర్చుంటే, ఇంతకు మించిన తప్పు మరొకటుంటుందా?

సాధారణంగా ఎవరైనా ఆదర్శనీయులయితే, వారి విగ్రహం, చిత్రం, పాదరక్షలు, వారి నివాస స్థానం, లేక వారికి సంబంధించినది ఏదయినా సరే చూడాలనీ, – వినాలనీ మనస్సులో శ్రద్ధ పుడుతుంది. ఇది యథోచితమయినదే. మేము కూడా మా గురుదేవ భగవానుని చిత్రాన్ని చెత్త కుప్పలో పారెయ్యలేము. ఎందుకంటే అతను మాకు ఆదర్శ నీయుడు. వారి ప్రేరణతోమరియు వారు చెప్పినట్లుగా మనం నడవాలి. ఏ స్వరూపమయితే వారిదో, క్రమంగా నడుస్తూ, ఆ స్వరూపాన్నే పొందాలనేది మనకు ఉండవలసిన అభీష్టం. ఇదే వారికి యథార్థమయిన పూజ, ఇంత వరకయితే బాగానే ఉంది. ఏదైతే వాస్తవానికి ఆదర్శనీయమో, దానిని నిరాదరించకూడదు. కానీ వారి విగ్రహాలు – చిత్రాల మీద ఆకులు పువ్వులు వేయడమే భక్తి అనుకొని, అదే కళ్యాణ – సాధనమని అనుకొంటే, మనం లక్ష్యానికి దూరంగా, దారి తప్పి పోయినవాళ్ళమయిపోతాము.

ఆదర్శనీయమయిన వారి ఉపదేశాలను హృదయంగమం చేసికొని, వాటిని ఆచరణలో పెట్టడానికి ప్రేరణ పొందడానికే స్మారకాల ఉపయోగం. దానికి ఆశ్రమం, గుడి మసీదు, చర్చీ, మఠం, విహారం, గురుద్వారా, లేక ఏ పేరు పెట్టినా సరే, ఒకే షరతు, ఆ కేంద్రాలు ధర్మానికి సంబంధించినవై ఉండాలి. ఎవరి విగ్రహం ఉందో, అతనేమి చేసాడు ? మరి ఏం పొందాడు ? తపస్సు ఎలా చేశాడు ? ప్రాప్తి ఎలా పొందాడు ? కేవలం ఇది నేర్చుకునేందుకు మనం అక్కటికి చేరుకుంటాము, మరియు చేరుకోవాలి కూడా. కానీ ఆ స్థానాలలో మహాపురుషుల

పాద చిహ్నాలు చూపించకపోతే, చేసి చూపించకపోతే, కళ్యాణానికై వ్యవస్థ చేయకపోతే ఆస్థానం సరైనది కాదు. అక్కడ మీకు మూఢనమ్మకం మాత్రమే దొరుకుతుంది. అక్కడికి వెళ్ళడం వలన మీకు నష్టమవుతుంది. వ్యక్తిగతంగా ఇంటింటికీ, సందు సందుకీ వెళ్ళి ఉపదేశాన్ని ఇవ్వడానికంటే సామూహికంగా ఉపదేశం ఇచ్చే కేంద్రంగా ఈ ధార్మిక సంస్థానాలు స్థాపించబడ్డాయి, కానీ కాలాంతరంలో యీ ప్రేరణా స్థలాలను మూర్తి పూజలు, మూఢ నమ్మకాలు ఆక్రమించేసుకున్నాయి. ఇక్కడి నుంచే భ్రమలూ వ్యాపించడం మొదలెట్టాయి.

**గ్రంథం :–** ఇదే విధంగా పుస్తకాల అధ్యయనం కూడా అవసరమే. దాని వలన మీరు ఆ నిర్దిష్ట క్రియను అర్థం చేసుకోగలరు. దానినే యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు నియత కర్మ అన్నాడు మరియు అర్థం అయిపోతే వెంటనే చేయడం మొదలు పెట్టాలి. మరచి పోతే తిరిగి అధ్యయనం చేయాలి. అలా కాకుండా పుస్తకానికి దండం పెట్టి అక్షింతలు, గంధం చల్లి వదలి పెట్టరాదు. పుస్తకం మార్గదర్శ చిహ్నం, అది పూర్తి వరకు తోడుగా ఉంటుంది. దాని ఆధారంగా మన లక్ష్యం వైపుకు ముందుకు వెళ్ళాలి. ఇష్ట దైవాన్ని హృదయంతో గ్రహించగలిగినప్పుడు, ఆ ఇష్టదైవమే పుస్తకం అయిపోతాడు. కాబట్టి స్మృతులను సమకూర్చుకోవడం హానికరం కాదు, ఆ స్మృతి చిహ్నాలకు పూజలు చేసి సంతుష్టులయి పోవడం హాని కారకమే.

**ధర్మం** – (అధ్యాయం2/16–29) యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు చెప్పినట్లుగా – అసత్య వస్తువుకు అస్తిత్వం లేదు మరియు సత్యానికి ఎప్పుడూ లోపం లేదు. పరమాత్ముడే సత్యం, శాశ్వతం, అజరం, అమరం, అపరివర్తనం మరియు సనాతనం, కానీ ఆ పరమాత్ముడు అచింత్యుడు మరియు అగోచరుడు, చిత్త తరంగాలకు అతీతుడు. ఇప్పుడు చిత్తం ఎలా నిరోధించబడుతుంది ? చిత్తాన్ని నిరోధించి ఆ పరమాత్మను పొందే విశేషవిధి పేరే కర్మ. ఈ కర్మకు కార్య రూపం ఇవ్వడమే ధర్మం, బాధ్యత.

గీత (అధ్యాయం 2/40)లో ఇలా ఉంది – అర్జునా! ఈ కర్మయోగంలో ఆరంభానికి నాశనం లేదు. ఈ కర్మ అనే ధర్మ సాధన కొంచెం కూడా చేస్తే అది జన్మ మృత్యువు అనే మహా భయం నుంచి ఉద్ధరిస్తుంది, అంటే ఈ కర్మకు కార్యరూపు యివ్వడమే ధర్మం.

ఈ నియత కర్మ (సాధనా – పథం)ను సాధకుడి స్వభావంలో ఉపలబ్దమయ్యే సామర్థ్యానికి అనుగుణంగా, నాలుగు భాగాలుగా విభజించటమయింది. కర్మను అర్థం చేసుకొని మనుష్యుడు ఎప్పుడయితే సాధనను ఆరంభించుతాడో, ఆ ఆరంభిక దశలో అతను శూద్రుడు. క్రమంగా విధానం ఆచరణలోకి వస్తే అతనే వైశ్యుడు. ప్రకృతి యొక్క సంఘర్షణలను తట్టుకొనే సామర్థ్యం మరియు శౌర్యం వచ్చినప్పుడు ఆ వ్యక్తే క్షత్రియుడు మరియు బ్రహ్మకు తద్రూపం అయ్యే సామర్థ్యం జ్ఞానం (వాస్తవాన్ని తెలుసుకోవడం), విజ్ఞానం (ఈశ్వరీయవాణి వచ్చినప్పుడు) ఆ అస్థిత్వం పై ఆధారపడే క్షమత – ఈ యోగ్యతలు వచ్చినప్పుడు అతనే బ్రాహ్మణుడు. కాబట్టి యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు (గీత అధ్యాయం 18/46–47) అంటాడు – స్వభావంలో పొందగలిగే సామర్థ్యానికి అనుగుణంగా కర్మ ఆచరించడమే స్వధర్మం. తక్కువరకపుదయినా సరే స్వభావంచే ఉపలబ్దమయ్యే స్వ ధర్మం శ్రేయస్కరమయిందే. మరియు సామర్థ్యం పొందకుండానే ఇతరుల ఉన్నత కర్మ యొక్క అనుకరణ కూడా హానికరమైనదే. స్వధర్మంలో

మరణించడం కూడా శ్రేయస్కరమయిందే, ఎందుకంటే వస్త్రాలను మార్చుకొన్నంత మాత్రాన, మార్చుకొనేవాడు మారిపోడు గదా. అతని సాధన యొక్క క్రమం ఎక్కడి నుంచి అయితే వదలి వేయబడిందో తిరిగి అక్కడి నుంచే మొదలవుతుంది. సోపానాలవారీగా నడచి, అతను పరమసిద్ధి అయిన అవినశ్వర పదవిని పొందుతాడు.

దీనిని గురించి వివరణ ఇస్తూ శ్రీకృష్ణుడు అంటాడు – ఏ పరమాత్ముని వలన ప్రాణులన్నీ ఉత్పత్తి అయ్యాయో, ఎవరైతే సర్వత్రా (అంతటా) వ్యాపించి ఉన్నాడో, స్వభావంచే ఉత్పన్నమయిన సామర్థ్యానికి అనుగుణంగా, అతనిని బాగుగా పూజించిన మానవుడు పరమసిద్ధిని పొందుతాడు. అంటే నిశ్చయించిన విధి ప్రకారంగా ఒక్క పరమాత్ముని చింతనయే ధర్మం.

ధర్మంలో ఎవరికి ప్రవేశం ఉంది? దీనిని చేసే అధికారం ఎవరికి ఉంది? దీనిని స్పష్టం చేస్తూ యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు అన్నాడు – అర్జునా! అత్యంత దురాచారుడు కూడా అనన్య భావంతో గనుక నా భజన చేస్తే (అనన్య అంటే అన్య+న), నన్ను వదలి ఇతరులు ఎవరినీ కూడా భజించడో, కేవలం నా భజన చేస్తాడో, 'క్షిప్రం భవతి ధర్మాత్మ' – అతను శీఘ్రంగానే ధర్మాత్ముడు అయిపోతాడు. అతని ఆత్మ ధర్మంతో సంయుక్త మయిపోతుంది. కాబట్టి శ్రీకృష్ణుడు చెప్పినట్లుగా – ఎవ్వరైతే ఒక్క పరమాత్ముని ప్రాప్తికోసం నిఖయత కర్మ – ఆచరణ చేస్తాడో, అతనే ధర్మాత్ముడు. ఎవ్వరైతే స్వభావంచే నియత సామర్థ్యానికి అనుగుణంగా పరమాత్మున్ణి వెదకడంలో సంలగ్నుడయిపోతాడో, అతనే ధర్మాత్ముడు.

చివరిలో అంటాడు – ''సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ'' – అర్జునా ! అన్ని ధర్మాల చింత వదలి, ఒక్క నా శరణులోకి రా!'' కాబట్టి ఒక్క పరమాత్ముడి పట్ల సమర్పితుడయిన వ్యక్తే ధార్మికుడు. ఒక్క పరమాత్మునిలో శ్రద్ధను స్థిరం చేయడమే ధర్మం. ఆ ఒక్క పరమాత్ముని ప్రాప్తికోసం నిశ్చిత క్రియ చేయడమే ధర్మం. ఈ స్థితిని పొందిన, ఆత్మతృప్తులయిన మహాపురుషుల సిద్ధాంతమే సృష్టిలో ఏకమాత్ర ధర్మం. అట్టివారి శరణు పొందాలి. ఏ విధంగా ఆ మహాపురుషులు ఆ పరమాత్మున్ణి పొందారు, ఏ మార్గంలో నడిచారు? ఆ మార్గం సదా ఒక్కటే. ఆ మార్గంలో నడవడమే ధర్మం.

ధర్మం అనేది మనుష్యులు ఆచరణలో పెట్టవలసిన వస్తువు. ఆ ఆచరణ కేవలం ఒక్కటే – ''వ్యవసాయాత్మికా బుద్ధిరేకేహ కురునందన' (2/41) ఈ కర్మ యోగంలో నిశ్చయాత్మక క్రియ ఒక్కటే – ఇంద్రియాల చేష్టలను మరియు మనస్సు యొక్క క్రియాకలాపాల్ని సంయమనం చేసి, ఆత్మలో (పరాత్పర బ్రహ్మవైపు) ప్రవహింప చేయడం (4/27)

**మతాంతరం :** – సనాతన ధర్మానికి ఆది దేశమయిన భారతదేశంలో దురాచారాలు ఎంతగా పెరిగి పోయాయంటే, విదేశీ, ముస్లిముల ఆక్రమణ సమయంలో, భారతీయుల సనాతన ధర్మం ఆక్రమణకారుల చేతి ఒక ముద్ద అన్నం తిన్నాగానీ, రెండు గుటకల నీళ్ళు త్రాగినాగానీ వినష్టమయి పోవడం మొదలు పెట్టింది. ధర్మభ్రష్టులుగా వెలివేయబడిన వేలమంది హిందువులు ఆత్మహత్య చేసుకొన్నారు. ధర్మం కోసం మరణించడం వారికి తెలిసింది, కానీ ధర్మం

అంటే ఏమిటన్నది తెలియలేదు. ధర్మం సిగ్గు చెట్టు అయిపోయింది. సిగ్గు చెట్టు (అత్తి పత్తాకు) ముటుకుంటే ముడుచుకు పోతుంది, కానీ వదలగానే మళ్ళీ విస్తరించుకుంటుంది. వారి సనాతన ధర్మం ఎలా ముకుళించుకుపోయిందంటే, అది మళ్ళీ వికసించలేదు. సనాతన ఆత్మను భౌతిక వస్తువులు స్పృశించను కూడా స్పృశించలేవు. అలాంటిది ముట్టుకుంటే, తింటే ఎక్కడైనా నాశనమయిపోతుందా? మీరు ఖడ్గం చేత మరణిస్తారు, కానీ ధర్మం ముట్టుకొంటేనే మరణిస్తుందా? నిజంగా ధర్మం నష్టమయిపోతుందా? ఎప్పటికీ కాదు, ధర్మం పేరిట ప్రచలితమయిన దురాచారం వినష్టమయిపోయింది. ఫిరోజు తుగ్లకు శాసనకాలంలో 'బయానా' యొక్క ఖాజీ ముగీసుద్దీను అనే అతను ఇలా ఆదేశించాడు 'హిందువులు తమ నోళ్ళను తెరిచే ఉంచాలి. ఎవ్వరైనా ముస్లీము గనుక ఉమ్మి దలిస్తే, ఆ హిందువు తరించి పోతాడు, ఎందుకంటే అతని వద్ద ధర్మమే లేదు గదా!' అతను తప్పేమన్నాడు? నోట్లో ఉమ్మితే ఒక్కడే ముస్లీముగా మారుతాడు, కానీ బావిలో ఉమ్మితే వేలమంది ఒక్కసారిగా ముస్లిములుగా మారి పోతారు. వాస్తవానికి ఆ ముగీసుద్దీను ఆతతాయా? లేక ఆ కాలపు హిందూ సమాజమా?

ఈ ప్రకారంగా మతాన్ని మార్చుకొన్న వారు ఏ మతాన్ని స్వీకరించినట్లు? హిందువు నుంచి ముస్లీము అయిపోవడం (లేక) ఉండే తీరు నుంచి యింకో తీరులోకి మారి పోవడం మతం కాదే. ఈ రకంగా ప్రణాళికా బద్ధమయిన కుట్ర పన్ని వారిని మార్చినవారు ధర్మాత్ములా? వారు యింకా పెద్ద దురాచారాలకు లోనైనవారు. హిందువులు అలాంటి వలలో చిక్కుకుపోయారు. నాగరికులు కానటువంటి, దేశ ద్రిమ్మరులైన ఆటవిక జాతుల వారికి సభ్యతను నేర్పడానికై మహమ్మదు ప్రవక్త వివాహం, విడాకులు, వీలునామా, యిచ్చి పుచ్చుకోడాలు, వడ్డీ, సాక్షి, ఒట్టు, ప్రాయశ్చితం, సంపాదన, తిండి-త్రాగుడు, ఉండే తీరు మొదలగు విషయాలలో ఒక సామాజిక వ్యవస్థను ఏర్పాటు చేసాడు. విగ్రహపూజ, వ్యభిచారం, దొంగతనం, సారాయి, జూదం, తల్లి – నానమ్మలతో పెళ్లి మొదలైన వాటిపై నిషేధం పెట్టి, స్వర్గంలో చాలా మంది సమ వయస్కులు, పురుషసంపర్కంలేని కన్యలకి కిశోర బాలకుల ప్రలోభంచూపాడు. ఇది ఏదో ధర్మం (మతం) కాదు. ఒక రకమయిన సామాజిక వ్యవస్థ మాత్రమే. అలా ఏదో చెప్పి, కోరికలలో మునిగి ఉన్న సమాజాన్ని అటువైపునుంచి త్రిప్పి, తనవైపుకు ఉన్ముఖుల్ని చేసాడు. స్త్రీలకు స్వర్గంలో ఎంత మంది పురుషులు దొరుకుతారు? దీనిని గురించి అతను ఆలోచించనే లేదు. ఇది అతని దోషం కాదు, దోషం ఆ దేశకాల పరిస్థితులది. ఆనాడు స్త్రీల ఆశలు, ఆకాంక్షలపై ఎవరికీ ధ్యాస ఉండేది కాదు.

మహమ్మదు సాహెబు ధర్మమన్న దాని వైపు ఎవరి ధ్యాస వెళ్ళనే లేదు. అతను అన్నాడు – ఏ పురుషుడి ఒక్క శ్వాసైనా ఆ ఖుదా యొక్క పేరు లేకుండా పోతే, (భవన్నామస్మరణ చేయకపోతే), అతనిని ఖుదా కయామత్‌నాడు ఒక పాపిని పాపం గురించి అడిగినట్లు ఆ ఒక్క శ్వాస భగవన్నామ స్మరణ రహితంగా ఎందుకు తీసుకున్నావు అని అడుగుతాడు. దానికి శిక్ష సర్వదా నరకంలో పడి ఉండడమే. ఒక్క శ్వాస కూడా భగవన్నామరహితంగా పోనీయని ముస్లీములు ఎంతమంది ఉన్నారు? కోట్లలో ఎవరో ఒకరు. మిగిలిన వారి శ్వాసలు భగవన్నామ

రహితాలే. దానికి శిక్ష అదే, పాపులకు దొరికే శిక్ష అని వేరే చెప్పవలసిన అవసరమేలేదు. అది నరకం (దోజఖ్). మహమ్మదు చెప్పినదేమిటంటే ఎవ్వరైతే యింకొకరిని బాధించరో, పశువులకు కష్టం కలగనివ్వరో, అతను ఆకాశం నుంచి ఖుదా యొక్క మాటలు వింటాడు. ఇది అన్నిస్థలాల కోసం అన్ని కాలాలకోసం చెప్పబడింది. కానీ తరువాతి వారు ఒక అడ్డదారిని వెలికి తీసారు, మక్కాలో ఒక మసీదు ఉంది, అందులోని పచ్చగడ్డి కోయకూడదు, ఆ మసీదులో ఏ పశువును చంపరాదు, అక్కడ ఎవరికీ కష్టం కలిగించకూడదు; మరియు చివరికి తిరిగి తిరిగి వారు అక్కడే ఉండి పోయారు. ఖుదా మాటల్ని వినడానికి ముందు మహమ్మదు మసీదు కట్టించాడా? ఏ మసీదులోనైనా ఎప్పుడైనా ఏదైనా ఆయత్ (ఖురాన్‌వాక్య) అవతరించిందా? ఆ మసీదు అతని నివాస స్థలం, అందులో అతని స్మృతులు సురక్షితంగా ఉన్నాయి. మహమ్మదు ఆశయాలను తబరేజు తెలుసుకొన్నాడు, ఇక్బాలు తెలుసుకొన్నాడు, కానీ వారు ధర్మ మూఢుల పాలయ్యారు, నానాయాతనలు అనుభవించారు. లోకులను నాస్తికులను చేస్తున్నాడని సోక్రటీసును విషంత్రాగి చావమన్నారు. ఇలాంటి ఆరోపణే ఏసుక్రీస్తుకు కూడా వేయబడింది, ఎందుకంటే అతను విశ్రమించవలసిన సబ్బాతునాడు కూడా పనిచేసాడు, అంధులకు దృష్టిని ప్రసాదించేవాడు. అందుచేత అతనిని శిలువ ఎక్కించారు. అలాగే భారత దేశంలో కూడా జరిగింది. ఇప్పుడు కూడా ఎవ్వరైనా ప్రత్యక్ష దర్శకుడైన మహాపురుషుడు సత్యంవైపుకు ఇంగితం చేస్తే, ఈ గుళ్ళు-మసీదులు, మఠాలు, సంప్రదాయాలు మరియు తీర్థాల వలన ఎవరి జేబులు నిండుతున్నాయో వాళ్ళు అల్లరి-గందరగోళం సృష్టిస్తారు, 'అధర్మం అధర్మం' అని గొంతు చించుకొని అరుస్తారు. కొందరికి వీటి వలన లక్షలు-కోట్లు ఆదాయం ఉంటే, కొందరికి పొట్ట గడుస్తుంది. వాస్తవికత యొక్క ప్రచారం వలన వారి రోజువారీ జీవితానికి భంగం వాటిల్లుతుంది. వారు సత్యాన్ని వ్యాపించనివ్వరు మరియు సత్యాన్నివ్వలేరు. ఇది తప్ప వారు విరోధం ప్రకటించడానికి వేరే కారణం లేదు. చాలా కాలం క్రిందట ఇలా ఎందుకు స్మృతులు తయారు చేయబడ్డాయో వారికి తెలీదు.

**గృహస్థుల అధికారం :-** సామాన్యంగా లోకులు అంటారు-కర్మ యొక్క స్వరూపం ఇదే అయినప్పుడు-ఏకాంతంలో ఉండటం, ఇంద్రియాల సంయమనం, నిరంతర చింతన మరియు ధ్యానం చేయడమే, కర్మ అయినప్పుడు 'గీత' గృహస్తులకు అనుపయోగకరమయినది. అలాంటప్పుడు 'గీత' సాధువులకు మాత్రమే ఉపయోగపడుతుంది. కానీ అలా కాదు. గీత ఈ సాధనా పథం మీద నడిచే సాధకుడి కోసం మరియు ఈ మార్గంపై నడవాలనుకొనే వారి కోసం కూడా ఉంది. గీత మానవ మాత్రులందరికీ సమానమయిన మార్గదర్శనం కలిగిస్తుంది. సద్గృహస్థులకోసం యిది విశేషంగా ఉపయోగకరమయింది. ఎందుకంటే అక్కడి నుంచే కర్మ ప్రారంభమవుతుంది గనుక.

శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు-అర్జునా! ఈ నిష్కామ కర్మ యోగంలో ఆరంభానికి నాశనం లేదు. దీని స్వల్ప సాదన కూడా జన్మ-మరణమనే మహా భయం నుంచి ఉద్ధరిస్తుంది. మీరే చెప్పండి స్వల్ప సాధన ఎవరు చేస్తారు? గృహస్థుడా లేక విరక్తుడా? గృహస్థుడే దీని కోసం

కొంచెం సమయం కేటాయిస్తాడు. ఇది అతని కోసమే, అధ్యాయం 4/36లో అన్నాడు- అర్జునా! నువ్వు సమస్త పాపులకంటే కూడా అధికమయిన పాపం చేసినవాడివయినా సరే, జ్ఞానమనే నౌక ద్వారా నిస్సందేహంగా తరించి పోగలవు. అధిక పాపి ఎవడు? అనవరతంగా కర్మలో మునిగి పోయిన వాడా (లేక) కర్మలో నిమగ్నమవాలనుకొంటున్న వాడా? కాబట్టి సద్గృహస్తు ఆశ్రమం నుంచే కర్మ ఆరంభం అవుతుంది. అధ్యాయం, 6/37-45లో అర్జునుడు అడిగాడు-భగవాన్! శిథిల ప్రయత్నం చేసే శ్రద్ధామయుడైన పురుషుడు పరమగతిని పొందక, ఏ దుర్గతిని పొందుతాడు? శ్రీకృష్ణుడు అన్నాడు-అర్జునా! యోగం ద్వారా నడిపించబడే శిథిల ప్రయత్నం చేసే పురుషుడు కూడా వినాశం చెందడు. ఆ యోగభ్రష్టుడు శ్రీమంతుల ('శుచీనాం' శుద్ధ (సత్యం) ఆచరణ చేయువారే శ్రీమంతులు) ఇంటిలో జన్మనెత్తి, యోగుల సముదాయంలో ప్రవేశం పొందుతాడు, సాధనపట్ల ఆకర్షితుడవుతాడు మరియు అనేక జన్మలు ఎత్తుతూ సాధనచేస్తూ, పరమగతి (లేక) పరంధామం చేరుకుంటాడు. ఈ శిథిల ప్రయత్నం ఎవరు చేస్తారు? యోగ భ్రష్టుడయిన అతను ఎక్కడ జన్మిస్తాడు? అతను గృహస్థే గదా అయింది. అక్కడి నుంచే అతను సాధనోన్ముఖుడవుతాడు. అధ్యాయం 9/30లో శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు-అత్యంత దురాచారుడు కూడా అనన్య భావంతో నన్ను భజించు వాడైతే, అతను సాధువే అనబడతాడు. ఎందుకంటే అతను నిశ్చయంతోబాటుగా సరి అయిన మార్గంలో నడవడం మొదలు పెట్టాడు. అత్యంత దురాచారుడు ఎవరు అవుతారు? ఎవరైతే భజనలో మునిగి పోయాడో అతనా (లేక) ఎవరైతే ఆరంభమే చేయలేదో అతనా? అధ్యాయం 9/32లో అన్నాడు-స్త్రీలు, వైశ్యులు, శూద్రులు మరియు పాప జన్మల వారయినా సరే, నా ఆశ్రయం పొంది సాధన చేస్తే పరమగతిని పొందుతారు. హిందువుడే కావాలనిగానీ, ముస్లీమే కావాలనిగానీ లేక క్రిస్టియనే అయివుండాలనిగానీ శ్రీకృష్ణుడు అనలేదు. అత్యంత దురాచారుడే, పాతకుడే అయినా సరే, నా శరణు పొందితే, పరమ గతిని పొందుతాడు. కాబట్టి గీత మానవ మాత్రుల కోసమే. సద్గృహస్థ ఆశ్రమం నుంచే యీ కర్మ ఆరంభం అవుతుంది. క్రమంగా అదే సద్గృహస్థుడు యోగి అవుతాడు, పూర్ణ త్యాగి అవుతాడు మరియు తత్త్వాన్ని దర్శనం చేసుకొని పరమంలో ప్రవేశం పొందుతాడు, అతనిని గురించే శ్రీకృష్ణుడు అన్నాడు, జ్ఞానిది నా స్వరూపమే.

**స్త్రీ :** – భగవద్గీత ప్రకారంగా శరీరం ఒక వస్త్రం మాత్రమే. ఎలాగైతే పాత వస్త్రాన్ని త్యజించి మనుష్యుడు క్రొత్త వస్త్రాన్ని ధరిస్తాడో, అదే విధంగా సర్వభూతముల స్వామి ''ఆత్మ'' ఈ శరీర రూప వస్త్రాన్ని త్యజించి రెండవ శరీరాన్ని (వస్త్రాన్ని) ధరిస్తుంది.మీరు పిండ రూపంలో స్త్రీ అయినా సరే, పురుషుడైనా సరే- ఇవి కేవలం వస్త్రాల ఆకారాలు మాత్రమే.

జగత్తులో పురుషులు రెండు రకాలు- ఒకటి క్షర పురుషుడు, రెండవది అక్షర పురుషుడు. సమస్త ప్రాణుల శరీరం క్షర పురుషుడు (లేక) పరివర్తనలశీల పురుషుడు. మనస్సహితంగా ఇంద్రియాలు ఎప్పుడైతే కూటస్తమౌతాయో, అప్పుడు అతడే అక్షర పురుషుడు. అతనికి

ఎప్పుడూ వినాశం జరగదు. ఇది సాధన యొక్క అవస్థ.

స్త్రీలపట్ల ఒకప్పుడు సన్మానం, ఒకప్పుడు అపమాన జనక భావన సమాజంలో ఉండటం జరుగుతుంది, కానీ గీత యొక్క అపౌరుషేయ వాణి ప్రకారంగా శూద్రుడు, వైశ్యుడు, స్త్రీ-పురుషుడు ఎవరైనా సరే. నాశరణు పొంది పరమగతి పొందుతాడు. కాబట్టి ఈ కళ్యాణ పథంలో స్త్రీలకు కూడా పురుషులతో సమానమైన స్థానం కలదు.

**భౌతిక సమృద్ధి:-** గీత పరమ కళ్యాణాన్ని ప్రదానం చేస్తుంది, దానితో బాటుగానే మనుష్యులకు కావలసిన భౌతిక వస్తువులను కూడా ఏర్పరుస్తుంది. అధ్యాయం 9/20-22లో యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు ఇలా అంటాడు-చాలా మంది నిర్ధారితమయిన విధానంతో నన్ను పూజించి, స్వర్గాన్ని కోరుకుంటారు. వారికి విశాలమయిన స్వర్గలోకం దొరుకుతుంది, నేను ఇస్తాను. ఎవరు ఏది అడిగితే, అది వారికి నా నుంచి దొరుకుతుంది, కానీ అనుభవించిన తరువాత సమాప్తమయిపోతుంది. ఎందుకంటే స్వర్గ భోగాలు కూడా నశించేవే, అతను తిరిగి జన్మించవలసి ఉంటుంది. నాతో సంబంధం ఉండటం వలన అతను వినష్టం కాడు, ఎందుకంటే నేను కళ్యాణ స్వరూపుడను. నేను అతనికి భోగాలను ఇస్తాను మరియు క్రమ క్రమంగా నివృత్తి చేయించి కళ్యాణ మార్గంలో చేరుస్తాను.

**క్షేత్రం:-** ఏ పరమాత్ముని శ్రీముఖ వాణి ఈ 'గీత యో, ఆయన స్వయంగా క్షేత్రం యొక్క పరిచయాన్ని ఇస్తూ అన్నాడు-అర్జునా! 'ఇదం శరీరం కౌంతేయ క్షేత్రమిత్యభిధీయతే'. ఈ శరీరమే క్షేత్రము (పొలము), దీనిలో నాటిన మంచీ-చెడూ కర్మ బీజాలు సంస్కార రూపంలో నాటుకుని కాలాంతరంలో సుఖ దుఃఖ భోగాల రూపంలో పరిణతి పొందుతాయి. ఆసురీ సంపద అధమ యోనులకు కారణమైతే, దైవీ సంపద పరమాత్మలో ప్రవేశం ఇప్పిస్తుంది. సద్గురువు యొక్క సాన్నిధ్యంలో వీటి మధ్య నిర్ణాయక యుద్ధం ఆరంభమవుతుంది. ఇదే క్షేత్ర-క్షేత్రజ్ఞుల యుద్ధం. వ్యాఖ్యాతలు ఇలా అంటారు-ఒక కురుక్షేత్రం బయట ఉంది, మరొకటి మనస్సులో ఉంది. గీతకు ఒక అర్థం బయట ఉంది మరో అర్థం లోపల ఉంది, కానీ అదేం కాదు. వక్త ఒక మాట అంటాడు, కానీ శ్రోతలు తమ తమ బుద్ధి అనుసారంగానే, దానిని అర్థం చేసుకోగలుగుతారు. కాబట్టి అనేక అర్థాలు ప్రతీతమవుతాయి. సాధనా పథంలో క్రమంగా నడుచుకుంటూ, ఏ పురుషుడయితే శ్రీకృష్ణుని స్థాయిలో నిలబడతాడో, అప్పుడు ఏ దృశ్యమయితే శ్రీకృష్ణుని ముందు ఉన్నదో, అదే ఆ పురుషుని ముందు కూడా ఉంటుంది. అటువంటి మహాపురుషుడు మాత్రమే శ్రీకృష్ణుని మనోగత భావాల్ని, గీత యొక్క సంకేతాలను అర్థం చేసుకోగలడు, అర్థం చేయించగలడు.

గీతలోని ఒక్క శ్లోకం కూడా వెలుపలి వాటిని గురించి చెప్పలేదు. తినడం ధరించడం ఉండే తీరు ఇవి మీకు తెలుసు. ఉండే తీరు, విలువలు, లోక రీతి-నీతి మొదలైనవి దేశకాల పరిస్థితులకు అనుగుణంగా మార్పు చెందుతాయి. ఇది ప్రకృతి ప్రసాదించిన వరం. వీటిని గురించి శ్రీకృష్ణుడు మీకు ఏ వ్యవస్థ ప్రకారం చెప్పాలి? ఎక్కడ అమ్మాయిలు బహుళంగా ఉంటారో అక్కడ బహువివాహాలు జరుగుతాయి. యింకోచోట వారి సంఖ్య తక్కువగా

ఉంటుంది. కొన్ని చోట్ల చాలా మంది అన్నదమ్ములకి ఒకే భార్య ఉంటుంది. వీటిలో శ్రీకృష్ణుడు ఏ వ్యవస్థను నిర్ధేశించాలి? రెండో ప్రపంచ యుద్ధం తరువాత జపానులో జన సంఖ్య తరిగిపోయి, సమస్య ఏర్పడింది. అలాంటప్పుడు ముప్పైమంది పిల్లలకు జన్మనిచ్చిన ఒక మహిళకు 'మదర్‌ల్యాండ్ అనే బిరుదునిచ్చి, ఆ దేశం ఆతల్లిని సన్మానించింది. వైదిక కాలంలో భారతదేశంలో మొదట పది మంది సంతానాన్ని ఉత్పన్నం చేసే విధానం ఉండింది. ఇప్పుడు 'మే మిద్దరం, మా కిద్దరు,' అనే రాగం మొదలెట్టారు. ఇంకో రకంగా చూస్తే వారిద్దరూ కూడా లేకపోతే, దేశానికి ఏ చింతా ఉండదు, సమస్య పరిష్కారమవుతుంది. శ్రీకృష్ణుడు ఇందులో ఏ వ్యవస్థను నిర్ధేశించాలి?

**శ్రేయం:–** కామం, క్రోధం, లోభం, మోహం అనే వాటిని నేర్పడానికి ఎక్కడా పాఠశాలలు తెరవలేదు. అయినా కూడా యీ వికారాలలో పిల్లలు, పెద్దలు మరియు చతురులు అందరూ ప్రవీణులయి పోతారు. ఇందులో శ్రీకృష్ణుడు ఏం నేర్పాలి? ఇవన్నీ ప్రకృతి ద్వారా స్వచాలితములయి ఉన్నాయి. ఒకప్పుడు వేదాలు నేర్పించబడేవి, ధనుర్విద్య, గదాయుద్ధం నేర్పించబడేవి. ఈ రోజు వీటిని ఎవరు నేర్చుకుంటారు? ఈ నాడు పిస్తోలు ఉపయోగింపబడుతోంది. ఇది స్వచాలితమయ్యే యంత్రాల యుగం. ఒకప్పుడు రథం నడపడం నేర్పబడేది, గుర్రాల లద్దే తీసి వేయవలసి వచ్చేది. ఈనాడు మోటారుల నూనె శుద్ధి చేయాల్సివస్తున్నది. వీటిలో శ్రీకృష్ణుడు దేనిని గురించి చెప్పాలి? గుఱ్ఱాలను ఇలా మాలీషు చేయకూడదని, చెప్పాలా? బయట మీకు ఎలాంటి వ్యవస్థ నివ్వాలి? మొదట్లో 'స్వాహా' అనడం వలన వర్షాలు కురుస్తాయని ఆశించేవారు, ఇప్పుడు ఉపకరణాల ద్వారా వర్షం కురిపించబడుతోంది. మొదట్లో పంటలు వర్షాలమీద ఆధారపడి ఉండేవి, ఈనాడు మనస్సుకిష్టమైనప్పుడు పంటలు పండించుకోవచ్చు. యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు అంటాడు–ప్రకృతిచే ఉత్పన్నమయిన గుణాల వలన పరవశుడయి మనుష్యుడు పరిస్థితులకు అనుగుణంగా మారుతూనే ఉంటాడు. గుణాలు స్వతహాగా అతణ్ణి మార్చడంలో సమర్థమయి ఉంటాయి. భౌతిక శాస్త్రం మొదలైన వాటిని అది వికసింప జేస్తూనే ఉంటుంది. ఒకే ఒక వస్తువు ఉంది. దానిని మనుష్యుడు తెలుసుకోలేడు, గుర్తించలేడు. అది అతని వద్దే ఉంది, కానీ అతను మరిచిపోయాడు. గీతను విన్న తరువాత అర్జునుడికి అదే స్మృతి తిరిగి వచ్చింది. ఆ స్మృతి–పరమాత్ముడిది. అతను హృదయదేశంలో ఉంటూ కూడా చాలా దూరంగా ఉంటాడు. అతనినే మనుష్యుడు పొందాలనుకుంటాడు, కానీ మార్గం తెలియదు. కేవలం ఒక్క కళ్యాణ పథం గురించే మనుష్యుడికి తెలియదు. మోహం యొక్క ఆవరణ ఎంత దట్టమయినదంటే పరమాత్ముణ్ణి గురించి ఆలోచించే అవకాశం కూడా దొరకదు. ఆ మహాపురుషుడు మీకోసం సమయం ఇచ్చాడు, కర్మ గురించి స్పష్టం చేశాడు, దానిని చేయమనే నిర్దేశం గీతలో ఉంది. గీత ముఖ్యంగా ఇదే చెబుతుంది. భౌతిక వస్తువులు కూడా దాని వలన దొరుకుతాయి, కానీ శ్రేయంలో పోలిస్తే ప్రేయం నగణ్యమయినది (లెక్కకు రానిది).

**యోగ ప్రదాత:–** యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు చెప్పినట్లుగా కళ్యాణపథం

గురించిన జ్ఞానం, దాని సాధన మరియు దాని ప్రాప్తి సద్గురువు వలనే సాధ్యపడుతాయి. అటు ఇటు చాలా చాలా తీర్థాల చుట్టూ తిరగటం వలన అది దొరకదు. ఎవ్వరైనా సాధుమహాపురుషుని ద్వారానే అది ప్రాప్తించుతుంది. అధ్యాయం 3/34లో శ్రీకృష్ణుడు అన్నాడు–అర్జునా! నువ్వు ఎవ్వరైనా తత్త్వ దర్శకుడయిన మహాపురుషుని వద్దకు వెళ్ళి, వినయంతో దండ ప్రణామాలు చేసి, నిష్కపట భావంతో సేవ చేసి, ప్రశ్నించి ఆ జ్ఞానాన్ని పొందు. ప్రాప్తికి ఒకే ఒక ఉపాయం– ఎవ్వరైనా మహాపురుషుని సాన్నిధ్యంలో చేరి అతని సేవ చేసి, అతనికి అనుగుణంగా నడుచుకొని, తగిన కాలంలో యోగం యొక్క సంసిద్ధి పొందుతావు. అధ్యాయం 18/18లో అతను అన్నాడు – పరిజ్ఞాతుడు అంటే తత్త్వదర్శకుడయిన మహాపురుషుడు, జ్ఞానం అంటే తెలుసుకొనే విధి మరియు జ్ఞేయుడయిన పరమాత్ముడు – ఈ మూడే కర్మకు ప్రేరకాలు. కాబట్టి శ్రీకృష్ణుడు చెప్పినట్లుగా – మహాపురుషుడే కర్మకు సాధనంగానీ పుస్తకం కాదు. పుస్తకం సహాయం మాత్రమే, సహాయాన్ని కంఠస్తం చేయడం వలన ఎవరూ నిరోగులు కారు. చదివిన దానిని అమలులోకి తేవాలి.

**నరకం:–** అధ్యాయం 16/16లో ఆసురీ సంపదను వర్ణన చేస్తూ యోగేశ్వరుడు ఇలా అన్నాడు – అనేక రకాలుగా భ్రమితమయిన చిత్తంగలవారు మోహంలో యిరుక్కుపోయినవారూ, ఆసురీ స్వభావంగల మనుష్యులు అపవిత్ర నరకంలో పడిపోతారు. స్వాభావికంగా అడిగే ప్రశ్న ఏమిటంటే నరకం ఎలా ఉంటుంది? మరియు దేనిని నరకం అంటారు? ఇదే స్పష్టం చేస్తూ అన్నాడు. నా పై ద్వేషం ఉంచుకొనే నరాధములను నేను మళ్ళీ మళ్ళీ ఆసురీ జన్మలు పొందేట్టు చేస్తాను. ఇదే నరకం. ఈ నరకానికి ద్వారం ఏది? అతను చెప్పాడు, –కామ క్రోధ లోభాలు నరకానికి మూడు ద్వారాలు. అందులో ఆసురీ సంపద సంఘటిత మవుతుంది. కాబట్టి మళ్ళీ మళ్ళీ క్రిమి కీటకాల, పశువుల జన్మలు ఎత్తడమే నరకం.

**పిండదానం:–** ప్రథమ అధ్యాయంలో విషాదగ్రస్తుడయిన అర్జునుడు ఇలా సందేహవ్యాకులుడయినాడు–యుద్ధ విజిత నరసంహారం వలన పితరులు పిండదానం మరియు తర్పణ చేత వంచితులై పోతారు, పితరులు పతితులయి పోతారు. అప్పుడు భగవాన్ శ్రీకృష్ణుడు అన్నాడు, నీకు ఈ అజ్ఞానం ఎక్కడి నుండి వచ్చింది? పిండోదక క్రియల్ని యోగేశ్వరుడు అజ్ఞానం అన్నాడు మరియు ఇలా చెప్పాడు–ఏ ప్రకారంగా జీర్ణమయిన వస్త్రాలను వదిలివేసి మనుష్యుడు క్రొత్త వస్త్రాలను ధరిస్తాడో, సరిగ్గా ఇదే విధంగా, ఈ ఆత్మ జీర్ణ శరీరాలను వదలి, వెంటనే శరీరమనే నూతన వస్త్రాన్ని గ్రహించుతుంది. ఇక్కడ శరీరం ఒక వస్త్రం మాత్రమే మరియు ఆత్మ కేవలం శరీరాన్ని మార్చుకొన్నప్పుడు. అది మరణించలేదు, నశించే శరీరాన్నే మార్చింది, దాని విధానాలు పూర్వంలాగే ఉన్నాయి. అలాంటప్పుడు ఈ భోజనం (పిండదానం), ఆసనం, శయ్యా, వాహనం, ఆవాసం లేక జలం మొదలగువాటిచే, ఎవరిని తృప్తిపరచాలి? ఇదే కారణంగా యోగేశ్వరుడు దీనిని అజ్ఞానం అన్నాడు. అధ్యాయం 15/7లో దీనినే వివరిస్తూ ఇలా అంటాడు. ఈ ఆత్మ నా యొక్క సనాతనమైన అంశం, స్వరూపం. మరియు మనస్సు సహితంగా అయిదు ఇంద్రియాల కార్యకలాప జన్యమయిన సంస్కారాలను

తీసుకొని, ఇంకో శరీరాన్ని ధరిస్తుంది మరియు మనస్సు సహితంగా ఆరు ఇంద్రియాల ద్వారా తరవాతి శరీరంలో విషయ భోగాలను అనుభవిస్తుంది. ఆత్మ నూతన శరీరాన్ని ధరించినప్పుడు, అక్కడ కూడా భోగసామాగ్రి ఉపలబ్ధమయ్యే ఉంటాయి. మరి పిండదానం ఎందుకు?

ఇక్కడ ఒక శరీరాన్ని వదలి, అక్కడ ఇంకో శరీరాన్ని ధరించింది, అది తిన్నగా ఆ శరీరంలోకి వెళుతుంది, మధ్యలో ఎలాంటి విరామము లేదు, ఎలాంటి స్థానం లేదు, అలాంటప్పుడు వేల తరాలుగా అనాది కాలంగా పితరులు పడి ఉన్నారనుకోవడం, వారి జీవన యాపన వంశ పరంపరగా వచ్చేవారి చేత నిర్ధారితమవడం, పంజరంలోని పక్షిలాగా వారి రోదనం పతనం ఇవన్నీ అజ్ఞానం కారణంగా మాత్రమే. కాబట్టి శ్రీకృష్ణుడు దీనిని అజ్ఞానం అన్నాడు.

**పాపం మరియు పుణ్యం:-** ఈ ప్రశ్న పట్ల సమాజంలో అనేక భ్రాంతులున్నాయి, కానీ యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు చెప్పినట్లు రజోగుణంచే ఉత్పన్నమయిన ఈ కామక్రోధాలు, భోగాల వలన ఎన్నటికీ తృప్తి పొందని మహాపాపులు. కామమే ఏకైక పాపి. పాపానికి మూలం కామం, కోరికలే. ఈ కోరికలు ఎక్కడ ఉంటాయి? శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు-ఇంద్రియాలు, మనస్సు మరియు బుద్ధి ఈ కోరికలకు నివాస స్థానాలు. వికారాలు తనువులో గాక, మనస్సులో ఉండగా తనువును కడిగితే ఏం లాభం?

శ్రీకృష్ణుడు చెప్పినట్లుగా నామ జపం వలన ఈ మనస్సు యొక్క శుద్ధి జరుగుతుంది, ధ్యానం వలన, సమకాలీన మహా పురుషుని సేవలచేత, అతని పట్ల సమర్పణ భావం వలన కూడ శుద్ధి జరుగుతుంది. దాని కొరకు శ్రీకృష్ణుడు అధ్యాయం 4/34లో ప్రోత్సహించుతాడు-'తద్విద్ధిప్రణి పాతేన' సేవ చేసీ మరి ప్రశ్నించీ ఆ జ్ఞానాన్ని పొందు, దాని వలన పాపాలన్నీ నశించి పోతాయి. అధ్యాయం 3/13లో అతను అన్నాడు-యజ్ఞ శేషంగా మిగిలే అన్నాన్ని తినే పుణ్య జనులు సమస్త పాపాల నుంచీ ముక్తులయి పోతారు. మరియు ఎవరైతే శరీరం కోసం (సుఖభోగాలను) కోరుకొంటారో, ఆపాపులు పాపాన్నే అనుభవిస్తారు. ఇక్కడ యజ్ఞం అంటే చింతన యొక్క ఒక నిశ్చితమయిన క్రియ, దీనిచే మనస్సులో నిహితమయిన చరాచర జగత్తుకు సంబంధించిన సంస్కారాలు నశించి పోతాయి. కేవలం బ్రహ్మ మిగులుతాడు. కాబట్టి ఏదైతే శరీరం జన్మించటానికి కారణమౌతుందో అదియే పాపం, మరియు ఏదైతే ఆ అమృతతత్వాన్ని ఇప్పించుతుందో, దేని తరువాత ఎన్నటికీ శరీరం ధరించవలసిన అవసరం రాదో, అదే పుణ్యం.

అధ్యాయం 7/29లో అతను అంటాడు ''నా శరణు పొంది జన్మ మరణ దోషాల నుండి విముక్తమగుటకై ప్రయత్నించువారై పుణ్యకర్మాచరణ చేయు ఏ పురుషుల పాపమైతే నష్టమైపోయిందో, వారు సంపూర్ణ బ్రహ్మను, సంపూర్ణ కర్మను, సంపూర్ణ అధ్యాత్మాన్ని మరియు నన్ను సంపూర్ణంగా తెలుసుకుంటారు. మరియు వారు నన్ను తెలుసుకుని నాలోనే స్థితులౌతారు'' కాబట్టి జన్మ-మరణ దోషాలను తొలగించి శాశ్వత జ్ఞానాన్నిచ్చి దాని యందే

నిరంతర స్థితిని ఇప్పించేదే పుణ్యకర్మ. మరియు ఏదైతే జన్మ-మృత్యువు; జరా-మరణ, దుఃఖ-దోషాల యొక్క పరిధిలో త్రిప్పివేస్తుందో, అదియే పాపకర్మ.

అధ్యాయం 10/3లో అంటాడు ''ఎవరైతే జన్మ-మృత్యువులచే రహితుడనైన, ఆది-అంతాలచే రహితుడనైన మరియు లోకాలన్నింటికీ మహా ఈశ్వరుడనైన నన్ను సాక్షాత్కార సహితంగా విదితమొనర్చుకుంటాడో, అట్టి పరుషుడు మరణ-ధర్మలైన పురుషులలో జ్ఞానవంతుడు మరియు అలా తెలుసుకొనువాడు సమస్త పాపాల నుండి ముక్తుడౌతాడు'' కాబట్టి సాక్షాత్కారంతోబాటే సంపూర్ణ పాపాల నుండి నివృత్తి దొరుకుతుంది.

మళ్ళీ మళ్ళీ జన్మ మృత్యువుల కారణమే పాపం మరియు ఏదయితే దాని నుంచి రక్షించి శాశ్వత పరమాత్ముని వైపు మళ్ళిస్తుందో, పరమ శాంతిని పొందేట్లు చేస్తుందో అదే పుణ్యకర్మ. సత్యాన్ని చెప్పడం, కేవలం తమ శ్రమచే సంపాదించి తినడం, స్త్రీల పట్ల మాతృభావం కలిగి ఉండడం, విశ్వాస పాత్రుడిగా ఉండటం మొదలగునవి ఈ పుణ్య కర్మకు సహాయం చేసే అంశాలు, కానీ సర్వోత్కృష్ట పుణ్యం-పరమాత్ముణ్ణి పొందటం. ఒకే పరమాత్ముని పట్ల శ్రద్ధ లేకుండా చేసేవి పాపాలు.

**సాదు-సజ్జనులంతా ఒక్కటే :-** గీత అధ్యాయం 4/1లో భగవంతుడు శ్రీకృష్ణుడు అన్నాడు- ఈ అవినశ్వర యోగాన్ని కల్పం యొక్క ఆదిలో నేను సూర్యుడికి చెప్పాను. కానీ శ్రీకృష్ణుని పూర్వం చరిత్రలో, లేక ఇంకే శాస్త్రంలోనూ కూడా కృష్ణుడు అనే పేరే కనిపించదు.

వాస్తవానికి శ్రీకృష్ణుడు ఒక పూర్ణ యోగేశ్వరుడు. అతను ఒక అవ్యక్తమయిన మరియు అవినశ్వరమయిన భావానికి చెందినవాడు. ఎప్పుడయినా పరమాత్మునిలో ఐక్యం చేసే క్రియ అంటే యోగానికి నాంది అంటూ జరిగితే, ఇదే స్థితికి చెందిన ఎవరయినా ఒక మహాపురుషుడే ఆ పని చేశాడు. అతను రాముడే అయి ఉండవచ్చు, లేక ఋషి జరధుస్త్రుడే అయిఉండవచ్చు. తరువాతి కాలంలో ఇదే ఉపదేశాన్ని యేసు, మహమ్మదు, గురునానక్ మొదలగు వారి వలన అభివ్యక్తమయింది. కానీ అసలు చెప్పింది మాత్రం శ్రీకృష్ణుడే!

కాబట్టి మహాపురుషులందరూ ఒక్కటే. అందరికందరూ ఒకే బిందువును స్పృశించి ఒకే స్వరూపాన్ని పొందుతారు. ఈ పదవి ఒక్కటే ఒక్కటి. అనేక మంది పురుషులు ఈ పథంపై పయనిస్తారు, కానీ పొందితే మాత్రం, ఒకే పదవిని పొందుతారు. అలాంటి అవస్థను పొందిన సాధువుకు ఈ శరీరం ఒక ఇల్లు మాత్రంగానే ఉండిపోతుంది. అతను మాత్రం శుద్ధ ఆత్మస్వరూపుడు. అలాంటి స్థితి గలవారు ఎప్పుడైనా ఏమయినా చెబితే ఒక యోగేశ్వరుడే చెప్పాడు.

యోగి ఎక్కడో అక్కడ జన్మిస్తాడు. తూర్పు (లేక) పడమరో, నల్ల వారిలోనో (లేక) తెల్ల వారిలోనో, పూర్వ కాలం నుండి ధర్మాచరణ పరాయణుల కుటుంబంలోనో, అవివే

కులయిన ఆటవికులలోనో, సామాన్యులయిన (లేక) శ్రీమంతులలోనో జన్మిస్తాడు. అయినా యోగి వారి పురాతన సంప్రదాయాలవాడు కాదు. అతను తన లక్ష్యమయిన పరమాత్ముని గ్రహించుకొని స్వస్వరూపం వైపు పురోగమిస్తూ పోతాడు, చివరకు బ్రహ్మప్రాప్తి పొందుతాడు. అతని ఉపదేశాలలో జాతీ, వర్గభేదాలు, గొప్ప, బీద అనే తేడాలు ఉండవు. వారి దృష్టిలో మగ – ఆడ అనే భేధం కూడా ఉండదు. (చూడండి గీత 15/16–'ద్వావిమౌ పురుషౌలోకే').

మహాపురుషుల తరువాత వారి శిష్యులు తమ సంప్రదాయాన్ని తయారు చేసికొని, సంకుచితులయిపోతారు. ఒక మహాపురుషుని వెన్నంటి నడిచేవారు యూదులయిపోతే, యింకొకరి శిష్యులు క్రిష్టియనులు, ముస్లీములు, సనాతనులు మొదలుగా మారిపోతారు, కానీ ఈ అడ్డుగోడలతో సాధువుకి ఎలాంటి సంబంధమూ ఉండదు. సాధువు ఒక సంప్రదాయానికి, లేక జాతికి చెందినవాడు కాదు. సాధువు సాధువే. అతనిని ఏదో ఒక సామాజిక సంప్రదాయంతో కట్టి పెట్టకండి.

కాబట్టి ప్రపంచంలోని ఏ కులానికి చెందినవాడయినా, ఒక సంప్రదాయం వారు అతణ్ణి అధికంగా పూజించినా, ఏదో ఒక సంప్రదాయపు పరిధుల ప్రభావంలోపడి అలాంటి యోగులందరిని గురించి ఆలోచించకూడదు. ఎందుకంటే వారు నిరపేక్షులు. ప్రపంచంలో ఎక్కడ జన్మించిన వాడయినా సరే, సాధువు నిందనీయుడు కాడు. ఎవరయినా గనుక అలా చేస్తే వారు తమలో స్థితుడయి ఉన్న అంతర్యాముడయిన పరమాత్ముణ్ణి దుర్బల పరుస్తారు. తమకు, పరమాత్ముడికి మధ్య గల దూరాన్ని పెంచుకుంటారు, స్వయంగా తమ నాశనాన్నే కోరు కుంటారు. ప్రపంచంలో జన్మనెత్తే వారిలో మీ అసలైన హితైషుడంటూ ఎవరయినా ఉంటే, అతను సాధువే. కాబట్టి అతని పట్ల సహృదయంతో ఉండటం అనేది ప్రపంచంలోని అందరి మూల కర్తవ్యం. ఇది కాదనుకోవడం అంటే, తమని తాము వంచించుకోవడమే.

**వేదం:–** 'గీత'లో వేదాలను గురించిన వర్ణన చాలా సార్లు వచ్చింది. కానీ మొత్తం మీద వేదాలు మార్గదర్శక సూత్రాలు మాత్రమే. గమ్యాన్ని చేరుకున్న తర్వాత ఆవ్యక్తికి వాటి ఉపయోగం ఉండదు. అధ్యాయ 2/45లో శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు – అర్జునా! వేదాలు మూడు గుణాలనే స్పష్టం చేయగలుగుతాయి. నువ్వు వేదాల కార్యక్షేత్రంకంటేపైకి లే. అధ్యాయం–2/46లో అంటాడు–అన్ని విధాల పరిపూర్ణమయిన, స్వచ్ఛమయిన జలాశయాన్ని పొందిన తర్వాత, చిన్న జలాశయాలతో మనుష్యుడికి ఎంత ప్రయోజనముంటుందో, చాలా బాగుగా బ్రహ్మను తెలిసిన జ్ఞాని అయిన మహాపురుషునికి అంటే బ్రహ్మణునికి వేదాలతో అంతే ప్రయోజనం ఉంటుంది. (ఏమీ ప్రయోజనం ఉండదు). ఇతరులకు వాటి ఉపయోగం ఉంది. అధ్యాయం 8/28లో అన్నాడు – అర్జునా! నన్ను తత్త్వంతో సహా బాగుగా తెలుసుకొన్న తర్వాత యోగి యజ్ఞం, తపస్సు, ధ్యానం మొదలగువాటి పుణ్యఫలాలను తరించి, సనాతన పదాన్ని పొందుతాడు. అంటే వేదాలు ఉన్నంత వరకూ., యజ్ఞం చేయడం పరిసమాప్తం కానంత వరకూ సనాతన పదం ప్రాప్తించదు.

అధ్యాయం 15/1లో చెప్పాడు – పైన పరమాత్ముడే దేనికి మూలమో, క్రింది క్రిమికీటకాది పర్యంతం ప్రకృతి దేనికి శాఖ ప్రశాఖలో, ప్రపంచం అలాంటి అవినశ్వరమైన రావి చెట్టు. ఎవరైతే దీనిని మూలంతో సహా తెలుసుకొంటారో, వారు వేదాల్ని తెలిసిన వారు. ఈ తెలుసుకోవడానికి మూలం మహాపురుషుడు, అతనిచే నిర్దిష్టమయినది భజన, పుస్తకాలు గానీ (లేక) పాఠశాలలు గానీ అతని వైపే ప్రేరేపిస్తాయి.

**ఓం :–** శ్రీకృష్ణుని నిర్దేశాలలో 'ఓం' యొక్క జపం చేయడమనే విధానాన్ని చూడవచ్చు. అధ్యాయం 7/8 'ఓం' కారాన్ని నేనే, 8/13 'ఓం' యొక్క జపం చేయుము మరియు నన్ను చింతించు. అధ్యాయం 9/17 తెలుసుకోదగిన పవిత్రమయిన 'ఓం కారాన్ని నేను. అధ్యాయం 10/33 – అక్షరాలలో 'అ' కారాన్ని నేను. 10/25 – వచనాలలో ఒక అక్షరాన్ని నేనే. అధ్యాయం 17/23– 'ఓం' తత్ మరియు సత్ బ్రహ్మ యొక్క పరిచాయకాలు. 17/24 – యజ్ఞం, దానం మరియు తపస్సులు 'ఓం'తోనే ప్రారంభమవుతాయి. కాబట్టి శ్రీకృష్ణుడు చెప్పినట్లుగా 'ఓం' యొక్క జపం నిరంతరం ఆవశ్యకమయినది. దాని విధిని ఎవరైనా అనుభవయుక్తుడైన మహాపురుషుడి వద్ద నేర్చుకోండి.

**గీతా జ్ఞానమే విశుద్ధ మనుస్మృతి :–** గీతా ఆది మానవ మహారాజైన 'మనువు' కంటే పూర్వమే ప్రకటితమైంది. ''ఇమం వివశ్వతే యోగం ప్రోక్తవానహ మవ్యయం'' (4/1) అర్జునా! ఈ అవినశ్వర యోగాన్ని నేను కల్పారంభంలో సూర్యునితో చెప్పాను. మరియు సూర్యుడు మనువుతో చెప్పాడు. మనువు దాన్ని శ్రవణం చేసి తన మానసిక స్మృతి పటలంపై గ్రహించాడు. దీనినే మనువు రాజా ఇక్ష్వాకుతో చెప్పాడు. ఇక్ష్వాకు ద్వారా రాజర్షులు తెలుసుకున్నారు. ఆ తర్వాతి కాలంలో ఈ అవినశ్వర యోగం ఈ భూమిపై లుప్తమై పోయింది. ఆరంభంలో మౌఖికంగా చెప్పడం, వినడం అనే పరంపర ఉండేది. లిపిబద్ధం కూడా చేయవచ్చుననే కల్పన కూడా ఎవరికీ ఉండేది కాదు. మను మహారాజు దీనిని మానసిక స్మృతిలో ధరించి, స్మృతి పరంపర కొనసాగించాడు. కాబట్టి ఈ గీతా జ్ఞానమే విశుద్ధ మనుస్మృతి.

భగవంతుడు ఈ జ్ఞానాన్ని మనువుకంటే ముందు సూర్యునితో చెప్పినప్పుడు దీనిని ''సూర్యస్మృతి'' అని ఎందుకు అనకూడదు? వాస్తవానికి సూర్యుడు జ్యోతిర్మయ పరమాత్ముని అంశము. సూర్యునిచే ఈ మానవ సృష్టి రూపొందినది. శ్రీ కృష్ణుడు అంటాడు– ''నేనే పరమ చేతన బీజరూపంలో ఉన్న తండ్రిని, ప్రకృతి గర్భాన్ని ధరించే తల్లి''. ఆ బీజరూప తండ్రియే సూర్యుడు. సూర్యుడు పరమాత్ముని యొక్క చేతన శక్తి. అదియే మానవులను సృష్టించింది. సూర్యుడు ఎవరో వ్యక్తి కాడు. మరియు ఎప్పుడైతే పరమాత్ముని ఆ జ్యోతిర్మయ తేజము ద్వారా మానవుల ఉత్పత్తి జరిగిందో, ఆ తేజములో గీతా జ్ఞానము కూడా ప్రసారితమైంది, ఇదియే సూర్యునితో చెప్పడమంటే. సూర్యుడు అతని పుత్రుడైన మనువుతో చెప్పాడు. అందుచే ఇది మనుస్మృతి. సూర్యుడు ఎవరో వ్యక్తి కాడు, బీజము.

భగవాన్ శ్రీ కృష్ణుడు అంటాడు అర్జునా! ఆ పురాతన యోగాన్నే నేను నీ కోసం చెప్పబోతున్నాను. నువ్వు నా ప్రియ భక్తుడవు, అనన్య సఖుడవు. అర్జునుడు మేధావి మరియు యోగ్యుడు. అతడు శ్రీ కృష్ణునిపై ప్రశ్నల వర్షం కురిపించాడు, ''మీరు ఇప్పుడు జన్మించారు, సూర్యుడు చాలాకాలం క్రితమే జన్మించాడు, అలాంటప్పుడు ఈ పురాతన యోగాన్ని మీరే సూర్యునితో చెప్పారని నేనెలా నమ్మగలను? ఈ ప్రకారంగా కనీసం 25 ప్రశ్నలను అడిగాడు. గీత చివరలో అతని ప్రశ్నలన్నీ ముగిసాయి. అప్పుడు భగవంతుడు ఏ ప్రశ్నలైతే అర్జునుడు అడగలేక పోయాడో, అతని హితానికై ఆ ప్రశ్నలను భగవంతుడే స్వయంగా లేవదీసి సమాధానపర్చాడు. చివరికి భగవంతుడు అన్నాడు. అర్జునా! నీవు నా ఉపదేశాన్ని ఏకాగ్ర చిత్తుడవై విన్నావా? మోహంచే ఉత్పన్నమైన నీ అజ్ఞానం నష్టమైందా? దీనిపై అర్జునుడు అన్నాడు.

శ్లో॥ నష్టో మోహ స్మృతిర్లబ్ధా త్వత్ప్ర సాదాన్మయాచ్యుత స్థితో స్మిగత సందేహ : కరిష్యే వచనం తీవ (18/73)

భగవాన్! ''నా మోహం నశించింది. నేను స్మృతిని పొందాను. వినడం మాత్రమే కాదు, స్మృతిలో ధరించాడు. నేను మీ ఆదేశాన్ని పాటిస్తాను, యుద్ధం చేస్తాను.'' అతడు ధనుస్సును ఎత్తాడు, యుద్ధం జరిగింది, విజయాన్ని పొందాడు. ఒక విశుద్ధ ధర్మ సామ్రాజ్య స్థాపన జరిగింది. ఒకే ధర్మశాస్త్ర రూపంలో అదే ఆది ధర్మ శాస్త్రమైన ''గీత'' మళ్ళీ వెలుగులోకి వచ్చింది.

గీత మీ యొక్క ఆది ధర్మ శాస్త్రం. ఇదియే మనుస్మృతి, దీనినే అర్జునుడు తన స్మృతిలో ధరించాడు. మనువు సమక్షంలో రెండు కృతులు ఉల్లేఖించబడ్డాయి-ఒకటి తండ్రి నుంచి లభించిన గీత, రెండవది వేదం మనువు సమక్షంలో అవతరించింది. ఈ రెంటికీ మించి ఏ కృతి కూడా మనువు సమయంలో ప్రకటమవ్వలేదు. ఆ సమయంలో వ్రాయడం, వ్రాయించడం ప్రచారంలో లేదు. పెన్ను, పేపరు ప్రచారంలో లేవు కాబట్టి జ్ఞానాన్ని శృత అంటే వినడం మరియు స్మృతి పటలం పై ధరించడమనే పరంపర ఉండేది. ఎవరి వల్లనైతే మానవుల ప్రాదుర్భావమైందో అట్టి, సృష్టి యొక్క ఆదిమానవుడైన ఆ మను మహారాజు వేదానికి శృతి మరియు ''గీతకు స్మృతి స్థానాన్నిచ్చాడు.

వేదం మనువు సమక్షంలో ప్రకటమైంది. దాన్ని విన్నాడు, అది విన యోగ్యమైనది. తర్వాత మరచి పోయినా కూడా హాని లేదు. కానీ గీత అనేది స్మృతి. ఇది ప్రతి మానవునకు శాశ్వత జీవనం, శాంతి, శాశ్వత సంవృద్ధి, ఐశ్వర్య సంపన్న జీవనాన్ని ప్రాప్తం చేయించే ఈశ్వరీయ గేయం.

భగవంతుడు అన్నాడు అర్జునా! ఒకవేళ నీవు అహంకార వశంతో నా ఉపదేశాన్ని వినకపోతే నష్టమై పోతావు. అంటే గీతోపదేశాన్ని అవహేళన చేసేవాడు నష్టమైపోతాడు. 15వ

అధ్యాయం చివరి శ్లోకంలో భగవంతుడన్నాడు. ''ఇతి గుహ్య తమం శాస్త్ర మిద ముక్తం మయానఘ''. ఈ గోపనీయం కంటే అతి గోపనీయమైన శాస్త్రం నా ద్వారా చెప్పబడింది. దీనిని తత్వంతో తెలుసుకుని నీవు సమస్త జ్ఞానాన్ని, పరమ శ్రేయాన్ని పొందుతావు. 16వ అధ్యాయం చివరి రెండు శ్లోకాలలో చెప్పాడు– ''యః శాస్త్ర విధిము త్సృజ్య వర్తతే కామ కారత'' – ఈ శాస్త్ర విధిని త్యజించి కామనలచే ప్రేరేపించబడి ఇతర విధుల ద్వారా ఎవ్వరైతే భజిస్తారో వారి జీవితంలో సుఖం, సంవృద్ధి, పరమగతి ఉండవు.

''తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ'' కాబట్టి అర్జునా! నీకు కర్తవ్యాకర్తవ్యములలో ఈ గీతా శాస్త్రమే ప్రమాణం. దీనిని బాగుగా అధ్యయనం చేసి, ఆ తర్వాత ఆచరించు. నీవు నాలో నివసిస్తావు, అవినశ్వర పదాన్ని పొందుతావు. శాశ్వత జీవనం, శాశ్వత శాంతి, సంవృద్ధిని పొందగలవు.

గీతయే మనుస్మృతి మరియు భగవాన్ శ్రీ కృష్ణుని అనుసారంగా గీతయే ధర్మ శాస్త్రము. దీనిని మించి శాస్త్రమంటూవేరేదీ లేదు. సమాజంలో ప్రచలితమైన అనేక స్మృతులు గీతను విస్మరించిన దుష్పరిణామమే. ఈనాడు ప్రచారంలో ఉన్న స్మృతులన్నీ సమాజంలో ఉచ్చ, నీచ భేదాలను సృష్టించి, కొందరు రాజుల స్వార్థానికై వ్రాయబడినవే. మనువు పేరుమీద ప్రచారమై ఉన్న మనుస్మృతిలో మనువు కాలపు పరిస్థితుల చిత్రణ లేదు. మూల మనుస్మృతి 'గీత' పరమాత్మ ఒక్కడే సత్యమని చెప్పి, దానిలో విలయమొందిస్తుంది. కానీ వర్తమాన కాలంలో ప్రచలితమై ఉన్న సుమారు 164 స్మృతులు పరమాత్మను నామ మాత్రంగా నైనా స్మరించవు, మరియు పరమాత్మను పొందే ఉపాయాలను కూడా చెప్పవు. అవి కేవలం స్వర్గ భోగాల వరకే సీమితమై ''న అస్తి'' ఏవైతే లేవో వాటినే ప్రోత్సహిస్తూ ఉంటాయి. మోక్షాన్ని గూర్చి వాటిలో ఉల్లేఖించబడలేదు.

**మహాపురుషుడు :**– మహాపురుషుడు బాహ్యాభ్యంతరమూ, వ్యావహారికము మరియు ఆధ్యాత్మికము, లోకాచారం మరియు యథార్థ వేద రీతి, రెండింటి జ్ఞానం గలిగి ఉంటాడు. ఇదే కారణంగా మహాపురుషులు సమాజాలన్నింటికీ ఉండే తీరు తెన్నుల గురించి చెప్పారు. మరియు ఒక మర్యాదా ప్రదమయిన వ్యవస్థను మన ముందుంచారు. వశిష్ఠుడు, విశ్వామిత్రుడు. వాల్మీకీ, స్వయంగా యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు, బుద్ధదేవుడు, యేసు, మహమ్మదు, రామదాసు, దయానందుడు, గురుగోవిందసింగు మొదలగు వేలకొద్ది మహాపురుషులు ఇలా చేసారు. కానీ ఈ విధానాలు తాత్కాలికమయినవి. పీడిత సమాజానికి భౌతిక వస్తువులను ప్రదానం చేయడం యథార్థం కాదు. భౌతిక కష్టాలు క్షణికమయినవి మాత్రమేగానీ శాశ్వతం కావు. కాబట్టి వాటి సమాధానం కూడా తాత్కాలికమయినదే అవుతుంది. కనుక వాటిని శాశ్వత వ్యవస్థగా (విధానముగా) గ్రహించరాదు.

**వ్యవస్థాకారుడు :**– సామాజిక వికృతులను మహాపురుషులు పరిష్కరిస్తారు.

వీటిని పరిష్కరించకపోతే జ్ఞాన వైరాగ్య జనితమయిన పరమ సాధనను ఎవరు వింటారు? వ్యక్తి ఏ వాతావరణంలో చిక్కుపడిపోయినాడో, అక్కడి నుంచి తప్పించి, అతణ్ణి యథార్థాన్ని తెలుసుకొనే స్థితిలోకి తేవడానికి అనేకానేక ప్రలోభాలు చూపించడం జరుగుతుంది. అంటే మహాపురుషుడు ఏ శబ్దాలను ప్రయోగించుతాడో, ఏ వ్యవస్థను నిర్ణయిస్తాడో, అది ధర్మం (మతం)కాదు. వాటి వలన ఒకటి రెండు శతాబ్దాలకు పనికి వచ్చే విధానం ఏర్పడుతుంది. నాలుగు – ఐదు శతాబ్దాల వరకు ఉదాహరణంగా ఉంటుంది. మరియు ఒకటి రెండు సహస్రాబ్దాల తరువాత ఆ సమాజ విధానం నూతన ఆవిష్కారాలు – నూతన పరిస్థితుల కారణంగా నిష్ప్రాణమయిపోతుంది. గురు గోవిందుసింగు ఏర్పరచిన సామాజిక విధానంలో ఆయుధాలు అనివార్యమయిపోయినవి. ఇప్పుడు ఆ కత్తిని ఆయుధంగా ధరించడం సముచితమయినదేనా? యేసు గాడిదపై కూర్చునేవాడు (మత్తయి 21). గాడిదకి సంబంధించి అతను ఇచ్చిన తీర్పు ఈనాడు ఉపయోగకరమయినదేనా? అతను 'ఇంకొకరి గాడిదను దొంగిలించకు' అని అన్నాడు. ఈరోజూ గాడిదల్ని ఎవరు పెంచుతున్నారు? ఇదే విధంగా యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు ఆ సమయపు సమాజానికి తగిన సమ్యక్ వ్యవస్థను నిర్దేశించాడు, దానిని గురించి మహాభారత భాగవతం మొదలగు వాటిలో చెప్పబడింది. వాటితో బాటుగా ఈ గ్రంథాలలో అతను యథార్థాన్ని కూడా యథోచితంగా చిత్రించాడు. పరమ కళ్యాణకారి అయిన సాధనను మరియు భౌతిక వ్యవస్థా నిర్దేశాలను ఒకటిగా కలిపేస్తే, సమాజం తత్వ నిర్ణాయక క్రమ విధానాన్ని పూర్తిగా అర్థం చేసుకోలేదు. భౌతిక వ్యవస్థలను ఉన్నదున్నట్లుగా కాక, ఎక్కువచేసి గ్రహించడమవుతుంది. ఎందుకంటే అవి భౌతికమయినవి. 'మహాపురుషులు చెప్పారు'– అలా అంటూ ఆ మహాపురుషుల యొక్క వాస్తవిక క్రియలను మార్చి–మార్చి వాటిని భ్రమింప చేసేస్తారు. వేదాలు, రామాయణం మహాభారతం బైబిలు, ఖురాను అన్నింటి పట్ల ఏక పక్షీయమై, మసక బారిన విశ్వాసాలు మాత్రమే మిగిలిపోయాయి.

బయటి ధరాతలంపై జీవనయాపన చేసే సమాజం ఈ గ్రంథాల స్థూల ఆశయాన్నే గ్రహించగల్గుతుంది. ఈ కారణం చేతనే భగవాన్ శ్రీ కృష్ణుడు శాశ్వత ధామం, అనంత జీవనం, శాశ్వత శాంతి ప్రదానం చేసే గీతా శాస్త్రాన్ని భౌతిక వ్యవస్థలనుంచి వేరు చేసాడు. మహాభారతం భారత దేశపు బృహత్ ఇతిహాసం మరియు గౌరవనీయ సాంస్కృతిక శాస్త్రం. భవిష్యత్తులో రాబోయే అన్ని తరాలవారు ధర్మశాస్త్రమైన గీతను ధార్మిక ధరాతలంపై యథావిధిగా అర్థం చేసుకోవాలనే దృష్టితో శ్రీ కృష్ణుడు విశాల ఇతిహాసమైన మహాభారతం మధ్యలో ఈ గీతా గేయాన్ని ఆలపించాడు. కాలాంతరంలో మహర్షి పాతంజలి మొదలగు అనేక మహాపురుషులు కూడా పరమ శ్రేయాన్ని కల్గించే యథార్థ విధిని సామాజిక వ్యవస్థనుంచి వేరు చేసి ప్రస్తుతీకరించారు.

**గీత మనుష్య మాత్రుల కోసం :–** భగవంతుడు ఈ ధర్మశాస్త్ర ఉపదేశాన్ని ''ప్రవృత్తే శస్త్ర సంపాతే''(1/20) సరిగ్గా శస్త్రాలను ఎక్కుపెట్టే సమయంలో ఉపదేశించాడు. ఎందుకంటే భౌతిక సంసారంలో శాంతి, సుఖం, ఎల్లప్పటికీ ఉండనే ఉండవని అతనికి బాగుగా తెలుసు. కోట్ల మంది ప్రాణాల్ని ఆహుతి చేసిన తర్వాత

కూడా, ఎవరైతే విజేతలౌతారో వారు కూడా తీరని కోరిక గలవారై చివరికి నిరుత్సాహాన్నే పొందుతారు. అందుకే శ్రీ కృష్ణుడు గీతా మాధ్యమంగా ఎటువంటి శాశ్వత యుద్ధ పరిచయాన్ని ఇచ్చాడంటే, అందులో ఒక్కసారి విజయం ప్రాప్తిస్తే శాశ్వత విజయం, అనంత జీవనం, అక్షయ ధామం తోడుంటాయి. అది మానవ మాత్రులందరికీ ఎప్పటికీ సులభ సాధ్యము. అది క్షేత్ర క్షేత్రజ్ఞుల యుద్ధం, ప్రకృతి–పురుషుల సంఘర్షణ, అంత: కరణంలో అశుభాన్ని అంతమొందించి శుభం, అంటే పరమాత్మ స్వరూపాన్ని ప్రాప్తింపజేసే సాధనం. ఉత్తమ అధికారి కోసమే అతడు దానిని వ్యక్తపరిచాడు. శ్రీకృష్ణుడు మరీ మరీ అన్నాడు– అతిశయమయిన ప్రీతిని కలిగిన భక్తుడవయిన నీ హితాన్ని కోరుతూ చెబుతున్నాను. ఇది అతి గోపనీయమయినది. చివరిలో అతను అన్నాడు – ఎవరైతే భక్తుడు కాడో, నిరీక్షించు. అతనిని ఆ దారిలోకి తీసుకురా, అప్పుడు అతనికి చెప్పు.ఇదే మనుష్య మాత్రుల యథార్థ కళ్యాణానికై ఒకే ఒక సాధన, దాని క్రమబద్ధమయిన వర్ణన శ్రీకృష్ణోక్త గీత.

**ప్రస్తుత టీకా :** – యోగేశ్వరుడైన శ్రీకృష్ణుని ద్వారా ప్రసారితమైన శ్రీమద్భగవద్గీత యొక్క ఆశయాలను ఉన్నవి ఉన్నట్లుగా వ్యక్తం చేసే కారణంగా ప్రస్తుత వ్యాఖ్య పేరు 'యథార్థ గీత'. ఇది భగవంతుని అంత: ప్రేరణపై ఆధారపడినది. గీత తనలో తాను ఒక పరిపూర్ణమయిన సాధనా గ్రంథం! గీతలో సందేహించవలసినది ఒక్కటి కూడా లేదు, ఎక్కడైనా సందేహం ఉంటే, ఈ బౌద్ధిక స్థాయితో దానిని తెలుసుకోలేము గనుక అలా అనిపిస్తుంది. కాబట్టి ఎక్కడైనా అర్థం కాకపోతే, తత్వ దర్శకులయిన మహాపురుషుని సాన్నిధ్యంలో తెలుసుకొనే ప్రయాస చేయండి.

శ్లో ॥ తద్విద్ధి ప్రణి పాతేన పరి ప్రశ్నేన సేవయా ।
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞాని నస్తత్త్వదర్శినః ॥

ఓం శాంతిః ! శాంతిః !! శాంతిః !!